మును బడసిన ఫ్రాన్సు బెల్జియము బ్రిటీషుసామ్రాజ్యములందును ప్రతిఘటనబీజములు మహాలయస్వరూపమును దాల్చకపోయినను పరివర్తనస్వరూపమును దాల్చుచున్నవి. ప్రజాధికారమునకు నిలయమైన యమెరికా సంయుక్తరాష్ట్రములందును, జగనుసాధించుటయందు నిరీక్షణముగల ఫ్రాన్సు దేశమునందును, పరివర్తనప్రవాహము వెల్లువలై ప్రవహింపకపోయినను, ఇతర రాజ్యములందు ప్రళయవేగమున బ్రవహించుచున్నది. జపానునందు మికాడోమిధ్యను నాశనము చేయుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. పదేండ్లకు బూర్వము జపానునందు నోగిదంపతులు చక్రవర్తితో సహగమనమునుచేసి ప్రపంచమునకు మహాశ్చర్యమును గలుగ జేసిరి నోగిసేనాధ్యక్షు డిహమునందువలె పరమునందును మికాడోసేవాపారవశ్యానంద మనుభవించుట కాత్మసమర్పణమును జేసి దివ్యప్రతిభను గడించెను. ఇపుడు జపానునందు మికాడో మాహాత్మ్యమునందే విశ్వాసము పోవుచున్నది. రాజ్యాంగపరివర్తనమును జేయుటకు జపానురాజ్యమునందు ప్రయత్నములు జరిగినవి. నిరంకుశరాజ్యాధికారాధీనములైన మహాసామ్రాజ్యములు మటుమాయము లైనవి. జర్మనీ ఆస్ట్రియా రుష్యా సామ్రాజ్యములకు సంప్రాప్తమైన పరివర్తన దశాఫలము ప్రాజ్ఞులహృదయములందు వివేకోదయమును గలుగజేయుచున్నది. ఆస్ట్రియాసామ్రాజ్యము నామరూపములు లేక నశించినది. సామ్రాజ్యభాగములు ఇటలీ హంగరీ పోలాండు జుగోస్లావియా రుమేనియా మొదలగు దేశములకు సంక్రమించినవి. ఇపు డాస్ట్రియాభాగము 30,000 మైళ్ల విస్తీర్ణమును 66,00,000 ప్రజలను మాత్రము గలిగియున్నది. ఈ శకలము సంపైనను ప్రజ లన్నము లేక పరితపించుచున్నారు. యుద్ధమునకు పూర్వము 1914 సంవత్సరమునందు 2,40,456 మైళ్ల విస్తీర్ణమును 5,20,00,000 ప్రజలను గలిగియున్న మహాసామ్రాజ్యమునకు బట్టిన దుర్దశ సకలసామ్రాజ్యములకు జ్ఞానోపదేశమును జేయం జాలియున్నది. మహాసంగ్రామములకు మూలకారకులైన హాప్సుబర్గురాజవంశజులు రాజ్యభ్రష్టులై భిక్షాటనమును జేయుచున్నారు. ఇటీవల రాజవంశజుడు కారలుమాక్సు రాజ్యాక్రమణమును జేయుటకు జేసిన ప్రయత్నములు నిష్ఫలము లైనవి. సామ్రాజ్యాభిమానులకు నధికారాభిమానులకును గుణపాఠమును నేర్పుటకు హాప్సుబర్గు వంశచరిత్రము ఆస్ట్రియాసామ్రాజ్యచరిత్రము చాలియున్నది.

### జర్మనుసామ్రాజ్యము

జర్మనుల యహంభావము పరాజయానంతరమునైనను నశింపక పూర్వార్జితాభిమానమే సంక్షోభమునకు గారణంబుగ బరిణమించుచున్నది. లోకసామ్రాజ్యాధిపత్యమునకు కంకణముకట్టుకొనిన జర్మను సామ్రాజ్య మిపుడు మహాదుర్దశ ననుభవించుచున్నది. యుద్ధారంభమునందు స్వస్థలమునందు 2,08,749 పరస్థలములందు 11,34,229 మైళ్ల విస్తీర్ణమును గలిగి యష్టైశ్వర్యముల ననుభవించుచుండిన జర్మను సామ్రాజ్య మిపుడు 2,08,780 మైళ్ల ప్రదేశమును మాత్రము గలిగి స్వకర్మఫలము ననుభవించుచున్నది. దురాశ దుఃఖములకు చేటను సామెతకు జర్మనుల దురాశాఫలమునం దర్థాపత్తి వ్యక్తమగుచున్నది. అవతారపురుషుండనని ప్రగల్భములను బలికిన జర్మను చక్రవర్తి ఇపుడు హాలండునం దజ్ఞాతవాసమును చేయుచున్నాడు. యుద్ధనష్టపరిహారార్థ మపారమైన ద్రవ్యమును జర్మనీ దేశము జయమును పొందిన రాజ్యములకు సమర్పింపవలసి యున్నది. నిరర్థకముగ ఫ్రాన్సునకు గావించిన నష్టపూరణమునకు జర్మనీ తగినశిక్షను బొందుచున్నది. సర్వసంహారమునకు బూనుకొనిన జర్మనికి స్వయంకృతాపరాధమున కనురూపమైన ఫలము గలుగుచున్నను పశ్చాత్తాపము గలుగలేదు. అహంకారము జర్మనులను సంధినియమాతిక్రమణమునకు పురికొలుపుచున్నది. జినీవాయందు మిత్రమండలి రాజ్యములు నిర్ణయించిన యర్బుదముల మొత్తము నిచ్చుటకు జర్మనీ నిరాకరించినది. మిత్రమండలిబలములు జర్మను పట్టణముల నాక్రమించుకొనినవి. సంగ్రామానలము మెల్లగ రగులుచున్నది. అమెరికాసంయుక్త రాష్ట్రములు సంధిసభయందు చేరకపోయినను మధ్యవర్తిత్వమును నిరాకరించినవి. లోకసామ్రాజ్యాధిపత్యమును బడయుటకు ముప్పదేండ్లు విశ్వప్రయత్నములను జేసి యధోగతిపాలైనను దురభిమానమును విడువజాలని జర్మను దేశవ్యవహారములు సామ్రాజ్యాభిమానులకు గుణపాఠమును నేర్పదగి యున్నవి.

### రుష్యాసామ్రాజ్యము

రుష్యాదేశచరిత్రము ధనాధికారాభిమానులకు

కన్నులను విప్పి జ్ఞానోపదేశమును జేయుచున్నది. నిరంకుశాధికారమునకు పుట్టినిల్లయిన రుష్యారాజ్య మిపుడపరూపమై సంపూర్ణ ప్రజాస్వామ్యత్వమును స్థాపించుటకు సమకట్టినది. రాజకుటుంబ మంతరించినది. భూస్వాములు మాయమైరి. కుబేరులు కూలిరి. సర్వసమత్వమును స్థాపించుటకు ముఖ్యాధికారులు లెనిను ట్రాస్కీగారులు సకలహింసలను జేయుచున్నారు. ప్రజాధికారాచ్ఛాదనమున సోవిటు ప్రభుత్వము చేయుచున్న వధలు నిరంకుశమైన జారుప్రభుత్వ వధలను మీరుచున్నవి. పట్టణములు పాడగుచున్నవి. ప్రజ లన్నము లేక కృశించుచున్నారు. యంత్రయానములు లేక పరిశ్రమలు సంపదలు క్షీణించుచున్నవి. పురములు దుర్భిక్షముపాలగుచున్నవి. గ్రామసీమలు మాత్రము విప్లవము పోయి సుఖపడుచున్నటులు వార్తలు తెలుపుచున్నవి. గ్రామములు పాడిపంటలుగలిగి సుఖజీవనమును జేయుచున్నను, నిర్మాణపదార్థములు లేక కష్టపడుచున్నవి. భోగపదార్థముల కభ్యాసమైన నాగరక ప్రపంచమునం దిరువదవ శతాబ్దారంభమునం దేదేశమును పరదేశసహాయము లేక సుఖజీవనమును గడుపజాలదని రుష్యాదేశానుభవము వ్యక్తముచేసినది. రుష్యానుల పాడిపంటలు - సహజపదార్థములు - యూరపుదేశముల పోషణమున కవసరములు. ఇతరదేశముల నిర్మాణపదార్థములు రుష్యాదేశ పోషణమున కవసరములు. సోవిటు ప్రభుత్వమును ఇతర ప్రభుత్వములును నీసత్యమును గ్రహించుటకు సంగ్రామ మవసరమయినది. ఫ్రాన్సు గ్రేటుబ్రిటను రాజ్యములు సోవిటుబలమును నిర్మూలము చేయుటకు విశ్వప్రయత్నములను జేసినవి. నూతన రాజ్యములను స్థాపించుటకు సైన్యనివహముల నంపినవి. యుద్ధ పరికరముల నందజేసినవి. పెట్టుబడి పెట్టినవి. రుష్యాదేశమునందు నెపోలియనుకు బట్టిన దుర్దశయే మిత్రమండలి యాజ్ఞాపాలకులకును పట్టినది. కాలక్రమమున సోవిటుల బలములు దేశద్రోహుల బలములను నిర్మూలము చేసినవి. డెన్కిను కోల్చకు మొదలగు నాయకులు పరారులైరి. యుద్ధమునకు పూర్వము రుష్యాసామ్రాజ్యము 85,00,000 చదరపు మైళ్ల విస్తీర్ణమును 18,30,00,000 ప్రజలను గలిగియుండెను. ఇపుడు రుష్యారాజ్యము 50,00,000 చదరపు మైళ్ల దేశమును 12,00,00,000 ప్రజలను గలిగియుండును. స్వయంనిర్ణయ ధర్మానుసారముగ ఫిన్లాండు, పోలాండు, ఎస్థోనియ, లాట్వియ, లిథుయానియ, జార్జియ, ఉక్రెయిను, డాను, కూబను, అజర్బైజను, ఆర్మీనియా రాజ్యములు స్వతంత్ర రాజ్యములుగ నిర్మింపబడెను. ఈ రాజ్యములు రుష్యారాజ్యవిభజనమునకును విస్తీర్ణము తగ్గుటకును గారణమైనను స్వయంనిర్ణయ ధర్మప్రయోగ మవలంబితమై శేషించిన రాజ్యము నేకముఖమునను తెచ్చుటకు సాధనంబులైనవి. సోవిటురుష్యాతో నమెరికా సంయుక్తరాష్ట్రములు జర్మనీ పోలాండు లిథుయానియ పారసీకము తుర్కీ అఫ్ఘనిస్థానము మొదలగు దేశములు సంధిని జేసికొనినవి. బ్రిటీషు సామ్రాజ్యము వర్తకసంధిని చేసికొనినది. ఫ్రాన్సు రాజ్యము మాత్రము బిగియబట్టి నిలిచియున్నది. సోవిటుప్రభుత్వము పారసీకమునకును అఫ్ఘనిస్థానమునకును చిరకాల లబ్ధములైన దేశములను తిరిగి సంక్రమింపజేసినది. పారసీకమునకు బాకీలను సయితము రద్దుచేసినది. మహమ్మదీయ ప్రపంచమును సోవిటుల యుదారప్రవృత్తి యాకర్షించుట సహజము. తురుష్కులకును రుష్యనులకును సంధినిబంధన తేర్పడినటులు వదంతి గలదు. సోవిటుల స్థితిగతులు గతసంవత్సరమునందు యూరపుఖండమునందు స్థిరపడినవి. సోవిటుల ప్రతిభ ప్రపంచశాంతికి వినియోగపడునదియును విప్లవమునకు వినియోగపడునదియును దుర్మతి సంవత్సర వ్యవహారములు నిర్ణయింపగలవు.

సోవిటులు బహుజనాధికారవిధాన స్థాపనమును ప్రకటించుచున్నను, వ్యవహారమునందు ముఖ్యాధికారులు నిరంకుశమార్గము నవలంబించుచున్న విధమును దేశవ్యవహారములు వ్యక్తముచేయుచున్నవి. క్రూరకార్యములును హింసావిధానములును ధర్మసంస్థాపనమునకు సాధనములు గాజాలవు. సోవిటులు ధర్మసంస్థాపనమునకు నిరంకుశప్రభుత్వ మవలంబించిన సాధనల నుపయోగించుచున్నారు గాని ప్రజాభిప్రాయమును గాని ధర్మబలమును గాని యుపయోగించుటలేదు. యూరపు రాజ్యముల కభ్యస్తమైన బాహుబల ప్రయోగమే సోవిటులకును నభ్యాసమగుచున్నది. సోవిటులు వారి ధర్మప్రతిపాదనమును లక్షలకొలది సైనికులపూనాలమున స్థాపించుచున్నారు సోవిటుల నిరీక్షణము పాశ్చాత్యుల కభ్యస్తమైన భౌతికలాభముల మీదనే గలదు గాని సకల ధర్మములకును మూలమైన యాధ్యాత్మిక ప్రయోజనములందు లగ్నము గాలేదు. లోకమునందు ధనాధికారదాస్యము నిరంకుశాధికారదాస్యము శిథిల

మైనను ప్రజాశాసనదాస్యము విపరీతాకారమును దాల్చి మహాసంక్షోభమును కలిగించునని యూరపు రాజ్యముల పరిస్థితులు-ముఖ్యముగ రుష్యాదేశ పరిస్థితులు లోకమునకు బోధించుచున్నవి గాంధిమహాత్ముఁడీయుపద్రవమునుండి భరతవర్షమును గాపాడుట కాధ్యాత్మిక సిద్ధాంతముల ననవరతము బోధించుచున్నాఁడు. భౌతిక వాసనలందు బడి పోరలుచుండు వారల కాధ్యాత్మిక వాసనలు స్ఫురింపవు. ఆసురసంపదల ననుభవించెడి వారికి దైవసంపదల ప్రభావ మగపడదు. గాంధిమహాత్ముఁడు సోవిటుల భౌతికవిప్లవమునుండి భరతవర్షమునుద్ధరించుట కాధ్యాత్మిక బలప్రభావములను సంస్మరింపజేయుచున్నాఁడు. లోకమునకు మోక్ష మాత్మబలము వలన గలుగగలదు గాని భౌతికాడంబరమున గలుగజాలదు. ఆధ్యాత్మిక ధర్మక్షేత్రమైన భరతఖండమునకు సోవిటుల యుపద్రవము కలుగదని దేశపరిస్థితులు విశదము చేయుచున్నవి.

బ్రిటీషుసామ్రాజ్యము

పరమేశ్వరానుగ్రహము బ్రిటీషుసామ్రాజ్యమునకు పరమోచ్చదశను గల్పించినది. బ్రిటీషుసామ్రాజ్యమునకు గల పరపతి - ప్రతిష్ఠ - పలుకుబడి-లోకమునందు వేరొక సామ్రాజ్యమునకు లేదను సిద్ధాంతము నిర్వివాదాంశము. అమెరికా సంయుక్త రాష్ట్రములు కొన్ని విషయములందు బ్రిటీషు ద్వీపముల శుభస్థితిని మించినను బ్రిటీషుద్వీపముల శుభస్థితి యద్వితీయము. బ్రిటీషుద్వీపముల యాదాయము 1918-19 వత్సరము 120,0000,000 వ్యాపారము 200,00,00000 సవరనులు. తలఒకటికి ఆదాయము 26, వ్యాపారము 44 అప్పు 177 సవరనులు. యుద్ధానంతరము బ్రిటీషుద్వీపములకు 800,00,00 000 సవరనుల ఋణము నిలిచినది. అమెరికా సంయుక్తరాష్ట్రముల వ్యాపారము బ్రిటీషుద్వీపముల వ్యాపారమును క్రమముగ దాటుచున్నది. అమెరికా సంయుక్తరాష్ట్రములకు బ్రిటీషుద్వీపములకు గల యప్పులందు మూడవవంతు మాత్రమే గలదు. బ్రిటీషు ద్వీపములకు గల యప్పులందు విశేషభాగ మితర రాజ్యముల పెట్టుబడికై వినియోగింపబడినది. బ్రిటీషు సామ్రాజ్యాంతర్భాగముల రాబడిని సంపదలను బ్రిటీషుద్వీపాదాయసంపదలకు జేర్చినపుడు బ్రిటీషుసామ్రాజ్యశుభస్థితి విశదమగుచున్నది. బ్రిటీషు సామ్రాజ్యము 1,42,72,782 మైళ్లవిస్తీర్ణమును, 44,53,88,500 జనసంఖ్యను గలిగియున్నది. యుద్ధానంతరము 11,00,000 చదరపుమైళ్ళదేశము 1,00,00,000 ప్రజలు బ్రిటీషు సామ్రాజ్యమునకు లభించినవి. సామ్రాజ్య మహావైభవము మాతృదేశమునందును అంతర్భాగములందును పరరాజ్యములందును మత్సరములను గలిగించుచున్నది. భూగోళమునందలి నాల్గవవంతు వైశాల్యమును జనసంఖ్యను గల బ్రిటీషుసామ్రాజ్యమునకు లాభమునకు దగిన భారమును గలదు. ప్రపంచమునందు సుస్థిరశాంతిని స్థాపించుటకు బ్రిటీషుసామ్రాజ్యమునకు గల యవకాశములు ఏయితరసామ్రాజ్యమునకును లేవు. ఇమ్మహాసామ్రాజ్యమునందు మానవపోషణమున కవసరమైన సకల సంపదలును గలవు. సకల మతములును గలవు. సకల సదుపాయములును గలవు. ఈ యదృష్టస్థితియే జర్మనుల మాత్సర్యమునకును అమెరికనుల స్పర్థకును గారణము. కాని యాంగ్లేయుల కార్యనిర్వహణ దక్షత్వము వారి నింతవఱకు రక్షించినది. సంగ్రామఫలముగ సకల రాజ్యములందును మహాపరివర్తనము గలిగినది. సకలవ్యవస్థలందును పరివర్తనము గలిగి మానవ జీవితమునందు నూతననిరీక్షణము గలుగుచున్నది.

నవ నిరీక్షణము

ప్రపంచవ్యాప్తమైన పరివర్తనము మానవహృదయమునందు దాస్యభావవిచ్ఛేదమును జేయుటకు బూనుకొనుచున్నది. కర్మకారులు ధనపాశ బంధనములను ఛేదింపఁ దలపెట్టుచున్నారు. పామరులు విద్యాధికార పాశబంధనమును శిథిలము చేయ యత్నించుచున్నారు. ప్రజలు నిరంకుశాధికార పాశబంధనములను తొలగించుటకు తలపడుచున్నారు. సామాన్యులు కుల పాశబంధములను నిర్మూలము జేయుటకు బూనుకొనుచున్నారు. పరాధీనజాతులు స్వారాజ్యస్థాపనమునకై తపమును జేయుచున్నవి. విశాల సామ్రాజ్యాధిపత్యముగల బ్రిటీషు ద్వీపములకే కష్టము లన్నియును గలుగుచున్నవి. ఆర్థికసమస్యలు, మతసమస్యలు, వ్యాపార సమస్యలు, అధికారసమస్యలు, స్వాతంత్ర్యసమస్యలు బ్రిటీషు సామ్రాజ్యమునందు ప్రచండవేగమున బరువిడుచున్నవి. బ్రిటీషుద్వీపములందు కార్మికవర్గము నూతనధర్మములను కార్మికుల వేతనములందు స్థాపించుటకు

నమకట్టినవి. బొగ్గుగనుల పనివాండ్రు లాభనష్టములతో నిమిత్తము లేకయే యుద్ధకాలమునందు గల వేతనము ప్రమాణవేతనముగ నుండవలయు నని కోరుచున్నారు. అధికారులు యజమానులు ప్రతిఘటించు చున్నారు. బొగ్గుపనివాండ్రు యానవాహకులు రైలుపనివాండ్రు సమ్మెకట్టి వారి యభీష్టమును పడయగోరుచున్నారు. ప్రభుత్వము సంపూర్ణముగ బ్రతిఘటించుట కేర్పాటులను జేయుచున్నది. కార్మిక ప్రపంచమునందు కార్మికుల విజయము నూతన సిద్ధాంతమును స్థాపించి కార్మికవర్గ విజయమును స్థాపించగలదు. పనివాండ్రు పరిశ్రమాధికారుల లాభనష్టము లెటు లున్నను సుఖజీవనోపాధిని బడయుట కధికారమును గలిగియున్నారని నిర్ధారణ జేయ నమకట్టుచున్నారు. లాభములను పంచుటయును పెట్టుబడికి వడ్డీ నిచ్చుటయును నిర్వహణ ప్రతిఫలమును కర్మకారుల వేతనానంతరము నిర్ణయింపదగిన విషయములు గాని పూర్వము నిర్ణయింపదగిన విషయములు గావని స్థిరపడినయెడల సోవిటుల సిద్ధాంతములు కాలక్రమమున ప్రాపకమును గాంచునని నమ్మవలసి యున్నది. సకల సంస్థాపనలు మానవప్రయోజనమున కేర్పడినవి గాని కేవలము ద్రవ్యోపార్జనమున కేర్పడలే దని స్థిరపడవలసి యున్నది. ఈ ధర్మసంస్థాపనము మహాపరివర్తనమునకు మార్గము నేర్పరచగలదు. కార్మికవర్గమునందు గలిగిన సంచలనము మానవహృదయమునందు గలిగిన సంచలమునకు నిదర్శనముగ నున్నది.

## స్వాతంత్ర్యాభిలాష

కార్మికవర్గము ధనవర్గ పాశబంధవిమోచనమును గోరునటులు పరాధీనజాతులు పరాధీనపాశబంధ విమోచనమును గోరుచున్నవి. ఈజిప్టు చరిత్రము - అయిర్లాండు హత్యలు-భరతవర్షపు భావపరివర్తనము-స్వాతంత్ర్యాభిలాషకు నిదర్శనములు. ఈజిప్టునందు స్త్రీలు స్వాతంత్ర్యసిద్ధి కంతఃపురవాసమును బరిత్యజించి పురుషులతో గలిసి పాటుపడిరి. విద్యార్థులు విద్యాలయములను వదిలి ప్రజాప్రబోధమును గావించిరి. ప్రజలు పరమోత్సాహముతో గష్టముల నెదుర్కొనిరి. నాయకులు కారాగృహవాసములను స్వర్గవాసమువలె స్వీకరించిరి. బ్రిటీషు ప్రభుత్వము నూరేండ్లనుండియును ఈజిప్టునకు స్వాతంత్ర్యమును ప్రసాదించుటకు వాగ్దానములను జేయుచుండెను. కాని ఏదో యొక కారణ మడ్డుపడి వాగ్దానభంగము గలుగుచుండెను. పరమోదారస్వభావమును గలిగిన గ్లాడుస్టోను మంత్రియును స్థిరనిర్ణయములను మార్చజాలకపోయెను. యుద్ధసమయమునందు సంగ్రామావసరములకుగాను ఈజిప్టు సంరక్షకదేశముగ నిరూపింపబడినది. యుద్ధానంతరము గ్రేటు బ్రిటను రాజ్యబంధనములను బిగించినదే గాని సడలింపలేదు. ఐగుప్తులందు గలిగిన యావేశమును శాంతింప జేయుటకు మిల్నరుపంచాయతీసభ నియమింపబడినది. మిల్నరు ప్రభువు మోంటేగు షెమ్సుఫర్డు లవలంబించిన సంకుచితమార్గము నవలంబింపక దీర్ఘదృష్టితో సంపూర్ణ స్వరాజ్యస్థాపనము నాదేశించెను. అధికారదేవతల కీమార్గము వెగటుగ నుండెను. చర్చిలు ప్రభృతులు స్వరాజ్యప్రదానమును ప్రతిఘటించిరి. ఆందోళనము ప్రబలినది. ఈజిప్టునందు చర్చిలు గారికి పరాభవము గలిగినది. ఇప్పుడు జగ్లులుపాషా గారు స్వరాజ్యస్థాపనాశయములతో వ్యవహార నిర్వహణమునకు బూనుకొనుచున్నారు పర్యవసాన మనతికాలముననే వ్యక్తము గాగలదు. ఆంగ్లరాజనీతిజ్ఞుల సంకుచితస్వభావమును ఈజిప్టుదేశ వ్యవహారములు విశదము చేయుచున్నవి.

## ఐర్లాండు

అయిర్లాండుదేశ మిపుడు స్వరాజ్యప్రాప్తికి మహావేదన ననుభవించుచున్నది సిన్ఫీనరుల బలము శుక్లపక్షచంద్రునివలె దినదినాభివృద్ధిని బొందుచున్నది. సిన్ఫీనరులు మూడువంతుల భాగములందు బ్రిటీషు ప్రభుత్వాధికారమును ప్రతిఘటించుచు స్వీయాధికారమును సాగించుచున్నారు. ప్రతికూలమైన అలస్టరు భాగము నందు నయితము సిన్ఫీనరుల యధికారము వ్యాపించుచున్నది. సిన్ఫీనరులు లోకమునకు స్వతంత్రరాజ్యస్థాపనమును బ్రకటించుచున్నారు. స్వాతంత్ర్యమునకై సిన్ఫీనరులు జేయుచున్న హత్యలు దుర్ణయములు దౌర్జన్యకార్యములు పరమ విచారమును గలిగించుచున్నవి. గతసంవత్సరమునందు 2000 హత్యలు 20,000 దుర్ణయకార్యములు జరిగినవి. పరిపాలన విధానము యథార్థముగ సిన్ఫీనరుల హస్తగతమైనది. పురపాలన సంఘములు మండలసంఘములు సిన్ఫీనరుల హస్తగతములైనవి. వారు పన్నులను తీసికొనుచున్నారు. న్యాయవిమర్శనమును చేయుచున్నారు. దురంతకముల నొన

ర్చుచున్నారు. న్యాయస్థానములను పరశురామప్రీతి చేయుచున్నారు. పోలీసువారిని సైనికులను కాల్చిచంపుచున్నారు. రహస్యముగ పన్నులను వసూలు చేయుచున్నారు. ఆంగ్లాధికారము శిథిలమగుచున్నది. బ్రిటిషు మంత్రివర్గము దుర్నయములను దుర్నయములతో ప్రతిఘటించుటకు బూనుకొనుచున్నది. అల్లరులు హత్యలు జరిగిన ప్రదేశములందు ప్రభుత్వాధికారులిండ్లను తగులబెట్టుచున్నారు. ప్రజలకు భయభ్రాంతులను కలిగించి సిన్‌ఫీనరులను నిర్జింపను ప్రభుత్వము తలపెట్టినది. ప్రభుత్వవిధానము స్వాతంత్ర్యప్రియులకు విషాదమును గలిగించుచున్నది. కార్మికవర్గము సిన్‌ఫీనరులకు సానుభూతినిజూపుచున్నది సిన్‌ఫీనరులు ప్రతిఘటన దౌర్జన్యకార్యములకు వెలువక స్వకార్య నిర్వహణమునకు బూనుకొనుచున్నారు. ఐర్లాండు స్థితిగతులు బ్రిటిషురాజనీతికి కళంకమును గలిగించుచున్నవి. సిన్‌ఫీనరులు స్వాతంత్ర్యప్రాప్తికి రెండు సాధనములను పూని పనిజేయుచున్నారు. మొదటి సాధనము అసహాయోద్యమము. రెండవది దౌర్జన్యము. అసహాయోద్యమ సాధనఫలముగ న్యాయస్థానములు విసర్జితములు. పార్లమెంటు ప్రతినిధులు కారాగృహములందు నివసించుచున్నారు. ప్రజలు పన్నుల నిచ్చుట మానినారు. ప్రత్యేక ధనాగారములను న్యాయస్థానములను స్థాపించినారు. దేశమును రక్షకభట శూన్యము చేయుచున్నారు. స్థానిక స్వపరిపాలన సంఘములను స్వాధీనము చేసికొని యున్నారు. పన్నులను విధించి వసూలు చేయుచున్నారు. ఈ వ్యవహార క్రమ మంతయును నైర్లాండు దేశస్థుల కార్యదీక్షకును దేశభక్తికిని నిదర్శనముగ నున్నను, వారి దౌర్జన్యకార్యములు విషాద జనకములుగ నున్నవి. వారవలంబించిన దహనకార్యములు-దౌర్జన్యములు-హత్యలు_పాశ్చాత్యహృదయము నావరించిన పశుబలధర్మారాధనమునకు ఫలములుగ నున్నవి. ప్రభుత్వ మవలంబించిన ప్రతిఘటన విధానమును నింద్యముగ నున్నది. ప్రభుత్వము శాసించిన స్వరాజ్యశాసనము నిరాకరింపబడుచున్నది. అయిర్లాండు ప్రజలు సంపూర్ణ స్వరాజ్యమును గోరుచున్నారు. మహాసామ్రాజ్య నిర్వహణాభిమాన భరితమైన బ్రిటీషుప్రభుత్వమీ యభిలాషను బ్రతిఘటించుచు ద్వేషభావమును దినదినాభివర్ధమానము చేయుచున్నది. అల్‌స్టరు సంరక్షణమునకును సామ్రాజ్యసంరక్షణమునకును ననుకూలమై సామ్రాజ్యాంతర్భాగస్థమైన స్వరాజ్యస్థాపనమును జేయుట క్షేమకరమని సామాన్యులు తలచుచున్నారు. భగవత్సంకల్పపరిణామమును కాలము దెలుపగలదు.

### అధినివేశస్థలములు

ఆఫ్రికాసంయుక్తరాష్ట్రములందొక పక్షము వారు సంపూర్ణస్వాతంత్ర్యము నభిలషించుచున్నారు. ఈ పక్షబల మల్పమైనను స్వాతంత్ర్యభావాంకురముల స్థితికి నిదర్శనముగ నున్నది. కనడాయందు స్వాతంత్ర్య సంకల్పము సిద్ధాంతమునందు గోచరము గాకపోయినను లక్ష్యమునందు గోచరమగుచున్నది. కనడా కార్థికస్వాతంత్ర్యము గలదు. ఇతర రాజ్యముల పదార్థముల మీదను వలె బ్రిటీషుపదార్థముల మీదను సుంకారోపణాధికారమును గలిగియున్నది, వాషింగ్టను నగరమునందు స్వయముగ రాయబారిని నియమించుట కధికారమును గలిగియున్నది. సంధి సభయందును స్వదేశసంరక్షణమునందును ప్రత్యేక వ్యక్తిత్వమును గలిగియున్నది ఇతర రాజ్యములును కనడా మార్గము నవలంబించుచున్నవి. మెసపొటేమియా అరాబియ పారసీక రాజ్యములు సంపూర్ణ సాతంత్ర్యమును కోరుచున్నవి. బ్రిటీషు ద్వీపములు సామ్రాజ్యాంతర్గతములు స్వాతంత్ర్య వికాసమును పరమోత్సాహముతో గోరుచున్నవి. సామ్రాజ్యవాసుల యజ్ఞములకు ఫలము స్వాతంత్ర్యము. స్వాతంత్ర్య లక్ష్యము భిన్నజాతులకు వారిసంస్కారమున కనురూపముగ గుదురుచున్నది. సామ్రాజ్యాభిమానులు భిన్న లక్ష్యములను నిర్లక్ష్యము చేయుచు స్వప్రయోజనముల రక్షణమునకు బూనుకొనుచున్నారు. బ్రిటీషుసామ్రాజ్యము సామ్రాజ్యాంతర్భాగములందుగలిగిన మహాసంచలనము నెదుర్కొనవలసియున్నది. పనివాండ్రు స్వస్థలమునందు స్తంభనమును గలుగజేయ త్వరపడుచున్నారు. అయిర్లాండు విప్లవమయముగ నున్నది. మెసపొటేమియాయందర్బుదముల ద్రవ్యము మునిగి పోవుచున్నది. వలసరాజ్యములు సంపూర్ణ స్వాతంత్ర్య సౌధారోహణమును గోరుచున్నవి. ఇమ్మహాస్వాతంత్ర్య సంచలన సమయమునందు భరత ఖండము పూర్వపు రీతిని కరములను ముకుళించుకొని కూర్చుండుట యసంభవమని ప్రాజ్ఞులు గ్రహించుచున్నారు.

స్వాతంత్ర్యము సంయోగము వర్తమాన సా

మ్రాజ్య స్థితి లక్ష్యము. భరతఖండ మితరరాజ్యముల వలె స్వాతంత్ర్య స్థితినే కోరుచున్నను సామ్రాజ్యాభిమానులకు విపరీతముగ తోచుచున్నది. స్వారాజ్య సంపాదనమునకు గాంధిమహాత్ముని యాదేశమునను భరతవర్ష మసాధారణ మార్గము నవలంబించుచున్న విధమును భారతజాతీయవ్యవహారపరిచయము విశదము చేయుచున్నది. విశ్వసంస్థాపనలను బ్రిటీషుసామ్రాజ్యసంస్థాపనలను నావరించి మహాసంచలనము భరతఖండము నావరించిన నవయుగనిర్మాణమునకు ప్రజలను ప్రేరేపించుచున్నది. ఆత్మవిశ్వాసము లేని మహాజనులు నవశక్తివిలాసములను కనుగొనలేక ప్రతిఘటన కార్యములను జేయుచు విచిత్రమార్గము నవలంబించుచున్నారు. సంశయాత్ములు మహాశక్తిని సందర్శించి సంశయముల బోనాడి యాత్మసామ్రాజ్యమును బడయుదురు గాత!

భరతఖండము

భారతాయతనమైన భరతఖండము కర్మక్షేత్రము; పుణ్యభూమి. ఈ పుణ్యక్షేత్రము రాజులు మారినను రాజ్యములు చెడినను సంపదలు పోయినను నవిచ్ఛిన్నముగ నాత్మసామ్రాజ్యము ననుభవించుచున్నది. పరదేశాక్రమణమును జేసి మహాసామ్రాజ్యములను స్థాపించి అస్సీరియా గ్రీసు రోము పారసీకము సామ్రాజ్యములు నామమాత్రావశిష్టము లైనవి. గ్రీసు రోమక సామ్రాజ్యములు సౌందర్యకళను ధర్మశాస్త్రమును లోకమునకు బ్రసాదించిన విధమును పాశ్చాత్యపండితులు ప్రశంసించుచు గొనియాడుచున్నారు. భౌతికప్రయోజనముల కేర్పడిన యీ ప్రాచీన సామ్రాజ్యములు స్వోద్ధరణమునకును పరోద్ధరణమునకును నిరుపయోగములై కాలక్రమమున క్షీణించినవి. సామ్రాజ్యాధిపత్యము భోగాభిలాషను వృద్ధిజేసినది. భోగభాగ్యాభిలాష మహావిలయమునకు గారణంబుగ బరిణమించినది. పెరిక్లీసు కాలమునందు గ్రీసుదేశము భోగభాగ్యములతో మునిగి తేలుచువిలయమార్గమును బట్టెను. సీరో చక్రవర్తి కాలమునందు రోమకసామ్రాజ్యమునం దతివ్యాపకమును గాంచిన భోగమహాతరంగములు సామ్రాజ్యవిప్లవమును గలుగజేసినవి. మద్యపానము వర్ధిల్లినది. వ్యభిచారప్రవాహము హద్దులను దాటినది. వస్త్రధారణ మవమానవ్యాపనమున కుపయోగపడినది. ఆ దివ్యమందిరములు దివ్యాంబరములు దిగంబరాకారములు మద్యపానములు నృత్యగీతములు మహాభీభత్సజనకములై మహాప్రళయమును గలిగించినవి. సామ్రాజ్యాంతర్భాగముల సంపదలు సామ్రాజ్యాధిపతుల భోగములకు బలవంతముగ గొంపోబడినవి. ఆసియాఖండ సంపదలు రోమునగరమునందు నివాసమును గైకొనినవి. మలయచందనఖండములు, మరాళవితానములు, చీనాంబరములు, సన్నసెల్లాలు, సుగంధద్రవ్యములు, రత్నకంబళములు, దంతాభరణములు రోమునగర వాసమును స్వీకరించినను కర్మకారుల నైపుణ్యము వికసించినది గాని క్షీణింపలేదు. రోమునగరము తగులబడుచున్నను సీరోచక్రవర్తి నిశ్చలుడై వ్యభిచారమునందు మునిగి తేలుచుండెను. గ్రీకురోమకకళాదక్షులు నిర్మించిన విగ్రహము లంగవిపాకమును బ్రదర్శించుటయందు పేరొందినవిధమున నాత్మ విపాకమును బ్రదర్శించుటకు వినియోగపడకుండెను. క్షురము లైన కండరములు మాంసపేశలములు జానువులు బాహువులు నేత్రములు కర్ణములు నాసాపుటములు ఫాలప్రదేశములు కళాభిజ్ఞులదృష్టి నాకర్షించినటులు అక్షరమైన యాత్మ యాకర్షింప జాలకుండెను. రూపవైభవమునకు జూపిన శ్రద్ధ భావవైభవమునకు బ్రసరింపకుండెను. భౌతికరూపవ్యామోహము సామ్రాజ్యవిలయమునందు బరిణమించినది. సామ్రాజ్యనిర్మాత లవలంబించిన మార్గమునే సామ్రాజ్యభక్షకులును అవలంబించిరి. యూరపురాజ్యముల సభ్యత్వము రోమక సామ్రాజ్యసభ్యత్వాధారమున నిర్మితమై యామార్గమునే యవలంబించినది. కళలు పరిశ్రమలు స్వారస్వతము మతము పాశ్చాత్యరాజ్యములందు భౌతికమూలములైన బహిరంగసాధనాధారముల ననుసరించి వికసించినవి. కళలకు ప్రధానము రూపముగాని భావముగాదు. పరిశ్రమల కాధారము భాగ్యముగాని సౌఖ్యముగాదు. సారస్వతమునకు మూలము భోగముగాని త్యాగము గాదు. సహజసంపదలకై పరితపించెడి జాతుల కిట్టి భౌతికలాభాపేక్షయును సహజముగ గలుగుచుండును. కళలు పరిశ్రమలు సారస్వతము భరతఖండమునందు భిన్నమార్గము నవలంబించి వికసించినవి. భారతీయు లక్షరమైన భావసామ్రాజ్యాధారమున వికాసమార్గముల నవలంబించిరి. పాశ్చాత్యులు పరదేశాక్రమణమునకు ఆయుధములను వాణిజ్యమును మతబోధకులను వినియోగించిరి. వ్యాపార

స్థులు చేరుచుండిరి. వ్యాపారస్థులను మతబోధకు లను గమించుచుండిరి. రక్షణార్థ మాయుధములు వెనువెంట వచ్చుచుండెను. వ్యాపారసంరక్షణమునకై గతశతాబ్ది యందు పాశ్చాత్యరాజ్యములు గావించిన హత్యలు క్రూరకర్మలు దుర్ణయములు దుండగములు భావికాల చరిత్రకారులు మహాపాతకములుగ నిర్ణయింపగలరు. ఓనాగరకదేవీ! నీపేరను మానవు లెన్ని ఘోరపాపముల కొడిగట్టుకొనిరి? ఎందరిని కష్టములపాలు చేసిరి? ఎందరిని హింసించిరి? ఎన్ని మహాసంగ్రామములను దాపరింప జేసిరి? గతశతాబ్దిచరిత్రను తలపోయునపుడు మానవ హృదయమునుండి దుఃఖతరంగములు పొంగి పొరలును గదా! మానవుల ప్రకృతిశాస్త్రజ్ఞానము మానవ వికాసమునకు గాకను మానవసంహారమునకు వినియోగపడినది గదా! మానవుల మహాసంపదలు మానవ విలయమునకు సాధనంబులైన మారణయంత్రనిర్మాణమునకు వినియోగపడినవి గదా! గతించిన మహాసంగ్రామమునకు వివిధదేశములు వినియోగించిన సంపదలగణనము నెవరు నిర్ణయింపగలరు? యూరపు రాజ్యములు మున్నూరేండ్లు కూడబెట్టిన సంపదలన్నియును నాలుగేండ్లలో మంట గలిసినవి. ఒక బ్రిటీషురాజ్యము యుద్ధములకుగాను స్వంతాదాయము గాక గతశతాబ్దియందు - స్వదేశమునందు 6,55,076३,४18 విదేశములందు 1,27,87,1४,405 సవరనులు మొత్తము 7,82,94,76,724 సవరనుల నప్పు చేసినది. అప్పులకు సంవత్సరమునకు 33,20,33,707 సవరనుల వడ్డీ నిచ్చుచున్నది. గ్రేటుబ్రిటను ఆదాయము ప్రస్తుతము 24,00,00,00,000 సవరనులుండుననియును అందు 3,50,00 00 000 సవరనుల సంపదలు నాశనమయిన వనియు పఅర్థికపండితుడు ఎడ్గరు క్రామండు గారు గుణించిరి. ప్రాన్సు 6,30,00,00,000 జర్మని ६000000000 ఇటలి 336 000000 సవరనుల నప్పును గలిగియున్నవి. ప్రాన్సు నాలవపాలు జర్మని సగము ఇటలి అయిదవవంతు సంపదలను నష్టపడినవి. జపాను సంపదలు రెట్టింపు పెరిగినను అమెరికా సంయుక్త రాష్ట్రముల సంపదలు 100-కి 30 వంతున పెరిగినను సంపదలకు గలిగిన నష్టమును ప్రజామరణములును విస్మయము గలుగజేయును. యుద్ధరంగములందు జేరిన 6,00,00,000 ప్రజలయందు 70,00,000 సైనికులు పరలోకమున కేగిరి. ఈమహాలయ మంతయును నాలుగేండ్లయందు జరిగినది. జాతీయాహంకారమునకు బలియైన జీవముల సంక్షోభము నెవరు వర్ణింపగలరు? ఈ మహాసంక్షోభము సర్వజ్ఞుడైన విశ్వేశ్వరున కెఱుక.

రాజ్యాధిపత్యమునకువలె ధనాధిపత్యమునకును పాశ్చాత్యరాజ్యములు మహాసంక్షోభమును గలుగజేసినవి. సంపత్కాములు బానిసతనమును స్థాపించి మానవులను హింసలపాలు చేసిరి. వాటికల నిర్మించి క్రూరకర్మల నొనరించిరి. బంధకపద్ధతి నవలంబించి మానవులను పశుప్రాయులను జేసిరి. కర్మాగారములను నిర్మించి కీలుబొమ్మలను జేసిరి. పాశ్చాత్యులు స్వదేశస్థులను బెట్టినబాధలు మానవదుశ్శీలమును వ్యక్తముచేయుచున్నవి. మానవులు వనమృగములనుసంహారించి దేశాక్రమణమును జేసికొనిన విధమునను నాఫ్రికాఖండమునందును నితరప్రాంతములందును స్వదేశస్థులు నిర్మూలము చేయబడిరి. కోంగోయందు జేసిన విచిత్రవధలు పాశ్చాత్యహృదయము నందు నయితము సంతాపమును గలుగజేసినవి. భాగ్యభోగములే పరమావధిగ నున్న నాగరకతాఫలమును పాశ్చాత్యరాజ్యములు ఇపుడనుభవించుచున్నవి. ధనాధిగమనాభిలాష పాశ్చాత్యరాజ్యములను దగ్ధపటలముచేసినను ధనప్రభావమునకు భంగము గలుగలేదు. ఆంగ్లదేశమునందు కర్మకారులు ధనాధిపత్యమునకు మహాప్రయత్నములను చేయుచున్నారు. రుష్యాయందు సోవిటులు ధనాధిపత్యమును నిర్మూలముచేయుచు ధనరాజ్యమునె స్థాపించుచున్నారు. మానవుల కన్నముతో ముక్తి గలుగదు. అక్షరాభ్యాసముతో వివేకము గలుగదు. భోగములతో సంతృప్తి గలుగదు. అయినను సోవిటులు పాశ్చాత్యానుభవమునకు సిద్ధమైన భౌతికసాధనముల మూలముననే నవయుగనిర్మాణమునకు బూనుకొనుచున్నారు. కర్మకారులు సోవిటులమార్గముననే ధనాధిపత్యమును సాంఘికపరివర్తనమును జేయ గోరుచున్నారు. పాశ్చాత్యనిరీక్షణము సుఖశాంతులకు బాహ్యప్రపంచమునందు లగ్నమగుచున్నది. ఆత్మోపలబ్ధికి ప్రతికూలమైన బాహ్యప్రపంచాధిపత్యము నిరర్థకమని ఏసుక్రీస్తు చేసిన తత్త్వోపదేశము క్రైస్తవరాజ్యముల దృష్టిపథము నుండి యంతర్థానమైనది. బాహ్యప్రపంచాధిపత్యము జీవితపరమార్థముగ బరిగణింపబడుచున్నది. బలము సంపదలు పాండిత్యము బాహ్యప్రపంచాధిపత్యమును బడయుటకు వినియోగింపబడుచున్నవి. పాశ్చాత్యులు బాహ్యప్రపంచాధిపత్యకాములై సామ్రాజ్యములను స్థాపించిరి. యంత్రములను నిర్మించిరి.

సంపదలను గడించిరి. పరిశ్రమలను నెలకొలిపిరి. వాణిజ్యమును వ్యాపింపజేసిరి. భాగ్యభోగాభిలాషను లోకమునందు వ్యాపింపజేసిరి. ధనాధిపత్యము వాణిజ్యాధిపత్యము సైన్యాధిపత్యము మహత్త్వమునకు చిహ్నములుగ బరిణమించినవి. సర్వాధిపత్యమునకై ఫ్రాన్సు ప్రయత్నించి విఫలమును పొందినది. జర్మనీ ప్రయత్నించి యధోగతిపాలైనది. సోవియటు రష్యా సర్వసమత్వమును స్థాపించుటకు బ్రయత్నించుచున్నది. మహాసామ్రాజ్యాధిపత్యమును వహించుచున్న బ్రిటీషు సామ్రాజ్యము శాంతిస్థాపనభారమును నవయుగనిర్మాణభారమును వహించుట కవసర మేర్పడినది. ఈ సందిగ్ధసమయమునందు సామ్రాజ్యవ్యవహారనిర్వహణము దుర్భరముగ నున్నది. సామ్రాజ్యమునందు కలవరమునకు గారణములు ప్రబలుచున్నవి. సామ్రాజ్యాభిమానము దృఢతర మగుచున్నది. లాయిడుజార్జి మంత్రివర్గము చతుర్విధోపాయములను సామ్రాజ్యాభిమానమును సంరక్షించుచున్నది సమ్మెకట్టులు-కలహములు ప్రతిఘటనములు-ప్రబలుచున్నను, మంత్రివర్గము ప్రతిష్ఠకై యధికారరక్షణమును జేసికొనుచున్నది. పాశ్చాత్యపరిపాలనము - పాశ్చాత్యసంసర్గము - పాశ్చాత్యశిక్షణము - పాశ్చాత్యసభ్యత్వము - ప్రాచ్యదేశములం దపారమైన భోగభాగ్యాభిలాషను గలుగజేసినవి. పాశ్చాత్యుల రాజసము రాచఠీవి యహంకారము ప్రజలయందు సమ్మోహమును పుట్టించినవి. భాగ్యభోగారాధనాభిలాష విపరీతముగ బెరిగినది. ఆంతరంగికపరీక్షణము పోయి బాహ్యనిరీక్షణము స్థిరపడినది. భావారాధన మంతరించి యర్థారాధనము వర్ధిల్లినది. ఆధ్యాత్మికచింతనము పోయి యాధిభౌతికవాసనలు పెరిగినవి. నూరేండ్ల బ్రిటీషుపరిపాలనము భరతఖండమును విషయవాసనలందు ముంచినవిధమునకు నిత్యవ్యవహారములు నిదర్శనములుగ నున్నవి.

### బ్రిటిషు పరిపాలన

భరతఖండము బ్రిటీషుసామ్రాజ్యమునకు మకుటమను ప్రసిద్ధనామమును బడసినను, సామ్రాజ్యాంతర్గతరాజ్యములందు నీచదశ ననుభవించుచున్నది. భరతఖండము సకలసంపదల కాకరంబయ్యును మహాదారిద్ర్యము ననుభవించుచున్నది. దివ్యౌషధులకు నిలయం బయ్యును మహావ్యాధులకు నిలయముగనున్నది. ప్రాచీనసభ్యతను గలిగియుండియును విజాతీయసభ్యతను గొలుచుచున్నది. ముప్పదిమూడుకోట్ల ప్రజలబలమును గలిగియుండియును పరాధీన యైనది. భావసామ్రాజ్యమునకు నిలయ మయ్యును నర్థసామ్రాజ్యమునకు మంగళములను పాడుచున్నది. ఆత్మవిభూతిని అపారముగ గాంచియును భౌతికవిభూతులకు దాస్యము చేయుచున్నది. తల్లీ! నీమహావిభూతులను నీబిడ్డలకుజూపి యాత్మవిశ్వాసమును బ్రసాదింపరాదా? కైలాసశిఖరము-గంగాజలము-కాశ్మీరోద్యానము- సస్యఫలరాసులు-దిల్వారాలయము - తాజమహలు-చీనాంబరములు-కోహినూరువజ్రము - గీతాశాస్త్రము-శ్రీకృష్ణప్రభావము - నీదివ్యస్వరూపవిభవము దెలుపుచున్నను, కన్నులు గలిగియును చూడజాలకున్నారు గదా! శ్రీకృష్ణుడు భారతరణరంగమునందు విజయునకు జేసిన ధర్మోపదేశము సమ్మోహావస్థయందనవరతము సంస్మరణీయముగ నున్నది. శ్రీకృష్ణకర్మయోగోపదేశమును లోకమాన్య బాలగంగాధరుడు చేసి సంశయవిచ్ఛేదనము చేసి యమరత్వమును బడసెను.

### లోకమాన్య బాలగంగాధర తిలకు

శ్లో. క్లైబ్యం మాస్మగమః పార్థ నైతత్త్వ య్యుపపద్యతే
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప.

మహాకార్యనిర్వహణము దుష్కరము. అందునను మోహపరవశులైన ప్రజలకు దుష్కరతరము. అర్జునుడు మహారథుడు. ధనుర్విద్యాదక్షుడు. మహాశూరుడు. ధర్మజ్ఞుడు. మహాతపంబు జేసి మహాదేవాదులమెప్పించి పాశుపతాదిదివ్యాస్త్రములనుబడసెను. రణరంగమునందు భయవిహ్వలుడై చిరకాలమభిలషించిన సంగ్రామమునుమానదలచెను. శ్రీకృష్ణుడు యోగప్రతాపము నుపదేశించి కర్మప్రవిష్టుని జేసి విజయమును బ్రసాదించెను. మహాబలసంపదను గలిగియును పరవశమైన భారతహృదయసమ్మోహమును బాపుటకు తిలకు మహాశయుడు స్వరాజ్యమంత్రోపదేశమును జేసి ప్రజలధన్యవాదములను బడసెను. స్వరాజ్యము నాజన్మస్వత్వము-అని నిర్భయముగ బోధించి కష్టములకు పాలైన భారతీయులందు లోకమాన్యు డద్వితీయుడుగ నున్నాడు. తిలకుమహారాజు మహాసామ్రాజ్యమును స్థాపించిన మహారాష్ట్ర దేశస్థుడు. రాష్ట్రము నేలిన బ్రాహ్మణకులజుడు. మహాపండితుడు. సంస్కృత మహారాష్ట్రాంగ్ల భాషలందు మంచిపండితుడు. పాశ్చాత్యవిద్యాసంభవు డైనను సనాతనజన్మసంస్కారవాసనలనుగలిగియుండెను. దేశమునకు పరిపాటే

మైన న్యాయశాస్త్ర పాండిత్యమును గడించియును న్యాయవాదివృత్తి నవలంబించి యుండలేదు. యౌవనదశయందే తనప్రజ్ఞాసంపదలను దేశసేవకై వినియోగించుట కుపక్రమించెను. పత్రికలను నిర్వహించెను. పాఠశాలలను స్థాపించెను. సంబోధనములను జేసెను. కేసరిస్వాతంత్ర్యసింహగర్జనముననవరతము చేయుచు నధికారహృదయమునకు భయమును గలిగించెను. రాజభక్తిరాహిత్యము రాజద్రోహమును నపూర్వధర్మప్రవచనము తిలకమహాశయునకై యేర్పడినది. శిక్షాస్మృతియందు 124 ఏ నిబంధన రాజద్రోహోపద్రవమును సంహరించుటకు గల్పింపబడినను, రాజభక్తి మాత్రము పెరుగలేదు. అవమానములు - పరాభవములు-శిక్షలు- లోకమాన్యుని వజ్రసంకల్పమును ప్రస్ఫుటము చేసినవి కఠిన శిక్షలు స్వరాజ్యావసరమును వ్యక్తముచేసినవి. భారతీయులు స్వదేశమునందు స్వపరిపాలనమును బడయగోరుట రాజద్రోహ మని నిర్ణయింపబడినపుడు, భారతహృదయమునం దాత్మగౌరవ మస్తమించిన దని సువ్యక్తమైనది. బ్రిటీషుప్రభుత్వము పిన్నపనులను చక్కగ నాలకించును. సభావేదికలనుండి స్వాతంత్ర్యవితర్కములను జర్చించుట కంగీకరించును. ఉన్నతోద్యోగముల నిచ్చుటకు పూనుకొనును. బిరుదములతో సత్కరించి యుపలాలన జేయుటకు ప్రయత్నించును ఆత్మవిశ్వాసజనకములైన భావములందును కార్యములందును రాజద్రోహమును అఘ్రాణించును. శివాజివర్ధంతులు-గణపతినవరాత్రములు - జాతీయగీతములు - రాజద్రోహజనకములుగ బరిగణింపబడి ప్రభుత్వాగ్రహమునకు పాత్రములైనవి. బాలగంగాధరతిలకు ప్రభుత్వాగ్రహమును నిశ్చలచిత్తముతో నెదుర్కొని ప్రజాహృదయపీఠమునందు శాశ్వతపథము నధిష్ఠించెను.

ఆంగ్లేయులు రాజనీతియందు చతురులు. సమ్మోహనాస్త్రప్రయోగమునందు సమర్థులు. ప్రజ్ఞావంతులకు భోగభాగ్యలాభములను సమకూర్చి నిరాయుధులను జేయుచుందురు. ఉద్యోగముల నొసగి యామోదమును గలుగజేయుచుందురు. భేదములను గల్పించి విడదీయుచుందురు. దండించి భయమును గలిగించుచుందురు. వెఱపించి నిర్లేపత్వమును పుట్టించుచుందురు. బుజ్జగించి వశపరచుకొనుచుందురు. దేశభక్తుడు గోపాలకృష్ణగోఖలే రాజనీతివాగురలందు జిక్కి ప్రతిభను గోల్పోయెను. తిలకుమహారాజునందు కర్మవైరాగ్యయోగములు మేళగించినవి. ప్రాచ్యసంస్కారసంజనితమైన భావక్షేత్రమునందు పాశ్చాత్యసంస్కారసంజనితములైన కర్మబీజములు ఫలించినవి. వైరాగ్యోపహతమైన భారతహృదయమునందు నిర్లేపత్వము గలిగినది. బాలగంగాధరుడు నిర్లేపత్వమును నాశనముచేసి కర్మక్షేత్రమునందు ధర్మబీజమును వికసింపజేయ సమకట్టెను. గీతారహస్యమునకు కర్మయోగనామకరణము తిలకుమహాశయుని జీవితవిలక్షణమునకు ప్రమాణముగ నున్నది. శ్రీకృష్ణుడు కురుక్షేత్రమునందు మహాసంగ్రామారంభమునందు విజయునకు జేసిన హితోపదేశమునే ఆత్మధర్మమునుమఱచిన భరతపుత్రున కుపదేశించి హృదయోద్ధరణమును జేసెను.

శ్లో॥ క్లైబ్యం మాస్మగమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప,

భారతసంస్కారప్రవాహమును చిరకాలపరాధీనత్వము శుష్కింపజేసినది. దైవోపహతమైన ప్రజాహృదయము నిర్లేపత్వమును వహించినది. వ్యాసవాల్మీకి కాళిదాస తిక్కనాది మహాకవులను శ్రీరామకృష్ణాద్యవతార పురుషులను నారదజనకశుక విద్యారణ్య వివేకానందాది తత్త్వజ్ఞులను విజయ పృథ్వీరాజ కృష్ణదేవరాయాది వీరులను గనిన మహామాత గొడ్డువోయినది. ముప్పదికోట్ల ప్రజాహృదయము జడత్వమును దాల్చినది. భారతమహాహృదయము మాయాపహృతమై వికారస్వరూపమును పొందినది, దైవాధీనభావ మతివ్యాప్తిని బొందినది. పౌరుషధర్మము నామమాత్రావశిష్టమైనది. పాశ్చాత్యసంసర్గము మహావ్యామోహమును గలుగజేసినది. రైలుమార్గములు మోటారుబండ్లు న్యాయస్థానములు విద్యాలయములు సన్నసెల్లాలు సారాయములు బిరుదములు భారతహృదయమును సమ్మోహసాగరమున ముంచినవి. సమ్మోహము హృదయదౌర్బల్యమును గలుగజేసినది. దుర్బలహృదయమును రక్షకభటులు సైనికబృందములు తుపాకులు ఫిరంగులు మిన్నుమిక్కిలి యధికారప్రతిభ స్వతంత్రచేష్టావిరహితముగ చేసినవి. ఉద్యోగవ్యామోహము గౌరవవ్యామోహము పారతంత్ర్యభావమును బలపఱచినవి. స్వాతంత్ర్యభావము తలయెత్తినపుడు రాజద్రోహశాసనాస్త్రము ప్రయుక్తమై సర్వసంహారమును చేయుచుండెను. సభావేదికలనుండి పంపెడి నివేదికల కధికారవర్గము ప్రత్యుత్తరములను నొసంగుచు సభయ

ానములను జేయుచుండినది. జాతీయమహాసభ యవలంబించిన విజ్ఞప్తివిధాన మధికారవర్గామోదమును బడయుచు వచ్చినది. శ్రీ విక్టోరియామహారాజ్ఞి శ్రీ ఎడ్వర్డు జార్జి సార్వభౌములు మహాశాసనపత్రములను బ్రకటించిరి. శాసనపత్రాంశములు కేవలము గ్రంథస్థములై ప్రయోగమునం దపురూపముగ నుండెను. ఆంగ్లవర్గాధికారసహాయము జీవనప్రవాహమునకు మూలసాధనముగ నుండెను. భారత జాతీయమహాసభా స్థాపనమున కాంగ్లాధికారులు మూలకారకులు. జాతీయమహాసభాచారిత్రమునందు హ్యూము వెడరుబర్నునామములు చిరసంస్మరణీయములు. హ్యూముగారి సహాయప్రోత్సాహములే జాతీయమహాసభను స్థాపించుటకు పరమసాధనములుగ నుండెను. అధికారవర్గ మెంతస్వల్పాధికారశకలము నొసగినను భారతీయులు మహాభాగ్యముగ బరిగణించి ధన్యవాదములను సమర్పించుచుండిరి. ప్రభుత్వవర్గ మొక మండలాధికారునిగ భారతీయుని నియమించిన, దిగ్విజయము గలిగినటు లానందించుచుండిరి. ప్రభుత్వవర్గము మిత్రభేదమార్గము నవలంబించి హిందూమహమ్మదీయులను ప్రత్యేకముగ జేరదీసి పరిపాలించుచు ప్రజలకు సంతసమును గలుగజేయుచుండిరి. మహమ్మదీయు లధికారవ్యామోహమున మునిగి భారతీయుల ధిక్కరించుచుండిరి. భారతీయు లాత్మప్రత్యయము లేక పరావలంబనముననే రాజ్యాంగసంస్కరణములను పొంద గోరుచుండిరి. ఈరాజ్యాంగధర్మప్రవర్తకులందు గోపాలకృష్ణగోఖలే యగ్రగణ్యుడుగ నున్నాడు. మింటోమోర్లె సంస్కరణములతో గోఖలే యుగము ముగిసినది. దేశసేవకై జీవితమును సమర్పించిన గోఖలె రాజ్యాంగములందు భారతీయులనిస్సహాయత్వమును గ్రహించెను. ఆయన పరావలంబనమే తరణోపాయ మని నమ్మి ప్రజాహితసేవనమునం దధికారసహాయము నధికతరముగ నభిలషించుచుండెను. స్వాతంత్ర్యతత్త్వములను బ్రకటించినను పరావలంబనోపాయమునందు విశ్వాసమును గలిగియుండెను. గోపాలకృష్ణ గోకలె కేవలము పాశ్చాత్యవిద్యాసంభవుడు. ఆయన జీవితమునందును సిద్ధాంతములందును పాశ్చాత్యసంసర్గసంజాతములైన భౌతికలక్ష్యము లనవరతము గోచరంబగుచుండును. మిల్లు స్పెన్సరు హక్సలివాకరు మొదలగు పాశ్చాత్య పండితుల సిద్ధాంతములు గోకలె ప్రజాహిత జీవనసిద్ధాంతములకు సాధనంబులుగ నుండెను. నక్రమాందోళనము వారిదృష్టికి లక్ష్యముగ నుండెను. స్వాతంత్ర్య నిరోధక రాజద్రోహ సభాశాసనము ముద్రణశాసనమును గోకలె యామోదమును బడసినవి. ఆశాసనములు దేశమునకు గలుగజేసిన యనర్థపరంపరలు పరావలంబనలక్ష్యమునకు ఫలములుగ బరిణమించినవి. గోపాలకృష్ణ గోకలెగారి పరావలంబన లక్ష్యము వారి యద్భుత ప్రజ్ఞాపాండిత్యములకు దగిన ప్రయోజనమును సమకూర్పనివిధమును దేశవ్యవహారములు వ్యక్తము చేసినవి. భారతహృదయస్వరూపము పరిస్ఫుటమగుటకు బరావలంబనవృత్తి యస్తంగతమై యాత్మావలంబనవృత్తి యుదయించుట యవసరంబయిన విధము వర్తమానపరిస్థితులు సువ్యక్తము చేసినవి.

గోకలేకాలమునందే దాదాభాయి నౌరోజి కలకత్తా కాంగ్రెసునందు స్వరాజ్యధ్వజమును స్థాపించెను. స్వరాజ్యసిద్ధి కాత్మావలంబనమే మూలసాధనమను భావము వంగదేశ విభజనానంతరము ప్రజాహృదయమునం దంకురించెను. ఆయంకురములను పోషించుటకు లోకమాన్యతిలకు మహారాజు తనజీవితమును సమర్పించెను. వంగయువజనవర్గము స్వరాజ్యమును పాశ్చాత్యప్రవృత్తి కనురూపమైన హత్యలమూలమునను దౌర్జన్యపద్ధతులసాధనమునను నుపార్జించుట కుపక్రమించినది. నిర్లేపత్వాయత్తమైన భారతహృదయమునకు యువజనహృదయోద్రేకము మహాస్పందనమును కలిగించినది. భారతహృదయమును స్వదేశాభిమానమావహించినది. స్వరాజ్యప్రాప్తి కాత్మావలంబనమే శరణ్యమని భారతహృదయము కనుగొనినది. భారతహృదయభావమును లోకమాన్యుడు స్వీయచరిత్రయందును కర్మయోగశాస్త్రమునందును బ్రతిపాదించెను. స్వరాజ్యము భారతీయజన్మస్వత్వమని సింహనాదము నిరంతరమును జేయుచు మిత్రుల తిరస్కారమునకును శత్రువుల పరిహాసములకును అధికారుల దండనమునకును బాల్పడి ఆత్మావలంబన యోగమహిమను భారతజాతి కుపదేశించి బాలగంగాధరతిలకు లోకమాన్యతను బడసెను. శ్రీకృష్ణులు కురుక్షేత్రమునందు మహాయోగ ప్రభావమును విశదముచేసి విజయుని సమ్మోహమును బాపి యోగారూఢుని జేసినవిధమున తిలకు మహాశయుడు కర్మయోగము నుపదేశించి భారతహృదయ సమ్మోహమును బాపెను. భారతీయులను “ఉత్తిష్ఠ జాగ్రత నిబోధత”యని సంబోధించెను. కర్మయోగ

మునకును ధర్మారాధనమునకును సనాతనం బైన భాగవతధర్మమునందు సమన్వయముచేసి యోగరహస్యమును వ్యక్తముచేసెను.

ప్రపంచ ప్రవృత్తియందు సృష్టిస్థితిలయములు మూడును సువ్యక్తముగ నున్నవి. సృష్టి విలయమును విలయము సృష్టిని దివారాత్రముల రీతిని ననుగమించుచు ప్రపంచవికాసమునకు దోడ్పడుచున్నవి. విలయము వికాససాధనంబైనను మహాకంపమును ధీమంతుల హృదయములందును గలుగజేయు చున్నది. కర్మక్షేత్రమునందు హింసాహింసల ధర్మరహస్యమును నిర్ణయించుట గహనము. ధర్మవ్యాధోపాఖ్యాన మీధర్మ సూక్ష్మమును విశదముచేయుచున్నది. ధర్మవ్యాధునకు మాంసవిక్రయము జీవనసాధనంబుగ నుండినను ధర్మచ్యుతి గలుగలేదు. ధర్మాధర్మవేదియైన ధర్మవ్యాధుడు నిరంతర వేదాధ్యయన పరాయణుం డైన బ్రాహ్మణునకు ధర్మరహస్యమును తెలిపి కృతార్థుని జేసెను.

ఆ. వినుము హింస ధర్మ-వితతి కెల్లను మేటి
యదియు సత్యయుక్త-మైన పలుకు
ననఘ శిష్టచరిత-లందు సత్యము కడు
నధిక మనిరి శ్రుతుల-నరసి బుధులు.—భా. అ.

ధర్మావరణమునందు హింసాహింసల స్వభావ స్వరూపములను నిర్ణయించి స్వరాజ్యమహాసంకల్పమును జేయుటకు విధానమును గీతారహస్యమునందు లోకమాన్యుడు వ్యాఖ్యానముచేసెను. స్వాత్మోద్ధరణమునకు స్వాత్మయే సాధనము గాని పరావలంబనము సాధనము గాదు. జాతీయమహాసభ చిరకాలము పరావలంబన సాధనమునను సక్రమాందోళనమార్గమునను జాతీయ వ్యక్తిత్వమును స్థాపించుటకు బ్రయత్నించినది. కాని ప్రయత్నములకుఁ దగిన ప్రతిఫలము గలుగలేదు. వంగ యువజనవర్గము పరసంహార సాధనమునను పరావలంబనమును నిర్మూలముచేయ దలపెట్టినది. తిలకు మహాశయుడు పరావలంబనదృష్టిని నిర్మూలము చేయుట కాత్మావలంబనధర్మమును బోధించెను. స్వధర్మసాధనమైన స్వరాజ్యసంకల్పమును ప్రజల కుపదేశించెను. ధర్మసంకల్పము ధర్మసాధనమునకు బీజ మని యుపదేశించి ఆత్మావలంబనధర్మమును భారతజాతీయహృదయమునందుఁ బ్రతిష్ఠించెను. ఫలాపేక్ష లేని కర్మయోగము త్యాగమునకు బీజము. ఫలాపేక్షావిరహిత మైన కర్మయోగము ధర్మాధర్మస్వభావరహిత మై మోక్ష సాధనం బగుచున్నది. భాగవతధర్మస్వరూపమైన కర్మయోగము పరమార్థసిద్ధికి సాధనం బని బోధించి ప్రజాహృదయమునందు మహాసంచలనమును గలుగజేసి ప్రజాహృదయసింహాసనము నధిష్ఠించెను. విశుద్ధసంకల్పము హింసారూపమునఁ బరిణమించినను, ధర్మచ్యుతి గలుగఁజాలదు. అపవిత్రసంకల్ప మహింసారూపమున నంతము నొందినను ధర్మహాని గలుగుచున్నది. యువజన హృదయము స్వరాజ్యసిద్ధికి పాశ్చాత్యచరిత్ర లుపదేశించిన మార్గము నవలంబించుటకు సమకట్టినది. స్వాతంత్ర్యప్రాప్తికి గ్రేటుబ్రిటను ఇటలి ఫ్రాన్సు రుష్యాదేశములందు పరివర్తనము గలిగినది. బ్రిటీషుప్రజలు మొదటి చార్లెసును రాజ్యభ్రష్టుని జేసి శిరమును ఖండించిరి. ఫ్రాన్సు రుష్యారాజ్యములు రాజకుటుంబములను రూపుమాపినవి. భారతయువజనహృదయమును పరిచితమైన లక్ష్యముగాని పరివర్తనమార్గమునకుఁ బూనుకొనినది. లోకమాన్యుడు భారతహృదయమునందు సహజమైన సనాతనధర్మ నిరీక్షణమును బునరుద్ధారణము చేయఁ బ్రయత్నించెను. ఆలక్ష్యమే నిష్కామకర్మయోగము. పాశ్చాత్యసంస్కారసంభవ మైన భారతహృదయమున కీలక్ష్యము గలుగుట దుర్ఘట మైనది. ఆత్మయోగము నుపదేశించిన లోకమాన్యుని లక్ష్యము సైతము సక్రమాందోళనమును పరావలంబనమును నతిక్రమియుండెను. స్వరాజ్య స్వత్వభావమును దృఢముగ భారతహృదయమునందు బ్రతిష్ఠించిన బాలగంగాధరతిలకు పరమపదమున కేగినను నా మహనీయుడు ప్రతిష్ఠించిన స్వరాజ్యబీజములు మహావికాసమును బొందుచున్నవి. గాంధిమహాత్ముడు స్వరాజ్యబీజముల నాత్మబలసాధనమున ఫలవంతము జేయబూనిన విధమును గత సంవత్సర జాతీయమహాసభావ్యవహారములు వ్యక్తము చేయుచున్నవి.

### జాతీయమహాసభ

మానవులకు కార్యసిద్ధి కాంతరంగిక సాధనము ప్రధానసాధనముగ నున్నది. మహానుభావులు మహాతపమును జేసి మహాఫలములను బడసినవిధమును పురాణేతిహాసములు దివ్యముగ బోధించుచున్నవి. ఆదినుండియును స్వరాజ్యప్రాప్తికి జాతీయమహాసభ బహిరంగ సాధనములందు లక్ష్యమును నిలుపుచుండెను. ఏపుదు గురు నాయకులో సభావేదికలందు గంభీరోపన్యాసములను జేయుచు పరిపాలన వికాసమును గోరుచుండిరి.

ఉన్నతోద్యోగములు ఆయుధశాసనసంహారము. భూమిశిస్తు, అధికారవిభజనము మొదలగు బహిరంగసాధనములు లక్ష్యములుగ నుండెను. లక్ష్యముల కనురూపముగ మోర్లేమింటో సంస్కరణములు మాంటుఫర్డు సంస్కరణములు చేయబడెను. సంస్కరణముల వెంటను నిర్బంధశాసనములును పుట్టుచుండెను. యుద్ధానంతరము బ్రిటీషు ప్రభుత్వము ప్రసాదించిన సంస్కరణశాసనము బ్రిటీషు హృదయమును విశదముచేసినది. మాటలయం దొకటి చేతలయం దొకటి యనురాజనీతి సంస్కరణములందు సార్థకమైనది. పంజాబు హత్యలు భారతీయుల నిస్సహాయస్థితిని విశదముచేసినవి. ముప్పదికోట్ల ప్రజలను డయరులు ఓడ్వాయరులు యథేచ్ఛగ నవమానపఱుపగలరు. ప్రజల నవమానపఱచిన డయరును యూరపియనులు బహూకరించిరి. కాంగ్రెసు సభ్యులు గోరిన విధమున ప్రభుత్వ మీ క్రూరాత్ములను దండింపలేదు. ప్రభుత్వము ప్రజాభిప్రాయమును నిర్లక్ష్యము చేసెను. ఈ విధముగ పంజాబువధలు విస్పష్టము చేసినవి. జాతీయ మహాసభ సంపూర్ణముగ నాత్మావలంబన ధర్మము నవలంబించుటకు నిర్ణయించినది. సంస్కరణము లొడగూర్చెడి మిథ్యాస్వాతంత్ర్యమును జాతీయమహాసభ గ్రహించినది. జాతీయ మహాసభ భారతీయుల జన్మస్వత్వమును ప్రకటించుటకు బూనుకొనినది. ఆంతరంగికసాధనము నుపదేశించినది. కలకత్తాయందు గూడినయవసరజాతీయ మహాసభయందు శాసనసభా బహిష్కారము నిర్ణయింపబడినది. మహాసభయం దామోదితమైన తీర్మానము ప్రజాహృదయమును విశదము చేసినది.

ఖిలాఫత్ సమస్యా సందర్భమున, భారతదేశ మహమ్మదీయుల యెడల చేయవలసిన, తమ విధాయకకృత్యమును భారతసామ్రాజ్య ప్రభుత్వములు తప్పెను. ముఖ్యమంత్రిగారు, తమ వాగ్దానమును చెల్లించుకొనలేక పోయిరి. కాబట్టి మహమ్మదీయులు కాని వారు గూడ సక్రమమైన పద్ధతులమీద, తమ మతమునకు గల్గిన ఆపత్తును పోగొట్టుటకు ప్రయత్నము చేయుచున్న మహమ్మదీయసోదరులకు సహాయము చేయవలెను. పై రెండు ప్రభుత్వములవారును పంజాబులో నమాయకులైన ప్రజలను రక్షించుటకును మిక్కిలి మోటుతనముగా ప్రవర్తించునట్టియు నేరస్థులైనట్టియు, అధికారులను రక్షించుటకును, నిరాకరించిరి. మరియు అధికారుల నేరములకు బాధ్యుడనని ఒప్పుకొనిన, సర్ మైకేలు ఓడ్వాయర్ గారిని నిర్దోషిగా నిర్ణయించిరి. ప్రభువులసభలోను కామన్సుసభలోను జరిగిన చర్చయందు భారతీయప్రజలయెడల సానుభూతిని చూపలేదు.

పంజాబులో నవలంబింపబడిన, భయంకర కార్యములను బలపఱచిరి. ఇటీవల ప్రచురింపబడిన రాజప్రతినిధిగారి, ప్రకటనవలన ఖిలాఫత్ పంజాబుల విషయములను గురించి, ఇరువురైనను పశ్చాత్తాపమును జూపినటుల కనబడలేదు. కాబట్టి పై రెండు నేరములందును ప్రభుత్వమువారు తగిన న్యాయమును చూపనిచో భారతీయులు తృప్తినొంద జాలరనియు భావికాలమున నిట్టి దురంతములు జరుగకుండుటకును, జాతీయగౌరవమును, నిలువబెట్టుకొనుటకు స్వరాజ్యస్థాపనమే తగినసాధన మనియు, ఈ సభవారు అభిప్రాయపడుచున్నారు. పై నేరములకు, ప్రతిఫలము కలుగునంతవఱకు, స్వరాజ్యము స్థాపించునవఱకు, క్రమాంతరపద్ధతులపై శాంతియుతమగు సహాయనిరాకరణావలంబనము తక్క భారతీయులకు వేరొకమార్గము లేదనియు, ఈ సభవారు అభిప్రాయపడుచున్నారు.

(అ) బిరుదములను, గౌరవపదవులను, విసర్జించి సర్కారు పాఠశాలలను, న్యాయస్థానములను, శాసనసభలను బహిష్కరించి యుద్యమమును జయప్రదము గావింపవలెనని, యీ సభవారు కోరుచున్నారు.

(ఆ) సర్కారువారు గావించు, దర్బారులను విందులు మున్నగు వానిని బహిష్కరింపవలెను.

(ఇ) ప్రభుత్వమువారి పాఠశాలలకు బాలురను పంపుట మానివేసి జాతీయపాఠశాలలను నెలకొల్పవలెను.

(ఈ) బ్రిటిషు న్యాయస్థానములను బహిష్కరించి పంచాయతుల మూలమున వివాదములను పరిష్కరించుకొనవలెను.

(ఉ) మెసపొటోమియాలో గుమస్తాలుగా గాని; సైనికులుగ గాని, పనిచేయగూడదు.

(ఊ) శాసనసభలకు అభ్యర్థులు బహిష్కరింపవలెను. జనులెవ్వరిని ఎన్నుకొనగూడదు.

(ఎ) విదేశవస్తువుల బహిష్కారము గావింపవలెను.

(ఏ) సహాయనిరాకరణము శిక్షణక్రమముగా భావించి స్వదేశీవ్రతము ననుష్ఠింపవలెను. దేశమున బట్టలు నేయుటకు వీలుకలుగుటకై స్వగృహముల భారతీయులు నూలువడుకుటను నేర్చుకొనవలయును.

అయినవేం ప్రతినిధులు 20 వేల సభ్యులు గల మహాసభ చేసినతీర్మానము ప్రభుత్వహృదయమునందు సంచలనమును గలుగజేయలేదు. భేదోపాయమున ప్రభుత్వవర్గ మధికారసంరక్షణమునకు బూనుకొనినది. అవసరజాతీయమహాసభాభిప్రాయమున కనురూపముగ నియోజనవర్గము నియోజనములను బహిష్కరించినది. ఎన్నికలందు 100-కి 10 వంతున నియోజకవర్గము పాల్గొనుట ప్రజానిశ్చయమునకు నిదర్శనము. సుప్రసిద్ధ జాతీయనాయకులు అభ్యర్థిత్వమును వదలుకొనిరి. మితవాదులు ప్రభుత్వపక్షావలంబనులు సులభముగ విజయమును బొందిరి. అధికారవర్గము మితవాదులను

ప్రభుత్వావలంబనములను సత్కరించినది. మితవాదనాయకులు సురేంద్రనాథబెనర్జిగారు సర్ బిరుదమును బొంది మంత్రిపదవిని బడసిరి. అధికారవర్గమునకు మితవాదులకు ప్రతిఘటకులకు సంయోగము గలిగినది. మితవాదులు దేశావసరసమయమునందు నిరంకుశాధికారవర్గమునకు బలమొసంగి నిరంకుశాధికారసంరక్షణమును జేసిరి. ఈ సంయోగ మసహాయోద్యమవ్యాపనావసరమును వ్యక్తముచేసినది. ప్రజాభిప్రాయమును నాగపురమునందు గూడిన జాతీయమహాసభ వ్యక్తముచేసినది.

### నాగపురమహాసభ

నాగపురమహాసభ యన్వర్థముగను ప్రథమ జాతీయమహాసభ. భారతజాతీయసంయోగము స్థిరముగఁ బ్రతిబద్ధమై జాతీయబలము వ్యక్తమైనది. ముప్పది వేల ప్రతినిధులు ప్రేక్షకులు సభనలంకరించిరి. సభ్యుల స్వాతంత్ర్యస్వభావము ప్రశాంతస్వభావము భారతజాతీయ హృదయస్వరూపమును విశదముచేసినవి. సభాసమావేశములందు చిరకాలపరిచితములైన ముఖము లదృశ్యములైనవి. పండిత మదనమోహన మాలవీయుడు జిన్నా కపర్ది సభ నలంకరించిరి. ఇంగ్లాండునుండి బెన్‌స్పూరు ఆల్ఫ్రెడ్ నైట్, కర్నలు వెడ్జివుడు వచ్చియుండిరి. బెజెంటమ్మగారు జాతీయమహాసభకు జాతీయలక్షణము మహాసభలక్షణము లేదని సభకు విముఖత్వమును జూపిరి. జిన్నా వెడ్జివుడు గార లారంభమునుండియును మందగమనము సక్రమాందోళనము బ్రిటిష్ సాహచర్యము సాధనములని ప్రతిపాదించిరి. మాలవీయుడు నయోక్తులను భయోక్తులను వారివాదమునే బలపఱచెను. మాలవీయుని విశుద్ధజీవనము మధురసంభాషణము శాంతస్వభావము సభ్యులదృష్టి నాకర్షించినను వారిభావములు కటువుగఁ గన్పించెను. మదనమోహనాస్త్రము శక్తిహీనమైనపు డితరాస్త్రములు నిరుపయోగములు. భారతభూమియందు పండిత మదనమోహనమాలవీయునకు గల మంచి ప్రతిష్ఠ వర్తమానకాలమునందు క్షీణించినది. పరమావమానకరమైన పంజాబు హత్యలు ఖిలాఫతు సమస్య సారరహితములైన రాజ్యాంగసంస్కరణములు ప్రజాహృదయమునందు మహాసంచలనమును గలిగించినవి. ప్రజలకు స్వరాజ్యసంపాదనమునందు గల పట్టుదల గాఢమైనది. గాంధిమహాత్ముని వజ్రసంకల్ప మీవిషయమును వ్యక్తముచేయుచున్నది.

### గాంధిమహాత్ముడు

లోకమాన్యతిలకు మహానుభావుఁ డస్తమించిన సమయము భారతజాతీయజీవనమునందు మహాసంధి సమయము. సంగ్రామము భారతహృదయమునందు స్వాతంత్ర్యాంకురములను వికసింపఁజేసినది. సంగ్రామసమయమునందు భారతభూమి చూపిన త్యాగ మేయితరసామ్రాజ్యాంతర్భాగమును జూపియుండలేదు. రణరంగములందు 16, 00, 000 భారతీయులు పాల్గొనిరి. భరతవర్షసంపదలు మిత్రమండలి విజయమునకప్రతిహతముగ వినియోగింపఁబడినవి. నూటయేఁబదికోట్ల రూప్యములు సమర్పింపబడినవి. మహాఖండస్వరూపమున కనురూపమైన స్వారాజ్యసంస్థాపనలు వినిర్మితము లగు నను నాశాపాశములు భారతహృదయమును సంపూర్ణముగ నావరించియుండెను. సంకుచితములైన మోంటుఫర్డు సంస్కరణవిధానములు భారతహృదయము నావరించిన యాశాలతలను శోషింపఁజేసినవి. తియ్యనిమాటలు కాఠిన్యకార్యములు బ్రిటీషురాజనీతియని స్థిరపడినది. క్రూరకార్యములను జేసిన డయరును యూరపియనులు సత్కరించిరి. ప్రభుత్వము దండింపఁబూనుకొనకుండెను. యథేచ్ఛగ భారతీయులనిందింప నాటంకపడకుండెను. సర్ మైకెలు ఓడ్వయరు యథాప్రకారము నిందాప్రవాహమును ప్రవహింపజేయుచుండెను. అమృతసరసమావేశసమయమునందు గలిగిన విషమపరిస్థితులకు నాగపురసమావేశసమయమున కేవిధమైన నుపశమనము గలుగలేదు. కాంగ్రెసుసభ నిర్ణయించిన ప్రతీకారమునైనను ప్రభుత్వ మవలంబించియుండలేదు. మీదు మిక్కిలి ప్రభువులసభ పంజాబుహంతకులను మహాధీరులని పొగడినది. స్వస్థలమునందుగల యవమానమె పరస్థలములందును భారతజాతికి స్థిరపడినది. ఫిజిద్వీపములందు భారతీయులు పరమావమానములకు బాలైరి. నిర్బంధప్రవాసములు హత్యలు దౌర్జన్యములు భారతీయులకు సంప్రాప్తములైనవి. దక్షిణాఫ్రికానుండి భారతీయులను స్వచ్ఛందమిషను స్వస్థలప్రవేశమును జేయించుటకు యూరపియనులు దలపెట్టిరి. తూర్పుఆఫ్రికాయందు భారతీయులకు ప్రత్యేకనివాసస్థలములను గల్పించుటకు బ్రయత్నములు జరుగుచున్నవి. ఆస్ట్రేలియా కనడాదేశములందు భారతీయులకు ప్రవేశమె దుర్లభము. బ్రిటీషుసామ్రాజ్యాంతర్భాగములందును స్వస్థలములందును భారతీయులకు దాస

త్వము నుమటను స్థిరముగ వ్రాసినది. పరస్థలములందు భారతీయుల మితజీవన విధానము యూరపియనుల భోగపరాయణత్వమునకు ప్రతిబంధకముగ నుండును. భారతీయులు దాసానుదాసులుగ యూరపియనుల భోగభాగ్యముల కనుకూలపడు నంతవరకును భారతీయుల సుగుణము లద్భుతముగ కొనియాడబడును. యూరపియనులు పెట్టినభిక్షకొగ్గై కొనివారిని సేవించినంత వఱకును భారతీయులకు యూరపియనులు స్వాగతంబు నొసంగిరి. భారతీయులు స్వల్పముగ స్వాతంత్ర్యప్రకర్షణమునకు బూనుకొనినపుడు వారిపొడ యూరపియనులకు గిట్టకుండెను. యూరపియనులు దక్షిణాఫ్రికా తూర్పుఆఫ్రికా ఫిజిద్వీపములు మొదలగు ప్రదేశములందు వినమ్రులైన భారతీయులసహాయముననే సంపదలను వృద్ధిచేసి సుఖజీవన మనుభవించుచున్నను నిపుడు వారిపొడ గిట్టకున్నది. ఆ దేశములందు భారతీయులార్జించిన స్వల్పసంపదలు యూరపియనుల లోభమునకు బలియగుచున్నవి. వలసరాజ్యములందు సేవకావృత్తియె స్వదేశగమనమె భారతీయునినుదుటను వ్రాసినవి. వలసరాజ్యములను వృద్ధిజేసిన భారతీయుల కిట్టి దైన్యస్థితి సంప్రాప్తమగు నపుడే భారతీయుని హృదయమునందు సంతాపతరంగములు పొంగి పొరలకుండును?

విదేశములందు గలిగిన దుర్దశయె స్వదేశమునందును గలదు. స్వదేశమునందు భారతీయులు క్లైబ్యమును గలిగి చైతన్యరహితులై దుర్భరమైన జీవయాత్రను గడపుచున్నారు. ప్రతిభాయుతులైన మహానుభావులు సయితము దైన్యస్థితి ననుభవించుచున్నారు. ఆంగ్లవేషభాషాభావులకు మహానుభావులు చేతులను జోడింపవలసిన స్థితి గలిగినది. విదేశస్వదేశములందు గౌరవహీనమైన స్థితిగతులు భారతజాతికి సహజావస్థగ బరిణమించినది. పంజాబువ్యవహారములు కన్నులను బలవంతముగ దెరపించినవి. భయభ్రాంతులైన యాంగ్లయువతులకు లక్షలరూప్యములు ప్రతిఫలముగ నొసంగబడినవి. భారతయువతు లవమానితలై మహాదుఃఖము ననుభవించిరి. జలియనువాలాబాగునందు నిరపరాధులు డయరు కోపాగ్నికిబలియైరి. విదేశములందును స్వదేశమునందును భారతీయుల నిస్సహాయస్థితి వ్యక్తమైనది. సంస్కరణము లీ నిస్సహాయస్థితి దొలగించుట కేవిధమైన నదుపాయమును గల్పింపలేక. పూర్వవాసనలతో నెన్ని జాతీయమహాసభలు జరిగినను భారతజాతికి విమోచనము గలుగదని భారతజాతి గనుగొనుట కుపక్రమించినది. తరణోపాయమున కాత్మావలంబనమె మూలసాధనమని ప్రజలు గ్రహించిరి. ముప్పదికోట్ల ప్రజలు సహజసంపదలు ప్రాచీనసభ్యత్వము భాగవత ధర్మాసక్తి యాత్మావలంబనసాధనమునకు సకలవిధములను తగియున్నవి. జాతీయవిషాదయోగదశయందు గాంధిమహాత్ముడు భారతజాతీయాత్మస్వరూపమును బ్రత్యక్షము చేసి మహామాయావరణమును బోగొట్టుటకు బూనుకొనెను.

### ఆత్మావలంబనయుగము

గాంధిమహాత్ముడు పాశ్చాత్య ప్రాచ్యసభ్యత్వసంరంభములం దనుభవమును గడించిన మహానాయకుడు. మోహనదాసకరణచంద్ర గాంధి బాల్యమునం దింగ్లాండునందు విద్యాభ్యాసమును జేసి పాశ్చాత్యసభ్యత్వానుభవమును స్వయముగ ననుభవించెను. దక్షిణాఫ్రికాయందు న్యాయవాదివృత్తి నవలంబించుచు లోకానుభవమును వ్యవహారపరిజ్ఞానమును సువిచారశక్తిని గడించెను. జైనధర్మప్రవర్తకుడై అహింసాసత్యధర్మస్వభావముల గనుగొన గలిగెను. పాశ్చాత్య భౌతికధర్మమును భారతీయాధ్యాత్మికధర్మమును స్వయముగ ననుభవమునందు గల గాంధిమహాత్ముడు స్వరాజ్యసంరంభమునందు నాయకత్వమును వహించుటకు సకలవిధములను తగియుండెను. గోపాలకృష్ణ గోకలె గాంధిని భారతసేవక సంఘమునందు జేర్చుటకై ప్రయత్నించెను. బిజెంటమ్మ గారు స్వరాజ్యసంఘమునందు జేర్చుటకు ప్రయత్నించెను. వర్తమాన విషమపరిస్థితులందు భారతీయహృదయవేదనను భిన్న ప్రదేశములందు స్వయముగ ననుభవించిన గాంధిమహాత్మునకు సామర్థ్యము గలదు. ధర్మజుడు శ్రీకృష్ణుని నమ్మినటులు భారతహృదయము గాంధిమహాత్ముని నమ్ముచున్నది.

క. ఆపద గడవంబెట్టను
నోపి శుభంబైన దానిఁ గూర్పను నా
కీపుట్టువునందు బాందు
క్ష్మాపాలుఁడు మిమ్ముఁ జూపి చనియె మహాత్మా.

గాంధిమహాత్ముడు దక్షిణాఫ్రికాయందు భారతీయుల జన్మస్వత్వములను సంరక్షించుటకు సకలమును సమర్పించిన మహాధీరుడు. సత్యవ్రతుడు. ధర్మప్రవర్తకుడు. హింసావిముఖుడు. కార్యజ్ఞుడు. పశుబలధర్మవిదూ

రుడు. ఆత్మబలధర్మనిరతుడు. భారతజాతికి విదేశమునందు గల దుర్దశయె స్వదేశమునందును గలదు. ఈ దుర్దశను తొలగించుటకు జాతీయమహాసభ ముప్పది నాలు గేండ్లు చేసిన ప్రయత్నములు నిరర్థకము లైనవి. పరావలంబనసాధనము నిరుపయోగ మైనది. భేదనోపాయ ప్రభావము వ్యక్తమైనది. మహమ్మదీయులకు ఖిలాఫతు సమస్య నేత్రోన్మీలనము చేసినది. రౌలటు శాసనము పంజాబుహత్యలు జాతీయస్వభావమును పరిస్ఫుటము చేసినవి. ఆత్మబలమునకును బాహుబలమునకును గల సంబంధము విశదమైనది. మోంటుఫర్డు సంస్కరణముల దౌర్బల్యము గోచరమైనది. అవసరజాతీయ మహాసభయం దామోదితమైన అసహాయోద్యమ ధర్మము జాతీయవాదుల యామోదమును బడసినది. క్రూరాత్ములైన ఓడ్వాయరు డయరు థాంప్సను జాన్సనుగారులు సన్మానసంపద సౌఖ్యములను అప్రతిహతముగ ననుభవించుచుండిరి. హంటరు నివేదికము క్రూరకార్యములను సమర్థించినది. ప్రభువులసభ డయరు హత్యలను కొనియాడినది. ఆంగ్లోఇండియనులు డయరును సన్మానించిరి. కాంగ్రెసునివేదిక సూచించిన స్వల్పదండనము నైనను నపరాధు లనుభవింపలేదు. యథాప్రకారము డయరుపక్ష మూపవేత నాది సత్కారముల ననుభవించుచున్నది. ఖిలాఫతు సమస్య మహమ్మదీయహృదయమునందు గొప్ప కలవరమును గలిగించెను. ఈ విషమపరిస్థితులందు భారతజాతీయహృదయమునందు నవనిరీక్షణము సహజముగ గలుగుచున్నది. ఆనవనిరీక్షణమె యసహాయోద్యమము. ఆ నిరీక్షణమార్గమును భారతీయు లవలంబించుటకు బూనుకొనిరి. జాతీయవాదులు శాసనసభలను బహిష్కరించిరి. న్యాయవాదులు కొందరు వృత్తిని విసర్జించిరి. విద్యార్థులు పాఠశాలలను విడిచిపెట్టిరి. ఇట్టిపరిస్థితులలో నాగపురమునందు గూడిన జాతీయమహాసభను గాంధిమహాత్ముడు నిరపాయముగ గమ్యస్థానమును జేర్చి ప్రథమనాయకపదము నధిష్ఠించెను. నాగపుర మహాసభయం దాత్మావలంబనధర్మము సంపూర్ణామోదమును బడసిన విధమును సభావ్యవహారములు విశదము చేసినవి.

### స్వరాజ్యసంపాదనము

జాతీయమహాసభాప్రయోజనము స్వరాజ్యసంపాదన మని సకలమతములవారును నమ్ముచున్నారు. స్వరాజ్యస్థాపనము బ్రిటీషుపరిపాలనమునకు ఫలమని రాజనీతిజ్ఞులు తెలిపియుండిరి. బ్రిటీషు రాజ్యాధిష్ఠాతలు సింహాసనారోహణసమయమునందు స్వరాజ్యాభయమును ప్రకటించుచుండిరి. భారతజాతీయమహాసభా పితామహుడు స్వరాజ్యస్థాపనము మహాసభాప్రయోజన మని నిర్భయముగ బోధించెను. లోకమాన్యుడు స్వరాజ్యము భారతీయుల జన్మస్వత్వమని బోధించుచుండెను. కాని భారతనిరీక్షణమునందు స్వరాజ్యసంపాదనమునకు బ్రిటీషు ద్వీపములు బ్రిటీషు అధికారులు బ్రిటీషుపద్ధతులు బ్రిటీషుసామ్రాజ్యము ప్రధానసాధనము లని గ్రహింపబడుచుండెను. ముప్పదినాలుగేండ్ల యనుభవము జాతీయమహాసభా వ్యామోహమును బాపగలిగినది. భారతజాతికి మోక్షము స్వహస్తములందు గలదనియు పరహస్తములందు లేదనియును జాతీయమహాసభ నిర్ధారణ చేసినది. సంకల్పమునందు లేని స్వాతంత్ర్యము కార్యమునం దసంభవము. భారతహృదయమును సంపూర్ణముగ నావరించిన దాస్యభావము పోయినపుడు స్వరాజ్యము సులభసాధ్యమగుచున్నది. భారతరాజ్యాంగమునకు ఫలము భారతీయుల యోగక్షేమములు. భారతీయుల యోగక్షేమములకు భారతీయులు బాధ్యులు. భారతీయులు కర్తలు. ఈ ధర్మమును నాగపురజాతీయ మహాసభ నిర్భయముగ ప్రతిపాదించినది. స్వదేశస్థులు విదేశస్థులు నవనిరీక్షణమును మాన్పుటకు జేసిన ప్రయత్నములు నిష్ఫలములైనవి. జిన్నా మాలవ్య బెశాన్తు వెడ్జ్వుడుగారులు చేసిన ప్రసంగములు నిరర్థకములైనవి. జాతీయమహాసభాసంకల్ప మిట్లు నిర్ధారణ చేయబడినది.

"శాంతియుతములగునట్టివియు సద్ధర్మములగునట్టివియు అన్ని యుపాయములచేత భారతీయులు స్వరాజ్యమును సంపాదించుట."

ఈ ప్రతిపాదనము భారతహృదయము నాశ్రయించిన దాస్యభావమును తొలగించుటకు సాధనభూతముగ నున్నది. సభాసంకల్పమునం దింతవరకును నగ్రస్థముగ జెప్పుచున్న బ్రిటిషు సామ్రాజ్యాంతర్భాగభావము సక్రమాంద శాంతభావము లోపించినది. ధర్మభావము శాంతిభావము ప్రవేశమును గాంచినవి. ఈ తీర్మానమునందు భారతజాతీయబలమును జాతీయస్వరూపమును జాతీయధర్మమును జాతీయమహాసభ ప్రతిపాదించి, యాత్మశుద్ధిసాధనమును భారతీయుల

కాదేశించినది. జాతీయసంకల్పసిద్ధికి అసహాయోద్యమ సాధనమును నిర్ణయించినది.

### అసహాయోద్యమము

ప్రవృత్తిపరమైన మహాసంస్థయం దనవరతము ధర్మాధర్మములకు సంరంభము గలుగుచున్నది. ధర్మక్షేత్రమునం దాధ్యాత్మికాధిభౌతిక ధర్మములకు మహాసంయోగమును అధర్మక్షేత్రమునందు మహావియోగమును గలుగుచున్నది. సంయోగ వియోగ కారణములు ధర్మస్వభావమును నిర్ణయించి మోక్షమార్గమును జూపుచుండును. ధర్మక్షేత్రమునందు ప్రకృతిపురుషసంయోగమునకు ప్రతిబంధకములైన కారణములు వర్తమానకాలమునందు లోకమున నావరించి మహాలయమునకు సాధనములగుచున్నవి. ఏకముఖాయుధముచేతనైనను ధనము నార్జించి భౌతికభోగ్యములందు బడి పోరాడుట గౌరవలక్షణముగ బరిగణింపబడుచున్నది. భౌతిక సంపద నార్జించుటకు పాశ్చాత్యరాజ్యములు కంటికి గానబడిన భూముల నాక్రమించుకొని మహాసంక్షోభబీజములను నాటినవి. మహాయంత్రసాధనమున సామ్రాజ్య శృంఖలబంధములను బిగదీసినవి. స్వజాతీయాభిమానము స్వదేశాభిమానము సామ్రాజ్యశృంఖలములను వజ్రశృంఖలములగు మానవపీడనమునకు సాధనములైనవి. పాశ్చాత్య సంయోగము పాశ్చాత్యశిక్షణము భారతహృదయమునందు పాశ్చాత్య సాధనోపాయములను స్థాపించినవి. స్వరాజ్యసంపాదనమునకు మారణపరికరములు సైన్యనివహములు సాధనములను భావములు భారతహృదయము నావరించినవి. ఈ భావములు మహాలయమునకు జేసినవిధమును యూరపురాజ్యముల చరిత్రము చెప్పకచెప్పుచున్నది. స్వజాతీయాభిమానమను పాశ్చాత్యరాజ్యములు గావించిన హత్యలు దౌర్జన్యకార్యములు వర్ణనాతీతములు. అధర్మమార్గమున స్వరాజ్యమును స్థాపించి ధర్మక్షేత్రమును నధర్మక్షేత్రముగ జేయుట వినాశమునకు సాధనముగాని పరమార్థమునకు సాధనముగాదు. ధర్మాధర్మములను వదలి హత్యలకు ఒడిగట్టుకొనినను నిరాయుధులైన భారతీయులకు బాహుబలసాధనము సాధ్యముగాదు. సాధ్యమైనను ధర్మక్షేత్రమునందు నిషేధముగుచున్నది. ఆత్మవినాశనమునకు సాధనంబగుచున్న పాశ్చాత్యసభ్యతాప్రవాహమును గనుగొనుమ నా విషఫలమును గొనుట యవివేకము. జాతీయమహాసభ నిర్ణయించిన స్వరాజ్యసంపాదనమునకు భారతజాతీయస్వభావమునకును స్వభావమునకును ననుకూలమైన హింసారహితమైన యసహాయోద్యమ సాధనమును మహాసభ నిర్దేశించినది. మహాసభయం దామోదితమైన ఈ తీర్మానము జాతీయహృదయమును ప్రదర్శనము చేయుచున్నది.

"కాంగ్రెసు సభవారి యభిప్రాయము ననుసరించి ప్రస్తుతపు ఇండియా ప్రభుత్వము దేశ శ్రేయమును కోల్పోవునట్లు చేతను, మన దేశప్రజలు స్వరాజ్యమును నెలకొల్పుటకు కృతనిశ్చయులై యుండునట్లు చేసినను, ప్రత్యేక కాంగ్రెసు మహాసభ కలకత్తాలో జరుగుటకు పూర్వము, తమ హక్కులను స్వాతంత్ర్యమును నిలుపుకొనుటయును, తరువాత ఘటిల్లిన అనేక కష్టములను, అందు ముఖ్యముగ ఖిలాఫత్ పంజాబులను సంబంధించిన కష్టములను నివారణ జేసికొనుట కవలంబింపబడిన పద్ధతులన్నియు విఫలములగుట చేతను, ఈ కాంగ్రెసు కలకత్తా కాంగ్రెసుసభలో గావింపబడిన దౌర్జన్యరహితమగు సహాయనిరాకరణ తీర్మానము తిరిగి యంగీకరించుచు, ఒకకొనను ప్రభుత్వమునకు సహాయమును నిరాకరించుట మొదలుకొని, వేరొక కొనను పన్నులను చెల్లింపకుండుట వరకు, సహాయనిరాకరణవిధానము నంతను గాని అందులో నొకభాగమును గాని, దేశీయమహాసభవారు గాని, అఖిల భారతీయ కాంగ్రెసు సంఘమువారు గాని నిర్ణయించెడి సమయమున అమలులో బెట్టవలసినదనియు, ఈలోపున దేశము నిందుకు సంసిద్ధపరుపవలయుననియు, ప్రకటించుచున్నది. ఇందుకొరకై ఫలప్రదములగు చర్యల నీక్రిందిరీతి నవలంబించుచుండవలయును.

(1) 16 సంవత్సరములలోపు వయస్సు గల విద్యార్థుల తలిదండ్రులు, సంరక్షకులు (విద్యార్థులు గాదు) ప్రభుత్వమువారి యాజమాన్యమున నున్నట్టిగాని, వారి సహాయమును పొందుచున్నట్టిగాని, వారికక్షయందున్నట్టిగాని, పాఠశాలలనుండి తమ పిల్లలను తొలగించుటకు కృషియెంను ప్రయత్నముల చేయవలయునని కోరవలయును. అందుకొరకు, విద్యార్థుల జాతీయపాఠశాలల మూలమున గాని మరి యితరసాధనముల మూలమున గాని శిక్షణ బడయుట కేర్పాటుల గావింపవలయును.

(2) అట్టి పాఠశాలలు లేనియెడల, ఏప్రభుత్వవిధానమును తాము తొలగింప నిశ్చయించిరో, దాని వలనబడి విస్తారముగ నుండెడి విద్యాప్రతిష్ఠాపనలలో చదువుటను 16 సంవత్సరముల వయస్సు గలిగినట్టియు అంతకు పైబడినట్టియు విద్యార్థులు తమ మనస్సాక్షికి వ్యతిరేకమని భావించుచో అట్టివిద్యార్థులను ప్రభుత్వమువారి యాజమాన్యమున నుండెడిగాని, వారి సహాయమును పొందెడిగాని, వారివశమునం దుండెడిగాని ప్రతిష్ఠాపనలనుండి పర్యవసానమును గమనింపక అలసత్వ మేమాత్రము లేకుండ తెలివొందవలయునని, కోర

వలయును. అట్టి విద్యార్థులు సహాయనిరాకరణోద్యమమునకు సంబంధించిన సేవలో నిమగ్నులై యుండవలయు ననియు, లేక జాతీయ విద్యాలయములలో చదువుకొను చుండవలయు ననియు, సలహా నీయవలయును.

(3) ప్రభుత్వము వారివశమునందున్నట్టిగాని, వారిసహాయమును బొందునట్టిగాని, పాఠశాలల ట్రస్టీలను, మేనేజరులను, ఉపాధ్యాయులను, మ్యునిసిపలు సంఘములను, లోకలుబోర్డులను వానిని జాతీయ పాఠశాలలుగ మార్పవలయునని, కోరవలయును.

(4) తమవృత్తిని మానుటకు న్యాయవాదులు ఎక్కుడు ప్రయత్నములను సలుపవలయు ననియు, లాకోర్టులను కక్షిదారులును సోదరన్యాయవాదులును బహిష్కరించునటులును, మధ్యవర్తుల ద్వారా పోరాటములు పరిష్కార మగునటులును, వారు ప్రయత్నింపవలయు ననియు కోరవలయును.

(5) హిందూదేశమును ఆర్థికముగ స్వతంత్రముగ గావించుటకు, వర్తకులు విదేశవ్యాపారసంబంధమును క్రమక్రమముగ వదలుకొనవలె ననియు, నూలువడుకుటకు నేత నేయుటకు ప్రోత్సాహము గలిగింపవలె ననియు, గోరవలయును. ఆర్థికసంబంధ మగు బహిష్కార విధానమును తయారు జేయుటకు అఖిల భారత కాంగ్రెసు సంఘమువారు నిపుణులను కొందరిని నియమింపవలయును.

(6) సహాయనిరాకరణోద్యమ విజయమునకు స్వార్థత్యాగ మత్యవసరము గాన, ఈ దేశములోని ప్రతిపురుషుడును, ప్రతిస్త్రీయు, జాతీయోద్యమముకొరకు సాధ్య మగునంతవరకు త్యాగము జూపవలయు నని కోరవలయును.

(7) సహాయనిరాకరణోద్యమము సత్వరాభివృద్ధి గాంచుటకు ప్రతిగ్రామమునందును సంఘములను నెలకొల్పవలయును. ప్రధాన పట్టణములలో కేంద్రసంఘములను నెలకొల్పవలయును.

(8) జాతీయసేవకొరకు, సేవకుల ననేకులను సిద్ధపరుపవలయును.

(9) జాతీయ సేవకును, సహాయ నిరాకరణోద్యమమునకును అవసర మగుజాతీయనిధిని నెలకొల్పుటకు ఫలప్రద మగు చర్యను దీసికొనవలయును. ఈనిధికి అఖిలభారతీయ తిలకు స్మారకస్వరాజ్యనిధి యని నామ మిడవలయును.

ధర్మాధర్మసంరంభమునందు సత్యాగ్రహము శాంతము త్యాగము మొదలగు దైవసంపదలు మరారాధ్యములు. భోగము క్రోధము స్వార్థము మొదలగు నాసురసంపదలు సుఖారాధ్యములు. తిట్టుకుతిట్టు దెబ్బకుదెబ్బ పామరాయుధములు. రాతివేతలకు రవలపాసలు రాక్షసాయుధములు. అభయము దమము సత్యము అహింస త్యాగము పండితాయుధములు. అసహాయోద్యమము స్వరాజ్యసంపాదనమునకు పండితాయుధప్రయోగమును శాసించుచున్నది. పండితాయుధప్రయోగము పురుషాయుధము గాని దుర్బలాయుధము గాదు. అసహాయోద్యమము సుప్రయోజకాయుధము గాని యప్రయోజకాయుధము కాదు. అసహాయోద్యమము మహాచేష్టకు సాధనము గాని నిశ్చేష్టతకు మూలము గాదు. అసహాయోద్యమము విదేశపాలకవర్గముతో సాహచర్యమును ప్రతిషేధించుచున్నది గాని ప్రజాసాహచర్యమును గాని ప్రజాప్రయత్నములను గాని ప్రజాసంకల్పములను గాని ప్రతిషేధించుట లేదు. తెలిసియును తెలియకను మానవులు అసహాయాయుధమును నిరంతరము ప్రయోగించుచున్నారు. మానవులు దుష్టవాసనలను విడుచునపు డసహాయోద్యమము నవలంబించుచున్నారు. వ్యాధిగ్రస్తమైన దేహమున కాహారవిసర్జన మవసరం బగుచున్నది. జ్ఞానసంపన్నత్వమునకు పరిత్యాగము సాధనం బగుచున్నది. మోక్షమార్గమునకు సత్యాగ్రహము సాధనం బగుచున్నది. అసహాయధర్మ మాసురసాహచర్యమును ప్రతిషేధించుచున్నది గాని దైవసాహచర్యమును ప్రతిషేధించుట లేదు. అసహాయోద్యమ మధికారారాధనాభిమానమును ప్రతిషేధించుచున్నది గాని అధికార ధర్మమును ప్రతిషేధించుట లేదు. ప్రహ్లాదుడు రాక్షసాధికారాభిమానమును బ్రతిఘటించెను గాని జనకుని ధర్మాజ్ఞలను ప్రతిఘటింపలేదు. అసహాయోద్యమవిజయమునకు అహింస సత్యము ప్రేమ త్యాగము మార్గములు. దౌర్జన్యము మమకారము ద్వేషము స్వార్థము ప్రతిబంధకములు. భారత హృదయమునం దాత్మోపలబ్ధికి మూలమైన భావప్రకాశమును జేయుటయె అసహాయోద్యమమునకు పరమ ప్రయోజనము. ఈ ప్రయోజనము వలననె ప్రజాహృదయమునందు వెలిగెడి స్వారాజ్యజ్వాల ప్రజ్వరిల్లగలదు గాని అధికారవర్గపు దయాభిక్షమువలన గాని కతిపయ నాయకుల గంభీరోపన్యాసముల వలనను గాని వెలుగ బోదు. నాగపురము సభయం దామోదితమైన యసహాయోద్యమ ప్రతిపాదన మీ భావమునే ప్రతిపాదించుచున్నది.

### సంస్కారణములు

జాతీయవాదులు జాతీయసభానిర్ణయముల కనురూపముగ నెన్నికలందును సభ్యత్వమునందును బ్రవేశమును మానుకొనిరి. మోంటుఫర్డు రాజ్యాంగ సంస్కారణముల కనురూపమైన శాసనసభ లేర్పడినవి.

శ్రీ కన్నాటుప్రభువు మహావైభవముతో నారంభకర్మకాండను జరిపించెను ఆరంభోత్సవములకు లక్షలరూప్యములు వ్యయమైనవి. ఉత్సవసమయములందు ప్రజ లూహించిన వరములు గలుగలేదు. భారతీయులు గతమును మఱచి మన్నించి భావికల్యాణమునకు కలిసి పనిచేయవలయు నని హితోపదేశమును జేసి కన్నాటుప్రభువు స్వస్థలమును జేరెను. ఉపదేశప్రయోజనము పాలకవర్గమునకువలె ప్రజావర్గమున కన్వయింపజాలదు. ప్రజాహింసలకు బాలుచేసిన దయరులు ఖాన్సాహిబులు సన్మానగౌరవముల ననుభవించుచుండ గతమును మఱచుట మన్నించుట యసంభవము. అధికారహృదయమునందు పశ్చాత్తాపము గలుగని విధమును దేశవ్యవహారములు వ్యక్తముచేయుచున్నవి. ద్విరాజ్యాంగ విధానము తలచినరీతిని స్వాతంత్ర్య వికాసమునకు నిరుపయోగముగ బరిణమించినది. అధికారాయత్త శాఖయందు మంత్రులాధికారము లేదు. కలిగిన యధికారము నైనను ప్రజాక్షేమమునకు వినియోగించుటకు ధనము పలుకుబడి సాహసము లేవు. అన్ని రాష్ట్రములును మితిమీఱిన భాగమును సామ్రాజ్యవ్యయమునకు సమర్పించుచున్నవి. చెన్న రాష్ట్రము 720 లక్షల యాదాయము నుండి 340 లక్షలను సామ్రాజ్యవ్యయమునకు సమర్పించుచున్నది. సర్ హార్కాటుబట్లరు రోనాల్డుషే ప్రభువు విల్లింగ్డను ప్రభువు పూర్వమువలెనే యధికారాభిమాన నీతి నవలంబించిన విధమును సభావ్యవహారములు సువ్యక్తము చేసినవి. రోనాల్డుషే ప్రభువు సభ్యులకు ధర్మోపదేశమును జేసెను. విల్లింగ్డను ప్రభువు స్వయంప్రభావాదరణమునను సభావ్యవహారములను నడిపించుట కుపక్రమించెను. అధికారవర్గదుర్గ మభేద్యముగ మున్నదని వ్యక్తమైనది. సామ్రాజ్యపాలనమునందేవిధమైన స్వాతంత్ర్యమును గలుగలేదు. క్రొత్తపన్నులను శాసనసభ లంగీకరించినవి. రాజ్యవర్గాధికారుల చతురోపాయము ప్రజాప్రతినిధులదృఢసంకల్పములను భేదించినవి. పాలకవర్గము నిర్బంధశాసన విమర్శనమును పంజాబుహత్యలు సైన్యవ్యయము మొదలగు విషయములకు సంబంధించిన తీర్మానముల నంగీకరించినది. పంచాయతీసంఘములు విషయవిమర్శనమును జేయుచున్నవి. సంఘముల వ్యవహారములకు బత్తెములకు లక్షలు వ్యయమగుట తథ్యము. ఫలముమాత్రము సంశయాస్పదము. వర్తమాన సంవత్సరాదాయమైన 126 కోట్లయందును 62 కోట్లు సైన్యవ్యయమునకు వినియోగపడవలసియున్నది. ఆదాయమునందు మూడవవంతు విదేశీయుల వేతనములకును నుపవేతనములకును వినియోగపడుచున్నది. విదేశములందలి వడ్డికి నేటేటను విశేషమైన ద్రవ్యము వ్యయమగుచున్నది. ఈ వ్యయమును తగ్గించుటకును నిర్ణయించుటకును సామ్రాజ్యప్రభుత్వమునం దధికారము లేదు. శాంతి సంరక్షకన్యాయ నిర్ణయాధికారము లేదు. ఈ యేడు సైన్యవ్యయ మపారముగ బెరిగినది. ఆఫ్గను యుద్ధము సరిహద్దుల యుద్ధములు వ్యయభారము పెరుగుటకు గొంత కారణము లైనను సామ్రాజ్యవర్ధనాభిమానము సైన్యవ్యయభారమునకు మూలకారణము. ఈ కారణమును మాటుపఱచి అసహాయోద్యమమును నిందించుట యధికారవర్గమునకును వారి పక్షవాదావలంబనులకును జెల్లినది. సామ్రాజ్యప్రభుత్వ మే తీర్మానముల నంగీకరించినను నధికారమంతయును విదేశాధికారవర్గాధీనమునందున్నపుడు స్వాతంత్ర్యబీజవికాసము దుర్లభము. వ్యయభారవృద్ధి కష్టములకు మారకపుధరలు దోహదము నొసంగినవి. యుద్ధము నిలిచిన తరువాత నెగుమతులు నిలిచినవి. పరదేశములు బీదపడి వస్తుక్రయ సామర్థ్యమును బడయకున్నవి. బ్రిటీషువర్తకులు యథేచ్ఛగ దేశమును దిగుమతులతో నింపిరి. యుద్ధవ్యయము యుద్ధవ్యయకల్పనములు యుద్ధపుపెట్టుబడులు ఋణగ్రస్తతను వృద్ధిచేసినవి. దేశము విత్తశూన్యమై ఋణపాశబద్ధమై నిస్సహాయస్థితియందు మునిగినది. భరతఖండమితరదేశములకంటెను సుఖతరస్థితియందున్నదని పాలకవర్గ మనవరతము హెచ్చరించుచున్నది. సంగ్రామగౌరవము దేశలాభము ధనాగమనము యశోగౌరవము బ్రిటీషుద్వీపములకును సంగ్రామకష్టములు భరతఖండమునకును సంప్రాప్తించినవి. ఫలప్రాప్తికి నోమును నోచని భరతఖండ మేల భారములందు మునుగవలయునో నిర్ణయింపగల బాధ్యత సామ్రాజ్యాభిమానులందుగలదు. సామ్రాజ్యావసరముల కవసర మయిన భారమును సామ్రాజ్యప్రయోజనములను బడయని భరతవర్షము భరించుట కెటు లంగీకరింపగలదు? సామ్రాజ్యశాసనసభకు వ్యాపారసంరక్షణము గాని యార్థికస్వాతంత్ర్యము గాని దేశసంరక్షణాధికారము గాని లేనపుడు సభాప్రయోజన మత్యల్పమని గత సమావేశము తెలియజేసినది. మంత్రాలోచనసభయందు గా. శర్మ షాఫి సప్రుగారు లున్నంతమాత్రమునను దేశమునకు సంతృప్తి గలుగదు.

సింహప్రభువు గవర్నరు పదవిని బడసినంతమాత్రమునను బీహారీల యోగక్షేమములు వర్ధిల్లజాలవు. స్వదేశాధికారవర్గము నిర్బంధవిధానమునందు విదేశాధికారవర్గమును మీరుచున్న విధమునకు దేశమునందవలంబితమైన నిర్బంధదండననీతి నిదర్శనముగ నున్నది. నిర్బంధవిధానమును న్యాయాంగమంత్రి సప్రూగా రంగీకరించుచున్నారని యంగీకరింపవలయును. నిర్బంధవిధాన ప్రయోగమునకు శిక్షాస్మృతివిధానమునందలి 144-103 సూత్రముల ప్రయోగము నిరంకుశమార్గమునందు గల రహస్యాయుధములు గోచరంబగుచున్నవి. అధికారవర్గము ప్రసాదింప దలపెట్టిన స్వరాజ్యప్రసాదస్వభావము నీనిర్బంధవిధానములు నిరూపించుచున్నవి. సంస్కరణస్వభావ మెటులున్నను నధికారవర్గహృదయస్వభావము మాత్రము మారలేదని తెలియుచున్నది. అసహాయోద్యమప్రచారకులు రాజద్రోహాశిక్షలకు బాత్రులగునపుడు పాలకవర్గనిరీక్షణమునందు భేదము గలిగినదనుట యసత్యము. పాలకవర్గము నిర్భయముగ స్వదేశక్షేమమార్గముల నుపదేశించెడి భక్తులను దేశద్రోహులని దండించుచున్నది. సంశయాత్ములను నధికారపదవులతో సత్కరించుచున్నది. ఆత్మవంచకులను జేరదీయుచున్నది. ఇట్టి నిరీక్షణ మొకటికిని సంతృప్తిని గలుగ జేయజాలదు. ధర్మమార్గము నవలంబింపదలంచిన నూతన రాజప్రతినిధి రీడింగుప్రభువు నవనిరీక్షణమును త్రికరణశుద్ధిగ నవలంబించుటకు విశ్వేశ్వరుడు దివ్యదృష్టిని బ్రసాదించి గాంధిమహాత్ముని యాత్మబలమును సార్థకము చేయుగాత!

## చెన్నరాష్ట్రము

గత సంవత్సరమునందు చెన్నరాష్ట్రపాలనము నవరూపమును దాల్చినది. రాజ్యాంగచతురుడు విల్లింగ్డను ప్రభువు రాజ్యాంగరథమును చతురముగ నడిపించెను. రాజ్యాంగరథగమనమునందు సారథిచతురత్వము గోచరమైనను గమ్యస్థానము మాత్రము దూరస్థమగుచున్నది. రాష్ట్రవికాసము గతించిన వర్షమునందు మందగమనమును బట్టినది. గత సంవత్సర జనగణనమునందు చెన్నరాష్ట్రమునందు 4,24,08,299 ప్రజలున్నటులు నిర్ణయింపబడినది. గతించిన పదేండ్లయందును 100-కి $2\frac{2}{5}$ వంతున మాత్రమె 10,02,895 ప్రజలు పెరిగిరి. ప్రజాభివృద్ధి మందగతిని బట్టినవిధముననె ఇతర సంస్థాపనలును మందగమనమును జేసినవి. భరతఖండరాష్ట్రములందు చెన్నరాష్ట్ర మొక పేదరాష్ట్రము. ప్రజలకు వ్యవసాయము ప్రధానమైన వృత్తి. ప్రభుత్వాదాయమునకు భూమిసిస్తు ముఖ్యసాధనము. సంవత్సర సంవత్సరమును ప్రభుత్వాదాయ మభివృద్ధిని బొందుచున్నను నభివృద్ధికారకుల స్థితిగతులుమాత్రము వృద్ధిబొందుట లేదు. గతసంవత్సరాదాయవ్యయము లీభావ సమర్థనమునకు నిదర్శనములుగ నున్నవి.

### 1920-21 ఆదాయము

| | లక్షలు | | లక్షలు |
|---|---|---|---|
| భూమిసిస్తు | 294.48 | కట్టడములు, రస్తాలు, మొ. ప్రజాభివృద్ధికరమగు పనులు | 6.44 |
| ఎక్సైజు | 270.95 | | |
| ఆదాయపు పన్ను | 60.75 | | |
| ఇతర బాబతులు | 177.95 | చిల్లర | 6.99 |
| నీటిపారుదలవలని నికరాదాయము | 47.80 | కేంద్రప్రభుత్వమువారి సహాయము | 17.61 |
| అప్పుల దీర్చుటకుంచిన నిలువ | 5.40 | మొత్తము. | 946.15 |
| సివిలు పరిపాలనము | 58.18 | | |
| మారకము | .10 | | |

### 1920-21 వ్యయము

| | లక్షలు | | లక్షలు |
|---|---|---|---|
| భూమిసిస్తు | 274.03 | కట్టడములు, రస్తాలు | 1[illegible]6.84 |
| నీటిపారుదల, వడ్డి, మొ. వ్యయము | 47.08 | ఇతర బాబతులు | 65.58 |
| అప్పులు | 4.84 | మొత్తము. | 1,120 99 |
| సివిలు పరిపాలనము | 608.12 | | |

1921-22వ సంవత్సరమునకు రాబడి 1,702.08 లక్షలని అంచనా వేయబడినది.

1921-22లో మదరాసు ప్రభుత్వము భారతప్రభుత్వమునకు చెల్లింపవలసిన మొత్తము 384.29 లక్షల రూప్యములు.

శాఖాదాయములు రాష్ట్రస్థితికి మహావ్యాఖ్యానము. భూమ్యాదాయము 294.48 లక్షలయినను రయితుల యభివృద్ధికి జేసిన ప్రయత్నము లతిస్వల్పములు. నీటిపారుదలకు జేసిన 1114 లక్షల వ్యయమును నేడాదికి 2466 లక్షల పంటలనిచ్చుచు 100కి 14 అణాలచొప్పున వడ్డి నిచ్చుచున్నవి. ఈ యాదాయమును వినియోగించుట కవకాశములున్నను నాయవకాశములను ప్రభుత్వము వినియోగింపకుండుటవలన నీరాష్ట్రము ప్రభుత్వదృష్టిని నుచితరీతి నాకర్షించుటలేదని వ్యక్తమగుచున్నది. కృష్ణా తుంగభద్రా జలాశయ నిర్మాణములు

ము. ప్రజలు మద్యపానవిసర్జనమును జేయుచున్నారను శుభవార్తలు వివిధప్రదేశములనుండియును ననుదినము వచ్చుచున్నవి. అధికారవర్గము ప్రజావర్గమును సన్మార్గమున నడుపుటకు ధర్మబలసంరక్షణము సాధనము గాని అధికారపశుబలము సాధనము గాదు. పాలకవర్గము ప్రజల మాన ధన ధర్మబలములను నాశనము చేయుచున్న మద్యపానాభ్యాసమును పూర్ణముగ నిషేధించి ధర్మరక్షణమును జేయుదురు గాత.

### చెన్నరాష్ట్రసభ

మోంటుఫర్డు సంస్కరణ శాసనసభ చెన్నరాష్ట్రమునందు విచిత్రపరిస్థితులం దేర్పడినది. జాతీయవాదు లసహాయోద్యమధర్మావలంబనమును జేయుచు సభ్యత్వాభ్యర్థిత్వమును మానుకొనిరి. బ్రాహ్మణేతర నాయకులు బ్రాహ్మణాభ్యర్థుల నిరాకరణమును బోధించిరి. పాలకవర్గము భేదనతంత్రము నవలంబించినది. బ్రాహ్మణేతరులకు ప్రత్యేకప్రాతినిధ్య మంగీకరింపబడినది చెన్నరాష్ట్రమున కేర్పడిన 125 సభ్యులందును 102 సభ్యులు బ్రాహ్మణేతరు లేర్పడిరి. బ్రాహ్మణేతరులకు ప్రత్యేకప్రతినిధులు 28 మంది నిర్ణయింపబడిరి. శాసనసభయందు

| | |
|---|---|
| మహమ్మదీయేతర ప్రతినిధులు | 65 |
| మహమ్మదీయులు | 13 |
| భారత క్రైస్తవులు | 5 |
| యూరపియనులు | 1 |
| ఆంగ్లో-భారతీయులు | 1 |
| భూస్వాములు | 6 |
| విశ్వవిద్యాలయము | 1 |
| వాటికేశ్వరులు | 1 |
| వ్యాపారపరిశ్రమములు | 5 |
| పంచములు | 2 |
| అధికారులును అధికారనియుక్తులును | 25 |
| | 125 |

గతసంవత్సరమునందు నిర్మితమైన శాసనసభయందు బ్రాహ్మణేతరులు బ్రాహ్మణుల కయిదు రెట్లు సభ్యులు గలరు. బ్రాహ్మణేతర సంఘ మను సంఘ మున్నను లేకపోయినను బ్రాహ్మణేతరపక్షమునకు బలము గలదు. బ్రాహ్మణేతరపక్షమునకు బ్రాహ్మణపక్షమునకంటెను సంఖ్యయందు బలము గలదు. సభావ్యవహారములందు అధికారానధికార పక్షములకును మితవాద జాతీయవాద పక్షములకును భారతీయ యూరపియను పక్షములకును రాజ్యాంగసంరక్షణమునందు భేదముగలదు గాని బ్రాహ్మణ బ్రాహ్మణేతరపక్షములకు భేదము లేదు. చెన్నరాష్ట్రమునందు గాకను నితరరాష్ట్రములందీభేదము లేకపోవుటయే యీకల్పితభేదమునకు ప్రమాణముగ నున్నది. ఉద్యోగాధికార వ్యామోహ మీరాష్ట్రమునందు బ్రాహ్మణ బ్రాహ్మణేతర పక్షములకసహజమైన స్వరూపమును గలుగజేసినది. బ్రాహ్మణేతరనాయకులును బ్రాహ్మణేతరసంఘములును స్వదేశయోగక్షేమములకు మూలసాధనమైన స్వరాజ్యప్రాప్తికి ప్రతిఘటనమును జూపజాలరు. వారును బ్రాహ్మణులవలె స్వాతంత్ర్యవికాసమును గోరుచున్నారు. బ్రాహ్మణేతరనాయకులు దేశమోక్షమును వారిహస్తమూలముననే చేయగోరుచున్నారు. బ్రాహ్మణపక్షము నావహించిన బ్రాహ్మణభ్రమ పోయిన బ్రాహ్మణేతరపక్షము తత్క్షణస్వరాజ్యస్థాపనమును గోరుట సహజము. భారతీయులను ముఖ్యముగ బ్రాహ్మణసంఘము నావహించిన యుద్యోగాధికార వ్యామోహమునకు బాధ్యులు బ్రిటీషు పాలకవర్గము గాని బ్రాహ్మణులు గారు. బ్రాహ్మణులకు భరతఖండమునం దాదికాలమునుండియును బ్రహ్మత్వము వృత్తిగ నుండెను. బ్రాహ్మణు లధ్యయనమును జేయుచు భిక్షాటనమును జేయుచు జీవయాత్రను గడపుచుండిరి. ధనసౌఖ్యమూలములైన రాజ్య కృషి వాణిజ్యాది వృత్తులు క్షత్రియ వైశ్య శూద్ర కులాధీనమునం దుండెను. చాణక్యుడు చంద్రగుప్తునకు రాజ్యాభిషేకమును జేసెను. తిక్కన మనుమసిద్ధునకు రాజ్యలాభమును చేయగలిగెను. రామదాసుస్వామి రాజ్యమును శివాజిమహారాజునకు సమర్పించెను. బ్రాహ్మణులు బ్రాహ్మణేతరసంఘముల పోషణమును బడయుచు బ్రహ్మవిద్యాప్రచారమునందు కాలమును గడపుచుండిరి. మహమ్మదీయ క్రైస్తవ మతపాలనము లీపరిస్థితులను మార్చినవి. మహమ్మదీయ క్రైస్తవ పాలకులు వారిమతగురువులను పోషించి సత్కరించుచుండిరి. బ్రాహ్మణగురువులను ద్వేషించి యవమానించుచుండిరి. భుక్తి దుర్లభమైన బ్రాహ్మణులు లౌకికవ్యవహారనిమగ్నులై జీవయాత్రను గడపుట కుపక్రమించిరి. వ్యాపారధనలాభమున కేర్పడిన బ్రిటీషు పరిపాలనమునందు బ్రాహ్మణులకు లౌకికవ్యవహారవ్యామోహము ప్రబలి

నది. విద్యాలయములం దార్యమతనిరసనము క్రైస్తవ మతప్రశంస పరిపాటి యైనవి. అధ్యయనమునందు బ్రహ్మవిద్యాచింతనమే యనవసరంబైనది. విద్యాప్రవృత్తి యంతయును నుద్యోగలాభమున కేర్పడినది. జీవన ప్రవృత్తి యంతయును నాధ్యాత్మికచింతనాశూన్యమై యాధిభౌతికలాభమయ మైనది. బ్రాహ్మణులకు బ్రాహ్మణవృత్తియందు భుక్తియును గౌరవమును దూరములైనవి. ఉద్యోగములందు భుక్తియును గౌరవమును గలిగినవి. ఈ భావములకు పాలకవర్గము స్వప్రయోజనములకై ప్రోత్సాహము నొసంగి పోషించినది. ఆంగ్లేయులు రాజ్యవ్యాపారనిర్వహణమునకు వారు నిర్ణయించిన లక్షణములు గలవారిని నియోగించిరి. వృత్తులు వసతులు భూములు లేని బ్రాహ్మణులు సేవకావృత్తియందుఁ జేరి వారి బుద్ధికౌశలమును రాజ్యాంగములందుఁ జూపి ధనగౌరవములను బడసిరి. ఇందు బ్రాహ్మణులు స్వయముగ బ్రాహ్మణేతరులకుఁ జేసిన యన్యాయ మేదియును లేదు. పాలకవర్గము పరీక్షలందు కృతార్థులైనవారల కుద్యోగముల నొసంగుట కుపక్రమించినది. పరీక్ష లధ్యయనసాధ్యములుగ నుండెను. వంశపారంపర్యముగ అధ్యయనాభ్యాసము గల బ్రాహ్మణులు పరీక్షలందు సులభముగఁ గృతార్థులై యుద్యోగముల కర్హతను గడించిరి. ఆంగ్లవిద్యావిధానము, ఆంగ్లపరిపాలనవిధానము, ఆంగ్లసంసర్గము గలుగఁజేసిన పరిస్థితులకు బ్రాహ్మణులు బాధ్యులుగ నెంచబడిరి. ఆంగ్లవ్యాపారము దేశమును స్వతంత్రవృత్తిశూన్యము చేసినది. ఆంగ్లరాజ్యనీతి దేశమును శౌర్యశూన్యము చేసినది. సామాన్యరాజ్యము లంతరించినవి. నిలిచియున్న జమీనులు సంస్థానములు ప్రతిభారహితములై అధికారాధీనము లయినవి. దుర్నిరీక్ష్యమైన క్షాత్రతేజము కృశించి తేజోహీన మైనది. శస్త్రోపజీవనము నశించి శౌర్యప్రతాపములు క్షీణించినవి. చేతిపనులు తఱిఁగి ప్రజలు వృత్తివిహీనులైరి. శ్వేతముఖుల యధికారప్రతిభ యవ్యవహితముగ సాగినది. పదిలక్షల రాబడి గల సంస్థానాధిపతికి సామాన్యాధికారికిఁ గల ప్రతిభ గలుగకున్నది. ఇట్టిపరిస్థితులందు సకలవర్ణముల దృష్టియును నుద్యోగములమీదను బ్రసరించినది. బ్రాహ్మణేతరులందు సహజముగ స్పర్ధ గలిగినది. అధికసంఖ్యాకులైన బ్రాహ్మణేతరు లధికముగ నుద్యోగముల నపేక్షించుట సహజ మైనను వర్తమానపరిస్థితులకు బ్రాహ్మణులు మాత్రము నిందార్హులు గారు. బ్రాహ్మణేతరసంఘములందు విద్యాప్రవృత్తి వ్యాపించిన కొలఁది వారిసంఘమునం దుద్యోగవ్యాపనము గలుగఁగలదు. కేవలము జనసంఖ్యనె యుద్యోగబాహుళ్యమునకు లక్షణముగఁ బరిగణించిన పంచమసంఘమును నుద్యోగలాభమునకుఁ బ్రతిబంధకము గాఁగలదు. అధికసంఖ్యాకులైన బ్రాహ్మణేతరులు రాజ్యాధికారమును గలిగి వికసింపఁగోరుట ధర్మమైనను బ్రాహ్మణపతనము బ్రాహ్మణేతరసంఘాభ్యుదయమునకుఁ బ్రయోజనముగాదు. ఆదికాలమునుండియును బ్రాహ్మణులు రాజ్యములను సంపదలను నాసింపకను రాజులను శ్రీమంతులను నాశ్రయించుచు భిక్షాటనమును జేయుచు జీవయాత్రను గడపుచుండిరి. వసిష్ఠుఁడు ధౌమ్యుఁడు చాణక్యుఁడు విద్యారణ్యుఁడు రామదాసు తిక్కనామాత్యుఁడు సమర్థులయ్యును రాజ్యముల కాసపడలేదు. పంచాజ్ఞశ్రవణమైనను నవసరములేని కాలమునందు బ్రాహ్మణులకు భిక్షాటనమయినను సంభవము గాకున్నది. గుణకర్మలబ్ధమైన వృత్తిశీలసంస్కారములేని బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులు ఉద్యోగవృత్తియందు లక్ష్యమును నిలిపిరి. ఈ యుద్యోగలక్ష్యము మిత్రభేదమున కనుకూలముగ నుండెను. పెంట్లండు ప్రభువు వారి యనుచరులు బ్రాహ్మణద్వేషమును బెంపొందించిరి. అధికారుల మిత్రభేదము స్వప్రయోజనమునకు నిరుపయోగ మైనను దేశానర్థములకు మూలమైన విద్వేషమునకు సాధన మైనది. అధికారులు సంకల్పించిన యధికారసంరక్షణతంత్రము నిరుపయోగ మయినది. సంస్కరణశాసన మితరరాష్ట్రములందువలె వ్యాపనమునకు వచ్చినది. ద్విరాజ్యాంగశాఖ ఏర్పడినది. బ్రాహ్మణేతరనాయకులు మంత్రిపదవులను బడసిరి. ఉద్యోగలాభ ముద్యోగాశను బ్రవర్ధమానము చేసినది. వేలకొలఁదిసంవత్సరము లేకదేశమునందు సోదరులవలెఁ గలిసి జీవయాత్రను గడపిన సంఘములందు సమష్టిదృష్టి పోయి విభాగదృష్టి గలిగినది. పాశ్చాత్యపరిపాలనము పాశ్చాత్యాధికారవర్గమునందు ప్రబలిన ధనాధికారాభిమానమును భారతీయుల హృదయమునం దుదయింపఁ జేసినది. అధికారాభిమాన ముద్యోగతృష్ణగఁ బరిణమించుచున్నది. ఉద్యోగతృష్ణ పూరణమగుట యసంభవము. ఉద్యోగాభిలాష సంఘసంఘమునకును ప్రాకుచున్నపుడు కలహబీజములు స్థాపితము లగును గాని సాహచర్యబీజములు వర్ధిలవు. ఉద్యోగములు తాత్కాలికముగ నొకసంఘము

నకు సంతృప్తిని గలుగఁజేసినను వేఱొకసంఘమున కసంతృప్తిని గలుగఁజేయుచుండును. ఒకనికిఁ బ్రయోజనకరమైనను వేఱొకనికి నష్టదాయకముగ నుండును. హీనస్థితియందున్న పంచములవలె హీనస్థితియందున్న బ్రాహ్మణులును సంఘసౌభాగ్యమున కాటంకముగ నుందురు. బ్రాహ్మణబ్రాహ్మణేతరులు వారివారి సంస్కారములకుఁ దగిన వృత్తుల నవలంబించుచు స్వప్రయోజనములను విసర్జించుచు దేశప్రయోజనములకై వారిశక్తిసంపదలను వినియోగించి సకలసంఘముల సౌభాగ్యమును బెంపొందించుటకు పాటుపడుదురుగాత! నవశక్తి యసంతరూపములను ప్రపంచమునందు విహరించుచున్నది. వర్ణాశ్రమధర్మములు మాయమగుచున్నవి. జాతులును నంతర్జాతులును స్వయంవ్యక్తిత్వమును బ్రకటించుచున్నవి. ప్రాతసిద్ధాంతములు నవాకృతిని దాల్చుచున్నవి. ధనాభిమానము కులాభిమానము విద్యాభిమానము అధికారాభిమానము ప్రతిభను గోల్పోయినవి. సర్వసమానత్వభావము స్థిరస్థాపిత మగుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. ప్రజలు సమష్టిబలమును సకలవ్యవస్థలకును సమన్వయము చేయుటకు నమకట్టుచున్నారు. దంభము కటాటోపము భోగభాగ్యములు పరమార్థములుగఁ బరిణమించుచున్నవి. మానము నిగ్రహము శీలము విరాగము పరమానర్థములుగఁ బరిణమించుచున్నవి. ఈ ప్రళయావస్థయందు బ్రాహ్మణులు బ్రాహ్మణేతరులు వినాశసాధనము లైన వైరమును క్రోధమును మాని ధర్మార్థమైన సమగ్రజీవనప్రవాహమునకు వారి సంయుక్తబలమును విజ్ఞానమును వినియోగించి ధన్యవాదములను బడయుదురుగాత!

## ఆంధ్రరాష్ట్రము

ఆంధ్రదేశము స్వయంవ్యక్తిత్వమును గలిగి భారతజాతీయజీవనప్రవాహమునకు బలవేగమాహాత్మ్యములను గలుగఁజేయుట కాత్మయోగమునకుఁ బూనుకొనుచున్నది. వ్యక్తివికాసము సమష్టిప్రకాశము నవయుగధర్మములు. స్వయంవ్యక్తిత్వముగల పదార్థముల యవ్య[illegible]భావము విశ్వస్వరూపము. పరమాణువులు [illegible] విశ్వస్వరూపమునం దవ్యవహితయోగమును గలిగియున్నవి. సకలపదార్థములు మహాతత్త్వానుసంధానమునకు నిదర్శనములు. స్వల్పరాజ్యములు సామ్రాజ్యములు స్వల్పజాతులు మహాజాతులు స్వల్పకార్యములు మహాకార్యములు విశ్వయోగమునకు సాధనములు. స్వల్పమహార్థములు పరార్థప్రతిపత్తికి ప్రతిబంధకములైనను భావార్థప్రతిపత్తికి ప్రతిబంధకములు గావు. మహాభారతప్రతిపత్తి కంతర్జాతీయప్రతిపత్తియె సాధనముగ నున్నది. ఆంధ్రద్రవిడకర్ణాటకమహారాష్ట్ర వంగమాగధ పాంచాలఘూర్జరాది జాతుల ప్రత్యేకప్రతిపత్తి భారతజాతీయ మహాప్రతిపత్తికి సాధనంబులగుచున్నవి. ఆంధ్రులు ప్రాచీనకాలమునం దసాధారణమైన ప్రతిభను బడసి భారతసంస్కారనిర్మాణమునకుఁ దోడ్పడిరి. శాలివాహనుఁడు, అమరావతిస్తూపము, ధరణికోటవిద్యాలయము, విద్యారణ్యులు, కృష్ణదేవరాయలు ఆంధ్రభారత భాగవతములు వారిప్రతిభకు నిదర్శనములు. కాలాంతరమున నాంధ్రహృదయమునందు స్తంభనము గలిగినను చైతన్య మవ్యవహితముగఁ బ్రవహించుచుండెను. నవయుగమునం దాంధ్రహృదయచైతన్యమునం దుత్తేజనము గలిగినది. ఆత్మస్వరూపమును సందర్శించి యాత్మోపలబ్ధిని బడయుట కనుతాపముదయించినది. స్వభాష స్వదేశము స్వధర్మము నిజస్వరూపసందర్శనమునకు సాధనంబులైనవి. ఆంధ్రజాతీయకళాశాల ఆంధ్రభాషాభిమానము స్వదేశోద్యమము స్వజాతీయయోగమున కుపయోగపడినవి. ఆంధ్రయోగసిద్ధి కాంధ్రోద్యమము మహాసాధనముగ గ్రహింపఁబడినది. ఆంధ్రమహాసభలు గూడినవి. ఆంధ్రవ్యక్తిత్వమును విశదముచేసినవి. ఆంధ్రరాష్ట్రనిర్మాణావసరమును ప్రతిపాదించినవి. స్వరాజ్యస్థాపనమునకు భాషాప్రయుక్తరాష్ట్రనిర్మాణావసరమును మోంటుఫర్డు సంస్కరణనివేదిక ప్రతిపాదించినది. నాగపురము జాతీయస్వరాజ్య మహాసభ భరతఖండమునందు భాషాధారకభాగములను నిర్దేశించి స్వరాజ్యవిధానమును ప్రతిపాదించినది. ఆరంభమునం దపోహలకుఁ గారణంబైన యాంధ్రోద్యమతత్త్వము సర్వజనాంగీకృతమై జాతీయమహాసభాశీర్వాదములను బడసినది. ఆంధ్రులసంకల్పము సఫల మగుట కాంధ్రోద్యమసిద్ధాంత మంగీకృత [illegible] కార్యకలాపము జరుగవలసియున్నది. [illegible] నులు కక్షములను భేదములను [illegible] బరిగణింపకను నాంధ్రయోగసిద్ధి కవసరమైన యాంధ్రరాష్ట్రసంపాదనమును వెంటనే చేసి గమ్యస్థానమును చేరుదురుగాత!

గత సంవత్సర మాంధ్ర చరిత్రమునందు ప్రముఖముగ నుండఁగలదు. ఆంధ్రుల కున్నతోద్యోగములు లభించినవి. బి. యన్. శర్మగారు భారత ప్రభుత్వమునందు వ్యవసాయాంగమంత్రిగను వేపా రామేశము పంతులుగారు న్యాయమూర్తిగను నియమింపబడిరి. రావుబహాద్దరు కూర్మా వేంకటరెడ్డి నాయఁడుగారు దివానుబహాద్దరు పానగంటి రామారాయనింగారు సుబ్బరాయులు రెడ్డిగారు మంత్రులుగ నియమింపఁబడిరి. ఉద్యోగాభిమానుల కీయుద్యోగములు సంతృప్తిని గలుగఁ జేయఁగలవు. స్వజాతీయజీవన విధానమునం దాంధ్రదేశము చూపిన త్యాగము సాహసధైర్యములు భారతజాతీయదృష్టి నాకర్షించినవి. అవసరజాతీయమహాసభ నిర్ణయించిన విధమునను అసహాయోద్యమ వ్రతాచరణమునం దాంధ్రదేశము ముందంజ వేసినది. దేశభక్తుఁడు కొండ వేంకటప్పయ్య పంతులుగారు శాసనసభాసభ్యత్వమును సభ్యర్థిత్వమును వదలుకొనిరి. వేంకటప్పయ్యగారు విల్లింగ్డను ప్రభువునకు వ్రాసిన లేఖ పంతులుగారి స్వాతంత్ర్యప్రియత్వమును విశదము చేయుచున్నది. న్యాయవాదులు వృత్తులను విసర్జించిరి. విద్యార్థులు విద్యాలయములను విడిచిరి. దేశమునం దంతటను జాతీయవిద్యాలయములు స్థాపింపఁబడినవి. పండితులు కవులు గాయకులు స్వరాజ్యవిజయమును గాంధి విజయములను గంభీర మధుర గానమును జేయుట కుపక్రమించిరి. పాటలు పద్యములు నాటకములు ప్రజాహృదయమునందుఁ గలిగిన మహాప్రబోధమును విశదముచేసినవి. గాంధి మహాత్ముఁడు భారతనాయకులు విజయవాడకు వేంచేసిన సమయమునం దాంధ్రలోకము చూపిన పరమోత్సాహ మసహాయోద్యమవిజయలక్షణములను బోధించినది. లక్షలమంది స్వరాజ్యయాత్రికులు గూడ సమావేశమైరి. శుద్ధ స్వదేశవస్త్రములను ధరించిరి. కృష్ణవేణీజలావగాహము చేసి భజనలను జేసిరి. పాటలను బాడిరి. కానుకల నర్పించిరి. సంబోధనలను జేసిరి. విజయవాడ మహాసమావేశమాంధ్రనిజస్వరూపమును భారత భూమికి వ్యక్తము చేసినది. అసహాయోద్యమతత్త్వము నాంధ్రహృదయమునకు సువ్యక్తమైన విధమును ప్రశాంతమైన దేశస్థితి వ్యక్తముచేసినది. విజయవాడ సమావేశ నిర్ణయమున కనురూపముగ దేశమునందు మూలమూలలను స్వరాజ్యప్రచార విధానములు వ్యాపించుచున్నవి. స్వరాజ్యచక్రములు స్థాపింపఁబడినవి. స్వరాజ్యసంఘములందు సభ్యులు చేరిరి. తిలక్ స్వరాజ్యనిధికి మూడులక్షరూప్యములు వసూలైనవి. గాంధిమహాత్ముఁ డాంధ్రదేశమునకు జనసంఖ్యకుఁ బ్రమాణముగ 1,60,000 రాటములు 7,00,000 రూప్యములు 7,00,000 సభ్యులు నిర్ణయించెను. ఆంధ్రులు స్వధర్మనిర్వహణపరాయణులై స్వరాజ్యాంధ్రరాష్ట్ర సంపాదనమున కాత్మసమర్పణమును జేసి పరమార్థమును సాధించుదురు గాత!

దుర్మతిసంవత్సరమునందు స్వాతంత్ర్యసంరంభము భయంకరరూపమును దాల్చుననుటకు సూచనలుగలవు. పాలకవర్గము వాగ్బంధనమునకు శాసనాస్త్రములను విచ్చలవిడిగ నుపయోగించుచున్నది. అసహాయోద్యమ సంహారమునకు పాలకవర్గము స్వజాతీయ ప్రతిపక్షులు విశ్వప్రయత్నములను జేయుచున్నారు. నిర్బంధములు నిరోధనములు దినదినప్రవర్ధమాన మగుచున్నవి. అస్పృశ్యతనరసమస్యాప విమోచనము గలుగలేదు. ఖిలాఫతు సమస్య భయంకరాకారమును దాల్చునని యూహింపఁ దగియున్నది. జ్వాలాముఖములైన మహమ్మదీయ రాజ్యములందు మతావేశము గలుగుచున్నది. కాబూలు నుండి కాన్స్టాంటినోపిలు వఱకును రాయబారములు సమరసన్నాహములు జరుగుచున్నవి. తురుష్క జాతీయవాదులు అంగోరయందు సమరసన్నాహములను జేయుచున్నారు. గ్రీకురాజు మతాచార్యుల ప్రార్థనలతో తురుష్కసంహారమున కుపక్రమించుచున్నాఁడు. నవసంగ్రామాంకురములందు, క్రైస్తవమత మహమ్మదీయ మతసంరంభ స్వరూపము యూరపు ఆసియా సంరంభస్వరూపము గోచర మగుచున్నవి. రీడింగు గంధిసమావేశము సంశయములకు గారణంబైనది. శాంతి సభలు సామ్రాజ్యసభలు స్వప్రయోజనసాధనమునకు వినియోగపడుచున్నవి. జాతులు సంఘములు కులములు వర్గములు పరస్పరవినాశనమునకుఁ బూనుచున్నవి. మహాప్రళయాంకురములు గల దుర్మతియందు మహానాటకసూత్రధారుఁడు లోకమునందు శాంతి మార్గమునను ధర్మసంస్థాపనమును జేయుఁగాత!

# 1921 వ సంవత్సరపు ఆంధ్రదేశపు జనాభా

| జిల్లాలు | | 1921 లోని గృహములు | 1921 జనసంఖ్య | | | 1911 జనసంఖ్య | | | 1901 | 1911 కును 1921 కిని |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | జనులు | పురుషులు | స్త్రీలు | జనులు | పురుషులు | స్త్రీలు | మొత్తము | నుండు తారతమ్యము |
| 1 | | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
| బ్రిటిషు రాజ్యము | | | | | | | | | | |
| 1 ఏజెన్సీగ్రామము | ... | 841,614 | 1,508,105 | 758,704 | 749,401 | 1,577,5 9 | 7 1,5 0 | 786,019 | 1, 51,550 | -74,414 |
| 2 గంజాము | ... | 893,680 | ,835,684 | 829,541 | 1,006,148 | 1,870,826 | 868,928 | 1,001,898 | 1,689,754 | -85, 42 |
| 3 విశాఖపట్టణము | ... | 5 8,318 | 2,221,666 | 1,081,860 | 1, 50, 06 | 2, 69,670 | 1,050,609 | ,119,061 | 2,082 662 | 61,996 |
| 4 గోదావరి | ... | 285,867 | ,471,651 | 719,903 | 751,748 | 1,445,957 | 707,702 | 788,255 | 1,286,119 | 25,694 |
| 5 కృష్ణా | ... | 896,652 | 2,129,763 | 1,061,867 | 1 067,896 | 1,997, 85 | 994,961 | 1,002,574 | 1,744,138 | 132,225 |
| 6 గుంటూరు | ... | 251,94 | 1,8 8, 04 | 912,458 | 89 ,646 | 1,697,551 | 856,665 | 840,886 | 1,490,6 5 | 110,551 |
| 7 నెల్లూరు | ... | 282,611 | 1,385,415 | 697,633 | 687,782 | 1,328,152 | 665,305 | 662,847 | 1,274 831 | 57 268 |
| 8 కడప | ... | 185,618 | 888,085 | 452,182 | 435,908 | 893,988 | 454,031 | 439,907 | 880,08 | -5,857 |
| 9 కర్నూలు | ... | 189,838 | 915,148 | 463,723 | 451,425 | 935,259 | 471,456 | 463,808 | 872, 70 | -20,111 |
| 10 బళ్లారి | ... | 1,9,105 | 863,149 | 439,744 | 428,405 | 969,486 | 490,848 | 478,598 | 947,214 | 106,283 |
| 11 అనంతపురము | ... | 218,675 | 1,042,058 | 537,057 | 505,001 | 969,228 | 494,232 | 468,99 | 938,75 | -78,838 |
| 12 మదరాసు | ... | 64,621 | 522,951 | 272,944 | 250,007 | 5 8,66 | 266,465 | 25 ,195 | 5 3,346 | 4,291 |
| 13 చెంగల్పట్టు | ... | 250,859 | 1 493,2 6 | 752,994 | 740,222 | 1,436,008 | 705,641 | 70 ,367 | 1,310,166 | 57,206 |
| 14 చిత్తూరు | ... | 289,025 | 1,269,169 | 647,9 8 | 621,171 | 1,288, 18 | 649,099 | 6 9,119 | 1,172,889 | 80,954 |

# నూతన సంవత్సర ప్రశంస

## శతావధానులు కొప్పరపు సోదరకవులు

సీ. నీలాంబుదారామ కేళీమరాళమై
సామేన శంకరస్వామి వెలయఁ,
పగలు రాతిరి సేయు భద్రతాటంకముల్
దరహాసరుచి ధగధగ వెలుంగ,
త్రయ్యంతవేణి పద్మజురాణి హారిరాణి
చెలికారమునఁ గెలంకుల మెలంగ,
కెంగేలి రాచిల్క క్రీడార్థ మెసరేఁగి
ప్రణవాక్షరార్థ ముపన్యసింపఁ,
గీ. గమ్ర ముక్తాఫలప్రాయ గగనవాహి
నీ దయాకణపఙ్క్తి వందే యటంచు,
విఘ్నపతి సేచన మొనర్ప విశ్వభరణ
దీక్షఁ గయికొన్న దేవి కిదే నమస్సు!

సీ. శ్రీ చిరాయు శ్శుభ స్థితి ధాత యిచ్చి ని
రామయానంద మబ్జాప్తుఁ డొసఁగి
బహుకళా సౌభాగ్య మహిమఁ జంద్రుం డిచ్చి
సకలవిద్యలు సరస్వతి యొసంగి
ధనమహోన్నతలను ధననాయకుం డిచ్చి
యిష్టభోగములు శచీశుఁ డొసఁగి
సుత్య సంతాన సంతోషంబు గుహుఁ డిచ్చి
యరిభయంకరభక్తి హరుఁ డొసంగి
గీ. పంచభూతంబు లర్హశుభంబు లిచ్చి,
భరతమాత జయోపేత వరము లొసఁగి
ప్రజలఁ బ్రోవఁగ నూత్న సంవత్సరంబు,
విజయమంగళసిద్ధుల వెలయుఁ గాక!

సీ. కఠినదండము వోలె గాన్పించునిక్షువు
మనసారఁ గురియదే మధురరసము
కడు వికారాకృతిఁ గాన్పించు కోయిల
చేయదే కర్ణ రసాయనంబు
కంటకాన్విత మయి కానిపించు గులాబి
చల్లదే దెస లెల్ల సౌరభంబు
శ్రవణభయావహ స్తనితమై కాన్పించు
ఘనధరం బిడదె చల్లని సువృష్టి.
గీ. కాన, దుర్మతినామంబు గల్గియున్న,
"సన్మతి" యనంగ మేల్నించి, సత్ప్రజాభి
మతము, దీర్చుట యర్హమట మాట యెఱిఁగి
యభినుతులఁ జెందు మో నూతనాబ్దవరమ!
ఓ-చి.

క. ముందు జయనాదములతోఁ
దుందుభి యానంద మొసఁగు, దుర్మతి యని స
న్నిందింపకుఁ డిష్టము లమ
రం దని పెద వంచు నబ్దరాజిదె వచ్చెన్.

సీ. అతితరారోగ్య భాగ్యద నింబకుసుమ ముఖ్య
గంధలాభం బంది గంధవహుఁడు
సహకార కిసలయ సంతర్పణంబున
మూకభావము మాని కోకిలములు
బహుళఫలాహార పరితుష్టి ననురాగ
సుముఖవైఖరి నొప్పి శుకకులంబు
శిరముల నురములఁ గరముల మల్లికా
పుష్పదామము లూని భూమిజనులు.
గీ. ప్రసవరసానుభవ వ్యాప్తిఁ బడసి యళులు,
చిత్తజానంద విహరణ శ్రీకరుండు
ఋతువిభుఁడు రాఁ బ్రమోదార్హ రుతి నుతించె
నుత్తమకృపాగమన శుభం బొనరి నప్రకు
ప్రజ కృతజ్ఞతఁ బొగడు టర్హంబ కాదె?

సీ. బ్రాహ్మివై బ్రహ్మ ప్రపంచ నిర్మితికిఁ జేఁ
దోడు వాఁదోడుగాఁ దోఁచి తంచు
భరతమునీంద్రు సంప్రార్థనంబునఁ బుట్టి,
భారతీశుభసంజ్ఞఁ బరఁగితంచు
సుత్యసంగీత సాహిత్య పయోధర
రసములఁ బ్రజల కింపొసఁగితంచు
యుపనిషదుక్తవై యుపమారహితకవి
తోల్లసితాత్మవై యొప్పితంచుఁ
గీ. పూతతరకీర్తిధనుల, సనాతసాధు
నాతన కవీంద్రులం గన్న మాతవంచుఁ
గొలుచు పుత్త్రుల భారతీయులను మమ్ము
స్థిరకృపం బ్రోవు మో భారతీమదంబ.

శా. ఆరోగ్యంబు చిరాయురాప్తిగ, మనం బన్యోన్య సఖ్యాప్తిఁ గా
మోఽజ్ఞ సర్వ సమర్హ గౌరవయశశ్శ్రీ హర్షముల్ సెగభీ
గారాబంపుఁ గుమారులన్ సుకవులన్ గావంగ దే సంతతా
పారోదారకృపాసుధారసము బై బైఁ బర్వ నో భారతీ!

శా. కవిరత్నంబులఁ గంటివెందఱినొ, తద్గణ్య ప్రభల్ దిక్కులన్
దినము న్నించియు, నొక్కడొక్కరును నోఁ జేవి చనంగాంచి రి
త్త విచారించితివేల, గోలవె దయాధారేయుఁడై చేఁటిస
త్కవిరత్నంబుల నేనిమన్న నిఁక ధాతన్ వేఁడుమా భారతీ!"

# నూతన మదరాసు శాసనసభాసభ్యుల వివరము

1 వ వరుస:—— 1 గౌ॥ సర్ లయనల్ డేవిడ్సను గారు 2 గౌ॥ ఏ. ఆర్. నాపు గారు 3 గౌ॥ ఖాన్॥ బ॥ మహమ్మదు హబిబుల్లా సాహెబు బహదూరు 4 గౌ॥ కే. శ్రీనివాస అయ్యంగారు 5 గౌ. ది. బ. ఏ. సుబ్బరాయలు రెడ్డిగారు 6 గౌ. సి. రామరాయణింగారు 7 గౌ॥ రా. బ॥ కే. వెంకటరెడ్డి నాయుడుగారు

2 వ వరుస:—— 8 ఎ. వై. జీ. క్యాంపుబెలు గారు 9 ఎఫ్. జె. రిచ్చర్డ్సను గారు 10 ఆర్. హెచ్. లిటిల్ హెయిల్సుగారు 11 ఏ. రామస్వామి మొదల్యారుగారు 12 పి. సుబ్బరాయనుగారు 13 ఈ. పెరియనాయకంగారు

3 వ వరుస:—— 14 సి. పి. రామస్వామి అయ్యరుగారు 15 కాటంరెడ్డి ఆదినారాయణరెడ్డిగారు 16 ఎస్. ఆర్. వై. అంకినీడు ప్రసాదు బహదూరు 17 ఆర్. అప్పాస్వామి నాయడుగారు 18 వి. అప్పాస్వామి వాండయారుగారు 19 ది॥ బ॥ సి. అరుణాచలం మొదల్యారుగారు

4 వ వరుస:—— 20 రా॥ బ॥ టి. బాలాజీరావు నాయుడుగారు 21 కే. చతుకుట్టి నంబియారుగారు 22 బి. పి. దేవరాజులు నాయడుగారు 23 రా॥ సా॥ ఎస్. ఎల్లప్ప శ్రేష్ఠిగారు 24 రా॥ సా॥ పి. యతిరాజులునాయుడుగారు 25 కే. గోపాలకృష్ణయ్యగారు

5 వ వరుస:—— 26 కే. పి. గోపాలమీనను గారు 27 జే. కుప్పుస్వామి నాయడుగారు 28 బి. మునిస్వామినాయుడుగారు 29 పి. సి. ముత్తుశ్రేష్ఠిగారు

6 వ వరుస:—— 30 సర్ పిట్టి త్యాగరాయ శ్రేష్ఠిగారు 31 చింతలపాటి వేంకటసూర్యనరసింహరాజుగారు 32 ఎం. నారాయణస్వామి రెడ్డిగారు 33 సి. నటేశం మొదల్యారుగారు 34 రా. బ. ఏ. పి. పాత్రోగారు 35 సి. పొన్నుస్వామి నాయడు 36 పి. టి. రాజన్ గారు

7 వ వరుస:—— 37 టి. ఏ. రామలింగం శ్రేష్ఠిగారు 38 రా॥ బ॥ ఏ. రామయ్య పుంజగారు 39 ఎ. రంగనాథం మొదల్యారుగారు 40 కే. శరభారెడ్డిగారు 41 డబ్ల్యు పి. ఏ. సుందరపాండ్య నాడరుగారు 42 ఆర్. కే. షణ్ముఖం శ్రేష్ఠిగారు 43 ఎస్. టి. షణ్ముఖంపిళ్లెగారు

8-వ వరుస:—— 44 టి. శివశంకరంపిళ్లెగారు 45 ఎన్. ఏ. వి. సోమసుందరం పిళ్లెగారు 46 ఎన్. సోమసుందరం పిళ్లెగారు 47 టి. సోమసుందరం మొదల్యారుగారు 48 ఆంచట సుబ్బారాయుడుగారు 49 దె. బ. కే. సూర్యనారాయణమూర్తి నాయడుగారు 50 ఎ. తంగవేలు నాయకరుగారు

9 వ వరుస:—— 51 టి. సి. తంగవేలు పిళ్లెగారు 52 ఓ. తణికాచల శ్రేష్ఠిగారు 53 వి. సి. వెళ్లింగి గౌండరుగారు 54 కే. సి. వేంకటాచలరెడ్డిగారు 55 సి. వేంకటరంగా రెడ్డిగారు 56 వంగులూరు వేంకట సుబ్బారావుగారు 57 దె॥ బ॥ రఘుపతి వెంకటరత్నము నాయడుగారు

10-వ వరుస:—— 58 డబ్ల్యు. విజయరాఘవ మొదల్యారుగారు 59 ఎం. సి. రాజాగారు 60 ఎల్. సి. గురుస్వామిగారు 61 ఆర్. టి. కేశవులు పిళ్లెగారు 62 ఎం. సీ. మధురపిళ్లెగారు 63 64

11-వ వరుస:—— 65 దె॥ బ॥ పట్టు కేశవపిళ్లెగారు 66 దె॥ బ॥ మోచర్ల రామచంద్రరావుపంతులుగారు 67 శ్రీమాన్ ఎస్. శ్రీనివాసఅయ్యంగారు 68 దె. బ. టి. దేశికాచారిగారు 69 ఎల్. ఏ. గోవిందరాఘవ అయ్యరుగారు 70 రా॥ బ॥ ఆమంచర్ల సుబ్బుకృష్ణారావుపంతులుగారు 71 పి. శివరావుగారు

12-వ వరుస:—— 72 శ్రీమాన్ బిశ్వనాథ దాసుగారు 73 ఎస్. ముద్దుమాణిక్యాచారిగారు 74 రా॥ బ॥ టి. ఎం. నరసింహాచార్యులుగారు 75 కే. వి. రామాచారిగారు 76 రా॥ బ॥ డాక్టరు సి. బి. రామారావుగారు 77 యు. రామారావుగారు

13-వ వరుస:—— 78 కే. సదాశివ భట్టుగారు 79 శ్రీమాన్ శశిభూషణ రథోగారు 81 దె. బ. డి. శేషగిరిరావు పంతులుగారు 81 ఎం. ఆర్ సేతురామ అయ్యరుగారు 82 శ్రీమాన్ ఆర్. శ్రీనివాస అయ్యంగారు 83 శ్రీమాన్ టి. సి. శ్రీనివాసఅయ్యంగారు

14-వ వరుస:—— 84 ఎం. సూర్యనారాయణగారు 85 రా॥ బ॥ కే. ఎస్. వెంకటరామ అయ్యంగారు 86 శ్రీమాన్ పి. వి. వేంకటరమణఅయ్యంగారు 87 దె॥ బ॥ ఎం కృష్ణను నాయరుగారు 88 టి. అరుమైనాథంపిళ్లెగారు 89 ఎస్. అర్పుదస్వామి ఉడయరుగారు

15-వ వరుస:—— 90 ఎం. డి. దేవదాసుగారు 91 రా॥ సా॥ ఈ. ఎం మెస్కిరిన్ హానుగారు 92 ఎ. టీ. పామరుగారు 93 జీ. వందనంగారు

16-వ వరుస:—— 94 రామనాథపురం రాజాగారు 95 జయపురం రాజాగారు 96 శ్రీ మేక వి. అప్పారావు బహదూరు 97 మంచస జమీందారు గారు 98 కే. ప్రభాకరన్ తంపన్ గారు 99 జే. ఏ. రిచ్చర్డ్సనుగారు 100

17-వ వరుస:—— 101 ఖాన్. బ. సర్ మిర్జా అబ్దుల్ హుస్సేన్ సాహెబు బహద్దరు 102 అబ్బాసు ఆలిబహద్దరు 103 సయ్యదు దివాను అబ్దుల్ రజక్ సాహెబు బహద్దరు 104 ఖాన్ సాహెబు మహమ్మదు అబ్దుల్ రహిమాన్ సాహెబు బహద్దరు 105 మున్షీ మహమ్మదు అబ్దుల్ రహిమాన్ సాహెబు బహద్దరు 106 మహమ్మదు మిరాన్ సాహెబు బహద్దరు 107 ఏ డి. ఎం. బావోటి సాహెబు బహద్దరు

18-వ వరుస:—— 108 అబ్దుల్ కాంంచిఖరీ సాహెబుగారు 109 కే. కే. కోయా సాహెబు గారు 110 హమీద్ సుల్తాన్ మరక్కాయరుసాహెబు 111 ఖాదరు నవాజు ఖాన్ సాహెబు బహద్దరు 112 సయ్యదు మహమ్మదు పాచ్చాసాహెబుగారు 113 ఎ. పి. ఐ. సయ్యదు ఇబ్రాహీం రవుట్టారుగారు 114 ఖాన్ బ॥ మహమ్మదు ఉస్మాన్ సాహెబుగారు

19-వ వరుస:—— 115 జే. ఎస్. సిమ్సనుగారు 116 డబ్ల్యు. అలగ్జాండరుగారు 117 ది. బ. గోవిందదాసు చతుర్భుజదాసుగారు 118 ఎ. ఎం. మెక్‌డౌగలంగారు 119 రా॥ సా॥ ఎం. సి. టి ముత్తయ శ్రేష్ఠిగారు 120 రా॥ బ॥ టి. నంబెరుమాళ్ శ్రేష్ఠిగారు 121 రా॥ సా॥ పి. వేంకటరంగయ్యగారు

20-వ వరుస:—— 122 రెవరెండు డబ్ల్యు. మెస్టను గారు 123 పి. డబ్ల్యు. పార్ట్రిడ్జిగారు ఏ. ఈ. రన్ కాంటరు 125 టి. రిచ్మెండుగారు 126 127 128

The Right Hon. The Earl of Reading
Viceroy of India



రీడింగుప్రభువు - నూతనరాజప్రతినిధి

The Right Hon. Countess of Reading
C. B. E.



రీడింగు ప్రభ్వి

The Hon. Mr. Justice V Ramesam Pantulu



గౌ. న్యా. వి. రామేశం పంతులుగారు

Rao Bahadur T Raghavayya garu



టి. రాఘవయ్యగారు, తిరువాన్కూరు క్రొత్తదివాను

Dr. M. A. Ansari, Delhi



డాక్టరు ఎం. ఏ. అన్సారి

Mr. C. L Wrenur, Principal
Pachappa's College, Madras 1920-1921



ప్రిన్సిపాలు, పచ్చయప్పకాలేజి, మదరాసు

Hon Mr Narayana Das Giridhara Das
Member, Council of State



గౌ॥ నారాయణదాసు గిరిధరదాసు

Mr O Tanikachalam Chettiar
New council Member



గౌ. ఓ. తణికాచలం శెట్టిగారు

Mr V. G Vasudeva Pillai, Panchama member
of the Madras Corporation



వి. జి. వాసుదేవ పిళ్లెగారు

Mr. Ch. Narasimha Rao
Cocanada



చిలకూరి నరసింహారావుగారు, కాకినాడ



# ప్లేగుమందులు

పెద్దసెట్టు రూ 2—2—0 లు
చిన్న ,, ,, 1—6—0 ,,



కలరామందులు సెట్టు రూ. 1—2—0 లు.

ఇన్ఫ్లుయన్జామందులు సెట్టు రూ. 1—12—0 లు

## అన్నివ్యాధులకును తగిన అత్యద్భుతములగు ఆయుర్వేదీయ ఔషధములు

చుట్టునున్న మూడు ఘోరవ్యాధులమందులే గాక యింకను

బలమునకు, పుష్టికి:—
జీవామృతము 6 ఔ. సీసా రూ. 3-4-0

తలంటునకు:—
అమృతామలక తైలము 6 ఔ. సీసా 1-0-0

సవా మేహమునకు:—
రక్తశోధక 6 ఔ. సీసా 3-0-0
పంచతిక్తగుగ్గులు ఘృతం 6 ఔ. సీసా 6-0-0
విచిత్రరత్న లేపము హైపూతకు డబ్బా 2-0-0

మధుమేహమునకు:—
ప్రమేహభంజని డబ్బా 3-0-0
గోమూత్రశిలాజిత్తు తులం 2-0-0

ముట్టుకట్టునకు:—
అశోకవటి సీసా 0-14-0
అశోకారిష్టము సీసా 3-0-0

గర్భిణీస్త్రీలకు:—
మాతులుంగరసాయనము సీసా 1-12-0

మదమూర్ఛలకు:—
అబలాసంజీవని సీసా 1-12-0

గనోరియాకు:—
ధృకవటి డబ్బా 1-12-0
చందనాసవ సీసా 3-0-0

పక్షవాతమునకు, అమవాతమునకు:—
నారాయణతైలము సీసా 3-0-0

ఉబ్బసములకు:—
చ్యవనప్రాశన డబ్బా 3-0-0
గలవు. ఇంతియ గాక

ఇంకను అనేక దివ్యౌషధములు శాస్త్రానుసారముగ సిద్ధమయినవి గలవు.
ప్యాకింగు, పోస్టేజి ఖర్చులు ప్రత్యేకము.

——:o:——

క్యాటలాగులు కోరువారి కుచితము.



వైద్యరత్న పండిత డి. గోపాలాచార్లుగారిచే స్థాపితమైన

తంతివిలాసము
పండిట్
మదరాసు.

## ఆయుర్వేదాశ్రమం

41, ఆచారప్పన్‌వీధి, జార్జిటవున్, మదరాసు



# అర్థసూత్రములు

దంటు శ్రీనివాసశర్మగారు బి. ఏ.

అర్థశాస్త్రమను పద మార్యలోకమునఁ జాలకాలము నుండి ప్రచారములో నున్నది. కాని, 'అర్థశాస్త్ర' మను పేర కౌటిల్యుఁడు వ్రాసిన గ్రంథమునకును ఆపేరుతో ప్రస్తుతము వెలువడు గ్రంథములకును విశేషము వ్యత్యాసము కలదు. కౌటిల్యుఁడు తన గ్రంథమున ప్రత్యేకము రాజనీతిని గుఱించియే ముచ్చటించియున్నాఁడు. ఈనాటి యర్థశాస్త్రములు రాజనీతి గ్రంథములు కావు. వీని యుద్దేశము ద్వితీయపురుషార్థముగఁ బేర్కొనబడిన యర్థమును సేకరించుటకు మనుజులు సేయు ప్రయత్నములను శాస్త్రీయపద్ధతులతో వివరించుట. పూర్వకాలమున 'అర్థశాస్త్ర' మను పద మీ యర్థమందు ప్రయోగింపబడలేదు సరిగద-ఈవిషయముపై మనదేశమందు గ్రంథములుగూడ వ్రాయఁబడియున్నట్లు తోఁచదు. కౌటిల్యుఁడు తనగ్రంథ మందు 'వార్తాశాస్త్ర' మని యొకదానిని బేర్కొనియున్నాఁడు. అద్దానియందు ధనోత్పత్తి మూలకము లగు వాణిజ్యము వ్యవసాయము, మున్నగు మనుష్యప్రయత్నములఁ గుఱించి ముచ్చటించియున్నట్లు తెలియుచున్నది. కాని 'వార్త' యను శబ్దము గాని, శాస్త్రము గాని ఏకారణముచేతనో, బొత్తుగా ప్రచారమున లేకుండ పోయినవి. కావునఁ బ్రస్తుతపు టర్థము గల యర్థశాస్త్ర గ్రంథములు వార్త పేర గాని, మఱి యే పేరుతో గాని ఒకప్పుడు వాడుకలో నున్నను, నేఁడు గనబడకుంటచే నట్టి గ్రంథము లిప్పుడు మనము వ్రాయవలసియున్నది.

ఆంధ్రులకీ యవసర మింకను, బాగుగ నబ్బినట్లు కనఁబడదు. ఏలయనఁగా- ఆంధ్రగ్రంథసముదాయము నంతను, వెదకిచూచినను, రెండు మూఁడు అర్థశాస్త్ర గ్రంథములు గూడ గనఁబడవు. ఈశాస్త్రమును చదువవలయు నన్న ఆంగ్లగ్రంథములు తప్ప, నితరములు దొరకుట లేదు. ఇయ్యది మిక్కిలి విచారకరము. ప్రస్తుతము ప్రపంచ మంతయు నార్థికసమస్యలవలన కల్లోలమైయున్నది లోకము నంతను చీకాకు పెట్టిన ఐరోపా మహాసంగ్రామమునకు రహస్యకారణము లార్థికములు. మనదేశమం దెల్లెడలను ప్రబలుచున్న సమ్మెకట్టుటకు కారణము లార్థికములు. ఇదియిది యన నేల? ప్రస్తుత కాలమున జీవిత మంతయు నార్థికతత్త్వముపై నాధారపడియున్నది. కావున నాంగ్లపరిచితి లేని యాంధ్రులకు లోకవ్యవహారమును బోధపరుపవలయు నన్న నర్థశాస్త్రమును వారి కందుబాటులోనికి తెచ్చుట అవసరమై కన్పట్టుచున్నది. కాని మూలసిద్ధాంతములను తెలియజేయకుండ ప్రత్యేకసమస్యలను బోధించిన ప్రయోజనము లేదు. కావునఁ బ్రస్తుతవ్యాసమునందు అర్థశాస్త్ర మన నేమో, తచ్ఛాస్త్రమునకు ప్రధానసిద్ధాంతము లెవ్వియో, మనదేశపు స్థితిగతుల కనుగుణ్యముగఁ బాశ్చాత్యసిద్ధాంతముల నెంతవఱకు యెట్లు మార్చుకొనవలయునో ఇంచుకంత విమర్శింతము.

అర్థశాస్త్ర మన నేమి? మనుష్యులు ధనము సంపాదించుకొనుటకై సలుపు ప్రయత్నమును శాస్త్రీయముగ వివరించునది యర్థశాస్త్ర మని యిదివఱకే చెప్పియుంటిమి. విత్తసంపాదనము మనుష్యప్రయత్నములలో నగ్రస్థానమును వహించుచున్నదని చెప్పవచ్చును. ధర్మమోక్షముల మాట చెప్పెడిదేమి? కామముకంటె గూడ నర్థమే యెక్కుడుగ జనసామాన్యము నాకర్షించునట్లు తోఁచుచున్నది. ఇయ్యది చాలవఱకు సమంజసమే. ఏలయన నర్థము సర్వపురుషార్థసాధకము. దారిద్ర్యము సకలకలుషములకును పుట్టినిల్లు. ధనము లేనివాడు సత్కార్యములఁ జేయజాలఁడు సరిగదా-ధనముకొఱకే యనేక దుష్కృతులకును గడంగును. దుష్కార్యములను జేయకున్నను రోగపీడితుఁడై ఆలుబిడ్డలను పోషింపనేరక, అకాలమృత్యువును పొందుచున్నాఁడు. కావున దారిద్ర్యమువలన రోగములు, దుష్కార్యములు, అకాలమృత్యువు, మఱియు ననేక దురవస్థలు సంభవించుచున్నవి. అట్లగుట నెల్లవిధముల దారిద్ర్య మవశ్యము నివారింపదగినది. దారిద్ర్యమును నివారింపవలయు నన్న దేశమును భాగ్యవంతముగఁ జేయవలయును. కావున దేశమందు ధనోత్పత్తికి సదుపాయము లేమేమి కలవో,

వాని నెట్లుపయోగింపవలెనో, ఉత్పత్తియైన ద్రవ్యము నెట్లు విభజింపవలయునో, వినిమయమున కెట్టి సదుపాయముల నేర్పాటు చేయవలెనో, మున్నగు విషయముల నాలోచింపవలసియున్నది. ఇట్టివిషయముల నాలోచించు శాస్త్రమే యర్థశాస్త్రము.

అర్థశాస్త్రము విధిశాస్త్రము కాదనియును, కేవలము నిర్దేశశాస్త్ర మనియు గొందఱి యభిప్రాయము. అనఁగా జనులీ రీతిగ ధనము నుత్పాదింపుచున్నారు ఈరీతిగ విభజింపుచున్నారు. అని మాత్రమే చెప్పను గాని ధనోత్పత్తికై యీతీరునఁ బ్రయత్నింపుము ఇట్లు పంచిపెట్టుము అని విధింపదు అని కొందఱి యభిప్రాయము. కాని విధి నిర్దేశములు రెండును అర్థశాస్త్రమునకు క్రమమైన పద్ధతులే కేవలనిర్దేశపద్ధతి భౌతిక, రసవృక్ష, జంత్వాదిశాస్త్రములకుఁ దగినపద్ధతిగాని మనుష్యశాస్త్రమునకు తగినది కాదు. ఏలయనఁ బశుపక్ష్యాదులకు యుక్తాయుక్తవైచక్షణ్యము లేకుండుటచే నన్నిఁటి ప్రవర్తనయు నొక్కతీరుగనే యుండును. ఒక్కసింహము యొక్క స్వభావమును గుర్తెఱింగిన తక్కిన సింహముల నన్నిఁటి నెరుంగనగును. కాని ఒక మనుజుని ప్రకృతిని తెలుసుకొన్నఁ దక్కిన మనుజు లందఱి ప్రకృతుల నెఱుఁగుటకు వీలులేదు. స్వచ్ఛందప్రవర్తనకు మనుజున కున్న సావకాశములు తక్కిన జంతువులకు లేవు. కాన ఎవరిష్టము వచ్చినట్లు వారిని చేయనిచ్చిన ప్రపంచమం దశాంతి చేకూరును. అట్లగుట, అర్థాన్వేషణమందు ఈ మార్గములు లాభములు ఇవి నాశకరములు, ఇయ్యవి నష్టదాయకములు, ఈత్రోవలు మంచివి, ఇవి చెడ్డవి అని అర్థశాస్త్రము విధింపవలసివచ్చును

అర్థశాస్త్రము విధిశాస్త్రము కాదనుట దానికి మంచిచెడ్డలతోఁ బని లేదని చెప్పుటకంటె వేరొండు గాదు. అట్లైన నేయుపాయముచే ధన మార్జింపబడినను ఈశాస్త్ర మంగీకరింపవలసివచ్చును. దొంగతనము, జూదము, వ్యభిచారము మున్నగునవి కూడ ధనార్జనకు మార్గములే! కాన అర్థశాస్త్ర మంగీకరించి తీరవలయును. కాని శాస్త్రము వీని నంగీకరించుచున్నదా? లేదు. కారణ మేమనఁ స్థూలదృష్టులకే యీమార్గము లశాంతికరములై తోఁచుటచేతను. రాజనీతి వానిని దండించుటచేతను. స్థూలదృష్టులే అనింద్యము లగు యన్ని మార్గములచేతను ధనార్జనమును చేయవచ్చు ననియే పాశ్చిమార్థికుల యభిప్రాయము, ఈకారణముచేత మొనమొన్నటివఱకు ఇంగ్లాండునందు, ధనోత్పాదన విషయమునఁ బ్రభుత్వమువారు జనుల కెట్టి విధులను చేయగూడ దని పండితులు బోధించియున్నారు. ఈ బోధవలన నేమి పుట్టెనో చూతము ఫేక్టరీ యజమానులు, షాహుకారులు మున్నగువారు స్వార్థపరాయణులై కడుపుకక్కుఱితికి ఎట్టి యిడుమలనైన గుడుచు, బీదవాండ్ర నన్నివిధముల హింసింపఁ జొచ్చిరి. పనివాండ్రకు తక్కువకూలి, ఎక్కువపని. తక్కువకూలికి దొరకుదు రను కారణముచేత ఈడుచాలని పసివాండ్రను, ఆఁడువాండ్రను కూలికి పెట్టుట మొదలిడిరి. ఈకూలీలకు కడుపునిండ తిండిలేదు. వంటినిండ బట్ట లేదు. ఉండుటకు పరిశుభ్రములైన యిండ్లు లేవు. భగవంతు డిచ్చిన మంచి గాలిని పీల్చి, మంచి నీటిని త్రావి ఎటులైన బ్రదుకుదు మన్న నవియును లేవు. గాలి యీ మరగొట్టములనుండి వెలువడు నేలబొగ్గుధూపముల చేత దూషితమైనది. నీరు ఎక్కడనుండియో త్రవ్వబట్టిన ఇనుపగొట్టములనుండి తీసికొనివచ్చిన విషము. అదియుంగాక పలువు రొక్కెడ నిరంతరమును పనిచేయుచుండుటచే నంటుడు వ్యాధులు ప్రబలజొచ్చెను. ఇట్టి సందర్భములందు పనివాండ్రస్థితి చాల దుర్భర మయ్యెను. అశాంతి, అనారోగ్యము. అకాలమృత్యువు వారిలోఁ బ్రబలఁజొచ్చెను. దొరతనమువారు ఫ్యాక్టరీ యజమానులకు నిర్బంధములు విధింపక తప్పదాయెను. ఆ నిర్బంధము లెట్టివో అవి ఎంతవఱకు ప్రయోజనకరములో చర్చించుట ప్రస్తుతము మనపనికాదు. కాని అర్థశాస్త్రమునకు విధినిర్దేశములు రెండును ముఖ్యపద్ధతులే యని నిరూపించుటయే మనపని.

అర్థశాస్త్రము చేయదగిన విధు లెట్టివి? అను విషయమును విచారింపవలసియున్నది. వివాహమును చేసికొను మని కామశాస్త్రము విధింప నవసరము లేదు. అటులనే ధనము సంపాదింపు మని అర్థశాస్త్రము విధింపవలసినపని లేదు. కాని మన దేశస్థులకు ధనము సంపాదింపు మని గూడ బోధింపవలసియున్న దని రామలింగారెడ్డి గారు విచారపడుచున్నారు. హిందూదేశస్థులకు తృష్ణ లేదనియు, అర్థము నీషణత్రయములలోఁ జేర్చి దూషించి రనియును దైవ మిచ్చినదానితో సంతృప్తిఁ జెంది యూరకుండు మని రనియును, ఇట్టి 'బూతు' సిద్ధాంతములే ప్రస్తుతమునదేశపు దారిద్ర్యము

నకు కారణభూతము లనియును రెడ్డిగారు నీతులు వ్రాసిరి. రెడ్డిగారు 'బూతులు' వ్రాయుట మా కిష్టమే గాని, కొన్ని విషయములు మాత్రము వారి దివ్య చిత్తమునకు తేవలసియున్నవి

ఆర్యులు అర్థము నీషణత్రయములోఁ జేర్చి యద్దాని నిందించుట వాస్తవము. కాని, అర్థదూషణమున కవసరమేమివచ్చె? జనులకు సహజముగ నర్థమందభిలాష మిక్కుటముగుటఁ జేసియే! జనులందఱును తృష్ణాపూరితు లగుటఁ జేసియే తృష్ణవలదని బోధింపవలసి వచ్చెను. చోరులు, హంతకులు కలరు గావుననే చోరత్వము, హననము పాపమని నేరమని చెప్పవలసివచ్చెను. చోరత్వమే లేనిచో, నయ్యది పాపమని చెప్ప నవసరమేమి కలుగును? కావున మనవారికి లేనిది తృష్ణ కాదు. తృష్ణారాహిత్యము పోనీ- మనవారికి తృష్ణ లేదనియే యంగీకరింతము. తృష్ణ కలిగినంత మాత్రమున మనము భాగ్యవంతుల మగుచున్నామా? తృష్ణవలన విత్తము చేకూరునా? మనము చేయు ప్రయత్నము లన్నియు కొనసాగుచున్నవా? ఎందఱు గొప్ప షాహుకారులు, ఎంతటి జాగ్రత్త వహించినను, దివాలా లెత్తుటలేదు. మన యదృష్టమునకు కర్తలము మనమే యగుదుమా? అగుదుమనుకొందము. పౌరుషమువలన తప్పక విత్తము చేకూరు ననియే తలంతము. అట్టి విత్తమువలన నేమి ప్రయోజనము విత్తమెంత యున్నను, ఆశాపిశాచగ్రస్తున కానంద మెక్కడనుండి వచ్చును? ఆనందముకంటె విత్తమునకు పరమప్రయోజన మేమి? విత్తమువలన ప్రాప్తవ్య మానంద మగుటను, అయ్యానందము మానసిక మగుటను, తృష్ణ గలయంతవట్టు సౌఖ్యము లేదు. భాగ్యము లేదు. 'మనసి చ పరితుష్టః కోఽర్థవాన్ కో దరిద్రః' అని యభియుక్తు లందురు. కావున ఎల్లవిధములను తృష్ణ గర్హ్యము. తృష్ణాదూషణమును చేసినంత మాత్రమున ధనమును దూషించినట్లు గాదు. ధనము వలదని ఎవ రనగలరు? ధనము లేకుండ ప్రాపంచిక వ్యవహారము లొక్కటియును నిముషమైన జరుగఁజాలవు. మనకేల? భగవంతుఁడైన విష్ణుమూర్తికే లక్ష్మి లేకుండ జగద్రక్షణము సాధ్యమైనదిగాదు. అర్థము సర్వపురుషార్థసాధక మని యిదివఱకే జెప్పియుంటిమి. కావునఁ బ్రతి మనుష్యుఁడును ధనార్జనమును తప్పక చేయవలయును. అందునను ప్రస్తుతకాలమున ధనమునకు గల యావశ్యకత మును పెన్నఁడు నెఱుంగము. సోమరిపోతుల కిది కాలము కాదు. మన దేశమున నింకను బిచ్చమైన దొరకుచున్నది గాని, పశ్చిమదేశముల నదియును దొఱకదు. అచ్చట బిచ్చ మెత్తుట నేరమని తలంతురు. సోమరులను బలవంతపెట్టి, పనిచేయించి ప్రభుత్వమువారు వాండ్రకు కూలి నిత్తురు. ఈపద్ధతి మంచిదో చెడ్డదో విచారింప నిది తావుగాదు. విషయ మేమనఁగా- ప్రతి మనుజుఁడును చెమట నోడ్చి కృషిసల్పి న్యాయ్యముగ, తనకు రావలసిన వేతనముపై జీవింపవలయునే గాని, సోమరిపోతులకు సత్రములు వేయు [illegible] మహారాజు లీకాలమున లేరు. ఎవఁడైన ధార్మికుఁడు, చనిపోవునప్పుడు అన్నసత్రమునకై కొంత ధనమును వదలిపోయినను, ధర్మకర్తలా ధనముతోనే పాఠశాలలనో నెలకొల్పుచున్నారు గాని, అన్నసత్రములు మాత్రము పెట్టుటలేదు. అవిభక్తకుటుంబముల (Joint Family) సంఖ్య నానాటికి తగ్గుచున్నది. కుటుంబములో నొక్క ప్రయోజకుఁడుండి సంపాదించుచున్న నప్రయోజకు లనేకులు వానియింటఁబడి తినుటకు అవకాశములు తగ్గుచున్నవి. కావునఁ బ్రతిమనుజుఁడును ఈకాలమునఁ దప్పక ధనమును సంపాదింపక తప్పదు. పైచర్చవలన నర్థశాస్త్రము జనుల కుద్బోధింపవలసిన విషయ మేమో సూచింపఁబడుచున్నది. ధనార్జన మవశ్యము చేయఁదగినదే కాని ధర్మకామమోక్షములకు మాత్రము విరోధము లేకుండ చేయవలయును. పురుషార్థముల నన్నింటిని సమదృష్టితో భావించి వానికిఁ బరస్పరవైరుధ్యమును కల్గింపకుండ ఎప్పు డెయ్యది యుచితమో అప్పుడు అద్దానిని యాచరించుటయే యుత్తముని లక్షణము. పురుషార్థముల నాల్గువిధములుగఁ జేర్కొనుటలో నభిప్రాయము ఏకమై యుండు మనుష్యప్రకృతి యీ నాల్గువిధములఁ బ్రవర్తించునని గాని ఎవ రిష్టము వచ్చినది వా రాచరింపవచ్చు నని గాదు. కావుననే ఏ యొకటి రెండు పురుషార్థములనో స్వీకరించి తక్కినవి త్యజించువారు స్వభావవిరుద్ధముగఁ బ్రవర్తించుచు ఆత్మద్రోహపాతకము పా లగుచున్నా రని గ్రహింపఁదగును. పురుషార్థములు వేదాంతులు సృష్టించిన నామమాత్రములు కావు. వ్యావహారిక ప్రపంచమందు ప్రవర్తించు జీవునకై స్వభావసిద్ధముగ నేర్పడిన రాజమార్గములు ఈ నాల్గు మార్గములందును సమానముగఁ బ్రవర్తించినఁ గాని ప్రపంచానుభవము సంపూర్ణము కానేరదు. అనుభవము పూర్తిగ నైన

గాని మోక్షప్రాప్తి లేదు. పురుషార్థచతుష్టయమును సమన్వయము చేయవలసిన యవసర మేమో మఱి కొంత విమర్శింతము. నాల్గుపురుషార్థములును కామము యొక్క వికారములే. ఏల యనగా- కామము ధర్మకామము మోక్షకామము అని ఇట్లు ఏదియైనఁ గావచ్చును. కావున మనుష్యప్రకృతికి ముఖ్యలక్షణము కామము. ఇయ్యది సకలసంకల్పములకు పుట్టినిల్లయిన మనస్సువలనఁ బుట్టుచున్నది. కావున మనస్సు గల యంతవట్టును తజ్జన్యమగు కామము గలదు. అది లేనప్పుడు కామము లేదు. నిదురబోవునప్పుడు మనస్సు జ్ఞానేంద్రియములద్వారా బాహ్యప్రపంచముపైఁ బ్రసరింపకుంటచే బాహ్యస్ఫూర్తి లేదు. కామమును నశించుచున్నది. సమాధియం దాత్మమనస్సులకు అవిచ్ఛిన్నమగు మైత్రి - అథవా సంయోగము సిద్ధించినప్పుడును ఇదియే స్థితియుండును. మనస్సు బాహ్యముఖమైనఁ గామము. అంతర్ముఖమైన నిష్కామము. కాన రాగవిరాగములకు రెండిటికిని కారణము మనస్సుతప్ప వేరొండు గాదు.

మనుష్యునకు రాగ మెంతయో విరాగము నంతియ. వినినంతమాత్రమున దీనియాథార్థ్యము కొందఱకు తట్టకపోవచ్చును. ఇటు చూడుడు. ఆఁకలిగొన్నవానికి అన్నము మిక్కిలి హితకరముగ నుండును. ఆకలి తీరిన తరువాత ఆయన్నమే మిగుల నసహ్యమై తోఁచును. అన్నము మనకు హితమా? అహితమా? రెండును. అవస్థాభేదముచేత నొకప్పుడు హితమై, వేరొకప్పు డహితమగును. అదియుం గాక ప్రతివస్తువును, కొంత పరిమితి వఱకు వాంఛనీయమై యాపైన ననిష్టమగును. ఒక యుదాహరణమును చూడుడు. తెల్లచీరలపై నొకయింతికి నిండువేడ్క కల దనుకొందము. ఎంత వేడ్కయున్నను, బహుశః రెండుమూఁడు చీరలకంటె నెక్కువ కట్టదు. ఏలయన నంతటితో వానిపై గల మురిపెము తీరును. అటుపైని నల్లకోకలనో-ఎర్రకోకలనో-యాశించునే గాని, తెల్లవానిని గోరదు. కోరఁదగిన వస్తువులు ప్రపంచమందు మిగుల కొద్దిగ నున్నచో నచిరకాలమున మనుష్యు లందఱును నిష్కాము లగుదురు. ఈశ్వరమహిమమువలన వాంఛలును వాంఛనీయములును అనంతములై యున్నవి. మనుష్యవాంఛలు రావణాసురుని తలలవంటివి. ఒకదానిని ద్రుంచివైచిన దానిస్థానమున వేరొండు ఉద్భవించును. కాని వాంఛల కన్నిఁటికిని ఒక్క సామాన్యలక్షణము కలదు. అది యెద్ది యనఁ గొంత యనుభవమైన పిదపఁ బ్రతివాంఛయు వెక్కసమై తోఁచును. కొన్ని మిగుల శీఘ్రముగ వెక్కసములై పోవును. మఱికొన్నిఁటిపైని చాలకాలమునకు గాని విరక్తి జనింపదు. ఎంత కల్గినను వెక్కసము కానట్లు కనుపడునది ధనము. ధనముపై విరక్తి ఎప్పటికో ఎవరికో కాని జనింపదు. కాని ఎప్పటికైననేమి ధనాశకుఁగూడ అంతము కలదు.

ప్రత్యేకముగా వాంఛలు వెక్కసములై యడఁగినటులనే నిఖిలప్రపంచముమీఁదను విరక్తి జనింపఁగూడదా? జనింపవచ్చును. తప్పక ప్రపంచముపై రోత పుట్టును. కాని యది సామాన్యము కాదు. తత్త్వదర్శనమువలనఁగాని ప్రపంచవాసన నశింపదు. తత్త్వదర్శన మన నేమి? వాంఛితము లనేకము లయ్యు, వాని సిద్ధివలన గలుగు ఫల మేక మగు నానంద మనియు నయ్యది ఐహికసుఖములందు 'మీసాలపైఁదేనియవంటిదై' క్షణభంగురమై యుండు ననియుఁ దెలియుటయే! ఈ పరమరహస్య మెఱింగినప్పు డారాటము మానును. తృష్ణాతిరోధాన మగును. అఖండ మగు నానందమును పొందుటకు మార్గములు గానఁబడును. అట్టియెడ మనుజుఁడు ప్రహ్లాదునివలె వస్తువాంఛ నొందడు. వానికి శమదమాది సంపత్తి గలిగి జీవితపరమార్థము సిద్ధించును.

కాన మనుష్యునకు రాగ మెంతయో విరాగము నంతియ. ఈరహస్య మెఱింగి యర్థశాస్త్ర మేమి బోధింపవలయును? వాంఛలను వృద్ధి పొందించినఁ గాని నాగరకత వృద్ధి కాదని పాశ్చాత్యులు బోధించుచున్నారు. వారివాదము కొంతవఱకు సమంజసమే! ఏల యనఁగా- ఆకలి కన్నము, దాహమునకు నీరు, చలికి బట్ట, ఎండకు నీడ, ఇంతకంటె వాంఛలు లేకున్నచోఁ బశుపక్ష్యాదులకును మనుష్యులకును భేదమే లేదు, వాంఛలు వృద్ధికానిచో ఇప్పుడుగూడ శిలాయుగమునాటి యాటవికులవలె గుహాలలో నివసించుచు, పచ్చిమాంసమును తినుచుఁ జర్మములను గప్పుకొని మహారణ్యములలో మన మందఱము తిరుగుచుండెడివారము.

ఈ కారణము నాధారము చేసికొని అర్థశాస్త్రజ్ఞులు మనదేశమందు, భిక్షాశనులై యోగాభ్యాసతత్పరులై తిరుగువారిని లోకమున కనర్థదాయకు లని నిందించుచున్నారు. వీ రందఱు లోకమందుఁ జే యర్థాన్వేషణమును చేయుచున్నచో, దేశము మఱింత బాగుపడు

నని వారి యభిప్రాయము. కాని యిది ఆత్మతత్వము నెఱుంగని యార్థికులు చెప్పదగినమాట. ఏలయన సన్న్యాసులు అనాగరకులైన ఆటవికులవంటివారు కారు. ఆటవికులు ప్రపంచములో ననుభవించుటకేమున్నదో తెలియక, అరణ్యములలో నుందురు సన్న్యాసులు ప్రపంచము నిస్సార మని అనుభవమునఁ దెలిసికొని యరణ్యములకు పోదురు. పుట్టనివానికిని చచ్చినవానికిని అభావము సామాన్యలక్షణమే యయ్యును, భేద మెట్లు గలదో అట్లే ఆటవికునకును సన్న్యాసికిని భేదము కలదు. ప్రాగభావమునకును ప్రధ్వంసాభావమునకును ఎంతభేదము కలదో, అనాగరకునకును సన్న్యాసికిని అంతభేదము కలదు. అదియునుగాక, సన్న్యాసియైన వాఁడు మొదటి మూఁడుపురుషార్థము లందును సంఘమందుండి ధనమును సంపాదించి సంఘసేవఁ జేసియున్నాఁడు. అటుపైని 55 సంవత్సరములకు పైన ఉద్యోగమును చాలించి యుపకారవేతనమును పుచ్చుకొన్నట్లాతఁడు సన్న్యసించిన మన మేల యతనిని నిందింపవలెను? ఆతఁడు కోరిన యుపకారవేతనము పూటకు పిడికెడు బిచ్చమే కదా! ముదుసలియుద్యోగియులు 'ఫింఛను' పుచ్చుకొనకున్న యువకులు ఆస్థానమునకు రా వీలుకానట్లు కొందఱు సన్న్యసించి బయటకు తొలగకున్నచో యువకులకు అవకాశము లెక్కడనుండి వచ్చును? కావున సన్న్యాసివలన దేశమునకు రాఁబోవు నుపద్రవ మేమియును లేదు వారి కిచ్చు బిచ్చమువలన దేశమునకు దారిద్ర్యము రాదు. వారు సంపాదింపకుండుటవలన యువకులకు మఱింత సావకాశములు గల్గునే గాని వేరొండు గాదు. ఇంతకంటెను విపులముగ నీవిషయమును చర్చించుట కిది తావుగాదు.

ఇంకను వాంఛలను వృద్ధిచేసినఁగాని నాగరకత గల్గదను మూలసూత్రమును పరికింతము. అది యెంతవఱకు సత్యమో ఇదివఱకు తెలిపియుంటిని. నిష్కాములమాట చెప్పినప్పుడాసూత్రమునఁ గల యాభాసయును సూచింపబడియెను. వాంఛలను వృద్ధినొందించుట న్యాయమే గాని ధర్మార్థకామమోక్షము లను మార్గములందే వానిని ప్రసరింపజేయవలయును. పురుషార్థములు రైలు పట్టాలవంటివి. పట్టాలనుండి తొలగిన రైలు నష్టమగును. అటులనే పురుషార్థముల నతిక్రమించిన మనుజుఁడును. కాన పాశ్చాత్త్యుల ఆర్థికసూత్రమును మన మీతీరున సవరింపవలయును. కొన్ని యుదాహరణములను చూపినచోఁ పైని జెప్పిన సవరణ ఆవశ్యకత బాగుగఁ దెలియగలదు.

మన దేశములో నవిభక్తకుటుంబము లీనాటివఱకు నిలచియే యున్నవి. పశ్చిమదేశమందు సంసారమనఁగా- భార్య భర్త. ఉన్నచో వారి సంతానము. ఇంతియే మన సంసారములు. వీరితో సరిపోవు. అవివాహితులగు తమ్ములు, చెల్లెండ్రు, వితంతువు లగు తోఁబుట్టువులు, పినతల్లులు, మేనత్తలు, ఇంక నెందఱో యుందురు. ఇట్టి సంసారములను చూచి పాశ్చాత్యార్థికు లేమనుచున్నారో వింటిరా? అవిభక్తకుటుంబములలో చాలమందికి స్వయంకృషి లేకయే జీవితము గడచుటచే నుత్సాహశక్తి తగ్గిపోవుచున్నది. సోమరితనము బలియుచున్నది. మఱియును సంపాదకుఁడైనవాఁడు సంసారభారముచే క్రుంగిపోయి ధనార్జనమందు నూతనమార్గములఁ ద్రొక్క సాహసింపఁడు. ఒకఁడు సంపాదించు ధనమనేకమందికై వెచ్చింపబడుటచే విశేషధనము కూడఁబెట్టుటకు వీలు లేదు. అందుచే మూలధనము (Capital) వృద్ధియగుటకు అవకాశము లభింపదు. కావున నవిభక్తకుటుంబము లనర్థకము లని వాదించుచున్నారు. ఈవాదము ధనమే పరమార్థ మని యెంచువారికి సమంజసమై తోఁచవచ్చును. గాని, కుటుంబశబ్దార్థము నెఱిగి బంధువుల ప్రేమించు వారికి రుచింపదు. ఇట్టి కుటుంబములే లేనిచోఁ కన్నుదెరువని పసికూనలు, కదలలేని వృద్ధులు, దిక్కులేని వితంతువులు, వీరందఱేమి కావలయును? పశ్చిమదేశములందు వలె ముసలివాండ్రను ప్రభుత్వమువారు పోషించుట ఇంతకంటె సులభమా? సౌఖ్యమా? మగవాండ్రతోఁబాటు అసహాయులగు స్త్రీలుగూడ జీవనోపాధికై ప్రపంచమున నల్లాడుచున్న నైతికప్రవర్తనము సాధ్య మగునా? సంపాదించుకొనఁ గలిగినఁ దినుము. లేకున్న పస్తు పరుండుము. అని జాతివారన్నట్లు అక్కటికముగల అర్యుఁ డెవడైన తన చిన్నతమ్ముని, ముసలితండ్రిని, తలచెడిన తోఁబుట్టువు ననఁగలఁడా?

మఱియొక యుదాహరణమును చూడుడు. పశ్చిమదేశములందు స్త్రీపురుషులకు వివాహముపై వాంఛ తగ్గుచున్నది. దీనికిఁ గారణ మేమన- వివాహమువలన జనసంఖ్య మితిమీఱి దేశము దరిద్రస్థితిలోనికి వచ్చునని కొందఱు ఆర్థికులు చెప్పుటచే దేశాభ్యుదయముకొఱకవివాహితులై ధనము సంపాదింపవలయు ననుకొనిరి.

క్షణముకొఱకై సర్వసంగపరిత్యాగమును చేసికొనుటకు సిద్ధపడువారి కీసూత్రము మిక్కిలి విహితమై తోఁచవచ్చును. ఏలయనఁగా వివాహము లేకున్న సంసారపు టీతిబాధ లేమియును గల్గవు. బిడ్డలను పోషింప నవసరము లేదు. ఎవరంతట వారు సంపాదించుకొని స్వచ్ఛందవిహారము చేయవచ్చును. ఇట్టి యుద్దేశములు శ్లాఘ్యములనియు, మనదేశస్థుల కిదిలేకుంట శోచ్యమనియును యదునాథసర్కారు మున్నగు నార్థికపండితులు వ్రాసియున్నారు. పై నుదాహరించిన యుద్దేశ్యము లెంతవఱ కవలంబింపదగినవో యూహింతము. అమితముగ జనసంఖ్య వృద్ధియైనచో తినుబండారములు సరిపోక దారిద్ర్యము వృద్ధి కావచ్చును. ఐనను జనసంఖ్య వృద్ధికాకుండ మాన్పుటకు వివాహమును మానుమని బోధింపవలయునా? వివాహముల మానుచున్న పాశ్చాత్య దేశములం దెట్టి దురాచారములు ప్రబలుచున్నవో చూచితిరా? గృహస్థధర్మమం దుండియు గర్భోత్పత్తి కాకుండ మాన్పువారు, భ్రూణశిశుహత్యాదుల కొడిగట్టువారు, అవివాహితులై యుండి కామమును జయింప నుపాయాంతరముల నారయుచున్నారు. ఇట్టి దుర్నీతిపరు లందఱును బలియుచున్నారు. ఒకానొక తుచ్ఛమార్గమువలన జితేంద్రియత్వము కల్గునని మనదేశమం దీమధ్య కొందఱు నవీనవేదాంతులు తలంచినట్లు - వీరును అట్టిమార్గమువలననే ఐశ్వర్యము సిద్ధించు నని యపోహ నొందుచున్నారు. కాని యట్టితుచ్ఛపుఁ బనులవలన వారికి జితేంద్రియత్వమును లేదు. వీరికైశ్వర్యమును లేదు.

మఱియు నీస్థితిగతులవలన ఫ్రాంసు మున్నగు దేశములలో జనసఖ్య తగ్గ జొచ్చినది. మూలిగెడి నక్కమీఁద తాటిపండు పడినట్లు, మొన్నటి ఘోరసంగ్రామము సంభవించెను. ఈ యుద్ధమందు లక్షలకొలఁది జనులు నిహతులైరి. మిగిలినవారైనను వివాహము చేసికొని ప్రజాభివృద్ధికిఁ దోడ్పడకున్న దేశము లెట్లు బాగుపడఁగలవు? అంచుకొని ఒక యుక్తిని పన్నిరి. ఏమిటది? బిడ్డలగన్నవారికి బహుమానములు! బ్రహ్మచారులకు పన్ను. ఇంతకొ నాగరకు కొందఱు బుద్ధిమంతులు వివాహమును నియమమును తీసివైచినచో జనసంఖ్య అచిరకాలమున వృద్ధికాగల దని యభిప్రాయపడుచున్నారు. ఆహా! నాగరకత! ఎట్టి విపరీతములను పుట్టించుచున్నది!!

ఇట్టి దురవస్థలను మనదేశమం దెం నివారింపదగునో చూతము. జనసంఖ్య వృద్ధియగు నను భయమున్నచో, ధర్మశాస్త్రములందు విధించిన ట్లమావాస ఏకాదశి మున్నగు నిషిద్ధదినములను వర్జించి నియమానుసారముగ భార్యలయందు సంచరింపవలదా? ఆశ్రమనియమములను పాటించి, బ్రహ్మచర్యమున, గురుకులవాసము చేసి, గార్హస్థ్యమున సంఘమర్యాదలననుసరించి ధర్మపత్నివలన తార్తీయపురుషార్థమునఁ బ్రవర్తించుచుచు, వానప్రస్థుడై మునివృత్తి నవలంబించి, సన్న్యాసియై కామములం దెగగోసి యోగముచే దేహమును చాలింపవలదా? ఇట్లు నియమానుసారముగఁ బ్రవర్తింపుచున్నచో ప్రజాసంఖ్య మితిమీఱునా? క్షీణించు నను భయమును లేదు. మన మెన్నఁడును బ్రహ్మచారికి పన్నులను విధింపవలసిన పనియు లేదు. 'అపుత్రస్య గతిర్నాస్తి' అని ఏనా డెవఁడు వచించెనో అది నేటికిని చెల్లివచ్చుచున్నది. బ్రహ్మచారులకును, కళత్రమును గోలుపోయినవారికిని, మనదేశమందు కర్మ కధికారము లేదు. సభయందు పూజ్యత లేదు. అందుచే ప్రతిమనుజుఁడును తప్పక వివాహమును చేసికొనును. కన్యాదానము దానము లన్నిఁటిలోనికి నగ్రగణ్యమని మనవారి నమ్మకము. అవివాహితులకు వివాహము చేయించిన విశేషఫలము కల దని ఆర్యులు వచింతురు. అదియును గాక, వివాహముయొక్క అవసరానవసరములు తుచ్ఛమగు నార్థికబుద్ధితో పరికింపరాదు.

గీ. అఖిలదుఃఖరోగార్తున కౌషధంబు
సురుచిరంబుగ భార్యయ చూవె యొందు
ఒనర భార్యాసమేతుఁడై యున్నవాని
కింత యాపదలయ్యును నెరుకపడవు. (నలచరిత్ర)

పరమ పతివ్రతయగు నరుంధతీదేవిని 'వశిష్ఠస్య తపోమయం జ్యోతి' రని ప్రశంసించియున్నారు. ఇందలి భావమేమో పాఠకు లూహించుకొందురు గాక.

కేవల ధనాశవలన నెట్టి విపరీతములు పుట్టునో నిరూపించుట కిట్టి యుదాహరణముల నెన్నిఁటినో చూపింపవచ్చును. కాని ముఖ్యముగ గమనింపవలసినవిషయమిది సదసద్వివేకరహితమగు కామమువలన వ్యష్టిసమష్టుల కిరువురకును దుఃఖమేకాని సౌఖ్యము లేదు. కామమువలన ద్వైతభ్రాంతి వృద్ధి యగును. ఈ భ్రాంతి దుఃఖమునకు మూలకారణము. "ద్వితీయాద్వై భయం భవతి, యని శ్రుతివాక్యము. కాన నద్వైతానుసంధానమునకు విరోధము లగు వాంఛలను వృద్ధి చేయువ

దని ఆర్థికశాస్త్రజ్ఞులు బోధించి తీరవలయును. యథార్థమన్ని శాస్త్రములకు నందఱు మనుజులకు నన్ని దేశములకు కాలములకు ఒకేరూపమున ప్రకాశించుచుండునే గాని వేదాంతశాస్త్రరీతిగ నిజమైన విషయము అర్థశాస్త్రబుద్ధ్యా అబద్ధము కానేరదు.

కావున నర్థశాస్త్ర మంతేయుఁ బైన నిరూపింపబడిన మూలసూత్రముపై నాధారపడి యుండవలయును. ఆ పునాదిపై నిలువబడకున్న నయ్యది యనర్థశాస్త్ర మగును గాని యర్థశాస్త్రము కానేరదు. అదియును గాక మన మర్థశాస్త్రము వ్రాయునప్పుడు ఒక్క మనుష్యప్రకృతినే గాక సమస్తశాస్త్రములను దానితో సమన్వయము చేసికొనుచుండవలయును. ఏలయనఁ బ్రపంచ మంతయు విరాట్పురుషుని స్వరూపము. అందు గల స్థావరజంగమము లన్నియు, పరస్పరసంబంధములు గలవై జగత్పాలకుని సంకల్పమును నెఱవేర్చుచుండును. మన యజ్ఞానమువలన నపోహపడుదుము గాని జగత్తునందు నిరర్థక మగు వస్తు వొక్కఁడును లేదు. పాము అపాయకర మగు జంతు వయ్యును, దాని గరళ మౌషధమునకు పనికివచ్చుచున్నది. పెద్దపులి క్రూరజంతు వయ్యును, పులిచేరువలన లోకమున కుపకారము గలుగుచున్నది. ఇటులనే స్థూలదృష్టికి నిరుపయోగములై కనుపట్టు ననేకములు ఉపయుక్తము లగుచున్నవి.

అఖండమై అనంతమై యనితరసాధారణ ప్రభావముగలదైన ఏక మగు జ్ఞానమును, తెలియమిచేతను, చేతగామిచేతను ముక్కలు ముక్కలుగ నఱికి - ఇది వేదాంతము, ఇది రసశాస్త్రము ఇది జంతుశాస్త్రమియ్యది యర్థశాస్త్రము అని పరస్పర విరుద్ధము లగు శాస్త్రములు నల్లిక జగత్తత్వము నెఱింగి సర్వసమన్వయమును చేయవలయును. ఇట్టి సర్వసమన్వయ జ్ఞానము లేకున్న నెట్టి యిక్కట్లు సంభవించునో చూడుడు. ఒకటి రెండు ఉదాహరణములు:—

పశ్చిమదేశములలో పక్షుల రెక్కలను టోపీలపై పెట్టుకొనుట అంద మని తలంతురు. కాన టోపీల చేయువారు పక్షులను చంప మొదలిడిరి. ఇట్లు కొంత కాలము గడచినపిదప జర్మనీదేశములో పైరు లన్నియు కీటకములవలన నాశన మగుట మొదలిడెను. అటుపై వ్యవసాయశాస్త్ర పండితు లందఱును కలసి పైరులు చెడుటకు కారణ మేమి? యని విచారించి కీటకముల దినుచుండు పక్షు లన్నియు నశించుటవలన కీటకములు ప్రబలుచున్న వని కనుగొనిరి. ఇప్పు డేమి చేయవలయును. కీటకములజంపుటకు క్రొత్తమార్గము కనుగొందురా? ప్రకృతిసిద్ధముగ కీటకముల జంపు పిట్టలను రూపుమాపి పైని పురుగులజంపుటకు మార్గాంతరముల నారయుట మేలా? పక్షులను జంపకుంట మేలా? సహజమగు దంతములను కొనువాఁ డెవఁడైన నున్నచో నూడగొట్టి యమ్ముకొని కృత్రిమ దంతములఁ గట్టించుట మేలా? సహజదంతముల నిలువబెట్టుకొనుట మేలా?

ఇప్పుడు ప్రపంచ మంతటను, నేలబొగ్గు, వెండి, బంగారు ఇనుము మున్నగు ఖనిజములను విశేషముగ పైకి తీసి పారిశ్రామికాభివృద్ధికి సావకాశము కలిగించుచున్నారు. కాని భూమిలోపలికి త్రవ్వుకొని పోయి యచ్చటనుండు పదార్థముల నన్నిటిని బయటకు లాగివేయుట వలన వసుమతి వంధ్య యగుచున్నది. ఎరువువేసి పంటలు వృద్ధిచేసినను పండిన వస్తువులలో పూర్వపుబలము గానిసారముగాని లేదు.

ఈమధ్య కృత్రిమపు రంగులను తయారుచేయు పద్ధతిని కనుగొనిరి. ఈ పరిశ్రమవలన జర్మనీదేశము చాల లాభమును పొందినది. జర్మనీవారు యుద్ధమునకు పూర్వము కృత్రిమపు నీలిమందును తయారుచేయుచుండెడువారు. జర్మనీనీలిమందు రాగానే మనదేశములో నీలిమందువ్యవసాయ ముడుగంటినది సహజ మగు నీలిమందు రంగునకే గాక ఔషధమునకుగూడ పనికివచ్చును. కృత్రిమపు నీలి కట్టి గుణములు లేవు, అదియునుఁ గాక సహజ మగు రంగులు నిలచినట్లు కృత్రిమవర్ణములు నిలువ వనియు, వానిలోనుండు సౌమ్యము వీనిలో లేదనియు, రంగుపనివాండ్రు మొఱ లిడుచున్నారు. రంగుపనిలో నాజూకుతనమును నిలువబెట్టుకొనుట మేలా? ధనమునకై కృత్రిమవర్ణములను తయారుచేయుట మేలా?

మఱబియ్యము తెల్లగ మల్లెపూలవలె నున్న వని మనమందఱము సంతసించుచున్నను వానివలన నంజువ్యాధి ప్రబలుచున్న దని వైద్యులు చెప్పుచున్నారు. మన మిప్పుడు మఱబియ్యమును మానివేసినచో మన బియ్యపు ఫాక్టరీ లన్నియు దివాలాతీయవలసి వచ్చును. దంపుడుబియ్యములో నున్న రుచి బలము మఱబియ్యములో లేవని మన మందఱ మెఱుంగుదుము. కాననిప్పు డేమి చేయవలయును? కొందఱకు ధనము కూడుటకై బియ్యపుమఱల పెట్టవలయునా? అందఱు నారోగ్య

ముగ నుండుటకై దంపుడుబియ్యమును తినవలయునా? పాఠకులు నిర్ణయించుకొందురుగాక.

ఇట్లు ధనాశచే ననేకములఁ దెగనాడుచున్నాము. గ్రామఫోను హార్మోనియముల పైడాబు కాగ లేక నాద బ్రహ్మాయవతారము చాలింపవలసెను. నారదుఁడు భూలోకమునకు రామానినాడు. మురికినీళ్లనుండి కిరసనాయిలునుండి, సారాలనుండి తయారుచేయు నాటోదిల్బహార్ మున్నగు సెంటువాసనలవలన- కస్తూరి పునుగు, జవ్వాజి, అత్తరులు, మున్నగు- సుగంధద్రవ్యము లడుగంటుచున్నవి. మఱబట్టల వేగమునకు చౌకదనమునకు ఆగలేక డక్కా-మజిలిన్లు, సరిగెచీరలు, బనారసుపంచెలు, నేతమగ్గము లన్నియు మ్రగ్గిపోవుచున్నవి.

గిల్టునగలు ప్రబలుచున్నను, వెండిబంగారులపై మనస్త్రీలకు మమకారము వదలలేదు. కాని మనయార్థికు లందఱును, బంగారునగల ధరించుట నాగరకలక్షణమనియు, నిరర్థకముగ కొంతసొమ్ము నగలపై వ్యయము చేయుటకంటె బ్యాంకులలో వడ్డీకి వేసియో జాయింటు స్టాకుకంపెనీల వాటాలను కొనియో వినియోగించిన యెడల తమకును దేశమునకును లాభకరమనియును, వచింపుచున్నారు. నిజమే! కాని, అలంకారము సహజమగు సౌందర్యమునకు వన్నె బెట్టుననియు, ముత్తైదువుల కలంకారములు సౌభాగ్యలక్షణము లనియు మనవారి వెఱ్ఱి నమ్మకము. నగ లన్నియు నమ్మి సొమ్ముచేసికొనకున్న నింతలో దేశమునకు దారిద్ర్యము రాదు. ఎవరిరాబడికి తగినట్లు వారు నగల నమర్చుకొనుటవలన విశేష నష్టము లేదు. అట్లు కాకుండ అలంకారరహితలై నల్లపూసలోనికి తెల్లపూస లేకుండ, క్రొంపిపోసిన చెక్కి పెవలె నున్న గృహిణులను జూచుకొన్నచో హిందువులందఱు నొక్కనాడే సన్న్యసింతురు. గిల్టునగల ధరింపవచ్చును గదా యందురేమో? సువర్ణమందు కొన్ని విలక్షణములైన లక్షణములు కలవని చెప్పుదురు. స్వర్ణము క్రిమినాశక మని పెద్దలు చెప్పుదురు. జాతివారికీ విషయము తెలియక పోయినంతమాత్రమున తప్పుగా బోదు. స్వర్గతత్త్వ నిర్ణయమందే వారికిని మనకును భేదము కలదు. బంగారము లోహావిశేష మని వారి నమ్మకము. బంగారము తేజోరూప మని మనవారిసిద్ధాంతము. ఇటులే రత్నములందు గూడ శుభప్రదములగు లక్షణములు కలవందురు. వాని నన్నిఁటి చర్చించుట కిది తావుగాదు,

ఇటులే సర్వ శాస్త్రసమన్వయజ్ఞానము లేనందువలన ననేకదోషము లుద్భవిల్లును. కావున శాస్త్రము వ్రాయునప్పుడు నాల్గుపురుషార్థములను, నవరసములను మనుష్యునందుఁ, ఆమనుష్య తత్త్వమును తక్కిన స్థావరజంగమ తత్త్వములందును, సమన్వయించి సర్వజ్ఞతతోఁ గడగవలయునుగాని భేదదృష్టితోఁ బ్రయత్నించిన మిథ్యాజ్ఞానము తప్ప వేరొండు సిద్ధింపదు.

ఇంతవఱకును, అర్థశాస్త్రమందు ముఖ్యముగ గమనింపవలసిన మూలసూత్రములను విమర్శించియుంటిమి. ఈసూత్రములను తచ్ఛాస్త్రమం దంతర్భాగములగు (1) అర్థోత్పత్తి (Prodnchin) (2) విభజనము (Dislubrurrin) (3) వినిమయము (Exchange) (4) అనుభూతి (Connumpliar) వీనియం దెట్లు సమన్వయింపవలయునో వ్రాయ నీవ్యాసమునందు తావుచాలదు కాని బుద్ధిమంతు లగు పాఠకులు అర్థశాస్త్రమందాయా భాగములు చదువుచున్నప్పు డీ సూత్రమును మనస్సున నుంచుకొన్నచో, పాశ్చాత్యపండితుల స్ఖాలిత్యములు పొడగట్టఁగలవు. గుణదోషవిచక్షణ జేయక పాశ్చిమ సిద్ధాంతముల గ్రహించుట మనకు శ్రేయస్కరము కాదు ప్రస్తుతవ్యాసము యొక్క యుద్దేశము ఆర్థికశాస్త్రవిద్యార్థుల కొక నూతనదృక్పథము నొసంగవలయు ననియే గాని వేరొండు గాదు.

# సోవియట్టులు

భోగరాజు పట్టాభి సీతారామయ్య పంతులు గారు

రాజ్యాంగ విధానము లనేకవిధములుగా నున్నవి. కొన్నింటియందు రాజు నిరంకుశప్రభువై యేలుచుండును. మఱికొన్నింటియందు రాజు తన యధికారము నంతను ప్రజాప్రతినిధుల సభ వశము చేసి తాను నామమాత్రావశిష్టుఁడై సంఘములో పెద్దగా మాత్రమే గౌరవమును బొందుచుండును. మఱి కొన్ని రాజ్యములందు రాజు లేకయే పరిపాలనావిధాన మంతయుఁ బ్రజాప్రతినిధులతోఁ గూడిన యొకసభలోఁ గాని రెండుసభలలోఁ గాని నిల్చియుండును. మొదటితెరగతికి ఉదాహరణము: మొన్నటివఱకుఁ బ్రబలియున్న ప్రభుత్వముగల రష్యా, జర్మనీ, ఆస్ట్రియా దేశములు. రెండవతెరగతికి ఉదాహరణములు: ఇంగ్లాండు, ఇటలీ, జపాను దేశములు. మూఁడవతెరగతికి: ఫ్రాన్సు, అమెరికాలోని సంయుక్తరాష్ట్రములు, స్విడ్జర్లాండులు. ఇవి మొన్న మొన్నటివఱకు ఏర్పడి ఉన్నటువంటి రాజ్యాంగ విధానములు. కాని యుద్ధము ముగియుటకు కారణము అనండి- లేక, ముగిసిన ఫలిత మనండి, జర్మనీ రష్యా ఆస్ట్రియా దేశములలో నిరంకుశప్రభుత్వము నశించినది. రష్యా దేశములో నిరంకుశప్రభుత్వముపై ప్రజలకు గలిగిన వైమనస్యమే నిరంకుశరాజుయొక్క పతనమునకును, యుద్ధముయొక్క ఆకస్మికమగు ముగింపునకును కారణములై ప్రజాపరిపాలనాస్వాతంత్ర్యమునకు మార్గము చూపెను. జర్మనీ ఆస్ట్రియా దేశములలో అట్లు కాక, యుద్ధమునందు పరాజితులైన ఈ రెండు దేశముల రాజులును పలాయితులు అయినపిమ్మట ప్రజలు బాధ్యతాయుత్తపరిపాలనమును స్థాపించుకొనిరి. కాని రష్యాయందు స్థాపింపఁబడినపరిపాలనము పైన వివరింపఁబడిన మూఁడవతెరగతి పరిపాలనమువంటిది కాదు. ఆ మూఁడవ పరిపాలనయందు స్వాతంత్ర్య మున్నట్లు కనఁబడినను, సంఘముయొక్క ఆర్థికస్వాతంత్ర్యమును ధ్వంసము చేయు విధానము లుండుటచే రష్యనులు దీనిని అవలంబింపలేదు.

పాశ్చాత్యదేశస్థుల సభ్యత యంతయును వర్తకముపై నాధారపడి యున్నది. ఈ వర్తకమును ఎవరి యింట వారు చేసికొనక, యావన్మంది ప్రజలు సంఘముగా నేర్పడి ద్రవ్యమును ప్రోవుచేసి, ఫ్యాక్టరీలు ఏర్పఱచి వేలకొలఁది కూలివాండ్రను నియమించి, లాభమును పొందుచున్నారు. ఇట్లు సంఘముల మూలమున వర్తకముచేసి కూలివాండ్రచే యావత్తుపనిని చేయించి సాంఘికులు శ్రమ లేకయే కోటీశ్వరు లగుచుండిరి. కూలివాండ్రందఱు తమ శ్రమవలన తమకు కూలి మాత్రమే లభించుటయును, సాంఘికులు అనాయాసముగా కోటీశ్వరు లగుటయుఁ దెలిసికొని సమ్మెకట్ట నారంభించిరి. ఈ అవబోధము 1878 లో ఇంగ్లాండునందు ప్రారంభమైనది. ఇంతకు పూర్వము యజమాని కూలివానిని వదలిన నేరము లేకుండుటయు, కూలివాడు యజమాని సేవను వదలిన వానిపై క్రిమినల్ నిందారోపణయు నుండెడిది. అది మొదలు ఇంతవఱకు కూలీలు సంఘము లేర్పఱచుకొని తమ ప్రతినిధులను పార్లమెంటునకు క్రమవృద్ధిగా ఒకరిని ఇద్దరిని పంపుచు నేడు సుమారు 70 మందిని పంపఁగలిగియున్నారు. నేఁడో రేపో వీరు రాజ్యాంగవిధానమునందు మంత్రిపదవులను గూడ, ఇప్పటివలె ఒకరిద్దరు కాక, పూర్ణముగ నలంకరింపగలరు. వీరలనుండియే ప్రధానమంత్రి నియమింపఁబడును. ఆయన తమ సహచరులను, పాలకపువర్గము వారి నుండియే ఏరుకొనును. కాని యిరోపాయొక్కయు, ఇంగ్లాండుయొక్కయు ఆర్థికసమస్య, ఇట్టి పైపూత పెట్టుటవలన తేలదు. పెట్టుబడిదారులకును పాటకపువర్గము వారికిని గలుగు పోరాటము ఎక్కువ లోఁతైనది. గాఢమైన కారణములును సాంఘికపరిస్థితులును ఈ సమస్యయం దిమిడియుండుటచే సమస్య క్లిష్టముగఁ గన్పించుచున్నది. ఈసమస్యయందున్న సారాంశము లెట్టివి? ఏ వస్తువు నుత్పత్తి చేయవలె నన్నను కుటుంబవ్యక్తి నశించినది. బహుజనము వాటాలు వేసికొనెద మని నటించుచు, ఏ కొలఁదిపాటిజనమో భాగ్యవంతు లయినవారు వాటాల నన్నిటిని తమలో తామే పుచ్చుకొని కంపెనీలను స్థాపించి పని చేయువారిని కేవలము కూలీలనుగ చూచుచు, వారిచే ఒకవస్తువును మొదటనుండి తుది

వఱకు చేయింపక వస్తువుయొక్క వివిధభాగములు వివిధ జనుల కిచ్చి యంత్రసామగ్రిచే ప్రతివస్తువును ఉత్పత్తిచేయు విధానమును బలపఱచి. యజమాను లగు కొలఁదిమంది పనివాండ్ర శ్రమచేఁ గలుగు స్వేదబిందువులపైనను, రక్తబిందువులపైనను నాధారపడియున్న భాగ్యభోగ్యముల నెల్ల ననుభవించుచున్నారు.

ఏ మనుష్యుడును ఏ స్త్రీయు ఏ బిడ్డయు తన కుటుంబములో తన స్వంతపని చేసికొనుటకు అవకాశమును పొందజాలక అందఱును ఒక్క యంత్రజాలమునందు—ఒక్క ఇంద్రజాలమునందు ఒక్క మహేంద్రజాలమునందు చిక్కుకొని ఒక్క మంత్రమునకు లోఁబడియున్నారు. ఏసంసారములోను తల్లితండ్రులును బిడ్డలును కలిసి, మనకుమ్మరులు మనసాలీలు మన నేతగాండ్రు కమ్మరులు విశ్వకర్మలు చాకలులు, రంగులవారు మున్నగు కుటుంబములవలె ఒక్కమనస్సు ఒక్కహృదయముతో - ఒక్కదీక్షతో - పనులను మొదలునుండి తుదివఱకు చేయుటకు అవకాశమును గలిగియుండఁజాల కున్నారు. అంతేకాదు. చంటిబిడ్డలను వదలి, తల్లులు యంత్రశాలలోనికి పనులకు పోవుచుండ, చంటిబిడ్డల నెల్ల నొక్క ప్రదేశమునందుఁ గూడఁబెట్టి గొఱ్ఱెలను కాఁచినట్లు, ఏదాయియో వీరిని జాగ్రత్తగా చూడవలసి వచ్చుచుండ, నిదియే మహాసంస్కరణ మని పాశ్చాత్యులు మురిసిపోవుచున్నారు. ఈ పద్ధతు లన్నియు సంసారములను విచ్ఛిన్నము చేసినవి. యంత్రములకు ప్రజలను దాసులను చేసినవి. ఏకొలఁదిమందికో భాగ్యభోగ్యములు మెండై జనసామాన్యమునకు తిండిలేక వసతిలేక మలమల మాడి పోవుచున్నారు. ఒకప్రక్కన 40 అంతస్తులమేడలో ధనికుఁడు కాఁపురముచేయుచు మురిసిపోవుచుండ, ఆసౌధముప్రక్కనే 10 కుటుంబములు ఒకచిన్నగదిలో స్థలము లేక, మఱుఁగు లేక, మంచిచెడ్డలు లేక, ముఱిగిపోవుచున్నారు. వంటచేసికొనుటకు-సంసారములకు-స్థలమును సావకాశమును లేక, పూటకూళ్ళఇండ్లనుండి అనేకకుటుంబములు ఆహారమును దెచ్చుకొనుచున్నారు. పట్టణములలోని కార్మికులకు ఇండ్లు లేక, పెనిమిటి ఒకయింటను భార్య మఱొకఇంటను, రాత్రులందు ఇరుగుపొరుగువారి యిండ్లలోను, 4 మాసములు కాలయాపన చేయవలసి వచ్చినది. కళాప్రవీణత యనునది వలయు పరిశ్రమలందు గూడ - అనఁగా తివాచీనేఁతయందు అనుకొనుఁడు—ఆ లతలు ఆపుష్పములు ఆ సౌందర్యము ఎవరి తెలివితేటల వలన,వారు ఉత్పత్తిచేసి, అట్టి స్వజనశక్తిచేఁ గలుగు పరమానందమును బొందుటకు బదులుగ, యంత్రముచే సర్వము గావింపఁబడుచుండ - ఒకఁడు ఉన్నిని అందిచ్చువాఁడై, ఒకఁడు చుట్టువాఁడై, ఒకఁడు బొత్తిపెట్టువాఁడై, ఒకరిపనికిని మఱియొకరిపనికిని సంబంధము లేక, ఒకరికిని మఱియొకరికిని పనిలో కలుపుగోలుతనము లేక, ఎవరికి వారే యమునాతీరే అను సామెతప్రకారము జీవనము సలుపుచున్నారు. ఐరోపాఖండమునంతను ఆవరించియున్న మహాదోషము ఇది. ఈ పోరాటము కేవలము - ధనము ఆర్థికస్థితి కుటుంబపోషణము గృహసౌకర్యము మున్నగువానితో నంత్య మగునది కాదు. ఈ సమస్య సంసారనిర్మాణము సాంఘికనిర్మాణము అను క్లిష్టసందర్భములకు వర్తించునది. ఇది కేవలము కూలివాండ్రు రాజ్యాంగాధికారము స్వీకరించుటతో తేలదు. వారు మంత్రిపదవుల నలంకరించుటవలన అంత్యము కాదు. బొగ్గుగనులను దొరతనమువారి వశము చేయుటవలనఁ దుదినొందదు. అధికారములో నుండువారియొక్కయేకాకఁ బ్రజాసామాన్యము యొక్కయు సాంఘికాదర్శముల యొక్కయు సంసార లక్షణముల యొక్కయు, పద్ధతులు ధర్మములు పరిపూర్ణముగ మారవలెను.

ఇట్టి విప్లవపూర్వకము లగు మార్పులను చేయఁగలుగునది ఎవరు? ఆ మార్పు లన్నియు పాశ్చాత్యపద్ధతులలో ప్రాగ్దేశపు ధర్మములను వ్యాపింపఁజేయఁగలవారే నిర్వర్తింపఁగలరు. ఎక్కడ ప్రాక్పాశ్చాత్యసంపర్కములు సరిసమానముగ కలిసియున్నవో అక్కడనే ఈ సమస్య తేలగలదు. ఎక్కడ పాశ్చాత్యభౌతికాదర్శములును ప్రాగ్దేశపు ఆధ్యాత్మికాదర్శములును సమ్మేళనము చేయఁబడగలవో అచ్చటనే ఈసమస్యను తేల్చుటకు అవకాశము లుండును. అట్టి దేశము రుష్యాదేశము. రుష్యా ఐరోపాఖండమునకు ఎంత చెందియున్నదో ఆసియాఖండమునకు కూడ నంతయే చెందియున్నది. ఈ విషయము కేవలము ప్రాతప్రపంచమునకే కాక భావప్రపంచమునకు కూడ వర్తించుచున్నది. అట్టి రుష్యాదేశమునందు విప్లవమునకు అంకురములు 1905 సంవత్సరములోనే ప్రారంభించినవి. కాని 'జారు' గారి నిరంకుశప్రభుత్వబలముచే నవి అకాలమరణము నొందినవి. ఐరోపామహాసంగ్రామము ప్రారంభమయిన

మూఁడు సంవత్సరములకు రుష్యావారు జర్మనీవారితో తలవనితలంపుగ ఆకస్మికముగ సంధిచేసికొనిరి. ఆసంధి చేసికొనుటకు గల కారణములలోనే రానైయున్న మహావిప్లవబీజములు గన్పించుచున్నవి. రుష్యాప్రజలు ఈ యుద్ధమునకు, రాజులును ధనికులును పెట్టుబడిదార్లగు వర్తకులును కారకులని గ్రహించి ప్రజాసామాన్యము ఎన్నిలక్షలు మరణించినను, తత్ప్రయోజన మంతయు ధనికులను ఇంకను ఎక్కువధనికులుగను పేదలను ఇంకను ఎక్కువ పేదలుగను మార్చునను నమ్మకముతో ప్రజలు కట్టుగట్టి యుద్ధము చేయమని నిశ్చయించుకొని విప్లవము సలిపి, రాజ్యాంగవిధానమును మార్చి, జారును పారద్రోలి, జర్మనీవారితో పరిపూర్ణములగు అపజయలక్షణములతోఁ గూడి వంచనపూర్వకమగు సంధిని బ్రెస్ట్‌లెటోవిస్కు-నొద్ద చేసికొనిరి. దీనికి కారణము మనకు తరువాత రుష్యాలో జరిగిన సందర్భములవలన స్పష్టము కాఁగలదు. ప్రక్కయింటివారితో చిన్నసందు తగాదాచే పోట్లాడుటవలన, ఇక్కడ ఇల్లంతయు గుల్ల అయి, నాశనమగుచు గబ్బిలములకు నిలయము అగుచుండ, సందును వదలుకొని, ఇంటిని చక్కబఱచుకొనుటయే శ్రేయస్సని రుష్యావారు తలంచి ఇట్లు చేసిరి. 1917-వ సం. మార్చిలో మొదటి విప్లవమును 1917-వ అక్టోబరులో రెండవ విప్లవమును జరిగినవి. అప్పటినుండి క్రమక్రమముగ విప్లవకారులు బోల్షివిక్కులు తమసంఘములను స్థాపించుకొని సురక్షితముగ రాజ్యము చేసికొనుచున్నారు. ఈసంఘములపేరే సోవియెట్ అనెదరు. సోవియట్లన్నియు వ్యవసాయకులయు కూలివాండ్రయు సిపాయి లయి సంఘములు పనిచేయువానికి ఈ సంఘములలో ప్రవేశము లేదు. పనిచేయువానికి లేని అధికారమును లేదు.

ఈ సంఘనిర్మాణమును గూర్చియు రాజ్యాంగవిధానమును గూర్చియు ఇంచుక సూచన మనము తెలిసికొనవలసి యున్నది. ప్రతిగ్రామమునందును ఒక్కొక్క సోవియట్ ఉండును. కొన్ని గ్రామములు కలిసిన మన ఫిర్కావలెనే రుష్యాలో ఓలోస్టు అందురు. ఓలోస్టు కొక్కొక్క-సంఘ ముండును. ఆ సంఘమునకు గ్రామసభలు ప్రతినిధుల నంపెదరు. మాసమున కొక్కొక్క-సారి 'ఓలోస్టు' మహాసభ జరిగి గ్రామవ్యవహారము లెల్ల పరిష్కరింపఁబడును. దీని కార్యనిర్వాహకసంఘము తక్కిన సమయసందర్భములయందు పరిపాలన సలుపుచుండును. ఓలోస్టు సంఘముల ప్రతినిధులు మండలసభికులుగను, మండలసభల ప్రతినిధులు రాష్ట్రీయసభికులుగను, రాష్ట్రీయసభల ప్రతినిధులు అఖిలరుష్యాసభా ప్రతినిధులుగను, నుందురు. ఓలోస్టు సంఘమువలెనే మండలసంఘమును రాష్ట్రీయసంఘములును అఖిలరుష్యాసంఘమును, సంవత్సరమునకు రెండుసార్లకు తక్కువ గాకుండ మహాసభలను జరిపి అందు పరిపాలనావ్యవహారములను చక్కఁబెట్టుచు మధ్యసమయములందు ఆయాసంఘములకు చెందిన కార్యనిర్వాహణసంఘములే పరిపాలనము చేయుచుండును. అన్ని విషయములందును పరిపాలనావిధాన మంతయు మన కాంగ్రెసు అంగవిధానమునే పోలియున్నది. రుష్యాలో ఎన్నికలు బహిరంగముగ జరుగును. ఎందుచేత ఇట్లు జరుగును ? పూర్వము 18-వ శతాబ్దమందు ఎన్నికలు రహస్యముగ జరుపుపద్ధతి నుపక్రమింపఁజేయుటకు సబబేమియో తెలిసికొనినచో ఈ సబబు తెలియఁగలదు. యజమానుల నుండి కూలివానికిని ధనికునినుండి దరిద్రునికిని అప్పు నిచ్చినవానినుండి పుచ్చుకొన్నవానికిని, భూస్వామినుండి వ్యవసాయకునికిని తొందర గలుగకుండ నుండుటకు ఇట్టి యుక్తి అప్పుడు కనిపెట్టఁబడెను. అప్పుడు బర్కువంటి మహావేత్తలు ఈ రహస్యపు ఎన్నికలను నిరసించిరి. కాని అప్పటినుండి ఇప్పటివఱకు ప్రబలియున్న సందర్భములో రహస్యపు ఎన్నికలు అనివార్యములై యుండినవి. ఎప్పుడు యజమానుడు కూలివాడు ధనికుడు దరిద్రుడు భూస్వామి వ్యవసాయకుడు అమ్మువాడు కొనువాడు అను విచక్షణ సమసిపోయెనో, అప్పుడే మొగమాటములకు గాని నిర్బంధమునకు గాని అవకాశములు గూడ సమసిపోయినవి. ఎన్నికలకు రహస్యము అనావశ్యకమైనది. ఇంతేకాక సోవియట్ల పద్ధతిలో ప్రతినిధులను పంపిన పిమ్మట పంపువారు ప్రతినిధుల కెన్నఁడును అనువర్తనులై యుండ నవసరము లేదు. ఎప్పుడు ప్రతినిధి ప్రజల యభీష్టమునకు వ్యతిరేకముగా సంచరించుచున్నట్లు అనుమానము కలుగునో అప్పుడు వారియందు ఆరోపింపబడిన ప్రాతినిధ్యమును రద్దు చేయుటకు రుష్యాప్రజలు అధికార ముంచుకొన్నారు.

ఈ సోవియట్లు, ఐరోపాఖండములో పూర్వము నుండియు ప్రజాప్రభుత్వమును బాధ్యతాయుత ప్రభుత్వమును గలిగియుంటి మని గర్వించు ఇంగ్లండు ఫ్రాన్సు ఇటలీ దేశస్థులకు రుచింపక, చిరకాలము సోవియటుపద్ధతి.

వారి యంగీకారమును బడసియుండలేదు. కడపటికి 'అపజయము పొందినచో తిరుగుబాటు. జయము పొందినచో మహావిప్లవము' అను ఆంగ్లలోకోక్తిని అనుసరించి జయముపొందిన యీ సోవియట్ (బోల్షివిక్) విధానము కాలక్రమమున వివిధరాజ్యాంగముల యంగీకారమును బడయుటయే గాక ఆయా రాజ్యాంగములెల్ల సోవియట్‌రష్యాతో వర్తకసంధి చేసుకొనుచున్నారు. మరియు రష్యాపై - స్త్రీలను సంఘముపాలు చేసిరనియు బిడ్డలను దేశముపాలు చేసిరనియు దుర్వాదంతులు వేసిన యాంగ్లేయ ప్రజలే ఈ సోవియట్ రుష్యానుండి ఒక్క వరమునుమాత్రము గోరుచున్నారు ఆవరమెట్టిది? "మేము మీతో వర్తకమ్ము చేయుదుము. మీ గోధుమపంట మాకు ఆవశ్యకము. అది లేకపోయిన మాకు తిండికి కష్టము. మా యంత్రసామగ్రి మీకు పంపెదము. ఇది లేనియెడల మీకు జరుగుబాటు కష్టము. కాని మీ బోల్షివిక్ భావములు మాదేశమునకు రాకుండ చేయుడు. అట్టి ప్రచారకులకు డబ్బును ఈయవద్దు" అని ఈ యొక్క వరమును ఆంగ్లేయులు రుష్యనులను ప్రసాదింపుమని కోరుచున్నారు. తమయొక్క సాంఘిక విధానము, తమ పెట్టుబడితనము, తమయొక్క పారిశ్రామికపద్ధతులు, నిలువవలెనని కోరెడు ఆంగ్లేయులు-ఇట్టి వరమును కోరుట సహజము. కాని రుష్యావారు ఆవరమును ప్రసాదించెదమని తాత్కాలికముగ నంగీకరించినను వారిప్రతిజ్ఞ ప్రపంచమునందెల్ల తమ దేశమున స్థాపింపబడిన రాజ్యాంగవిధానమువంటి విధానములే ప్రబలియుండవలెనని అయి యుండుటచే వీరి వాగ్దానమునందు ఆంగ్లేయులు విశ్వాసమును ఉంచజాలకున్నారు. రుష్యనులు పదార్థములను ఉత్పత్తిచేయు కార్యములయందు వృత్తులను కల్పించుకొనక, పంటలను పండించుకొనక, పనులుచేయక, జ్ఞానసముపార్జనయందు కాలము గడుపక, కేవలము పరభృతు లయి, జలగలవలె ఇతరుల రక్తమును పీల్చుకొని తన్నాశ్రయించుకొన్న ప్రజలకు ఇంచుకైన మేలు కలిగింపజాలని ఉన్నత తరగతులకును మధ్య తరగతులకును జెందియున్న ప్రజలను అంత్యము చేయుటయే లక్ష్యముగ నుంచుకొనుచున్నారు. అందుచేతనే ఇట్టివారికి వోట్లు నిచ్చుట లేదు. కాని పరిపాలనయందు పాల్గొనువారెల్లరు శరీరకష్టము చేయవలసినదని నిర్బంధము లేదు. ఉపాధ్యాయులకు ఉద్యోగస్థులకు వర్తకులకు సహాకారులకు ఎల్లరకు ప్రాతినిధ్యము గలదు. కావలసినదెల్ల సంఘముకొఱకు ప్రతి వ్యక్తియు పాటుబడవలయును. ఈ ధర్మమును అనుసరించియే, రాజ్యాంగమునకు అధ్యక్షుఁడగు లెనిన్ (Laenin) సేనానియును ట్రాట్స్కీయు, వారమునకొకసారి శని ఆదివారములలో చేతులతో పని చేయుదురు. మురుగుకాలువలు తుడుచుటయో రాళ్లు బ్రద్దలు కొట్టుటయో ఏదో ఒకపనిని ప్రతి రుష్యనుడును, వారమునకొకసారి ఒకగంటసేపైనను చేయవలయును. ఇట్లు దేశములో 100 కి 90 మంది రాజ్యాంగ విధానమునందు పాల్గొనుచున్నారు. అమెరికాలో గూడ ఇంతమంది పాల్గొనుట లేదు. చేతితో గాని బుద్ధితో గాని పని చేయువారెల్లరు సోవియట్ సభలయందు ప్రాతినిధ్యము కలిగియున్నారు. ఉపాధ్యాయులు వైద్యులు వీరెల్లరు ప్రాతినిధ్యము కలిగియున్నారు. ఆఱువారములకంటె ఈరాజ్యము నిలువదనుకొన్న సోవియట్ ప్రభుత్వము ఇప్పుడు శాంత పరిపాలనమును జరుపుచున్నది.

రుష్యాప్రభుత్వముమీఁద వేసిన యపవాదములు ఇన్ని అన్ని అని చెప్పుటకు వీలులేదు. మాస్కో-పట్టణము నంతయు ముప్పాతిక తగులఁబెట్టబడెనను వదంతికి ఆధారమంతయు అయిదిండ్ల దహనమే. జారుగారి 'క్రెమ్లిన్' అను మహాసౌధము నాశనము చేయబడెననుమాట విని పరిశోధింపగా ద్వారముయొద్ద నున్న ఒక శిలాప్రతిమయొక్క భాగమొకటిమాత్రము విరిగినటుల కనుపించెను. మఱియు నచ్చట సురక్షితముగ నున్న రెండు గోడలలో కొన్ని గుండ్లు రంధ్రములు కనుపించెను. కాని కొన్ని విపత్తులు జరిగినమాట నిజమే. రుష్యాలో పెద్ద ఉద్యోగులుగ నుండి యున్నవారు రైలువద్ద బాటసారుల సామాను మోసికొని పోవుచుండిరి. నిర్ణయింపఁబడిన కూలిమీఁద దమ్మిడియైనను ఈనాము అడుగుటకు వీలులేదు. పెట్రోగ్రేడ్ పట్టణములో ఒకరోజు మంచు విశేషముగా పడిన పిమ్మట శరీరపుష్టిగల ప్రతివాడును మంచును తీసివేయవలసినదని ఉత్తరువు చేసిరి. ఈ ఉత్తరవును ఇంటింటికి నుండు ఉపసంఘమువారు అమలుపరచిరి. సోవియట్లు అధికారములోనికి రాగానే బ్యాంకుగుమాస్తాలును కచేరిగుమాస్తాలును పూర్వపు అధికారులచే ప్రోత్సాహింపబడి సమ్మెకట్టిరి. వెంటనే "లెనిన్" క్రొత్తపరిపాలనాధ్యక్షుడు బ్యాంకుల సన్నిటిని పట్టుకొని యెంత భాగ్యవంతుడైనను సరే తన కుటుంబములో ఒక్కొక్క మనిషికి మాసమునకు

45 రూపాయలకంటె సొమ్మును పొందజాలడని ఉత్తరువుచేసెను. తక్షణమే ఈభాగ్యవంతులు సమ్మెకట్టిన వారిని పోషించుటకు డబ్బులేక సమ్మెను నిలిపివేసిరి. ఇంతియ కాక 'ఆకత్తుమీద అవమానమా ?' అన్నట్లు డబ్బుగలవా రందఱు-మాసవారి మనోవర్తి తీసుకొను నప్పుడు వరుసగా నిలువబడవలెనని ఉత్తరువు చేయబడెను. ఇందువలన రవ్వలు బంగారముతో మెరిసిపోతున్న స్త్రీలుకూడ ఇట్లు నిలువవలసి వచ్చెను.

ఈ అపవాద లన్నిటికి కారణ మేమనగా రష్యాలో పరిశోధనకు పోయిన ప్రేక్షకు లెల్లరు తమతమ దేశములోని కెల్ల భాగ్యవంతులు. రష్యాలోని విప్లవము భాగ్యవంతులను అధికారమునుండి తప్పించుటయే కాక భాగ్యవంతులు, పెట్టుబడిదారులు అను తరగతికి చెందిన వారిని నిర్మూలముచేయుటయే యని వీరు గ్రహింపజాలక రష్యాకుపోయినప్పుడెల్ల అచ్చట పరిస్థితులను వీరు అవగాహనచేసుకొనజాల. కున్నారు. విప్లవసమయమునందు జనులను విభజించునది యుద్ధముకాదు. ప్రవర్తనయే! విప్లవము లన్నియు జయప్రదములు కాకపోవచ్చును. విప్లవ మనునది ఒకచర్య కాదు. రాజకీయ జీవనమునందు ఒకకృత్యము కాదు. ఒకఅవస్థ. ఒకదశ. ఒకమార్పు ఒకపరివర్తనము. విప్లవ ప్రతికూలు రెల్లరు ఒకచర్య యని భ్రమించి దానిని నశింపచేయవలయునని ప్రయత్నము గావింతురు. ఆ ప్రయత్నమే ఈపరివర్తనమును బలపరచును. విప్లవము జయప్రదము కాకపోయినదని దాని ప్రముఖతను గోల్పోదు. ఫ్రాన్సు దేశముకు స్వేచ్ఛాస్వాతంత్ర్యములు లభింపకపోయినను ఐరోపాఖండములోని తక్కినదేశముల కెల్ల ఇట్టి స్వాతంత్ర్యస్వేచ్ఛలు కొంతవఱకు ప్రసాదింపబడెను. అపజయము పొందిన ఈఫ్రెంచివిప్లవమువలన 1795-1801 ల మధ్యభావప్రచారము వృద్ధియై, 19-వ శతాబ్దము మొదటిభాగమునందు జరిగినపోరాటములు ఎక్కువ తీవ్రముగ నడుపబడెను. పోరాటములయందు అనేకదీపములు వెలిగింపబడెను. ఈదీపావళి విప్లవమనెడి సూర్యాస్తమానంతరము వీచిన మహాతుపానులో రక్షింపబడెను. విప్లవములు అపజయములైన నేమి ? అమెరికా ఇంగ్లండు ఫ్రాన్సు, జర్మనీ మున్నగు దేశములలో అపజయము పొందినభావ మెద్దియో తెలియనిమ్ము. ఎట్లు అపజయముపొందెనో ఎవరు మోసపుచ్చిరో, ఎవరు దానిని భావవిధ్వంసము గావించిరో బహిరంగము కానిమ్ము. మనుష్యుని జీవితమునకు ఉత్సాహము కల్పించునవి కార్యములు కావు. ఆకార్యములను ప్రేరణ సేయు మహోద్దేశములు. ఎన్నిపక్షులు బాల్యమునందెగురుటను ప్రయత్నించుటను మనము చూచుట లేదు? ఆ నిశ్చిత విషయమును ఎవరు నశింప చేయగలరు? అనంతరము ఈ పక్షు లన్నియు నొకదాని తరువాత నొకటి విరిగిన ఱెక్కలతో నేల పడిన నేమి ?

రుష్యావిప్లవము ఇటీవలనే జరిగిన కారణముచే అందలి సత్యాసత్యములు గ్రహించుట కష్టము. కాని సోవియట్లన నేమో, విప్లవముయొక్క పథక మెద్దియో ఫలితము లెవ్వియో, ఎల్లరు తెలిసికొనవలసి యున్నది. రుష్యాలో పనిచేయు ప్రతివారును ప్రతివ్యవసాయకుడును తన స్థానిక సోవియట్‌నందు ప్రతినిధిని ఎన్నుకొను హక్కు గలిగియున్నా డనియు, స్థానిక సోవియట్లు అఖిల రుష్యా సోవియట్ సభకు ప్రతినిధుల నెన్నుకొను హక్కుకలిగియున్నారనియు ఇదివఱకే చెప్పియున్నాము. ఈ అఖిలరుష్యా సమావేశము తమప్రతినిధులలో 5 గురికి ఒక్కొక్కరిచొప్పున గలిగిన ఒక కార్యనిర్వాహక సంఘమును ఎన్నుకొనును. ఈసంఘమే మంత్రివర్గమును నియమించుటకును తీసివేయుటకును అదుపులో నుంచుటకును అధికారము గలిగియున్నది. రాజ్యాంగనిర్ణయము లన్నియును ఈకార్యనిర్వాహకసంఘముచే గావింపబడి పిమ్మటమంత్రివర్గముచే శాసనముగజాహిర్ చేయబడును. అఖిల రుష్యామహాసభ సమావేశమగునపు డెల్ల కార్యనిర్వాహసంఘము తనపదవికిరాజీనామా నిచ్చి క్రొత్తసంఘ మేర్పడుటకు అవకాశ మొసంగును. అప్పుడు కార్యనిర్వాహక సంఘముయొక్కయు మంత్రివర్గముయొక్కయు చర్యలను అఖిలరుష్యా మహాసభ తనిఖీచేయును. ఈపథకములో అపూర్వవిషయము ఎద్దియన ఎన్నుకొనువారు ఎన్నుకొనబడువారిని ఎప్పటికప్పుడు సందర్భానుసారముగ వారిపదవులనుండి తప్పింపవచ్చును.

### భూమి

భూమి యావత్తు ప్రజలదై దాని నాశ్రయించి పనిచేయువారిచే పాలింపబడుచున్నది. సంఘమే పొలములకు అవసర మగు పనిముట్లు విత్తనములు వగైరా పరికరములను ఇచ్చును. పనిచేయువారు ప్రత్యేకముగా గాని పరపతిసంఘముల మూలముగా గాని ఇట్టి ఏర్పా

టులు చేసికొనవచ్చును. ఒకరిచేత పనులుచేయించుట యనునది లేదు. ఒక్కపనివాడును జబ్బుగానుండి పని చేయలేనిచో, వానిపని మఱియొకరిచేత సంవత్సరములో జరిగేది రెండు సంవత్సరములలో జరుపబడును. అప్పటికిని శరీరారోగ్యము వానికి కలుగనిచో వానికి మనోవర్తి ఇయ్యబడును. భూమి తక్కువ అయి పని చేయువారిసంఖ్య అధికమగుచో ప్రక్కన విడిభూమిగల జిల్లాలకు పోయి పనిచేయు నేర్పాట్లు గావింపబడును.

### గృహములు

పట్టణపరిపాలన సంఘమువారు ఖాళీస్థలములను స్వాధీనముచేసికొని ఇండ్లులేనివారికిని ఇరుకులోనుండు వారికిని అనారోగ్యస్థలములలో నుండువారికిని సమానముగా పంచి ఇచ్చెదరు. ఇండ్లు తక్కువగా నుండుచోట్ల మనిషి 1-కి గాని ఇద్దరు పిల్లలకుగాని ఒక్కొకగదిపద్ధతిని పంచుదురు. కలపలేనివారికి, దీపముల వసతిలేని వారికి, ఉచితముగా సంఘమే ఏర్పాట్లు చేయును. ఇండ్లమీద నూటికి 90 కంటె ఎక్కువగా పన్ను వేయుటచేత అవి సత్వరముగ ప్రత్యేకముగ ఒక్కని ఆస్తి అగుటకు మారుగ సొవియట్ సంఘము ఆస్థి యగుచున్నది. రష్యాలో ఇండ్లు పెద్దరాళ్లచే కట్టబడుటచే, ఈరాళ్ళను ఏర్పాటుచేయుటకును సంఘపుపనులను నెఱవేర్చుటకును గృహసంఘములు ఏర్పాటు చేయబడును.

రుష్యాలో 150 రూ. మొదలు 210 రూ వఱకు మ 1 కి నిర్ణీతమగు కూలియున్నది. ఎవరికిని రెండు పనులకు కూలి ఇవ్వరు. రెండవపనిచేసేవాఁడు డబ్బులేకుండా చేయవలయును. శరీరకష్టముతో పనిచేయువారికి 210 రూపాయలును, నిలకడగా కూర్చుని పనిచేయువారికి 150 రూపాయలును, "ప్రవడ" అను బోల్షివిక్కుల దినపత్రికా సంపాదకునకు 150 రూ. జీతమును, ఆపత్రిక అచ్చుకూర్చువారికి 210రూ. జీతమును రాజ్యాంగమునకు అధ్యక్షుడయిన "లెనిన్" అను ప్రధాన మంత్రికిని 150 రూ. జీతము ఇత్తురు. చివర ఇద్దరకును కాపురమునకు ఇల్లుమాత్రము పైని ఇచ్చెదరు.

### పనిలేమి

పనిలేనప్పుడు పనిచేయుచున్నప్పటి జీతము సర్కారువారు ఇచ్చెదరు.

### విద్య

అక్షరాభ్యాసము మొదలు పట్టపరీక్షవఱకు ఉచితముగా చదువు చెప్పుదురు. అన్నిచోట్ల క్రొత్త కళాశాలలు, క్రొత్తపద్ధతులు ఉత్పన్న మగుచున్నవి.

### బాల్యములో కూలి

20 సంవత్సరముల లోపుగల వారెవరును కూలి చేయుటకు వీలు లేదు. అంతవఱకు ఎక్కడనైన ఒక్కచోట చదువుకొనవలయును. అట్లు బిడ్డలకు చదువు చెప్పించుటకు తల్లిదండ్రులకు తగినసౌకర్యము లేర్పఱుపబడును.

బోల్షివిక్కులు దండయాత్రలు చేసి, ఇతర దేశములను స్వాధీనపఱచుకొనెద రని యొక దుర్వదంతి కలదు. వీరి భావప్రచారమునకై శ్రమచేయుదురే కాని ప్రాంతవ్యాపకమునకు ఎంతమాత్రము వీరికి కోరిక లేదు. ఇందుకు నిదర్శనముగ 1917 వ సం. 12-వ నవంబరు తేదీ గల ఈ దిగువ శాసనము చూడుడు :—

"ఇంక నిరంకుశ ప్రభుత్వ మనెడి కాడిక్రింద తలయుంచిన రుష్యాలోని కొన్నిజాతులవారి విషయమై, వారివిమోచనమే మా కర్తవ్యమును పరమధర్మమును అని చెప్పుచున్నారము. జారుగారికాలములో అంతఃకలహములు పెంచబడినవి. ఇందువలన పరస్పర హత్యలు బానిసత్వము సంభవించినవి. లజ్జాకర మగు ఈనీతిని తిరిగి అవలంబింపజాలము. ఇదివఱకు ప్రబలియున్న అవిశ్వాసము మోసము కయ్యమునకు పురికొల్పుట అనుపద్ధతికి బదులుగ, బహిరంగమైనట్టియు, నిజాయతీకూడియున్నట్టియు, నీతిని పెంపొందించి పరస్పరవిశ్వాసమును ప్రజలకు నమ్మకమును గలిగించెదము. అప్పుడే రుష్యాప్రజలు స్వార్థపరు లగుకట్టియు సామ్రాజ్యాపేక్ష గలిగినట్టియు ధనికుల యొత్తిడిని తప్పించుకొనగలరు.

కావున సోవియట్లు అభిమతమును అనుసరించి వారిచే నియమింపబడిన మంత్రివర్గమువారు ఈదిగువ ధర్మములను ప్రచారము చేయుచున్నారు.

1. రుష్యాలోని ప్రజలకు సర్వసమత్వము స్వామ్యత్వము.

2. వ్యక్తత గలిగిన ప్రతిప్రజాకూటమునకును స్వయంనిర్ణయ ధర్మమును అనుసరించి అవసరమైతే ప్రత్యేక రాజ్యాంగ విధానమును గూడ నియ్యవలెను.

3. జాతి మత భేదములపై నాధారపడియుండు ప్రత్యేకపు హక్కులున్ను ప్రత్యేకపు స్వాతంత్ర్యము సహింపబడవు.

**4. రుష్యాదేశములో నివసించుచు, అల్పసంఖ్యాకులుగ నుండు జాతిమత వర్గములవారెల్లను స్వేచ్ఛగ నభివృద్ధి చెందవలెను.**

ఇన్ని వాగ్దానము లొసంగబడినను యూక్రేన్ ఫిన్‌లండు దేశములపై వీరేల దండెత్తిరని ప్రశ్నింపవచ్చును. ఆయా ప్రాంతములలో సోవియట్లు స్థాపింపబడినప్పుడు ఆయా ప్రాంతములలో నుండు పెట్టుబడిదారులును భాగ్యవంతులును ప్రజాస్వామిక ప్రతిష్ఠాపనలగు నీ సోవియట్లను నశింపచేయ యత్నింపగా రుష్యా రాజ్యాంగమువారు తమ విప్లవాదర్శములను పెంపొందించు సోవియట్లకు దేశములకు గాని అనగా ఈ దేశములకుగాని, పోలండు పర్షియా లిథ్యుయేనియా మున్నగు ఇతరదేశములకు గాని వారు సైనికసహాయము గావించినపుడు ఆదేశములో నొకతెగవారి ఇష్టముమీద నాతెగవారికి సహాయము చేసి ప్రజాస్వామికము స్థాపించుటకే అట్టి సంబంధమును గల్పించుకొనిరి గాని రాజ్యము నాశించి కాదు. బోల్షవిక్కు రుష్యాలో స్త్రీలును బిడ్డలును సంఘముపరము చేయుటకు బదులుగ వ్యభిచారము నశించినది. బిడ్డలకు పాఠశాలలలో భోజనము పెట్టుదురు. కళాశాలలయందు ప్రజలెల్లరకును చదువు ఉచితముగ గఱపబడును. ఎప్పుడీ ఆస్తి రద్దుఅయినదో అప్పుడే న్యాయశాస్త్రశిక్ష కళాశాలలనుండి ఎత్తివేయబడినది. దీనితోఁబాటు పౌరోహిత్యపువిద్యయు ఆపుదలచేయబడినది. మంత్రివర్గము వారు వచ్చి కళాశాలలో సంవత్సరముల తరబడి పాఠముల మూలమున బోధించువిద్యను గంటలలో ఉపన్యాసములవలనను ప్రదర్శనములవలనను నాటకముల మూలముననను ముగించుచున్నారు. పూర్వము రుష్యాచక్రవర్తిగారు నివసించు క్రెమ్లిన్ సౌధము ప్రజలకు విశ్వవిద్యాలయముగ మార్పఁబడినది. అచ్చటి అపరూపములగు చిత్తరువులు కళాకౌశలతను దెలుపు పదార్థములును అత్యంత శ్రద్ధతో జాగ్రత్తచేయఁబడి ప్రతిగదియందును ప్రతిమందిరమునందును ఆయావస్తువులను గూర్చి పూర్ణముగఁ దెలిసియున్న వారిని ప్రజలకు బోధించుటకుగాను అధ్యాపకులుగ నియమించుచున్నారు. విద్యయంతయు దేశానుగుణ్యముగ ప్రజలా భాగ్యభోగ్యములకు అభివృద్ధికరముగ నుండునట్లు మార్పఁబడినది. కళలు సంగీతము సాహిత్యము రాజ్యాంగమంయొక్క ప్రత్యేకపు ఆదరణను పొందుచున్నవి.

ప్రతిపురుషుఁడును ప్రతిస్త్రీయును ఏద్దియో యొకవిధమున పని చేయుచుండవలెను. ఆప్రకారము ప్రతివ్యక్తికిని తన పనివృత్తాంతమును దెలుపు పుస్తకముండును. ఆ పుస్తకమునందు ఎవరియొద్ద ఏజీతముమీద ఎంతకాలము పనిచేయునదియు తెలుపబడును. ఎప్పుడైన సక్రమముగఁ బనిచేయువారు పనిగలిగియుండనిచో వారికి రాజ్యాంగమునుండి భృతి ఇయ్యబడును. సంవత్సరమునకు కొన్నివారములు ప్రతిమనుష్యుఁడును విరామమును బొందగలడు. గర్భవతి యగు ప్రతిస్త్రీయును ప్రసవించకపూర్వము 6 వారములును, పరము 8 వారములును ఉచితముగ రాజ్యాంగముచేఁ బోషింపబడును. ప్రతి మనుష్యుఁడును శనివారమునాడు ఒక్కొక్కచోట ప్రజాహితైకమగు చేతిపనిని చేయవలసియున్నది ఈ ప్రకారము 1 వ మే తేదిని దేశమునకై పాటుబడు ఒకపుణ్యభూమియందు 60,000 చెట్లు ఒక్కరోజున నాతిపెట్టఁబడి అంతవఱకు ఎడారిగ నున్న ప్రదేశము దేదీప్యమానముగ ఉద్యానవనమై శోభిల్లుచుండెను. ప్రతివాఁడును వృత్తిరూపకముగ శరీరశ్రమతో గాని బుద్ధివినియోగముతో గాని కూడిన పనిని చేయవలెను. అట్లు చేయనివారికి భుక్తియు లేదు వోట్లును లేవు.

రుష్యాలో ఇచ్చిపుచ్చుకొనుటకు నవకాశములు లేవు. ప్రతిపనివానికిని ఒక చీటి ఇచ్చిన ఆచీటి ఒకసహకార పదార్థనిలయమునందు చూపి అతను తనకు వలయు భోజనపదార్థములును బట్టలను తెచ్చికొనఁగల్గును. ఈ సంఘమువారు ఈ చీట్లను ఎవరిపనిచోటికి వారి చీటిని పంపించి జమాఖర్చు చేతురు. వ్యవహారములన్నియు జమాఖర్చులవలననే పరిష్కరింపబడుచున్నవి. బ్యాంకులలోని భాగ్యవంతులు ధనమంతయు వారు అనుభవించుటకు వలనుపడదు. కాని మాసమునకు 1200 రూ. వఱకు వారికి పరపతి ఇయ్యబడును. కూలివానికిని తగినన్ని జీతములున్నవి. రైళ్లమీద ప్రయాణమునకు ఎవరును డబ్బును ఇయ్యనక్కఱలేదు. ఉత్తరములకు తపాలాఖర్చులు లేవు. త్రాగుటకు కల్లుసారాయులు లేవు. ఎప్పుడు సహకారసంఘములమూలమున క్రయవిక్రయములు జరుగుచున్నవో అప్పుడే అమ్మువాడే కొనేవాడు - కొనేవాడే అమ్మువాడు - అగుచున్నారు. మధ్యనుండు వర్తకులు కేవలము ధనమునే పూజించి ధనమూలమున లాభములను బొందువారు నిర్మూలము చేయబడినారు. ఈ తత్వబోధ యంతయు

నలుపుటకు ప్రత్యేకపు శిక్ష. ప్రజలకు ఆఱువారముల కాలము మొదలు ఆఱుమాసముల కాలమువఱకు మారుచుండును. విధానముల మూలమున నేర్పబడుచున్నది. అన్నము లేనివాడు లేడు. చదువులేనివాడు లేడు. భాగ్యవంతుడు లేడు. పేదవాడు లేడు. అమ్మువాడు లేడు. కొనువాడు లేడు. సోమరి లేడు. పనిభారముచే క్రుంగిపోవువాడు లేడు. రక్షించుభటుడు లేడు. రక్షింపఁబడు తిండిపోతులు లేరు. ఇట్టి మహావిప్లవము అనేక సందర్భములలో అసంపూర్ణముగను అపర్యాప్తముగను ఉండవచ్చును. కొన్ని సందర్భములలో అసంతృప్తికరముగ నుండవచ్చును. ఎన్నడైనను ఆశాభంగకరముగ నుండవచ్చును. కాని ఆర్యావర్తముయొక్క యుగధర్మములను గుర్తెఱిగిన మనకు ఈ నూతన విధానము కృతయుగ లక్షణసమన్వితమై తనరారుచున్న దనుటకు సందియము లేదు.

# కొండవీడు

## దువ్వూరు రామరెడ్డి గారు

సాంధ్యరాగాంకితాంభోద శకలచయము
లనెడి కీలల నిర్మగ్నుఁ డయ్యె నినుఁడు;
శర్వరీకాంత కుంతల చ్ఛాయలందు
నెలవుకొనె విషాదపు రామణీయకంబు.

తే. గీ. కొండవీటి దుర్గంబునకు సమీప
మున నొకానొక కేదారమునఁ గృషీవ
లార్భకుఁడు దున్నుచుండి సూర్యాస్తమయము
గాఁగఁ దలపోయుచుండె నాగలిని విప్ప.

చ. ఇటుఁ దలపోసి పూనుకొను నెద్దుల నిల్వఁగ మేడి నూని సం
తట, మొనకఱ్ఱులోఁ దవిలి ధారుణిఁ జీల్పఁగ నందు వెండి సం
పుట మటు పుఱ్ఱపై వెడల భూతమటంచును గేకవైచి య
చ్చటఁ బనిసేయు తండ్రిఁ దనచక్కికి రాఁ బిలిచెన్ భయంబునన్.

చ. తనయుని వెఱ్ఱికేకలకుఁ దందరలాడుచు వృద్ధుఁడేమిరా
యని పరుగెత్త, సీరపథమందునఁ బుఱ్ఱను జూపి బాలకుం
డను, నిది యేమి తండ్రి! తల యాకృతిగల్గినరాయి దున్నుచుం
డిన వసుధార్ద్రగర్భము వడిస్వెడలెం గనుఁ గొమ్ము నావుడున్.

గీ. కృషికుఁ డంతటఁ బుఱ్ఱను గేల నెత్తి
యశ్రు ధారాభిషేకంబు నలవరించి
భయమునను సంభ్రమంబునఁ బలుకకున్న
తనయునిం గాంచి గద్గదధ్వని వచించె.

గీ. మాతృదేశ పరాయణమానసు లయి
సలిపి రిచ్చోట రెడ్డివీరులు రణంబు
కత్తికంట్ల నమూల్య రక్తంబు దొరఁగి
కీర్తి వల్లికపాదు క్రిక్కిఱిసి నిండ.

గీ. శ్యామలాకాశ వీథి నక్షత్రము లటు
కాలవాహినీ తటములఁ గానిపించు
రెడ్డి వీర కుమార చరిత్రపాద
చిహ్నములు మృతశౌర్యంబు చివురువెట్ట.

మ. అరివీరుల్, పులిగర్జలన్ విని కురంగానీకముల్ కాననాం
తరముం జొచ్చెడు పోలికన్ రణమునన్ ధైర్యంబు వోనాడి యే
డ్తెఱఁ బర్వన్, భుజవిక్రమంబు బలమున్ దీపింపఁ, బోరాడి కీ
ర్తిరమం గాంచి ధరిత్రిగర్భమున శాంతిం బొందుదారల్ నృపుల్

తే. గ. అట్టి శూరాగ్రగణ్యుల యందునొక్క
పురుషుశిరముగఁ దోఁచు నీ పుఱ్ఱ, తనయ!
దీని వీక్షించినంతనే స్తిమితమైన
నాదు రక్తంబు సైత ముష్ణముగఁ బారె.

చ. అనవిని బాలకుండు జనకా! మనవార లెవారు? వారికిన్
మనకును బూర్వమెన్నఁ డయినం గల చుట్టఱికంబుఁ దెల్పుమా
యనఁ, దలయూఁచి వృద్ధుఁడు, దిగంతములన్ బలమయ్యెఁ జీకటుల్
మనము గృహంబు సేరునెడ మార్గమునన్ వచియింతు నంతయున్.

క. అని యెద్దులఁ బోఁదోలుచుఁ
దనయుండును దాను నింటిదారి నడచుచున్
మును గొండవీటి నేలిన
జనవంద్యుల రెడ్ల పూర్వచరితలు వినిచెన్.

గీ. పూర్వవీరుల ధమనులఁ బొంగినట్టి
రక్తపూరంబె మనలోనఁ బ్రజ్వరిల్లుఁ
గాని, కాలభరంబునఁ గండ లెల్ల
శాంత కర్షకవృత్తి దాస్యమునఁ దవిలె.

ఉ. ఒక్కక్షణంబునన్ గగన ముల్లసితంబుగఁ జేసి యుల్క వే
ఱొక్కక్షణంబులో మఱుగునో జగరెడ్ల ప్రతాప వహ్ని న
ల్దిక్కులనుండి యాంధ్రమహిఁ దేజము నిమ్మడిచేసి మోసపుం
డక్కులెఱుంగకుంట, నకటా! యలకత్తుల బావిఁ జెన్నఱెన్.

గీ. ఇటులఁ జెప్పెడి నంతలో నిల్లుసేరి
యెద్దులను దొడ్డిఁ ద్రోలిరి యిరువు రపుడు.
కొడుకు మనమున నిసియెల్లఁ గొండవీటి
స్వప్నమే దక్క, మఱియొండు స్మరణ లేదు.

ఉ. కత్తికి నడ్డులేక రిపుఖండన లీలల నారితేఱి భూ
పోత్తములన్ యశంబుగన నుర్విఁ బాలన చేసినట్టి రె
డ్లిత్తఱి సీరచోదకపు వృత్తిగ్రహించిరి పోటుకత్తులున్
నెత్తుటఁ ద్రుప్పుపట్టి చెడనే చెడె శూరత యంతరించుటన్.

మ. పరవీరావళి ప్రాత్పుటంబులను జీల్పన్ శక్తిమతంబులై
దురమందున్ మెరుపట్లు శోభిలిన కత్తుల్, నేఁడు రూపాంతర
స్ఫురణన్ సీరములందుఁ గఱ్ఱులుగ నేపున్ సొంపు వోనాడి యీ
ధరణీగర్భముఁ జీల్చుచున్న యవి శాంత ప్రక్రియం గోరుచున్!

జయప్రదమైన అత్యుత్తమగు మందులు!!

# పరమహంసక్రియా వైద్యశాల.

గవర్నమెంటు ఫారెస్టు డిపార్టుమెంటులోనుండి ఘోరాటవులను దిరిగి, అందుండు పరమహంస క్రియాకుశలురగు అనేకమంది మహానీయులనుండి, మూలికాదులచే భస్మాదులను తయారుచేయు కొన్ని మహాయోగములు సంపాదించి, అనేక వ్యాధులను బాగుచేసి, గొప్ప రాజాబహద్దర్లవల్ల సహా మెప్పువడసి యోగ్యతాపత్రికలను బొందిన రాజవైద్య పి. వి. యస్. రావు, యీ వైద్యశాలను బెజవాడలో స్థాపించిరి.

రజితత్రివంగం:—వెండి, తగరము, సీసము సత్తు యీ నాల్గింటిని గలపి మూలికచే భస్మము చేయబడెను. దీనిని సేవించుటచే శుక్లనష్టము, ప్రమేహము, దగ్గులు, క్షయరోగము, వైశ్యములు, సర్వమేహములు వీటిని హరించును. బలము బుద్ధిబలము వీర్యవృద్ధి, ధాతుస్థయిర్యము వీటిని గలుగజేయును. మోతాదు పూటకు ఒక గురిగింజప్రమాణం, వెన్నతోగాని, నేతితోగాని మెత్తనిపంచదారతోగాని కలిపి సేవించవలెను.

పావుతులంఖరీదు రూ. 5. అరతులంఖరీదు రు. 9-8-0 తులం రు. 18.

నాగసిందూరం:—మూలికచే భస్మంపై సిందూరించును. దీని గుణము:—(బసవరాజీయము) ॥ శతనాగబలం ధత్తే మృతనాగో నుజాపహః । ఆయుః కాంతిం వీర్యవృద్ధింపులతే సేవయేత్సదా॥ తా॥ నాగభస్మము నూరు ఏనుగుల బలమును గలుగంజేసి సర్వరోగముల హరింపజేయుటయే గాక, ఆయుర్వృద్ధిని, కాంతిని, వీర్యవృద్ధిని గలుగజేయును. కావున దానినెల్లప్రదు సేవింపుచుండవలయు. మోతాదు పూటకు ఒకగురిగింజ ప్రమాణము.

వెన్నతోగాని, నేయితోగాని, మెత్తని పంచదారతోగాని కలిపి సేవింపవలయును.

పావుతులం ఖరీదు రు. 4 అరతులం ఖరీదు రు. 7-8-0 తులం ఖరీదు రు. 14.

సెగమందు:—పచ్చసెగ, తెల్లసెగ, ఎర్రసెగ, రక్తసెగ మొదలగు సెగరోగములన్నియు హరించును.

బుడ్డి 1-కి రు. 1-8-0.

మూత్రరోగనారి:—సెగలు జీర్ణించుటచే గలిగిన బాధ, రక్తము, రాళ్లు, తొలకలు, శుక్లము, సుద్దకట్టు మొదలగు వాటితోగూడి, బొట్లు బొట్లుగగాని, సన్నగిలిగాని, విస్తారముగ గాని, [illegible]గాని వెలువడిన మూత్రవ్యాధులను మూత్రబద్ధమును హరించును. బుడ్డి 1-కి 1-8-0.

సవాయిమందు:—ఒళ్లులు, అడ్డగ్రంథులు, పుండ్లు, బొగ్గ, చిట్లి గంగి, పొక్కులు, నిసపొక్కులు, పల్లిక, చిడుప, రొమ్ము, మూత, కొరుకు, కోడిజుట్టు, బొకణాసి, కీళ్ల, పుచ్చు, దమ్ము మొదలగు సవాయివ్యాధులను హరించును బుడ్డి 1-కి రు. 1-8-0.

సవామేహాంతకం:—సవాయిరోగములు జీర్ణించుటచే కలిగిన పొడలు, మచ్చలు, భగంధరములు, గంట్లు, గండమాలలు, వ్రణములు, కుష్టు మొదలగు మహావ్యాధులు అంతరించును. బుడ్డి 1-కి రు. 2-0-0.

N. B. వ్యాధుల పుట్టుక ప్రస్తుతపుస్థితి తెలిసినయెడల స్పష్టముగా తెలియజేయవలయును. పైరోగములు ఎంతచిరకాలబాధితములై ఎట్టి దుస్తరస్థితియందున్నను వానిని కడ్డి, శస్త్రము, యింజక్షన్ ఏదియు చేయకుండా, ఔషధములచే గ్యారంటీగా బాగుచేయబడును. హిందూదేశీయ ఋషీశ్వర ఆయుర్వేద శాస్త్రములందు వక్కాణించబడిన మహాయోగములచే తయారుకాబడిన యీ భస్మౌషధముల మహిమను లోకమంతటను వెల్లడించి, వీటిని అభివృద్ధిలోనికి దెచ్చుటకును ధనవ్యయప్రయాసలు లేకుండగ పేదసాదల కుపకారార్థము కొరకును, యిండియా, బర్మా, సిలోనులున్నగు దేశములో 1000 చందాదారులు గావలయును.

సంవత్సరమునకు చందా రు. 5. ముందు తమ చిరునామాతో మనియార్డరుద్వారా పంపవలయును. మొదటి 1000 చందాదారులకు, పైనవివరింపబడిన యేదొక వ్యాధికైనను నెలకొక బుడ్డిచొప్పున ఔషధము ఒక సంవత్సరమువరకు ఉచితముగా పంపబడును.

(పోస్టేజీ వగైరాలు ఔషధములు తెప్పించుకొనువారే భరించవలయును)

పరమహంస క్రియా వైద్యశాల, ఆవులవారిసందు, బెజవాడ. (కృష్ణాజిల్లా.)

జయప్రదమైన అద్భుతమగు మందులు!!

# పరమహంసక్రియా వైద్యశాల.

గవర్నమెంటు ఫారెస్టు డిపార్టుమెంటులోయుండి ఘోరాటవులను దిరిగి, అందుండు పరమహంస క్రియాకుశలురగు అనేకమంది మహనీయులనుండి, మూలికాదులచే భస్మాదులను తయారుచేయు కొన్ని మహాయోగములు సంపాదించి, అనేక వ్యాధులను బాగుచేసి, రాజాబహద్దరుగల్ల సహా మెప్పువడసి యోగ్యతాపత్రములను బొందిన రాజవైద్య పి. వి. యస్. రావు, యీ వైద్యశాలను బెజవాడలో స్థాపించిరి.

రజితత్రివంగం:—వెండి, తగరము, సీసము సత్తు యీ మూడిటిని కలపి మూలికచే భస్మము చేయబడెను. దీనిని సేవించుటచే శుక్లనష్టము, ప్రమేహము, దగ్గులు, క్షయరోగము, వైల్యములు, సర్వమేహములు వీటిని హరించును. బలము బుద్ధిబలము వీర్యవృద్ధి, ధాతుస్థయిర్యము వీటిని గలుగజేయును. మోతాదు పూటకు ఒక గురిగింజప్రమాణం, వెన్నతోగాని, నేతితోగాని మెత్తనిపంచదారతోగాని కలిపి సేవించవలెను.

పావుతులంఖరీదు రు. 5. అరతులంఖరీదు రు. 9-8-0 తులం రు. 18.

నాగసిందూరం:—మూలికచే భస్మంబై సిందూరించును. డిటో గుణము:—(బసవరాజీయం) శతనాగబలం ధత్తే మృతనాగో రుజాపహః । ఆయుః కాంతిం వీర్యవృద్ధిం కురుతే సేవయేత్సదా॥ తా॥ నాగభస్మము నూరు ఏనుగుల బలమును గలుగంజేసి సర్వరోగముల హరింపజేయుటయే గాక, ఆయుర్వృద్ధిని, కాంతిని, వీర్యవృద్ధిని గలుగజేయును. కావున దానినెల్లప్పుడు సేవింపుచుండవలయు. మోతాదు పూటకు ఒకగురిగింజ ప్రమాణము.

వెన్నతోగాని, నేయితోగాని, మెత్తని పంచదారతోగాని కలిపి సేవింపవలయును.

పావుతులం ఖరీదు రు. 4 అరతులం ఖరీదు రు. 7-8-0 తులం ఖరీదు రు. 14.

సెగమంట:—పచ్చసెగ, తెల్లసెగ, ఎఱ్ఱసెగ, రక్తసెగ మొదలగు సెగరోగములన్నియు హరించును.

బుడ్డి 1-కి రు. 1-8-0.

మూత్రరోగహారి:—సెగలు జీర్ణించుటచే గలిగిన బాధ, రక్తము, రాళ్లు, తొరకలు, శుక్లము, సుద్దకట్టు మొదలగు వాటితోగూడి, బొట్లు బొట్లుగగాని, సన్నగిలిగాని, విస్తారముగగాని, దానంతటదిగాని వెలువడిన మూత్రవ్యాధులను మూత్రబద్ధమును హరించును.

బుడ్డి 1-కి 1-8-0.

సవాయిమందు:—బిళ్లలు, అడ్డగఱ్ఱలు, పుండు, బగ్గి, చిట్లపరంగి, పొక్కు, రసపొక్కు, పల్లెక, చిడప, రొచ్చు, మూత, కొరుకు, కోడిజుట్టు, బొకణాసి, కీళ్ల, మచ్చ, దచ్చు మొదలగు సవాయివ్యాధులు హరించును బుడ్డి 1-కి రు. 1-8-0.

సవామేహాంతకం:—సవాయిరోగములు జీర్ణించుటచే కలిగిన పొడలు, మచ్చలు, భగంధరములు, లూటీలు, కండమాలలు, వ్రణములు, కుష్టు మొదలగు మేహవ్యాధులు అంతరించును. బుడ్డి 1-కి రు. 2-0-0.

N. B. వ్యాధుల పుట్టుక ప్రస్తుతపుస్థితి తెలిసినంతవరకు స్పష్టముగా తెలియజేయవలయును. పైరోగములు ఎంతచిరకాలబాధితములై ఎట్టి దుష్కరస్థితియందున్నను వాటిని కడ్డి, శస్త్రము, యింజక్షను వీటిపనియును లేకుండా, ఔషధములచే గ్యారంటీగా బాగుచేయబడును. హిందూదేశీయ ఋషివరుల ఆయుర్వేదోక్తములగు మూలికాదులచే తయారుకాబడిన యీ భస్మౌషధముల మహిమను లోకమంతటను వెల్లడించి, వీటిని అభివృద్ధిలోనికి దెచ్చుటకును ధనవ్యయప్రయాసలు లేకుండగ పేదసాదల కుపకారార్థము కొరకును, యిండియా, బర్మా, సిలోనునున్నగు దేశములలో 1000 చందాదారులు కావలయును.

సంవత్సరమునకు చందా రు. 3. ముందు తమ చిరునామాతో మనియార్డరుద్వారా పంపవలయును. మొదటి 1000 చందాదారులకు, పైనవివరింపబడిన యేఒక్క వ్యాధికైనను నెలకొక్క బుడ్డిచొప్పున ఔషధము ఒక సంవత్సరమువరకు ఉచితముగా పంపబడును.

(పోస్టేజీవగైరాలు ఔషధములు తెప్పించుకొనువారే భరించవలయును)

పరమహంస క్రియా వైద్యశాల, అవులవారిసందు, బెజవాడ. (కృష్ణాజిల్లా.)

# మన నాణెములు — చలామణి పద్ధతి

కళా వేంకటరావు గారు

ప్రస్తుతపు పరిస్థితులఁ బరికించుటకుఁ బూర్వము ప్రాచీనపద్ధతులను పరామర్శించుట మంచిది. క్రీస్తుశకమునకుఁ బూర్వముగూడ, మనదేశపు చక్రవర్తులు, బంగారు వెండి నాణెము లుపయోగించినటుల చరిత్రపాఠకులకు విదితమే. గ్రీకుదేశజుఁ డగు అలెగ్జాండరు చక్రవర్తి హిందూస్థానమును జయించునప్పటికే, తక్షశిలానగరమునందు, నాణెములు వాడుకలో నుండె ననుట సుప్రసిద్ధము. ఆనాణెములకు ఒకవైపున సింహమును రెండవవైపున అక్షరములును చిత్రింపఁబడియున్నవి. మౌర్యసామ్రాజ్యమునందును, హర్షవర్ధన కనిష్కుల పరిపాలనమునందును, బంగారునాణెములు విరివిగాఁ నుపయోగింపఁబడు చుండెడివి. అటు పిమ్మట ఉత్తరమునను దక్షిణమునను శక, పల్లవాంధ్ర, తమిళ రాజ్యములందు నాణెము లనేకము లుండెడివనియు, రోమకదేశముతోను చైనారాజ్యముతోను వర్తకము విరివిగా జరుగుచున్నటులు పలుచోటుల దొరకుచుండిన నాణెములు నిరూపించుచున్న వనియు విశేషించి వ్రాయ నక్కఱలేదు.

మహమ్మదీయ పాదుషాల పరిపాలనమునందు, వెండినాణెములు మిక్కుటముగా నుండెడివి. అల్టామషు 175 చిన్నముల బరువుగల వెండి "టంకా" (రూప్యము) నుపయోగించెను. మహమ్మదు బీను తుఘలకు, రాగి నాణెముల నుపయోగించి కృతార్థుఁడు కాలేకపోయెను. అక్బరుచక్రవర్తి టంకశాలలను స్థాపించి మంచి రూపాయలను తయారుచేసెను. కాని మహారాష్ట్ర రాజ్యములందు బంగారునాణెములే, వాడఁబడుచుండెడివి.

ఈ నాణెములు, మనప్రాచీనుల సాధనసంపత్తులను, వర్తకౌన్నత్యమును, దేశక్షేమమును నిరూపించుటయే గాక చారిత్రిక పరిశోధనలందు సాధనము లగుచున్నవి. కాని యొక చిత్ర మున్నది. వివిధరాజ్యములున్న మన భరతవర్షమునందు, 994 రకముల నాణెము లమలునం దుండియున్నను, మంచి ఖనిజములచే నిర్మితము లగుట, ప్రతిరాజ్యమునందును సాధారణముగాఁ జెల్లుబడినందుట మాత్రమేగాక, పరదేశవర్తకులు కూడ చలామణి చేసెడివారు. దేశచరిత్రను పరికించినచో, ఉత్తర హిందూస్థానమున వెండినాణెములును, దక్షిణదేశములలో బంగారునాణెములును విరివిగా నుపయోగించుచున్నట్లు తెలియవచ్చును.

**తూర్పుయిండియా వర్తక సంఘపరిపాలన**

మన హైందవదేశమందు చలామణియం దుండిన పలునాణెములఁ జూచి, తమరుకూడ రూపాయల నచ్చొత్తింపసాగిరి. 250 సంవత్సరముల క్రిందట బొంబాయిలో నచ్చొత్తించిన రూప్య మొండిప్పుడు దొరకినది. 18 వ శతాబ్దాంతమున వర్తకసంఘాధ్యక్షులు తమపరిపాలనలో నున్న దేశములో నొక్కనూదిరి వెండి నాణె ముండిన లాభకర మని తలఁచిరి. 1806 లో చెన్న రాజధానిలోఁ బ్రచారమునం దుండిన బంగరు వరహాల (Pagcdas) చలామణినుండి తగ్గించి, 165 గింజల బరువు గలిగిన మంచి వెండితోను, 15 గింజల కల్తీఖనిజము గలిగిన రూప్యమును ప్రచారమున నుంచవలెనని యాజ్ఞాపించిరి. మదరాసు రాజధానిలోని, జమాఖర్చు లన్నింటిని 1818 లో, 100 వరహాలకు, 350 రూకలచొప్పున మార్చిరి.

1885 వ సంవత్సరములో సంఘపరిపాలనలో నున్న దేశములలో నొక్కరకపు వెండినాణెము చలామణియం దుండవలెననియు, అర్ధరూపాయలను పావులాల నచ్చొత్తింపవలెననియు, పరిపూర్ణముగ చలామణిలో నుండుటకు వీలులేని, 15 రూప్యముల ఖరీదుగల బంగారు మొహరులను తయారుచేయవలెననియు, గవర్నరుజనరలుగా రాజ్ఞాపించిరి. ఇట్టిరూప్యమే ప్రస్తుతము మనదేశమం దమలులో నున్నది.

1841 సం॥ లో, 15 రూ॥ లకు 1 మొహరు చొప్పున ప్రభుత్వమువారు తమ కోశాగారములందు ము పుచ్చుకొనెద రని తెలుపఁబడినది. కాని కొలఁదికాల బంగారుఖరీదు తగ్గుటయును, ప్రజలు రూపాయల నెక్కువగా వాడుటయును జూచి, 1853 లో బంగారు మొహరుల చలామణిని చేయ మని ప్రచురించిరి. ఇంతటితో వర్తకసంఘపు పాలనము సమాప్తమైనది.

చక్రవర్తిగారి పాలనము

859 వ సంవత్సరమునుండి ఆర్థికశాఖకు ప్రత్యేకపు మంత్రులు నియమింపఁబడుచు వచ్చిరి. వీరిలో విల్సనుగారు తప్ప మిగిలినవారు బంగారునాణెము చలామణిలో నుండవలెనని తలఁచిరి. అందుల కనుగుణముగా 1864 వ సంవత్సరము హైందవులును, యూరపియనులును వర్తకసంఘముద్వారా యీవిషయమై విన్నపమంపుకొనిరి. కాని ప్రభుత్వమువా రిందుల కియ్యకొనకున్నను, పూర్వమువలెనే బంగారునాణెములను పుచ్చుకొనెదమనిరి. 1866 సం॥ రమునఁ గూడిన మేసేసంఘమువారు, 15, 10, 5 రూప్యముల విలువగల బంగారునాణెము లుండవలెనని సూచనఁ గావించిరి. కాని ఆసూచనము క్రియారూపమును మాత్రము దాల్పలేదు.

కాని పాశ్చాత్యదేశములలో చాలవఱకు వెండినాణెముల ప్రచారమును పూర్ణముగా తగ్గించుటచే, వెండిధరను 1871 వ సంవత్సరమునుండియును తగ్గుటకు ప్రారంభించెను. ఆకాలమునాఁటికే, మన ప్రభుత్వమువారు ఇంగ్లండుదేశమునకు, వడ్డీక్రిందను, జీతములు, ఉపవేతనములు వగైరాలక్రిందను 14,26,57,000 రూప్యము లిచ్చుచువారు. కాని కొలదికాలములోనే చెలామణిలో ధరమారుటు సంభవించినది. ప్రభుత్వమునకును, వర్తకులకును నమితమైన నష్టము వాటిల్లినది. 1892 వ లో, స్టాంపు చెలామణీధర ప్రకారము చెల్లింపవలసిన 17,75,19,200 రూప్యములకు బదులుగా 26,47,84,150 రూప్యములు చెల్లింపవలసివచ్చెను. బంగారునాణెము లేకుండుటచేతను, వెండిధర తగ్గుట కనుగుణ్యముగా చెలామణీధర తగ్గుటచే మనదేశమునకు ఆసంవత్సరములో 8,7[illegible],64 950 రూప్యములు నష్టము వచ్చినది" అని గోఖలేమహాశయుఁడు నిర్ధారించెను.

పరిస్థితులు విషమములుగా నుండుటచే 1893 సంవత్సరమున హెర్షెల్ సంఘమువారి యామోదముతో టంకశాలలో బంగారువెండినాణెముల యుచితముద్రణము నాపుచేసెను, విలయువారికి రూపాయ యొకటికి 16 పెన్నుల చెలామణీధర ప్రకారము బంగారునకు మాఱుల వెండినాణెము లిచ్చుటకును నిశ్చయింపఁబడెను. ఇతర దేశములలో వెండిధర తగ్గుటచే మనదేశములోని కమితముగా దిగుమతి చేయఁబడఁజొచ్చెను. కాని రూపాయలను ముద్రించుట ప్రభుత్వాధీనమునం దుండుటచేత నది యంతయు స్వంతవ్యవహారములకై —అనఁగా నగలకై మార్పఁబడెనని తలంపఁబడుచున్నది. 1898 లో ఫౌలరుసంఘమువారు కొన్ని సూచనలను జేసిరి. వానిని ప్రభుత్వమువా రామోదించిరి. బంగారునాణెముల ప్రచారమునం దుంచుటకును, రూపాయలను అసంపూర్ణ చెలామణిగల నాణెములుగా (Token Coins) చేయుటకును, అటుపైని వచ్చు లాభమును నిలువ జేయుటకును, [అనగా, రూపాయలో 11/12 వంతు మంచివెండియు 1/12 వంతు కల్తీయు నుండును. [అనఁగా 1/12 వంతు లాభము ఇదంతయును కూడఁబెట్టవలెనని యభిప్రాయము.] బంగారునాణెములకొఱకు టంకశాలను స్థాపించుటకొఱకును తీర్మానింపఁబడియెను. కాని కొలఁది కాలములోనే ప్రభుత్వమువారిదృష్టి భిన్నరూపమును దాల్చుటచే, లాభకరములగు నీపద్ధతులు మాఱిపోయి, బంగారు చెలామణీపద్ధతి (Gold-exchange Standard system) అమలులోనికి తీసికొనిరాఁబడినది.

బంగారు చెలామణీ పద్ధతి యనగేమి?

ఈ నూతనపద్ధతి ఎట్లు అమలునం దుంచఁబడుచున్నదో చెప్పుటకుముందు పూర్వము "బంగారు చెలామణీ పద్ధతి" యనఁగా నేమియో వివరింపవలసియుండుట అత్యావశ్యకము. ఏలనఁగా ఆపద్ధతియే నేఁడు మనలో ప్రచారమునం దున్నది.

ఈదేశములోపల బంగారునాణెము ప్రచారమునం దుండదు. కాని పరదేశవాణిజ్యమునకు బంగారము కావలయును గాన ప్రభుత్వమువారు సరఫరా చేయుచుందురు. అది ఎట్లనఁగా:—[illegible] మాఱుగా ఖరీదునకు [illegible] చేయుదురు. అనఁగా 15 రూపాయలకు 1 సవరను చొప్పున నియమించెను. లండనులో నాటికి మనదేశపువర్తకులు సొమ్ము బాకీపడి యున్నయెడల తా మీయవలసిన బంగారముఖరీదును చెలామణీధర ప్రకారము రూపాయలలోఁ జెల్లించినయెడల బంగారును లండనులో సరఫరా చేయుటకు ప్రభుత్వమువారు పూనుకొనెదరు. అటులనే లండనువర్తకులు మనవర్తకులకు బాకీపడియున్నయెడల ఆధరప్రకారము నవరసులను, హిందూదేశకార్యదర్శిగారి కిచ్చినయెడల, హిందూదేశప్రభుత్వము ఇచ్చుట నవరసులగా ఆసొమ్మునీయక కేవలము రూపాయలనుగా సరఫరా చేసెదరు. ఈ వంకరవ్యవహార మంతయు 1905 సంవత్సరమునుండి "కౌన్సిలు" "రివర్సు కౌన్సిలు" బిల్లు లమ్ముటవలన

జరుగుచున్నది. కాని వ్రాసినదాని నంతయు నుదాహరణపూర్వకముగా నిరూపించినయెడల తేటతెల్ల మగునని తలంచెదను.

రాముఁడను హైందవవర్తకుఁడు జోసఫ్ అను లండను వర్తకునియొద్ద 215,75 90 పౌనుల ఖరీదు గల 1702 సల్లుతానులను కొనె ననుకొందము.

ఇప్పుడు మన దేశములో సంపూర్ణముగాఁ బ్రచారమున నున్న నాణెములు వెండివి. విదేశవర్తకులు బంగారు నేగాని పుచ్చుకొనరు. ప్రాత చెలామణిపద్ధతి ధరయగు సవరనుకు 15 రూపాయలచొప్పున, రాముఁడు 2213850 రూపాయలను, ఖర్చులకొఱకు రూపాయకు 1/38 పైసచొప్పునను సొమ్ము వైస్రాయిగారికి చెల్లించి రివర్సుకౌన్సిలుబిల్లు కొనును. రివర్సుకౌన్సిలుబిల్లు అనఁగా హిందూదేశ కార్యదర్శిగారిపై జోసఫుకు 45;75,90 పౌనులు చెల్లింపవలయు నని పంపిన హుండీ. ఇటులు బంగారునాణెములు మనదేశములో లేకపోయినను విదేశవర్తకము జరుపఁబడుచున్నయది. కాని మనదేశమే ఎక్కువగా నెగుమతులఁ జేయును. మనకు బంగారము వచ్చుచున్నదా ? లేదు.

విలియం అను వాఁడు బొమ్మంజీ గారి యొద్ద 450 0000 రూ॥ల ఖరీదుగలదూదిని కొనెను. న్యాయము ప్రకారము మనకు దీనికి సరియగు సవరనులు రావలయును. కాని అట్లు వచ్చుట లేదు. విలియం చెలామణీ ధర ప్రకారము 300,000 పౌనుల నిచ్చి, 4500000 రూపాయలకు "కౌన్సిల్లు బిల్లు" హిందూదేశ ప్రభుత్వ కార్యదర్శియొద్ద లండనులోఁ గొనును. ఆహుండీని, బొమ్మంజీగారు వైస్రాయిగారికి చూపినచో, 450,0000 రూపాయలను ఇచ్చెదరు.

ఇట్లు వ్యవహారము జరుగుపద్ధతిని గ్రహించిన పిమ్మట, ఈ హుండీలకు సొమ్ము చెల్లించుటకు ప్రభుత్వపు కార్యదర్శియొద్దను రాజప్రతినిధియొద్దను, నిలువ సొమ్ము ఎటుల వచ్చినదో కనుగొనుట ముఖ్యము.

రూపాయనాణెములో కొంత కల్తీయున్న దని తెలిసికొంటిమి. ఆకల్తీమొత్తములోఁ బ్రభుత్వమువారికి వెండిలో లాభ ముండును. అనఁగా రూపాయలో 11/12 వంతులు మంచివెండి 1/12 వంతు కల్తీ. ఈ ఎత్తువెండి ప్రతిరూప్యముపైనను ప్రభుత్వమువారికి లాభము. ఈ లాభ మంతను జేర్చి లండనులో నిలువసొమ్ము చేయుదురు. ఆసొమ్ము కొంత ముద్దబంగారు రూపకముగను, కొంత సెక్యూరిటీలయందును ప్రభుత్వకార్యదర్శిగారు ఉంచెదరు. ఇదియే బంగారుచెలామణికి నిలువ. ఇది గాక, కౌన్సిలుబిల్లులు అమ్ముటకునపుడు వచ్చు బంగారమును దీనిలోఁ జేర్చును సామాన్యవ్యవహారములను జరిపెదరు.

సవరనుకును రూపాయకును మారకపుధర నిర్ణయించునపుడు నష్టము వాటిల్లునెడల అది పైని చెప్పిన నిలువసొమ్మునుండి చెల్లింపఁబడును. ఈపద్ధతివలన వచ్చెడి లాభము లీరీతిగా వివరింపఁబడినవి. ౧. సెక్యూరిటీలలో లండనునం దుంచుటవలన వడ్డీలాభము వచ్చును. ౨. ఇండియా ప్రభుత్వమువారు పెన్షనుల క్రిందను, ఇతర ఖర్చుల క్రిందను, సొమ్మును పార్సెలుద్వారా పంపుటకంటె సులభముగా లండనులోఁ జెల్లింపవచ్చును. 3. మన దేశములో నాణెములకు వెండి కావలయు నేని, కార్యదర్శి సులభముగా నక్కడ కొని పంపఁగలఁడు.

కాని యీపద్ధతి దేశమునకు నష్టదాయకము. వివరముగాఁ బరికించినయెడల మన నిలువసొమ్మును లండనులో మూలధనముగా నిచ్చుటకంటె బీదస్థితులలో నున్న మన వర్తకసంఘముల కప్పుగా నిచ్చిన బాగుగా నుండును. పెన్షనుల క్రిందను ఇతరవ్యయముల పేరుతోను మనదేశమునుండి ధనప్రవాహము సంతతముగ నచ్చటికిఁ బోవుచున్న దనియును, హీనస్థితిలోనికి వచ్చినారమనియును విలపించుచుండఁగా, నట్టికర్చులను తగ్గించుటకు మారుగా ఎక్కువగ నెగుమతిఁ జేయఁబూనుట న్యాయ్యము. స్వలాభపరాయణత్వము. ఇఁక మూఁడవవిషయము వెండి దిగుమతి చేయుట అవసరమా? యనునది. హిందూదేశములో బంగారునాణెములను వాడలేరనియును ప్రజలు దాఁచెద రను నభిప్రాయముతోను ఈ ద్వంద్వపద్ధతి యవసర మని ప్రభుత్వమువారు నిరూపించిన చేంబర్లేను సంఘమువారి యభిప్రాయము. దానికి జవాబు సంఘసభ్యు లగు చిస్బిగారే వ్రాసియున్నారు.

అనేకశతాబ్దములనుండి హైందవులు బంగారునాణెములను వాడుట కలవడియున్నారను సంగతి చారిత్రపరిశోధకులకు తెలియనిది గాదు. పైఁగా దేశములో వెండినాణెములకు, ప్రభుత్వమువంటి బంగారునాణెమునకున్నట్లు లేదు. ఆకారణమున బంగారమును ప్రజలు దాఁచుకొను వీలు కలుగుచున్నది. పైఁగా ప్రజలు కోరినప్పుడును, అవసర మున్నప్పుడును, ఏకారణముచేత బంగారు నాణెము ప్రచారమునం దుంచలేదు ? ప్రభుత్వమువారి

కరెన్సీకంట్రోలర్ అగు హార్వార్డుగారు 1913-14 లో ఇట్లు వ్రాసిరి: "ప్రజలు వాడుట కభ్యంతర ముండదు. కాని ఎక్కువనాణెములు (బంగరువి) వారికి అందుబాటులో నుంచుట ప్రభుత్వమువారివిధి. బంగారమును దాచుట కొంతవఱకు ప్రకృతిసిద్ధము."

ఇట్టిస్థితిలో బంగారునాణెమును ప్రచారమునకుఁ దెచ్చుట అత్యావశ్యకము. 1912 సం॥ లో మన ప్రభుత్వమువారు ప్రయత్నించినను హిందూదేశ కార్యదర్శిగారొప్పుకొనలేదు. ఆలస్యముఁ జేయుట న్యాయ్యము కాదు. ఈసంవత్సరము వర్తకములో మనకు దిగుమతు లెక్కుడుగా నున్నవి. కావున రివర్సుబిల్లులను ప్రభుత్వమువా రమ్ముట లేదు. హైందవవర్తకులకపార నష్టము కలుఁగుచున్నది. మాఱకపుధర నవరసునకు పదిరూపాయ లయినను ఈవ్యాసమును వ్రాయునపుడు ఖరీదు రు. 17-8-0 పరదేశపు చెలామణి రూ॥ 1-కి షి. 7¼ పెన్సు లయినది.

కావున దేశ మభ్యున్నతస్థితిలోనికి రావలె నని కోరునెడల తత్క్షణమే ఈపద్ధతిని నిర్మూలించి బంగారు నాణెమును ప్రచారములో నుంచవలెను. రూపాయను పరిపూర్ణముగా ప్రచారమునం దుంచకుండునటులు తటస్థింపవలెను. స్వార్థపరత్వభావభూయిష్ఠ మగు ప్రభుత్వ మటులు చేయు నను నాశలు పొడగట్టవు. స్వరాజ్య సంపాదనమే దీనికి మంచిమందు. ఎప్పుడు హైందవ భూమి తన హక్కుల నిర్ధారణ చేసికొని, ప్రాచ్యనాగరకతతోఁ దులఁదూఁగుచు, సర్వైశ్వర్యసంపన్నలయై విరాజిల్లునో గదా!

# భారతీయ ప్రబోధము

పిశుపాటి చిదంబరశాస్త్రి గారు

ఆశ్రమధర్మంబు లడఁగంటి వర్ణసాం
కర్యంబు మిగులఁ బ్రాచుర్య మొందె
స్వత్వనివృత్తి పూర్వక మైన పరదేశ
భాషాభిమానంబు ప్రబలమయ్యె
ఆత్మీయకులగోత్ర మన నెట్టిదో గూడ
తెలుఁగ మం చను కాల మేగుదెంచె
బాపలో భూపులో కాపులో చేపలో
తెలియఁజాలని యవస్థలు ఘటిల్లె
గీ. దేవభాషకుఁ బ్రాణసందేహ మొదవె
నార్యుల కనార్యభావంబు లతిశయిల్లెఁ
గొంప మునిఁగిన ద్దీక నుద్ధరింప రయ్య
న్యాయమతులార యో భారతీయులార.

సీ. అబ్ధిమధ్యంబునం దల్లాడు బడబాగ్ని
వలె నుండినది మనప్రాభవంబు
రవలజాడలు లేని నివురుగప్పిన నిప్పు
గా నుండె మన ప్రతాపానలంబు
బోనుగోఁ జిక్కిన పులి చందమని దీన
దశ నొందు మన మంత్రతంత్రశక్తి
రెక్కలూడిన పక్షిఫక్కిఁ జేఁ దన్యుల
చేఁ జిక్కినది మన జీవనంబు
గీ. పూర్వవృత్తాంతములు తలపోయ రయ్య
దివ్యతమ మైన యీ హిందుదేశమునకు
పుట్టమే ? యని కంట నీ రొట్టి రయ్య
న్యాయమతులార ! యోభారతీయులార !

సీ. జననిబోధమునందు శ్రద్ధ మీ కున్నచో
నాదిభాషాశక్తి నంద రయ్య
నీతికావలె నన్న నియతి మీ కున్నచో
ధర్మశాస్త్రంబులం దలఁప రయ్య
ఆస్తికత్వంబునం దాస మీ కున్నచో
గురుదేవతాభక్తి నెరప రయ్య
గౌరవం బార్జింపఁ గాంక్ష మీ కున్నచో
దేశీయసేవ సాధింప రయ్య
గీ. శుభము విభవంబు సేమంబు శుద్ధి బుద్ధి
మన్ననలు జెందువేడ్క మీ కున్నయెడల
న్యాయ మగు పూర్వపద్ధతి నడువరయ్య
న్యాయమతులార ! యో భారతీయులార

సీ. అవ్యయం బగు పరమార్థచింతామణి
వేదామృతాబ్ధిలో వెదుకరయ్య
మాననీయం బైన జ్ఞానాంజనశలాక
బహుశాస్త్రములనుండి వడయ రయ్య
పూజనీయం బైన పూర్వసామర్థ్యంబు
నాచారసమితితో నందరయ్య
ఆయురారోగ్యంబు లడఁగించు చండాల
వేషభావలు విడిపింప రయ్య
గీ. మన మహర్షులలోఁ గల మహిమ లెల్ల
మఱల నొకసారి స్మరియించి మంటిలోన
బొరలుచుండక కన్నులు తెఱవ రయ్య
న్యాయమతులార యో భారతీయు లార.

# ముక్తిసంపాదనము

## ఏ. పేరనార్యకవిగారు

ముక్తి యను పదమునకుఁ బర్యాయముగ మోక్షమని వాడుక గలదు. రెండుమాటలకుఁ గూడ విడుదలయను నర్థమే ధ్వనించుచున్నది. ఆస్తికమతావలంబకులై, పునర్జన్మమందు సంపూర్ణవిశ్వాసము గల ప్రతి హైందవుని నోటినుండియు నీపదము ప్రతిధ్వనించుచునే యుండును. మోక్షముఁ గోరనివా రెవరు నుండరు. సాధారణముగ దీనియం దందఱకును విశ్వాస మెక్కువగ నుండితీరును. ప్రతియొకరును దీనిని సంపాదించుటకుఁ గొద్దిగనో గొప్పగనో శక్తికొలఁది ప్రయత్నించువారే. కాని యిందలితత్త్వమును గ్రహించినవారు మాత్రము చాల నరుదుగఁ గలరు. ముక్తి యనునది మరణానంతరమునఁ బొందఁదగినదే కాని జీవితకాలమునఁ బొందఁదగనిది యని కొందఱమతము. పుణ్యలోక మొకటియుఁ బాపలోక మొకటియుఁ బ్రత్యేకముగ నున్నవనియు, వానినే స్వర్గనరకము లని పిలిచెద రనియు. పుణ్యపాపములను చేసిన జనుల కవి క్రమముగ ప్రత్యేకింపబడియుండు ననియు నమ్మువారు మఱికొందఱు. అనేకు లనేకవిధములుగఁ దలచుచున్నను పరమార్థము మాత్ర మొక్కటియే! పుణ్యలోకమున సంపూర్ణస్వేచ్ఛచే నిష్టసుఖము లనుభవింపగల రనియు, నరకమున బహునిర్బంధములకు లోనై నిరంకుశయమపాలకులచే మితిలేని కష్టముల ననుభవింతు రనియు నందఱు నమ్ముదురు. అందుచే స్వేచ్ఛాయుత మైన పుణ్యలోకమునే యందఱును గోరుదురు కాని నిర్బంధయుత మైన నరకమును ద్వేషించుచుందురు మొదటిదానిలో సుఖ మున్నదనియు, రెండవదానియందు కష్ట మున్నదనియుఁ గూడ సర్వు లెఱింగినరహస్యమే. ఇట్లు అందఱుఁ గోరునది యొక్కటైనను దానిని పొందుటకు మాత్ర మనేకు లనేకమార్గములను సూచించెదరు. కొందఱు తపము సల్పవలె ననియు మఱికొందఱు తీర్థయాత్రలు, దానధర్మములు, ఉపవాసవ్రతములు మొదలగునవి కావింపవలెననియు, నింకఁ గొందఱు మహనీయులసేవ, దైవప్రార్థనము మోక్షసాధనము లనియు నభిప్రాయపడెదరు. ఎవరికిఁ దోఁచినట్లువారు సూచించుట ఆచారమై యున్నది. వివిధమార్గము లెన్ని యుండినను అన్నియును— కష్టసహనము త్యాగము అహింస సత్యము ధర్మవర్తనము మున్నగువానిని ప్రతిపాదించుచుండును. జనులు నానియమములు గడిదేరనిచో ముక్తిని పొందజాల రని రూఢిపడుచున్నది. అట్టి క్రమశిక్ష నొందుటే మోక్షసాధన మనఁబడును.

జన్మాంతరమున ముక్తిని సంపాదించు నిచ్ఛచే జీవితకాల మంతయుఁ గడపుట భ్రమకాని వేఱు కాదు. ముక్తి యన విడుదల యని మొదట చెప్పియుంటిని. విడుదల గోరుట యనఁగా నీవఱకే యేదో నిర్బంధమునఁ దగుల్కొనియున్నట్లే స్పష్టము. స్వేచ్ఛ ననుభవించువారు విడుదలఁ గోరుట యన్న నర్థ ముండదు. స్వేచ్ఛ యనిన సంపూర్ణస్వాతంత్ర్యము. ఇది జన్మముతో గలిగిన హక్కనియు దానిఁ గాపాడుకొనుటకే సర్వులు సహజముగ నపేక్షించెద రనియు స్పష్ట మగుచున్నది. స్వాతంత్ర్యమే స్వర్గలోక మను లోకోక్తి దీనినే స్థిరపఱచుచున్నది. కావున స్వాతంత్ర్యముఁ బొందుటయే మోక్ష మనియు దానికి భంగకర మగు నిర్బంధవిధానమే నరక మనియు వేఱుగఁ జెప్పఁబనిలేదు. అప్రత్యక్షమగు పరలోకవిషయ మట్లుండనిచ్చినను— భూలోకమున స్వర్గనరకములు మాత్ర మేల జనులకుఁ గాన్పింపవు?

మానవుని జీవితకాలమునందు స్వేచ్ఛ ఆవశ్యక మగునా కాదా? ఆవశ్యక మైననది ప్రస్తుత మున్నదా? లేనిచో దాని సంపాదించుటకు మార్గము లెవ్వి యను విచారమునే బొత్తిగ మఱచి దేహాంతరమున నెచటనో ముక్తి కలదనియు, దానినిమాత్రము సంపాదింపవలె ననియు జనులు భ్రమించు టేల? ప్రత్యక్షమునఁ బొందఁజాలని స్వాతంత్ర్యమును పరోక్షమునఁ బొందఁ దలఁచుట విపరీతము కదా! బ్రదికినన్నిదినములు నిహలోకస్వాతంత్ర్యచింతను మాని, పరలోకస్వాతంత్ర్యమున కువ్విళ్లూరుచుండుట కర్థ మేమి? ముక్తి, సాధనచే నలవడునది కాని యొకమాఱుగ నెగురుటకు సాధ్యమైనది కాదు కదా? ఇహలోకస్వాతంత్ర్యము నేమాత్రము నెఱుఁగని యాత్మ పరలోకస్వాతం

త్ర్యము మాత్ర మెట్లు పొందఁగలదు? ఉట్టి కెక్కఁ జాలనిచో స్వర్గమున కెక్క సాధ్యపడునా? జీవితకాలమంతయు స్వేచ్ఛారహితమును నిర్బంధమును అగు వర్తనమున కలవాటుపడిన మానవులు దేహాంతరమున స్వాతంత్ర్యార్హు లెట్లు కాఁగలరు? ఆత్మస్వాతంత్ర్యమే మోక్షసామ్రాజ్య మను సిద్ధాంత మంగీకరించినపుడు అట్టి స్వాతంత్ర్యము ముం దిహలోకమున సంపాదించి అనుభవించినపిమ్మటఁ గదా పరలోకస్వాతంత్ర్యమున కాశింపనగును? ఇంట గెలిచినపిమ్మట రచ్చకేగిన జయము సులభసాధ్యము. ఇహలోకమున నట్టిది సంపాదించుట దేశమునకు జాతికంతకును సంబంధించిన విషయము. కావున, ముందు దేశమునకు స్వాతంత్ర్యము కలిగిన దేశీయులు మోక్షసామ్రాజ్యమున నోలలాడఁగలరు. ప్రకృతము దానిని సంపాదించు టెట్లో విచారింపవలయును.

ఐహికమోక్ష మనఁగా స్వయంనిర్ణయవిధానము. సంపూర్ణస్వపరిపాలనము వాక్పత్రికాస్వాతంత్ర్యములు జన్మస్వాతంత్ర్య సంరక్షణములె కాని వేఱు కావు. ఈ హక్కులు సంపాదింపని దేశము లన్నియు జాతు లన్నియు, ఘోరనరకము ననుభవించుచున్నవే యని వేఱుగఁ జెప్పఁబనిలేదు. భరతమాత తన 33 కోట్ల పుత్రులతోడ నరకకూపమునఁ బడి తపించుచుండుట లేదా? రౌలతుముద్రణాది కఠినశాసనము లన్నియు భారతీయులకుఁ బ్రత్యేకనరకకూపములుగ నుండలేదా? స్వదేశమునందు విదేశములందు నయితము భారతీయులు పశువులువోలె హింసింపఁబడుచుండుట లేదా? ఈ నరకములు, నిర్బంధములు మున్నగువానినుండి దేశము మోక్షము పొందవలె నన్న సత్వరస్వరాజ్యసంపాదనమే ఆవశ్యకము కదా? దాని సంపాదించుటకు మార్గ మేది?

మోక్షమునకు సాధన మవసర మని పైనఁ జెప్పితిని. సాధనమార్గము లెన్ని యుండినను అన్నిటియందు కష్టసహనము త్యాగము సత్యాహింసాధర్మవర్తనములే ప్రధానము లని కూడఁ జెప్పియుంటిని. పైమార్గములందు దేశీయు లందఱు క్రమశిక్ష నందినఁగాని మోక్షము సులభసాధ్యము కాదు. అజ్ఞానాంధకారమున మునఁగియున్న జనసామాన్యమునకుఁ దరణోపాయమును, మోక్షమార్గమును జూపి యుద్ధరించుటకు ప్రధానోపదేశకు లావశ్యకము. గురుఁ డుపదేశించిన తత్త్వమార్గము ననుసరించి వర్తించి శిష్యు లందఱు మోక్షసామ్రాజ్యమును చూరగొనుట పరమధర్మము

భరతఖండము నావరించిన విషమపరిస్థితుల నెఱింగి యిపుడు ఘోరనరకకూపమై యున్న దేశము నొక్కమాఱుగ స్వర్గతుల్యము గావింప నెంచి సామాన్యజనులకు మోక్షమార్గము నుపదేశింప బయలుదేఱిన దేశికోత్తముఁడే గాంధిమహాత్ముఁడు. కష్టసహనత్యాగాదులతోఁ గూడుకొన్న దౌర్జన్యరహితసహాయనిరాకరణదీక్షయే శిష్యులకు వారు మోక్షసాధనమునకై యుపదేశించుతత్త్వము. భౌతికదృష్టితో మహాత్ముని కార్యక్రమమును విమర్శించువారి కట్టి భ్రమ కలిగినను, ఆధ్యాత్మికదృష్టితోఁ బరిశీలించు మహనీయుల కీయుద్యమ మంతయు భారతజాతీయముక్తికే గాక, ప్రపంచముయొక్క శాంతికి - పునర్నిర్మాణమునకు - సర్వమానవసౌభ్రాత్రమునకును - ధర్మోద్ధరణమునకు - మూలసాధన మని తోఁపకపోదు. కావున మహాత్ముని సందేశానువర్తులై దేశీయు లందఱు, మత సాంఘిక రాజకీయాది కక్ష లన్నియుఁ గట్టిపెట్టి ఒక్కమాఱుగ నైహికమోక్షము సంపాదించి భరతఖండమును భూలోకస్వర్గముగ మార్చి ప్రపంచమునకు మార్గదర్శకు లగుదురుగాక యని నిరంతరము ప్రార్థింతును.

# ఆదిమాంధ్రులు

చెర్ల నారాయణశాస్త్రి గారు

ధరణి నాలుగు జాతులు దక్కఁగడమ
యంటరాని జాతులు వేదమందు లేవు
అవి యున్నయటుఁగలవని యనుకొనినను—
విశ్వమున మానవుల యభివృద్ధికొఱకు
జ్ఞానమే ముఖ్యసాధనంబైన కతన
శాస్త్రులకు జ్ఞానరూప సిద్ధాంతమునను
హెచ్చు తగ్గులకది యర్హహేతువగుట
జ్ఞానమును బట్టియే కాదె; కౌశికుండు
క్షత్రియుండయ్యు బ్రాహ్మణ జాతి కాఁడె
రూఢములు జాతులనియుండ్రె? మూఢమతిని
బొట్టులను జీల్చిమూడ నే మాలఁ గని
యొక్కయక్కరమైన లేకున్న యట్టి
కేవల ద్విపాత్పశువులు సేవగించి
గొప్ప దక్కించుకొనఁ జూచు చొప్పు గాక
వర్ణమాత్రంబు గౌరవభాజనంబె?
రాముఁడని యెడు వాఁడును రజకుఁ గాఁడె?
నిషధ దేశాధిపతియైన నృపతి యెవఁడు?
చంద్రవంశ్యుఁడౌ హరిశ్చంద్రుఁ డెవఁడు?
ప్రథితుఁడైనట్టి రామహర్షణి యెవండు?
వారి ద్విజులు పూజింతురే కారణమున?
కొడుకు జమదగ్ని? రేణుక యెవతె? వార
లిద్దఱును దంపతులె కారె? యెట్లు పొసఁగె?
వ్యాసునింటికి బ్రాహ్మణ ప్రవరఁ డేగి
తానెఱుంగఁడె యుత్తమధర్మమేదొ?
వెనుకటివి త్రవ్వఁగా నేన వేలు గలవు
తీగదీసిన డొంకయుఁ ద్రెళ్లివచ్చు.

* * * *

పారిశుద్ధ్యము లేదని పరిషవింత్రో
బాగు, చాలాను, ఛలిరె యాల్గు రంపా.
దారికిసివచ్చి హారతీ మాఱుకొంత
లేఁ వాఁగుడను మనలోనతేర
వారు మనలో బహిష్కరింపఁగ బడిరె?
యిందొకటి ధర్మసూక్ష్మ మదేమియున్న
పారిశుద్ధ్యము శుద్ధ సంపర్కము లిబ
యొకటొకటి పరస్పరము నన్యోన్య సంశ్ర
యములు చెట్టుఁ దీత్తులపోల్కి నమరుచుండుఁ
గొంతదగ్గర రానిచ్చు నంతమీఁద
వానికవకాన్ని క్రమముగవచ్చి దీయఁ
దొలుతఁగొంతివడి మనమును మెలఁగితిమపె
ఎన్నొతరములు గడవఁగ నిట్టులైతి
మిందనుక మానవవ్యక్తి చెందవలయు.
నట్టి పరిపూర్ణదశ మన మందలేదు.

* * * *

ఇల్లు గాలెడు వేళ నుయ్యికిఁ గడంగు
ప్రజ్ఞ గలయంతటి మహానుభావులార?
దానిమాట యటుండనిత్తమనుకొన్నఁ
బరమతంబున సహనంబు ప్రబలియున్కి
మతము లన్నిఁటికిని శిఖామణి యనంగ
ఖండఖండమ్ములందుఁ బ్రఖ్యాతిఁగన్న
మతము మన హైందవమతము; మతమనంగఁ
డీకవ్రాయఁగనే మన్నిటికిఁబు నాడి.
మునులు మనవారు దెలిసిరి మును పు; నేడు
దీనితత్త్వము పాశ్చాత్య దేశమెఱుఁగు
నట్టిదిమతంబు దాని కిక్కట్టు లిపుడు
దాపరింపగనున్న వదైవ్యతులార!
కారణం బేమియన్నను గడమజాతి
వారలద్దానికిని గంచె పగిదినుండ్రు
పాడుపడిపోయె నయ్యదిప్పటికి; మనము
శ్రద్ధచేయుమి బొత్తిగా సారమెడలి
కట్టుదిట్టము తప్పి మార్గములు వెలసె
దానిచే నింతవుకు మున్నె హాని వృద్ధమై
నంతఁ బోవక కటకటా? యింతలోన
గోరుచుట్టుపై రోకలి జారినట్టు
లందు దరికొన్న యది క్రైస్తవానలంబు.

* * *

ఒక్క పరమార్థమిందులో నున్నదింకఁ
గనఁబడును జాపు మేరలో గాంచనగు దుం
సాగినది కొంతకాలము సాగినంత
తెగిన దాఁకను లాగుట తగవు గాదు.
తెలిసికొన్నారు వారును గలనిజంబు.
కనులు మూసియుఁ గన్నుల గంతగట్టు
కాల మది మారిపోయె నాగరకులార?
మొరయుచున్నవి భేరులు బోరుకలుగఁ
గట్టనున్నారు క్రైస్తవక వచములను
వలదు కలహంబు మన కుటుంబంబులోన
నింటిగుట్టు లంకకును జేటంటువినరె.
ఆనిదర్శనములు యుక్తులల్లెఱుంచి
చిత్తమున మీరె కొంతయోజించుఁడయ్య.

* * * *

అయ్యదియ్యది నాక సమస్తమగు ప
దార్థముల సారగించెడు నట్టిదక్క
భైరవస్వామిగాఁగ స్వభావదుష్ట
మయినపాము సుబ్రహ్మణ్యుఁడగుచునుండ
ధన్యుఁగాలకు నాయరుంధతి పవిత్ర
సీమఁ గడుపారఁ గాంచుటఁజేసి కీర్తి
గన్నకోలము వారలు నంటఁగా నవర్హు
లనుటకంటె నజ్ఞాయ్య మవనిఁగలదె?
ఉన్నదున్నట్లు చెప్పుట కడుక రాదు
ఛాందసులు? పెట్టకుఁడు మీరు శాపములను
వారలిచ్చెడునట్టి దీవనలయెడుట
వేదవిదుల శాపములు నిర్వీర్యములు లెకా!

# కీర్తిశేషులైన రసవిహారీ ఘోషుగారు

కో. శఠకోపాచార్యులు గారు, ఎమ్. ఏ., బి. ఎల్.

రసవిహారీఘోషుగారు 1845 సం॥ డిసెంబరు 28-వ తేదీని వంగరాష్ట్రమున వర్థమాన మండలములో జన్మించెను. ఈయన తండ్రి జగద్బంధుఘోషు. రాసవిహారి తొలుత బంకురా నగరమున విద్యాభ్యాసము జేసెను. రసవిహారీఘోషు బాల్యమునుండి యసమాన మేధావియై, పరీక్ష లన్నిటను నగ్రస్థానమున కృతార్థు లగుచుండిరి. 1865 సం॥ జనవరియందు బి. ఏ., పరీక్షను, 1866 సం॥ జనవరిలో ఆంగ్లభాషావాఙ్మయములందు ఎం. ఏ. పరీక్షను ఇచ్చి, మొదటి తరగతిని కృతార్థులైరి. 1867 సం॥లో బి.ఎల్. పరీక్షను, 1871 సం॥లో న్యాయశాస్త్రాచార్య పరీక్షను నిచ్చెను. కలకత్తా ఉన్నత న్యాయాలయమున న్యాయవాదిత్వమును 1667 సం॥ము నుండి ప్రారంభించెను. న్యాయశాఖయం దాయనకు గల యప్రతిమప్రతిభ శాస్త్రదీక్ష న్యాయదృష్టి అసమానజ్ఞప్తి ధైర్యసాహసములు - స్వల్పకాలముననే ఈయనను కలకత్తా న్యాయవాదులలో నగ్రగణ్యునిఁ జేసెను.

1875 సం॥లో టాగూరు లాలెక్చరరుగా ఘోషుగారు నియోజితులైరి. అప్పుడు తమ పరిశోధన ఫలితముగ తనఖావ్యాసారములను గూర్చి వారొసంగిన యమూల్యోపన్యాసములు తరువాత గ్రంథరూపముగ ప్రకటింపఁబడినవి. అప్పటికి ఇట్టి చట్టము శాసనసభలలో నిరూపితము కాలేదు. అందువలన ఘోషుగారి గ్రంథము న్యాయవాదులకును జనులకు గూడ నత్యుపకారక మయ్యెను. నేటికిని శాసనకర్తలచే ఈ గ్రంథము సర్వోత్తమ మని యంగీకరింపబడి యున్నది. కలకత్తా విశ్వవిద్యాలయమువా రాయనకు 1884 సం॥లో డాక్టరు ఆఫ్ లాస్ అను బిరుదము నిచ్చిరి. ఘోషుగారి కాంగ్లవాఙ్మయమునం దభిలాష మధికము. వీరి యాంగ్లభాషా శైలి మిక్కిలి మనోహరముగ నుండును. ఇట్టి సాహిత్యజ్ఞానము వక్తృత్వశైలి ఆంగ్లనాయకులలో గూడ అరుదు. ఘోషుగారిని మొదట వంగదేశ శాసనసభకును తరువాత సామ్రాజ్యశాసనసభకును సభ్యునిగ నియమించిరి. వీరు స్వాతంత్ర్యప్రియులు. ఈయన పేరునకు మితవాదియే. కాని సమయము వచ్చినప్పుడు కేవల న్యాయపక్షవాది. 1897 సం॥లో రాజద్రోహసంఘశాసన ముపపాదింపఁబడగ ఘోషుగా రాచట్టమును తీవ్రముగ ఖండించిరి. అప్పుడు సభలోని మితవాద నాయకు లందరు చట్టమునకు తమ యంగీకారముల నిచ్చిరి. కాని ఘోషుగారును మరియొకరును మాత్రమే దానికి వ్యతిరేకముగా తమవోటు నిచ్చిరి. కర్జనుప్రభువు రాజప్రతినిధిగ నుండిన కాలమందును వీ రనేక సభల కధ్యక్షులుగా నుండి రాజప్రతినిధిగారి నిరంకుశప్రవర్తనను సహేతుకముగా ఖండించిరి. శాసనసభ్యులుగా నున్నప్పుడు ఘోషుగారు స్వయముగ గొన్ని చట్టములను సభలో నుపపాదించి వాని నంగీకృతముల గావించిరి. వీరు 40 ఏండ్లు కలకత్తా న్యాయవాదులకు నాయకులుగ నుండిరి. న్యాయమూర్తు లగు సర్ ఆశుతోషముకర్జీ మొదలగువా రనేకులు వీరి శిష్యులే.

ఘోషుగారి దేశభక్తి పరిశుద్ధమైనది. వీరు దేశోపకారకములగు సదుద్యమము లన్నింటికిని తమచేతనైన సహాయమును జేయుచుండిరి. వంగదేశమునందలి సదుద్యమము లన్నిటికిని వీరి ద్రవ్యసహాయము ప్రోత్సాహమును కలదు. 1906 సం॥లో జాతీయవిద్యాపరిషత్తును నిర్మయించిన ప్రధానులలో వీ రొక్కరు. ఆ జాతీయశిక్షాపరిషత్తునకు ఘోషుగారే యధ్యక్షులు.

వీ రనేక విద్యాశాఖలలో విశ్వవిద్యాలయమున పరీక్షకులుగను ఆంతరంగిక సభాసదులుగను పనిచేసిరి. పరిశ్రమల యభివృద్ధికి గణితశాస్త్రమునను ప్రకృతిశాస్త్రమునను ప్రావీణ్య మావశ్యక మగుటచేత మనదేశమున నా పరిస్థితుల నేర్పరచుటకు ఘోషుగారు కలకత్తా విశ్వవిద్యాలయమువారికి ఇరువదియొకలక్షల రూపాయలను దానముగా నిచ్చిరి. తా మిచ్చిన ద్రవ్యమువైవచ్చు వడ్డితో ప్రకృతిశాస్త్రమునను గణితమునను సుత్తమకీర్తి పరిశోధకులైన యుపాధ్యాయులను నియమించి దేశీయయువకులకు పరిశోధనపద్ధతులు నేర్పవలయు ననియు, నియమితులగు నుపాధ్యాయులును పరిశోధకులును హిందూదేశమందే యుండవలయు ననియు వీరు తమవిరాళము నుపయోగించుటలో నిబంధన చేసిరి. ఇంతియగాక, ఘోషుగారు తమ మరణశాసనమున కలకత్తా విశ్వవిద్యాలయమువారికి వ్యవసాయశాస్త్రజ్ఞానమును జనులకు వ్యాపింపజేయుటకు $2\frac{1}{2}$ లక్షలను, స్వగ్రామములోని తమ విద్యాలయమునకు $1\frac{1}{2}$ లక్షలను జాతీయవిద్యాభివృద్ధికి 10 లక్షల రూప్యములవరకు నిచ్చునట్లు నియమము చేసిరి. దీనివలన వీరికి గల పరిశుద్ధమగు ప్రజాప్రేమము వ్యక్తమయ్యెను.

ఘోషుగారు చిరకాలము మితవాదకక్షలో జేరియుండిరి. కాని జాతీయవాదులపై వీరికి కోపము గాని అసూయ గాని లేదు. కలకత్తాలో దేశీయమహాసభా సమావేశమున వీరు స్వాగతసభాధ్యక్షులుగ నుండిరి. 1908 సం॥న చెన్నపురిలో కాంగ్రెసు సమావేశమందు ఘోషుగారే యధ్యక్షులైరి. కాలక్రమమున దొరతనమువారి నిరంకుశచర్యలను చూచి చూచి తుదకు ఘోషుగారు జాతీయపక్షము నవలంబించిరి. రెండు మూడు సం॥ల క్రింద జాతీయవాదులు స్థాపించిన వంగీయజనసభకు వీ రధ్యక్షులుగ జేరి ఆమరణము తామే యధ్యక్షులుగ నుండిరి. అసహాకారోద్యమము రాజద్రోహసూచన మని కొందఱు నాయకు లభిప్రాయపడు తరుణమున ఘోషుగారు అసహాకారోద్యమమున నెట్టిదోషమును లేదని నిరూపించి ఈ యుద్యమమును రక్షించిరి. వీరు స్టేటుకవున్సిలు సభ్యులుగా నెన్నుకొనబడిరి. కాని వీరి కందుండుట రుచింపక సమావేశమునకు వెళ్లుట మానివేసిరి. దొరతనమువారు వీరికి సి. ఐ. ఇ. సర్, బిరుదముల నొసంగియుండిరి. కాని ఘోషుగారికి బిరుదములం దెట్టి యిచ్ఛయును లేదు. ఘోషుగారు 75 ఏండ్లు జీవించి తమ సర్వస్వమును దేశాభివృద్ధికి ధారవోసి అర్పించిరి. 28-2-21 నాడు రాత్రి రెండుజాములకు వీరు కీర్తిశేషులైరి.

# బాదపమహారాజు — అరుంబాక తామ్రశాసనము

కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావు గారు, ఎమ్. ఏ.

ఈ శాసనము కొలఁదిదినములక్రిందట కృష్ణాజిల్లా బందరు తాలూకా పోలమూరు గ్రామమునందు అల్లాడ పగఱు రాయుఁడను అను రైతు తనయింటి గోడపునాది త్రవ్వుచుండఁగా దొరకినది. ఇది యొక కుండలో భద్రముగాఁ బెట్టఁబడియుండెను. రేకులు మకిలపట్టియుండుటచేత బంగారమో వెండియో యని భ్రమపడి గడ్డపారతో కొట్టి చూచిరి. కత్తితో గీసిరి. కంసాలిచే నొక రేకును పగులఁ గొట్టించిరి. తుదకు ఆ రేకులపై నైట్రిక్ ఆసిడ్ పోసియు, వానిని పిడకలదాలిలోఁ గాల్చియు, చింతాకులో నుడకఁ బెట్టియు శుభ్రపఱుప యత్నించిరి. ఈ రేకుల కిట్టి యవస్థలు సంప్రాప్తించుటచే నందలి రెండవరేకు రెండు తునకలగుటయే కాక యందలి కొంతభాగము విరిగి యెచ్చటనో పడిపోయెను. ప్రతిరేకు మీఁదను కొన్ని యక్షరములు అరిగియు రూపుమాసియు సూక్ష్మదర్శినిలోఁ బరీక్షించినను చదువుటకు వీలులేని యవస్థను జెందినవి. చివఱకీరేకులను అగ్రహారనివాసులును దేశాభిమానులు నగు శ్రీయుత కొత్తపల్లి నరసింహము గారు సంపాదించి ఆంధ్రపత్రికా కార్యాలయమునకుఁ బంపిరి. ఆ కార్యాలయమునుండి యవి నావద్దకి వచ్చెను.

ఈ శాసనమునందు ఐదు రాగిరేకులు ఒక కడియములో గ్రుచ్చియున్నవి. ఆ కడియముపై శ్రీ 'త్రిభువనాంకుశ' అని యక్షరములు గల యొక ముద్ర కలదు. అందుపై పూర్వచాళుక్యుల ముద్రలపై నున్నటులనే అక్షరములకు పైభాగమున చంద్రుఁడును అంకుశమును గలవు; క్రిందిభాగమున వరాహప్రతిమయు, దాని ప్రక్కను సూర్యుఁడును, అన్నిటికంటె క్రింద పద్మమును ఉబ్బుగ పోతపోయఁబడియున్నవి. ఇందలి రేకులు రమారమి 9⅜ అంగుళముల పొడవును 4⅜ అంగుళములు వెడల్పును గలవి. ఒకటవ రేకు లోపలి భాగమున మాత్రము అక్షరములు చెక్కఁబడి యున్నవి.

శాసనభాష సంస్కృతము. గద్యపద్యాత్మకము. వ్రాతతప్పులు కొన్ని కలవు. ఇందలి లిపి పదవశతాబ్దపు పూర్వచాళుక్యుల శాసనముల లిపిని బోలియున్నది. క్రీ. శ. 927–934 వఱకు రాజ్యము చేసిన యుద్ధమల్లుని[1] బెజవాడశాసనమునందలి యక్షరములును, క్రీ. శ. 945–970 వఱకు రాజ్యముచేసిన అమ్మరాజుశాసనము[2] లోని యక్షరములును ఇందలి యక్షరములును ఒకే ఫక్కిగ నుండును. ఇవి రాజరాజు నందంపూడి శాసనపు[3] అక్షరములకంటె పురాతనములు. కొన్నిచోట్ల మొదట వ్రాసిన యక్షరములు తరువాత దిద్దఁబడి యున్నవి.

శాసనమందలి గద్య పద్యములు చాలభాగము పూర్వశాసనముల నుండియే గ్రహింపఁబడినవి. రెండవ అమ్మరాజు శాసనములోని పద్యములను గూడఁ దీసికొని కవి యిష్టమువచ్చినట్లు మార్చెను.

ఇందలి యక్షరస్వరూపమును గుఱించి విచారింపగా యుద్ధమల్లుని శాసనమును, అమ్మరాజు శాసనములను ప్రకటించినవారు చెప్పిన విశేషములే ఇందును గానవచ్చుచున్నందున ఇందలి యక్షరస్వరూపము వేఱుగ వివరింప నక్కఱలేదు. ఇతరులు చెప్పని యొకటి రెండు సంగతులు మాత్రము చూపించెద.

ఈ శాసనమునందుఁ గొన్ని శబ్దములలో వట్రువసుడియిచ్చుటకు మాఱుగ ర్రాగతమును ఇకారమును వ్రాయఁబడినవి. ఉదా:— హ్రిషీకేశ (మూఁడవరేకు, రెండవ ప్రక్క 7 వపంక్తి); శత్రుభ్రితాంకురః (నాలుగవరేకు, రెండవ ప్రక్క, 4 వపంక్తి). దీనిని బట్టి చూడ నాకాలమునందు ఋకారమును అప్పటియొక్క యుచ్చారణ ఇప్పుడు తెనుఁగుదేశమునం దున్న దానివలె 'రు' అని లేదనియు, ఇప్పు డుత్తర హిందూదేశమునం దున్నటుల 'రి' అని యుండె ననియుఁ దెలియుచున్నది. ఇందుచేతనే మనపూర్వులు 'ఋ' కారమునకును 'రి' కారమునకును యతిమైత్రి యొప్పుకొనిరి. 'ఋత్విజుండని విచారించి పూజించితే' అని మహాభారతము. ఈ శాసనకాలమువఱ కనుస్వార మింకను సున్నగా మాఱలేదు. నాగరములో వలె చుక్కగనే యుండి అక్షరము పైభాగమునఁ జూపఁబడుచుండెను.

పొల్లులలో ఱ అను నొకయక్షరము కానవచ్చుచున్నది. (రే-2; ప్ర-2; పంక్తి 6.) ఏని పూర్వాక్షరము స్పష్టముగ లేనందున ఆ శబ్దస్వరూపము విషయమై యధికముగ వ్రాయుటకు వీలులేదు.

## కథాసంగ్రహము

పూర్వచాళుక్యులలో నొకఁడైన బాదపుఁడను మహారాజు వెలనాటిలోని అరుంబాక యను గ్రామమును గండనారాయణుఁడను వానికి ఇచ్చిన సమాచారమును, మఱల దానిని ఆ గండనారాయణుఁడు తనపినతల్లి కుమారుఁడైన చండేనాఖ్యున కిచ్చిన సమాచారమును దెలుపుటకీశాసనము పుట్టినది. ఇది పూర్వచాళుక్యుల ఇతరశాసనములలోనున్న వీరుబావళులతో ప్రారంభమైనది. ఇందు కుబ్జవిష్ణువర్ధనుని మొదలుకొని రెండవ అమ్మరాజువఱకు రాజ్యముచేసిన రాజులపేళ్లును వారికిఁ గల సంబంధమును, వారిరాజ్యకాలపరిమితి సంవత్సరముల సంఖ్యలును ఈయఁబడినవి. అవి యితర శాసనములలోని సంఖ్యలతో సరిపోవుచున్నవి.

రెండవ అమ్మరాజు న్యాయ్యముగ వేంగీదేశమును త్రికలింగసహితముగ రక్షించెను అనిచెప్పఁబడినదే కాని అతని రాజ్యసంబ

1 ఆం. సా. ప. సం. 6. పుట. 49; Ep. Ind. Vol. XV. p. 150.
2 Ind. Ant. Vol. XIII, p. 248
3 ఆం. సా. ప. ప. సం. I. పుట. 45.

త్సరములసంఖ్య ఇచ్చియుండలేదు. తర్వాత రాజాఖ్యుఁడను వల్లభుని పౌత్రుఁడు అమ్మరాజును ఓడించి దేశమునుండి వెళ్లఁగొట్టి బాదప రాజు రాజైనట్లు చెప్పఁబడినది. ఈతఁడు యుద్ధమల్లుని కుమారుఁడు. ఏడు సంవత్సరములు రాజ్యముచేసిన యుద్ధమల్లుఁడు నెలదినములు రాజ్యముచేసిన తాలపునికొడుకు. బాదపుఁడు దాయాదులను జయించెనని కూడఁ జెప్పఁబడియున్నది. ఇతనికి 'సమస్త భువనాశ్రయ శ్రీ విజయాదిత్య రాజాధిరాజ పరమేశ్వర పరమభట్టారక' అన్న బిరుదు లుండెను.

[కా]ట్టువదిత్యుఁడను ధనుర్ధరుఁడుకలఁడు. వానికి నృపకాముఁడు అనుకొడుకు కలిగెను. ఇతఁడే నృపకామసరోనాధుఁడు. ఇతనిభార్య నాయమాంబ. వీరిరువురికి గండనారాయణుఁడు పుట్టెను. బాదప మహారాజు ప్రీతుఁడై ఈగండనారాయణునకు వెలనాండు విషయమున ఆరుంబాకయను గ్రామము సర్వకరపరిహారముగ నిచ్చి శాసనము వ్రాయించి యిచ్చెను. తన తల్లి చెల్లెలైన స...కాంబపుత్త్రుఁడగు చండేనాఖ్యునకు గండనారాయణుఁడు ఈ గ్రామము నిచ్చివేసెను. ఈగ్రామమునకు సీమలు—తూర్పున చెఱుకుంబల్లి; దక్షిణమున శ్రీపూండి; పశ్చిమమున కావూరు; ఉత్తరమున గోమదువు. ఆజ్ఞప్తి కటకరాజు. కవి అయ్యనభట్టు. శాసనము చెక్కినవాఁడు భట్టదేవుఁడు.

## శాసనకాలము

శాసనమునందు శక మీయలేదు. కాని బాదపుఁడు తాను రెండవ అమ్మరాజు తరువాత రాజ్యముచేసినట్లు చెప్పుకొనుచున్నాఁడు. అమ్మరాజు క్రీ. శ. 945 మొదలు 970 వఱకు రాజ్యముచేసెనని యతని శాసనములనుబట్టి యిదివఱకే నిర్ణయముచేయఁబడినది. అతనితరువాత అతని యన్నయగు దానార్ణవుఁడు మూఁడు సంవత్సరములు రాజ్యముచేసెనని అతనికుమారుఁడైన శక్తివర్మశాసనమునందును, విమలాదిత్య రాజరాజాదుల శాసనములందును జెప్పఁబడియున్నది. దానార్ణవుని తరువాత ఇరువదియేడు సంవత్సరముల వఱకు వాంధ్రదేశ మరాజకముగ నుండెననియు, క్రీ. శ. 999 మొదలు దానార్ణవుని కుమారుఁడైన శక్తివర్మరాజ్యము చేసెననియు శక్తివర్మాదుల శాసనములవలనఁ దెలియుచున్నది. కావున ఈబాదప మహారాజు ఈ యరాజకకాలమనఁబడు ఇరువదియేడు సంవత్సరములలోపల (క్రీ. శ. 973-999) రాజ్యముచేసి యుండవలెను.

## స్థలనిర్ణయము

శాసనము దొరకిన గ్రామము పొలమూరు అనునది. ఇది కృష్ణాజిల్లా తెనుఁగు తాలూకాలో నున్నది ఈ శాసనమునందు దానముచేయఁబడిన గ్రామము ఆరుంబాక. ఈ పేరుగల గ్రామమేదియు ఇప్పటి తెనుఁగు తాలూకాలోఁ గానరాదు. ఆరుంబాక యొకటి రేపల్లితాలూకాలో నున్నది. శాసనమునం దీగ్రామమునకు సరిహద్దులుగఁ జెప్పఁబడిన శ్రీపూండి, చెఱుకుంబల్లి, కావూరు అను గ్రామములుకూడ ఆతాలూకాలోనే యున్నవి. శ్రీపూండికిపుడు సిరిపూడియనియు, చెఱుకుంబల్లికి చెఱుకుమిల్లియనియు, కావూరికి కావూరనియు ఇప్పుడు పేర్లుగలవు. కావున దానవిషయమైన గ్రామము రేపల్లితాలూకాలోనిదియే యని నిశ్చయింపవచ్చును. ప్రతిగృహీతగాని, వారి వంశమువారుగాని, మఱి యితరులుగాని ఈ శాసనమును రేపల్లితాలూకానుండి తెనుఁగుతాలూకాకు తీసికొని వెళ్లియుందురు.

## దానముతీసికొన్నవారు

ఈ గ్రామము మొదట బాదపునిచే గండనారాయణుఁడను వానికీయఁబడినది. ఈతఁడు దానిని తరువాత తనపినతల్లికుమారుఁడైన చండేనాఖ్యునికిచ్చెను. గండనారాయణుఁడు రాజబంధువుగఁ గానవచ్చుచున్నాఁడు. ఈతనితండ్రి నృపకాముఁడు; తల్లి నాయమాంబ రెండవ అమ్మరాజు క్రీ. శ. 945 లో వేయించిన శాసనమువలన నృపకాముఁడును, నాయమాంబయు, అమ్మరాజు అత్తమామలని తెలియుచున్నది. కావున గండనారాయణుఁ డమ్మరాజునకు బావమఱఁది. *

## శాసనమువలన స్పష్టపడు నూతనవిషయములు

ఈ శాసనమువలన నిదివఱకుఁ జరిత్రకారులకుఁ దెలియని యొక నూతనవిషయము వెల్లడియగుచున్నది. ఇదివఱకుఁ బూర్వచాళుక్యుల చరిత్రమును వ్రాసినవారందఱును క్రీ. శ. 973 మొదలు 999 వరకు 27 సంవత్సరములు ఆంధ్రదేశమున నేరాజును రాజ్యము చేయలేదనియు, అరాజకముగ నుండెననియు వ్రాసియున్నారు. అట్లువ్రాయుటకుఁ గారణము లేకపోలేదు. శక్తివర్మ కాలమునుండి మఱల రాజ్యమునకు వచ్చిన పెద్దవంశపు చాళుక్యరాజులు ఈకాలమునందు వేంగిదేశ మరాజకముగ నున్నదని వ్రాసియున్నారు:—

అనుదానార్ణవాదాసీత్ దైవదుశ్చేష్టయా తతః
సప్తవింశతివర్షాణి వేంగిమహీరనాయకా ।

అని నందంపూడి శాసనమునందుఁ గలదు. (ఆం.సా.ప.సం.౧.పు.౪౫.)

'తతో దానార్ణవాధీశా దను వేంగిమహీతలం
సప్తవింశతివర్షాణి వేంగిదేశ మరాజకం.'

అని శక్తివర్మశాసనములోఁగలదు. (ఆం. సా. ప. సం. ౨పు. ౩౯౫.)

ఇట్టి వాక్యములను బట్టి చరిత్రకారులు ఆకాలమున వేంగిదేశమునందు రాజులేరని వ్రాసిరి. కాని యిది భ్రమయని యీ శాసనమువలనఁ దేలుచున్నది. ఈ యరాజకకాలమనునది చాళుక్యులలోని పెద్దవంశమువారికే అరాజకకాలముకాని, చిన్నవంశమువారికి, దేశమందలి ప్రజలకు కాదు. ఈ యిరువదియేడు సంవత్సరములును, పూర్వచాళుక్యులలోని పెద్దవంశమువారిని వెడలఁగొట్టి చిన్నవంశమువారు వేంగిదేశముఁ బరిపాలించుచున్నట్లు ఈ శాసనమువలనఁ దెలియుచున్నది. ఈవంశమువాఁడే ప్రస్తుతశాసనము వ్రాయించిన బాదపరాజు. పూర్వచాళుక్యులలో పెద్దవంశము చిన్నవంశము అనుభేదము ముఖ్యముగా కలివిష్ణువర్ధనుని కుమారులవలనఁబుట్టినది. ఈ భేదము తెలియుటకై కలివిష్ణువర్ధనునినుండి రాజరాజువఱకు చాళుక్యవంశములోని యావశ్యకమైన భాగము ఈ క్రిందఁ జూపఁబడినది.

* Ind. Ant Vol Xiii p 248

- కలి విష్ణువర్ధనుఁడు (843–844)
  - గణకవిజయాదిత్యుఁడు (844–888)
  - విక్రమాదిత్యుఁడు
    - చాళుక్యభీముఁడు (888–918)
      - విజయాదిత్యుఁడు (918)
        - అమ్మరాజు విష్ణువర్ధనుఁడు (918–925)
          - బేటవిజయాదిత్యుఁడు (925)
          - భీముఁడు (926–927)
        - చాళుక్యభీముఁడు (934–945)
          - * దానార్ణవుఁడు (970–973)
            - శక్తివర్మ ♦ (1003–1015)
            - విమలాదిత్యుఁడు (1015–1022)
              - రాజరాజు (1023–63)
          - అమ్మరాజు విజయాదిత్యుఁడు (945–970)
      - విక్రమాదిత్యుఁడు (925–926)
  - యుద్ధమల్లుఁడు
    - తాళరాజు (925) ఒక నెల
      - యుద్ధమల్లుఁడు (927–934)
        - బాడబ రాజు
        - తాళ రాజు (970–999)

కలివిష్ణువర్ధనునకు ముగ్గురు కుమారులుండిరి. గుణగాంక విజయాదిత్యుఁడు, విక్రమాదిత్యుఁడు, యుద్ధమల్లుఁడు వీరిలో పెద్దవాఁడు క్రీ. శ. 844 మొదలు 888 వఱకు రాజ్యముచేసి సంతానములేక మృతిపొందినట్లు కానవచ్చుచున్నది. ఇఁక మిగిలినవి రెండు వంశములు. విక్రమాదిత్యుని వంశమును పెద్దవంశమనియు యుద్ధమల్లుని వంశమును చిన్నవంశమనియు మనము గుర్తుపెట్టుకొనవలెను. పెద్దవంశమువారే రాజ్యాధికారమును వహించియుండిరి. కాని చిన్నవంశమువా రప్పుడప్పుడు రాజ్య మాక్రమించుకొనుటకు ప్రయత్నము చేయుచుండిరి. పెద్దవంశములోని బేట విజయాదిత్యుఁడను వానిని వెడలఁగొట్టి చిన్నవంశమువాఁడైన తాలపుఁడు ఒకనెల రాజ్యము చేసెను. పెద్దవంశములోని చాళుక్యభీముని కుమారుఁడైన విక్రమాదిత్యుఁడు తాళపరాజును వెడలఁగొట్టి పదునొకండు సంవత్సరములు రాజ్యముచేసెను. మొదటివంశములోని మొదటి అమ్మరాజు కుమారుఁడైన భీముని జయించి రెండవవంశములోని తాళరాజుకుమారుఁడైన యుద్ధమల్లుఁ డేడుసంవత్సరములు రాజ్యముచేసెను. ఈతఁడే బెజవాడలో ఆంధ్రపద్యాత్మకమైన శాసనమును వేయించినవాఁడు. వీనినిజయించి కొల్లిభిగండ విజయాదిత్యుని కొడుకైన చాళుక్యభీముఁడు పదునొకండు సంవత్సరములు రాజ్యమేలెను. ఇతని కిద్దఱు కుమారులు. పెద్దవాఁడు దానార్ణవుఁడు. చిన్నవాఁడు అమ్మరాజు. దానార్ణవుఁడు బ్రదికియుండఁగనే అమ్మరాజు రాజ్యమునకు వచ్చెను. ఈయమ్మరాజు తరువాతనే రెండవవంశమునకు చెందిన ఏడేండ్లు రాజ్యముచేసిన యుద్ధమల్లుని కుమారుఁడైన బాడపుఁడు వేంగిదేశము నాక్రమించుకొని పాలించినట్లు ప్రస్తుతశాసనమువలనఁ దెలియుచున్నది. అమ్మరాజు క్రీ. శ. 945 మొదలు 970 వఱకు ఇరువదియైదు సంవత్సరములు రాజ్యముచేసినట్లు పెక్కు శాసనములలోఁ జెప్పఁబడియున్నది. కాని ప్రస్తుత శాసనమునందు అతని రాజ్యవత్సరముల మితి చెప్పఁబడలేదు. అమ్మరాజుతరువాత అతనిసవతి సోదరుఁడగు దానార్ణవుఁడు మూఁడు సంవత్సరములు రాజ్యముచేసెనని ఇరువదియేడు సంవత్సరముల తరువాత మరల రాజ్యము సంపాదించిన ఇతని కుమారుఁడైన శక్తివర్మకాలమునుండి చెక్కింపఁబడిన శాసనముల వలన తెలియుచున్నది. అమ్మరాజు శాసనమొకటి ఈ దానార్ణవుని పేర్కొనుచున్నది. * ఈ శాసనము దానార్ణవునిదని చెప్పనగును. అమ్మరాజ విజయాదిత్యుఁడు 11 సంవత్సరములు రాజ్యముచేసి కళింగమునకు వెళ్లినప్పుడు అతని సవతితమ్ముఁడు దానార్ణవుఁడు రాజ్యమేలినట్లు కలదు. కాని బాడపుని ప్రస్తుత శాసనమునందు దానార్ణవుఁ డెచ్చటను పేర్కొనఁబడియుండలేదు. కర్ణరాజవల్లభుఁడను వాని నాశ్రయించి బాడపుఁడు అమ్మరాజు నోడించి దేశమునుండి వెడలఁగొట్టెనని మాత్రము చెప్పఁబడియున్నది. కర్ణరాజవల్లభుఁడను పేరులోని వల్లభశబ్దమువలన అతఁడు రాష్ట్రకూటరాజని మనము వెంటనే గుర్తింపవచ్చును. మహాప్రతాపశాలియైన కర్ణరాజను గల రాష్ట్రకూటరాజొకఁడు ఈ కాలమునందు కన్నడదేశములో పరిపాలనము చేయుచుండెను. ఈతని చరిత్రములో మూఁడవ కన్నరదేవుఁడు, లేక, మూఁడవ కృష్ణుఁడు అందురు. ఈతని రాజ్యకాలము క్రీ. శ. 940 మొదలు 971 వఱకని చరిత్రకారులు నిశ్చయించియున్నారు. ఇతఁడు చోళరాజైన రాజాదిత్యుని జంపి, కాంచీపట్టణమును గాల్చి, తంజావూరి పట్టణమును ముట్టడించెను. కన్నరశబ్దములోని రేఫము గౌరవసూచకము. మూలశబ్దము కన్న. దీని సంస్కృతమున మార్చినపుడు శాసనకర్త కర్ణయని మార్చినట్టు స్పష్టము. +

రాష్ట్రకూటరాజగు నీయూఁడవకృష్ణుని సాహాయ్యముచే బాడపుఁడు అమ్మరాజు నోడించెనని మొదటరెను రాజ్యము పెద్ద వంశమువారికిని, రాష్ట్రకూట రాజులకును బహుకాలమునుండి పోరాటము జరుగుచుండెనని శాసనములవలన స్పష్టమగుచున్నది. అమ్మ

* దానార్ణవుఁడు 3 ఏండ్లు రాజ్యముచేసినట్లు బాడపుని శాసనము ఒప్పుట లేదు.

♦ ఈతఁడు రాజ్యమునకు వచ్చినది 999 లోనా. 1003 లోనా అనునది చింత్యము.

* C. P. No. 1 of 1916-1917

+ అసలు కన్నరశబ్దము కృష్ణశబ్దభవము. కన్హ, కన్న అనునవి ప్రాకృతరూపములు. కావుననే యీకన్నరదేవుడు కొన్నిశాసనములలో కృష్ణనామముతో పేర్కొనఁబడెను.

రాజు తండ్రియైన కండవచాళుక్యభీముఁడు రాష్ట్రకూటరాజును, మూడవకణ్ణరునికిఁ బూర్వుఁడునైన యైదవ గోవిందరాజుతో పోరాడి యాతని నోడించెను. అందుచేత రాజ్యభ్రష్టులైన చిన్నవంశమువారు రాష్ట్రకూటుల సహాయమునుబొంది పెద్దవంశమువారిని పదచ్యుతులను జేసియుండుట సహజము. కాని బాదపుఁడు తనశాసనమునందు 'మహారాజాధిరాజ పరమేశ్వర పరమభట్టారక' మొదలైన బిరుదులు వేసికొనుటవలనను, ఇతని ముద్రమీఁద 'త్రిభువనాంకుశ' యని యుండుటవలనను ఇతఁడు ఇతరులకు సామంతుఁడుగ నుండక జ్యేష్ఠ వంశపు చాళుక్యులవలెనే స్వతంత్రముగ ప్రభుత్వముచేసినట్టు కానవచ్చుచున్నది.

అమ్మరాజు చివరకాలమే మనము బాదపుని రాజ్యప్రారంభ కాలముగఁ దీసికొనవలెను. శక్తివర్మ శాసనాదులలో అమ్మరాజు తరువాత అతనియన్నయైన దానుఁడు అనఁబడు దానార్ణవుఁడు మూఁడుసంవత్సరములు రాజ్యముచేసినట్లు చెప్పఁబడినది. కాని యది స్థిరమైన రాజ్యముగఁ గనఁబడదు. అమ్మరాజు రాజ్యభ్రష్టుఁడైనతరువాత కొలఁదికాలములోనే మృతుఁడైయుండును. బలహీనుఁడగుటచే సంతకుపూర్వము తమ్ముఁడగు అమ్మరాజునకే రాజ్యము వదలి యూరకయున్న దానార్ణవుఁడు మూఁడుసంవత్సరములవఱకు రాజ్యమున్నకై కొంతవఱకు పెనఁగులాడి మరణమునొందెనని పైశాసనమునకు మన మర్థము చేయవలెను. దానార్ణవుని బాదపుఁడు లెక్కలోనికిఁ దీసికొనినట్లు కానఁబడదు. అరాజక కాలము 27 యేండ్లని సాధారణముగ శాసనము లన్నింటిలోను, 30 యేండ్లని కొన్నిశాసనములందును గలదు. అమ్మరాజు మరణమునుండి లెక్కవేసిన 30 సంవత్సరములు, దానార్ణవుని మరణకాలమునుండి లెక్కవేసిన 27 సంవత్సరములు. ఇట్లు బాదపునిరాజ్యము క్రీ. శ. 973 లో ప్రారంభమైనను అది యెప్పుడంతమయ్యెనో నిశ్చయముగఁ జెప్పజాలము. బాదపుఁడు 27 యేండ్లుగాని, 30 యేండ్లుగాని రాజ్యము చేసి క్రీ-శ1000 ప్రాంతమున దానార్ణవుని కుమారుఁడైన శక్తివర్మచే నోడింపఁబడియెనో, లేక కొన్నిసంవత్సరములు రాజ్యముచేసి మరణము నొందఁగా నాతనితమ్ముఁడైన తాలపుఁడు రాజయ్యెనో చెప్పఁజాలము.

బాదపునకు తాలపుఁడను* నొక తమ్ముఁ డుండెను. అతనిచే నీయఁబడిన తామ్రశాసనమొకటి కలదు. + అందు తన యన్నగారి పేరువచ్చినప్పుడు 'బాదపాఖ్య మహారాజాధిరాజః పరమేశ్వరః' అనిచెప్పి తననుగురించి చెప్పుకొనునప్పుడు 'తదనుజో విష్ణువర్ధన స్తాల భూపాలః' అనిమాత్రము వ్రాసికొనెను.

ఇదియుగాక కడియముమీఁది ముద్రలో ప్రభుత్వముచేసిన రాజులు వేసికొనిన 'త్రిభువనాంకుశ' అన్న బిరుదు వేసికొనక 'త్రిభువనసింహ' అన్న బిరుదు వేసికొనెను. అందువలన ఈ శాసనకాలమందీతఁడు రాజుకాఁడేమో, అన్న ప్రభుత్వకాలమందే దానమిచ్చెనేమో యని సంశయింపవలసివచ్చుచున్నది. కాని 'విష్ణువర్ధన స్తాల భూపాలః స్వరాజ్యసమయే' అనియొకచోటను, మఱియొకచోట 'విష్ణువర్ధన మహారాజాధిరాజః' అని యింకొకచోటను నుండుటవలన నీతఁడన్నతోఁ గలిసి రాజ్యము చేసెనని కాని, స్వతంత్రముగ రాజ్యము చేసెనని కాని యూహించుటకు వీలున్నది. దానము పుచ్చుకొన్నవానిని వర్ణనము చేయుచు 'పల్లవమల్లాన్వయాయ కలివర్మస్య పౌత్రాయ అస్మత్ప్రస్తావవ్యాపృతస్య కృతక్లేశస్య మకరియ రాజస్య పుత్రాయ కుప్పనయ్యాకర నామ్నే' అని యొకచోటను, 'పరమనిర్వ్యాజభృత్యస్య క్రీత క్లేశామరజిత స్వామి ప్రియస్య పలవాన్వయస్య చతురుపధా శుద్ధస్య మహాసామంతామాత్య పదనియుక్తస్య సకలగుణాలంకృతస్య పతిహితధవలస్య' అని మఱియొకచోటను జెప్పఁబడియున్నది. దీనినిబట్టిచూడ కుప్పనయ్యతండ్రి బాదప తాలపుల కొఱకు అమ్మరాజాదులతోఁ బోరాడి మృతినొందినట్లును, ఆ విశ్వాసమునకై తాలపుఁడతని కీగ్రామమిచ్చినట్లును కానవచ్చుచున్నది. బాదప, తాలపరాజుల ఈ రెండు శాసనములను, రెండవ అమ్మరాజుయొక్క శాసనములతో పోల్చిచూచిన యెడల అమ్మరాజు పక్షమువారిని పెక్కుమందిని చీలదీసి, బాదపతాలపులు తమపక్షములోఁ జేర్చుకొనినట్లు స్పష్టపడుచున్నది. ఎందుకన బాదపుని శాసనములోని ప్రతిగృహీతయైన గండనారాయణుఁడు అమ్మరాజుయొక్క బాంధవుఁడు. తాలపుని శాసనమందలి ప్రతిగృహీతయైన మహాసామంతామాత్యుఁ డగు కుప్పనయ్య అమ్మరాజు రాజ్యకాలమందుఁగూడ నా బిరుదములనే వహించుచు నుండెను, వేలివూండి అను గ్రామములను అగ్రహారముగఁ బడసెను. *

అన్నదమ్ములైన బాదప తాలపుల పైరెండు శాసనములను, వేంగిదేశ మిరువదియేడు సంవత్సరములు నాయక రహితముగ నుండెనన్న యుత్తరకాలీనచాళుక్యశాసనములను కలిపి సమన్వయించుకొనినయెడల ఆకాలమునందు జ్యేష్ఠకుటుంబమువారు దేశాంతరగతులైరనియు, కనిష్ఠకుటుంబమువారు బలవంతులై రాజ్యమాక్రమించుకొనిరనియు తేలుచున్నదేగాని యిరువదియేడు సంవత్సరము లాంధ్రదేశమునందు ఏరాజును రాజ్యముచేయక దేశమంతయు ఒకచేకల్లోలముగ నుండెనని తేలుట లేదు.

దక్షిణమున చోళులును పశ్చిమమున పశ్చిమచాళుక్యులును ప్రబలులైన రాజులుండ, ఆంధ్రదేశము ఖాళీగా నున్నయెడల దాని నాక్రమించుకొనక యూరకుందురా? శక్తివర్మాదిరాజులు తరువాత పోయినరాజ్యమును మఱల సంపాదించుకొని తమకు బాదపతాలపులపై మిక్కిలి ద్వేషముండుటచేతనో, లేక వారుకూడ రాజ్యము

* ఈశబ్దము శాసనములలో తాటిప, తాలప, తాడప, తాళప అను రూపములతోఁ గానవచ్చుచున్నది. పెక్కు శాసనములలో తాటి రూపము కనఁబడుచున్నది.

+ Ep. Rep. 1908-1909, C. P. no 5; ఈ శాసనము నకలు లోకల్ రికార్డులు 57-వ సంపుటములో నీయఁబడియున్నది. అందువలన మెకంజీనాఁటికే యీశాసనము అప్పుడు నిజాంపట్నం సర్కారులో నున్న సిరిపూడి కరణముగారికి దొరకినట్లు కానవచ్చుచున్నది.

* Ep. Ind. Vol. IX p 131.

చేసిరని చెప్పినయెడల వారి సంతతివారికి ముందు హక్కుండునన్న భయముచేతనో, వారికేదైనఁ జెప్పనొల్లక దేశమునకు రాజే లేకుండ యుండెనని తమశాసనములలో వ్రాయించియుందురు. ఈయిరువది యేడు సంవత్సరముల తరువాత బాదపునో, తాలపునో, ఓడించి మఱల జ్యేష్ఠవంశమును రాజ్యముపై నిలిపినవాఁడు దానార్ణవుని పెద్దకుమారుఁడైన శక్తివర్మ. ఇతని రాజ్యప్రారంభకాలమును, చోళరాజైన రాజరాజకేసరివర్మ వేంగిదేశముపై దండెత్తివచ్చిన కాలమును ఒకటియే. ఈశక్తివర్మశాసనము లిదివఱకు రెండుదొరకినవి. ఇందొక దానిలో * నీతఁడు బద్యెమాదిప మహారాజును ఓడించినట్లును, చోడభీముఁడను వానిని జంపినట్లును బాల్యమున చోళులతో + యుద్ధముచేసినట్లును చెప్పఁబడి యున్నది. • ఇంకొక శాసనమందు ఈతఁడు చిన్నతనమునందే ద్రమిళయుద్ధమునం దనేకశత్రుగజములను స్వఖడ్గముచేత ఖండించెననియు, చోడభీమునిచేఁ బంపఁబడిన యొక మహావీరుని స్వయముగఁ జంపెననియు, జటచోడుఁడను మహావృక్షమును వ్రేళ్లతోఁ బెకలివైచె ననియు చెప్పఁబడి యున్నది. బద్దెగ మహారాజుతోఁ బోరినట్లును ఉన్నది కాని యాభాగము స్పష్టముగ లేదు.

బద్యెమమహారాజు, బద్దెమమహారాజు అను పేళ్లు బాదపమహారాజను దానికి కొంచెము భేదముతో మాఱురూపములు. § మహారాజపద మున్నందునను, ఆకాలమునందు బాదపుఁడు తప్ప అట్టిపేరు గలవారు మఱియెవరును మహారాజపదవిగలవారు లేనందున వేంగీరాజైన బాదపునే గ్రహింపవలయును. అట్లయిన బాదపుఁడిరువది యేండ్లవఱకు బ్రదికియున్నట్లే గ్రహింపవలసియున్నది. ఆకాలమునందు అతనితమ్ముఁడైన తాలపుఁడు యువరాజుగనో, మంత్రిగనో యధికారము చేయుచుండెను కాఁబోలు.

పైశాసనములోఁ జెప్పఁబడిన జటాచోడుఁ డనువాఁడు రాజేంద్రచోడుని కుమారుఁడైన జటావర్మసుందర చోళపాండ్య అనువాఁడు. ఇతని మూలనామము జటావర్మచోళుఁడు. రాజేంద్రచోళుఁడు పాండ్యదేశమును గెలిచినతరువాత అచ్చట తన కుమారుని తన ప్రతినిధిగా నిలిపి యాతఁడే పాండ్యరాజని తెలుపుటకు 'సుందరపాండ్య' శబ్దము నతని పేరుకు జేర్చెను. రాజేంద్రచోళుఁడు పాండ్యదేశమును గెలిచినకాలము మనకు నిశ్చయముగ దెలియదు. కాని యాపని క్రీ.శ. 1016 నకు పూర్వమే జరిగెనని తజ్ఞులయభిప్రాయము.†

* Ep. Rep 1917-18, C. P. No 15.

+ బాల్యే కీర్తిలాభి చోళైరణే యేన ప్రయోద్యానిశా। యేనాత్యుద్ధత బద్యెమాధిప మహారాజాదయో విద్రుతాః రావణ ప్రతినిధి శ్చాళుక్య సాహాయనె। వాహాస్త ద్వ్యష తాపయేననిధనం శ్రీచోడ భీమాధిపః

• ఆం. సా. ప. సం. 2 పుట 406.

§ బద్దెమలోని మకారము, బాదపలోని పకారము మూలశబ్దములోనివి గావు: గౌరవసూచకములగు ప్రత్యయములు.

† చోళులు పాండ్యదేశమును ఆక్రమించుకొనుటకు ప్రారంభించినది రాజరాజు కాలములో క్రీ. శ. 994 ప్రాంతమునుండి యని కానవచ్చుచున్నది. V. A. Smith's Early History of India p 454.

కావున శక్తివర్మ జటాచోడునితో పోరాడినది అరాజకమనఁబడిన కాలములోనో, తాను రాజ్యమునకు వచ్చిన ప్రథమదినములలోనో అయియుండును. భీమచోడుఁ డెవఁడో స్పష్టముగఁ దెలియుట లేదు. ఎవఁడైనను చోడరాజు పక్షమున శక్తివర్మతోఁ బోరాడినవాఁడై యుండవలెను. ఈపోరులందఱును ద్రావిడులే గనుకను, వీనిశైశవమునందు గెలిచితినని చెప్పుటవలనను ఈపోరాటములు శక్తివర్మ యిరువదిసంవత్సరముల వయస్సువచ్చుటకుఁ బూర్వమే జరిగియుండవలెను. తండ్రియగు దానార్ణవుని మరణకాలమువఱకు అనఁగా 978 వఱకు పెద్దకుమారుఁడు పదిసంవత్సరముల వాఁడనియు, చిన్నవాఁడగు విమలాదిత్యుఁడు అయిదుసంవత్సరములవాఁడనియు అనుకొన్నయెడల శక్తివర్మకు క్రీ. శ. 983 వ ప్రాంతమున 20 సంవత్సరముల వయస్సుండును.

శక్తివర్మచోళులతోఁ బోరుటకు కారణమేమి? ఈతఁడు మఱల రాజ్యము సంపాదించినది ఎవరిసహాయమువలన? అనువిషయమై పండితులు భిన్నాభిప్రాయులై పెక్కువిధముల వ్రాసియున్నారు. చోళులు ఆంధ్రదేశము మీఁదికి క్రీ. శ. 972 ప్రాంతమున దండెత్తివచ్చినందున 27 సంవత్సరములవఱకు దేశ మరాజకముగనుండెనని చాలకాలము పండితు లభిప్రాయపడియుండిరి.౧ కాని 999 వఱకు చోళు లాంధ్రదేశముమీఁదికి దండెత్తివచ్చియుండుట యసంభవమనియు, ఆసంవత్సర ప్రాంతమున రాజరాజు కొడుకైన రాజేంద్రచోడుఁడు దండెత్తి వచ్చియుండె ననియు, అతని సాయమువలననే అరాజకముమాని శక్తివర్మ మఱల రాజ్యస్థుఁ డాయె ననియు ఇటీవల కొందఱుపండితులు తమయభిప్రాయమును మార్చుకొనిరి. ౨ చోళులు క్రీ. శ. 999 వఱకు తెనుఁగుదేశముమీఁదికి రానిమాట వాస్తవమే. కాని శక్తివర్మ వారి సాయమువలన బాదపాదులను జంపి, పోయినరాజ్యమును సంపాదించుకొనెనన్నమాట మాత్రము శక్తివర్మశాసనములనుబట్టియే యసత్యమని తేలుచున్నది. ద్రావిడులతోను, జటాచోడునితోను, భీమచోడునితోను బోరాడినశక్తివర్మ రాజేంద్రచోడుని సాయమున రాజ్యమునకెట్లువచ్చును? కావున శక్తివర్మ మఱియొకరి సాయమువలన పోయినరాజ్యమును సంపాదించుకొనెనని మన మనుకొనవలయును.

ఆకాలమునందు శక్తివర్మకు సాయముచేయఁ గలిగినట్టి గొప్ప రాజెవఁడుండెనని విచారింపఁగా పశ్చిమచాళుక్యవంశోద్ధారకుఁడైన రెండవ తైలపుఁడును, అతని కుమారుఁడైన సత్యాశ్రయుఁడును కనఁబడుచున్నారు. తైలపుఁడు క్రీ. శ. 973 మొదలు 997 వఱకును, సత్యాశ్రయుఁడు క్రీ. శ. 997 మొదలు 1008 వఱకును రాజ్యము చేసిరి. బాదపుఁడు సాయముచేసిన కర్ణదేవుని జంపి తైలపదేవుఁడు కర్ణాటాదిదేశముల నన్నింటిని ఆక్రమించుకొనెను. బాదపునకు సాహాయ్యముచేసిన కర్ణదేవునకును, అతని వంశమునకును బరమశత్రువులైన తైలపాది చాళుక్యులను బాదపుని

౧ ఆం. సా. ప. సం 1. పుట 45.

౨ Ep. Ind. Vol. VI. P.358.

శత్రువైన శక్తివర్మ నాశ్రయించుట సహజము. కాని తండ్రి మరణ సమయమున శక్తివర్మ చిన్నవాఁడగుటచే వయస్సు వచ్చువఱకూర కుండి తరువాత పశ్చిమచాళుక్యుల సైన్యముతోఁజేరి వారుచోళులతో పోరాడఁగఁ బోయినప్పుడు తన పౌరుషముం జూపి వారి యనుగ్రహమును సంపాదించి తైలపుఁడు పోయినతరువాత అతని కుమారుఁ డగు సత్యాశ్రయుని సాయమువలన పూర్వరాజ్యమును మఱల సంపాదించి యుండవచ్చును. ఇది యూహ. కాని శక్తివర్మకు, చోళులకు గల వైరమును స్పష్టపఱచునట్టి శక్తివర్మశాసనములును, పశ్చిమ చాళుక్యరాజైన సత్యాశ్రయుఁ డాంధ్రదేశమునకు వచ్చినట్లు తెలుపు గుంటూరుమండలములోని చేబ్రోలు శాసనమును ఈ యూహను మిక్కిలి బలపఱచుచున్నవి.౧

ఇందుకు వ్యతిరేకముగ చోళుల సహాయమువలననే శక్తివర్మ మఱల రాజ్యమును సంపాదించుకొనె ననువారు శక్తివర్మ తమ్ముఁడైన విమలాదిత్యునకును చోళరాజులకును గల సంబంధమును జూపవచ్చును. చోళరాజైన రాజరాజు కూఁతురు కుందవ విమలాదిత్యుని భార్య. విమలాదిత్యుఁడు చోళదేశమునందున్నట్లు ద్రావిడదేశమునందలి క్రీ. శ. 1013 నాటియాతని శాసనమువలనఁ దెలియుచున్నది౨. తమ్మునికి బంధువులైనవారు అన్నకు శత్రువు లగుదురా? కాని రాజ్యాతురులైన రాజులచరిత్రమునకును, సామాన్య జనుల చరిత్రమునకును మిక్కిలి భేదముండు నని మనము మఱవఁగూడదు. శక్తివర్మయొక్కయు, విమలాదిత్యునియొక్కయు శాసనాదులనుజూడ అన్న పశ్చిమచాళుక్యులను, తమ్ముఁడు చోళులను ఆశ్రయించినట్లు కనఁబడుచున్నది. తండ్రి చనిపోయినప్పుడు వీ రేప్రాయమువారో, యెంతకాలము కలిసియుండి యెప్పుడు చీలిరో యూహించుటకు సాధనము లేవియు లేవు. కాని అన్నకు చోళులతో వైరమును, తమ్మునకు వారితోనే బంధుత్వమును స్నేహమును ఉండె ననుట వారి శాసనములవలన స్పష్టము. చోళులు క్రీ. శ. 1011 తరువాత విమలాదిత్యుని చెఱఁబట్టికొనిపోయి, తమపిల్లనిచ్చి పెండ్లిచేసిరని కొందఱు వ్రాసియున్నారు.* గంజాములోని మహేంద్రగిరిమీఁద రాజేంద్రచోడుని శాసన మొకటి గలదు. అందు నాతఁడు విమలాదిత్యుని జయించె నని యున్నందున వీరట్టి యూహ చేసిరి. కాని యా శాసనమును మఱల శాసనశాఖవారు మహేంద్రగిరి కేగి చదివి చూడఁగా నందుఁ జెప్పఁబడిన విమలాదిత్యుఁడు చాళుక్యుఁడు కాఁడనియు, అటువైపున నుండు నొక చిన్నరాజనియుఁ దేలినది. ఇదియుఁగాక విమలాదిత్యుని వయస్సునుబట్టి చూచినను, అతని వివాహము క్రీ. శ. 1010 కు పూర్వమే అయియుండవలె నని స్పష్టపడఁగలదు. ఇతని తండ్రియైన దానార్ణవుఁడు క్రీ. శ. 973 లో మృతిఁబొందెను. అప్పుడితఁడు ౫ సంవత్సరములవాఁ డనుకొనినను 1011 లో నీతనికి 38 ఏండ్ల వయస్సుండును. ఇంత వయస్సు ముదిరినవానికి రాజరాజు తనబిడ్డ నిచ్చె ననుట అంతగ సంభవము కాదు. వివాహకాలమునకు విమలాదిత్యుని వయసు 25 సంవత్సరములు మించలేదని యనుకొనుట స్వాభావికము. అప్పు డాతని వివాహము క్రీ. శ. 993లోనో అంతకు పూర్వమో అయియుండవలెను. ఇట్లు విమలాదిత్యుని క్రీ. శ. 1011 లోఁ జెఱఁబట్టుకొనిపోయి చోళులు పిల్లనిచ్చి రనుట పొసఁగ నేరదు. చోళులకును, అతనికిని అంతకుఁ బూర్వము నుండియే సంబంధము కలిసియుండవలెను.

౧ Ep. Rep. No 145 of 1897.
౨ Ep. Rep. No. 215 of 1894

* Ep. Ind. Vol. VI, p 340.

## [1] తామ్రశాసనము - మూలము

### మొదటి రేకు

(1) స్వస్తిశ్రీమతాం సకలభువన సంస్తూయమాన మానవ్యసగోత్రాణాం హారీతిపుత్రాణాం కౌశికీ (2) వరప్రసాదలబ్ధ రాజ్యానాం మాతృగణపరిపాలితానాం, స్వామిమహాసేన పాదానుధ్యాతానాం భగవన్నారా (3) యణప్రసాద సమాసాదితవర [వరా] హలాంఛనే క్షణ క్షణవశీకృతారాతిమణ్డలానాం మ[2]శ్వమేధా (4) వభృథస్నాన పవిత్రీకృత వపుషాం[చాళుక్యానాం కు]లమలా(ల ౦కరిష్ణోః సత్యాశ్రయవల్లభేన్ద్రస్య భ్రాతా కు (5) బ్జవిష్ణువర్ద్ధ[3] నోష్టాదశవ [ర్షాణి] వేఙ్గీదేశమపాలయత్ । తదాత్మజో జయసింహస్త్రయస్త్రి (6) ంశతం। తదనుజేన్ద్రరా [జనన్ద నో] విష్ణువర్ద్ధనో, నవ। తత్సూనుర్మఙ్గియువరాజః పంచవింశతి (7) తత్పుత్రో జయసింహస్త్ర [యోదశ । తదవ] రా(ర)జః కోకిలిః షణ్మాసాన్ తస్యజ్యేష్ఠో భ్రాతా విష్ణు(8) వర్ద్ధనస్తముచ్చాట్య సప్తత్రింశతం । తత్పుత్రో విజయాదిత్యభట్టారకో ష్టాదశ । తత్సుతో విష్ణువర్ద్ధ (9) నః షట్త్రింశతం। తత్సుతో విజయాదిత్యనరేన్ద్రమృగరాజ శ్చాష్టచత్వారింశతం । తత్సుతః కలివిష్ణువ (10) ర్ద్ధనో [ధ్యర్ధవర్షం] తత్సుతో గుణగాంక విజయాదిత్య శ్చతుశ్చత్వారింశతం । తదనుజయువరాజ వి

1. తామ్రశాసనమునుబట్టి యథామూలము వ్రాయఁబడినది. అక్షరములు పోయినచోటను, బాగుగ తెలియనిచోటను, అక్షరము లూహింపఁబడి కుండలీకరణమునందుంచబడినవి. ఊహించుటకు వీలులేనిస్థలములందుఁ జుక్కలు పెట్టఁబడినవి. తప్పులుగానున్నను మూలప్రకారము వ్రాసి, ప్రక్కను ఇది యిట్లుండవలయునని చూపఁబడినది. 2. చామళ్య. 3. వర్ధనశబ్ద మీలేఖకుఁడంతటను వద్ధ౯న అనివ్రాసియున్నాఁడు. అంతటను దిద్దవలెను.

### రెండవ రేకు — మొదటి ప్రక్క

(1) క్రమాదిత్య భూప [శ్శస్త్రనయశ్చాళుక్యభీమ] భూపాలస్త్రి [0] శతం । తత్పుత్ర కొల్లభిగణ్డ విజయాది (2) త్యస్సమాః

సాన్[।]తత్సుతో౽౦బ1 రా [జస్సప్తవర్షాణి] తత్సుత[ం]విజయాదిత్య బాల ముచ్చాట్య తాలపోమా (3) సమేకం భుక్త్వా చాలుక్య [భీమ సూను] ర్విక్రమాదిత్య ఏకాదశమాసాన్ [।] తతస్తాలపరాజస్య (4) సుతో యుద్ధమల్లః సప్తవర్షాణి భుక్త్వా కొల్లభిగణ్డవిజయాదిత్య సుతో భీమరాజో ద్వాదశవర్షాణి (5) తి తస్యమహేశ్వర [మూ] ర్తేః భీమభూపతేః ఉమాసమానాకృతేః లోకమహాదేవ్యాః కు (6) మారాభః ఖలు యస్స మభవ దమ్మరాజాఖ్యః అసౌ సమ్యగ్ధర్మన్యాయేన వేంగిదేశంత్రి (7) కలింగ సహితంరక్షతిస్మః అశ్రిత్యకర్ణరాజాఖ్యవల్లభం బాదపాధిపః వినిగ్గమయ్య 5 తద్దే (8) శాదమ్మరాజాఖ్యముజ్జితం [॥] జిత్వా [దా] యాన్నృధిత్వారి పుని కరమథార్థర్థినాం వస్తురాశిం దత్వాసంపూజ్యాబ (9) న్వాన్స కల గుణగణాలంకృతో త్తుంగ6 । కీర్తిః మానివీరః ప్రతాపీసను మత చరితః పాలయన్వాతిభూ (10) మిం వేంగిశోయుద్ధ మల్ల క్షితిపతి తనయో బాదపాఖ్యాధి రాజః ॥ యస్మిన్నాసతి నృపతో7 పరిపక్వా

రెండవ రేకు — రెండవ ప్రక్క

(1) వేకసస్య సంపన్న హితః । చ (ర) మతి ధర్మానురక్తో8 నిరిరితి రపరుజ్ఞరక్త చోరోదేశః ॥ మనురివ సకలజనానాం జనక (2) ఇవా శేష భృత్యవర్గాణాం కామ ఇవ [కా] మినీనా మర్థి జనానాంచ కల్పతరుః ॥ స్న సమస్తభువనాశ్రయ శ్రీవిజయా (3) దిత్య మహారాజాధిరా [జప] రమే [శ్వర] పరమభట్టారకః పరమ మాహేశ్వరః పరమ బ్రహ్మణ్య మాతా పితృ పాదాను (4) ధ్యాయీ వెలనాణ్డు విష యనివాసి [నో రాష్ట్రకూట] ప్రముఖాన్కుటుంబిన స్సమాహూయేత్థ మాజ్ఞాపయతి విదితమ (5) స్తువః [॥] శ్రేష్ఠోఽయశ్చ ధనుర్ధర (ఏ) [కలి] యుగే తత్కాలత్వ 10 వీయూపహః భూయోజాత ఇతి ప్రఖ్యమ11 (6) హి [మో] రామార్జునాభ్యాంసమో [బా?] ఆదిత్య విశేష నామ వినుతో ధర్మైక రతస్సత్యవాక్ । త్రాతా (7) ......... ...... 12 విద్విష్ట కాలానలః । తత్పుత్రో నృపకామ ఇత్యభినుత స్సత్యప్రతి (8) [శ్లోధ] స [1] ద్ధర్మాంచా............విఖ్యాత శౌర్యాకరః యుద్ధాద్రిష్టవిధిగ్ఛతాంచ పవనా సాస్రం (9) సయ... ఖ్య కిం నో రాః13..............................తాయస్య ప్రతాపానలః, సకామ్మనాకజితారిత్వాత్కామ్మనా (10) జ్ఞాన నా[మ]......భృత్ సత్య...............తసేవ్యాః [।] ధీస్య శ్రీగురుమాగ్రి14 జన్మ నికరావ్య

మూడవ రేకు — మొదటి ప్రక్క

(1) సంసహాయం నృపాః [భి]త్యానీకగణాః] నాస్య...... 15జనకంకల్పద్రుమం చార్థినః మన్యన్తేపిస (2) దైకమూర్జితమనేక [ప్ర]స్థమూర్ధాన్వయః [॥] చిత్రం శ్రీవరకామకార్జున నృపం కామాళ్ళ కాయా 16 స్త్రియః । (3) యచ్ఛౌర్యార్జం యుధి వైరి భూపనివహా వ్యాఘాతజాతం భ్రింశం17 యద్దానం ద్విజసంశ్రి (4) తార్థి జన సంత్రిప్తి18 క్రియాపాల [న]ం । యత్కీర్తి స్సకలాఖ్య చన్ద్రికధవ (5) లాకృ భ్రికశోతిక్షితి ( ) [।] సోయం చాతి సుకామ్మ కార్జున సరోనాథోజ్జి (ా) తోషి (6) య్యా వాణ్ కనతిసన్నృ [ప] కామసరః పతి [ః] శ్రీశజనానన పద్మసు నన్దనః । ఇవా సదో (7) దితిరంకునిధిః క్షితో । రిపుకమోనుది నేవ19 సమోనఘః । దానోదారదయా బలప్ర

మూడవ రేకు — రెండవ ప్రక్క

(1) కటి[త] ప్రావీణ్యశౌచక్షమా మానాలంఘ్య శివార్చనో రుగుణముక్తాహార సంభూషితః (2) దీనానాథనటాన్ధ నగ్నకవి వాగ్మి స్త్రీద్విజానన్దకి20 ద్ఖాతి ప్రస్తుతకీర్తి మాన్రణజయా (3) శ్రీసత్య [బ] ల్లాతరాట్ [॥] ధవలగుణో ధవలయశో ధవలితదిగ్మణ్డలో [వి] దమితారా (4) తిః । భవక్తో భవకరుణా21 ద్భవ భవభోగో న్వితో విభాతి సుకీర్తిః । అకన్ప్రతా (5) పారివిద్రగ్ధ శ్రీప్రా తుమాజ్ఞా కరుణాశ్రితోభిః ఏసః క్షిదస్యం22 భువి భాతినిత్యం । (6) సత్యాశ్రితస్స న్నృపకామకారి23 ॥ యోవర్ధీతు రికేశోకః పంచ వీరా న్బలా త్స్వయం। పు(పు) (7) [ణ్యతర]మపాం శత్రూన్సహస్రా న్యధిభాతిసః। బ్రహ్మేశేన్ద్రప్రిషికేశ కుమారాణాం

నాలుగవ రేకు — మొద[టి] ప్రక్క

(1) [త] థాభవ న్వాగ్వభూమా శచీ లక్ష్మి । జయశ్రీ శుభ గాస్త్రియః ॥ తథా తేషాం సమ (2) స్యాభూ న్నృపకామసరః పతేః తాసాంసమా ప్రియాభార్యా నాయమంబా24 ఇతి (3) శ్రుతా॥ సర్వా25 లక్షణసంపన్నా సర్వాభరణ భూషితా। సర్వస్త్రీధర్మతత్వ జ్ఞా శ్రీ (4) లవృత్త వతీసతీ॥ తస్యాం పతివ్రతాయాంచ గణ్డ నారా యణాహ్వయః స (5) త్య బల్లాతనామాంకః పౌత్రం పుత్ర మజీ జనత్ ॥ ఉమాన్నపాంక యోాయ్య (ా) (6) [థా?] గుహా [శ్న] చిన్ద్రి26 యోరివజయ న్త ఇత్యభూ త్సుతః తయోశ్చ తత్సమానయోః॥ (7) [వ్యూ] హోరస్కో వృషస్కన్ద స్కన్ద ప్రతిమ విక్రమః [।] మహోత్సాహో మహోద్యోగీ మహా

నాలుగవ రేకు — రెండవ ప్రక్క

(1) బాహు ర్మహాబలః॥ నృపకామసరోనాథ పుత్రో జ్యేష్ఠోతి బుద్ధిమా న్గణ్డ నారాయణ (ః) (2) శ్రీయాన్గజాశ్వాయూధ కౌశలః॥ పటు

---

1. అంబరాజ నా అమ్మరాజు

5 వినిర్గమయ్య 6 తుంగ 7 నృపతౌ 8 ధర్మధర్మానురక్తో 9 స

10 త్కార్త. 11 ప్రకాశమహిమో, లేక, ప్రసిద్ధమహిమో అనిగాని యుండవలెను. 12 ఇచ్చటి అక్షరములు తార్తిగ నణగం గొట్టబడినవి. 13 రేకులో నిచ్చట నొకమూల విరిగి యెచ్చటనో పోయినది. నాయొద్దకు రాలేదు. అందువలన 8, 9, 10 వ పంక్తులలోం గొన్ని యక్షరములు పోయినవి. 14 శాశీగురుమగ్ర

15 ఈ పంక్తిలోని కొన్ని యక్షరములు సుత్తిదెబ్బను అణిగి పోయినందున స్పష్టముగా దెలియుట లేదు. 16 కామంస కామా స్త్రియః 17 భృశం 18 సంతృప్తి 19 తమోనుద సేన 20 కృద్ఖా 21 కరుణోద్భవ 22 దస్యాం 23 కారిః 24 నాయమాంబేతివి 25 సర్వ 26 కృచీంద్ర.

న్నార స్సుచిర్దక్షః శీలవృత్త గుణాన్వితః [।] ధనుమ్మత్సు (3) యమ త్రేష్ఠః శ్రేష్ఠస్సర్వకలాసుచ॥ మాతాపితృపాదాబ్జ[27] భ్రమరో భాస్క (4) రోన్నృప [ః క] ణ్డనారాయణాహ్వోయ స్సర్వశస్త్రభృ[28] తాంవరః॥ తస్మై శ్రీబాదపరాజాధి (5) [రా] జరా [జేన్ద్ర][29] పుంగవః] ప్రీతః ప్రాదాన్మహాగ్రామ మారుంబాకేతి శ్రుతః ॥ తస్మై క (6) [ణ్డనారా] యణాయ వెలనాణ్డువిషయే ఆరుంబాక నామ గ్రామం సర్వ[30] కరపరిహారం[31] (7) [తామ్ర] శాసనీ [కృత్యమ] యాదత్త ఇతి ॥ బాదపరాజేన్ద్రేణ దత్త దత్త గ్రామస్వీకృత్వా,

## అయిదవ రేకు—మొదటి ప్రక్క

(1)...కణ్డనారాయణ స్స్వయం స్వమాతుర్నాయ మంబాయాః కనీయసీ సహోదరీ సా (2) ...కాంబాత [స్యాః పు] త్రశ్చన్ద్రేనాఖ్యః తస్మై చన్ద్రేనాఖ్యాయ స్వీకృత మారుంబాక నామ(3) [గ్రా]మం ము[32] ద[కపూర్వం][33] ప్రాదాత్ తం గ్రామ(ం) స్వీకృత్వా

27 పదాంభోజ 28 భృతాం 29 రాజేంద్ర 30 గ్రామస్సర్వ 31 పరిహారః 32 గ్రామముదక 33 పూర్వకం

చన్ద్రేనాఖ్యః కలాస్స్వీకృత్వా పూర్ణచన్ద్ర ఇవ భ్రా (4) జతిస్మ కూరః కుమారమ్సుభ [టా] గ్రగణ్య స్సరోవరాజా [ం] సకలాగమజ్ఞః కారుణ్యవా (5) న్గర్విత శత్రుహన్తా చారూదయో భాతి సుచన్ద్రేనార్యః ॥ తస్య గ్రామస్యావధయః పూర్వ (6) తః చెఱకుంబల్లి దక్షిణతః శ్రీపూణ్డి పశ్చిమతః కావూరు ఉత్తరతః గోమహావు । అస్య గ్రామ (7) స్యోపరి న కేనచిద్బాధా కర్తవ్య యః[34] కరోతిస పఞ్చమహాపాతక సంయుక్తో భవతి । స్వద (8) త్తాం పరదత్తాం వా యోహరేత వసున్ధరాం [।] షష్టిర్వర్ష సహస్రాణి విష్టాయాం జాయతే కృమిః[35] । వ్యాసేనాఖ్య

## అయిదవ రేకు—రెండవ ప్రక్క

(1) క్తం—బహుభి ర్వసుధా దత్తా బహుభిశ్చాను పాలితా యస్యయస్య యదాభూమి[36] తస్యతస్యతదా ఫలం। అజ్ఞప్తి (2) క[ట]క నృపః కవిరయ్యనభట్ట సర్వశాస్త్రజ్ఞః లిఖితం భట్టదేవేన శాసన మానన్దితా గార్క (ం) ॥

34 కర్తవ్యా 35 క్రిమిః 36 భూమిస్తస్య

# శ్రీ మహాత్మా గాంధి స్తవము

కలశపూడి శ్రీశైలము గారు, బి. ఏ.

భారతధర్మతత్త్వపుఁ బ్రభావము ప్రస్తుతకాలమందు నే
ధీరుని దివ్యరూపమున దేశమునెల్లెడఁ దేజరిల్లఁగన్
దారుణ దాస్యపుందపము దద్దయుస్రుక్కఁగ నాత్మశక్తి వి
స్తారపటుత్వముం దెలియసాగిరి భారతదేశవాసు, లా
పారగభీరు శాంతగుణసాంద్రుని, నిస్తులలోక సంగ్రహా
ధారుని, గాంధిదేవుని, విధాయకమంచు నుతింతు నెంతయున్

ఉ. ద్వ్యత్తురిరై మహాత్మయుతమాటను నే ఋషినామ మిప్డు పం
చాతురి సన్నిభంబగుచు సర్వజనాస్యములందు మ్రోయుచున్
రక్షణమయ్యెఁ గ్రూర పరరాక్షసబాధ లడంప, నా దయా
వీక్షణు, నాత్మమాభరణు, ద్వేషవిదూరుఁ బ్రశాంతు, నాహిర
ణ్యాక్ష సహోదరాత్మజ సమంచిత వర్తను, గాంధిఁ గొల్చెదన్

శా. స్వార్థత్యాగ విశిష్టశిక్షణమె దేశక్షేమ మన్నట్టి స
త్యార్థంబుఁ బ్రకటించి యాత్మబలముఁ స్థాపించి, యేధీరుఁడా
వ్యర్థప్రార్థన లెల్లమాన్పి నిరపాయంబైన మార్గంబునన్
వర్ధిల్లంగ నొనర్చి దేశమును గాపాడంగ జన్మించె, నా
నిర్ధూతాఖిల కల్మషున్ గొలుతు గాంధిన్ సత్యసంపన్నునిన్

ఉ. బంధురశాంత సాత్త్వికవిభాకర తేజము జూపిఁ ద్వేషభా
వాంధము బాపి, నిస్తుల సహాయనిరాకృతి సల్పి, దాస్యపుఁ
బంధము డుల్చి, సర్వసుఖవర్ధనమైన సర్వరాజ్యమున్ దయా
సింధుఁ డజాతశత్రుఁడు ప్రసిద్ధుఁ డెవండిట నిల్పుచుండెనా
గాంధిని సత్యసంధుని బ్రశాంతుని నిశ్చలభక్తిఁ గొల్చెదన్.

ఉ. కష్టములన్ సహించి కడకన్ మనభారతమాతపుత్త్రకా
మేష్టి నొనర్చియుండ బ్రభవించి, చరించియు దక్షిణాఫ్రికా
శిష్టరవస్యభూములను, శే సముసల్పి మహామ్మదీయులన్
శిష్టులఁగూడి, రాజ్యరమ చేకొననెవ్వఁడు దాస్యరావణున్
భ్రష్టునిజేయుచుండె, జనవంద్యుఁడు, రామసమానధీయుఁడా,
శ్రేష్ఠుఁడు, దేశబాంధవవరేణ్యుఁడు, గాంధిమహాత్ముఁడెంతయున్
నిష్ఠనుగొల్చు నాహృదయనీరజమందు వహించుగావుతన్.

# ఆంధ్రవాఙ్మయమున నాచన సోమనాథున కీయందగిన స్థానము

రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ గారు

నాచన సోముని కవిత్వముం జర్చించుచు నై పేరుతో నేను గొన్ని యేండ్లక్రిందట వ్రాసిన వ్యాస మాంధ్రదేశీయ పండితుల కనేకుల కాందోళనముం గల్గించినది. శ్రీ శతావధాని వేలూరి శివరామ శాస్త్రులు గారు, టేకుమళ్ల అచ్యుతరావు గారు, దుర్భా సుబ్రహ్మణ్య శర్మగారు, నడకుదుటి వీరరాజు పంతులు గారు మొదలగువారు నై విషయమును జాలం జర్చించిరి. శివరామ శాస్త్రి గారు 'నాచనసోముం' డను గ్రంథమున నతని గుణదోషముల రెంటిని జర్చించి మధ్యస్థవ్యాఖ్యయును వహించిరి. అచ్యుతరావు గారాంధ్రసాహిత్య పరిషత్పత్రికలో సోముని జాలం బొగడి నా సిద్ధాంతము (సోముని కవిత యెఱ్ఱనకవిత కన్నం గొంచె యను విషయము) ఖండింపం దగినదని మాత్రము వచించి యుదాసీనులైరి. దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారును నా సిద్ధాంతమును సమగ్రముగ ఖండించుచు గొన్నాళ్ల క్రింద నెల్లూరిలో నుపన్యసించిరంట. శ్రీ వీరరాజుగారు విమర్శరూపముగ నొక గొప్ప గ్రంథమే వ్రాసిరంట. కాని, యందలి కొంతభాగము మాత్రమే కడచిన సంవత్సరాదిసంచికలోం బ్రకటించిరి. సోమునికన్న నెఱ్ఱన మేలను నా మతము నంగీకరించినవారు శ్రీ నాగపూడి కుప్పుస్వామయ్యగారొక్కరే యిదివఱకు నాకుం గానవచ్చినవారు.

నేను వ్రాసిన నలువదిరెండు పుటల వ్యాసమందు ప్రత్యక్షరము ఖండనీయమని తలంచినవారు వీరరాజుగారు. అందు లోపము లనేకములు కలవని నే నెఱుంగుదును. కాని వీరరాజుగారు తలంచినట్లు దోషములు తప్ప వేమియు నందు లేదని తలంపవలసినంత యక్కఱ నాకింకను దోంపలేదు. శ్రీ శివరామశాస్త్రులు గారు నా యందలి లోపములను జూపుటయే కాక, గ్రహణీయములైన విషయములం గూడ మఱుంగుపఱక యంగీకరించిరి. శ్రీ వీరరాజు గారి సంపూర్ణగ్రంథము బైలువడునంతవఱకు నే నూరకుండవలసినదే. కాని, వారి ఖండనఖండముం జదివిన తరువాత వారి విమర్శనమార్గము గుణపక్షపాతము గలది కాదని స్పష్టమై, ఇంతకన్న గ్రంథములో నేర్పరింపవలసిన దేమియు నుండదని నే నూహింపవలసెను. కావున నేను వ్రాయవలసిన దంతయు నిప్పుడే సాధ్యమైనంత సంగ్రహముగా వ్రాయంగలను.

మొదలు ఫల్గు, పరంధామ, శబ్దములం గూర్చి నా పొరంబాటు తెలిపినందుకు వారికిం గృతజ్ఞుడనై వందనము లర్పించుచున్నాను. పై విషయము మొదటే తెలిపిరి గాన శ్రీ శివరామశాస్త్రులును నాకు వంద్యులు. బలరాముని గదుం డను పేర సోముడు వ్యవహరించినందుకు వారిచ్చిన సమాధానము యుక్తమైనను తృప్తికరము గాదు. బలభద్రునిచేత నంతకు మున్న 'ఈషాదండ'ము వ్రేట్లు సోముడు వర్ణించెనే కాని 'గద యతనిచేత నున్న' ట్లెప్పుడును జెప్పలేదు. కావున 'గదుండను సగదుండై గదాధరుండనఁ దగినట్టియెడ' ఇత్యాది స్థలముల 'గదగలవాండ'ని వ్యుత్పత్తిని గల్పించినను, సోముడు 'భాషాభూషణుండు' కాంగలండేమో కాని, బలరాముడు మాత్రము 'గదుం' డగుట కష్టము. పోనిండు, పైపొరంబాటు లొక చేర నేం జేయకుండినను, నా వ్యాసము నిర్దుష్టము గాదు. అందలి యభిప్రాయములు కొన్ని నాయిప్పటియభిప్రాయములకు విరుద్ధములుగా నున్నవి. నాచనసోముం డెఱ్ఱనకన్న నెంతవన్నె తక్కువ యను నాయభిప్రాయ మిప్పటికిని మాఱలేదు. గాని, నే నతనికిం జూపవలసినంత గౌరవము నా వ్యాసమునం జూపనైతి నని చింతింపవలసి యున్నాను.

శ్రీ వీరరాజు గారి మొదటి శంక, 'ఆంధ్ర భాషాభివర్ధనీ సమాజము' వారింత దోషపుంజమగు వ్యాసము నెట్లు బహూకరించిరి?' యని. బహుమాన మేర్పఱిచిన పిదప సంఘమునకై వచ్చిన వ్యాసములలో మేలైన దని పరీక్షకులకుం దోంచినదానిని బహూకరించుట సంప్రదాయమే కదా! వచ్చినవ్యాసములలో మే లన్నారు గాని యన్నివిషయముల మే లని వారు తలంపలే దని నానమ్మకము. మఱియు నా వ్యాసము బహూకరించిన పండితులలో శ్రీ వావిలికొలను సుబ్బారావు గారు, జయంతి రామయ్య పంతులు గారు, మానవల్లి రామకృష్ణ కవి గారును గల రని విన్నాను. వీరిలో నెవరు నా మతమును నేంటికి నంగీకరించునట్లు లేదు. ఈ విషయము పై సమాజపు కార్యదర్శులును, సోమపక్షపాతులు నగు శ్రీ [illegible] సీతారామయ్య గారు వచించిరి. పై విషయము తెలియంగ శ్రీ వీరరాజుగారు నా యందు వారికిం దోంచిన యపాండిత్యము బహుమతిని గాంచుటకు సమాజపండితుల యపాండిత్యమే ప్రధానకారణ మని యొక యన్యాయ్యపుటూహను బైలుపెట్టిరి! పై మూవురి పాండిత్యము నాంధ్రలోక మంతయు నక్కఱగ నెఱింగియే యున్నది. కావున, నేడు నేను వారిపక్షము వహించి స్థాపింపవలసినది లేదు. 'ఆంధ్రభాషాభివర్ధనీ సమాజము' అను నామధేయమున మొదటిపదము స్త్రీలింగము గాక, [illegible] గాను, ఉండుటచే విశేషణవిశేష్యములకు సమానలింగకత్వము లేమి తప్పనియుం, నదియే సమాజపండితుల యపాండిత్యభాగమును వెల్లడించు ననియు వీరరాజు గారనిరి. కాని, 'తింత్రిణీవృక్షము' ఇత్యాది ప్రయోగములందు వలె, పూర్వపదము సంజ్ఞ యనియు, నిత్యలింగక మనియు, కావుననే 'వర్ధనసమాజ' మని పుంవద్భావము గాక 'వర్ధనీసమాజ' మనియే యుంపంబడిన దనియుం బంతులుగారు నిదానించి చూచి

యుండి రేని పైప్రయోగము, వారి 'మహదానంద' మను ప్రయోగమునకన్న వేయింతలు సాధు వని గ్రహించియుందురు. సంజ్ఞ మనమే కల్పించినది. గావున సమాజపదమునకుఁ దగినట్లుగా 'వర్ధన' సమాజమనియే యేల పేరుంచి యుండఁగూడ దందురేమో! నామధేయములలో స్త్రీలింగపదములయం దున్నరుచి పుంపదములయం దుండమికి మానవమనోధర్మము ప్రమాణము. ఐన 'సమాజ' మునకు బదులుగా 'సభ' యుండిన నీకష్టము లేదే యందు రేని, సభాసమాజపదముల కర్థమందుఁ గల భేదము వా రెఱుఁగనిదిగాదు. ఇట్లే 'కాశ్మీరు' పదమునకు నా కర్థము కాలే దని వ్రాయుట వారి [illegible] సరి. దా, నాతోఁ బాటు సమాజపండితులకును కాలే దనిరి. 'కాశ్మీర మనఁగాఁ జందన మంటిని. కలపము, తత్సాధనము గూడఁ జందన శబ్దమున మేము వాడుదుము అత్తరు బీళ్ళలు రచించిన పన్నీటికిఁ గూడఁ జందన మని యిందలి వాడుక * పైశబ్దమును గూర్చిన నా యాక్షేప మల్ప మనియు, నేఁ జేయరాని దనియుఁ బంతులుగారితో నంగీకరించుటకు నాయభ్యంతరము లేదు. నేను ప్రయోగించిన 'పైననే' శబ్దముపై వారి యాక్షేపము నిట్టిదే. అల్లన, మెల్లన, లోన, నెట్టన ఇత్యాదికళ లన్నియుఁ బ్రకృతులు ద్రుతాంతములుగా మాఱినవి. 'పైన' గూడ నట్టిదే. 'నలుకెం దత్తివిరంబు నంబుదము లోనం దోఁచు, అని సోముని ప్రయోగము. 'పాడవు' 'పాడుపు' రెండును వ్యవహారమున సామాన్యములు.

పోనిండు. కవిత్వమర్మములను బరిశీలింపఁగా సోమునికన్న నెఱ్ఱన యుత్తముఁ డని నేనును, కాదు సోముఁ డుత్తముఁ డని పంతులుగారును వాదించుచున్నాము. అసలు ప్రాచీనమహాకవుల నొకరితో నొకరిని పోల్చుటయే యసంగత మని కొందఱు పండితులు తలఁచెదరు. కాని నా కామతమున గౌరవము లేదు. భరతఖండమును పాలించి ధర్మస్థాపన చేయుటమాత్రము చూచితి మేని, చంద్రగుప్తుఁడును కృష్ణదేవరాయలును తుల్యగౌరవార్హులే; కాని, వారిరువురిలోఁగల భేదము గమనించి- రాయలకన్న గుప్తుఁడు గొప్పవాఁ డని యెవ్వ రన్నను, అది రాయల నగౌరవపఱచినట్లు తెలియఁదగునా? తాతగారు గొప్ప పండితు లన్నమాత్రాన కుమారుఁడు తండ్రి నవమానించిన ట్లాయెనా? అట్లే యెఱ్ఱనసోమనల కిరువురకును తెనుఁగుజాతియే యప్పుపడి యున్నది. వారిపేరు చెప్పుకొని బ్రతుకవలసి యున్నది. కాని, వారిరువురిలో నెవరికన్న నెవరు గొప్పవా రని సకారణముగఁ దలఁచినను, ఇతరునియెడ గౌరవమున కే లోపము నుండదు. మఱియు, 'సోమునికి వాఙ్మయమున నిట్టిచోటని యిచ్చు నధికారము మన కెక్కడిది?' యని పంతులుగారి యాక్షేపము. ఎక్కనను 'కవిబ్రహ్మ' యని వినుతించిన యెఱ్ఱన కీ యధికార మెక్కడిది? 'వాణి నారాణి' యని పినవీరభద్రుఁడు మఱుఁగుమరియాద లేక చాటిన మాత్రాన, మన మందఱము నతని యోగ్యతాయోగ్యతల విచారింపక, తలవంచుకొని, 'పినవీరభద్రుఁడు మాతాత' యని యంగీకరింపవలసినదేనా? సోముఁడు గొప్పవాఁ డని చెప్పుట కధికార మెవ్వ రిచ్చిరో కాఁ డని చెప్పుటకును వారే యీఁగలరు. మఱియు నిట్టి విషయములందు పెద్దలవాక్యమునే ప్రమాణముగాఁ గొనవలయు నని వారు వాదించునట్లు తోఁచెడిని. నా కంత విశ్వాసము లేదు. అంతమాత్రమునఁ బెద్దల నగౌరవించితి నని తలఁపరాదు. 'గొప్పవారిని గౌరవించుటకు వారి సిద్ధాంతములను విమర్శించుటయే యుత్తమమార్గ' మని యొకానొక పండితుఁడు వచించిన వాక్యమందు నాకుఁ జాల నమ్మిక కలదు. శ్రీ మానవల్లి రామకృష్ణకవి గారు, వీరేశలింగము పంతులు గారు మొదలగువారు నాచనసోముని మేడపై కెక్కించి రన్న మాత్రమున నాంధ్రలోక మంతయు వారిపల్లవి నే యనువదింపవలయునా? మఱియు, రామకృష్ణకవి గారు, వీరేశలింగము పంతులు గారు మొదలగువా రసాధారణపండితు లైనను, వారి పాండిత్యమందుఁ గాని కార్యనిర్వాహణశక్తియందుఁ గాని, మావంటివారికి నూఱవపాలును లే కున్నను, ఇట్టివిషయముల నావంటివానికి వారివాక్యములే ప్రమాణములు కానేరవు. వారు చరిత్రశోధకులు. ప్రాతవానికంటెఁ గ్రొత్తవానియందు వారి కభిమాన మెక్కుడు. నూతనగ్రంథములను సంపాదించి యాంధ్రవాఙ్మయమును వృద్ధిపఱచుటకును, మఱుఁగుపడి మునిఁగిన మహాకవులను బైలుపఱచుటకును వారు చాల పరిశ్రమించువారు. ఏదైన నూతనవిషయము లభించెనేని దానిగుణమును-గొండంత చేసి, యందఱును దాని నెఱుఁగునట్లు చేయువారు. తత్త్వదృష్టికన్న నభిమానము చరిత్రశోధకుల పొగడ్తలకు వన్నె పెట్టును. నన్నిచోడుని కుమారసంభవము బైటికిఁ దీసినపుడు శ్రీ కవిగారు, 'రాజకవులలోను కవిరాజులలోను ఇంతటివాఁడు లేఁ' డని గంట వాయించిరి. సోముని గ్రంథము వెలువఱచినప్పుడు వీరేశలింగము గారు నట్లే పొగడిరి. తుప్పలుతుప్పలుగా వెడలు పనికిరాని ప్రబంధములు శతకములు మొదలగువానినే చూచిచూచి రోసిన యితరపండితులు నిట్టి యుత్తమజాతి గ్రంథములు బైలుపడఁగా, ఆఱుతుగుల పొడవుగల మనుష్యుని జూచి 'ఒంకాయమ్రానిపొడవుగా నున్నాఁడురా' యనిన 'ఔనురా' యని మన మందఱ మనునట్లే, ఇట్టి యతిశయోక్తు లసత్యము లనక యులంకము లనిరి. పదార్థము మంచిదిగావున పొగడ్త కొంచె మెక్కువయ్యును ఓర్చుకొన్నది.

'ఏకత స్సర్వ శాస్త్రాణి తులసీ కాష్ఠ మేకతః
వక్తవ్యం కించి దత్యుక్తం వస్తుత స్తులసీ వరా'

యను నీలకంఠదీక్షితుని మాట మనము మఱవరాదు. శిష్యుఁడైన

* కాశ్మీరపదము గాక నా కర్థము గాని పదము లనేకములు సోముని హరివంశమున నున్నవి. శ్రీ శివరామశాస్త్రులు వారు నిట్లు తలంచిరి. 'కుజము కుంజరముచే' ఇత్యాది పద్యమునకు శ్రీ కడ్డాది సుబ్బారాయుఁడు గారు, వావిలకొలను సుబ్బరావు గారు మొదలగు పండితులు సమంజసముగ నర్థము నాకుఁ జెప్ప రైరి. శ్రీ వీరరాజుపంతులు గారు సోముని హరివంశమునకు వ్యాఖ్య వ్రాసి తెనుగువారి కుపకరింతురు గాక.

కేతన దశకుమారచరిత్రమును తెనిఁగించుటచే నతని యితరగుణములకు నశుఁడైన తిక్కన ‘అభినవదండివిరా నాయనా’ యని పిలిచియుండును. అతని కదే బిరుద మయ్యెను. కాని నేఁడు సంస్కృతాంధ్రములఁ బ్రక్కలో నుంచుకొని చూచినవారి కెవ్వరికి *దండికేతనల కజగజాంతర మని తోఁపదు? అంతమాత్రమున తిక్కనను స్మరించి మ్రొక్కని తెనుఁగువాఁ డెవఁడు?

ఇట్లు మాయిరువురకును మార్గములు వేఱు. పెద్దలవాక్యములు ప్రామాణికములుగాఁ జూచువారు వారు, నాకదియే? పెద్దలవాక్యములు సరిపోవునా యని చూడఁ బ్రయత్నించువాఁడను నేను. ఐనను నాయుత్తరమునకుఁ గూడఁ బెద్దల యంగీకారము గల దని నేనొకకారణముఁ జూపితిని. అదేదన సోముని విడిచి యెఱ్ఱనను కవిత్రయములో నొక్కనిగాఁ బరిగణించియుండుట. సోమునికన్న నెఱ్ఱనయే ప్రాచీనుఁ డను సిద్ధాంతము నే వీరేశలింగము పంతులుగారు మొదలగువారు తొలుత నంగీకరించియుండిరి. తరువాత బుక్కరాజు శాసనము బైలుపడి వారిరువురును సమకాలికు లని తేలినది. నేను వ్యాసము వ్రాయునప్పుడు పంతులుగారి కవిచరిత్ర పూర్వముద్రణము మాత్రము చూడఁగల్గితిని. (నేను మైసూర నుండుట యాంధ్రగ్రంథములు మఱవరాదు) ఎఱ్ఱనహరివంశము బాగుగ నుండలే దను తాత్పర్యముతో సోముఁ డుత్తరహరివంశము వ్రాసె నని పంతులుగా రూహించిరి. నేను నట్లే తలఁచితిని. రెండు గ్రంథములను బోల్చిచూడఁగా, ఎఱ్ఱనపురాణకవిత్వమునకు సోముఁడు ప్రబంధపుమెఱుఁగులు పెట్టినట్లు కానవచ్చినది. ఆ విషయమే నేను వివరించితిని. పరిషత్పత్రికలో నది ప్రకటింపఁబడుటకుఁ గొంత ముందుగా ఎఱ్ఱన్నకన్న సోముఁడే ప్రాచీనుఁ డను వాద మొకటి శ్రీ వంగూరు సుబ్బారావుగారు బైలుదీసిరి. చరిత్రపరిశ్రమ మెక్కువలేని వాఁడ నగుటను, ఆవివాదవాఙ్మయము పూర్తిగా నాకు లభింపమిచేతను, ఆవిషయము చర్చింపక, శ్రీ సుబ్బారావుగారి వాదమే సత్యమైనను, సోమునికన్న నెఱ్ఱన యుత్తముఁ డను సిద్ధాంతమున కేమియు బాధ లేదనియు, ప్రాచీనుని విడిచి యర్వాచీనుని కవిత్రయములో నొక్కనిగాఁ బరిగణించుటయే నిదర్శన మనియు, భూమికలోఁ జేర్చి పంపితిని. అది యట్లే ముద్రిత మయ్యెను. ఎఱ్ఱన్నను కవిత్రయములోఁ జేర్చుటకుఁ గారణ, మే ‘నాలవవారము’ బాలుఁడైనను జెప్పఁగలఁ డని వీరరాజుగా రనుచున్నారు. అది భారతశేషమును బూర్తిచేయుటయే యఁట! ఆ ‘పంచమవేదము’ను తెనిఁగించినవారిలో నధర్వణాచార్యుఁడు లేఁడా? అధునికులలో తిమ్మయ లేఁడా? వీరినిగూడఁ జేర్చుకొని కవిచతుష్టయమో కవిపంచకమో యని యేల చేయరైరి? తిక్కన భారతము వ్రాయుటచేతనే కవిబ్రహ్మ, యయ్యెను గాని, యదేశైలిలో నిక నే గ్రంథమును వ్రాసియుండినను అతని కాబిరుదము లభించుచుండదే దందురా? నిజము చూడ, తక్కినదేశముల కన్న తెనుఁగువారికి భారతమం దెక్కువ గౌరవము గలుగుట తిక్కనాదులవలననే. గాని, గౌరవమున రామాయణ మెందుతో తక్కువ? మఱియు, భాస్కర రంగనాథ రామాయణాదుల కంటె నెక్కువ కవిత్వము గలిగియుండెనేని, ఎఱ్ఱన రామాయణ మేల యంతరించుచుండె నని వీరరాజుగారి ప్రశ్న! దీనికి నే నెట్టుత్తర మీవలయునో తెలియకున్నది? అంతరించుట యనఁగా నచ్చుపడకుండుట యని యర్థమా? సోముని హరివంశమున నొకటినుండి తేని కర్తృత్వము వీరేశలింగము పంతులుగారి కాలమున నెవరైన నించిరా? లేకున్న నంతవఱకదేల ‘యంతరించి’ యుండవలయును? మఱియు నెఱ్ఱన రామాయణము పూర్తిగా నశించిన దనియే నిశ్చయముగఁ జెప్పఁగలవా రెవరు? తెనుఁగుదేశ మంతయు నెవరు గాలించి చూచినారు? అలాభము నాశమే యగునా?

‘చ. పలుకఁ దలంప దవ్వు లగు భారతరామకథార్థముల్ విభా
సిలఁగ నరంటిపం డొలిచి చేతికి నిచ్చినరీతి నాంధ్ర వా
క్సులలితశక్తి నందఱకు సుప్రథితంబుగఁ జేసినట్టి ధ
న్యుల నుతియింతు నన్నయబుధోత్తముఁ దిక్కన నెఱ్ఱసత్కవిన్’
(కళా. ఆ. ౧.)

పై సూరనార్యుని పొగడ్తలో సర్థాధికాధికార మెఱ్ఱనదే కదా? రంగనాథుని, భాస్కరుని సూరన యెఱుఁగఁడా? దేనిచే అత్యుత్తమఖ్యాతిం బొందితి, నని వేమారెడ్డి తలఁచెనో, అట్టి రామాయణము నశింపవలసినదే యగు నేని యది వ్రాయఁబడుచునే యుండ లేదు. అది నేఁడు గాకున్న ఱేపు లభింపఁగల దనియు, నప్పుడు వీరరాజుగారు తమ యభిప్రాయమును మార్చుకొనవలసియుండు ననియు, నానమ్మిక.

మఱియొకమాట. ఇప్పుడు లభించిన వాదము లన్నియుఁ జూడఁగా నెఱ్ఱనసోమనలు సమకాలికు లను భావమే బలియుచున్నది. గాని, సోముఁడు ప్రాచీనుఁ డని ఋజువుచేయఁగల సాధనము లింకను నాకుఁ దోఁపలేదు. పండితు లనేకు లట్లే తలఁచెదరు. ఇరువురిలో నెవరు పెద్దయో యెవరు చిన్నయో చెప్ప సాధ్యము గాదు. సోముఁ డెఱ్ఱన్న హరివంశమును జూచియే వ్రాసినాఁ డను భావము నాకింకను గృశింపలేదు. అనఁగా నెఱ్ఱనకన్న నతఁడు పాండిత్యమునఁ దక్కువ యని నాయాశయము గాదు. ఎఱ్ఱన వృద్ధుఁడై, సోమన తరుణుఁడై సమకాలికస్పర్ధచే నతఁడు వ్రాసిన గ్రంథము నే యింకను మెఱుఁగుగ వ్రాయవలయు నని పూనినవాఁ డని తలఁచెదను.

‘అభ్రంకషం బైన యాలపోతు నితఁడుత్రుంచినాఁ డీతండు పెంచినాఁడు’ అను సోముని చమత్కారపూర్ణ మగు పద్యమును జూచిన తరువాత. ‘యజ్ఞరక్షకుఁడు యజ్ఞవిధ్వంసియునై లోకనుతులఁ బెంపారువాఁడు’ అను కల్పనతోఁ బద్యము నెఱ్ఱన వ్రాసినాఁడన్న నాకు నమ్మిక లేదు. సోముని గ్రంథము నందలి “నిండారఁ బెగఁగొని నిగిడించు తూఁపుల” “చేతులఁ గసి వోఁ గయ్యము” అను రెండుపద్యము లెఱ్ఱనగ్రంథమందు లభించుచున్నవి. గాన, సోముని హరివంశమును జూచియే యెఱ్ఱన వ్రాసె నని పంతులుగా రనుచున్నారు. కాని యిందలి పద్యములతో యం దున్నవని యేల చెప్పరాదు? సోముని గ్రంథమునం దేర్చి తీసికొనవలయు నన్న నెఱ్ఱన కింతకంటె మంచిపద్యములు దొరకవయ్యెనా? లేక, యామాత్రపుఁ బద్యములు వ్రాయవచ్చువేళకు సరిగ ప్రబంధపరమేశ్వరుని ప్రతిభ కుంటువడెనా? ఎఱ్ఱన్నకు సహజ

ముగ చాలని చిత్రకళాకౌశలము పైరెండుపద్యములు చేర్చుటచేఁ బూర్తియయ్యె నని తలఁచు వెఱ్ఱిచదువరి యెవఁడైన నుండునా? ఇందులఁగూర్చి విశేషచర్చ పేజీలకొలఁది జేసెదమనిరి. సరి; అందాఁక వేచియుండుట నాకు విధి.

ఒకవేళఁ బై రెండుపద్యములును సోమునివే యని పంతులుగారు స్థాపింపఁగల్గినను, నే నిట్లు తలంతును. ఎఱ్ఱన గ్రంథము లన్నియుఁ జాల దురవస్థలపాలైనవి. భారతభాగమే కొంత మేలు. నృసింహపురాణ హరివంశములు రెండును అనేక దుస్సంస్కారణములఁ బొందినవి. రామాయణ మింకను బైలుపడనే లేదు గదా! నృసింహపురాణపుఁ దాటాకుల ప్రతి యొకటి యొకప్రక్క శిథిలమై యుండఁగా, సాధునికు లొకరా భాగమంతయుఁ బూరించి రని వదంతి గలదు. ఎంతనిజమో యెఱుఁగను. సోముని కవనమునం దితరులు దూర్చిన కవిత్వాభాసమును పంతులుగారు రెఱుఁగక పోలేదు. అట్లే హరివంశమునందును ఎఱ్ఱనవి కావనిపించు భాగములు చాలఁ గలవు. యతిగణప్రాసాదిభంగములు, అర్థశబ్దవైకల్యములును, దిక్కులేక యున్నవి. వానిని శోధింప నిది గాదు చోటు. అట్టిచో గ్రంథపాఠమును సవరించుటకై పై సోమునిపద్యము లెవఁడో చేర్చియుండును. కాని, ఎఱ్ఱనపై దయచే శిల్పభిక్షము నితరుని నుండి దొంగిలించి యీవలయు నని, నాకుఁ జూడఁగా కాదు.

ఎఱ్ఱన సోమనల పరస్పరభేదమును గూర్చి నాయభిప్రాయ మిప్పుడు చెప్పుటకు మున్ను నే నెట్టి కవిత్వధర్మ మాధారముగాఁ గొందునో, యది సంగ్రహముగా నిందు వివరించుట యావశ్యకము. కావ్యమునకు జీవనము రసము. ఇప్పటిపండితుల కనేకులకు చమత్కారమునకును రసమునకును భేదము లేదు. కావ్యమున దీనిచే మనకున కెట్టి యానందము గల్గినను, అందుకు రసమే కారణ మని భ్రమించి 'ఎంత రసవంత మైన కావ్య' మని మెచ్చుకొనుట వాడుక. 'రసము తేవలయు నన్న వసుచరిత్ర కావఁడే తేవలయు' నని యుద్ఘోషించువా రున్నారు. శ్లేష తప్ప వేఱొకటి నేరనివారికి 'సరసకవిచక్రవర్తి' యని బిరు దిచ్చువా రున్నారు! పాండిత్యమును ఉపజ్ఞయుఁ గలచోట రసము గల దని భ్రమించెదరు. కావుననే కల్పనాకవిత్వము వృద్ధికిఁ దెచ్చిన ప్రతికవియు నొక 'సరసప్రబంధము' వ్రాయఁబూనితి ననుచున్నాఁడు! మన వాఙ్మయమున నా లోకోత్తరపదమునకు వచ్చిన దుఃవస్థ మఱి దేనికిని రాలేదు. రస మనఁగా, మన లాక్షణికులు నియమించినట్లు శృంగారము మొదలగు తొమ్మిదిభేదములే కలిగి 'యలౌకికచర్వణావిషయ' మగు నొక వివరింపరాని పదార్థ మని నాయుద్దేశము గాదు. తర్కశాస్త్రపరాధీనులగు మన లాక్షణికులు వాదవివాదములను బెంచి యెవరో వ్రాసిన రసలక్షణమునే స్థాపింపఁబూని, రసశబ్దమునకు మార్గమును సంకోచపఱిచి రని నాయభిప్రాయము, రసపండితుల సిద్ధాంతము ప్రకారము.

"అలోఏంతి పులిందా పవ్వఅ సిహరట్ఠిఆ ధణుణిసణ్ణా,
హత్థిఉలేహిఅ వింఝం పూరిజ్జంతం ణవబ్భేహిమ్"
[గా. స. ౭. శ. ౧౬.]

ఆ. చెంచుమగలు ముదముచేఁ జూచుచున్నారు,
విండ్లు నూని శిఖరవీథి నిలిచి,
మత్తగజము లట్లు క్రొత్తమేఘంబులు,
ప్రాఁకుచున్న వింధ్యపర్వతంబు.

అను హాలికుని పద్యమున నేరసమును లేదు. కాని, దీనిని జదువునపుడు ఆ యెండకుమాఁడిన పర్వతరాజు, ఉక్కుబొమ్మలవంటి చెంచుదొరలు, వారు చేతులూనుకొన్న విండ్లు, చలువనీడనిచ్చుచు వానకాలము సూచించు క్రొక్కారుమొగిల్లు - ఇవన్నియు మన కన్నులఁ గట్టికొనును. విండ్లపై నూని వింధ్యము నభిమానప్రకారములతోఁ జూచు చెంచుమగలకెట్లో యట్లే, మనకును తన్మయత్వము గలిగి, నిర్వచింపరాని యానందము గలుగును. లేదన్న నాతప్పు లేదు. శృంగారము మొదలగు రసముల 'చర్వణ' యలౌకిక మేమి? యిది లౌకిక మేమి? ఏ భావములైనను వాని తీక్ష్ణదశలో నవిదిత వేద్యాంతరముగా ననుభవింపఁగల్గుట మేని, యానందస్వరూపములై రసశబ్దవాచ్యము లగును. అనఁగా శిల్పమందన్న మాట. జుగుప్సాభక్తివాత్సల్యాదులు గూడ రసములే యని వాదించినవారు మనలో లేకపోలేదు. తర్కశాస్త్రము నోరుమూసినను హృదయమును మూయఁజాలదు. కావున, కవి భావనాబలముచే తనకుఁ గలుగు వివిధములగు శోకము, మోహము, అసూయ, ద్వేషము, సంతోషము, ప్రణయము, మొదలగు భావము లనఁబడు చిత్తవికారముల మూలమున వర్ణింపవలసిన పదార్థముల స్వరూపమును నిర్ణయించి, విగ్రహము (ఏవిగ్రహమైనను సరే) సజీవమగు భావతోఁ దీర్చి యెదుర నిలిపినప్పుడు రసానుభవ సంస్కారము గల సహృదయుల కట్టి మనోవికారములే కలిగి, అవి యెట్టివైనను, శిల్పమందుఁగల యొకానొక యనిర్వచనీయ మహిమచే, ఆనందముగాఁ బరిణమించును. ఈయర్థమందే ప్రకృతము రసపదమును నే నుపయోగించెదను. అది యిన్నే విధము లని పలకపై సుద్దతో వ్రాసి చూప సాధ్యము గాదు.

కవిత్వసామాన్యమున కది ప్రాణము. కవి దానిని దీర్చినట్లెల్ల నందుకుఁ దగిన మర్యాదఁ బొందును. తక్కినగుణములు, అలంకారములు, రీతులు, పాకములు మొదలగు నర్థశబ్దధర్మము లన్నియు స్వాభావధర్మమున కుపస్కారకములు గాఁగలవు. గాని, దానితరువాతివి. వీనిని చక్కఁగా నిర్వహించుటచేఁగూడ నొక యానంద ముదయించును. గాని, అది రసముతోఁ దులఁదూఁగదు. వీనిని గూర్చిన యొండు రెండు లోపములను గమనింపక పోవచ్చును. గాని, మూలమగు రసమున కీమాత్రపు విఘ్నము గల్గినను రసికులు సహింపలేరు.

ఇది మనసున నుంచుకొని యెఱ్ఱన సోమనల కవిత్వములను బరిశీలింపఁగా, రసపోషణదృష్టి యెఱ్ఱనకన్న సోమునికిఁ దక్కువ యని నాకుఁ దోఁచెడిని. సోముని సర్వజ్ఞబిరుదము, నవీనగుణసనాథత్వము మొదలగు వానిని గూర్చి నాయాక్షేపము లేదు. అతని పాండిత్యమును గూర్చి నేఁ జేసిన యాక్షేపము అల్పము లనియు నేఁ జేయరాని వనియు నంగీకరించితిని గదా! అతఁ డష్టాదశపురాణముల నుపపురాణములతోఁ గూడఁ జదివియున్నను, లేకున్నను, ప్రకృతము

మనకుఁ బనికివచ్చున దతని కవిత గాని పాండితి గాదు. ఎఱ్ఱనకన్నను బండితుఁ డని మీరంగీకరింతురేని నాయడ్డు లేదు. ఎందుకన, ఔనను టకును గా దనుటకును బ్రమాణములు చాలవు. ఆతఁడు సర్వజ్ఞుఁ డైన నితఁడు పరమేశ్వరుఁడు. మఱియు నెఱ్ఱన హరివంశాదులలోఁ గొన్నిచోట్ల నతిబల్బజము లైన భాగములును గలవు. శాంతిపర్వమునకును విరాటపర్వమునకును శైలిబిగువులో సడలు లేక వ్రాసిన తిక్కనయోగ్యతనికి లేదని మనము నమ్మవచ్చును. వంశావళి, స్తోత్రములు, ధర్మములు, మొదలగు చప్పిడివిషయములు వ్రాసినచోట్ల నతఁడు వ్రాయవలయు నే యని వ్రాసె నని మన మూహింపవచ్చును. కాని, యేచోటి వర్ణ్యమైన విషయమునకును అతనికిని మానసిక సంబంధము గలదో యాచోట నతనివలె, ధారాళముగ, తీక్ష్ణముగ వ్రాయఁగలవా రరుదు. సోమునికి నట్టి రసపోషణశక్తి గల దనుటలో సందేహము లేదు. కాని యతఁ డాశక్తికి స్వేచ్ఛాచార మిచ్చినవాఁడు కాఁడు. ఆకాలమునకే సంస్కృత వాఙ్మయమున మాఘుఁడు, బాణుఁడు సుబంధువు, రాజశేఖరుఁడు మొదలగువారిచే స్థాపింపఁబడిన కల్పనాప్రధానమగు నాలంకారిక శబ్దార్థరచన ఇతనిని లోఁబఱుచుకొన్నది. కాని రామరాజభూషణాదులవలె దానికిఁ బూర్తిగా లోఁగియుండమిచే నతని యుత్తరహరివంశము రసికుల నాకర్షింపఁగలిగి యున్నది. ఐనను రసప్రవాహమున నెఱ్ఱనకుం దున్నంత బిగువు నిర్మలతయు నితనియెడ లేవు. ఒక్కయుదాహరణము. మన్నింతురు గాక. ఉలూఖలబద్ధుఁ డగు బాలకృష్ణుఁడు ఱోటిని జమిలిమద్దులనడుమ నీడ్చుకొని పోఁగా, నాచెట్లు కూలెను. అప్పుడు కొందఱు గోపికలు సంభ్రాంతలై పాఱివచ్చి యశోదతో నిట్లనిరి.

"ఉ. ఎక్కడిబిడ్డ నీకు? నిటు లెంతయుఁ గట్టెఁడి. వేయుఁగంబులన్
బొక్కెడుఱోటితో బలియుఁ బుత్త్రుని బ్రాఁకులఁగట్టినాఁ డువా
రక్కట! కల్గెనే! వినఁగ నాఱడిపోయెఁ గుమారుఁ డీపునన్
మిక్కటమైన మ్రాఁకు లవె మీఁదఁ బడన్ వడిఁ దాఁ
[బెనంగడన్."

మ. అనినం దల్లడమంది మేను విరియన్ హాయంచు గోపాలభా
మిని విస్రస్తములౌ స్తనాంచలము ధమ్మిల్లంబు దూలంగ, లో
చనపద్మంబుల బాష్పధార లెసఁగన్, సంభ్రాంతిఁ బాదద్వయం
బును దొట్రిల్లఁగఁ బాఱె, గోపికలు నుద్భ్రాంతార్తలై తోఁ జనన్"

ఉత్తరహరివంశమున ననిరుద్ధుఁడు చిత్రరేఖచే నపహరింపఁబడఁగా నతని యాఁడువారు,

"సీ. చెందమ్మిరేకులతోఁ జిందు తేనెలవోలెఁ
గన్నుల బాష్పాంబుకణము లదర,
వలుదచీకట్లలో వ్రాలుచుక్కలు వోలె,
వేణీభరమ్ముల విరులు వ్రేలఁ,
దూలు తీఁగలవెంటఁ దూఁగు తేఁటులువోలె,
నసదు సెన్నడుమున నారు లాలయ,
రాహుఁ జక్కవలఁ జేరని చంద్రికలు వోలెఁ
జన్నుల ముత్యాలసరులు పెనఁగ,
ముద్దుమోము లల్లార్చుచో మూఁపులందుఁ
గర్ణభూషణజాలంబు గళవళింప
మార్చిమార్చి చేతుల వ్రేళ్లు మడిచికొనుచు
'నింక నెట్లమ్మ' యనుచు నయ్యింతులేడ్వ"

(ఉ. హ. ఆ. ౫-౨౭౬)

పై రెండుపద్యములను బరీక్షింపవేఁడెదను. ఏమ్ప సన్నివేశ మొక తీరయినను రసధార రెండవపద్యమునకన్న మొదటిదానియందు తీక్ష్ణము కాదా? రెండవదానియందు చమత్కార మెక్కువ యని యంగీకరించితి. కాని యంతమాత్రమున మనము మోసపోరాదు. యశోద వెంటనే, కృష్ణుఁడు కాలో చేయియో విఱుచుకొన్నట్లు, ఎఱ్ఱన్న 'సంభ్రాంతి'తోఁ బరువెత్తినట్లు, మనలఁ బరువెత్తించినట్లు, ఉన్నది మొదటిపద్యము. రెండవది, యేడ్చువారితో సానుభూతి లేక తూలికను వన్నెలుఁ దీసికొని నిదానముగా నవ్వుచుఁ జిత్రించినట్లున్నది. 'చెందమ్మిరేకులతోఁ జిందు తేనెలు' 'వలుదచీఁకట్లలో వ్రాలుచుక్కలు' మొదలగు భావము లుదారములే; చమత్కారజనకములే; కాని ప్రకృత రసముతో సంబంధము వానికి లేదు. ఇదిగాదు చోటు వానికి. మొదటిదానియందు 'విశేష మేమియు లే' దని భావించెదరు వీరరాజుగారు. విశేషములకు విశేషమగు రస మందున్నది. సోముని పద్యము వ్రాయుటకు అతనివంటి ప్రతిభాశాలియే కావలయును. గాని ఎఱ్ఱనపద్యములవంటి పద్యముల నెవరైన వ్రాయఁగలరని పంతులుగా రందురు. కాళిదాసుని స్వయంవరమునకన్న శ్రీహర్షుని స్వయంవరమున 'విశేష' మెక్కువ యున్న దని, యందుచే నతనికన్న నితఁడు గొప్పవాఁ డని వాదింతు రేని వారి కొక్క నమస్కారము తప్ప నావంటివాఁ డేమియుఁ బ్రత్యుత్తర మీఁజాలఁడు.

'లోకమంతయు ఔ నన్నది నేను కాదన్నా' నని తలఁచి, నాయెడ ననూయను, సోముని సర్వజ్ఞబిరుదము నెడఁ బక్షపాతమును వహింపక, యెఱ్ఱనసోమనల కవిత్వమును మఱియొకతూరి పంతులుగారు పరిశీలింతురేని, నావ్యాసము నంత యెక్కువగా నింకమీఁద ఖండింప రని నానమ్మిక. వారి సిద్ధాంతము వే ఱని మొదలే విన్నవించితిని. సోముని పాండిత్యము, పదవాక్య ప్రమాణజ్ఞత, మొదలగునవి వారి యభినందములకు మూలములు. నాచనసోముని తక్కిన బిరుదము లెట్లయినను 'సాహిత్యరసపోషణ'బిరుదమం దతిశయోక్తి కొంత యున్న దని నామతము. ఇది గమనింపక వారు నామతమును ఖండించిరి.

"మ ధనదాంతఃపుర తోరహారములు; యాదఃపాల బాలా ఘన
స్తన కాశ్మీరము, ధర్మరాట్కులవధూ సంవ్యాన కౌశేయమున్
దనుజేంద్రారివరావరోధ దయితా ధమ్మిల్లమాల్యంబులున్
గినుకం దెచ్చి ఘటింపఁ జూచు జయలక్ష్మి నిత్యనైపథ్యమున్"

ఇత్యాది సోమపద్యములలో, దిక్పాలక జయమును గూర్చి యోజించునప్పుడు నరకాసురుఁడు తనకును దెలియక యప్రదక్షిణక్రమముగనే వారిపేళ్లను దడవినట్లు సోముఁడు వ్రాసె ననియు, అందువలన నరకునికి రాఁగల యపజయము సూచింపఁబడిన దనియు,

ఎఱ్ఱన యట్లు చేయఁజాలఁ డయ్యె ననియు వా రనుచున్నారు. ఈ శకునశాస్త్రజ్ఞానము నరకునికే లేనప్పు డెఱ్ఱన కేల యుండవలయునో? ఉండినను కవిత కది యె ట్లుపకరించునో? యెఱుఁగలే కున్నాను! మఱియు,

"బలిమిఁ గోలున నవ్వు దళుకొత్తినను మొగం
బెల్లఁ దానై యున్న వెల్లఁదనము*"

అను సీసపద్యము భావపూర్ణ మని పొగడి నేను తిక్కన యొక్క "ముదమున నెలమి" యను పద్యముతోఁ బోల్పఁగా పాదాంతములలో తిక్కనపద్యములో నున్నట్టి చదరపునడక యెఱ్ఱనపద్యమున లే దని రెంటికిని బోలిక యనుచిత మనిరి! ఇట్లే,

"సీ. దైతేయ మదవతీ ధమ్మిల్లములతోడ
విరుల సెత్తావికి వీడుకోలు,
దనుజశుద్ధాంత కాంతాకటాక్షములతోఁ
గలికిగాటుకలకుఁ గానివావి,
దానవమానినీ స్తనకుంభములతోడఁ
బసపుపయ్యెదలకుఁ బాయుతెరువు,
దైత్యావరోధన దయితాధరములతో
సొబగువీడెములకుఁ జుక్కయెదురు,
చేసి, సురసుందరీకరాశీరతాళ
వృంత చలితాంతకుంతలవిలస దింద్ర
కులవధూటీ లలాటికా కుంకుమంబు
పదిలపఱుపఁ జక్రంబ! నీభరము గాదె!"

అను సోమునిపద్యమున నాల్గుపాదములయందుఁ గల 'దైతేయ మదవతీ' 'దనుజశుద్ధాంతకాంతా' 'దానవమానినీ' 'దైత్యావరోధన దయితా' పదములందలి పనికిరాని పునరుక్తిని వారు మఱుగు పెట్టి రాక్షసకాంతలకు విరులు, కాటుక, పసపు, వీడెము మొదలగు సౌమంగల్య చిహ్నములను శ్రీవిష్ణుసుదర్శనము నశింపఁజేయు నని, చెప్పుటచే వారికి వైధవ్యము సూచించె నని సతిశయోక్తిలో నత్యుక్తి సంకరించిరి! ఇంతేకాక, 'ధనదాంతఃపుర' యనుపద్యమున దేవతాస్త్రీలకు వైధవ్యము గలిగించుటఁ గూర్చి నరకుఁ డాలోచించువేళ "పెరిగినను, కరఁగినను, మాసినను, నలఁగినను, మఱలమఱల ధరించుకొను నవియు, సౌమంగల్యమునకు భంగము తేనివియు నగు తారహారములు, కాశ్మీరము, సంవ్యానకౌశేయము, ధమ్మిల్లమాల్యము అనుతాత్కాలికాలంకారములమీఁదికే నరకునిదృష్టి పోవునట్లు చేసినాఁడు" అని స్తుతించిరి. రాక్షసస్త్రీల ధమ్మిల్లములనుండి తీసివైచిన వైధవ్యము గలిగించు 'విరులు' ను దేవతా స్త్రీల ధమ్మిల్లములనుండి తీసినను 'సౌమంగల్యమునకు భంగము తేని' 'మాల్యములు' ను వేఱుపదార్థములా? తారహారములు, స్తనకాశ్మీరము, ధమ్మిల్లమాల్యములు- ఇవి సౌమంగల్యచిహ్నములు కా వేని, విరుల సెత్తావి; కాటుక పసపు, వీడియము మొదలగునవి మాత్ర మె ట్లగును? ఒకవేళ దేవతలకును రాక్షసులకును స్త్రీధర్మశాస్త్రములు వేఱువే అనుకొన్నను, వైభాగములు సోమునికవిత సమయాచారబద్ధమే కాని రసస్వాతంత్ర్యమును వహించినది గా దని బోధింపవా? రసదృష్టితోఁ జూచువారికి రాక్షసవిధవ యని దేవతావిధవ యని భేదము గలదా? పగని బోఁగొట్టుకొని యేడ్చు నేయాఁడుది యైనను భావుకుని మనసు గరఁగింపదా? రాక్షసుల తప్పులకు వారిని సంహరించుట యుక్తమే. కాని వారిభార్యల యేడ్పులకుఁ గవి సంతసింపవచ్చునా? రావణుని జంపిన తరువాత 'మరణాంతాని వైరాణి నివృత్తం నః ప్రయోజన' మ్మని పల్కిన యుదారహృదయుఁ డగు శ్రీరామచంద్రున కింతమాత్రము తెలియదాయెనా!

ఇఁక సోముని కవనమున నిరర్థకము లగు దీర్ఘసమాసము లనేకములు గల వని నే వచింపఁగా, యెఱ్ఱనాదులయందును గల వని వారు చూపిరి. తిక్కనవ్రాసిన యొక్క సమాసపద్యమును వెదకి యెత్తిరి. తిక్కనభారతమున నట్టి సమాసము లనేకములు వ్రాసియుండెనేని, అతని యుద్దేశము ప్రకారము 'ఆంధ్రావళి మోదముం బొరయు' చుండెనా? అట్లైనను సోమునిసమాసములకు నెఱ్ఱనాదులసమాసములకు సమాసత్వము సమాన మైనను అర్థాన్వయాదులలోఁ జాల భేదము గల దని పంతులుగారు గమనింపఁ దలచుకో లేదు.

"ముండటిడిక్కూడి మొలత్రాటిఁ దవిలిన
తోఁకగోచులవెంటఁ దూలువారు"

అనుపద్యము సోముఁడు మొగము ముడివేసికొనియే వ్రాసె నని వారి యభిప్రాయము. పరిహాసదృష్టి యున్న దని నామతము. మహర్షులయవస్థకు నేను నవ్వితి నని వారు భ్రాంతిపడిరి. నవ్వినది సోముఁడో? నేనో? చదువరులు మఱల నూహింతురుగాక. ఇట్లే 'పోరాని చుట్ట మితఁడ'ను పద్యమున నెఱ్ఱన యింద్రుని గేలిచేసె నని నేఁ దలఁచితి. నాది విపరీతవ్యాఖ్య యని పంతులుగా రనెదరు. కాని, ఊర్వశికి వైధవ్యమును గలిగించిన వారివ్యాఖ్యకన్న నిది విపరీతమా?

ఈసందర్భమున నింకొక విషయము. నరకాసురుఁ డూర్వశిని బిలిపించినకథ మూలమున లేదంటిని. 'మీ రేమూలచూచిరో?' యని నన్నధిక్షేపించి పంతులుగా రొక శ్లోక ముదాహరించిరి. గోపాలనారాయణకంపెనీ వారి నాగరముద్రణమును, పురాణం హయగ్రీవశాస్త్రులుగారి తెనుఁగుప్రతియు నేఁ జూచినవి. కాని పైరెండుప్రతులలో 'నేమూల'లోను వారుచూచిన 'మూల' లేదు. విష్ణుపురాణమందును ఈకథ గానరాదు.

ఈ పాపరిణయఘట్టము, ఊర్వశీచరిత్ర మొదలగు వానిపై వారి విమర్శమునకు నేను ప్రతి యీఁదలఁచుకో లేదు. రుచిభేద మిందుకుఁ గారణము. మఱియు వారి పూర్ణవిమర్శ మింకను బైలు పడలేదు గదా! నావ్యాసనామము, ఎఱ్ఱనపద్యములలోని పదములు,

* పైపద్యపాద మున్న దున్నట్లు వ్రాసితి. 'ఉన్న'కు బదులుగా 'ఉండు' చేసినచోఁ దొందఱలేదు. 'మొగమంతా కన్నులే' యన్నట్లు క్రియలేకయే వాక్యము ముగింపఁగల్గుట పంతులుగా రెఱుఁగనిదిగాదు. రెండవపాదము స్పష్టపడలే దంటిని. వారు టీక వ్రాసిరి. అప్పటికిని ఎఱ్ఱనపాఠముగా నాకుఁ దోఁపదు. ఈ సందర్భమున వారు వ్రాసిన మాటలు వారికిని నాకును యోగ్యములు గావు.

నావ్యాసమందలి పదఖండములు మొదలగువానిని గూర్చిన తక్కిన విమర్శము వారు చేయఁదగినదియుఁ గాదు. నేను ప్రత్యుత్తర మీయఁ దగినదియునుఁ గాదు.

కృష్ణకైలాసయాత్రానుష్టుప్పున స్పష్టముగఁ గానవచ్చు పూర్వోత్తర విరోధమును విరోధముగాకుండఁ జేయుటకై పదునెనిమిది పుటల విమర్శనము పంతులుగారు వ్రాసిరఁట! సోమునియెడ వారికిఁ గల పక్షపాతమును, నాయెడ వారికిఁగల యసూయయుఁ దైయొక విషయముచేఁ జదువరులు గ్రహింపఁగలరు.

సోమునియందలి వైయభిమానముచే నెఱ్ఱనను వీరు చాల తక్కువపఱచిరి. దీనికి విపరీత మగు పనియే నా వ్యాసమున నేను జేసితినని యంగీకరించితిఁ గదా! అందుకు నేను పరితపించునట్లు పంతులుగారును పరితపింపఁగలరా? నాకుఁ దోఁపదు. ఏలయన నెఱ్ఱన కవితయందు తెలి గౌరవ మెట్టిదనుండఁ గలుగుట కష్టము సోముఁడు సింహాసనియుఁ, నెఱ్ఱన చిఱుతపులి (పెద్దపులియుఁగాదు) యనియు వారింకను దలఁచుచున్నారు. ఐన నదే చిఱుతపులికే సింగము తిరువాతఁ జక్రవర్తి పదవి నియ్యవలసెను! వీరందఱముందఱ నక్కవంటివాఁ డనియా నన్నయ్యను వా రేపదవియు నీయరైరి? కాని, అతఁడు మహితాత్ముఁడని దక్షుఁ డని వారే వాకొనిరే! ఎఱ్ఱనకన్న హీనుఁడయ్యెనా? అతనికే యాంధ్రవాఙ్మయ సామ్రాజ్యమున నధికారము లేదని తిక్కనయెట్టి తేమని సిగ్గులేక యాయధికారమును గైకొందురు? ఎఱ్ఱనకుఁ దరువాత శ్రీనాథుడు ప్రయత్నించె నఁట గాని, యా సింహాసనము మాత్రమతనికి లభింపలే దఁట! ఏల? అతఁడు కవిసార్వభౌముఁడే!

ఈ యాక్షేపవాదముల కేమి? పోనిండు. ముగింపున కొకమాట. రసికుల కెఱ్ఱనయందలి యభిమాన మెన్నఁడును కృశింపదు. చిత్రకగ్మచే నెకరిమనసులు రంజిల్లునో, వారి కెఱ్ఱనకన్న సోముఁడు మేలుగాఁ దోఁచును. పంతులుగారు చిత్రకవితాభిమాను లని నమ్ముచున్నాను. అట్లయిన, నాయందలి యొండురెండు లోపములను సవరించి వారిత్రయు మఱియొకతూరి వందనము లర్పించుకొనుచుంటిని. కాని, మే మిరువురము నేకాభిప్రాయులమై చేరి వాఙ్మయసేవను చేయఁగలకాలము రాఁజాల దేమో! కానిండు. భవభూతి యిట్లనుచున్నాఁడు.

"యే నామ కేచి దిహ నః ప్రథయం త్యవజ్ఞాం
జానంతి తే కి మపి, తాన్ప్రతి నైష యత్నః
ఉత్పత్స్యతేఽస్తి మమ కోఽపి సమానధర్మా
కాలో హ్యయం నిరవధి ర్విపులా చ పృథ్వీ."

## కఱవు కాలము

బాలకవి దోమా వేంకటస్వామిగుప్త గారు

సీ. పుట్టినప్పటినుండి పూర్ణభాగ్యముతోడఁ దిరలువారలను "బకీర్లఁ" జేసి
తలమీఁద రెంకుకాసుల నిడం గాసుఁ జేయని దరిద్రుల మహాధనులఁ జేసి
ఏపూట కాపూట యేఁగునా? యనుఁ జింత సామాన్యులందు మించంగఁ జేసి
కూలి యెంత యిడిన కూలివారికిఁ బొట్ట నిండనిరీతిని నియతిఁ జేసి
గీ. మెలఁగునట్టులఁ జేసినా విలను; నీకు, నిప్పటికినైన మది నింత తృప్తి కలదె?
తగదు, తగదమ్మ! కష్టాలఁ దాళఁ గలమె? కరవుకాలమ! యిఁక లెమ్మ! కదలిపొమ్ము.

సీ. బీదవారలఁ గూడు లేకులే' దనఁ జేసి పెద్దపెట్టున నేఁడిపించినావు
సామాన్యులకుఁ దమ సరణిఁ దప్పఁగఁ జేసి కక్కుర్తులం జెందఁ గఱపినావు
మోసమ్ము, దోసమ్ము, వీసమ్ము, సందు లేకుండ మించంగాను గూర్చినావు
గౌరవంబుగఁ బ్రదుకఁగ నిచ్చగలవారిఁ బెను ముప్పు తిప్పలఁ బెట్టినావు
గీ. ఇన్నికష్టాల నిలను జెందించినావు; ఇంక నీచేయవలసిన దేమి కలదు?
సరిగ, నిప్పటి కైనను శాంతిఁ బొంది, కరవుకాలమ! యిఁక లెమ్ము! కదలిపొమ్ము.

సీ. "ట్రామేలు" కట్టాలఁ దూఁగి దొర్లినవాఁడుఁ బ్రజ లింత యారాటపడఁగ లేదు;
"ఆర్బత్తునాటు" ద్రవ్యంబుఁ దోఁచినవాఁడుఁ బ్రజ లింత యారాటపడఁగ లేదు;
"ఎమ్డను" గుండు తా "ఢమ్డు" మ్మనిన నాఁడుఁ బ్రజలింత యారాటపడఁగ లేదు;
"యూరోపు" నందైన ఘోరసంగ్రామానఁ బ్రజ లింత యారాటపడఁగ లేదు;
గీ. తల్లి! యొక్క నీవే తెంచి, యెల్ల జగము, నల్లకల్లోలముగఁ దల్లడిల్లఁ జేయు
టాయె, గరుణించి, మాఁ మొఱ లాలకించి, కరవుకాలమ! యిఁక లెమ్ము! కదలిపొమ్ము.

# భావగీతములు

సుధాకరుఁడు

పుల్కవెలందికి సత్కవుల మనము తళుకుటద్దంబు. సత్కవుల మనమునకు వారి కవితయే తళుక్కుటద్దంబు. సర్వకాలసర్వస్వరూపములును కవివరుని హృదయఫలకమునఁ బ్రతిబింబించియుండును. పురాణ ప్రబంధ నాటకాదులు మొదలు, భావగీతములు చాటుధారాలవరకుఁ గల కావ్యభేదంబు లన్నిఁటియందు నీ గుణము స్ఫుటమై యున్నది. విరాటోద్యోగపర్వములలోఁ దిక్కన మనోవిశేష మెట్లు వికసించి యున్నదో, యట్లే శృంగార నైషధాదులయందును శ్రీనాథుని మనోగాంభీర్యము స్పష్టముగ విలసిల్లుచున్నది. ముక్కుతిమ్మన్న పారిజాతాపహరణమున స్వభావ సౌందర్యము ఎట్లు స్పష్టమగుచున్నదో యావిధంబుననే కళాపూర్ణోదయమున సూరనార్యుని మనోవైచిత్ర్యము తెల్లమగుచున్నది. రాయప్రోలు సుబ్బారావుగారి గీతములందు సమృద్ధిమగు భావసౌభాగ్యము ఎట్లు వెల్లడియగుచున్నదో యారీతినే "ఊహాగానము"న రామకృష్ణరావుగారి రసమహిత మగు మనస్తత్త్వము విదిత మగుచున్నది. కవిత యననేల? చిత్రలేఖనము నందును, శిల్పమునందును ఈస్వభావ మీరీతినే పరిణమించి యున్నది. అమరావతియందలి శిల్పములు పూర్వకాలపు టాంధ్రుల ప్రతిభావిశేషమును వేయినోళ్ల చాటుచుండుటలేదా? ఆగ్రాయందలి "తాజ్‌మహాల్" మొగలాయీ శిల్పకారకుల యశేషమనీషావైభవమునకు నిదర్శనము కాదా? వేయేల? కర్తృస్వభావము తత్కృతులయందుఁ బ్రతిబింబించి యుండు ననుట నిక్కము.

అయినను, ఈ ప్రతిబింబ మొక్కొక్కప్పుడు స్వచ్ఛమై, విస్పష్టమై తనరారుచుండును. వేరొక్కొక్కప్పు డంత నిర్మలముగఁ గన్పట్టదు. అందులకుఁ గారణ మా యా కావ్యముల విషయములందలి భేదములే. నాటకముల నుదాహరణముగాఁ గొనుము. అందు కవికిని పాఠకునకు గాని, కవికిని సభాసదునికిఁ గాని, సంబంధముండునా? ఉండదు. ఉండుటయును తగదు. కర్తమాటయే సంపూర్ణముగ మఱువఁజేసి నాటకమునందే హృదయమును లీన మొనర్పఁ జేయుటయే మహాకవిలక్షణము. కాళిదాసాది మహాకవుల నాటకరాజములఁ జదువునప్పుడుగాని, తత్ప్రదర్శనములను చూచునప్పుడుగాని, మన కా కవివరుని హృదయాంతర్గత భావములు తెలియుచున్నవా? లేదు. శకుంతల ముగ్ధసౌకుమార్యములయందును గణ్వాశ్రమ దివ్య సౌభాగ్యమునందును మాత్రమే మనహృదయము లీనమై యుండును. పురాణములందు నీవిధముననే కవిస్వభావము విస్పష్టముగఁ బ్రకటమై యుండదు. పురాణమునందుఁ బ్రధానము కథ. కల్పనకు నైతము అవకాశ ముండదు. ప్రబంధములందు కొంత మేలు. కల్పనాశక్తికి అవకాశ ముండును. పాత్రపోషణమునందు స్వాతంత్ర్య ముండును.

కాని, ప్రస్తుతము భావగీతములను పేరఁబఱఁగు కావ్యవిశేషము నందువలె నింక నే యితర కావ్యభేదమునందును కవియొక్క భావప్రతిబింబము స్వచ్ఛమై, నిర్మలమై, మనోజ్ఞమై కన్పట్టదు. ఈగీతములను జదువునప్పుడు కవికిని పాఠకునకును మధ్య నంతరాయ మేదియు నుండదు. అద్దముఁ బోలె కవివరుఁడు నిజహృదయాంతర్గత భావసమూహమును తన గీతములయందు వెల్లడింపగలిగియుండును.

'భావగీతమన నేమి?' అని యడిగిన శాస్త్రయుక్తంబుగ నుత్తర మొసంగుట యశక్యము. అలంకారశాస్త్రములందు ప్రబంధనాటకాదుల లక్షణములు వర్ణింపఁబడి యున్న తెఱఁగున భావగీతముల లక్షణములను నియమింపఁజాలము. అట్లు నియమింపఁజాలమియే దాని ముఖ్యలక్షణము. కావ్యము పురాణమైనను ప్రబంధమైనను విషయపరిణామమునకు మేర గలదు. అందు ప్రధానము కథ తత్సంబంధములైనవర్ణనలు కథనైతము కొన్ని ముఖ్యమార్గములనే యనుసరించును. ఇఁక భావగీతము లన్ననో వీనికి విషయపరిణామము లేదు. ఇందు ప్రధానము భావము-రసోత్తరమైన భావము. వీనియందు భావతరంగములకుఁ గథ యడ్డురాదు. సరసిజమునుండి వచ్చు క్రొత్తతేనియలవలె నీగీతములు నిర్మలములై యనర్గళధారలతోఁ బ్రవహించును. కావుననే వీనియందు భావనాపూర్ణమగు కవిమనోబింబము స్పష్టముగ వెల్లడియగుట సంభవించుచున్నది.

ఈ ముఖ్యలక్షణమున కనుగుణమైన భావగీతములకు ఉదాహరణములు మనపూర్వవాఙ్మయమున నెవ్వియైన నున్నవేమో పరిశీలించి, అటుపైని నేను నిర్ణయించినభావగీతముల స్వరూపమును ప్రదర్శింతును. ఈనాఁడు మనము భావగీతము లని వ్యవహరించు కావ్యభేదము ప్రత్యేకస్వరూపముతో నుండెననుట యసంభవము. ఈస్వరూప మితరభాషల సాంగత్యముచేతనే యేర్పడినది. అయినను మనము భావగీతములం దేలక్షణమును ముఖ్యముగ నెన్నుచున్నారమో, ఆలక్షణము కలభాగములు మనవాఙ్మయమున నచ్చటచ్చట నున్నవి.

పోతనామాత్యుని భాగవతమునందలి భక్తిరసప్రధానము లగు భాగములకును, భావగీతములకును, కొంతయో పోలిక యున్నది. అందునను రెండు స్థలములందు పోలిక మిక్కుటముగా నున్నది. అవి దశమస్కంధమునందలి ఘట్టములలోఁ జేర్పదగినవి. గోపికాగీతలు, భ్రమరగీతలు. ఈరెంటియందును భావమే ప్రధానము. భావతరంగములకుఁ గథ యడ్డురాదు. కథాసందర్భము మిళితమై యున్నను అది సాయమై వచ్చును. కవివరుని హృదయచిత్రము ప్రతిబింబించి యుండును. ఉదాహరణమునకు క్రిందిపద్యములఁ గనుగొనుడు.

శా. "భ్రమరా! దుర్జనమిత్ర! ముట్టకుము మా పాదాబ్జముల్, నాగర
ప్రమదాళీ కుచకుంకుమాంకిత లసన్మాల్యోత్థ దామప్రసూ

సమరంభదారుణిశాతాసుండై నగుటకై నాథుండు మన్నించుచుఁగా
శ్రమము ల్వేఁపుచు వారకాంతల శుభాగారంబులన్ నిత్యమున్.

శా. ఒకపువ్వందలి తేనెఁద్రావి, మధుపా! యుత్సాహివై నీవు వే
ఱొకటిం బొందెదు భంగి నమ్మధరపీయూషంబునం దేల్చి, మా
యకలంకోజ్జ్వల యౌవనంబుఁ గొని. యన్యాసక్తుఁ డయ్యెన్ విభుం
డకటా! యాతని కెట్లు దక్కె సిరి మిథ్యాకీర్తి నమ్మెం జుమీ.

శా. భృంగా! కృష్ణుఁడు మంచివాఁ డనుచు సంప్రీతిం బ్రశంసించెదీ
సంగీతంబున నేమి సాక్కుదువొ? తచ్చారిత్రముల్ వింతలే!
యంగీకారము గావు మాకుఁ, బురకాంతార ప్రదేశంబులన్
సంగీతం బొనరింపు. వా రిడుదు రోజ న్నీకు నిష్టార్థముల్

ఇవిగాక భావగీతములకు సరిపోలునవి మన వాఙ్మయమున శతకములు. భక్తిశృంగారరసోదంచితము లగు నీ స్వల్పకావ్యముల యందుఁ గవీశ్వరుఁడు నిజభావములను వెల్లడించును. శతకరాజములం దగ్రస్థానము నలంకరింపఁ దగిన ధూర్జటి ప్రణీతం బగు కాళహస్తీశ్వరశతకమే ఇందులకు దివ్యమయిన యుదాహరణము. రసికవతంసుఁడై రాజసభాసరోవరముల విహరించిన రాజహంస మగు నీకవి విషయసుఖములకు రోసి కాళహస్తీశ్వరునకు తన హృదయము నీ శతకమున వెళ్లబోసి కొనె నని ప్రతీతి కలదు.

శా. "సంతోషించితిఁ జాలుఁజాలు రతిరాజద్వార సౌఖ్యంబులన్
శాంతిం బొందితిఁ, జాలుఁజాలు బహు రాజద్వార సౌఖ్యంబులన్
శాంతిం బొందెదఁ జూపు బ్రహ్మపద రాజద్వారసౌఖ్యంబు ని
శ్చింతన్ శాంతుఁడ నాదు నీకరుణచే శ్రీకాళహస్తీశ్వరా.

శా. నీరూపంబు దలంపఁగాఁ దుదమొద ల్గానంగ నీ వైనచో
రా రా రమ్మని యంచుఁ జెప్పవు వృథారంభంబు లిం కేటికిన్
నీర న్ముంపుము పాలముంపు, మిఁక నిన్నే నమ్మినాఁడం జుమీ
శ్రీరామార్చితపాదపద్మయుగళా! శ్రీకాళహస్తీశ్వరా!

శా. పాలుం బువ్వయుఁ బెట్టెదం గుడువరా! పాపన్న! రా! యన్న, లే
లే లెమ్మన్న, నరంటిపండ్లు గొని తే, లేకున్న-నే నొల్ల నం
టే లాలింపరె తల్లిదండ్రుః? లవు డట్లే తెచ్చి వాత్సల్యల
క్ష్మీలీలావచనంబులం గుడుపరా? శ్రీకాళహస్తీశ్వరా!

ఇఁకఁ బూర్వవాఙ్మయమున మనము గమనింపవలసినది "చాటుధార." భాగ్యవశమున నెట్లో మనకు లభించిన మహాకవులచాటువులు వారి హృదయ కమలపరిమళములను వెదఁజల్లుచున్నవి. సహజపాండిత్యవిరాజితుండును, భక్తాగ్రేసరుండును, నగు పోతనామాత్యుని స్వాతంత్ర్యేచ్ఛ యీపద్యమున నెట్లు చిప్పిలుచున్నదో పరికింపుడు.

ఉ. బాల రసాలసాల నవపల్లవ కోమల కావ్యకన్యకన్
కూళల కిచ్చి యప్పడుపుఁగూడు భుజించుటకన్న సత్కవుల్
హాలికు లైన నేమి? గహనాంతరసీమల కందమూలకౌ
ద్దాలికు లైన నేమి? నిజదారసుతోదర పోషణార్థమై.

ఇట్టి స్వాతంత్ర్యప్రీతితో, నిట్టి నిర్భయముతో, నిట్టి మనోదార్ఢ్యముతో, నిండియున్న యీ పద్యమును భావగీతములయం దెట్టి పూజ్యస్థానమున నుంపవలయునో చదువరులే యూహింతురు గాక!

ఈ కవివరుని పద్యరత్న మింకొక్కటి కలదు. అందలి భావోత్కర్షమును భావోద్రేకమును సాధారణముగ నాంధ్రభాషయందే గాక మఱియే యితర భాషయందును, పెక్కుచోట్ల గన్పట్టదు. అట్టి కవిత లోకమున నరుదు. కావుననే పూజార్హము. మనభాషయం దట్టి రత్నముండుట మన భాగ్యము. ఎన్నిమాఱులు పఠించినను తనివి తీరని పద్యములు. మఱియొకమాఱు ఉదాహరించుచున్నందులకు నన్ను చదువరులు మన్నింపగోరెదను.

ఉ. కాటుకకంటినీరు చనుకట్టుపయిం బడ నేల యేడ్చెదో
కైటభదైత్యమర్దనుని గాదిలికోడల! యో మదంబ! యో
హాటకగర్భురాణి! నిను నాఁకటికిం గొని పోయి యల్లక
ర్ణాట కిరాట కీచకుల కమ్మ త్రిశుద్ధిగ నమ్మ భారతీ!

ఇట్టి భావగీతములు మన వాఙ్మయమున నుంట నవీన కవివరులకు నుత్సాహకారణము. ఉదాహరణమునకై చాటుధారలనుండి మఱియొక్క పద్యముతోఁ బూర్వవాఙ్మయమునందలి భావగీతచ్ఛాయావిషయమును ముగించెదను. శ్రీనాథుఁడు సర్వజ్ఞసింగ భూపాలుని కొల్వునకుఁ బోవుదారిని సరస్వతీదేవి విగ్రహమును జూచి నుడివిన ఈ క్రింది పద్యముఁ జిత్తగింపుడు.

సీ. దీనారటంకాలఁ దీర్థ మాడించితి దక్షిణాధీశు ముత్యాలశాల
పలుకుతోడై తాంధ్ర భాషామహాకావ్య నైషధగ్రంథసందర్భమునకు
పగులఁ గొట్టించి తుద్భటవివాదప్రౌఢి గౌడడిండిమభట్టు కంచుఢక్క
జంద్రశేఖర క్రియాశక్తి రాయలయొద్దఁ బాదుకొల్పితి సార్వభౌమబిరుద
మెటుల మెప్పించెదో నన్ను నింకమీఁద
రావుసింగమహీపాలు దీవిశాలు
నిండుకొలువున నెలకొనియుండి నీవు
సరససద్గుణ నికురంబ! శారదాంబ!

కావ్యమునకుఁ బ్రధానమైనది హృదయాహ్లాదకరమైన రసము. రసప్రతిపాదకమున కనుకూలంబైన భావము. ఈ రెంటికి నుచితము అగు భాష. ఈ మూఁటియం దెయ్యది కొఱవడినను-కావ్యము మనోజ్ఞము గానేరదు. కేవలము భాషానైపుణ్యము మాత్ర ముండిన ఫలము లేదు. రసపోషితమైనదే కావ్యము. కావ్యమునకు రసము జీవగఱ్ఱ. రసము స్థాయియై యుండిన, భావమును భాషయును దాని ననుసరించును.

రసము కావ్యపరిణామమును బట్టి వేర్వేఱు రీతుల విలసిల్లును. పదాశ్వాసముల ప్రబంధమునందును - నలువదిపంక్తుల భావగీతమునందును - రస మొక్కరీతిగనే వెల్లడిచేయుట యసంభవము. ఉదక మొక్కటియే యైనను చిన్నపాత్రలలో నుండునప్పటి తీరునకును, విశాలప్రదేశము నాక్రమించినప్పటి తీరునకును చాలభేద ముండుట సహజము. అట్లే రసమునకును ఆయా విషయములను తత్పరిపాకములను బట్టి భేద ముండును. అట్లుండుట కావ్యధర్మము.

భావగీతము సర్వసాధారణముగ నాతిదీర్ఘమై యుండును. ప్రబంధాదులతో బోల్చి చూచిన నతిస్వల్పముగ నైన నుండును. ఈ కారణమునఁ బైని నుడివినరీతి నిందు రసము కేంద్రీకృత మగును

పరిమాణము స్వల్ప మగుటచేత రసోత్సేధము సిద్ధించును. హృదయాంతరజనిత మగుటచే స్వచ్ఛందమై, స్వచ్ఛంద మగుటచే బంధవిముక్తమై, బంధవిముక్త మగుటచే నుత్కటమై, యుత్కట మగుటచే తీక్ష్ణమై, విశాలప్రదేశము నాక్రమింపమి నిశితమై, రసము చిప్పిలుచుండును.

రసోత్పన్న మైన భావ మెట్లుండవలయునో పాఠకు లప్పుడే యూహింపవచ్చును. రసము కేంద్రీకృత మైనప్పుడు భావైక్యము మిక్కుటముగ నుండును. రసపోషణకుఁ గాని భావము లనవసరము లగును. అనావశ్యకము అగు భావసమ్మేళనము రసోత్సేధమున కంతరాయమై రసనైర్మల్యమునకు భంగమును గల్పించి, రసాభాసమునకుఁ గారణ మగును. భావమునకును రసమునకును సంపూర్ణోత్సంగము సంభవించినప్పుడే భావగీతము హృదయోత్సవకరమై యుండును. ఆధునికకవివరుల గీతములనుండి రీతి కొక దాని నుదాహరించుచున్నాను.

## కాపుపాట

ఉ. ప్రేయసి! లేచిరమ్మ, చివురించిన మావులక్రింద శీతల
చ్ఛాయలలోన యౌవన వసంతశుభోదయమయ్యె, నవ్వుచున్
చేయికిఁ జేయిఁ జేర్చి, పెరచింతనలన్ మఱపించు రాగముల్
దీయుచు, వాసనల్ బరిమళించెడు చోటులయందు బోవఁగన్
ఉ. ప్రాలినసంజల న్మఱలివచ్చెడు గోవులఁ దోలి తీయఁగా
దోలెడుదాక, త్రాడులను దుత్తలు నావలఁబెట్టి సిగ్గులన్
సోలెడు చిన్నదాన! యెటుచూచిన నెవ్వరు లేనిచోటను
య్యాలల నెక్కి యూఁగ మనమయ్యెడు నీవును నేను వేడుకన్.
ఉ. పాడుట కొప్పు వేని, పడవ ల్నడిపించెడు యేటిత్రోవలే
చూడగవద్దు లేతమనసుల్ తడిసేసెడు చెట్లచాటునన్
గూడిన మేను లాను కొన కొమ్మల కాకులవోలె నొక్క మా
టాడకఁ గూరుచుండ మనువైన పొలమ్ముల గట్టునీడలన్.

[అ. రామకృష్ణారావు.]

పరిమాణము స్వల్ప మగుటంజేసియు, రసము కేంద్రీకృత మగుటంజేసియు, భావైక్యము నిశితమై యుంటఁజేసియు, భావగీతములు చిత్రలేఖనా సారూప్యమును కొంతవఱకు చెందియున్నవి. ఈ పోలిక ప్రకృతి సౌభాగ్యవర్ణనలందును, స్థాయీభావ విలాసాది వర్ణనలందును, నతిమనోహరముగఁ గన్పట్టుచుండును. చిత్రకారుఁ డెట్లు తన భావనాశక్తి నంతయు వినియోగించి ఎదే నొక్క విషయమును చిత్రించునో, అట్లే కవివరుఁడును భావగీతమున నొక్కరసమును మహిత మగు భావసమూహముతో ప్రతిపాదించును. చిత్రకారుఁ డెట్లు బలు తెరంగుల రంగుల నాయా స్థానముల నుపయోగించి చిత్రసౌందర్యమునకు భంగమును గల్పింపడో, అట్లే కవిశేఖరుఁడును భావగీతమున వివిధభావములను రసపోషణార్థము వినియోగించును.

ఉదాహరణార్థము రాయప్రోలు సుబ్బారావు గారి "ఎవరు" అను గీతరాజమునుండి ఒక రెండు గీతములు:—

గీ. ఆరుచున్న కలంకారి చీరచెఱఁగు
లనఁగ శాఖాముఖంబుల నందగించె
భాద్రపద నీలనీరద పంక్తు లపుడు
వ్రాలుచుండె నభోమణి వాఁడు కళల
తామ్రపర్ణీప్రవాహంబు దరులు దాటి
వఱదఁ బెట్టినయట్లు చూపట్టె, సంధ్య
నిండుకొన్న సంధ్యారామణీయకంబు
పొంగిపొరలు స్రవంతీ తరంగ శోభ
యొండొరుల ముద్దులాడుచు నుల్లసిల్లె
లసదపూర్వ ప్రణయలగ్న లాలనమున.
ఇంతలోన రక్తిమ కృశియించి పోయె.
చీకటి జడల్ ముడుల్ విచ్చి చిందులాడె.

రసమును గుఱించియు, రసోత్పన్న మైన భావమును గుఱించియుఁ జాలించి, ఇఁక భాషావిషయమును కొంత వ్రాసి విరమించెద. ఉచితమైన భాష రసపోషణమున కెంతయావశ్యకమో మఱల చెప్ప నక్కఱలేదు. రసము హృదయ జనితము. దాని నితరులకు సంపూర్ణ సౌభాగ్యమునఁ దెలుపుటకు భాషయే సాధనము.

భాష రసమును భావమును అనుసరించి యుండవలెను. ఔచిత్యము లేనప్పుడు భాషయెంత నిర్దుష్టముగ నుండినను ఫలము లేదు. లక్షణానుసారముగ రచింపఁబడిన ప్రబంధముల భాషాశైలియును శయ్యాయును స్వచ్ఛందము లగు భావగీతములకుఁ బనికిరావు. దీర్ఘసమాసములును, కఠినము లైన యన్వయములును హృదయాంతర జనిత మగు కవితాప్రవాహమున కడ్డువచ్చును. పదలాలిత్యము భావగీతమునకుఁ బ్రధానగుణము. భావగీతములు గీతములను మాట మఱువ కూడదు. ఆచారములోనుండు శార్దూలమత్తేభాదివృత్త స్వరూపములే కాక వేరుస్వరూపములను నైతము ప్రస్తుతకాలమున వాడుచున్నారు. నూతన మార్గమున రచింపఁబడిన లలితము లగు గీతములు కొన్ని "ఊహాగానము"నఁ గన్పట్టుచున్నవి. శ్రావ్య మైనప్పుడు స్వరూప మెద్దియైన నేమి?

పూజాతిసాంద్ర కర్పూరమ్ములందు
ప్రాఙ్నదీ పాధోలవమ్ముల యందు
వడగు సన్ననిపాట -
పొడుచు వెన్నెల తేట-
కలవు లెక్కున పల్కు తెలుఁగు పల్కులకు.

ఆంధ్రభాషామణి యిట్టి సుందరమైన యలంకారము నూతన మని పారవైచునా?

# నిమ్మరాజు వేంకటాద్రి కవి

కొణిదెన బాలకృష్ణయ్య గారు

వేంకటాద్రికవికి గుంటూరు మండలమునందలి నర్సారావుపేట తాలూకాలోని యనమదల గ్రామము నివాసస్థలము. ఈయన వేంకటకృష్ణమంత్రికిని తిరుమలాంబకును పౌత్రుఁడు. ఇతని తండ్రి వేంకటరమణప్ప. తల్లి పుల్లమాంబ. విద్యాగురువు ఇనగంటి వేంకటజోగి. శ్రీవత్సస గోత్రము. ఆఱువేల నియోగి. ఈతని యిష్టదైవము వేణుగోపాలమూర్తి. ఈగోపాలుని యనుజ్ఞవలనఁ దాను "కైవల్యకందరామాయణమును" రచించినటు లిక్కవి తన గ్రంథమునఁ జెప్పియున్నాఁడు. ఈ రామాయణము భారత మంత గొప్ప గ్రంథమై యున్నది.

వేంకటాద్రి కవియొక్క స్వీయసంతతివారు నశించిరి. కాని యాతని జ్ఞాతులు యనమదలగ్రామమునఁ బెక్కు రున్నారు. వారు చెప్పుచున్న వంశక్రమము ననుసరించి చూడ నిక్కవి పదునెనిమిదవ శతాబ్దిమధ్యమున, నఁగా క్రీ. శ. 1740—1760 ప్రాంతమున జీవించి యుండినట్లును, కొంచె మించుమించుగ నా కాలముననే "కైవల్యకంద రామాయణము" రచింపఁబడినట్లును తోఁచుచున్నది. కవి తన గ్రంథమునఁ దన సమకాలికు లగు కవులను గాని తక్కుంగల పురాతనాధునాతన కవీశ్వరులఁ గాని పేర్కొనక, గీర్వాణరామాయణ కృతికర్త యగు వాల్మీకినిఁ బ్రార్థించి, యవ్వల నాంధ్రమున రామాయణముల రచియించిన భాస్కరాదులను మాత్ర మీక్రిందిపద్యములలో నుదాహరించియున్నాఁడు.

కం. ఘన మాదికావ్య మీవలఁ
దెనుఁగున భాస్కరుఁడు జెప్పెఁ; దేటగ జగతిన్
అనువొంద రంగనాథుం
డను వాదికవీంద్రు లెల్ల నధికత రామా.

కం. పరిపరివిధముల రఘుపతి
చరితంబులు జెప్పి రట్టి చతురులలోనన్
పరమదయాకర! యుష్మ
ద్వరకవి నే వేంకటాద్రి వనరుగ రామా.

ఈతఁడు శ్రీరామభక్తిధురంధరుఁడై "కైవల్యకందరామాయణ" మను నొకగ్రంథమును మాత్రమే రచించినటుల నాతని బంధుగులు చెప్పుచున్నారు. వారియొద్ద నారామాయణపు ప్రతి (పుత్రిక) యొక్కటి తాటియాకులపై వ్రాయఁబడియున్నది. మాతృక యేమయ్యెనో యిప్పటివారు చెప్పఁజాల కున్నారు. ఈ తాళీదళసంపుటములను నిమ్మరాజు వేంకటదాసు (పెద్దవెంకయ్య) గారు మిగుల శ్రద్ధగాఁ గాపాడుచుఁ బఠించుచున్నారు. కొలఁదికాలముక్రిందట నీరామాయణపద్యములను వీధిబడులలోని విద్యార్థులకు, అపటి గ్రామములలోని యుపాధ్యాయులు బోధించుచుండినట్లు, గొందఱు వృద్ధులిప్పుడును జెప్పుచున్నారు. ప్రకృతము మన కలవడిన తాళీదళసంపుటము గ్రంథకర్తమనుమఁడును కీర్తిశేషుఁడును నగు నిమ్మరాజు అప్పయ్య స్వహస్తమున లిఖించినటుఁ దదంతమున వ్రాయఁబడి యున్నది.

ఈ రామాయణమున నాఱు కాండములును, ఎనిమిది యాశ్వాసములు గల యుత్తరకాండమును, నున్నవి. అన్నియుఁ గందపద్యములు. ఉత్తరకాండముతోఁ గలిసి యిందలి పద్యసంఖ్య 11051. ప్రతిపద్యమునకును చివర "రామా" యను మకుటము చేర్పఁబడినది. కవి యన్నియుఁ గందపద్యములుగ వ్రాసిన తనసామర్థ్యమును గ్రంథాంతమున నిట్లు వ్రాసికొనియున్నాఁడు.

కం. కందమునకు ఘనుఁ డెందురు
చందవరము చౌడకవిని, గురిగా నన్నున్
అందముగ వేంకటాద్రియు
కందములకు ఘనుఁడె యండ్రు కవు లిల రామా.

ఈ పద్యము చౌడప్పపద్యమున కనుకరణమే గాని యన్యము గాదు. చౌడప్పకందములకుఁ గల సరళత వేంకటాద్రికవి కందములలో నొక్కదానియందును గన్పట్టదు. గ్రంథ మంతయు రంగనాథ రామాయణము ననుసరించి వ్రాయఁబడినట్టు లందందుఁగల కథలపట్టులు చెప్పకయే చెప్పుచున్నవి. ఇందు చ్యుతసంస్కార ఛందోవ్యాకరణాదికము లగు దోషములు లెక్కలేనన్ని యున్నవి. కొన్ని ప్రక్షిప్తములును లేకపోలేదు. గాని యన్నియు నట్టివే యన నవకాశము లేని ప్రమాదములు పెక్కులు గన్పట్టుచున్నవి.

వేంకటాద్రికవికి సంస్కృతభాషాపరిచయ మంతగ లేనట్టు లాతని రామాయణమువలన మనము దెలిసికొనవచ్చును. ఇప్పటి గ్రామ్యభాషాపోషకు లగు నూతనసంస్కర్తల ప్రయోగములకుఁ దగు నిదర్శనము లిందనేకములుగ నున్నవి. కవిత్వ మంత సరసమై నదిగ నుండలేదు. కాని తనకుఁ గలిగిన భాషాపరిచయము నూరక వ్యర్థము చేసికొనక భాషాభిమానముననో, భక్తిపారవశ్యముననో, యింత పెద్దగ్రంథమును రచించిన వేంకటాద్రికవియొక్క సమర్థతయును ఓపికయును దలంచినపుడు మాత్రము మనకు ఆమ్మహాత్ముని కవితను గౌరవింపకఁ దప్పదు. మఱియు "రామకథ" గావున రంధ్రాన్వేషణమునకుఁ బనిలేదు. రామభక్తుఁ డగు నిక్కవి తన గ్రంథమున నీక్రిందివిధమున గద్యమును వ్రాసియున్నాఁడు. "గద్యము : ఇది మఱియు వాల్మీకిమహర్షి వలన సంస్కృతవిరచితం బైన శ్రీమద్రామాయణ మహాకావ్యం బాంధ్రభాషగా శ్రీ తిరుమల వేంకటాచలపతి కరుణాకటాక్ష వరలబ్ధకవి నిమ్మరాజు వంశపయఃపారావార

రాకాసుధాకర వేంకటరమణప్పనందన వేంకటాద్రినామధేయ ప్రణీతంబైన కైవల్య కందరామాయణంబునకు కృతికర్తయైన వైకుంఠపతి శ్రీమన్నారాయణమూర్తి కర్పణంబుగా నొసర్చిన యుద్ధకాండము సంపూర్ణము."

ఇఁక నీ కందరామాయణము నందలి పద్యముల గొన్నిఁటి శైలికై ఈ క్రిందఁ బొందుపఱచెదను.

### బాలకాండము.

కం. "అందము గలిగిన మేడల
చందము దినమణికళతంబు చాడ్పున వెలయన్
అందలిచిత్రం బెంచగ
కందర్పునియన్న కలవి గాదుగ రామా."

### అయోధ్యకాండము.

కం. తన నగరుఁ జేరవచ్చుట
విని, సీతాదేవి తాను వెలదులతోడన్
వినయత నెదురుగ వచ్చియుఁ
దనపతి నటుఁ బారజూచి తలకుచు రామా.

### ఆరణ్యకాండము.

కం. నిను, నాతమ్ముని, నిద్దఱ
పనిపడి నే విడుతుఁగాని పలికిన ప్రతినన్
విను, విడువక నే జరిపెద
నను పతిపలుకులకు నులికె యవనిజరామా.

### కిష్కింధకాండము

కం. కన సుకృతికి నిటు దగు నా?
జనకజతోఁ గూడ బుద్ధి-జనియెనొ నీకున్
ఘనవిరహాగ్నిఁ గ్రాగితి
నిను ననఁగానేమి ఫల మి కియ్యెడ రామా.

### సుందరకాండము.

కం. అనయముఁ గొండెల దిరుగుచు
నిడుమలఁబడి యున్నయట్టి హీనుని పొందున్
విడువక గోరగ నేటికి?
పడతీ! నను గోరితేని భాగ్యము రామా.

### యుద్ధకాండము.

కం. ఇనకులమున నుదయించిన
ఘనుఁడే శ్రీరామమూర్తి కారణపురుషుం
డని యెంత జెప్పినను మతి
విననేరవు. పాప మేమొ ! విను మిట రామా.

### ఉత్తరకాండము.

కం. తనబల మెచిరిబలంబును
గననేరక నెవ్వఁ డయిన గదిసినయేనిన్
విను మతఁడు జయముఁ జెందం
డని పలుకుదు రార్యు లెపుడు నతనిని రామా.

## ఎట్టిది కవిత్వము?

హనుమంతవఝుల జగన్నాథశర్మ గారు

చం. సరసులు మెచ్చునట్లు పదసౌష్ఠవమున్, విపులార్థయుక్తియున్
గురుతరభావగుంఫనము, కోమలమా రసపోషణంబు, సుం
దరవరవర్ణనాదు లుచితంబుగ గూర్చి రచించినట్టి దే
సరసకవిత్వ మంచు బుధసంతతు లెల్ల గ్రహించు నెప్పుడున్.

చం. అతికఠినంబు గాక, మఱి యంత సుబోధము గాక, మధ్యయౌ
చతురను బోలి యల్లిన పసం దని మెత్తురు గాని ధాత్రిలో
యతిగణప్రాసము ల్మిగుల యత్నము జేసియు చాటుమాటలన్
వెతకి యిమిడ్చి యల్లిన కవిత్వము మెత్తురె, పండితోత్తముల్.

తే. గీ. ఎచట నేరీతి వలయునో యెఱిగి పాత్ర, గతుల నతికేడి నాటకకర్త వ్రాలె,
సత్కవియు కావ్యములయందు సరస మైన, భావముల గూర్పఁ బండితు ల్భళి యటంద్రు.

# మార్పు

విద్వాన్, గ. సోమన్న గారు, ఎం. ఏ; ఎల్. టి

సంఘ నియమములు-భాషలు-పాలనపద్ధతులు మున్నగున వేవియు శాశ్వతముగ నేకరూపముగ నుండవు. అన్నింటిలో నానాఁటికి మార్పు గలుగుచునే యుండును. నిజమునకు మార్పు లేకుండుట మృతావస్థను సూచించును.

మార్పు కాలానుగుణముగఁ గలుగుచుండును. క్రొత్త సందర్భము లేర్పడినప్పుడు ప్రాఁత నియామకములు మాఱక తప్పవు. మార్పు వల దనువారు వారి యభీష్టమును చిరకాలము కొనసాగించుకొనఁ జాలరు. వివేకముగలవారు, బాధించు మార్పులను మాని యభివృద్ధి కారణము లగు మార్పులను గ్రహింతురు. ఇప్పటికాలము ననుసరించి మన సాంఘిక సాంప్రదాయములు మాఱుచునే యున్నవి. బ్రాహ్మణులు వేదపాఠ నిత్యాగ్నిహోత్రములు మాని, రాజకీయోద్యోగములు మున్నగు వ్యాపారములయందుఁ బ్రవర్తించుచున్నారు గద! సముద్రయానము సమ్మత మగుచుండ లేదా? ఆఁడువారికిఁ గూడ విద్య యబ్బుచుండుట మన మెల్లెడలఁ గనుచుండువిషయమే. ఇఁకముం దవసరములగు మార్పులు పెక్కులు గలవు. బాలురకును బాలికలకును యుక్తవయస్సునందు వివాహములు చేయుట, స్త్రీలకుఁగూడ వైద్య వృత్తి యుపాధ్యాయ వృత్తి మున్నగునవి కల్పించుట, కన్యావిక్రయము, వృద్ధులకు బాలికలనుఁ గట్టు దురాచారమును మాన్పుట, పిన్న వయసున వైధవ్యముఁ గనినవారి కష్టముల నెంచి తగిన యుపచారమున కవకాశ మొసఁగుట దృఢగాత్రులను బిచ్చ మెత్తకుండఁ జేయుట, ఇట్టి సంస్కరణములు మన కత్యవసరములు. పంచముల దురవస్థ చెప్ప నలవి గాదు. ఏ పంచముని యింట నైనను మూఁడుపూటలకుఁ జాలిన బత్తె ముండదు. పూర్ణయౌవనము వచ్చిన స్త్రీకైన నిండుగుడ్డ యుండదు. నివసించుతావు సర్వవిధముల హేయ్యముగ నుండును. త్రాగుటకు నీరు దుర్లభమై యుండును. ఈ పంచములు చేయు దేహకష్టమునకు మితి లేదు. మగవాండ్రు ఆఁడువాండ్రు పిల్లలు వృద్ధులును నిరంతరము కూలిపనులలోఁ దిరుగుచుందురు. కాని, వారికిఁ గడుపునిండఁ గూడు దొరకదు. పైఁగ, వారి నితరవర్ణములవారు మిక్కిలి నిరాదరణము సేయుదురు. హిందూసంఘము పంచములయెడల గావించు పాతకము వెంటనే యంత మొందవలయును. పంచములను వేఱు మతములలోనికిఁ ద్రిప్పు నుద్యమములు ప్రబలముగఁ గాన్పించుచున్నవి. పంచములను వేఱు మతములలోనికిఁ బోనిచ్చుట సంఘబలమును తగ్గించుటయే! దూరదృష్టి గలవారు, దీనిని గ్రహించి, తగిన ప్రతిక్రియఁ జేయనగును. ఈ చిన్న వ్యాసమునందుఁ బైనిఁ దెలుపఁబడిన విషయములను విపులముగఁ జర్చించుటకు వీలుపడదు. కాలోచితము లగు విపర్యాసములకు నెడ మీయనిచోఁ దప్పక కీడు మూడు నని యెఱుఁగవలయును. పరిపాలన ప్రకారము కూడ స్థిరరూపము నొందియుండ లేదు. ఇదియునుఁ గాలానుగుణముగ మాఱుచుండవలయును. లేనిచోఁ గల్లోలములు గలుగును. రాజకీయ విధానము లెంత త్వరగ మాఱుచున్నవో మన మిప్పుడు చూచుచున్నారము. నిరంతరము ఏవో క్రొత్త యేర్పాటులు పుట్టుచున్నవి. దేశమునందు జ్ఞానచైతన్యము వృద్ధియగుచున్నది. ఉత్తరోత్తరాభివృద్ధిఁ బడయక దేశము శాంతినిఁ బొందదు. స్వార్థపరులు ప్రతిఘటించినను, దురాశాబద్ధు లెదిరించినను, పరిపాలన ప్రక్రియ ప్రజానుకూలముగ మాఱక తప్పదు. వర్షానంతరము భూమిపై సస్యోత్పత్తి యగునటుల, జ్ఞానోదయము అయినతోడనే నూతనావిర్భావము లుదయించును. ఇట్టివానికి సహజవికాసము కలుగఁజేయుటయే నీతియును బ్రాజ్ఞతయును.

ఇఁక భాషావిషయమును కొంత విచారింతము. ఏ భాషయు నెల్లకాలము నొక్కరూపముఁ గలిగియుండదు. సంస్కృతము, ఇంగ్లీషు, లాటిను, మున్నగు భాషల చరిత్రలఁ జూచిన నీ విషయము తెలియవచ్చును. ఇప్పటి సంస్కృతభాష వృద్ధిక్షయములు లేక నిలిచిపోయినది. గనుకనే దీనిని మృతభాష యని వాడుచున్నారు. వ్యవహారములో లేని భాషకు, జీవము లేదని చెప్పవచ్చును.

మన తెలుఁగుభాష సజీవమైనది. గనుక దీనియందుఁ గాలానుసారముగ మార్పు లేర్పడుచున్నవి. ఇట్టి మార్పు లుండఁగూడ దనుట యనుచితము. తెలుఁగు భాష బహుముఖముల విస్తరించుచున్నది. వార్తాపత్రికలు, నాటకములు, నవలలు మున్నగున, వెన్నియో క్రొత్త క్రొత్త రచనము లుదయించుచున్నవి, రచన శైలి మాఱుచున్నది. వచనకావ్యములు మెండుగఁ బుట్టుచున్నవి.

మనభాషకుఁ బెక్కు నూతనవికాసములు రావలసియున్నవి. పాశ్చాత్యుల యుత్తమగ్రంథము లన్నియుఁ దెలుఁగులోనికిఁ బరివర్తితములు కావలయును. కేవల సాహిత్యగ్రంథములే కాదు. వైద్యము, జ్యోతిషము, ప్రకృతిశాస్త్రములు, గణితము, చరిత్రము వాణిజ్యము వివిధపరిశ్రమలు మున్నగు నూర్లకొలఁది విషయములను బోధించు గ్రంథములు మన భాషలో లేవు. ఈ లోప మున్నంతవఱకు మనభాష యధమదశయందే యుండక తప్పదు.

ఇట్టి గ్రంథములు బయలువెడలుటకుఁ గొన్ని యభ్యంతరములు గలవు. ఉన్నతపాఠశాలలలో నీవిద్యలు తెలుఁగుభాషలో నేర్పఁబడకుండుట మొదటి యభ్యంతరము. పాఠకు లుండినఁ గాని పుస్తకములు పుట్టవు. ఈకాలమునందు ఇంగ్లీషురానివారికి పాశ్చాత్యుల శస్త్రవైద్యము వంతెనలు కట్టుట, గడియారములు చేయుట ఖనిజములనుండి లోహములను తీయుట విమానములు స్టీమర్లును గట్టుట, మున్నగు విషయము లేవియును తెలియరావు. ఇట్టి వాఙ్మయము తెలుఁగున నుండినఁ గాని తెలుఁగొక గొప్పభాషగ గణింపఁబడదు. ఉన్నతవిద్యాలయములలోఁ దెలుఁగుననే యన్ని విషయములను బోధించుటయు, రాజకీయ వ్యవహారములు తెలుఁగుభాషలో జరుపుటయుఁ దెలుఁగుయొక్క యభివృద్ధికిఁ ముఖ్యమార్గములు.

పై సంస్కరణముల నొనర్చినతోడనే భాషకుఁ గల కొన్ని యనవసర నియమములు తొలఁగిపోవును. వ్యవహారభాషలో శకటరేఫము అర్ధానుస్వారము క్లిష్టసంధులు మున్నగునవి తమంతటఁ దామే తొలఁగిపోవును. ఇట్టి వానినిఁ బాటించు పండితబృందములు-భాషయందుఁ బ్రకృతిశాస్త్రములును ఉత్తగ్రంథములును ఉత్పత్తిగాకుండ నభ్యంతరముఁ గలుగఁజేయుచున్నా రనుట యవివేకము. ఈలోపమునకుఁ గారణము వేఱుగ నున్నది. పండితుల ననవలసిన పనిలేదు. పైలోపములను దీర్చుటయే ప్రజ్ఞ గాని ప్రల్లదము లాడుట ప్రజ్ఞ గాదు.

మార్పులేకుండు సంవిధాన ముండదు. ప్రయోజనకరము లగు మార్పులను గ్రహించుట వివేకము. దేశకాలవిపర్యాసముల నెఱుఁగక, మార్పు వల దనువారు దేశాభివృద్ధికిఁ దోడ్పడరు.

# ఉపాధ్యాయత్వ గౌరవ పరిరక్షణము

రాయసము వేంకటశివుఁడు గారు, ఎమ్. ఏ., ఎల్. టి.

లోకములో సామాన్యముగా నెవ్వని కైనను తా ననుభవించు కష్టములు, తాను మోయు భారములు మాత్రమే తోఁచును గాని తాను బడయుచున్న సౌఖ్యగౌరవము లంత స్ఫుటములుగ నగపడుట లేదు. ఉపాధ్యాయులకును వారియెడల సహానుభవము గలవారికిని, సాధారణముగ వారు లోనగు నిక్కట్టులే గోచరించును. గాని, వారు "పాలకొఱకు తాయి మోయు"చుండు సంగతి విదితము గాకున్నది. జననీజనకుల ఋణమును మనుజుఁ డీ జన్మమునఁ దీర్చుకొనలేఁ డని మనదేశీయులు తలంతురు గురువు ఋణమును నంతకుఁ దీసిపోవునది కాదు. ఐహికాముష్మిక సుఖము లొనగూర్పఁ దగిన జ్ఞానము ప్రప్రథమమున మనకు లభింపఁజేయ నుద్యమించిన గురువర్యునకు మన మేపాటి దక్షిణల నీయఁగలము? ఏ యుపకృతుల చేయఁగలము? విద్యాబోధమునకును దదితర వ్యాపారములకును చాల వ్యత్యాసము గలదు. జ్ఞాన ప్రబోధనము, 'వృత్తులలో నుత్కృష్టమును-బేరములలో నికృష్టము' నని యాంగ్లేయుల మతము. ఐనను నిజమారసినచో, నిది కేవలము వృత్తి యని చెప్పఁ దగినది గాదు. జీవనోపాధిని సంపాదించుకొనుట కుపకరించునది వృత్తి. నిజమునకు జ్ఞానబోధన మటువంటిది గాదు. ఇది కేవలము పారమార్థిక చింతవలననే పూనవలసిన మహాకార్యము. ధనార్జనము చేయు నుపాధ్యాయులను దూషించుచు, సోక్రటీసు, వారిని విద్యావిక్రేతలని నిందించెను. ప్రాచీనకాలమున మనదేశమునను గురువు శిష్యుల వలనఁ బ్రతిఫల మేమియు నపేక్షింపక, మీఁదు మిక్కిలి వారికే తాను భోజనాది సౌకర్యములను సమకూర్చి, విద్యాపరిపూర్తి యైనపిమ్మట వారు శక్తికొలఁదిని మనఃపూర్వకముగను నొసగిన దక్షిణలను స్వీకరించెడివాఁడు. వారి సంతతివార మగు మనమును జ్ఞాన విక్రేతల మను నపయశస్సును ఒడిఁగట్టికొనకుందము గాక! ప్రాచీనకాలమునందువలె గురుశిష్యుల పరిపోషణమునకు వలయు మంచి వసతులు ప్రస్తుతకాలమునఁ బొడకట్టని లోపముచేత, గురువుల మగు మన మిపుడు ధనమును గ్రహింపవలసి వచ్చుచున్నది. కాని, నిమిత్తమాత్రముగను, ఆపద్ధర్మముగను, ప్రస్తుత మేర్పడిన యీధనస్వీకారమును పరమావధిగ నెంచి, మనము పూనిన కార్యము యొక్క పవిత్రతను మఱచిపోవుచున్నాము. శ్రీరామానుజాచార్యులవారి జీవితమునుండి మన మొక్క సందేశమును గ్రహింపవలయును. మోక్షమార్గ ప్రబోధనమే ముఖ్యకర్తవ్యముగఁ జేకొని జీవయాత్రను గడపు నామహనీయునికి, ఒకనాఁడు తమయింటికి భిక్షకే తెంచు సమయమున గృహస్థులు కొందఱు పిడికెట బియ్యము తోఁ బంగరునాణెములను గలిపి వేయుచువచ్చిరఁట. కాని యాపుణ్యపురుషుఁడు దానిని గనిపెట్టి, "పచ్చపురుగు లున్నవే!" యని యా నాణెములను స్పృశింపనైన నొల్లక, ఒక పుడకతోఁ నేర్చి, వానిని వారి యిండ్ల కడనే దిగవిడుచుచుండు నఁట! "సువర్ణము నాసతోఁ దిలకించు కన్నులు గలవానికి విజ్ఞాన ప్రబోధన కార్యదీక్ష వహించుట కధికారము లే" దని గుర్తెఱిఁగి మనమును దగినట్టుగ మనస్సును దిట్టపఱచుకొందుము గాక!

మోక్షమార్గప్రదర్శకుఁ డగు నాచార్యునివలెను - హృదయము నానందసాగరమున నోలలాడింపఁ జాలు కవిపుంగవునిరీతిని - విద్యాప్రబోధకుఁడు ఫలాపేక్ష లేక, తృప్తియు హృదయ పవిత్రతయుఁ గలిగి, నియతమగు కార్యమును నిర్వహించుటకుఁ దొడంగవలయును.

తాను రచించిన మహాభాగవత కావ్యమును గృతి నందుకొన నువ్విళ్ళూరుచు, లెక్కింప నశక్యములగు ధనరాసులు తన కీయ సమకట్టిన రాజాధిరాజులకు తా నీయక, మనదేశీయుఁ డగు పోతనమహాకవి శ్రీహరికే దానిని సమర్పించెను. దరిద్రదశలో నున్నను తాను రచించిన యుద్గ్రంథమును పొట్టకూటికై యేరాజునకో అంకితము చేసినచో-మరణానంతరమునఁ దాను గాలుచే సమ్మెటపోట్లఁ బడుదు నని యతఁడు వెఱఁగందెను! కవితామతల్లిక కన్యకారూపమును దాల్చి నీచులకుఁ దన్ను నాతఁడు విక్రయించునేమో? యని భీతిల్లి, యెదుట నిలిచినపు[illegible]వివర్యుఁడు చెప్పిన పద్యములు దేశమం దన్నిదిశలను వ్యాపించి యున్నవి.

ఉ. బాల రసాల సాల నవపల్లవ కోమల కావ్యకన్యకన్
గూళల కిచ్చి యప్పడుపుఁగూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికు లైన నేమి? గహనాంతరసీమలఁ గందమూలకో
ద్దాలికు లైన నేమి? నిజదారసుతోదర పోషణార్థమై.

ఉ. కాటుకకంటినీరు చనుకట్టుపయిం బడ నేల యేడ్చెదో
కైటభదైత్యమర్దనుని గాదిలికోడల! యో మదంబ! యో
హాటక గర్భరాణి! నిను నాఁకటికిం గొని పోయి, యల్ల క
ర్ణాట కిరాట కీచకుల కమ్మఁ ద్రిశుద్ధిగ నమ్ము భారతీ.

ఆఁకలిచే నల్లాడుచుండియును, ఈ కవివర్యుఁడు కావ్యకన్యకను నీచులకు విక్రయింపక, ఈశ్వరసమర్పణము గావించెను. ఆరీతిగనే మనమును విద్యాకన్యకను గడుపుకూటికై విక్రయింపకుందుము గాక! మానవసేవకై - ఈశ్వరప్రీతికై - సమర్పింపవలసిన యీపవిత్రమగు విద్యను క్షుద్రమగువస్తు సంపాదనకు వినియోగింపకుందుము గాక!

ఈ తీయనిపల్కుల చొప్పున నడుచుకొన నీ పాపపులోకమున సాధ్యమా? యని యెవరైన నడుగవచ్చును. సాధ్య మనియే నాతలఁపు. కానిచో నెట్లైనను సాధింపవలయును. ప్రస్తుతమువ్యావహారిక ధర్మముల ననుసరించి భుక్తికై యుపాధ్యాయుఁడు ధనమును గైకొనవలసి వచ్చుచున్నది. కాని, ధనకాంక్షచే నిరతము పీడింపఁబడువాని హృదయమునుండి ప్రబోధనశక్తి నానాఁటఁ దొలఁగిపోవును. సొమ్ముమీఁదనే కన్నువేసియుండు దేశికుని యాత్మ శిష్యమోహము నాకర్షించి హృదయరంజకముగ విద్యనేర్పగల శక్తిని గోలుపోవును. ఉత్కృష్టనికృష్టపదార్థములచే నేకసమయమున నాత్మ యాకర్షింపఁబడ నేరదు. ఉత్తమవిద్యాబోధకునియందు గనఁబడెడి తృప్తి - హృదయనైర్మల్యము- పవిత్రప్రేమ- మొదలుగాఁగల గుణసంపద నట్టి బేరగానియందుఁ బొడగట్టునా? ఇతర వృత్తులలోఁ జేర వలసినవారును, ఉపాధ్యాయవృత్తికి బనికిరానివారును, పలువు రిపుడు బోధకు లగుచున్నారు. వీరిలోఁ గొందఱు ధనార్జనమునకు సహాయభూత మగునే వర్తకమునందో ప్రవేశింపక, కాలకర్మలోపము చేతనుపాధ్యాయులై, మేకవన్నె పులులుగ మెలఁగి, బోధకలోకమున కవమానమును తెచ్చుచున్నారు. వీరికి "చిత్తము శివునియందును భక్తి చెప్పులమీఁదను." ఉపాధ్యాయబృందమునకు వీ రంత శ్శత్రువు లని చెప్పవచ్చును. ఇట్టి [illegible]పాధ్యాయాభాసుల సహవాసమువలన తక్కిన వారికి గూడ నపయశస్సు ఆపాదిల్లుచున్నది. తనశిష్యులకి ట్లొకానొకతఱి జీసనుబోధించెను:-"ఇరువురు స్వాములకు మీరు దాస్యము చేయనేరరు. ధనదైవములను మీరు ఏకసమయముననే భజింపలేరు." అని. ఆవిధమున, ధనకాంక్షాదులు హృదయసీమ నావరించినచో నట్టి విద్యాబోధకుఁడు జ్ఞానప్రబోధనరూప మగు పవిత్రకార్యమును సాధింప సమర్థుఁడు గాఁడు.

నే నిట్లనుటవలన అధికారులు - ఉపాధ్యాయుని దరిద్రదశ తొలఁగునట్టి ప్రయత్నములు చేయవలదనుచున్నానని కాదు. విద్యాబోధక మహాకార్యమును నెరవేర్పఁబూనునుపాధ్యాయులకు సంసారయాత్ర యవ్యాహితముగ జరగు వసతులను రాజును ఆరాష్ట్రికులును ఏర్పఱుపవలయును. అట్లు చేయరేని, ఉపాధ్యాయుఁడు తగు జీవనోపాధి లేక తన పనులను సరిగ నిర్వర్తింపలేకపోవును. సంతత దరిద్రదశ " చెప్పులోని రాయి " వలె గురువుల మనస్సును కలవరపెట్టుచు, వారి కార్యమునకు విఘ్నములు గలిగించుచుండును. కావున నుపాధ్యాయునికి ఇహలోకయాత్ర సౌఖ్యముగ జరగునట్టి యుపపత్తి గలిగించుట దేశీయుల యొక్కయు దొరతనమువారి యొక్కయు ప్రథమకర్తవ్యమే !

కాని, తన స్థితిగతు లెటులున్నను, గురూత్తముని మనస్సు ధనమున నోలలాడుట కిచ్చగింపక, విదురుని హృదయసీమవలె భాగ్యదారిద్ర్యములకు దూరమగు స్థితిని గోరును. ఒకటేల? జ్ఞానధనానుభవము గల మనస్సునకు పరధనము లంతగ రుచింపవు. " దేశికోత్తములు విద్యాసంపన్నులై తమ్మును పోషించుభారమును స్వదేశీయులకు విడిచివైచి యిచ్ఛావిహారులై, జ్ఞానవ్యాపనమును చేయుచుందు" రని ప్రజాతంత్రరాజ్యమను పుస్తకమున ప్లేటో వచించెను. ఇంక మనదేశమందును జ్ఞానోపదేశమునే ముఖ్యకార్యముగఁ జేసికొని సంపదలు రోసి, కృతకృత్యులైన గురూత్తములు, వేలకొలఁది గలరు. కావున నిప్పటి బోధకులును క్షణభంగురములగు నైహిక సంపదలకై పరితపింపక తమ పవిత్రకార్యమునందు దీక్ష వహింపవలయును. నవలాగ్రంథకర్త్రి యగు మేరీకారిల్లై, మహాభాగ్యము యొక్క దుర్లక్షణములను వర్ణించుచు, " భాగ్యము దారిద్ర్యము నను నీరెంటిలో నేదియైనఁ గోరుకొను మని దైవము నన్ను నిర్బంధించెనేని, నేను తప్పక దారి

The First Arundhatia Conference




ప్రథమ ఆరుంధతీయ సమావేశము

Andhra Parisodhak Mandal. Third Anniversary.



ఆంధ్రపరిశోధకమహామండలి తృతీయవార్షికోత్సవము

Scoutmasters' Training Camp



స్కౌటుమాస్టర్ల ట్రెయినింగు కాంపు, నంద్యాల

Godavery Pushkaram Camp Scouts.



గోదావరి పుష్కర బాలభట సేవలు

The youngmens' Union—1920



యువజనసంఘము, బందరు

ద్రవ్యమునే కోరుకొందు" నని పలికెను. ప్రస్తుతకాలపు నాగరకతకు బరమావధి - ధనసంపాదనము. దీనివలన నన్నిపనులును సమకూరుచున్నవి. కాని, ప్రాప్యములలో నుత్తమ మగు మనశ్శాంతి మాత్రము చేకూఱుట లేదు. కావునఁ బామర జనులవలె నుపాధ్యాయుఁడు మోస పోకుండవలయును. తాను గైకొను స్వల్పజీతమును పాటించి కాక, తన యుద్యమముయొక్క యుత్కర్షతను గుర్తెఱిఁగియే యతఁడు కార్యసాధనమునకుఁ దొడంగ వలయును. తన యధికారి కను సన్నలఁగాక దైవముఖ మును జూచియే యతఁడు పనులను నిర్వహింపవలయును. తన కీయఁబడు వేతనము గౌరవవేతన మనియే భావింప వలయును గాని రోజు కూలి యని తలంపరాదు. తన యధికారులు వీరును వారును గాక, వీరందఱకు స్రష్టయై పరిపాలించు లోకపాలకుఁడే యని గుర్తెఱుఁగవల యును. అట్లు వర్తించి మనము కృతకృత్యుల మయ్యెదముగాక!

## కోకిల

నిడుమ్రోలు కనకసుందరము గారు

గానపాథోధి నోలాడి, గాఢమైన
వింటిదెబ్బకు నసువుల విడచి, మర్త్య
లోకమున సెలవు గైకొని, లోభియైన
బోయనికి బొంది నర్పించి, పుణ్యభూమి
కేగితివి భాగ్యవతివి. కోకిలమృగాక్షి!
ఇన్నిదినములు నీ వున్న యిల్లు, నెట్లు
కలిప్రపంచమ్ము విడి చనఁగలవు నీవు?
దినదినము నీ మధుర గాన దివ్యసుధను
కడుపు నిండంగ గ్రోలి నీ గానమందు
నమలుఁడౌ సృష్టికర్త వాక్యముల వినెడి
మానవోత్తంసులకు నేది మార్గ మింక?

* * * *

నమ్రమై నట్టి నీ కంఠనాదము విని
ధారుణీస్థలి జనసముదాయమునకు
భావ ముప్పొంగఁ గీతము ల్పాడు నట్టి
కవిశిఖామణి కగుఁ గష్టకాల మింక.
గానవిద్యాప్రవీణతఁ గంటి మంచు
గర్వపడునట్టి నరుల ప్రఖ్యాతి కింక
మేర యుండఁగఁ బోదు నిమేషమాత్ర
రిపులను జయింపఁ గల నీవు లేనికతన.

* * * *

స్తబ్ధులై విని నీదు సుస్వరము లన్ని
ఎల్లపుడును ప్రతిధ్వను లీనుచుండు
చిత్తసందీప్తి లేని నిర్జీవరాశి
చలనమే లేక యుండఁగావలయు నింక.
ప్రకృతి జన్మదినోత్సవ ప్రభలమధ్య
నల వసంతాగమమునఁ గ్రొమ్మొలక లెత్తు
మావిగున్న నధిష్ఠించి మావిచిగురు
లను భవింపంగ నెవరుఁ గలార లింక!

* * * *

గాఢమై నట్టి నష్టము కలిమిలోన
కలిగె విశ్వాన నీదు నిర్గమమువలన
సర్వరక్షకుఁ డగు మహేశ్వరుని కరుణ
పెంచి బిడ్డల, దయఁ బ్రసాదించి యుంటి
వపుడె, పుణ్యము! వాని యవ్యక్త గాన
మాలకించుచు సంతృప్తి నందగలము.
అవియుఁ గ్రమమున నీవలె నైన దనుక.

* * * *

తరుశిఖర మెక్కి మందగీతములఁ బాడి,
పాంథజనులకు శ్రమ బాపి, పండితులకు
సర్వదేవుని చెయ్దముల్ జ్ఞప్తి దెచ్చి,
గానవేత్తల మను యంత్రగాండ్ర గెలిచి,
ఎల్లరకు హృదయమ్ము రంజిల్లఁ జేసి
సుఖమొసంగుట నీబిడ్డ సొమ్ము ఇంక.

* * * *

కలిసి జీవించు నే కలకాల మొకఁడు?
ఋణము చెల్లిన వారలు చనుట, మిగులు
తమ రెఱింగిన విధ్యుక్త ధర్మములను
మానకుంట, ప్రపంచధర్మమ్ము గాన,
వసుధ నీచావునకు సుంత వగవ నయ్యె!
వగచినన్ నీదు వాక్సుధాస్వాదనమ్ము
లభ్యమగుఁ నెక్కొ? మాకు దుర్లభము గాదె

# గ్రంథాలయ సమాలోచనము

సాహిత్యసరస్వతి నారాయణశర్మ గారు

జ్ఞాన మైహిక మనియుఁ బారమార్థిక మనియు రెండు విధములు. అందు మొదటిది చతురాశ్రమంబుల కాశ్రయభూతం బగు గృహస్థధర్మము నడపుటకు మార్గదర్శకము. ఆధర్మమునే లోకులు లౌక్య మందురు. ప్రతిజీవియు సంసారయాత్రను జరపినమీఁద నధమగతికిఁ బోక యుత్తమగతినిఁ బ్రవేశింపఁ బ్రయత్నపడుట విధి యని ఋషుల యాదేశము. ఇది మనదేశమునఁ గశ్యపాది ప్రాచీన మహర్షులచేతను, శంకరాచార్యాది మతోద్ధారకులచేతను ద్రచ్చఁబడి జీవన్ముక్తి జ్ఞానముగఁ బరిణమించినది. ఖొరాను, బైబిలు పిటకము, నింక నెట్టి మతప్రమాణము లయినను దుదకు ముక్తిధామమే గంతవ్యస్థానమని అంగీకరించుచున్నవి. ఇట్టి మహత్తరవిద్యలు శ్రుతిపూర్వముగఁ గాని, కంఠస్థముగ గాని, యనశ్వరస్థానమును బడసి, లోకపరంపరలకు ఇహపరసాధనము లుపదేశించుట యెట్లు? వీని కాయా యాదిమ భాష లాధారములు. భావలను బ్రతికించి, సౌకర్యముతోఁ బెంచి పెద్దవిగఁ జేయునవి గ్రంథములు. గ్రంథసంపత్తిలో ఋగ్యజుస్సామాథర్వములు ప్రథమములు. నఖర్వ విజ్ఞానప్రదములు. వానిం బట్టియే యాయుగమునకు వేదయుగ మను నాఖ్య వొసఁగినది. త్రయీలతలయందలి యమానుషీయములు నమూల్యము లగు వివిధజ్ఞానామృతములు జగంబున ధ్రువముగఁ దనుపుచుండుట గ్రంథరూపధారణమునఁ గాదా?

## పూర్వోదంతము

గ్రంథములు వేదయుగమునుండి మనకు బ్రబుద్ధములై యుండుటచే వానిపుట్టువు కాల మిది యని స్ఫురించెడు. ఈతఁంపు శ్రుతుల కాలనిర్ణయ మొనర్చు వారల యాశయమునకు సమీక్ష్యము. 'పరితస్సీదం త్యత్ర పరిషత్' అనువ్యుత్పత్త్యర్థ మిచ్చు పరిషత్త్వమునుఁ జూడఁగ, నా కాలమునఁ బండితసమావేశము లున్నట్లు కనఁబడుచున్నవి. మఱియును మొదటిపరిషత్తు బ్రహ్మావర్తమున నియుక్తమైనదట. అప్పుడు గోష్ఠీస్థలము లున్నట్లును, అందు గ్రంథాధానమును ఉన్నట్లు ప్రమాణముల వినఁబడు. అట్టి పరిషత్తులందు గ్రంథపేటిక లుండెను. గ్రంథములు పారిషదులచేఁ దేఁబడుచుండెను. అవి కేంద్రస్థానముల నుండి శాఖాస్థానములకు గొనిపోఁబడుచుండెను. ఇప్పు డమెరికా ఆస్ట్రేలియాలలోని సంచారగ్రంథాలయములు దీనిస్మరణ చిహ్నములేమో? కొన్ని పరిషత్తులు నియమితకాలానుకూల్యముగను, మఱికొన్ని నిత్యములై గురుకులాశ్రయములతోఁ దోఁబుట్టువులుగను ఉండెను. స్థిరపరిషత్తులందు స్థిరగ్రంథపేటికలు విరాజమానములు. ఇవియే కోశాగారములు. వీని యధ్యక్షుఁడు కోశాచార్యుఁడు. ఈతఁడు కోశాగారమందలి గ్రంథరత్నముల విలువ నెఱిఁగిన విశారదుఁడు. మొగ్గ, కత్తియొర, ధనసమూహము, ప్రమాణము లేక పుస్తకము లోనగు నర్థములను వివరించుచు, కోశశబ్దము విజ్ఞానవిస్తరం బగు పుస్తకం బని నిష్కృష్టార్థ మిచ్చుటచేతను, విశ్వకోశ మనియు, నమరకోశ మనియు నుదాహృతములై యున్నవి. చూడుఁడు! యోగసిద్ధులు సంగ్రహించి యుంచిన జ్ఞానదాయకంబు లగు వేదాద్యుత్తమశాస్త్రములు మొన్నమొన్నటివఱకు విదేశీయులు తీసికొనిపోవుటయు, రేఖాక్షరగణితసూత్రము లారబ్బులు నేర్చుకొని పడమటిదేశములయందు గణితశాస్త్రోన్మేషమును గలిగించుటయు, వరాహమిహిరుఁడు గ్రహణములయునికిని భూవలయాకారమున నాదికాలముననే సిద్ధాంతీకరించుటయును, ప్రాచీనాలయములఁ బుట్టి పెరుగుచున్న శిల్పకళలు యవనాదిదేశముల మోమెత్తుటయు, విశల్యకరణి లోనగు నపూర్వమహత్తులు ప్రద్యోతించు నాయుర్వేదసువాసన విదేశకల్మషముల హరించుటయు, పాతివ్రత్యము లోకోపకారము మున్నగు సతీలోకసద్గుణములు పాశ్చాత్త్య స్త్రీపుల్లోకములను జమత్కృతులం జేయుటయు, భారతీయుల గ్రంథాలయ ప్రణాళికవలన వెల్లడియగుచున్నది.

కోశాగారమందుఁ గోశాచార్యుండును లిపికరణుండు నను నిద్దరు కార్యనిర్వాహకు లుండిరి. శ్లో॥ 'సాంగంచ సరహస్యంచ తమాచార్యం విదుర్బుధాః' అని మనువు శాసించిన ట్లాచార్యుఁడు కోశస్థ గ్రంథములు సాంతముగఁ జదివిన చదువరియుఁ బాఠకులగు దర్శకులకు జనించు శాస్త్రసందేహములు తీర్చువేత్తయునై యుండెను. ఈతఁడు గోష్ఠీసమయంబులఁ బ్రసంగముల నుపన్యాసముల నొసఁగి, శ్రోతలహృదయముల నీశ్వరభక్తియందును వారి ప్రవర్తనముల నైతిక విధులందును బొందుపఱచుచుండిన గురుఁడు. ఈతఁడు రాజుల యాదరణమును బ్రజల యనురాగమును ఉపార్జించి, కోశాగారములను సర్వవిధముల నున్నతికిఁ దెచ్చుచుండెను. ఆగారమందలి పురాతన ప్రక్షిప్తగ్రంథములను వ్రాయుటయే లిపికరణుని కార్యము. ఇట్టియాగారముల కార్యవర్తమే మొదటి చోటని మీఁద వ్రాసియున్నాఁడను. కాని ఋషుల యజ్ఞశాలలందలి ప్రాగ్వంశములు పవిత్రకోశాగారములై యుండెనని యూహాపథ మున్నది. గార్గి శ్రద్ధ, విశ్వవారా, వాక్కు ప్రభృతు లగు తపస్వినులకు ఆకోశాగారములు విద్యాక్షేత్రంబులై యుండెను. కానఁ గోశాగారముల జననము ప్రాచీనమునులకు సమకాలికముగఁ గన్పట్టుచున్నది. గ్రంథాలయము లిట్లు వానప్రస్థుల యొడఁ బాల్యావస్థనుఁ గడపి, గృహస్థపండితుల యిండ్ల యౌవనము చూపెను.

## ఉన్నతావస్థ

దీనికిఁ జంద్రగుప్తుని కాలము లగ్నస్థానము. ఆచార్యవంశతిలకుఁడు తక్షశిలలోఁ గోశాగారములను నిర్మించెను. ఈతని మనుమఁ డశోకవర్ధనుఁడు పితామహుని గ్రంథాలయదీప్తి నుచ్చదశకుఁ దెచ్చెను. మఱియు నీచక్రవర్తి రాజ్యాంగములలో నొక్కటిగ గ్రంథాలయోద్యమ వ్యవస్థను శాసించెను. అనేకభాషలవలన నుత్తమగ్రంథముల ననువాదము చేయించుచుండెను. తరువాత విశ్వవిఖ్యాతి అక్బరు చక్రవర్తి యీసత్కార్యమునఁ గంకణబద్ధుఁడై యుండెను. ఆ బాదుషా యంతిపురమునను సభామందిరమునను నున్న గ్రంథాలయము ప్రాపంచిక సారస్వతమునకు క్రీడామందిరమే! ఇందు గ్రంథస్థమూల్యము కొలంది పుస్తకములు చేర్చఁబడియుండెను. ఈపద్ధతి కోమటులయందును విద్యమానము. ఈలాగు బేగుకృత మగు ఖగోళశాస్త్రము హిందీభాషకును, వ్యాసవిరచితభారతము యవనకవిత్రయముచేత బారసీకిని, రామాయణ మథర్వవేదము లీలావతీగణితములు ఫారసీకిని అనువదింపఁబడియె. ఈమార్గము గ్రంథాలయ విస్తరమునకు రాజపథము కాదా? మఱియు నీచక్రవర్తి శృంగారముతప్పఁ దక్కిన యెనిమిదిరసములు సాక్షాత్కరించునట్లు పటములు చిత్రింపఁబడి యాతని గ్రంథాలయముల నమర్పఁబడుచుండెను. దీన నాలయములం దపూర్వసౌందర్యము తాండవితంబై, దర్శకులను జారిత్రికానందమునఁ దేల్చుచుండెను. తదుపరి కాశ్మీరము - శ్రీనగరము - తక్షశిల, శిలాదిత్యుని రాజధానివల్లభిపురి - యుజ్జయిని - చైతన్యస్వామి జన్మభూమి నవద్వీపము, పాటలీపుత్రము - మున్నగుచోట్ల గ్రంథాలయములు ప్రసిద్ధివహించి యుండెను. దక్షిణదేశము గుఱించి యోజింపఁగ "సుమనోజనవాదరణస్థానమ్" అని విశ్వగుణాదర్శము వెల్లడిపఱచుచున్నందున నట్టి గాంచీనగరమున గ్రంథాలయవికాసము తెలియఁబడుచున్నది. సెంజపురి నామాంతరము గల తంజావూరునందుఁ గోశాగారము లుండెను. ఇట్టి వృద్ధికాలపరిపక్వమున నష్టదశఁ బొందెను. అలభ్యము లగు నెన్నియో గ్రంథముల యాలయములును, గ్రంథాలయరూపములు ధరించు కోవెలలును, తురుష్కుల కరవాలాఘాతములకును ఘోరదహనములకు లోనయి, విలయ మొందెను. సరస్వతీనికేతనం బగు తక్షశిల కాలిపోయినప్పు డెన్ని గ్రంథములు నీఱైపోయెనో! జ్ఞానస్థానంబు వారణాసిని మహమ్మదుగజని కబళించినప్పు డెన్ని యమోఘశాస్త్రములు జీర్ణించెనో? అలంఘీరు హైందవులశుచిత్వముఁ జెఱుప విశ్వప్రయత్నము సేయునప్పు డెన్ని గ్రంథములు హాళైనవో! ఆటీకల కార్మణ్యులు ఆ సంఖ్యాకప్రమాణము లెన్ని కొనిపోయిరో! అహహా! భారతమాత! నీ శాస్త్రైశ్వర్యములు ఖండాంతరములఁ బ్రవాస మొనర్చుచున్నవి! ఇప్పటికి భారతవర్షగ్రంథాలయ పూర్వమధ్యమ చారిత్రమునుఁ గొంతఁ దెలిసికొంటిమి. ఆంధ్రదేశగ్రంథాలయ పూర్వకథనమునకుఁ గడంగెదము.

కృష్ణా గోదావరీమధ్యస్థములు శ్రీశైల ద్రాక్షారామ కాళహస్తులు. వీనికి త్రిలింగాఖ్య. వీనికి వేఁగినాఁడు హృదయస్థానము. ఇది యాంధ్రభాషకు మొదటిపోటు. కొందఱు త్రిలింగశబ్దమే తెలుగనియు, మఱి కొందఱు తినగవలనఁ దెనుగు వచ్చినదనియు, నింకఁ గొందఱు తేనె అను తెనుగనియు, ననేకవిధముల తెనుంగు శబ్దతత్వమును సాధించి, తెలుంగుకోమలికతనుఁ జాటియున్నారు. తదనుకూలముగ నీభాష గోదావరీ కృష్ణా వాసులయిన భూసురుల ముఖములం బ్రోదిగ వర్ధిల్లినట్లు కనబడుచున్నది. ఆంధ్రి నయకునఁ గన్నడిఁ దోఁబుట్టువని యక్షరతత్త్వజ్ఞు లందురు. దక్షిణదేశమున వాడుకలో నున్న బ్రహ్మలిపి కవి యెల్ల నంతర్భూతములై యున్నందున నాంధ్రలిపి ప్రప్రాచీన మనుట నిర్వివాదాంశము. శాతవాహనలిపి నాఁబడు నాంధ్ర రాజలిపికాలము. క్రీ. శ. మూడవశతాబ్దియని విమర్శకుల యభిప్రాయము. ఇంక నిది చర్చింపవలసియున్నది. ఆంధ్రసీమ దక్షిణాపథదేశములలో సుప్రసిద్ధమై యున్నట్లు పురాణములందు వినంబడు. ఋగ్వేదమందలి యాంధ్రప్రశంస ఇందునకు బలము. లిపి సంస్కరింపఁబడిన క్రమమున గ్రంథములు వికాసిల్లె. ప్రస్తుతపు మన గ్రంథోదయము కాలక్రమమునఁ బెరుగుచు దక్షిణగంగం జేసి తుంగభద్రవఱకు వ్యాప్తినొందెను. పండితకులపతి యనఁదగు విద్యారణ్యస్వామి హంపివిరూపాక్షాలయమున విద్యావ్యాసాయ మొనర్చెను. ఇచటి గ్రంథపరంపరలే యీ యద్వితీయవిద్యానిధికి శిక్షాబోధకములై యొప్పారెను. రాయని కాలమున గ్రంథములు అభ్యుదయసమృద్ధములు గాఁజొచ్చెను. ఈతని చింతామణి మందిరమునను; దదుపాంత సభాభవనమునను బెక్కు వేలు పుస్తకము లుండెను. ఆంధ్రభోజునితరుణమున భాషామతల్లి జైత్రయాత్ర చేసి యుండెను. క్షేత్రస్థానములు, దేవతాగృహములు పంచాయతీకూటము లప్పటికి గ్రంథాలయములకుఁ జేయూతలై యుండెను. తదనంతర మాంధ్రదేశము విప్లవకారుల హస్తములలోఁబడి, ఆందోళనావస్థను గ్రుంగినది.

ప్రస్తుతము పాశ్చాత్త్యదేశములలో బ్రిటను ద్వీపమందును ఫ్రాన్సు జర్మన్యాది దేశములందును, గ్రంథాలయములు తమ ప్రజల సంఖ్యలో నాలవభాగము వారికి సమృద్ధిపఱచునంతటివి యైయున్నవి.

మన పూర్వు లింద్రపదవు లనుభవించిరని మన మువ్విళులూరుచుండుటవలనఁ బ్రయోజనము లేదు. తదుద్యమము నిర్విరోధోత్సాహమునఁ గొనసాగింపవలసినవారము మనమే! బరోడామహారాజా అమెరికావారి దక్షతను దన రాష్ట్రమున గ్రంథాలయజ్యోతిని వెలిగించుచున్న ప్రతిభాశాలి. మహీశూరదేశమం దీకిరణము లావరించుచున్నవి. వంగమహాశయుల తీవ్రయత్నమునఁ బురోగాములై తమ భాషను భారతఖండమున రాజభాషయంతస్థున కెక్కించిరి. పూర్వగౌరవమును బవిత్రవ్యక్తిత్వమును పోషించుకొనుట యాంధ్రసభ్యతకు గమ్యస్థానము. కావుననే తెనుంగు సహజమాధురిమవలన నన్నిభాషల గౌరవము బడసిన యది. ఇపుడు నవ్యకళాకలాపములు సర్వత్ర నృత్యములు చేయఁ దొడఁగుచున్నవి. వ్యక్తిత్వతేజము ప్రబలమై భూవలయమును కబళింప కించుచున్నది. యుగయుగమునఁ బుట్టు నుద్యల్లీలలు సమయాసన్నములు కాకమానవు. తల్లులందు భక్తిప్ర

త్తులు గనుపట్టు పిల్లసంతానములు పురస్కరించుకొనుచున్నవి. ఇట్టి శుభావహతరుణమున నాంధ్రికిఁ బ్రాణబంధురము లగు గ్రంథాలయముల వన్నె కెక్కించుట యాంధ్రమహాశయుల కర్తవ్యదీక్ష. భాషాపల్లవములకుఁ గోశాగారములు స్కంధములు. ఆంధ్రసామ్రాజ్య వైశాల్యమునకుఁ దగినన్ని గ్రంథాలయములు లేమినికి సరస్వతీవిజయయాత్ర కాతంకము వాటిల్లుచున్నది. వాఙ్మయాభ్యుదయ మెంత వఱకు సాగిన నంత బాగుగఁ దేశోత్తేజము ప్రజ్వరిల్లును. కొన్ని కాలారిష్టముల పాలఁ బడుచున్నవి. కొన్ని యకాలమృత్యుముఖమునఁ బడుచున్నవి. కొన్నింటి యావృతులు దృష్టిగోచరము లగుచున్నవి. ఇవి యైనఁ జిరజీవులు కావలసియున్నవి. ఇట్లున్న వాఙ్మయప్రశస్తికి నిస్తులత్వము ఆయత్తపడదు. ప్రభువు లీ కార్యమున నాగంతుకులు కాక కూటస్థులు కావలయును. ధనికు లాంధ్రభారతికి బ్రహ్మరథమును పట్టవలయును. తన యావదాస్తియు గ్రంథాలయోద్యమమునకై ధారవోసిన అండ్రూ కార్నీజీ వోలె మన ధనసంపన్నులు విద్యావితరణమును చేయవలసియున్నది. బోసువంటి మహాత్ములు ఆంధ్రిగర్భమున నుదయించి యుండరే దని చెప్ప సాహసింపము. అట్టి యావికై తెలుఁగుంబలుకు పలంది పెద్దమొగములో నెదురుచూచుచున్నది. చూడుడు! ఆంధ్రదేశమునఁ బదునెనిమిదేండ్లకుఁ బూర్వమునుండి రాజమహేంద్రవరమున గ్రంథాలయస్థాపనము జరిగియున్నందున, నిది నూతనోద్యమమై వింశతివత్సరప్రాయమున నున్నది. అభిమానుల పురస్సరమున నిపుడీ యుద్యమము సర్వత్ర వ్యాపింపఁ దొడంగుచున్నది.

# ఉదయగానము

పూడిపెద్ది వేంకటరమణయ్యా గారు

గీ. సుమముఖమ్ములఁ గళ లూరి సొగసు లీన
జివురుసంపద నతిశయచేష్ట లమర
హిమకణానందబాష్పము లిట్టి రాల
నగుచుఁ గదలెడు వృక్షసంతతులు వేడ్క—
జీవమా! యేలఁ దహతహఁ జెందె దీవు?

*    *    *    *

గాలిశ్రుతి మేళవించి సంగతుల నించి
గళరవమ్ముల మేర లాకసము నంటఁ
గలిసి యొండొంటి జీరలేకయ సుఖానఁ
బక్షు లన్నియు ముదమునఁ బాటపాడు
జీవమా! యేలఁ దహతహఁ జెందె దీవు?

*    *    *    *

త్రుళ్లిపడు చిఱుచేప చప్పుళ్లు, తాళ
గతికి లయగాగ నలల సద్గతులు దూగ
నీటితెరచీర యంచుల నెగడ మడత
లవిగొ నాట్యముసేయు జలాశయములు
జీవమా! యేలఁ దహతహఁ జెందెదీవు?

*    *    *    *

పూర్వదిశ నదె బంగారుబొమ్మ పోల్కి—
నంద మయి స్నేహవాత్సల్య మతిశయిల్ల
గరములం బ్రకృతినిఁ దట్టి కౌఁగలించి
నవ్వుమొగమున భానుఁ డానంద మొందు.
జీవమా! యేలఁ దహతహఁ జెందె దీవు?

*    *    *    *

నిర్మలమ్మయి సుఖదమై నెగడునట్టి
మేన సుమగంధమును బూసి మెల్ల మెల్ల
నోలపాటల నటునిటు నూగికొంచుఁ
జల్లఁగాఁ బవనుఁ డదిగో! పచారుసేయు
జీవమా! యేలఁ దహతహఁ జెందె దీవు?
ఉండియును లేనియట్టుల నొప్పి జగతి
నెందుఁ జూచినఁ దానయై హెచ్చుదగ్గు
లెఱుఁగకుండగ నన్నిఁట నిమిడి సమత
సౌఖ్యమునఁ దోచు నదె యాకసమ్ము ప్రబ!
జీవమా! యేలఁ దహతహఁ జెందె దీవు?

*    *    *    *

ప్రకృతియే నిన్నుఁ జేసె నాప్రకృతిలోన
నైక్య మొకటమె నీ యాశయమ్ము గాదె!
ప్రకృతి యంతయు సౌఖ్యవారాసిఁ దేల
లేని దుఃఖము లెన్నొ కల్పించుకొంచు
జీవమా! యేలఁ దహతహఁ జెందె దీవు?

# విద్యావిధానము

డా॥ వేంకటసుబ్బారావుగారు

హిందూదేశచరిత్ర సామూలాగ్రము చూచినచో ప్రాచీనాధునిక విద్యావిధానములందు హస్తిమశకాంతరము లున్నవని తెలియనగును. తొల్లి ఆర్యావర్త మెట్టి సంపర్కము లేక నాగరికతాభివృద్ధి జెంది అధికారాభ్యుదయమునం దున్నతదశ ననుభవించి పాండిత్యప్రకర్షవలనను తత్త్వజ్ఞాన పరంపరవలనను సహజముగా గౌరవింపబడుచు వేలకొలంది విదేశీయవిద్యార్థుల నాకర్షించుచు జాతీయ విశ్వవిద్యాలయములను విజృంభింపజేసిన హిందూయగు నాటి ప్రాచీనజాతీయ విద్యావిధాన మీ కాలమున లేకపోవుటచేత మనదేశ మీ దుస్థితికి వచ్చినదని ప్రతివారికిని తెలియును. పూర్వకాలమున సుచితముగా నేర్పబడుచున్న జాతీయ విద్య మహోత్కృష్ట మైనదని వేరుగ చెప్ప నక్కఱలేదు. ఆ కాలపు పద్ధతులప్రకారము విద్యార్థులు బాల్యముననే తమ స్వగృహములను వదలి జననీజనకుల నెడబాసి గురుకులవాసమును చేయుచు కాయకష్టముల కోర్చి, నీతి, జ్ఞాన, శరీరసౌష్ఠవాదు లభివృద్ధినొందునట్లు ఉండెడివారు. ఆనాటి జాతీయవిశ్వ విద్యాలయములు, బహుజనసమ్మత మై కేంద్రస్థానముల నలంకరించి యుండెడివి. అందలి గురువులు సర్వజ్ఞులై కేవలము ద్రవ్యార్జనాతత్పరులు గాక, పరిజ్ఞానమును హితమును, దేశభక్తిని, తదితర మగు నున్నతోపదేశములను శక్తివంచనలేక బోధించి యావజ్జీవమును వినియోగింప గలవారు ఆ విశ్వవిద్యాలయములు స్వతంత్ర జీవితమునకు పరిశోధనలకు పరిశ్రమలకు జన్మస్థానములుగ నుండెను. పెక్కు పండితులు, తత్త్వవేత్తలు, పరిశోధకులు, శిల్పకారులు, పారిశ్రామికులు ఆ విశ్వవిద్యాలయములనుండి వెడలి స్వదేశమున కలంకారభూతులై దేశోన్నతికి వన్నె బెట్టుచుండిరి.

మన విద్యావిధానము పరరాజుల హస్తగతమైన దాదిగ మిక్కిలి లోపభూయిష్ఠమై మార్గదర్శితను పొందకున్నది. నేటి విశ్వవిద్యాలయములు కేవలము అంతర్గర్భితమైన విజ్ఞానశక్తిని వృద్ధిపరచుటకు సమర్థతలేని విద్యార్థులను తయారు చేయుచున్నవి. స్వతంత్రజీవనోపాధి కనువగు విద్య నేర్పుటకు మారుగా బానిసత్వమున కుపకరించు గుమస్తాలను తయారుచేయు యంత్రాగారములుగ పరిణమించుచున్నవి. ఇప్పటి విద్యావిధానమందు అన్యభాషామూలమున పాఠము లన్నియు నేర్పబడుటచే ఆ భాషాజ్ఞానము తదర్థము తెలిసికొనుటయందే యువజనులు బుద్ధిసామర్థ్యములను వినియోగించుటచేత విషయగ్రహణాసక్తి బొత్తుగా నశించి విద్యాభ్యాసానంతరము స్వతంత్రమైన విషయపరిశోధనాశక్తిని నిర్వహించ గల పట్టభద్రులు ఎక్కడైన కనుపించరు. ఇప్పటి మన పట్టభద్రులలో ననేకు లనారోగ్యులై, స్వజాతీయధర్మములను విసర్జించి, స్వమతాభిమానశూన్యులై స్వతంత్రాభిలాష లేక పాశ్చాత్య సాంప్రదాయములకు లోనై సోదరస్పర్థకు తాళజాలక పెక్కు లిడుములపాలగుచున్నారు. పూర్వపశ్చిమ పరిజ్ఞాన సంఘట్టనముచేత మన యలవాటులు, మర్యాదలు, వేషభాషలు అన్ని విధముల సంకర మొందినవి. దేశోదయమునకు, దేశ స్వాతంత్ర్యమునకు దేశభాషయే ఆయువుపట్టు. భారతీయుల స్వతంత్రాధికారమునకు లోబడిన జాతీయ విద్యావ్యాప్తియే స్వాతంత్ర్య సంపాదనకు మూలసూత్రము.

గనుక మన దేశములోని విద్యావిధానము లనేకము మార్పు జెందవలసియున్నది. దేశభక్తి నణుమాత్ర మైన ప్రోత్సాహపరచని ప్రభుత్వవిద్యావిధాన మవలంబించు విద్యాశాల లన్నియు సంస్కరింపబడవలెను. అట్టి పాఠశాలలను బహిష్కరించవలెను. బోధన పద్ధతులను మార్చి యుచిత రీతిని వృద్ధిజేసి తగిన పాఠపుస్తకములను నిర్ణయించి జాతీయవిద్యా ప్రబోధమునకు నూతనమార్గము త్రొక్కవలెను. మాతృభాష రాజభాషతో బాటు సమానమైన యగ్రస్థాన మలంకరింపవలయు. రాజభక్తిని పురికొల్పు ప్రాచీనాధునిక హిందూదేశచరిత్రలు పఠనీయగ్రంథములుగా నియమించవలెను. జాతీయ పాఠశాలలందు పురాణేతిహాసములను, కళాకల్పములను భగవద్భక్తియుక్తము లైన దేశచరిత్రలును, వేదాంత సిద్ధాంతములను భారత భాగవత, రామాయణాది భక్తిపూరితము లైన కథలను, మహావీరుల చరిత్రాంశములతో మన విద్యార్థుల హృదయపీఠములందు నెలకొనునట్లు చేయవలెను. సేవకవృత్తి కుపకరించు ప్రస్తుత విద్యా విధానమును మొదలంట పెరికివేసి యద్దాని కేమాత్రము తావీయకలదు. పూర్వము మనసంఘ విజృంభణమునకు మూలకారణమును, అవి క్షీణించుటకు ఏర్పడిన విషయములును విద్యార్థులు తెలిసికొనుట అత్యావశ్యకము. పూర్వ సాంప్రదాయముల ననుసరించు జాతి యెల్లపుడును వృద్ధిజెందుచుండును. తద్భిన్నముగా స్వజాతి సాంప్రదాయములను విసర్జించి విదేశ సాంప్రదాయములను మన సంఘమునందు నాటబూనుట జాతివిఘాతమునకే యనియు [illegible]

స్వజాతీయాభివృద్ధి కనువగు నున్నతాదర్శములను మాతృభాషామూలమున బోధించినచో సులభముగను శీఘ్రముగను గ్రహించి విషయమును జీర్ణముచేసికొని జాతీయాభివృద్ధికిఁ మనవారు తోడ్పడగలరు. దేశాభ్యుదయమునకు పాటుబడగలరు. కేవలము తర్కమునకు వివేకమున కుపయోగించు ప్రస్తుతవిద్యవలెగాక, హైందవజాతియొక్క యార్థిక నైతికాధ్యాత్మికాభివృద్ధికి తోడ్పడు విద్యయై యుండ

వలెను. స్త్రీలకు కర్మవిద్యలు సహితము నేర్పవలెను. శిక్షణాలయము లగు కర్మాగారములను కూడ నిర్మించవలయును. ఇట్టి విద్యమీఁదనే దేశముయొక్క భవిష్యత్సౌఖ్య మాధారపడి యున్నది. దేశమును కాలమానపరిస్థితులను గమనించి పాఠశాలలను చల్లనివేళల యందు పెట్టవలయును. విద్యార్థులు దేశీయము లగు పరిశుభ్రము లైన సామాన్యదుస్తులను ధరించుట కాటంక పెట్టరాదు. జాతీయ గ్రంథ పఠనము జాతీయవీరపురుషారాధనము జాతీయాదర్శబోధనము దేశ భక్తి వాణిజ్య, పారిశ్రామిక, వ్యవసాయికాభివృద్ధులు కళాకల్పనా శక్తులు మున్నగునవి జాతీయవిద్యయొక్క ముఖ్యలక్షణములు. మన జాతీయవృత్తులు నశించుటచేతనే దరిద్రదేవత భాగ్యవంతమగు నీభరత ఖండమునందు తాండవ మాడుచున్నది. నిన్న మొన్నటి ఐరోపామహా సంగ్రామమునం దాంగ్లేయులు తమ దేశపు పారిశ్రామిక ఫలిత ముల నీ దేశమునకు పంపలేకపోయినపుడు మన ప్రభుత్వమువారు జపానుదేశీయ వస్తువులను రావించుటకైన సహించిరేగాని దేశీయ పరిశ్రమలను వృద్ధిజేయుట కణుమాత్రమైన సహింపలేక పోయిరి. మీదుమిక్కిలి యొకటిరెండు చోట్లలో నున్న పారిశ్రామికాలయాధి కారులయొద్ద నుండి కొన్ని యంత్రములజేయు లైసెన్సులు సహితము లాగికొనిరి. వారికిఁ మన దేశీయులు సందుదొరికినచో సకలవిద్య లల్ప కాలములో సులువుగా నేర్చుకొని త్వరలో నగ్రగణ్యులై పోటీకి నిలబడెదరని, బాగుగఁ దెలియును. పూర్వపు వృత్తు లన్నియు నట్టి మహోన్నతదశ నొందినచో జనులు సంపన్నులై వర్ధిల్లుదురు. దేశము సుభిక్షముగా నుండును. క్షామ మదృశ్యమగును. గనుక వాణిజ్య పారి శ్రామికవ్యవసాయిక సాంకేతికాధ్యాత్మిక విద్యలను బాలుర కామూ లాగ్రముగ నేర్పినచో వారు స్వతంత్రజీవనులై సంతృప్తులై యుందురు. దీని కనువగు విద్యావిధానము ప్రభుత్వమువారి పాఠశాలలలో గాని, తత్సహాయపాఠశాలలలో గాని కాన్పించదు. మహాత్మా గాంధిగారు ప్రభుత్వమువారియొక్క సహాయము నొందు పాఠశాలలనుండి జనులు తమబాలురను చదువ మాన్పించి జాతీయవిద్యాప్రతిష్ఠాపనలను నెలకొల్పి, దేశహితైకవిద్యావిధానము లవలంబింపఁ గృతనిశ్చయులు కావలయునని సందేశము లంపుచున్నారు. ఉత్తరహిందూస్థానము నందు, గుజరాతీరాష్ట్రమునందు జాతీయకళాశాల లనేకము నెలకొల్పి విద్యార్థులకు జాతీయవిద్యాబోధనమును చేయించుచున్నారు. ప్రజలు విద్యార్థు లీ యుద్యమమున కన్నివిధముల సహకారులుగ నున్నారు. మన యాంధ్రదేశమునందు సహితము జాతీయపాఠశాలా ప్రతిష్ఠాప నములు బయలువెడలవలెను. ఇందుకు తెనాలిపురవైశ్యశిక్షామణులే ముందంజవైచి ఆంధ్రరాష్ట్రమునకు కంఠతము మార్గదర్శకులైరి. మన దేశములో విరాజిల్లుచున్న ప్రాచీనాధునిక కవివర్యులు - శిల్పశాస్త్రజ్ఞులు - వాణిజ్యాధికారులు - పారిశ్రామికులు వ్యవసాయికాగ్రణులు మున్నగువారి పవిత్ర చరిత్రాంశములు మన యువకుల కగ్గ బాలతో నేర్పి జ్ఞాన, నీతి, శౌర్యబీజములను హృదయఫలకములయం దు నాట జేయవలెను. మనవిద్యార్థులు ప్రభుత్వవిద్యాపరీక్షలను దయ్యములవలె నెంచవలయును. ఇదియే భుక్తికి ముక్తికి సాధనము. ఈపాఠశాలలలో సార్థకులగు నుపాధ్యాయు లుండితీరవలయును. ఇతర యుద్యోగములు దొరకక తాత్కాలికముగా కాలముగడుపు బోధ కులును గాక, ఇతరాదాయము లనుభవించుట కనువగునట్లు నటించు గురువులును గాక, బాలుర కుచితమగు విద్యను నేర్పి యజ్ఞానమును పారద్రోలి, వారి మనఃపథములందు సుగుణపుంజముల నెలకొనజేసి యున్నతాశయముల బోధించి విద్యార్థులపురోవృద్ధిని దేశాభ్యుదయ మును గోరు నుపాధ్యాయులుగా నుండవలెను. బాలుర శాస్త్ర యుక్తముగను విస్పష్టముగను ఆలోచించుటకును మేధస్సునందు ప్రవేశించు ప్రతిస్థూలసూక్ష్మవిషయములను జీర్ణింపచేసికొనుటకును తగిన జ్ఞానబోధ చేయవలెను. విద్యార్థులందు జ్ఞానసముపార్జనాభిలాషను అంకురింపఁజేయవలెను, బాలురతో కలసి మెలసి యుండి వారి కష్టనిష్ఠురములను గమనించి నిర్వహింపవలయును. గనుక నో స్వదేశాభిమానులారా! ధర్మపరతంత్రులారా! ముందంజ వేయుఁడు. జాతీయతాభివృద్ధిని గోరి దేశోన్నత్యమునకై తోడ్పడుఁడు. మన దేశమునుండి వస్త్రములకొఱ కెన్నికోట్లరూపాయ లాంగ్లదేశమునకు పోవుచున్నవో, నిప్పుపెట్టెలకొఱ కెన్నికోట్ల రూపాయలు జపాను దేశమున కరుగుచున్నవో, లాంతర్లుగాజువెంకులకై అమెరికాదేశ మున కెంత ధనము పోవుచున్నదో, బ్రాందిబుడ్లు కత్తులు కత్తెరలు పింగాణిబొచ్చెలు మున్నగువానికి మన మెట్లు విపరీతధోరణితో ధన మును గుమ్మరించుచున్నామో, యాలోచించుడు. మనదేశదారి ద్ర్యమున కిదియే మూలకారణము. మనదేశములోని పంటలు మన దేశసోదరుల కొఱకు కూటకైన చాలకున్నవి. ఇందుల కేమి కార ణమో గ్రహింపుడు. స్వదేశాభిమానులై దేశాభ్యుదయమును కోరి, తమ పుత్రపౌత్రపారంపర్యము నౌన్నత్యదశ ననుభవించవలె నను నుద్దేశము దృష్టియందునిలిపి స్వతంత్రతకు ప్రథమసోపాన మనఁదగు జాతీయవిద్య నేర్పు విద్యాలయములను నిర్మింపుడు. అట్టివాటిని పోషింపుఁడు.

# తరణోపాయము.

మాదిగొండ నాగలింగశాస్త్రులు గారు

ఉరుతర గురుకరుణోదయంబున గాని, మదమానజోద్ధతి మట్టుపడదు
మదమానజోద్ధతి మట్టుఁ జెందిన గాని, సమరసభావంబు చక్కపడదు
సమరసభావంబు సంభవించినఁ గాని, భేదభావం బెల్ల పెల్లగిలదు
భేదభావం బెల్ల పెల్లగిల్లినఁ గాని, మిత్రభావము బుద్ధి మెలఁగఁబోదు
గీ. మిత్రభావంబు బుద్ధిని మెలఁగకున్న, బంధము విముక్తి నొందదు భాసురముగ
బంధముక్తిని గాని నిర్భయతగలుగ, దీ వెర వెఱుంగుడీ సుహృద్భావులార !

సీ. స్నాన సంధ్యాదుల జాడఁ జూడని బాపఁ, డెక్కువయే నని నిక్కఁ బోవు,
ఎక్కు వెట్టులో చూపు మిక్కడ ననినాయుఁ, డొక్కఁడు వానిని వెక్కిరించు,
నాకు జందెం బిదో! నీ కది యే దని, మూర్ధాగ్రజుఁడు వాని మూదలించు
నటులేని నేను నింతటఁ దాల్తు జందెంబు, నని యొక్కటిని గొని యతఁడు దాల్చు
గీ. జనము లన్యోన్య మిట్లు వైషమ్యబుద్ధిఁ, జెలఁగ నరిషడ్గణంబు నశించు నెట్టు?
లరిజయము లేక మైత్రి కుదురుట యెట్లు? మైత్రి లేక లభించునే మహితముక్తి.

సీ. తనవలె సర్వభూతంబులఁ గను మని, శ్రుత్యంతసూక్తి భావింపలేదె
ఘనునందు నట్ల పుల్కసుపట్ల గనుమని, భగవానుఁడును గీతఁ బలుకలేదె ?
శత్రునందును దన మిత్రునందును సమ, భావము నిడుట శుభంబు గాదె
ద్వేషావము సర్వదోషమూలంబుగ, ధీయుతుల్ తొల్లి బోధింపలేదె
గీ. కాన వైరంబు పోనాడి లోన మైత్రి, గూడి నిజబుద్ధిదేశంబు గురుసుఖాబ్ధి,
నోలలాడంగఁ జేయంగ నోపి దుఃఖ, బంధ మెడఁ బాయుడీ మీరు భవ్యులార !

సీ. దేశమందున భేదలేశంబు గని కాదె, యింపున నొరు లాక్రమింపఁ గనుట
వాక్కునందున భేదపద్ధతిఁ గని కాదె, జనము లవ్వాని నల్పునిఁగఁ గనుట
ఘనకుటుంబపు భేదకలనఁ గాంచియె కదా, జెలఁగి దుష్టులు దానిఁ జెఱుపఁగనుట
ఒరులకు భేదంబు పురిగొల్పియే కాదె, వారిఁ బాల్యులఁ జేయఁ బరులు గనుట
గీ. అట్టి భేదంబు హృద్వీథి నమరఁ గాంచి, కామముఖ వైరివర్గంబు క్రమ్ముకొనును
కాన, నద్దాని విడనాడి ఘనతఁ గూడి, స్వేచ్ఛఁ గని యాడిపాడుడీ విజ్ఞులార!

సీ. బ్రాహ్మణ తదితర ఖండనల [illegible], [illegible] కటము
వైదిక నియోగ వ్యాజ్యంబు లిట, నట, వెల్నాటి తెల్నాటి వికటభాష
శైవ వైష్ణవమత సంవాద మీలోన, నాలోన నగ్రతాంబూల కక్ష
వడఘు తెంగలి కుడి వైరభావం బిందు, నందు పశుద్వయాభ్యధిక చర్చ.
గీ. జనత యీరీతిఁ గలహభాజనతఁ దనర, పిట్టపో ర్పిట్టపోరును పిల్లి తీర్చె
నన్నయట్టు లరివ్రాత మాక్రమింప కున్నె? మిత్రత వహియించి వన్నెఁ గనుడు.

# ఆంధ్ర వ్యాకరణములలోఁ గల కొన్ని సంస్కృత సిద్ధాంతములు

వఝల చినసీతారామ శాస్త్రి గారు

ఆంధ్రవాఙ్మయాభివృద్ధికి సంస్కృతవాఙ్మయమే చాలవఱకు మూలమై యున్నది. అక్కారణముననే సంస్కృత వ్యాకరణములోని మార్గము లనేకములు తెలుఁగు వ్యాకరణములందుఁ బ్రవేశించినవి. ఆంధ్రవాఙ్మయము చాలవఱకు సంస్కృతప్రచురమై యుండుటం జేసి సంస్కృతభాషా పాండిత్యము లేనివారి కయ్యది దుర్గ్రాహ్య మని చెప్పుటకు సందేహము లేదు. ఆంధ్ర పండితు లెల్లరు సామాన్యముగా నాంధ్రముతో పాటు సంస్కృతమును గూడ బాగుగా నభ్యసించి యందలి రీతుల నెల్లఁ దమ తెనుఁగునఁ జూపింప నభిలషించుచువచ్చిరి. అందు ముఖ్యముగా నాంధ్ర వైయాకరణులు సంస్కృత వ్యాకరణములను బాగుగ నభ్యసించి యా మార్గముననే తెనుఁగు వ్యాకరణములను నైతము నడిపింపసాగిరి.

ప్రాచీను లెల్లరును లోకులను మంచి వ్యాపారమునందుఁ బ్రవర్తింపఁజేయుటకై యిట్టి యుపయుక్త కార్యములకు బుణ్యఫలమును ననుపయుక్త కార్యములకు బాపఫలమును గల్పించుచు వచ్చిరి. తుదకుఁ గుడిచెడికూటికిని గట్టెడిబట్టకును, దంతధావనాది కార్యములకును నియమములను గల్పించి వానికిఁ బుణ్యపాపఫలముల నుపదేశించుచు వచ్చిరి. ఇట్టి యలవాటు చొప్పుననే కావలయు వేదవిదులు వేదపారాయణమునకుఁ గూడఁ బుణ్యఫలము లభించు నని వక్కాణించిరి. కాని ప్రాప్య మగు పుణ్యఫలము పారాయణ మాత్రముననే లభించుచుండఁగా, నిఁక నర్థావబోధ ప్రయాసముతోఁ బని యేమి యను నింత యభిప్రాయములు మనవారికిఁ బొడము నని యూహింపరైరి.

క్రమక్రమముగా వేదములకువలెనే తదంగము లగు శిక్షా వ్యాకరణాదుల పారాయణమునకును స్మృతిపురాణేతిహాసప్రభృతుల పారాయణమునకును పుణ్యఫలమును తత్తదాచార్యులు గల్పింపసాగిరి. ఇట్టి యభిప్రాయమే శబ్దేందుశేఖరమునఁ జూపఁబడినది.

పతంజలి తాను పాణినీయమునకు భాష్యము వ్రాయఁబూని యా గ్రంథము మొత్తముమీఁద మంచి కట్టుబాటుగ నగపడినందున నం దెచ్చటను వ్యర్థసూత్రాదులు లేవనియుఁ బూర్వోత్తర విరోధములు లేవనియు స్తుతించెను. కాని కొన్నికొన్నిచోట్ల సూత్రసూత్రాంశములను నాయా సందర్భములలో వ్యర్థము లని ఋజువుచేసి ప్రత్యాఖ్యానము చేసియుండెను. అది యాధారముగాఁ జేసికొని యిటీవలి వైయాకరణులు పాణినీయమునం దెచ్చటను నిరర్థకభాగము లే దని చెప్పియు నిట్లు కొన్నియెడలఁ బ్రత్యాఖ్యానములను చేయుటం బట్టి యా ప్రత్యాఖ్యాత భాగములకు ఫల మదృష్టమే యన్న నిర్బాధ మని యెంచి, వెనుకటి సంప్రదాయానుసారముగా భాష్య తాత్పర్యమును దీయసాగిరి.

పైరీతినే కావ్యాచార్యులు కావ్యపఠనాదికమునకును, వైద్యాచార్యులు వైద్యపఠనాదికమునకును, నట్లే, తత్తచ్ఛాస్త్రాచార్యులు తత్తచ్ఛాస్త్రపఠనాదికమునకును, బరమపురుషార్థమును ఫలముగా నుపదేశింప నారంభించిరి.

వ్యాకరణ శాస్త్రపఠమునకుఁ బ్రయోజనములను జెప్పను సందర్భమున మహాభాష్యకారుఁడు వైదికకర్మలందు వాడుటవలనఁ బుణ్యమును కలిగించునట్టియుఁ బాపమును గూర్పనట్టియు సుశబ్దముల నుపదేశించుట మున్నగునవి వ్యాకరణ శాస్త్రపఠమునకు ముఖ్యఫలము లనియుఁ దక్కినవి యానుషంగికఫలము లనియుఁ జెప్పెను.

"కాని పున శ్శబ్దానుశాసనస్య ప్రయోజనాని- రక్షోహాగమ లఘ్వసందేహాః ప్రయోజనమ్...ఇమాని భూయ శ్శబ్దానుశాసనస్య ప్రయోజనాని మ్లేచ్ఛా మాభూమే త్యధ్యేయం వ్యాకరణమ్... దేవేనసహ సామ్యం స్యాది త్యధ్యేయం వ్యాకరణమ్...ప్రాయశ్చిత్తీయా మాభూమే త్యధ్యేయం వ్యాకరణమ్ "సిద్ధే శబ్దార్థసంబంధే లోకతః శాస్త్రతో ధర్మనియమః...ఏవ మిహాపి సమానాయా మర్థావగతౌ శబ్దేన చాపశబ్దేనచ ధర్మనియమః క్రియతే-శబ్దేనైవార్థోఽభిధేయో నాపశబ్దేనేతి. ఏవంక్రియమాణ మభ్యుదయకారి భవతీతి" "ఏకస్యైవ శబ్దస్య గావీ గోణీ గోతా గోపోతలి కేత్యేవ మాదయో బహవోఽపభ్రంశాః" "అథ కిమర్థ ముపదిశ్యతే వర్ణజ్ఞానమ్ వాగ్విషయో యత్రచ బ్రహ్మ వర్తతే...సర్వవేదపుణ్యఫలావాప్తి శ్చాస్య జ్ఞానే భవతి, మాతాపితరౌ చాస్య స్వర్గేలోకే మహీయతే" (ప్రత్యాహారాహ్నికము)

పయిరీతిని మహాభాష్యాదులలోఁ జెప్పఁబడి యుండుటచేతను, సంస్కృతాపభ్రంశములు ప్రాకృతమునందును, సంస్కృతప్రాకృతాపభ్రంశములు తెనుఁగునందును నిండియుండుటచేతను నాంధ్ర వ్యాకరణ వ్యాఖ్యాత యగు నహోబలపండితుఁ డట్టి చిక్కు లాంధ్ర భాషాపఠనమునకును సంభవింప కుండునట్లును, నాంధ్రభాషాపఠనము వలనఁ గూడఁ బుణ్యఫలము లభించునట్లును సిద్ధాంతము చేయుటకు గట్టిఁగా బెనఁగులాడి తుదికెట్టులో కృతార్థుఁ డయ్యెను.

మహాభాష్యకారుడు యజ్ఞాది వైదికకర్మములందు మాత్రమే యపశబ్దముల వాడరాదని చెప్పియుండుటం జేసి యవి యాధారముగఁ

గొని యహోబలపండితుఁడు "సర్వో వ్యపశబ్దనిషేధః క్రతువిషయ ఏవ. నతు వ్యవహారవిషయ ఇతి ప్రతిపాదితం. తత స్స్వదేశభాషాభి మానవద్భిరేయాః పండితశశాదికా నిర్మంకా స్స్వదేశభాషాకావ్య నిర్మాణేపి ప్రవర్తంత ఏవ" (అహో. 89 పుట) అని యిట్లు మూఁడు నాలుగువందల పంక్తులతోఁ జర్చించి యాంధ్రశబ్దజాలమున కపభ్రష్టత్వ మొప్పుకొని, మహాభాష్యకారుని మతముచొప్పునఁ దెనుఁగు చదువువారికిఁ బాపము లే దని నిర్ధారణ చేసెను.

అయినను, పై సిద్ధాంతమువలన నహోబలపతిమనసునకుఁ దృప్తి కలుగఁజాల దయ్యెను. ఆంధ్రభాష కపభ్రష్టత్వము నంగీకరించి యద్దాని వ్యవహారమునఁ బాపము రానేరదనిగదా సిద్ధాంతము చేయఁ గల్గెను. కాని,పాపము రాకున్నను బుణ్యము రానేరదు గదా! మఱియు "దుష్టాన్ శబ్దాన్ మా ప్రయుక్ష్మహీత్యధ్యేయం వ్యాకరణమ్" "నమ్లేచ్ఛితవై నాపభాషిత వై మ్లేచ్ఛో హవా ఏష య దపశబ్దః" అను మొదలగు భాష్యకారధోరణి యాతని మనసును బీడింప కుండు నా? కావుననే తుద కహోబలపతి యట్టి కొఱఁతకుఁగూడ సహింపఁజాలక, యాంధ్రభాషకును - దద్వ్యాకరణములకును - పరబ్రహ్మమూలకత్వమును సాధించి తత్పఠనమునకుఁ గూడ మోక్షఫలమును బ్రసాదించి యాప్రకరణము నంతతో ముగించినాఁడు. [చూ. అహో 116 వ పుట. వస్తుతస్తు ఇత్యాదిగ్రంథము.]

ఏభాషయైనను పూర్వభాషల యపభ్రంశమే యగుచుండును గదా! సంస్కృతభాషమాత్రము తత్పూర్వభాషల యపభ్రంశము కాదా? ఇంతమాత్రమున కింతటి గ్రంథము వ్రాయవలయు నా? అయినను నీసందర్భమున నహోబలపతి త్రొక్కిన యీవింతమార్గము కూడ గమ్యస్థానమునే చేరినది. ప్రపంచమెల్ల బ్రహ్మవివర్తమే యగుటఁ జేసి-ప్రపంచాంతఃపాతి యగు సంస్కృతమును దెనుఁగు వలెనే వివర్తమే యనియుఁ, దెనుఁగుతోఁబాటుగ దానికిని బ్రహ్మమే మూల మనియు, నక్కారణమున నద్దానివలె నియ్యదిగూడ సాధువును సుశబ్దమయము నగుటకు సందేహము లే దనియు, పురాణయుగమువా రథరస్పందము చేయ వలసుపడని రీతిని సిద్ధాంతము చేసెను.

"సిద్ధే శబ్దార్థసంబంధే లోకతః..." అను మహాభాష్యోక్తికిఁ బర్యాయ మగు 'సిద్ధి ర్లోకాద్ద్వయోః' అను చింతామణివచనము చొప్పునఁ దత్తత్కాలములందలి సుశబ్దాపశబ్దములు తత్తత్కాలము లోని శిష్టవ్యవహారమువల్లనే తెలిసికొనుట సుకరమైనను, పూర్వపూర్వకాలములలోని భాషను దాని సౌష్ఠవమును మాత్ర ముత్తరోత్తరకాలములందలి వ్యవహారమును బట్టి తెలిసికొనుట సుకరము కాదు. మఱియును వాఙ్మయస్థభాషయంతయును వ్యవహారమును బట్టి తెలిసికొనుటయు శక్యము కాదు. కావున, నట్టి పూర్వపూర్వ కాలములందలి భాషయొక్క సౌష్ఠవమును వాఙ్మయస్థ భాషాప్రపంచమును దెలిసికొనుటకు విశేషపరిశ్రమ మక్కఱలేకుండ వ్యాకరణకర్త తానట్లు శ్రమించి సంపాదించిన యాజ్ఞానమును పాఠకులకుఁ జాల వఱకు సులువుగను నిస్సంశయముగను లభించునట్లు చేయుటయే వ్యాకరణరచనకుఁ బ్రధానఫలమై యున్నది.

ఈనడుమను బయలుదేరిన యాంధ్రభాషావివాదములలో గ్రాథికవాదులు కొందఱు - వెనుక నుదాహరించిన భాష్యకారోక్తులను - "మ్లేచ్ఛా మా భూమే త్యధ్యేయం వ్యాకరణమ్" అను మొదలగు వానినిస్వవాదోపస్థాపకములనుగా నుదాహరించి శిష్టవ్యవహారస్థాంధ్రభాషను నిరసింపసాగిరి. కాని భాష్యకారునిమతము చొప్పున వ్యావహారికాంధ్రముకలెనే గ్రాంథికాంధ్రముగూడ నపభ్రష్టమే యను విషయమును గ్రహింపరైరి గదా !!

శాస్త్రమునకు సాకల్యముగాఁ బ్రామాణ్యము సిద్ధించుటకును, శాస్త్రమునం దేవిధమగు కొఱంతయును లే దనుమాట స్థిరపడుటకును, శాస్త్రమునకుఁ బరిపూర్ణత్వము దృఢపడుటకును, శాస్త్రము పరమేశ్వరమూలక మనియు, ననాది యనియు, నపౌరుషేయ మనియు, శాస్త్రకర్త సర్వజ్ఞుఁ డనియు, నీశ్వర వరలబ్ధవిద్యావైభవుఁ డనియు, దివ్యజ్ఞానసంపన్నుఁ డనియుఁ జెప్పుటకూడఁ బురాణయుగమువారి కలవాటు. అట్టి యలవాటుచొప్పున 'అఇఉణ్' మొదలగు వర్ణసమామ్నాయసూత్రములు-ఈశ్వరుఁడు ఢక్కఁ వాయించుటలో జనించిన వనియును, ఇట్లీశ్వరమూలక మగుటచే నిదియే వేదాంగ మనియు, లోకమునం దీ శబ్దశాస్త్రము వెలయుటకై యా వర్ణసమామ్నాయ సూత్రముల నీశ్వరుఁడు పాణినికిఁ బ్రసాదించె ననియు వైయాకరణులు చెప్పియున్నారు. [చూడుము శేఖరములోని మాహేశ్వరాణి సూత్రాణి అనుమూలపు వ్యాఖ్యానసందర్భము.]

ఇట్టిప్రసంగములు లేచిపెట్టుటచేతనే కావలయు, నాంధ్రకౌముది మున్నగు కొన్ని యాంధ్రవ్యాకరణములలో నైత మట్టి మహత్త్వమే యాంధ్రవ్యాకరణ తత్కర్తలకుఁ గూడఁ గల్పింపఁబడినయది.

"ఆంధ్రవిష్ణు స్సురయుతో దనుజేన నిశుంభునా, యుద్ధ్వా త్రయోదశయుగాన్ హత్వా లం రాక్షసోత్తమమ్, అవస త్తత్ర ఋషిభి ర్యుతో గోదావరీతటే, తత్కాలప్రభృతి క్షేత్రం త్రిలింగ మితి విశ్రుతం, తత్ర త్యా స్తత్సమాలాపా స్తత్కాలేక వాకే కృటాః, కాలేన మహతా సర్వం తత్సమం స్వల్పబుద్ధిభిః, అస్ఫుటోచ్చారితా నీతి తద్భవానీ తి సమ్మతిః, బ్రహ్మణా నిర్మితా వాచః పూర్వ మాంధ్రేశితు ర్హరేః, అచ్ఛా ఇతిచ కథ్యన్తే సుప్తిఙ్ ధాతుసమన్వితాః, ... త్రిలింగశాస్త్రవిహితస్య లక్షణస్యాపి ప్రయోగేణ హైన్యం న కారయే దితి నాగరాజః ... యుగభేదా దాంధ్రభాషా చార్యభేదః ప్రకీర్త్యతే, కృతేసుధాయుతః ప్రోక్త స్త్రేతాయాం శుకసాధకః......(ఆంధ్రకౌముది)

"శాస్త్ర మహార్ష మాద్యం ప్రాయిక నిత్యప్రయోగ లక్ష్యైకత్ దృశ్య మతిస్థవిరం యద్ జ్ఞాత్వా శబ్దః ప్రయుక్త ఆర్షసమః" (ఆంధ్రశబ్ద చింతామణి) నను సంస్కృతప్రాకృతవ్యాకరణయో రార్షత్వేన భవతి ప్రామాణ్యమ్. నన్నయాథర్వణయో రిదానీంతన కవిమాత్రత్వేన కథం తత్ప్రణీతయోః ప్రామాణ్యం స్యాత్?... నాన్నృషిః కురుతే కావ్యకరణచాతుర్యధుర్యత్వం సంభవత్యేవ ఖలు. నానృషిః కురుతే కావ్య మిత్యభియుక్తోక్తేః, అనితరసాధారణ వ్యాకరణనిర్మాణ పటు

తయా పండితకవీంద్ర ప్రథమగణ్యత్వేవచ పరిప్రాప్తం సార్వజ్ఞ్యాది తయో రిదానీంతనత్వమాత్రేణ కథం నివార్యేత? అతఏవ 'బ్రహ్మాదే వానాం పదవీః కవీనా' మిత్యుపనిషదే వచనే పదజ్ఞస్య విశిష్యే శ్వరభూతిసత్తా ప్రతిపాదితా" (చూ. అహో 110 పుట).

పైరీతినే బాలసరస్వతియుఁ దన యాంధ్రశబ్ద చింతామణి నొక సిద్ధుఁడు ప్రసాదించె ననియుఁ దత్కర్తయగు నన్నయ యుగాది సంభవుఁ డనియుఁ జెప్పి యున్నాఁడు.

ఉ. ఏమి మహాద్భుతం బిది హరిహరి యెక్కడి యాంధ్రశబ్దచిం
తామణిఫక్కి యెక్కడి మతంగనగంబు యుగాదిసంభవుం
డై మనిచన్న నన్నయమహాకవి యెవ్వఁడు సిద్ధుఁ డెవ్వఁ డా
హా మదగణ్యపుణ్య సముదగ్రతఁ జేకుఱెఁ గాక యిన్నియున్.

బాలసరస్వతిపద్యమునే యాధారము చేసికొని, యప్పకవి కూడ నట్లే చెప్పియుండెను. గాని "యుగాదిసంభవుండై మని చన్న నన్నయ" యని అంత ఘోరముగాఁ జెప్పఁజాలక, కొంతసంకోచించి "ఎన్నఁగ నన్నయాఖ్యకవి యీకలికాదిని జెప్పె". అని చెప్పియున్నాఁడు. యుగాది యుగాంత శబ్దములు కల్పాద్యంతములందు రూఢములై యున్నవి. లేదా యుగశబ్దమునకుఁ గృతయుగ మనియైన నర్థముచేయక తీరదు. కేవల యుగశబ్దమునకుఁ గలియుగ మన్న యర్థ మెంతమాత్రమును లేదు. ఇప్పుడు బయలువెడలిన శాసనాదుల నిదర్శనములను బట్టి - సృష్ట్యాదిని గాని, కల్పాదిని గాని, కృతయుగాదిని గాని, తుదకుఁ గలియుగాదిని గాని, నన్నయ పుట్టియుండ లేదనియు, రమారమి వేయియేండ్లలోపలివాఁ డనియు నెల్లరకును విదితమే గదా! ఇట్లే పాణినియును దివ్యజ్ఞానతపోమహిమలచేతఁ గ్రొత్తగా లోకములో వ్యాకరణశాస్త్రము నవతరింపఁజేయు లేదనియు, నంతకుముందు నైతము వ్యాకరణశాస్త్రము వ్యాపించియే యుండెడి దనియు, నట్టివానిని బాగుగాఁ జదివికొని గొప్ప పాండిత్యమును సంపాదించి కొన్ని క్రొత్తవిషయములను జేర్చి యష్టాధ్యాయిని రచించె ననియుఁ దోఁచక పోదు. పాణినీయమునందు శాకల్య శాకటాయన భారద్వాజాది పూర్వ వైయాకరణులు పేర్కొనఁబడి యున్నారు. ఇంతయేల? యష్టాధ్యాయిలో నొకచోటఁ బాణిని పూర్వాచార్య మతమును విమర్శించియు నున్నాఁడు. [చూడుము-లుపియుక్తవద్వ్యక్తివచనే-అనునది మొదలు, ప్రధానప్రత్యయార్థవచనమర్థస్యాన్యప్రమాణత్వాత్-అను వఱకు తత్త్వబోధినీవ్యాఖ్యానము 238-239 పు.]

పాణిని గ్రంథమునందలి కొఱంతలు పెక్కింటిని వార్తికకారుఁడును, భాష్యకారుఁడును, కాశికాకారాదులును పూరించుచు వచ్చిరి, ఇంకను వాఙ్మయసారస్యము పూర్తిచేయవలసియే యున్నది. ఇట్టి స్థితిలోఁ బాణినికి సర్వజ్ఞత్వమును దివ్యదృష్టిసంపన్నతయుఁ గల్పించుట యెంతవఱకు యుక్తమో విమర్శకులే గ్రహింతురు గాక. అష్టాధ్యాయికిఁ బూర్వమునందును వ్యాకరణములు ప్రసిద్ధములై యుండఁగా వానికి వేదాంగత్వమును గల్పింపక, యష్టాధ్యాయికి మాత్రమే గల్పించుటకుఁ గారణ మేమో !!

శాస్త్రకర్తలకుఁ ఋషిత్వ సర్వజ్ఞత్వ దివ్యదృష్టి సంపన్నత్వాదులను, శాస్త్రమునకు భగవద్విలసితత్వాదులను అంగీకరించునపు డింక శాస్త్రోక్తవిషయములకు సాకల్యముగాఁ బ్రామాణ్యము నీయక తప్పదని, మనవారు తచ్ఛాస్త్రముచే సాధింపఁదగిన శబ్దజాల మెల్ల సాధువే యనియు, తద్విలక్షణము లసాధువు లనియుఁ, దలంప నారంభించిరి. కావుననే వ్యాకరణమునకు లొంగని కాళిదాసాది మహాకవుల ప్రయోగములకుఁ గూడ నసాధుత్వము కల్పింపఁబడు చున్నది.

"కృఞ్ చానుప్రయుజ్యతే లిటి" అను సూత్రపు తత్త్వబోధినిలో "కథం తర్హి తం పాతయాం ప్రథమ మాస పపాత పశ్చాత్. ...ప్రమాద ఏవా యం, నచ విపరీతప్రయోగనివృత్తిమాత్రే సూత్రస్య తాత్పర్యాత్ పశ్చాత్ప్రయోగో వ్యవహితో౽పి న దుష్యతీతి వాచ్యం విపర్యాస నివృత్త్యర్థం వ్యవహితనివృత్త్యర్థం చేతి వార్తికవిరోధాత్." అని యిట్టి ప్రయోగముల కసాధుత్వము కల్పింపఁబడెను. పైసూత్రము నభిప్రాయమునే చెప్పుచున్న "భ్రస్కన్నామః" అను ముగ్ధబోధసూత్రము వ్యాఖ్యానములో దుర్గాదాసుఁడును "ఆమ ఇతి పంచమ్యైవ. పరతః ప్రయోగేసిద్ధే అనుగ్రహణం క్రియా విశేషణోపసర్గవ్యవధానేపి ప్రయోగార్థమ్. తేన తం పాతయాం ప్రథమమాస పపాత పశ్చాదితి రఘుః. ఉక్షాం ప్రచక్రుర్నగర స్యమార్గాన్, ఇతి భట్టిః" అని చర్చించి యున్నాఁడు. ఇంకను "ప్రభ్రంశయాం యో నహుషం చకార" అను ప్రయోగాంతరము కుదురనేలేదు. భాషాపరిపాటిచేఁ బ్రయోగింపఁబడిన ప్రయోగము లిట్టి నియమములకు లొంగునా?

"అక్షాదూహిన్యా ముపసంఖ్యానమ్" అను వార్తికము, గుణమును బాధించి 'అక్షౌహిణీ' అను వృద్ధిరూపమును సాధించుటకే పుట్టె నని తోఁపకపోదు. అట్లయ్యును అక్షోహిణీ అను రూపము నయితము కవిప్రయుక్త మగుటంజేసి 'అక్షశబ్ద మూహినీశబ్దముతో సమసించినపుడు మాత్రము పై వార్తికము ప్రవర్తించు నని అక్షశబ్ద మూహశబ్దముతో సమసించినపిదప 'ఇని' ప్రత్యయము చేసినచో 'అక్షోహిణి' అను గుణరూప మగు నని తత్త్వబోధినీకారుఁడు చెప్పెను. కాని వార్తికకారునకు 'అక్షోహిణీ' — అక్షౌహిణీ' అను రూపద్వయ సాధుత్వ ముపదేశించుతలంపే యున్నయెడల నాతఁ డావార్తికమును వైకల్పికముగా నుపదేశింపకుండునా?

మునిత్రయమువారి వచనములచే సాధ్యము కాని ప్రయోగము సాధువు కానేర దనియు, నట్టి కవిప్రయోగ మైన సాధు వనిపించు కొనుటకు మునిత్రయమువారి వచనములకు లొంగితీరవలయు ననియు సంస్కృతవైయాకరణుల మనస్సున దృఢముగా నాటుకొని యుండుటచే వారీరీతిని సూత్రములను సాఁగదీసి గాని, లేక వింతవింత యెత్తుల నెత్తి గాని, ఆయా మహాకవుల ప్రయోగములను లొంగినట్లు తోఁపించుటకు యత్నించుచు వచ్చి రని తోఁపక పోవునా?

వ్యాకరణకర్తలు శబ్దప్రపంచములోఁ గొన్ని కొన్నిఁటియందుఁ గల సాజాత్యములను బట్టి వానిని వేర్వేఱు తెగలుగా నేర్పఱిచి వానియందుఁ బ్రవర్తించు కార్యముల కనుగమములను సూత్రించు

చుందురు. సాకల్యముగా నట్టి యనుగమములకు భాష లొంగియుం డనేరదు. కావున నట్టి యనుగమములను బ్రయుక్తములందే ప్రవర్తింపఁజేయవలయును గాని, ఆ యనుగమములకలన నప్రయుక్తశబ్దములను సృజింపరాదు. మొదటమొదట సంస్కృతవైయాకరణుల సిద్ధాంత మిదియే యైనను క్రమక్రమముగా నిట్టి సిద్ధాంతము మాత్రి వ్యాకరణసూత్రములచొప్పున నిరంకుశముగా శబ్దములను సృజించు నలవాటు చాలవఱకు వ్యాపించినది. వ్యాకరణసూత్రములకు లక్ష్యములను జూపునపుడు ప్రయుక్తాప్రయుక్తతలను పాటించు ప్రయత్నమే యగపడదు. కావున నానాఁటికి వ్యాకరణముచే సాధించుటకు వీలుపడెడు రూపములెల్లఁ బ్రయోగయోగ్యములే యను సిద్ధాంతము దృఢపడినది.

"యథేష్టం నామధాతుషు" అను వార్తికమున యథేష్టమ్మని యున్నది గాన నామధాతువుల కెల్ల సన్నిమిత్తకద్విత్వము యథేష్టముగా సంభవింపవలసినదే యయ్యెను, "పుపుత్రీయిషతి, పుతిత్రీయిషతి, పుత్రీయియిషతి," అని యిట్లు భట్టోజీదీక్షితుఁ డుదాహరించినాడు. బోపదేవుఁడంతతోఁ దృప్తినందక "ఐధోర్యథేష్టం ద్విః..." అని సూత్రించి పై యుదాహరణములనే గాక "పుపుతిత్రీయియిషిషతి" అనికూడ నుదాహరించెను. వైయాకరణు లుదాహరింపరైరి గాని యింకను బ్రస్తారవశమున నెన్నియేని రూపములను సృజించుట కానూత్రము సమర్థమై యున్నది. ఇట్టి భాషయేమాత్రమును సహజము కాదనుటలో నెవ్వరును విప్రతిపన్నులు కాఁజాలరని నా నమ్మకము.

కొందఱు వైయాకరణు లీ విషయమున నెక్కుడు స్వాతంత్ర్యము నభిమానమూనిఁ పుపుతిత్రీయియిషిషతి వంటి ప్రయోగములు గూడ సహజములే యనియుఁ, బ్రయుక్తములే యనఁదగు ననియు, సంస్కృతశబ్దప్రపంచము నెల్ల సాకల్యముగాఁ బరిశీలించుట యశక్య మగుటం జేసి యట్టివి యప్రయుక్తము లనుట సాహసమనియు, వాదించుచు పస్పశాహ్నికమునందలి "సంతి వై శబ్దా అప్రయుక్తాః" మున్నగు భాష్యపంక్తుల నుదాహరింతురు.

ఇట్టివి శాస్త్రమునకు అప్రామాణ్యము రాకుండుటకై సత్యకాలపువారు కల్పించుకొన్న యుక్త్యాభాసములు కాని సద్యుక్తులు కాఁజాలవు. సంస్కృతభాష యెల్లలోకములందును నెల్ల ద్వీపములందును వ్యవహరింపఁబడునట్లు భాష్యకారుఁడు గాని, యింకెవ్వరు గాని, ఋజువుచేసి యున్నారా? ఋజువుచేయఁ గలరా? అది యటుండ నట్టి సంస్కృతశబ్దప్రపంచము నెల్ల మునిత్రయమువారు మాత్ర మెట్లు గ్రహింపఁగల్గిరో తెలియకున్నది. భాష్యకారుఁడే వేఱొకచో సంస్కృతశబ్దప్రపంచ ప్రతిపదపాఠమునకు దివ్యవర్షశతము చాలదయ్యె ననియు, నట్టియెడ నొకని యాయువు చాలదనుటలో వింతయేమున్న దనియుఁ జెప్పియుండెను. [చూడుడు — పస్పశాహ్నికము బృహస్పతి రింద్రాయదివ్యం వర్షసహస్రం శబ్దపారాయణం ప్రోవాచ అను మున్నగు వాక్యములు.]

ఈ విషయములను బాగుగాఁ బరిశీలించియే యహోబలపండితుఁ డీ క్రిందిరీతిని బ్రసంగించియున్నాఁడు. "అద్య ప్రకృతే కపి ప్రయోగానుసారిత్వ మేవ. తదుక్తం ధనంజయాచార్యైః- "వక్తా వాచస్పతి ర్యత్ర శ్రోతా శక్ర స్తథావిధః । శబ్దపారాయణస్యాంతం న గతౌ తత్ర కేవలం ॥ తథాపి కించి త్కస్యచిత్ ప్రతిబోధాయ సూచితం । బోధయే త్క్రియ దుక్తజ్ఞో మార్గవి త్సవ యాతి కిమ్ ? ప్రమాణ మకలంకస్య పూజ్యపాదస్య లక్షణమ్. అని. [చూ. అహో. 514 పు]

పైరీతి కేతన, తన యాంధ్రభాషాభూషణమునఁ జేర్కొని యున్నాఁడు. తే. గీ. కంచి నెల్లూరు మఱి యోరుగల్లు రోడ్య యనుపురంబులపై గంగ కరుగు మనిన । పగిది, నొకత్రోవఁ జూపెను బహుపథంబు । లాంధ్రభాషకుఁ గల వని యరసికొనుఁడు.

మఱియుఁ బైరీతిని దుష్కరమే యగు భాషాప్రపంచాన్వేషణమును ప్రతివారును చేయలేనంతమాత్రమునఁ దద్వ్యాకరణసాధితములైన-యప్రయుక్తము లనఁదగు-'పుపుతిత్రీయియిషిషతి' వంటి రూపముల నెల్లఁ బ్రయోగింపవలసినదేనా? ఇంక నిరంకుశముగా నెల్లధాతువుల నుండియు-క్విబంతములు - భావక్తాంతములు - ఘఞంతములు మున్నగు వానిని బుట్టించి ప్రయోగింపవలసినదేనా? [బాలవ్యాకరణగుప్తార్థప్రకాశికాకారులు ఘఞంత రాజశబ్దమును బుట్టించిరే.] ప్రయుక్తానా మేవేద మన్వాఖ్యాన మ్మని భాష్యకారుఁడే చెప్పియుండఁగాఁ-దత్సాధితరూపములు ప్రయుక్తములని ఋజువుచేసికొను భారము వైయాకరణులయందే యున్నది కాదా? ఇంతయేల! పై రీతిని బ్రసంగించిన భాష్యకారుఁడే ప్రతివాదులు అప్రయుక్తములన్న వానిలోఁ గొన్నిటికిఁ బ్రయోగములు చూపి యవి యప్రయుక్తములు కావని ఋజువు చేసికొనెను. [చూడుడు- యేచాప్యేతే భవతాఽప్రయుక్తాః, మున్నగు పంక్తులు. పస్పశాహ్నికము.]

వ్యాకరణాభిమానము ముదిరిన కాలములోనివాఁ డయ్యు, నాంధ్రశబ్దచింతామణికర్త యీవిషయమునఁ జాల మంచిమార్గమునే యనుసరించినాడు. భాష్యకారుఁ డీసందర్భమునఁ బ్రతివాదులు అప్రయుక్తము లని చూపినవానిలోఁ గొన్నిటికి వేదములోఁ బ్రయోగముం జూపి వాని ప్రయోగమున కభ్యనుజ్ఞ నిచ్చుట జూచి యదియు సరికాదని తలఁచి కాఁబోలును అప్రయుక్తములేగాక విరళప్రయుక్తములుగూడ నాంధ్రకావ్యములందుఁ బ్రయోగార్హములు కావని సిద్ధాంతము చేసినాడు:—

"విరళాన్ పేచో పాదిక శబ్దాన్ ప్రవ్యాహరంతు శబ్దజ్ఞాః
ఇహతు ప్రవ్యాహర్తుం సంశేతిక సుప్రసిద్ధ మేవ పదమ్"

[చింతామణి]

వేయేల! పైరీతిని బ్రసంగించిన భాష్యకారుఁడే వ్యాకరణసూత్రముల నప్రయుక్తశబ్దముల సాధించుటలో నుపయోగింపరాదని "యథాలక్షణ మప్రయుక్తే" అని స్పష్టముగా వచించియున్నాఁడు. అప్రయుక్తశబ్దములవిషయమున లక్షణము బ్రవర్తింపఁజేయరాదని యద్దాని తాత్పర్యమై యున్నది. అట్లయినను పైభాష్యకారోక్తి అప్రయుక్తశబ్దములను వ్యాకరణముచొప్పున సాధించి గ్రహిం

పవలె నని వేఱొకయర్థమును గూడఁ గైయటుఁడు చెప్పియున్నాఁడు. కాని, యీ యర్థము సమంజసము కానేరదు. "ప్రయుక్తానా మేవేద మన్వాఖ్యానమ్" అని యిట్లు ప్రయుక్తముల స్వరూపమునే వ్యాకరణము సాధించునను స్వసిద్ధాంతమునకు విలక్షణముగా నప్రయుక్త శబ్దములను లక్షణముచొప్పున సాధించుకొనవలె నని భాష్యకర్త యెట్లు చెప్పియుండును? మఱియు గ్రంథాదిని భాష్యకారుఁడు ప్రతిజ్ఞ చేసిన "అథ శబ్దానుశాసనమ్ * * * కేషాం శబ్దానాం, లౌకికానాం వైదికానాంచ" అను ద్వివిధశబ్దములును బ్రయుక్తవిషయకములే యని - "సిద్ధే శబ్దార్థసంబంధే లోకతః * * * వేదాన్నో వైదికాః శబ్దాః సిద్ధాః లోకాచ్చ లౌకికాః, అనర్థం వ్యాకరణమ్" అను మొదలగు భాష్యకారోక్తులచే స్పష్టపడుచునే యున్నది. కావుననే "అష్టన ఆవిభక్తౌ" అను సూత్రపు శేఖరమునందును నీయర్థము నిరాకరింపఁబడినది. ఇట్లే వాల్ జ్యాది సూత్రపు మనోరమా వ్యాఖ్యానమునందును, శబ్దరత్నమునందును హరిదీక్షితులచే నప్రయుక్త శబ్దములందు లక్షణమును బ్రవర్తింపఁజేయరా దనియే సిద్ధాంతము చేయఁబడెను.

ఇఁక మునిత్రయమువారి కాలములో సంస్కృతము వ్యవహారస్థమై యుండెడి దనియు, నందలి శిష్టవ్యవహారస్థభాషకును వాఙ్మయస్థభాషకును గూడ వా రన్వాఖ్యానము చేసి యుండుటచేఁ దల్లక్షణసాధితములు వాఙ్మయప్రయుక్తములు కాకున్నను, వ్యవహారప్రయుక్తములై యుండునేమో యనుకొనుటకు బాధక మేమియు లే దనియు, నిపు డట్టి వ్యవహారము లేకుండుటచే నట్టి వ్యవహారప్రయుక్తతను జూపలేకుండుటవలన క్షతి లేదనియు, నక్కారణమున వానివిషయమున లక్ష్యమే ప్రమాణము కానోపు ననియుఁ జెప్పుటకు గొంత యవకాశ మగపడుచున్నది. కాని, మునిత్రయమువా రట్లు కేవలము ప్రయుక్తములకే లక్షణము చేసియుండలే దనియు, వ్యాకరణసాధితరూపములలో ననేకము లప్రయుక్తములు గూడఁ గలవనియు నట్టివానివిషయమున లక్షణమును బ్రవర్తింపఁజేయరా దనియు భాష్యకారుఁడే కంఠోక్తముగా "యథాలక్షణ మప్రయుక్తే" అని చెప్పి యుండుటచేత పూర్వము వ్యవహారమునఁ బ్రయుక్తములై యుండునేమో యనుకొని వాఙ్మయమున కెక్కిన వ్యాకరణసాధితరూపములను సాధువులుగా నంగీకరించుట యుక్తము కాదుగదా. ఒకవేళ నవి యప్రయుక్తములయి కూడ నుండిన నుండవచ్చునుగదా.

సంస్కృత వైయాకరణులు పాణిన్యాదులకుఁ బ్రసాదించిన సర్వజ్ఞత, వస్తుతః భూతత్వముల కపోలకల్పిత ప్రసాదించిన సర్వజ్ఞత వంటిదే యన్న క్షతి లేదు. కాని యది వాస్తవమే యన్నచో నింక "యథోత్తరం మునీనాం ప్రామాణ్యమ్" అను మొదలగు సిద్ధాంతము లెట్లు పొసంగును? సర్వజ్ఞుఁ డగువాని మాట యెన్నఁడైన నప్రమాణము కాదు గదా. ఉత్తరముని వాక్యమును బట్టి పూర్వమునివాక్య మప్రమాణ మగునపు డింక నాతనికి సర్వజ్ఞత్వ మెట్లు పొసఁగును? అష్టాధ్యాయికి లోఁగనిరూపములఁ గుదుర్చుటకై పుట్టిన వార్తికములను వృత్తికారాదుల "అంగగాత్రకంఠేభ్యో వక్తవ్యమ్" అను కొందలగువానివంటి విషయముల నుపదేశింపలేకుండ పాణిని సర్వజ్ఞతకు బాధకము కాదా? మఱియు సూత్రములలోని చకారాదుల కనుక్తసముచ్చయార్థకత్వమును గల్పించియు, వాశబ్దాదులకు వ్యవస్థితవికల్పార్థకత్వమును గల్పించియు, యథేష్టవ్యవస్థలను జేసియు, యోగవిభాగము చేసి యథేష్టముగా నిష్టరూపసాధనమును జేసియు, వార్తికకారవృత్తికారాదులు పూరించిన విషయము లెల్లఁ బాణినిసూత్రములకు లోఁగినవే యని నిర్వహించుచు, పాణిన్యాచార్యులవారికిఁ గల్పించిన సర్వజ్ఞత్వమునకు భంగము రాకుండుటకై "సూత్రేష్వేవహి తత్సర్వం యద్వృత్తౌ యచ్చ వార్తికే" అను నొక వింత సిద్ధాంతము బయలువెడలదీసిరి. అట్టి సిద్ధాంతముయొక్క దౌర్బల్యమును విశదీకరించుటకై యిట దిఙ్మాత్రముగా నుదాహరించుచున్నాను.

"విభాషా ప్రకరణే తీయస్య జిత్సూపసంఖ్యానమ్" అను వార్తికము సూత్రకృదభిప్రేతమే యనియు 'విభాషాజసి' అను సూత్రమును యోగవిభాగము చేసికొని యీ యర్థమును సంపాదింపవలసిన దని మాత్రమే వార్తికతాత్పర్య మనియు, న్యాసాపరనామక కాశికావివరణపంజిక యను గ్రంథములో వ్రాయఁబడెను. విభాషా జసీ త్యత్ర విభాషేతి యోగవిభాగః క్రియతే. తత్ర చ సర్వాదీని ద్వంద్వ ఇతి చ నివృత్తమ్. తేన తీయస్య విభాషా సర్వనామసంజ్ఞా భవిష్యతీతి. నచైవ మతిప్రసంగః, యోగవిభాగా దిష్టసిద్ధేః నాపి విభాషా ద్వితీయా తృతీయాభ్యా మిత్యస్య వైయర్థ్యాపత్తిః ప్రపంచార్థత్వాత్. తతో జసీతి ద్వితీయో యోగః. అత్ర విభాషా గ్రహణం ద్వంద్వగ్రహణం చానువర్తతే" (1 అ. 1 పా. 36 సూ.) జస్సంబంధియాధారకార్యము చేయవలసినపుడు ద్వంద్వమందు సర్వనామసంజ్ఞ విభాష యని తెలుపుటకై 'విభాషాజసి' అని సూత్రించె నని భట్టోజీదీక్షితుఁడు జసాధారం యత్కార్యం శిభావాఖ్యం తత్ర కర్తవ్యే ద్వంద్వే ఉక్తసంజ్ఞా వా స్యాత్' అని మహాభాష్యానుసారముగా వృత్తిని రచించెను. న్యాసకారుల యర్థము భాష్యవిరుద్ధ మగుటచేతనే యప్రమాణ మని దృఢముగాఁ జెప్పవచ్చును. సూత్రకర్త యీయర్థము నాఘ్రాణించియైన నుండలే దనుటయు స్పష్టము. సూత్రకర్తకే యిట్టి యాశయ మున్నయెడల 'విభాషా ద్వితీయా తృతీయాభ్యా' మను సూత్రమును 'విభాషాద్వితీయతృతీయాభ్యామ్' అని యిట్లు పుంలింగములకుఁ గూడ సిద్ధించునట్లు సూత్రము చేసి యుండును గదా! ఇట్లే గ్రామ్యపశుసంఘేష్వతరుణేషు స్త్రీ (౧ అ. ౨ పా. ౭3 సూ.) నాసికోదరోష్ఠ జంఘాదంతకర్ణశృంగాచ్చ, అను మున్నగు స్థలములందును వింతవింత యర్థములు వ్రాయఁబడినవి. [స్థలసంకోచముచేత ఆయాగ్రంథభాగము లిందు ఉద్ధృతములు కాలేదు.]

ఇట్టులు వింతయర్థములు తీయుట పాణిన్యాచార్యులవారి సర్వజ్ఞత్వమును గాపాడుటకే గదా! ఆ పక్షమున నతోధికుఁ డని యెల్లవైయాకరణులు నొప్పుకొనుచున్న భాష్యకారుఁ డట్టి యర్థవిశేష మాసూత్రములకుఁ జేయఁజాలకుండుటచే నాయనయొక్క సర్వజ్ఞతను గోలుపోతి మని యీపక్షమువా రెట్లు తలంపకున్నారో

తెలియుచున్నది. మఱియు నిట్టి రచనలవలననే వ్యాకరణము పరిపూర్ణమగు నన్నప్పుడు-ఒక్క చకారముతోనో, ఒక్క, వాశబ్దముతోనో, ఒక్క బహుళ శబ్దముతోనో, సూత్రములను రచించి దానితోనే వ్యాకరణశాస్త్రమునెల్ల సంగ్రహించుట గూడ మఱింత లఘువుగానుండును గదా! ఇదియునుగాదేని—"కొన్ని కొన్ని శబ్దములకుఁ గొన్ని కొన్ని యెడలఁ గొన్ని కొన్ని కార్యము లగును!" అను నొకసూత్రముతో రచింపఁబడిన వ్యాకరణశాస్త్రముగూడఁ బరిపూర్ణమే యగు ననియుఁ, దత్కర్త గూడ వ్యాకరణవిషయముల నెల్లఁ జెప్పినవాఁ డగు ననియు ననఁదగును గదా!!

మఱియుఁ బై వార్తికకార వృత్తికారాదులు పూరించిన విషయము లెల్లఁ బాణిన్యాచార్యులవా రెఱిఁగియెఱిఁగి ముందు పుట్టఁబోవు వార్తికకారాదులు పూరింతు రను విషయమును దివ్యదృష్టిచే నెఱిఁగి, యట్లా విషయములను జెప్పక విడిచియుండి రని చెప్పుచుఁ బాణిన్యాచార్యుల సర్వజ్ఞతను గాపాడు సంప్రదాయము నున్నది.

'నబహువ్రీహౌ' అను సూత్రపు వ్యాఖ్యానావసరమున మూలములోని 'యథోత్తరం మునీనాం ప్రామాణ్యమ్' అను పరిభాష నంగీకరించుచు వ్యాఖ్యానముచేసిన శేఖరకారుని 'యథోత్తరమితి-ఏతచ్చ ధిన్వికృణ్వ్యోర చ, ఇతి సూత్రే భాష్యే ధ్వనితమ్.' అను వాక్యమునకు వ్యాఖ్యానము చేయుచు దీపకారుఁడు "ధ్వనితమితి - తత్ర హి లోపవిధానేపి 'సధాతులోప' ఇతి సూత్రేణ 'ధినోతి' ఇత్యాదౌ గుణనిషేధే సిద్ధేఽకారాదేశవిధానం కిమర్థ మిత్యాశంక్య తత్ప్రత్యాఖ్యానపక్షే స్థానివద్భావాయ తద్విధాన మిత్యుక్తమ్. యది పూర్వముని రుత్తరమున్యభిప్రేతం న జానీయాత్తర్హి ప్రత్యాఖ్యానస్య భాష్యకృత్కృతత్వేన తత్రపక్షే తత్సిద్ధ్యర్థం సూత్రకారకృత మకారాదేశ విధాన మసంగతం స్యాదితి నిరుక్తమ్..."అత్ర రుచిబీజంతు మహర్షీణాం సర్వజ్ఞత్వ భంగః - అతోఽస్మిన్ శాస్త్రే ఉత్తరముని తాత్పర్యానుసారేణైవ పూర్వమునే స్తాత్పర్య మవధారణీయ మితిబోధ్యమ్" అని వివరించియున్నాఁడు. ఇట్టి యుక్తులతో సామాన్యముగా నెట్టివ్యాకరణమును బరిపూర్ణము కానేరదు. అనంత మగు భాష సమగ్రముగా నియమింపఁబడునన్న మాట యెంతమాత్రమును బొసఁగనేరదు. అందును నొక్కని గ్రంథమే యట్లు నియమింపఁజాలు ననుట యింకను సరికాదు. అనేకమహాపండితులు పూరించుచువచ్చినను ఇంకను ననేక విషయములందు కొఱవడియే యున్నది. ఇంకను సంస్కృతభాష వ్యవహారభ్రష్టత నందియుండుటచే నద్దాని లక్షణ గ్రంథములందలి కొఱంతలంతగా నగపడవు. కాని, యీ భాషయొక్క వ్యవహారస్థితి నెఱుఁగఁదగు కాలమునం దింకను వేనవేలు కొఱంతలందు గన్పట్టియుండు నని నా నమ్మకము. పూర్వులనేకు లీ వాఙ్మయమును శోధించి లోపములను బూరించుచు వచ్చుచుండుటం జేసి యిప్పు డంతగా గొఱంతలు గన్పట్టవు. కాని కృత్తద్ధిత సమాస విషయములందును ఉణాదిప్రత్యయములందును నింకను దృష్టిలేక వైయాకరణులీక్రిందిరీతిని వ్రాసియున్నారు.

"కృత్తద్ధితసమాసానా మభిధానం నియామకమ్,
లక్షణం త్వనభిజ్ఞానాం తదభిజ్ఞానసూచకమ్
సంజ్ఞాసు ధాతురూపాణి, ప్రత్యయాశ్చ తతఃపరే,
కార్యాద్విద్యాదనూబంధ, మేతచ్ఛాస్త్ర ముణాదిషు"

ఇంతియగాక, వ్యాకరణములలోఁ జేర్కొనఁబడిన యాకృతిగణములును, బాహుళక విధానములును, ప్రాయోవిధానములును, పృషోదరాదీని యథోపదిష్టమ్ అన్యత్రాపిచదృశ్యతే. అనువానివంటి విధానములును, శాస్త్రముయొక్క యపరిపూర్ణత నుగ్గడింపఁజాలియే యున్నవి గదా! పైనిఁ జేర్కొన్న సంస్కృత వైయాకరణుల నమ్మకములు జూచియే యహోబలపండితుఁ డాంధ్రవ్యాకరణకర్త లగు నన్నయాథర్వణులకును ఋషిత్వము సర్వజ్ఞత్వము నున్నగువానిని సాధించి వారివాక్యములకే పరమ ప్రామాణ్యము నొసంగి వారిలక్షణములకు లొంగని తిక్కయజ్వాది మహాకవుల ప్రయోగములను గూడ నిరసింపసాగెను.

"నను - నెలఁతముద్దుమోము నెఱికురుల్ గుబ్బలు" ఇత్యాది ప్రయోగే వ్యసమాసేపి షష్ఠీ ద్వితీయాతుల్యైవ వర్తతే. తత్ర కిం మూల మితిచేత్ "మహాత్ములైన భూపతులయు విప్రముఖ్యులసభన్, "ఎవ్వనియేని ముఖాంబుబింబంబున నిత్యాద్యాచార్య వచన మేవ మూలమ్. ఏనిశబ్దప్రయోగే నైవాత్ర భిన్నతా స్పష్టీక్రియతే. తత్ర తద్వచనమహిమ్నైవ ద్రుతస్య లుగితిధ్యేయమ్. .........వస్తుతస్తు ఆచార్యప్రయుక్తస్యైవ తాదృశవాక్యస్య నిపాతన్యాయేన ప్రామాణ్య మన్యేషాంతు నైవ సాధుత్వ మిత్యనుసంధేయమ్. ......[అహో. 218 పుట.]

అగ్గలంబు నాయెదుట బాహుబలించి, పర్వము లేకయును రాహు భానుని బట్టెన్, తనతనువు రాహుసోమామృతంబు మ్రింగె, దిక్పాలతను వెత్తి తిరిగెంబు తనుతోన, ఇత్యాద్యాస్తిక్కయజ్వాది కవిప్రయోగాః అస్త్రియా మిత్యపర్వణశ్చ నే స్త్రీవాచకవ్యతిరిక్తానా ముదంతానా మితి వ్యాఖ్యానా న్న తన్వాదిభ్యో వువర్ణకవికల్పో విరుద్ధః. విద్యుత్సహస్రముల్ విలసిల్లె మఱి రాహు పర్వంబు లేకయ భాను బట్టె నిత్యాది ప్రయోగాచ్ఛబ్దశాసనస్యాపి వువర్ణవికల్ప స్సమ్మత ఏవ అనుతాం స్త్రియా మిత్యుక్తే రాచార్యస్య మతేతు తన్వాదిభ్యో నేష్టఏవ వికల్పః. "జరత్కారు నదీయానుజు న్నితి తదుక్తే స్తస్మాత్రస్య సాధుత్వ మితి బోధ్యమ్" [అహో-396 పుట]

"నను సంస్కృత ప్రాకృతవ్యాకరణయో రార్షత్వేన భవతి ప్రామాణ్యమ్ నన్నయాథర్వణయో రిదానీంతనత్వేన కథం తత్ప్రణీతయో ర్వ్యాకరణయోః ప్రామాణ్యం స్యాత్. నానృషేః కావ్యకరణచాతుర్యధుర్యత్వం సంభవత్యేవ ఖలు. నానృషిః కురుతే కావ్యమిత్యభియుక్తోక్తేః, అనితరసాధారణ వ్యాకరణనిర్మాణ పటుతయా పండితకవీంద్ర ప్రథమగణ్యత్వేనచ పరిప్రాప్తం సార్వజ్ఞ్యం తయో రధునాతనత్వ మాత్రేణ కథం నివార్యేత? అతఏవ బ్రహ్మదేవానాం పదవీః కవీనా మిత్యుపనిషదే వచనే పదజ్ఞస్య విశేష్యేశ్వరభూతిసత్తా ప్రతిపాదితా". [అహో 110 పుట]

సంస్కృతవ్యాకరణ వాసనావాసితుఁ డగుటచే నహోబల పండితుఁడు, నైరీతిని నన్నయాథర్వణులకే పరమప్రామాణ్య మొసంగి వారికి సర్వజ్ఞత్వవిశిష్ట ఋషిత్వమును బ్రసాదించి వారి వ్యాకరణములకు లొంగిన ప్రయోగములు సాధువు లనియుఁ దక్కినవి యసాధువులనియు, వారి వ్యాకరణములేగాక వారి ప్రబంధములలోని ప్రయోగములుగూడ వ్యాకరణములకు లొంగకున్నను బరమప్రమాణము లనియు నీరీతిని బ్రసంగించియున్నాఁడు. అహోబలపతియే గాక తత్పూర్వుఁ డగు నప్పకవియు నిట్టి యభిప్రాయమునే పొంది యుండెను:—

ఉ. ఆదిని శబ్దశాసన మహాకవి చెప్పిన భారతంబులో
వేది వచింపఁగాఁబడియె నెంతయు దాని నెఱింగి సూత్రసం
పాదన లేమిచేఁ దెనుఁగుపల్కు మఱొక్కటిగూర్చి చెప్పఁగా
రాదని ప్రాక్తనాటి కవిరాజులుఁ డీనియమంబు చేసినన్.

కం. ఆమూఁడు పర్వములలో
నా మాన్యుఁడు నుడువు తెనుగు లరసికొని కృతుల్
దామ రచించిరి తిక్కన
ధీమణి మొదలైనతొంటి తెనుఁగు కవీంద్రుల్.

[అప్పకవీయము]

ఇది కేవలమును సత్యేతర మనుట కేమి సందియము? సంస్కృత వ్యాకరణ వాసనావశమున నే విశ్వతివివేకకారుఁడును గొందఱు సంస్కృత వైయాకరణులవలెనే యొకచో వ్యాకరణములకు లొంగని శబ్దము లపశబ్దము లనియు - శాస్త్రవిరోధము లేనపుడే ప్రయోగమునకుఁ బ్రామాణ్య మనియు, శాస్త్రప్రయోగములకు విరోధము గల్గినపుడు శాస్త్రమునకు ప్రామాణ్యము నంగీకరించి యా ప్రయోగమును నిరసింపవలసినదే యనియు సిద్ధాంతము చేసియున్నాడు. అట్టి సిద్ధాంతము నవలంబించియే యహోబలపండితుఁడును "ఆద్యుఁడు హిరణ్యగర్భునం దంతకంటె" నిత్యాది కవిపితా మహోద్యుక్తిస్తు నిర్మూలైవ. (అహో 815 పుట) "మధుకైటభారాతి మఱఁది రమ్మని పిల్చి పనిఁగొంట నీకుఁ బ్రాభవము గాద" ఇత్యాది శ్రీనాథ వచనస్య ప్రామాదికత్వమే శేత్యవధేయమ్" అహో 499 పుట.] "సుతులఁ గనియెడు కోఱకు! నీవు ఘటించు కంటె" ఇత్యాదీనాం భాస్కరతిక్కయజ్వాది వచనానాం కిం మూల మితి వయం న విద్మః" [అహో 500 పుట.] అని యిట్లతిసాహసముగా జర్చించి యున్నాఁడు. ఇట్టి ధోరణులను బట్టి చూచునపుడు వ్యాకరణములు ప్రయోగముల నాధారముగాఁ జేసికొని రచింపఁబడె ననుమాటను మఱచి వ్యాకరణములనుండియే భాష పుట్టిన దను నట్టి యభిప్రాయమును మన వైయాకరణులంది రని తోఁపకపోదు గదా.

సంస్కృత వైయాకరణులు కాళిదాసాది మహాకవుల కావ్యములలోని కొన్ని ప్రయోగములు వ్యాకరణములకు లొంగనపుడు వానిని బ్రామాదికము లనుచుఁ జేయు సిద్ధాంతమే మన యీ తెనుఁగు వైయాకరణుల సిద్ధాంతమునకు మూలమై యున్నది. "త్రియంబకం సంయమినం దదర్శ" అను కాళిదాసుప్రయోగములోని త్రియంబక శబ్దము ప్రామాదిక మనియు నపశబ్ద మనియు వైయాకరణులు చెప్పుదురు. అట్లే-విమానవా "సుభ్రు కుతః పితు ర్గృహే" అను కాళిదాసు ప్రయోగములోని సుభ్రు అను సంబుద్ధ్యంత మపశబ్ద మని చెప్పుదురు. కాళిదాసువంటి మహాపండితకవి మనపాటి 'ఇకోయణచి' యెఱుఁగకుండునా? అట్లే "అంబార్థనద్యో ర్హ్రస్వః" అను సూత్రవిషయమును మాత్ర మెఱుఁగకుండునా? అరయనరయ నట్టి మహాకవు లూరక యిట్టి యపశబ్దములను బ్రయోగించి యుండరనియు, వారు పూర్వ పూర్వ వాఙ్మయమును బాగుగఁ జదివి యందలి సత్ప్రయోగముల నాధారముగఁ జేసికొనియే వ్యాకరణములకు లొంగకున్నను, వానిని సరకు సేయక యట్లు ప్రయోగించియుందు రనియుఁ దోఁచుచున్నది. ఇంత యేల? కేవలము వ్యాకరణోదాహరణమునకు రచింపబడిన భట్టికావ్యమునందు సైతము "హాపితః క్వాసి హే సుభ్రు!" అను నిట్టి ప్రయోగ ముండుటయే యట్టి ప్రయోగముల సాధుత్వమునకును సమూలకత్వమునకును ప్రబల నిదర్శనమై యున్నది.

మఱియుఁ గొందఱు సంస్కృత వైయాకరణులు సంస్కృత మహాకవుల ప్రయోగములు వ్యాకరణములకు లొంగనప్పు డవి యపశబ్దము లయ్యు, మహాకవి ప్రయుక్తము లగుటం జేసి, యెట్టెటో వాని నంగీకరింపవలయు ననుచు "మహాకవి ప్రయోగత్వాత్ కథంచి ద్బోధ్యవ్యః" అని యిట్లంగీకరింతురు. గాని యట్టి వ్యాకరణ విరుద్ధ ప్రయోగము లాంధ్రమహాకవుల కావ్యములందు గన్పట్టునపుడు వాని నెంతమాత్రము నంగీకరింపరు. ఇదియు మిక్కిలి వింతగ నగపడుచున్నది. వారు సంస్కృతభాషయందు మంచి పాండిత్యము గలవారని వారి తత్సమపుఁ దెనుఁగువాడుకలు వేనోళ్ల నుద్ఘోషించుచుండఁగా, నట్టివారి ప్రయోగములకు సంస్కృతమహాకవుల కిచ్చు ప్రామాణ్య మేల యీయరాదో తెలియకున్నది. వారికి సంస్కృతకవులకు లేని యాంధ్రభాషాజ్ఞాన మధికముగా నుండుట యిట్టి యప్రామాణ్యమునకు సాధకముగ నెంచుట యర్హమా?

"చ. అటఁ జని కాంచె భూమిసురుఁ డంబరచుంబి శిరస్సరజ్ఝరీ
పటల ముహుర్ముహు ర్లుఠ దభంగతరంగ మృదంగనిస్వన,
స్ఫుటనటనానురూప పరిఫుల్ల కలాప కలాపిజాలమున్
గటకచరత్కరేణు కరకంపితసాలము శీతశైలమున్"

అను నిట్టి నిరర్గళధారణఁ గవిత్వముఁ జెప్పఁగలుగు మహాకవిప్రయోగము ప్రామాణ్యము కాదఁట! అందుఁ దెనుఁగువిభక్తి యుండుటయే యాతని యప్రామాణ్యమునకు మూల మఁట! ఆ రీతిని సంస్కృత సమాసమును గూర్పఁజాలిన కవి యిఁక నా సమాసము తుదను సంస్కృత విభక్తి నిలుపఁజాల కుండునా? ఒకవేళ నట్టి పద్యమే—

"చ. అట నవిధానపక్ష్యదము కొంబరచుంబి శిరస్సర జ్ఝరీ,
పటల ముహుర్ముహు ర్లుఠ దభంగతరంగమృదంగ నిస్వనః
స్ఫుటనటనానురూప పరిఫుల్ల కలాప కలాపిజాలకం,
కటకచరత్కరేణు కరకంపితసాలక శీతభూధరమ్"

అని యిట్లు సంస్కృతవిభక్తులతో నున్నయెడలఁ బ్రమాణమే గదా! (ఇందు విభక్త్యాది విపరిణామమే ప్రస్తుత మగుటచే పూర్వోత్తరార్థ సమాసము పాటింపలేదు.)

"శ్రీ" వేదాభ్యాస పవిత్ర పూతరసనావిర్భూత భూరిస్తవా
        పాద బ్రహ్మముఖౌఘ విఘ్నిత నవస్వర్గక్రియా కేళిచే......

ఇందలి "చే" అను తెనుఁగు విభక్తి తుదినుండుటచే నిది యప్రమాణ మగునఁట.

"శ్రీ" వేదాభ్యాస పవిత్ర పూతరసనావిర్భూత భూరిస్తవా
        జిహ్వా బ్రహ్మముఖౌఘ విఘ్నిత నవస్వర్గక్రియా కేళినా...

అని యిట్లు సంస్కృత విభక్తితో నున్నయెడల మాత్రమే యది ప్రమాణ మగునఁట! — "అహా ఏమివింత! బాగుగాఁ జూచుకొనకున్నారు గాని, మహాభాష్య కర్తయే "పృషోదరాదీని యథోపదిష్టమ్" అను సూత్రము భాష్యమున వ్యాకరణము శిష్టప్రయోగ మూలక మనియు శిష్టు లిట్టివా రను విషయమును దెలుపుటకు మాత్రమే యష్టాధ్యాయి యుపచరించును గాని సాకల్యముగా భాషనంతను నుపదేశింపఁజాల దనియును, వ్యాకరణములకు లొంగని ప్రయోగములు గ్రంథములో నగపడునపు డాగ్రంథములోని యితర ప్రయోగములు వ్యాకరణశుద్ధి నందియున్నట్లును, తద్గ్రంథకర్త పండితుఁ డైనట్లును సహృదయులకు తోఁచునేని యా వ్యాకరణ విరుద్ధ ప్రయోగములు కూడ సాధువులే యనియు, నాతఁడు వాని సాధుత్వము నరసియే ప్రయోగించి యుండుననియు నంగీకరింపవలసినదే యనియు సిద్ధాంతము చేసియున్నాఁడు.

"యది తర్హి శిష్టా శ్శబ్దేషు ప్రమాణం, కి మష్టాధ్యాయ్యా క్రియతే? శిష్టపరిజ్ఞానార్థాఽష్టాధ్యాయీ. కథం పున రష్టాధ్యాయ్యా శిష్టా శ్శక్యా విజ్ఞాతుమ్" అష్టాధ్యాయీ మధీయానో ఽన్యం పశ్యత్యనధీయానమ్. యే ఽత్ర విహితా శ్శబ్దాః తాన్ ప్రయుంజానం పశ్యతి నూన మస్య దైవానుగ్రహః స్వభావో వా, యో ఽయం అష్టాధ్యాయీ మధీతే యే చాస్యాం విహితా శ్శబ్దా స్తాంశ్చ ప్రయుఙ్క్తే నూన మయ మన్యానపి జానాతీతి. ఏవ మేషా శిష్టజ్ఞానార్థాష్టాధ్యాయీతి [మహాభా. ౬ అ. 3 పా. 3 ఆహ్ని.]

పై గ్రంథమును బట్టి కేవల మవైయాకరణుఁ డయినను నే గ్రంథకర్త తన వాఙ్మయ పఠన జనిత సాహితినిబట్టి పరిశుద్ధ శబ్దములను బ్రయోగించునో యట్టివాని గ్రంథ మందలి వ్యాకరణములకు లొంగని ప్రయోగములు నైతము ప్రమాణీకరింపఁ దగినవే యని తేలుచున్నది. ఇట్టి స్థితిలో గ్రంథకర్త వ్యాకరణాభ్యాసము కలవాఁడని కూడ నాతని గ్రంథము చదివిన విమర్శకులకు విశదపడుచుండ నట్టి మహాకవికి మతోకభావ వచ్చినంత మాత్రమున నెట్టుల ప్రామాణ్యము ప్రసక్త మగునో తెలియరా కున్నది. గ్రంథవిస్తరభీతిచేత నింతతో విరమించుచున్నాను గాని యింకను నిట్టివి పెక్కువిషయములు విమర్శింపఁదగి యున్నవి. వ్యాకరణము శబ్దతత్త్వశాస్త్ర మగుటంజేసి యందు వేదపురాణాదులందువలె నర్థవాద ప్రసంగము అను నతాత్త్విక విషయములును నయుక్తిక సిద్ధాంతములును నమానుష మాహాత్మ్యములును నుండుట యర్హము కాదు. ఒకవేళ పురాణ యుగమున నప్పటి నాగరకత చొప్పున వెనుక నుదాహరించిన యట్టి విషయములు ప్రాచీనుల గ్రంథములలోఁ బ్రవేశించినను బ్రవేశించుఁగాక. పాశ్చాత్య నాగరకత ప్రబలిన యిక్కాలమునందుఁ గూడ నట్టి సిద్ధాంతములనే నమ్ముచు నిర్విచారణబుద్ధితోఁ జెప్పినదాని నెల్ల నంగీకరించుచుండుట యర్హమా? వ్యాకరణశాస్త్ర పఠనమువలనఁ బుణ్యము వచ్చునా? రాదా? అను పెనఁగులాట నటుండనిచ్చి మునిత్రయమువారి సర్వజ్ఞత్వమునకు భంగము కలుగకుండుటకై వైయాకరణులు పరిశ్రమచేసి రచించిన యతివిపుల శాస్త్రార్థ సముద్రమునందు మునిఁగి కాలమును గడపికొనక, భాషాస్వరూపమును సులువుగాఁ దెలిసికొనుటయే వ్యాకరణాభ్యాసమునకుఁ బరమప్రయోజన మనియెంచి వ్యాకరణశాస్త్రములోని యనుగమము లెంతవఱకు వాఙ్మయస్థ ప్రయోగములచే రూఢమూలములు కాఁగలవో యను మంచి విషయమును గ్రహించుటకు యత్నింతురు గాక.

# గుణత్రయము

శ్రీ రిపి ఆంజనేయులు గారు

గీ. స్వాత్మగౌరవ మాత్మ విజ్ఞానకళలు, మాత్మవశ మీఁదుఁ ద్రికరణంబు నూనె,
నరున కమలదీవన విధానమ్ముఁ గూర్చి, సార్వభౌమ పదమ్ముకు సంతరించు.

గీ. సార్వభౌమ పరాక్రమ సరణిచూడ, సారహీనం బదెంత! నిష్కామవృత్తి
నీ గుణత్రయమును దాల్చునేని నరుఁడు, తాన కోరక నాయకత్వము వహించు.

గీ. ధర్మమే విధాయక మగు తత్త్వ, మట్టి నియమ సూత్రానువర్తియై నెగడు నరుని
జ్ఞానమే జ్ఞాన, మద్దానఁ గలుగు ఫల మ దెట్టి దైన, నతండు లెక్కింపఁబోఁడు.

# ఆంధ్రసారస్వతము

జంధ్యాల వేంకట శివకవులు

మన తెలుఁగుబాస లాతిబాసలవలె గాక తన సొంపు నింపు చక్కని యక్కరములును మృదుమధురములై విన నింపుఁ గూర్చు నజంతశబ్దములును గలిగి సులభోచ్చార్యమై యెసగుచున్నది. ఆంధ్రభాషయందు స్వరములకుఁ బ్రత్యేక సంజ్ఞలు గలవు. సంస్కృతకవనాభిజ్ఞు లయ్యును త్యాగరాజాదులు తెలుఁగుననే కృతులు సేయుటయు, దాక్షిణాత్యగాయకు లాంధ్రకీర్తనలనే తఱచు గానము సేయుటయుఁ జూడఁ ద్రిలింగభాష గీర్వాణాది సమస్తభాషలకన్న మార్దవముఁ గల్గిన దని తెల్లము గాఁగలదు. మన యాంధ్రభాషయం దనేకము గ్రంథరత్నము లున్నవి. వీనిలో మూఁడువంతు లితర భాషలనుండి యనువాదితములు. ప్రాచీనకావ్యములు చాలవఱకు సంస్కృతమునుండి యాంధ్రీకరింపఁబడినవి. ప్రస్తుతకవులు పల్వు రాంగ్లేయ, హిందీ, మరాటీ, వంగాది, భాషాగ్రంథముల కనువాదము సేయుచుండిరి. అనువాదకుఁడు సంపూర్ణకవిలక్షణములు గల్గువాఁడు గాకపోయినను యితరభాషాకవిరహస్యములను దెలుపుచు భాషకు మహోపకారి యగుచున్నాఁడు. తిక్కన, పోతనాది మహాకవు లనువాదకు లయ్యును, తమ కృతిరత్నములందు స్వతంత్రశక్తిని జూపి వన్నె కెక్కినారు. కవిబ్రహ్మ నిజహృదయకేదారంబున భావామృతసస్యములఁ బండించి రసికులకు విందుచేసినాఁడు. అద్వైతిభావనావశమునఁ దాను పరబ్రహ్మమగునటుల కవి భావనావశమున సర్వప్రపంచము తా నగును. ఏసమయమం దేయే స్థితిగతులయం దెట్టి రసపోషణమును గావింపవలయునో వాని నెల్లఁ జూపెట్టును. చిత్రకారుఁడు ప్రకృతిని జిత్రించి యద్భుతానందముల నొందించునటుల కవి స్వభావకల్పనలచే మెప్పువడయును. హేమంతమును వర్ణించుచోఁ దుషారబిందువులచే మేను తడసినటులనే యుండును. వసంతమును నుడువుచో నందనోద్యానమునఁ దాను విహరించునటులనే యుండును. కవి యజరామరుఁడై రసజ్ఞహృదయవీథుల నెల్లపుడు విహరించుచుండును. పురాతనాధునాతన ప్రపంచకము నాగరకతను జాటుచుఁ బ్రజల యుత్తమజీవనమునకుఁ గవులే కారణభూతులు. "ద్విత్రా ఏవ కవయః ద్విత్రాణ్యేవ కావ్యాని" యని యానందవర్ధనుఁడు వాక్రుచ్చినట్లు భాషాప్రపంచ మంతయుఁ గాలించిచూచిన కొలఁదిమంది సత్కవులును కొలఁదిగ సత్కావ్యములును జూపట్టును. వ్రాసిన వెల్లను కావ్యములు గావు. వ్రాయువా రెల్లరు కవులు గారు. కవి యౌచిత్యవిచారదక్షుఁడును దీర్ఘదర్శియు నిర్లోభుఁడును సత్యవాక్కును రససిద్ధుఁడు నయి యుండవలయును. దేశాటనము పూర్వకృతి విమర్శనము సాధుదుర్జనచేష్టా పరిశీలనము ధారణాశక్తియు కవివిజ్ఞానమునకు సాధనములు.

ఔచిత్యము

ఔచిత్యమే కావ్యమునకు జీవితము. వివిధాలంకారములు గాని మిథ్యాకల్పితగుణగణంబులు గాని యౌచిత్యహీన మగు కావ్యమునకు మృతకళేబరమునకుం బోలె వన్నెఁ గూర్పవు. ఉచితస్థానముల నెలకొల్పఁబడిన యలంకారములును, గుణములును, కృతికన్యను శోభాధన్యను గాఁ జేయును.

శ్లో. కంఠే మేఖలయా నితంబఫలకే తారేణ హారేణ వా
పాణౌ నూపురబంధనేన, చరణే కేయూరపాశేన వా
శౌర్యేణ ప్రణతే రిపౌ కరుణయా, నాయాంతి కే హాస్యతా
మౌచిత్యేన వినా రుచిం ప్రతనుతే నాలంకృతి ర్నో గుణాః.

అనఁగ వడ్డాణమును కటిప్రదేశమున ముత్యాలహారమును, హస్తముల కందెలును, పాదములకు బాహుపురులును, వినతునిపైఁ బీరమును, అరిపైఁ గరుణయు, నపహాస్యతామూలకంబు లగునట్టులనే ఔచిత్యశూన్యంబులగు కావ్యములును భవ్యములు గావు. కాన నిట్టి యౌచిత్యానుభవమునకై కవి దేశకాలజ్ఞానమును లెస్సగ సంపాదింపవలయును. పూర్వకృతులను సవిమర్శముగఁ దిలకింపవలయును. హిమానీదూషితంబు లగు నైకోపాఖుండారామములు పరిణత ఫలనత శాఖాయుత చూతశోభితంబు లని వర్ణింపరాదు. హూణాంగనాముఖ హేమాంభోజంబు చికురభ్రమరలలితంబని నుడువరాదు. భాగీరథీ గ్రీష్మశోషితపయోధార యని పలుకఁ గూడదు. కమలాసనాసీనయై భృంగము సంగీతముఁ బాడుచున్న దనిగాని, కోయిల కూఁతలకు వెఱచి రాయంచలు మానసకాసారమున కరిగెననిగాని, శంకరుఁడు శరత్పయోధరగాత్రుఁ డని గాని చెప్పుట యుపహాస్యము. కాంతాకేశపాశమును మాలకాకి యీఁకెలతోఁ బోల్చుట యుచితమా? ధీరోదాత్తునకు లాఘవముఁ గూర్చుట న్యాయ్యమా? అయ్యది ప్రసంగోచితముగను వన్నెలును చిన్నెలును గలిగినదిగా నుండవలెను. పురాతనకావ్యము లాధునికకావ్యములట్లు కథాప్రధానములు గావు. ఔచిత్యప్రధానములు. కనుకనే తృతీయపథగామి యగు మురారిమహాకవి రామవాలిసంగ్రామమును ప్రత్యక్షముగఁ జూపినాఁడు. కాళిదాసమహాకవి పద్మపురాణమందలి కథను పుచ్చుకొని యభిజ్ఞానశాకుంతలమెంత మనోహరముగ వ్రాసినాఁడు. శకుంతలాదుష్యంతుల దాంపత్యధర్మముల నుపపాదించుటలో నౌచిత్యముఁ జక్కఁగఁ బోషించి మూర్తీభవించిన వారి ప్రేమ దేవతను గన్నులకుఁ గట్టినాఁడుగదా! ఇంతయేల? తిక్కన కవిబ్రహ్మ యౌచిత్యమును పాటించియే గదా భారతమును బలుచోట్ల మార్చి వ్రాసినాఁడు. కాన నాధునిక కవు లెల్లరు నిరర్థకము లగు నవధానము లందును, ఆశుకవి, బాలకవిత్యాది

విషయ సంపాదనము లందును మనసుఁ దోఁచనీయక పూర్వగ్రంథ పరిశీలనమునఁ దమ బుద్ధికిఁ బదను పెట్టుచు దేశకాల జ్ఞాన సంపాదనమునఁ దమజ్ఞానము నినుమడింపఁ జేయుచు, మఱియుఁ దగిన సాధన సామగ్రితో నుత్తమ కావ్య నిర్మాణమునకుఁ గడఁగినచో, మన యాంధ్రభాషయందు పెక్కు లుత్తమము లగు స్వతంత్ర కావ్యములు బయలు వెడలును. ఇప్పుడు మన యాంధ్రులు - ఇంగ్లీషు బెంగాలీ మరాఠీ హిందీ మొదలగు భాషాగ్రంథములను తర్జుమా చేయుచున్నట్టులు అప్పుడు వారే మన యాంధ్రగ్రంథములను స్వభాషలోనికిఁ దర్జుమా చేసికొందురు.

కాళిదాస మహాకవి పద్మ విష్ణు వాయుపురాణము లందలి యంశములఁ బుచ్చుకొని రఘువంశమును, శైవపురాణ జ్ఞాన సంహితయందలి యాశయమును గ్రహించి కుమారసంభవమును, పద్మపురాణ స్వర్గఖండమందలి కథాభాగముఁ దీసికొని యభిజ్ఞానశాకుంతలమును రచించెను. ఇటులనే పలువురు సంస్కృత కావ్యములను రచియించిరి. వీరి

**కావ్యముల యుద్దేశము**

యుద్దేశము కథలను దెల్పుట కాదు. విజ్ఞేయాంశములను విననివారికిఁ గూడ నభిరుచిఁ గల్పించి యందములను చందములను చిత్రము లగు రీతులను నీతులను జేర్చి హృదయరంజకముగ నుపదేశించుటయే వీరి తలంపు. ఈ యాశయమునే కాళిదాసమహాకవి రఘువంశమున సూచించినాఁడు.

శ్లో. అథవా కృతవాగ్ద్వారే వంశేఽస్మిన్ పూర్వసూరిభిః
మణౌ వజ్రసముత్కీర్ణే సూత్రస్యేవాస్తి మే గతిః.

పురాణగాథలు వజ్రముచేఁ దొలివేయఁబడిన రత్నములు. తన కావ్య మాయంశముల నేకత్రఁ గూర్చి ధారణాయోగ్యముగాఁ జేయు సూత్రమని భావము. కావ్యప్రయోజనముఁ గూర్చి కావ్యప్రకాశకారుఁ డిటుల వక్కాణించినాఁడు.

శ్లో. కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యః పరనిర్వృతయే, కాంతాసమ్మితతయోపదేశయుజే.

కావ్యము కీర్తి నొసంగును. కీర్తిమంతు లుత్తమ లోకమున నుందురు. పురుషార్థములు బోధింపని కావ్యము లసత్కావ్యములుగఁ బరిగణించుటచే నుత్తమకావ్యములు పురుషార్థము లొసంగును. దేశకాలజ్ఞుఁ డగు కవిచే వ్రాయఁబడిన కావ్యము లోకవ్యవహారమును బోధించుచు నమంగళములను బోఁగొట్టును. వెంటనే హృదయముఁ గఱఁగించి సుఖముఁ గూర్చును. మచ్చకంటులవలె వలయు నంశములను దెల్పుటయే చెల్వును.

పదగ్రాహణము మాత్రమే ఫలముగాఁ గలిగి ధ్వని విరహితంబులగు కావ్యములు తాదృశము లగు కాంతానూపురంబుల వలె హృదయరంజకములు గావు.

*గీ. ధ్వనిరహితము పదగ్రాహపరము నగుచు
కేళియందున మంజీర లీల ధీర
నదములందున కావ్యమ్ము హృదయమునకు
శ్రవణమున కేని మోద మొసంగ లేదు.

"అవ్యంగ్య మవరం స్మృతం" మ్మని అలంకారికులు చెప్పినటుల నవ్యంగ్యములగు కావ్యము లధమములు. ఉత్తమ కావ్యములు ధ్వని ప్రధానములు.

మ. ఫలభారమ్మున వంగ మెల్లఁ గరముల్ వంగెన్ జుమీ, యన్నిదిక్కుల సౌరభ్యము పర్వె, నైనను శ్వపాకుల్ నీపయిన్ గుండబొచ్చెల నెల్లప్డుఁ దగుల్చుచుందు రను హాచ్చెంబొందు బాధించుచూతలతా! సత్ఫల వయ్య నిష్ఫలవుగా! తర్కింప నా నిందులన్.*

ఉ. రాజనిభాననా! సరసురాలవు, జబ్బుగ నల్లినా వదే
మే జడ? యింతకంటె వలెనే? వల నొప్ప బిగించి యల్లవే
రోజవరాల! వేఱె పని యున్నది; దోసము దోసమె మహా
రాజగు నట్టి యవ్విజయరాఘవు పైఁ జిగురాకు కోమలీ!
(పూర్వుల చాటువు).

**రసము**

కావ్యమునకు జీవకళఁ దెచ్చునది రసమే. రసము లేక నాలుగు జల్లిపదము లల్లిన మాత్రాన నది కావ్యము గాదు. సత్కావ్యములు బహిరంత స్స్ఫురద్రస ప్రవాహముల నొప్పారు చుండును.

గీ. అంతరంబున గూఢమౌ యర్థములను
గోచరము సేయక ప్రసాద గుణము లేకఁ
దనరుచుండెడు కావ్యన దమ్ముల రస
మరయఁగా రసజ్ఞానంద కరము గాదు.

పండితపామరాది ప్రజలకే కాక, పిపీలికాది బ్రహ్మపర్యంతము గల జీవరాశికిని యా యా సమయములయం దంతరంగములు నార్ద్రములుగ గావించి సంతోషవార్ధియం దోలలాడఁ జేయుచు సహృదయ హృదయకుహరములనుండి వెల్లువగ ప్రవహించునదియే రసము.

కావ్యోపాత్తములు గాని యభినయోపదర్శితములు గాని విభావానుభావ సాత్త్విక వ్యభిచార భావములచే శ్రోతృప్రేక్షకాంతః కరణములకుఁ బరివర్తనముఁ గలిగించు రత్యాది స్థాయిభావమే రసము. ఉప్పుసంద్రమువలె స్థాయీభావము విరుద్ధావిరుద్ధ భావములచే మార్పుఁ జెందక, ఇతరభావముల కాత్మభావ మొసంగును.

చ. అసమశరోత్సవంబునఁ గ తాంతుకయౌ ప్రియమాడ్కి నుల్లసద్రసముఁ జెలంగు వాణి ప్రమదం బొనగూర్చును శుద్ధయయ్యు. నీరస యగు వాణి యాకరము రాజదలంకృతియుక్త యయ్యు. మానసమున సాలభంజికవలె నవ్యముదం బొనగూర్ప నేరికిన్.

రసావిస్ఫురణమునకు (ఉదాహరణము)

సీ. లలనాజనాపాంగ వలనావసదనంగ
తులనాభికాభంగ దోఃప్రసంగ
మలసానిలవిలోల దళసాసవ రసాల
ఫలపాదరకుకాల సనవిశాల

* ఉదాహృత పద్యములు మా రచించిన శృంగారసప్తశతి లోనివి. (వేం. శ.)

మలినీకరదనీక మలినీకృత ఘనీక
యలినికుఖచిత కోకముల ఖధూళి
మతికాంత సలతాంత లతికాంతర నితాంత
తతికాంతర ఇతాంత సుతను కాంత
వ. మకృత కామోద కురవకా వికలవకుల
ముకులసకల వనాంత ప్రమోదచలిత
కలిత కలకంఠముల కంఠ కాకలీవి
భాసురము వెల్బు మధుమాస వాసరంబు. (వసుచరిత్ర.)

సరస కవిత్వము

మ. తమిఁ బూఁదీఁగెలఁదూఁగుటుయ్యెలలఁబంతాలాడు చుందూఁగునా
కొమరుంబ్రాయఁపుగబ్బిగుబ్బెతలయంఘ్రుల్ చక్కఁగాఁ జాఁగిమిం
టిమొగంబై చనుదెంచు శీవిఁ గనుఁగొంటే! దివ్యమౌనీంద్ర! నా
కమ్రుగీనేత్రలమీఁదఁ గయ్యమునకుం గాల్ దాఁచులాగొప్పెడున్.
(కళా)

సీ. ఉష్ణాన హోమాగ్ని నూఁద నొల్లఁడు గాని
విరహజ్వరార్తుఁడై వెచ్చ నూర్చు
సంధ్యకు బ్రార్ఘ్యాంజలి ఘటింపఁడు గాని
యొరఁగు నీర్ష్యాకషాయితల కర్ఘ్య
సాగమవాదంబు లెఁగా దనఁడు గాని
విటవాదములు తీర్చు వేగిలేచి
కంబుభృత్పాదోదకంబు గ్రోలఁడు గాని
యాపతాధరసీధు వాని చొక్కఁ
తే. బుణ్యచిహ్నంబు లపఘనంబున ఘటింప
సిగ్గుపడుఁగాని కరనఖ శిఖరలిఖిత
జాత నూత్న క్షతాంకముల్ సమ్మతించు
నారజముమీరి యా దుర్విహారహారి.

ఉ. నాదు సహోదరుండు సుజనస్తవనీయనయప్రసక్తి, బ్ర
హ్మాదుల మెచ్చఁ, డే నతనియజ్ఞమునం గడుఁ బూజ్యురాలనై
వేది యలంకరింతు నని వేవురిలోపల నాడుకొందు నీ
వేదియు లేక సర్వగుణహీనుఁడవౌట యెఱుంగఁ దమ్ముఁడా.
(పాండురంగ మాహాత్మ్యము)

ఉ. ఏవనితల్ మముం దలఁప నేమిపనో? తమ రాఁడువారు గా
రో? వలపించు నేర్పెఱుఁగరో? తమ కౌఁగిటిలోన నుండఁగా
రా వదియేమిరా? విజయరామ యటం చిలు దూతి బల్కఁచేఁ
దీవరతోన్నై పెనఁగి లీసుక వచ్చితివా? తలోదరీ! (చాటువు)

ఇట్లు రసము చిప్పిలునట్లు వ్రాయఁబడిన గ్రంథరాజములే పాఠకులను శ్రోతలను మెచ్చుకొనఁగ సంపాదించు కొనఁగలవు. అప్పుడే విద్యాదేవత శ్రోతల భావవీథులఁ బ్రవేశించి విముఖులనుఁ గూడ వెంబడించి, మంజుల నూపురశింజాధ్వనులనుఁ జేయుచు నవిద్యా నిద్ర నుండి మూఢులను సైతము మేల్కొల్పుచు నజ్ఞానాంధకార మగ్నులకు మంచిత్రోవఁ జూపఁగలదు. రసప్రాధాన్యమును గూర్చి ధ్వన్యాలోకమున నిట్లు చెప్పఁబడెను. "కవి నా ప్రబంధ ముపనిబధ్నతా సర్వాత్మనా రస పరతంత్రేణ భవితవ్యంతత్రేతివృత్తే యది రసాననుగుణాం స్థితిం పశ్యేత్తాం భంక్త్వాపి స్వతంత్ర రసానుగుణం కథాన్తర ముత్పాదయేత్. నహికవే రితివృత్త మాత్రనిర్వాహణేన కించిత్ప్రయోజనం, ఇతిహాసాదేవ తత్సిద్ధేః" ప్రబంధము వ్రాయుకవి యన్ని విధముల రసమునకు లోఁబడి యుండవలెను. ఇతివృత్తమునందు విరసంబగు విషయ మున్నను దానిని మార్చియైనను రసానుగుణంబుగ వ్రాయవలెను. కథా నిర్వహణ మాత్రమున కవి కేమియుఁ బ్రయోజనము లేదు. ఇతిహాసమునుండియే యది యలవడును గదా! యని భావము. ఇట్టి రసవత్తరములైన గ్రంథముల నిర్మింపఁ దొరకొనుటయేగాక-ఆంధ్రమున నిదివఱకు వెలువడిన యుద్గ్రంథములను సదుద్దేశముతో విమర్శింప వలయును. ఉత్తమ కావ్యములకు ఔచిత్య

ఆవశ్యక గ్రంథములు

విమర్శన, రస వివేచన, ధ్వన్యర్థ స్ఫుటీకరణపూర్వకముగ వ్యాఖ్యలు రచింపఁ జేయవలయును. క్షేమేంద్రుని యౌచిత్య విచారచర్చ సువృత్త తిలకము ధ్వన్యాలోకమువంటి గ్రంథములును, ఆంధ్రభాషకు సంపూర్ణ వ్యాకరణమును. వెలువడవలయును. ఆంధ్రభాషా ప్రాశస్త్యమును దెలుపు గ్రంథములను, ఇతరభాషలందు వ్రాయించి బుద్ధిమంతులు గల దేశములలో వెల్లడిచేయుచు, నాంధ్రభాషా ప్రచారమున్నట్టుఁ గూడఁ జేయించుట ఉత్తర కాలక్షేమకర మనిమాతలంపు. మఱియు మన యాంధ్రాక్షరములలోఁ గొన్నిఁటికి అరవము బెంగాలి మొదలగు నక్షరముల పోలిక కలదు. తావత్తు, క్యావడి, త్రావడి మొదలగు వత్తులు బెంగాలీ వత్తులను బోలియుండును. ఇ, ఒ, ఖ, ఘ, చ, ఠ, ద, ధ, ల, మొదలగునవి మలయాళాక్షరములనుబోలినవి గూడ కలవు గాన నాంధ్రాక్షరముల కితరభాషాక్షరములతోఁ గల సంబంధమును దెలుపుచు నాంధ్రవర్ణోత్పత్తి యను గ్రంథమును సమర్థులు వ్రాయవలయును. శ్రీ సూర్యారాయనిఘంటువుచే నాంధ్ర శబ్దముల కొఱఁత దీరినది. ఈ గ్రంథమువలన నక్షరముల కొఱంతగూడఁ దీరగలదు. ఇట్టి యుద్గ్రంథములను వెలువరించి యాంధ్ర భాషను సమస్తాభ్యుదయ సమన్వితముగా జేయుటకు భాషాభిమానులు పూనుకొనవలయు నని కోరుచున్నాము.

# ఛందోరహస్యదర్పణము: పద్యరచనావ్యవస్థ

గిడుగు వెంకటసీతాపతి గారు, బి. ఏ., ఎల్. టి

కోట్లకొలదిగా ఉన్న రాగములు 72 మేళకర్తల నుండి పుట్టినట్లు సంగీతశాస్త్రజ్ఞులు రాగ విభాగము చేసినారు. కోట్ల కొలదిగా ఉన్న వృత్తములు 26 ఛందములనుండి పుట్టినట్లు ఛందశ్శాస్త్రజ్ఞులు వృత్తవిభాగము చేసినారు. అయితే, సంగీతశాస్త్రజ్ఞులు చేసిన రాగవిభాగమునకున్ను ఛందశ్శాస్త్రజ్ఞులు చేసిన వృత్తవిభాగమునకున్ను వ్యవస్థాసాదృశ్యము లేదు. ఒక్కొక్క మేళకర్తను బుట్టిన రాగములకు గల పరస్పర సంబంధము రాగమునకు జీవనమైన స్వరములను బట్టి ఉన్నది; గాని, ఒక్కొక్క ఛందమున పుట్టిన వృత్తములకు గల పరస్పర సంబంధము వృత్తములకు జీవనమైన నడకను (Rhythun) బట్టిలేదు. ఇందుకు నిదర్శనముగా ఒకటి చూడండి:—

29-వ మేళకర్తయైన ధీర శంకరాభరణమున బుట్టిన ఆరభి, బిలహరి, దేవగాంధారి మొదలయిన రాగము లన్నిటికిన్ని ఒక్కవిధమైన స్వరములే (అనగా షడ్జమము, చతుశ్రుతి రిషభము, అంతర్గాంధారము, శుద్ధమధ్యమము, పంచమము, చతుశ్రుతి ధైవతము, కాకలినిషాదము) ఉండును. గాని,—మాటకు—పంక్తి యను పదియవ ఛందమున పుట్టిన వృత్తములకు నడక ఒక్కలాగుననే ఉండవలెనన్న నియమము లేదు. చూడండి:—

1. చంద్రవదన * సాయకాగ్నులన్ - (ఇది మూడు మాత్రలకు విరుగుతూ 'త్రిశ్ర' గతిని § నడుచును.)
2. నలగగ గాగాల్ * నాళీకాక్షా-(ఇది చతురస్రగతిని నడుచును.)
3. దీపింప నిది యొప్పు * దివ్యమై - (ఇది 5 మాత్రలకు విరుగుతూ ఖండ గతిని నడుచును.)
4. కంజాక్షున్ * కంబుగళున్ గీర్తించున్ - (ఇది 6 మాత్రలకు విరుగుతూ రూపకతాళమునకు సరిగా నడుచును.)
5. శైల విరతులు * సాగుచుండున్-(ఇది 3 + 4=7 మాత్రలకు విరుగుతూ మిశ్రగతిని నడుచును.)
6. గోత్ర విశ్రమము * గూడున్ శౌరి - (ఇది 8 మాత్రలకు విరుగుతూ ఆదితాళమునకు సరిగా నడుచును.)
7. కాలాగ్ని చంద్రుల్ * గల్గించు సంఖ్యన్ - (ఇది 5 + 4=9 మాత్రలకు విరుగుతూ సంకీర్ణగతిని నడుచును.)
8. మహాశయుల్ * మహోన్నతుల్ ధరన్-(ఇది త్రిశ్రగతిని విలోమముగా నడుచును.) †
9. ఖగేంద్ర యానా * గజేంద్రపాలా - (ఇది విలోమ చతురస్ర గతిని నడుచును.)
10. భజింతున్ నుతింతున్ * వాసుదేవున్ - (ఇది విలోమఖండ గతిని నడుచును.)

పై నుదాహరించిన వృత్తపాదము లన్నీ పదియవ ఛందమున బుట్టిన వృత్తముల పాదములే అయినా ఒకొక్కటి ఒకొక్కలాగున నడుచును.

అంతేకాదు, ఒక వృత్తములో ఉండవలసిన గణములు ఎన్ని విధములుగా నడిపించ వచ్చునో చూడండి:—

(1) ∪| ∪| ||| |∪
(2) ∪| ∪||| ||∪
(3) ∪| ∪|| ||| ∪
(4) ∪| || |||∪

మూడక్షరము లొకగణ మన్న సంప్రదాయ మనుసరించి అన్నిటను "రనస" గణములే ఉన్నవని చెప్పవలెనట.

1. శౌరి ముద్దు పలుకు వినన్
శౌరి మోము సొగసు గనన్ (3 + 3 + 3 + 3 మాత్రలు) = 12
శౌరి తోడ నెపుడు చనన్
గోరు చుందు మదిని సదా.

2. శౌరి పాటలను వినుమా.
శౌరి రూపమును గనుమా (3 + 5 + 4=12)
శౌరి చెంతకును జనుమా
శౌరి చిత్తమున నిడుమా.

3. శౌరి పాటలు వినుటకున్
శౌరి రూపము గనుటకున్ 3 + 4; 3 + 2=12)
శౌరి చెంతకు జనుటకున్
గోరు చుందును మనమునన్.

4. న్యాయమా ప్రియ సుదువుమా.
ప్రేయసిన్ నను వదవిలో (5 + 2 + 5=12)
బాయుటే! నిను వెతకుచున్
రోయుదే! మరి పగులగాన్

ఈ నాలుగున్ను భిన్నవృత్తముల వలె నడుచు చున్నా ప్రతి దానిలోను "రనస" గణములే ఉన్నవి; గనుక, ఇవి అన్నీ పాలమంజరీ వృత్తములే అన వలెను గదా! మూడక్షరముల కొక గణమన్న సంప్ర

---

* ఈ శీర్షిక క్రింద నే నిదివరకు "తెలుగు" అనే పత్రికలో 5, 6, 7, 8 సంచికలలో వ్రాసిన వ్యాసములు చూడండి.

§ త్రి * అస్ర=త్ర్యస్ర అని ఉండవలెను; గాని సంగీతపుస్తకములలో త్రిశ్ర అని ఉన్నది. గనుక వ్యవహారములో ఉన్నట్లే వ్రాసినాను.

† ఇది మృదంగ వాద్యములో ఎదురుదెబ్బవంటిది. రామ రామ రామ, అనునది అనులోమగతిని; 'రమా రమా రమా' అన్నది విలోమగతిని నడుచును.

దాయ ముండబట్టి, అన్నిటను గణము లొకటే అని భ్రమ పుట్టు చున్నది; గాని నడకను బట్టి గణ విభజన మున్నయెడల, అట్టి భ్రమ కలుగదు.

ఇఁకను ఒక్కలాగుననే కొన్ని పద్యములు నడిచినా పాద మందలి గణములున్ను, అక్షరముల సంఖ్యయున్ను మారిన వని వాటికి వివిధ నామములు పెట్టినారు. చూడండి:—

1. శౌరిం జూడన్ * సంతోషింపుమన్ (8-వ ఛందము మొదటివృత్తము)
2. శౌరిని జూడన్ * సంతోషించున్ (9-వ ఛం. 7-వ ,,
3. శౌరిని జూడఁగ * సంతోషించున్ (10-వ ఛం. 55-వ ,,
4. శౌరిని జూడఁగ * సంతస మొందున్ (11-వ ఛం. 439-వ వృ.
5. శౌరిని జూడఁగ * సంతస మొదవున్ (12-వ ఛం. 1975-వ వృ.
6. సరసిజ నేత్రుని * సద్గుణ చరితున్ (13-వ ఛం. 3952-వ వృ.)
7. సరసిజ నయనుని * సద్గుణ చరితున్ (14-వ ఛం. 7935-వ వృ.)
8. సరసిజ నయనుని * సదమల చరితున్ (15-వ ఛం. 16384-వ వృ.)

ఇవి అన్నీ ఒక్కలాగుననే నడిచినా- భిన్నచ్ఛందోవృత్తపాద ము లని మన శాస్త్రమును బట్టి చెప్పవలసి వచ్చినది.

భిన్న భిన్నముగా నడిచే వృత్తములు ఒక్క ఛందము నుండే పుట్టుటయున్ను, ఏకరీతిగా నడిచే వృత్తములు వివిధచ్ఛందములనుండి పుట్టుటయున్ను, చూడఁగా వృత్తవిభాగము నడకను బట్టి లేదనుట స్పష్టము.

మూడక్షరము లొక గణముగా ఎన్నుటచేత గణనామముల బట్టి పద్యముల నడక తెలుసుకొనుట కష్టము. ఉత్పలమాలా చంపక మాలలున్ను, శార్దూల మత్తేభములున్ను, మానినీ కవిరాజవిరాజిత ములున్ను, ఏకరీతిగా నడిచినా, లాక్షణికులు పెట్టిన గణనామ ములను బట్టి, విశేషముగా భిన్నములైన వృత్తములవలె కనఁబడును. మానినికి ఏడు భగణములున్ను గురువున్ను గల వనిన్ని, కవిరాజ విరా జితమునకు ఒక నగణము, ఆరు జగణములు, లగము కలవనిన్నీ చెప్పిన యెడల, ఆ రెండు వృత్తములకు గల సామ్యము బోధపడదు. గాని, ఒక నలమున్ను, 6 భగణములున్ను గురువున్ను ఉన్నవని చెప్పిన యెడల, బోధపడఁగలదు. అంతేకాక, నడకను బట్టి గణవిభజన మేర్పడును.

పొత్తులెడఁ బాయుటన్న బోయిసమ యంబునను
బొంగుచుఁ గురూద్వహుల నెల్లన్

ఈ లాగున అయిదు మాత్రల గణములైన భిలములు కనబడు నట్లు గణ విభజనము చేయుట సహజముగా నుండును; పద్యగమనము గుర్తించుటకు అనుకూలము బాగా నుండును. అంతేగాని—

భ జ స న భ
పొత్తులె డఁబా యుటను * బో యసమ యంబున
జ స న గగ
ను * బొంగు చుఁ గురూ ద్వహుల నెల్లన్

అని గణవిభజన చేయుటచేత మంగళమహాశ్రీవృత్త గమన మునకు సరిగా లక్షణము చెప్పలేదు. అంతే కాక, యతిస్థానములు గణముల నడుమ నుండునట్లు గణ విభజనము చేయుట సమంజసము కాదని నాయభిప్రాయము.

గణవిభజనము పద్యముల నడకను బట్టి చేసుకొనే సంప్రదా యము లేకపోవుటచేత, కొన్ని కొన్ని వృత్తములు చక్కగా నడి పించుటకు అవకాశ మున్నా, లక్షణకర్తలు తమ లక్ష్యలక్షణ పద్య ములు వ్రాయవలసినట్లు వ్రాసినారు కారు. అందుచేత చక్కని వృత్త ములు ప్రచారములోనికి వచ్చినవి కావు. ఇందునకు నిదర్శనముగా- గ్రంథవిస్తర భీతిచే - మూడు మాత్రమే చూపిస్తున్నాను:—

1 పాలాశదళము (దీనికే త్వరితగతి యని కూడా, పేరు కలదు)

అదనదనున హరినుతు * లమరు ధరఁ బాలా
శదళ మనఁ దనరుఁ గవి * జనులు వచియింపన్
బదునొకఁ డగునెడ యతి * పదిలమునఁ జేరన్
గదియు నగణము లయిదు * గగముతుద నొందన్ (అప్పకవి)

ఇంతకంటె,

అయిదునము లొకగగము * నయిదయిదు మాత్రల్
లయఁజనును త్వరితగతి * లములు పది సాగన్
నియమమున వడియమర * నిలుచు శ్రుతి కింపై
కయితలన్న దనరునిది * ఖగతురగ శౌరీ.

అని లక్ష్య లక్షణపద్య మున్నయెడల పద్యగమనము వెంటనే పట్టు పడును.

2. విచికిలిత

ప్రవిలయ సమయమునను బద * పడి జలనిధి నడుమ స
ద్భువనములు కడుపున నిడుక * భుజగపతి శయనము పై
నవిరళమతిఁ గురుకువరదుఁ * డని విచికిలితఁ బదు మూఁ
డవ యెడ వడి యిరువదియొక * లఘువుగముబలుకనగున్
(అప్పకవి)

ఇటువంటి లక్ష్య లక్షణ పద్యమునుబట్టి దీని నడక ఎట్లు తెలుసుకోగలము? ఇందులో 21 లఘువులున్ను చివరను గురువున్ను గలవు గనుక, తిశ్రగతిని సులభముగా నడిపించవచ్చును. తిశ్రగతి గణములు:—హగణము,నగణము. 7 హగణములున్ను గురువున్ను గలది సుగంధి; 7 నగణములున్ను గురువున్ను గలది విచికిలిత; హగణ నగణ ములలో ఏవయినను 7 గణములున్ను గురువున్ను గలది ఉత్సాహము. విచికిలిత ఎట్లు చక్కగా నడుచునో చూడండి :—

మునుల వలపు, నబల బలము, * ముదిమి సొగసు, కలసిరుల్,
చెనటిహితము,విషముచియు, * చెలిలసుఖము,పగహితుల్,
తనివి త్రవను, కపికి సిరత, * తమికి వెలుఁగు, నెగవగల్
తనికె కుక్షితి, విలువసము, * సవతి చెలిమి, కలుగునే?

3. తురగము

నననన సజజగలు తిథివిరమ * ణంబగున్ దురగంబునన్
గనలుచు నగరముపయి విడిసిన * గాంచి తానొకరుండెదు
రొక్కనిదవులకుఁ గొనిచనిగిరిగుహఁ*గూర్కునాముచికుందు చే
తను యవనునిఁ బొరిగొనితనివను * ధన్గణింతురు భూసురుల్.
దీని నడకతీరు కనుగొనుట శక్యమగునా? ఇదే— [(అప్పకవి)

వనల యుగళము హాభము రగణము * నాల్గుపంక్తులనొప్పఁగా
ధనరు విరమము ననలయుగళము * దాటఁగాఁ దురగంబునన్

అని యుంటే, మత్తకోకిల, తరళ, కరిబృంహితమువలెనే తురగము కూడా మిశ్రగతిని నడుచునని సులభముగా బోధపడగలదు.

నడకనుబట్టి గణవిభాగము లేకపోవుటచేత గణములబట్టి పద్యములకూర్పు ఉండవలెనన్న నియమము ఏర్పడినది కాదు. వృత్తపాదముల గణవిభజనము అసందర్భముగా ఉండడముచేత కలిగిన అనర్థము కొందరు వ్రాస్తూయున్న జాత్యుపజాతి మొదలయిన దేశ్యపద్యములలో కనబడుచున్నది. ఈ దేశ్యపద్యములకు లక్షణము చెప్పినవారు నడకను బట్టి వాటిలో ఉండవలసిన గణములనే పేర్కొన్నారు. అయితే నేమి? గణములబట్టి పదములకూర్పు వృత్తములలో పాటించలేదు గనుక దేశ్యపద్యములల్లో సయితము పాటింప నక్కరలేదన్న భ్రమ కలిగినది.

నాలుగుమాత్రల గణములైన నల, గగ, భ, జ, స గణములతో కంద ముండునంటే, చతురస్రగతిని పద్యము నడుచునని స్పష్టముగా కనిపిస్తూ యున్నది. గనుక, ఈ దిగువనిచ్చిన పద్యములు కంద పద్యములవలె కనిపించుచున్నా నడకనుబట్టి కందములు కావని చెప్పవలసెను.

1. చిలుక పలుకు చెవిని బడిన
చెలియ పలికె ననుచు దలఁచి * చెలిని బిలువఁగా
చిలుక మఱలఁ బలికె నతని
చెలియపలుకు గా దటంచు * చెప్పనటులుగా.

ఇది తిశ్రగతిని నడుచును గనుక, గతిని అనుసరించి త్రిమాత్రాగణములుగా గణవిభజనము చేయవలెను; గాని, నాలుగుమాత్రల గణములుగా గణవిభజనము చేసి ఇది కందపద్య మనరాదు.

2. చెలిపలుకె యగు ననుచు నొక
చిలుక పలుకు విని మదిఁ దలఁచి నిలిచి కనఁగా
చెలి యెచట నున్నదని యా
చిలుక యొక తఱవుపయి నిలి * చి చేసె రుతమున్

ఇది ఖండగతిని నడుచును; గనుక, కంద మనరాదు.

3. వనము నడుమను విశేషర
మణీయము లగు తరుల ను * మముల నెటులఁ జే
సెనో కద! యా బ్రహ్మ యని, క
డు నలరుచుండఁగ వసంతుఁ * డు పిలిచె నన్నున్.

ఇది కందమువలె కనబడును. గాని ఇందులో నడకకు నియమమేమీ కనబడదు. గనుక ఇది పద్యమా అని భ్రమకలుగజేస్యే గద అని చెప్పవలెను; గాని దీనిని కందమనరాదు. ఈలాగుననే మరియొక పద్యము చూడండి:—

ఒంపెకును సుందరత గేదె * కొడలి శుభ్ర
త ముసిఁడికిఁ దీపి కపికిఁ జి * త్తస్థిరత, క
లుకునకు బర్వు, కవికిఁ గ * లుములు, గులట
కును గృతజ్ఞత యాకాశ * కును మటులె

(ప్రచండచా. పు. 41)

ఇది తేటగీతి ఆకారమున నున్న గద్యముగాని పద్యము కాదు. దీనినడక ముళ్లపొదలు దాటుతూపోయే పొట్టవాని నడకవలె నున్నది.

దేశ్యపద్యములు మాత్రాగణయుతములు; గాని, వృత్తములు మాత్రాగణయుతములు కానక్కరలేదని కొందరియభిప్రాయము. గాని చక్కగానడిచే వృత్తములన్నీ మాత్రాగణయుతములనియే నావాదము. * మాత్రాగణయుతములు కాని వృత్తములు చక్కగా నడవకపోవుట చేతనే కోట్లకొలది వృత్తములున్నా అనేకములు ప్రచారములోనికి రాలేదు.

అయితే కొన్నివృత్తములు చక్కగానడుచును ; మాత్రాగణ సంయుతములైనట్లు స్థూలదృష్టికి కనబడవు; ఏల యట్లు నడుచునో సులభముగా పట్టుపడదు ; గాని, జాగ్రత్తగా విమర్శించి చూచిన యెడల వాటి నడకతీరునకు గల వ్యవస్థ బోధపడగలదు. ఇందు కొక నిదర్శనము:—ఉత్పలమాలా చంపకమాలా వృత్తములు చక్కగా నడుచు ననుటకు సందేహము లేదు. స్థూలదృష్టికి సమానమాత్రాగణయుతములయినట్లు కనఁబడవు; గాని వాటి పాదములు చతురస్రగతి, తిశ్ర జాతి త్రిపుటతాళమునకు సరిగా నడుచును. చూడండి:—

| తిశ్రజాతి లఘువు | దెబ్బ ఉసి | దెబ్బ ఉసి |
|---|---|---|
| సందియమేల సర్వగుణ | సంపదఁ జూడఁగ | బాహుకుండు భూ |

ఏదో ఒక తాళమునకు సరిగా నడచినా లయకు సులభముగా దొరకక, అప్రతిహతముగా సాగే ఉత్పలమాలా చంపకమాలల వంటి వృత్తములు అనేకముగా లేవు. వీటిలో చక్కని నడక ఉన్నది. గనుక ఇటువంటివి ఇంకా కావలెను. శోధనకోసము నేను వ్రాసిన వాటిలో ఒకటి:—

"కవికాంత"

§ కూరుఁడు వీర్యపరాక్రమోన్నతుఁడు సుశ్లోకుండు జనార్దనుండు కంసారి, మురాసురవైరి మాధవుఁడు సౌమ్యుండంచు వారిన్నుతింపఁగా

* నా వాదమును బలపరచినవారు బ్రహ్మశ్రీ బరియపల్లి మల్లయశాస్త్రి గారు (పర్లాకిమిడీ రాజావారి కాలేజీలో ప్రధాన సంస్కృతోపాధ్యాయులు.) వీరు పురాణము చదువుచు ప్రతిపద్యమున్ను లయకుగాని తాళమునకు గాని సరిగా పాడగలరు.

§ ఇది 22-వ ఛందమునందు 1412791-వ వృత్తము. నే నిప్పుడు క్రొత్తగా వ్రాసిన వృత్తము. గనుక రెండు మూడు సార్లు చదివితేనే కాని, పైవారికి దీనినడక వెంటనే పట్టుపడక పోవచ్చును. (పరిచితి లేక తొలిసారి చదివినప్పుడు ఉత్పలమాలాది వృత్తములను సయితము సంగీతవిద్వాంసులై చక్కగా నడిపించ లేరు.) అంతేకాక, పరిచితి గల వృత్తములవలె చదువబోయి నడువ దన్న భ్రమ పడవచ్చును. ఈ కవికాంతలో ప్రతిపాదము చతురస్రగతి, చతురస్రజాతి. త్రిపుటతాళమునకు సరిగా నడుచును. (అనగా క్రియకు నాలుగక్షరములు గల ఆదితాళము.)

'భారవమస్తగ' మొంచి విశ్వయతి * పాటింపన్ గవిశాంత యాకృతిన్ సూరిజనస్తుత వృత్తమై తనరు * సాంపారన్ గవి చెప్పఁ గల్గినన్.

ఈవిషయములన్నీ జాగ్రత్తగా పరిశీలించి, ఎటువంటి ఛందో వ్యవస్థ ఏర్పడినయెడల పద్యరచన హృద్యముగా నుండగలదు? అనే విషయముగురించి ఆలోచింపగా, ఒకమార్గము స్ఫురించినది. దానిని గూర్చి విపులముగా వ్రాయుటకు అవకాశము చాలదు. గనుక నా యభిప్రాయములను సంగ్రహముగా తెలియజేస్తున్నాను.

## 1. గణప్రస్తారము

1. ద్విమాత్రాగణములు:— U గ ; I I లలము
2. త్రిమాత్రాగణములు:— (తిశ్రగతిగణములు)

I I I నగణము }
U I గలము } ఇవి అనులోమమార్గమున నడుచును

I U లగము—ఇది విలోమమార్గమున నడుచును

3. చతుర్మాత్రాగణములు:— (చతురస్రగతి గణములు)

I I I I నలము }
U I I భగణము } (అనులోమ)
I I U సగణము }
U U గగము }

I U I—జగణము (విలోమ)

4. పంచమాత్రాగణములు:— (ఖండగతిగణములు)

I I I I I నలలము }
U I I I భలము }
I I U I సలము }
I I I U నగము } అనులోమ;
U U I తగణము }
U I U రగణము }

IUII జగణలఘువు }
IUU యగణము } విలోమ

5. షణ్మాత్రాగణములు:— (2 + 4 ; 4 + 2) రూపకతాళ గణములు
6. సప్తమాత్రాగణములు:— (మిశ్రగతిగణములు 3 + 4)
7. అష్టమాత్రాగణములు:— ఆదితాళగణములు (4 + 4; 3 + 5)
8. నవమాత్రాగణములు:— సంకీర్ణగతి గణములు (5 + 4)

పై నుదాహరించిన 5,6,7,8 విభాగములలోని గణములు మొదటి 4 విభాగములనుండి ఏర్పడును గనుక ఊహింపవచ్చును.

### 2. వివిధచ్ఛందములు :— వృత్తములు; పద్యములు

1. త్రిమాత్రాగణచ్ఛందము, అనులోమ తిశ్రగతి వృత్తములు, పద్యములు :—

పాదమునకు రెండు మొదలు 8 గణముల వఱకు ఉండవచ్చును. వీటికి చివరను గురువు చేర్చవచ్చును. మానవచ్చును. నాలుగు గణములకు తక్కువగా ఉండినయెడల విన సొంపుగా ఉండదు. రెండు గణములు గల పాదములు నాలుగు విధములుగా వ్రాయవచ్చును. ((1) UI, III; (2) UI, UI, (3) III, UI, (4) III, III). మూడు గణములు గల పాదములు 8 విధములుగా వ్రాయవచ్చును. ఎనిమిది గణములు గల పాదములు 28=256 విధములుగా వ్రాయవచ్చును; నాలుగుపాదములు ఒక్కలాగుననే ఉంచి వృత్తములు వ్రాయవలెనంటే 256 వృత్తములు వ్రాయవచ్చును; నాలుగు పాదములు నాలుగు విధములుగాను ఉంచి పద్యములను వ్రాయదలచినవారు 2564=4294967296 విధము లయిన పద్యములు వ్రాయవచ్చును. ఈలాగున తిశ్రగతి వృత్తములు పద్యములు ఎన్నికోట్లు పుట్టునో చూడండి. అన్ని చక్కగా నడవగలవు.

ఇదివరకు లాక్షణికులు చెప్పిన విభూతి, భోగివిలసితము, భద్రకము, శ్యేని, సుగంధి, విచికిలిత, ఉత్సాహము, మదనదర్పణము మొదలైన వృత్తములు, పద్యములు అన్నీ తిశ్రగతి పద్యజాతిలో చేరును.

2. విలోమ తిశ్రగతి వృత్తములు, పద్యములు:-

నీటిలో I U లగముతే ఉండును. రెండు మొదలు 8 వరకు గణములుంచి పాదములు కూర్చవచ్చును.

లక్ష్యములు :—

1. ఇదేయశిన్
మదాన్వితున్
సుదేవునిన్
వధించెదన్ (సునందినీ పరిణయము)

2. పంచచామరము (ఇదివఱ కున్నదే)

పరాత్పరున్ రమాపతిన్ భజించెదన్ మనంబునన్
(యతిస్థానము మార్చినాను)

3. అనులోమ విలోమగతులు కలిపి చెప్పవచ్చును.

1. వీను లలర వినం బడున్
2. సార దాది మౌని వరుల్
3. రామరామ హరేరామ రామరామ హరే హరే

### చతుర్మాత్రాగణచ్ఛందము

పై ఛందమునకు చెప్పినట్లే అనులోమ విలోమ చతురస్రగతి గణములతో కోట్లకొలది వివిధములైన పద్యములు చెప్పవచ్చును.

1. పాదమునకు రెండుగణములు గలవి:—

రెండే గణములు, ఉండన్ దీనికి...
వసుదేవసుతున్ బొసగింపు మనన్...

2. మూడుగణములు గలవి:—

స్తోత్రము సేయగ నొప్పన్
ధాత్రిని భాగగ యుక్తిన్ (చిత్రపదము)

ఈలాగునే మాణవకము, మొదలయిన వున్నవి.

3. నాలుగు గణములు గలవి.—విద్యున్మాలా, మత్తకీశమాలా, కుసుమవిచిత్రము, ప్రహరణకలితా, మత్తా, చంపకమాలీ, రుక్మవతీ, వృత్తము లెన్నో ఉన్నవి.

ఈ లాగుననే పాదమునకు 5, 6, 7, 8 గణము లుంచి చెప్పవచ్చును. మానిని, కవిరాజవిరాజితము మొదలయిన వాటిలో 7 గణములున్ను గురువున్ను కలవు. లాటీ, సరసీజ, క్రౌంచపద, భాస్కరవిలసితము మొదలయిన వాటిలో పాదమునకు 8 చతు

ర్మాత్రాగణము లున్నవి. పై నుదాహరించిన జాతులలో చివరగణము లఘ్వంతమైతే గురువు చేర్చవచ్చును.

భుగపతివాహ కపర్దినుతా

విలోమగతిని నడిచే గణములు కలిసిన పాదములు:—

1. జగదేకదేవ * సజసాయుతమై

2. సరోజనయనా * జలోద్ధతగతిన్

కందపద్యములు మొదలయిన వాటిలో జగణములు కనబడును.

## III పంచమాత్రాగణచ్ఛందము

అలసగతి, పద్మనాభము, మంగళమహాశ్రీ, లయగ్రాహి, లయవిభాతి మొదలయినవృత్తము లిదివరకు లాక్షణికులు చెప్పిన వున్నవి. ఇవిగాక పాదమునకు రెండు మొదలు ఎనిమిది గణములవరకు గణము లుంచి, కావలసినయెడల చివరనొకగురువు చేర్చి, కోట్లకొలది వివిధములయిన వృత్తములు కల్పించి చెప్పవచ్చును. భుజంగప్రయాతమువంటి పద్యములు విలోమమార్గమున నడుచును. ఈలాగుననే పై నుదాహరించిన మాత్రాగణప్రస్తారముబట్టి కొన్ని ఛందములున్ను ఆ ఛందములలో బుట్టిన వృత్తపద్యములున్ను ప్రత్యేకముగా ఒక లక్షణ గ్రంథము వ్రాసి వివరించి తెలియజేయవలయును గాని. ఒకవ్యాసమున స్పష్టముగా వ్రాయుట కష్టము.

పైని పేర్కొన్నవిగాక కొన్నికొన్ని మిశ్రమైనజాతులున్నవి. వాటిలో ద్విపద, తరువోజ, తేటగీతి, ఆటవెలది, సీసము ప్రచారములో నున్నవి. నన్నయకాలమువరకు మధ్యాక్కరలు ప్రచారములో నుండియుండును. గాని, (ఎఱ్ఱాప్రగడతప్ప) తర్వాతికవులు మధ్యాక్కరలు చెప్పినట్లు కనబడదు. వీటిఅన్నిటిలో సూర్యేంద్రగణము లుంటవి. అనగా, 3,4,5 మాత్రల గణములు అనేకవిధములుగా కలిసి వుంటవి. ఇదివరకు లాక్షణికులు చెప్పినవిగాక, మరికొన్ని కల్పించవచ్చును. సుమారు ముప్పదిసంవత్సరముల క్రిందట కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు వెండి, బంగారము మొదలయినపద్యములు చెప్పినారు; వాటిలో నడక చక్కగా వున్నదని చెప్పలేను; గాని, ఇప్పుడు కొందరు వ్రాస్తూవున్న "పాట్ట" పద్యములకంటె బాగానే వున్నవి. అయితే ఆదినములలో అన్నివిషయములందును నిరంకుశాధికారమునకు దాసులై ఆత్మగౌరవము సహజస్వాతంత్ర్యాభిలాష లేక యుండిరి గనుక వీరేశలింగము, కృష్ణయ్యవంటి పండితులకు క్రొత్త ప్రయత్నములు రుచింపలేదు. గురుజాడ అప్పారావుపంతులుగారు ముత్యాలసరములు వ్రాసినప్పుడు సయితము కొందరు పరిహసించినారు. ఇప్పుడు ఎందరెందరో వాటిని మెచ్చుకొంటున్నారు. పద్యముల నడక చెడినప్పుడు చూపించవచ్చును; ఎట్లు నడక బాగుపడునో చెప్పవచ్చును; గాని, క్రొత్తపద్యములు వ్రాయకూడదని శాసించుట అటువంటి శాసనమును మన్నించుట, అవివేకము. అనర్థకము.

దేవ కీ సుతుఁ డంత దే దీప్య మాన
అమర లో కంబు వే ళ్యల మైన మాకు

ఇటువంటి పాదములు ద్విపదపాదములుగాను తేటగీతిపాదములుగాను గణవిభజన చేయవచ్చును. దానిని బట్టి ఈ పద్యములకు గల సంబంధము బోధపడగలదు.

పృథుఁడు విశ్వ రుఁడను * పేరిపుత్రు నిఁగాంచె
నతని కిఁ జని యించె * శార్ఙ్గిఁ డనఁగ

ఇటువంటి పాదములు సీసపద్య పాదములుగాను ఆటవెలది పాదములుగాను గణవిభజనము చేయవచ్చును. దాని బట్టి సీసములకు ఆటవెలదులకు గల సంబంధము బోధపడవచ్చును. అందుచేతనే నన్నయ సాధారణముగా ఆటవెలదులనే సీసములందు కూర్చినాడు.

ఈ సీసగీతాదుల నడకను గూర్చి విశేషము వ్రాయుట కవకాశము లేదు. గాని, ఒక్కవిషయము సూచనగా మాత్రము తెలియజేస్తున్నాను. ఈ సీసాదులలోని ఇంద్రగణములు అయిదు మాత్రలు గలవయినప్పు డున్న సొగసు - నాలుగు మాత్రలు గల వయినప్పుడు కనబడదు. అందుచేతనే కన్నడమువారు అయిదుమాత్రల విష్ణుగణములనే సీసాదులం దుండవలెనన్నారు. మన తెలుగు లాక్షణికులు కూడా సర్వలఘు సీసములందు మాత్రము అయిదు మాత్రల గణములు కావలెనన్నారు.

"మందార మకరంద మాధుర్యమును గ్రోలు
మధుపంబు వోవునే మదనములకు"

ఇటువంటి పద్యపాదములు చక్కగా నడిచినట్లు "శ్రీసరి మీఁఱంగ భానురతఁ దగంగఁ గేసరి కేసరి కేసరి యను" ఇటువంటి సీసపద్య పాదములు నడవవు.

ఇంద్రగణములలో చెప్పకపోయినా, భలము, నలలము సీసాదులలో చక్కగా నడుచును. చూడండి:—

ద్విపద. సీతపై శ్రీరామ * చంద్రునకు ప్రేమ
సీతకును శ్రీరామ * చంద్రుపై గలదు.

సీ. పా. నిను వినుతి సేయుదురు * సనకాది మునివరులు
నీపేరు మధురమై * నిలిచియుండు.

3, 4, 5 మాత్రల గణములు అనేకవిధములుగా కూర్చి క్రొత్త క్రొత్త పద్యము లెట్లు కూర్పదగునో చూడండి:—

1. చందమామ రావే * జాబిల్లి రావే } 331454
అందమైన బంతిపువ్వ * ఆడుకోను తేవే } 3333334

2. తెలివి మాలిన మిడుత * దీపంబునన్ జచ్చు
తెలివి మాలిన చేప * గాలమున జిక్కు
జ్ఞానసంపద గలిగి * మానవుం డయ్యయో
మోహ కల్లులఁ జిక్కి * మోసపోవు

| | | | |
|---|---|---|---|
| (1) | 3 4 3 + 5 5 | 5 5  5 5 | 20 |
| (2) | 3 4 3 + 5 3 | 5 5  5 3 | 18 |
| (3) | 3 4 3 + 5 5 | 5 5  5 5 | 20 |
| (4) | 3 4 3 + 3 3 | 5 5  3 3 | 16 |

౪. సౌందర్య సార సముదాయ మునకామె *
పదనమే యైయుండు ; కాకయున్న,
లాలిత్య నిధికి నధిదేవతయె ; కాక *
మాలతీ కాంత సామాన్యురాలె ?

| | | | |
|---|---|---|---|
| (1) | 5 3 5 5 | = | 18 |
| (2) | 5 5 3 3 | = | 16 |
| (3) | 5 3 5 5 | = | 18 |
| (4) | 5 5 3 3 | = | 16 |

యతిప్రాసములు, అక్షరమైత్రులు, శబ్దాలంకారములు మొదలయినవి కవుల స్వాతంత్ర్యమునకు విడిచిపెట్టవలసిన విషయములే కాని విరంపశాధికారము వహించి లాక్షణికులు శాసించరాదు. అయినా, తమ ఇష్టానిష్టములను అభిప్రాయములను తెలియజేయవచ్చును.

విశ్రమస్థానములను బట్టి ఏర్పడిన పాదఖండములు ఉద్దిష్ట మాత్రాగణ సంయుతములై ఉన్నయెడల, పద్యములు శ్రుతి రంజకములుగా ఉండగలవు. ఇందుకు నిదర్శనముగా ఒకటి చూడండి:—

"క్ష్మాహారంబు మనయతి * స్కంబుల్ చెంది * మనను నందంబై" (అప్పకవి).

ఇది నాలుగేసి మాత్రలకు విరుగుతూ నడవవలసిన వృత్తము. గనుక,

"క్ష్మాహారంబులు మధురంబయ్యెన్ * మైత్రులు యతులన్ * గూర్చెన్. అని చెప్పవచ్చును; లేదా,

క్ష్మాహారంబున చరణంబుల్ * మాత్రాగణముల క్రమ్యంబుల్ అని పాదమధ్యమందు వడి పాటించి చరణములు చక్కగా నడిపించవచ్చును. ఒకపాదమున ఒకచోటను, మఱియొక పాదమున మఱియొక చోటను, కవి తనమనోభావముల ననుసరించి రసోచితముగా వడి మార్చవచ్చును.

రసజ్ఞు లయిన విద్యావంతుల కొక మనవి :—

ఇదివరకు లాక్షణికులు చెప్పిన వృత్తలక్షణములు నాకు తృప్తికరములు కాకపోవుటచేతను, ఇదివరకున్న గణప్రస్తారము ననుసరించి చెప్పిన వృత్తములు అనేకము ప్రచారము లోనికి వచ్చుటకు అనుకూలములు కాక పోవుటచేతను, ఛందోరహస్యములు కొన్ని తెలుసుకొని, పద్యరచనా వ్యవస్థ ఎట్లుండినయెడల పద్యములు హృద్యముగా నుండును? అన్న విషయముల గురించి నాకు శక్యమైనంత వరకు ఆలోచించి వ్రాసినాను. ఈ ఉద్యమము వల్ల మేలు కలిగితే కలుగవచ్చును. గాని కీడు ఎంతమాత్రము కలుగ కూడదు. గనుక ఈ ఛందోవిషయములు ఉత్సాహములో విమర్శిస్తూ ఉన్న విద్యావంతులు వీటినిగురించి తమ అభిప్రాయములను ఉపదేశములను తెలియజేతురు గాక !

# ఓటు పాట

రా. చెన్నరాయ శ్రేష్ఠి గారు

౧. ఓటునివ్వ నెందుబోదురా - వద్దురా
గోటిపనికి గొడ్డలేలరా
సాటివారు నవ్వపేట
పేటదిరిగి సరిగవర్ల
వాటువేసి సీటుకెంచి
పాటబాడి వోటరనుచు
పాటుగాని మాటచెప్పి
కూటమట్టి కొట్టుకొనకు. ఓటు.

౨. కొండుకన్న నేమి లేదురా - రాజులీ
ఖండకంబు పెట్టినారురా
అందుబోయి నట్టివారు
కొలదుకైన పనికిరారు
ఖండనంబుచేసి గొప్ప
నొందగోరి విఱ్ఱవీగి
వందకైన నొక్కమాట
అందలేరు పొందలేరు. ఓటు.

౩. అమృతసరపు క్రౌర్య మెన్నరా-యెంచగా
నఘమనంబుతోడ జూడరా
రమణులనక బాలులనక
సుగుణంబు లేక ఘోర
శమనురీతి వృద్ధజనుల
ప్రమదమునను గాల్చినట్టి
యమునిబోలు డైరు
తప్పు నేమిజేసె జూడు. ఓటు.

౪. మనకు నేమి ఫలము లేదురా - ఓటునివ్వ
పనికిరాదు లాభమేమిరా
మనము జేసినట్టి పనికి
తనకు లాడకాను ముందు
మనల బ్రతుకనీరు వారు
ఘనముగాను పన్ను లెక్క
తనకుతాను ముప్పుదెచ్చు
కొనెనటన్న సామితోను. ఓటు.

౫. పూరకున్న మేలుజూడరా - పోరముప్ప
దారు వత్సరముల నుండిరా
ఘోరకష్టములను బొంది
దారితెచ్చి యున్నవారు
శ్రీరముకు బోలు గాంధి
గారు వారి మదికి నెదురు
దూరి పూర్తిలేని సాధి
కారమునకు చేరవలదు. ఓటు.

౬. నాకు ఓటు నివ్వమంచును - యెందరో
యూములాడి చత్తుమంచును
లేఖలంపి దిమ్మతిరిగి
లోకబంధు లనుచు చెప్పి
మూకలైన మనల నూతి
లోకి ద్రోసి పత్రికల న
నేకములగ బంపి బంపి
దేశమునకు గీడుదెత్రు. ఓటు.

Mr. M. Durga Sankar



మాచిరాజు దుర్గాశంకర్ గారు
నాగపూరు

Mr G Ramaswamy



గొట్టిపాటి రామస్వామి గారు నాగపూరు

Mr. M. Bhawani Sankar



మాచిరాజు భవానీశంకరు గారు
నాగపూరు

Mr Moturu Ankineedoo



మోటూరు అంకినీడు గారు

Mr. K. Venkatachalapathiah



కా. వెంకటాచలపతయ్య గారు

Mr. J. Veeraswamy Naidu



జంపా వీరాస్వామి నాయుడు గారు

Late Mr P. Venkataswamy Chetty



కీ॥ శే॥ పొతాళం
వెంకటస్వామి శ్రేష్ఠిగారు

Mr. Bomma Ratnam Chetty Garu, Ellore



బొమ్మా రత్నం శ్రేష్ఠిగారు, ఏలూరు

Mr. D Venkataswamy Gupta



డోమా వెంకటస్వామి గుప్తగారు

Mr. V Venkata Subbaraya Chetty



ఊటుకూరి వెంకటసుబ్బారాయ శ్రేష్ఠిగారు

Mr V. Koulingam Chetty
Vetapalem



ఊటుకూరు కోటిలింగం శ్రేష్ఠిగారు
వేటపాలెము

Late Venkataswamy Chetty Garu
Vetapalem



కీ॥ శే॥ ఊటుకూరు వెంకటస్వామి
శ్రేష్ఠిగారు, వేటపాలెము

# యక్షగానములు — లేక, జక్కుల పాటలు

పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు - కావ్యవ్యాకరణతీర్థులు

సరస్వతీ పవిత్రాణాం జాతి స్తత్ర న దేహినాం, వ్యాసస్పర్ధి కులాలో భూ ద్యద్ద్రోణో భారతే కవిః—అని రాజశేఖరమహాకవి చెప్పిన సుభాషితము కలదు. "సరస్వతీపవిత్రు లగు దేహాలకు— అనగా సరస్వతీదేవి యనుగ్రహమునకుఁ బాత్రము లైన కవులకు—జాతి అనఁగ ప్రాముఖ్యము కాదు. ఎట్లనఁగా, భరతఖండమునం దున్న ద్రోణుఁ డను కవి జాతినిబట్టి కుమ్మరి యైనను, సమస్త వేదవేదాంగములను సాకల్యముగా నధిగమించి వేదవ్యాసుఁ డను బిరుదము నొంది భారత మను పేరితో పంచమవేదము రచించిన వ్యాసమహర్షితో కవిత్వవిషయమున స్పర్ధచేయువాఁడుగ నయ్యెను."— అని పై సుభాషితమునకు తాత్పర్యము. ప్రస్తుతము ఈ వ్యాసమున చర్చింపఁబోవుచున్న యక్షగానముల విషయమున మనము ఈ పై సుభాషితపు టర్థమును ఆదర్శముగా నుంచుకొనవలెను.

**ఆంధ్రవాఙ్మయము - తొలి రూపము యక్షగానములు**

ఆంధ్రవాఙ్మయము చిరప్రవర్ధమాన మగు రసాలముతోఁ బోల్పఁదగి యున్నది. ఈరసాలమునకు మధ్యకాలమునందు ప్రతిభానిధులును ప్రాభవోపేంద్రులును నగు పండితోత్తములును ప్రభువతంసులును పోషకత్వమును వహించి సర్వాంగపరిపూర్ణతను సర్వాభరణభూషితతను సంతరించఁ గలిగినను, రసాలపు ప్రాదుర్భావకాలము నుండి—స్వార్థరహితబుద్ధులై యగణ్యములును అనివార్యములును నగు ననేకకష్టనిష్ఠురములకు లోనయ్యును బాలారిష్టాది బాధలు చేరకయుండ నవ్యత నిజమంతర్యామిన నొందనీయక, సౌకుమార్యమును దొలఁగనీక అప్రమత్తులై అహర్నిశము తత్పరతయా త్తమతులై పెంచి పోషించి కలయుంతలో గౌరవించి పిదప నద్దానిని సమర్థులగు పండితప్రభువుల కరపల్లవముల నర్పించి కృతార్థులైన మన జక్కులు (యక్షు లని వీరిపేరును మనవారు సంస్కరించినారు.) వాఙ్మయమును గురించి చర్చించుకొనుట మనము నిర్వహింపవలసిన ధర్మములలో నొక్కటియని నాభావము. ఇంతుల కంగీకరింపని యాంధ్రవాఙ్మయ చేత్తలు కలరా? ఆంధ్రదేశమునందలి విజ్ఞానవిశేషకులు నగు ప్రాచీనజాతుల వారిలో జక్కులు బహునీతులు మున్నగువారు మిక్కిలి ప్రాచీనులు. వీరు మంచి మేధావులును సంగీతసాహిత్యముల సారము నెఱిఁగినవారలు మాత్రమే గాక చిత్రకళాకౌశలమునందును నద్వితీయులని పేరొందినవారు. ఇంతవఱకును మన జక్కులు తొలుకొలుత విజ్ఞానపూర్ణ మగు జాతికి చేరినవారై సంగీతసాహిత్యములను అభివృద్ధి చేసినారు. కాని కాలవశమున భారతవర్షమునందలి తక్కిన జాతులలో వలెనే, వీరిలోను - ఉన్నతి ఆదర్శము శుచిశీలములు వంశానుస్మృతధర్మములు మున్నగునవి నశించి, అస్థానమునందు స్వజాతివిస్మరత్వము శీలభ్రంశత అవనతి మున్నగునవి ప్రవేశించినవి. తోడనే వా రధఃపతితులైరి. ఆంధ్రదేశమునందు ప్రాచీనకళాకౌశల్యమును వెలువరింపఁజాలిన స్మరణచిహ్నము లేనైన వాఙ్మయరూపమున నున్నవని మనము తలంచు కొని అయ్యవి జక్కుల పాటలును జక్కుల యాటలును జక్కుల చిత్రకళాకౌశలములును మాత్రమే యగును కాని వేఱు గావు. మన కిపుడు లభ్యమైనంతవఱకుఁ గల యక్షగానవాఙ్మయమును విమర్శించికొన్నచో, ఈ విషయములకు తగినంతటి యాధారములు లభ్యములు కాగలవు. కాని ప్రకృతము స్థాలీపులాకన్యాయమున వారి ప్రాచీనస్థితిని మిగుల సంగ్రహముగాఁ బ్రదర్శింపఁగలిగిన ఒకటిరెం డుదాహరణముల నిచ్చుచున్నాను :—

సీ. కోణాగ్రసంఘర్ష ఘుమఘుమధ్వని తార
కంఠస్వరంబుతో గారవింప
మసిబొట్టుబోనాన నసలుకొల్పిన కన్ను
కొడుపుచేఁ దాటించు నెడపఁ దడప
శ్రుతికి నుత్కర్షంబుఁ జూపంగవలయుచోఁ
జెవిత్రాడు బిగియించు జీవగఱ్ఱ
గిల్కు గిల్కున మ్రోయు కింకిణీగుచ్ఛంబు
తాళమానంబుతో మేళవింప
తే. రాగమునుండి లంఘించు రాగమునకు
నురుమయూరద్వయంబుపై నొత్తిగిల్లి
కామవల్లీ మహాలక్ష్మి కైటభారి
వలపుఁ బాడుచు వచ్చె జక్కులపురంధ్రి.

సీ. ముద్రికామాణిక్యముల దీప్తి దారికెలి
పింఛంబు గుంచెతోఁ బ్రస్తుతింప
ఉపవాసమున నున్న యుపవిదస్సనికాను
చనుదోయిభరమున జలదరింప
తోఁకచుక్కల చెలువు తోరంపు తెలికన్ను
లాస్యకేళుల నిగ్గు నలకరింప
నిగ్గంపు జిలిబిలి గొలుసు కైవసించిన యక్ష
తోడలమందుల వలి దొంగలింప.
తే. ఉయ్యెల చప్పట్లునుఁ బిట్టకొయ్యల మ్రోత
దరతరంతమఁ జేయును నాకసింపు
నాడెఁ బీటలపై నోలిఁ గూడియున్న
యక్క కేడ్పురిలో నొక్క యలరుఁబోఁడి.

ఈపద్యములు క్రీ. శ. పదునాల్గవ శతాబ్దిలోని వాఁడ వల్లభరాయుని క్రీడాభిరామములోనివి. ఇది రచనావిన్యాసమును బట్టి దశరూపకాంతర్భాగ మగు వీథిలో చేరినది. ఇందలి నా

రుఁడు అగు మంచనశర్మ ఓరుగంటిపురంబున విహరించి ఆయా విశేషములను తెలిసికొనుచు, కామెపల్లివారి భాగవతకలాపము లోని లక్ష్మీనారాయణుల ప్రేమఘట్టమును బాడుచు జక్కుల వారి చిన్నది నృత్యముచేయు సందర్భమును వర్ణించుటను ఉదాహృతము లగు పద్యములు తెలుపుచున్నవి. దీనిని బట్టి పదునాల్గవశతాబ్దినాటికి యక్షగానముల ప్రచారము ఎక్కుడుగా నున్నట్టు మన మూహింపవచ్చును. మఱియును యక్షగానములు అనఁగా ఆకాలములోని జక్కులపాటలే అనియును, ఆకాలమునందు పర్వదినములలో సంతానకాంక్షు లగు శ్రీమంతులు శుభార్థులై జక్కులను బిలిపించి వారిచేతఁ బాటలఁ బాడించు నాచార ముండె ననియును తెలియుచున్నది.

యక్షులు అను పదమునకు మన పండితులు జక్కులు అను నది తద్భవరూప మని వ్యవహరించు నాచార మున్నది. కాని జక్కులు అనుమాట కేవలమును దేశ్య మని నాభావము. మనవారు దేశ్యశబ్దముల కనేకమునకు ఆర్యతాప్రాశస్త్యమునకుఁ గాబోలు - సంస్కృతరూపములను కల్పించి వ్యత్యయముచేసి, సంస్కృతభవత్వమును అనుగ్రహించి యున్నారు. ఈవాడుక మనపండితులకు క్రొత్త కాదు. తెలుఁగు అను పదమునకు త్రిలింగాదిరూపములు గల్పించుటలు మున్నగువానిఁ బరికించినచో పైని చెప్పిన మనవారి వాడుక లోఁగల యాథార్థ్యము తెలఁగలదు. అప్రస్తుత మగు ఈ విషయము నింతతో విడిచి ప్రకృతమునకు వత్తము. మొత్తము మీఁద యక్షు లనఁగా 'జక్కులనియును, యక్షగానము లనఁగా జక్కులపాట లనియును తేలినది. ఇప్పుడిపుడు మనవారు ఈ యక్షగానములను నాటకాంతర్భేదములనుగాఁ బరిగణించి నాటకచర్చ చేయునప్పుడు ఈ యక్షగానములను గూడ నందు చేర్చుచున్నారు. కాని ఇది యంత న్యాయ్యము కాదు. ఇప్పటి నాటకములలోఁ గల కొన్ని ధాతువులు యక్షగానములందు గన్పట్టినంతమాత్రమున వీనిని నాటకములకు పూర్వరూపములుగాఁ జేర్కొనఁదగునా? అభినయ ప్రధానము లగు నాటకములలో సంగీతప్రధానము లగు యక్షగానములను చేర్చుటవలన లాభ మేమి? దీనిని గూర్చి చర్చింపవలసి యున్నది.

**యక్షగానముల ప్రాచీనత**

ఇఁక మనము యక్షగానముల ప్రాచీనతను కనిపెట్టవలసి యున్నది. వెనుక నొకవిధముగా యక్షగానములు ఆంధ్రవాఙ్మయమునందలి ఆద్యదశను సూచించుభాగమునకు జేరిన వని సూక్ష్మరీతిని వ్రాసియున్నాము. అనఁగా ఆంధ్రవాఙ్మయ రసాలము తొలుత యక్షగానములు (జక్కులపాటలు) మున్నగువాని రూపమున నంకురించి కాలక్రమమున దోహదవిశేషములు జరుగఁ గొలఁదిని వ్రేళ్లు నాటుకొన్న ద్విపద నాఁ బరిణమిల్లి - అటుపైని గద్యపద్యోభయాత్మకముగా వెలసి ఈ వనకాలము నాఁటికి విశ్వరూపమున వెలయుచున్న దని మాభావము. ఉదాహరించుటకు ప్రాథమికరూప మైన ఆకాలమునాఁటి గానవాఙ్మయ మిప్పుడు అదృశ్యమే యైనను కొన్ని యుక్తులవలన నా కాలమునందు యక్షగానాదుల ప్రచార మున్నట్లు ఋజువుచేయ వచ్చును:—

"పదములు తుమ్మెదపదముల్ ప్రభాత, పదములు పర్వతపదములానంద, పదములు శంకరపదముల్ నివాళి, పదములు తాలేశుపదములు గొబ్బి, పదములు వెన్నెలపదములు సంజ, వర్ణన మఱి గణవర్ణన పదము, లర్ణవఘోష ఘూర్ణిల్లుచు నుండఁ, బాడుచు నాడుచు బరమహర్షమున, గూడి సద్భక్తసంఘుల మేగుదేర"—

ఈ యుదాహృతపఙ్క్తులు పండితారాధ్యుని చరిత్రములోనివి. పండితారాధ్యుఁడు వాదార్థమై వెలనాటిచోడుని సభ కేగునప్పుడు ఆయన శిష్యులును అనుయాయులును నగు శివభక్తులు కొందఱు తుమ్మెదపదములు ప్రభాతపదములు వెన్నెలపదములు మున్నగువానిని పాడుచు నతనివెంట ఆసభకు పోయిన ట్లున్న సందర్భము నివి తెల్పుచున్నవి. ఈపంక్తులలో సుదహృతము లైన తుమ్మెదపదములు ప్రభాతపదములు వెన్నెలపదములు మొదలగునవి కేవల మొక్క యక్షగానములందు మాత్రమే గ్రథితము లగుచున్నవి. ఆంధ్రవాఙ్మయములోఁ గల తక్కిన ఏరీతిగ్రంథములలోను కూర్పఁబడక ఇవి యక్షగానములలో మాత్రమే యుండుటచేత పండితారాధ్యుని కాలమున నివ్వివి జనసామాన్యమునందు ఎక్కుడుగ ప్రచారపథమున నున్నట్లు - బాల్యదశను గడచి యౌవనదశ ననుభవించుచున్నట్లు - తోఁచుచున్నది. కావున యక్షగానములు ఆంధ్రవాఙ్మయపు ఆద్యదశను వివరించు గ్రంథము లని మనము నిర్ణయింపవచ్చును. కాని ఒక చిక్కు మాత్రము గలదు. ప్రస్తుతము మనకు లభించుచున్న యక్షగానములు యక్షగానయుగపు అంతిమభాగపు గ్రంథము లగుటచేత భాషానిబంధాదులలోఁగల వైరూప్య సారూప్యాదులను పోల్చుకొనఁ జాలము. కాని ఈ లోపము లక్షణవాఙ్మయపు ప్రతిభాగమునకును జెందు సామాన్యవిధి యగుటచేత నంతగా మనము పాటింప నవసరము లేదు. అయినను రచనలలో గొంత భేదము లేకపోలేదు. మఱియును యక్షగానముల ప్రాచీనతను స్థిరపఱచుకొనుట కింతకంటెను బలవత్తరము సాధన మింకొకటి కలదు. ప్రబంధాదిని మనవారు మత్స్యపతకములను జేర్చినట్లే యక్షగానములందును మత్స్యరతము లక్షనిబద్ధములై యుండును. దీనిని బట్టి చూచినను కూడ యక్షగానములకు గల ప్రాచీనత వెల్లడి కాఁగలదు. ఇట్టివాని నింకను ప్రదర్శింపవచ్చును గాని విస్తరభీతిని విరమింతును.

**యక్షగానముల నిర్మాణరీతి తత్పరిజ్ఞానము మున్నగునవి**

ఆంధ్రవాఙ్మయమునందలి తక్కిన గ్రంథజాలపు నిర్మాణపథముకంటె యక్షగానముల నిర్మాణములో అపూర్వములును అద్భుతములును ప్రశంస్యములును గద్యపద్యాదులకు మార్గదర్శకములు నగు రీతులు కొన్ని యున్నవి. ఉపక్రమోపసంహారములు - కృత్యాది ప్రస్తావనలు-పాత్రప్రవేశతత్సంభాషణములు-దరునుస్వృతములగు వృత్తముల పోకడలు-గానములయభినివేశనములు-రసపోషణక్రమము - ఛందోనియమములు - పదవిన్యాస

ములు భావప్రదర్శనపథకములు మున్నగునవి ఇందులకు సాధనములుగా గ్రహించి మనము చర్చించెద మేని ఈయంశము స్పష్టపడును.

యుద్ధములు మున్నగు కారణములవలననేగాని, ఇతరవిధములగు కారణములవలననేగాని తమతమ పతీత్వవీరప్రసూత్వాదులను ప్రదర్శించి యతిసాహసమున వీరస్వర్గమును జూఱగొని పేరటాండ్రై వెలసిన ఆంధ్రనారీమణుల చరిత్రములను తొలుదొల్తటి జక్కులు తమకుగల గానప్రౌఢిమచే శ్రోతల మనశ్శరీరములు రసాతిరేకమునఁ బులకలెత్తునట్లుగ కీర్తించెడివారు. ఇట్లు కీర్తింపఁబడిన సతీచరిత్రములు కొన్ని ఈనాటికిని పలనాడు మున్నగు ప్రదేశములలో గల జక్కుల యొద్ద మనము కనుగొనవచ్చును. ఇట్లు దేశీయ నాయికానాయక గుణగణోత్కర్షలను వెల్లడించుటకై బయలువెడలిన యీ వాఙ్మయప్రవాహమును ఎవ్వరో కొందఱు తప్ప, తక్కిన యాంధ్రదేశమువా రందఱును పవిత్రభావమునఁ దిలకించుటయే గాక, శుభశోభనాదు లగు కార్యసందర్భములందును జక్కులను పిలిపించి సుహృద్బాంధవపరివారమున కానందముఁ గూర్చుటకై కీర్తింపఁజేయు నాచారము గూడ మన వారిలో నున్నది. ఉదాహరణముగా వల్లభరాయని క్రీడాభిరామమును చూడుడు :—

"ఇదె యీ యింటి యజమానుండు సంతానకాంక్షియై ప్రతిబంధనోదనార్థంబు యక్షకన్యలం బరితోషారాధనంబు సేయుచున్నవాఁడు గావలయు."          17 వ పేజి 189 ప.

ఈ వల్లభరాయని వీధిలో చెప్పఁబడిన అక్కలు పాడినపాటలు ఇప్పుడు మనలో అక్కలపాటలు అక్కమహాదేవి కథలు కామేశ్వరి పాటలు కులదేవతలపాటలు అను పేరులతో వ్యవహరింపఁబడుచున్న పాటలే యగునా? లేక భిన్నములా? విమర్శకులు పరీక్షింపఁదగును.

ప్రాచీనము లగు యక్షగానముల నిర్మాణరీతులను విమర్శించుటకు ప్రస్తుతము అయ్యవి అలభ్యములు. ఈకాలమున మనకు లభించుచున్న యక్షగానములలో నెల్ల మిక్కిలి ప్రాచీనము లైనవి గరుడాచలమును నీలాచలమును ననునవియే. గరుడాచల నాటకమును రచించినది ఓబనమంత్రి యని యొక వాడుక యున్నది. కాని ఈ యోబనమంత్రి ఏకాలమువాఁడో ఎవ్వనికి నిర్ణయింపఁగల యాధారములు ఆ గ్రంథమునం దేమియును గానరావు. గరుడాచల నీలాచల నాటకములకంటె ప్రాచీనము లగు యక్షగానములు తదితరము లిప్పుడు లేవు. కనుక మనము యక్షగానముల నిర్మాణరీతులను ఇప్పటికి వాని యాధారముననే చర్చించుకొనవలయును.

యక్షగానములు చూచినంతలో మూడు తెఁగులుగా నున్నవి. శైవమత విజృంభణ కాలమునకు వెనుకటివి మొదటి తరగతివి. ఆపిమృతిని- అనఁగా శైవమతానంతరము రచితములై వ్యాప్తిలోనికి వచ్చినవి రెండవ తరగతివి. ఆపిమృటివి - అనఁగా నేఁడు మన ప్రచారములో నున్న ఆధునికరచనలు మూఁడవ తరగతివి. ఇట్లు స్థూలవిభాగమును మొదట నేర్పఱచుకొందము. తొ... గో సాధారణముగా ప్రప్రథమమున సంస్కృతభాషయందు నైన మంగళశ్లోకములు గలిగి, పిదప శైవవైష్ణవాది మతాచార్యుల స్తోత్రములు, ఆపిమృట జంపెలను పేరుతో నొప్పెడి యొకవిధము లగు గేయములు కలిగి, కథ యారంభ మగును. కథ యారంభమైనది మొదలుకొని చివరవఱకును సందర్భములకు తగు మాత్రముగా నుండి సహజధోరణిని సూచింపఁగల శృంగారరసము తఱచు కానవచ్చుచుండును గాని, ప్రబంధయుగమున మితిమీఱినంతటి దుస్థితి వీనిలోఁ గానరాదు. వర్ణనలు సహజములును మృదువులు నై యుండి కల్పనాకౌశలము భావగోప్యమును లేక ప్రాకృతస్థితిని వెల్లడింపఁ జాలియుండును. ఈకాలమువానిలో తొలుత కథారంభమునకు పూర్వము గూర్చెడి జంపెలలో సాధారణముగా మన ప్రబంధములందుఁ గల రీతిని షష్ఠ్యంతములు నెలకొల్పఁబడి యుండుటను మనము గాంచఁగలము. దీనిని బట్టి షష్ఠ్యంతముల యాచారము మనకు మిక్కిలి ప్రాచీన మని తేటపడుచున్నది. మఱియును రచనా సంవిధానములయందు నుత్తమ పాత్రములఁ బ్రవేశపెట్టవలసినచోట ద్విపదలును కవి తనంతతాను విషయమును ప్రదర్శింపవలసినచోటుల జంపెలును, పాత్రల పరస్పర సంవాదమును విశదము చేయవలసినచోటుల కందార్థములును, స్తుతులు విన్నపములు జోహారులు చేయవలసిన స్థలములలో దండకములును, సీసములును నెలకొల్పఁబడి యున్నవి. పద్యయుగమున సంస్కృతవాసనావాసితములై మన గ్రంథముల కెక్కిన చంపకమత్తేభ శార్దూలాది వృత్తము లిందు తఱచు కానరావు. గాని వానిస్థానమున సీసము కందము గీతము చూర్ణికలు అర్ధచంద్రికలు త్రిపుటలు ఏలలు మున్నగు జాతీయ ఛందములు విచ్చలవిడిగా గానవచ్చుచుండును. ఆంధ్రభాష గేయప్రధాన మనియును స్వచ్ఛందముగఁ బెరిఁగిన దనియు ననుటకు దీనిని గూడ నొక కారణముగా తీసికొనవచ్చును. మఱియు నీకాలమువానిలోఁ గూర్పఁబడిన ధూపహారతి పాటలు మున్నగు వానిని బట్టి మనవారు జనసామాన్యమున సుశాదరాభినివేశములఁ గలిగించుటకును, వారిని తమవైపునకు నాకర్షించుటకును పండితులై యుండియు రమ్యఘటితములైన యీ పాటలను వ్రాసియున్నట్లును మనకు గోచరించును. ఒక్కొక్కచోట పామరజనాదరణమునకు గోచరింపని శాస్త్రీయవిషయముల నుంచుట ఈ విషయమున దృష్టాంతము నీయఁగలదు.

ఇఁక మధ్యకాలపువానిలో నైన యేర్పడిన విషయములు మార్పు నొందుటను మనము కనిపెట్టఁగలము. వీనిలో నైవానిఁగలె రచన మతమునకు సంబంధించినంతవఱకు కలసిన యాదరాభినివేశములను మాత్రమే ప్రదర్శించి యూరకుండక, విమతస్థులఁ జేయు పరిహాస పద్ధతులును, ఒక్కొక్కచోట నతిమాత్ర మనఁదగిన శృంగార వర్ణనాతిరేకములును, ఆత్మశ్లాఘా మూలకంబులు లనఁదగు కుకవినిందాది ప్రథనములును యక్షగానగ్రంథనిర్మాతలు గూర్పసాగిరి. ఈమధ్యకాలపు యక్షగానములలో జంపెలతో చేయు కథారంభదశ కొంతమారి, అందులకు బదులుగా— తెరవెడలి వచ్చుట సంధివాక్యముల యోజనలు మున్నగాగల నిరర్థకము లగు దాంభిక ప్రక్రియలు తలసూపినట్లు అందలి వర్ణనములను బట్టి మనము

గ్రహింప వచ్చును. తొల్లిటి హార్దికపారిశుద్ధ్యము విశుద్ధప్రేమ మున్నగువని అంతరించి వానికి బదులుగా వేళాకోళములు వింతవింత లగు భావోదయములు వీనిలో నంకురించినవి. ఇఁకను చెప్పవలసిన దేమున్నది? మున్ముందు ఈపాటలు పొందఁగల దుర్దశల కన్నింటికిని అంకురారోపణము ఈ మధ్యకాలపు యక్షగానవాఙ్మయమున నుద యించిన దనిన చాలదా?

విద్యాధన ప్రాభవాదుల నుత్తము లగు వారి పఠకయులను [illegible] నుకరింపఁ బాలుచుండు టనుటకు భిన్నముగా దేశీయుల యాదరాతిశయములఁ బట్టియో, లేక మరేకారణమును బట్టియో యక్షగానములను విరచన సేయుటలో ఆకాలమున నొకరిద్దరు పండితులు గూడ నడ్డికట్టిరి. యక్షగానవిరచనము తమ పాండిత్యమున కొక ప్రౌఢతగా గూడ నెన్నుకొని ప్రకటించుకొనిరి. కాని వారిరచనలలో పాండిత్యప్రభావములు వెల్లడి యయ్యెనే గాని సహజమధురము లగు గానఫణితులు గాని కల్పనలు గాని కథా రచనానివేశములు గాని నెలకొనఁజాలక పోయినవి.

ఈస్థితి యిట్లుండ నల్పప్రజ్ఞావిభవులు గూడ యక్షగానము లను రచించి పేరొందవలయు నను తలంపుతో దొరకినకథ నెల్ల వస్త్వంశముగా గ్రహించి రచనల సాగింప నారంభించిరి. ఈకాలము గ్రంథములే యక్షగానములలో మూఁడవతరగతికిఁ జేరినవి యగును. ఈగ్రంథములకు గ్రంథవిరచయితలకుఁ దగినట్లుగా దేశసుస్థితిలోఁ గూడ నొకవిధ మగు దుర్దినచ్ఛాయ లావరించుటచేతఁ గాఁబోలు కొంటుతనములను సూచించు శృంగారహాస్య రసములును, మృదు మధురము లగు కందార్థాదులకు బదులుగా సీసార్థములు దరువులును, కొండవీటి జోస్యాదుల ననుకరించుచు గుణరహితములును కృత్రిమ ములు నగు కల్పనలును వర్ణనములును బయలువెడలినవి. యక్షగాన ముల యథఃపతనమునకు ఇయ్యవి అంత ప్రముఖము లైన కారణ ములు కాకున్నను అట్టి కారణవర్గములో వీనికిని గొంత స్థలము నీయక తప్పదు. ఇఁక నీచర్చను ఇంతతో నిలిపి, యక్షగానము లందు కూర్పఁబడిన గానముల స్వభావమును సామర్థ్య పారశ్య ములును బోధపడుటకై కొన్ని గానముల నుదాహరణార్థమై యుద్ధరించెదను. వీనిని చదువుటకు కాని యానుపూర్వి నెఱిఁగి యుండవలసిన దనుట ముఖ్యమే. వినను యక్షగాన వాఙ్మ యమునందుఁ గల ఛందోవిశేషములు గొంతవఱకు పాఠకుల మనస్సు లకు స్ఫురింపవచ్చు ననునమ్మకముతో నట్లు చేయుట యైనది. ఇందు ఉదాహరించిన గానముల క్రమము—అవి ప్రచారమునకు వచ్చిన కాలక్రమము ననుసరించి వ్రాయబడుచున్న యవి:—(1) జంపె, (2) కందార్థాదులు, (3) ద్విపద, (4) ద్విపదార్థము, (5) లాలిజోలలు, (6) ధూపారతి దీపారతులు, (7) త్రిపుటకురుజంపెలు (8) చంద్రికలు అర్ధచంద్రికలు, (9) సిందు (చిందు?) రగడలు, (10) వెన్నెలలు-విన్నపములు, (11) ధవళము-త్రిభంగులు, (12) సువ్వి పాటలు, (13) మేలుకొలుపులు, (14) పరిశిష్ట గానములు.

(1) జంపె:—శ్రీరమేశ పురారి విధులను - చేరి కొలుతున్ ముదమున, శ్రీరమాసతి గౌరి వాణుల-సేవఁ జేతున్.

(2) కందార్థములు:—(1) గురు పరమేశుల భక్తిని, పరగఁగ మది నిల్పి తత్త్వపారాయణులై, పరతత్త్వబోధ దెల్పెడు, పరిపూర్ణుల భక్తిఁ దలతు-పరముగ నిల్పి, తద్దాస్యము నిరతము సలిపి. పరిపరి విషయుల, దిరిగెడు చిత్తము, స్థిరము లేని పాప, చింతమాన్పు మని, పరముగ నిలిపి - తద్దాస్యము స్థిరముగ సలిపి.

(3) ద్విపద:—వినవయ్య తెనగాల కృష్ణాంగి నెల్ల, గనుగొన భ్రమ తెల్ల గ్రక్కునఁ బాయు

(4) ద్విపదార్థము:—కొందఱు మందులు కూర్మితో సుతుల, యందు మోహంబు చే నఁరుదు రెపుడు, గాన - బుత్రుల దుఃఖముఁ వినవయ్య తెల్పెదా, వాని కనుగొను మనిశము.

ద్విపదార్థములవలెనే సీసపద్యమువైని సీసార్థము లను ఒకవిధ మగు ఛందము కూడ ఏర్పాటు చేయఁబడినది. ఉదాహరణముకై—

సీసార్థము:—పురుషుని వీర్యంబు పొందుగా వెడ్చిన పురు షుఁడై యుదయించు భూమియందు, తరుణుల రక్తమంతట వెచ్చఁ దరుణియో సమమైన మందుడో నుత్యముగను. సుడిప్రక్కఁ బురు షుండు మదయగా నివసించు వామభాగంబున వనిత నరియుండు, మధ్య మందున నుండుడో నిజముగా, తెలసి మదిలోనఁ గొల్వరా - చిద్ఘనా తెలుఁగు - దేవరా మదిలోఁ దల్వరా - పురుషులూ గర్భమున పాలతూల నున్నపుడె, తరచుగ గ్రాహ్యములు తప్పక పుట్టును - తెలసి మదిలో గొల్వరా.

(5) లాలిజోలపాటలు:—(1) లాలిపాట:—లాలీ పాడుచు నూచరమ్మ-కృష్ణ, లీలామృతమా గ్రోల రమ్మ - (ఇది ప్రాచీన కాలపుది.) (2) లాలిబాడి లాలింపరే బాలకృష్ణునిని-భక్తి, లోలుడై వర్తింపఁదరే బాలకృష్ణుని - (ఇది మధ్యకాలపుది.) (3) లాలి శ్రీకృష్ణ లాలి-వరమాత్మ, లాలీ కూతున్న లాలీ - (ఇది ఇటీవలికాలపుది.) (2) జోలపాట:—జోజో గోపాలా, భక్తైకలోలా.

N. B. ఇందులో రెండవరకపుది రెండవరకపు లాలిపాటువలె నున్నది.

(6) ధూపారతి దీపారతులు:—ధూపోయం ఘోరపాపా దూరాయతే-సర్వ తాపస హృదయ ధ్వాంత దీపాయతే - నారనార. (ఇవి ఇప్పటి జంగముల పాటలను పోలి యున్నవి. కాని శైవుల నాఁటి యక్షగానములలో వీనికి ప్రచారము అధిక మని తోఁచు చున్నయది.)

(7) త్రిపుట, కురుజంపెలు:—(1) త్రిపుట—మగని నీ వఁ పల్కవాడదు, మహితభక్తిని మీ రటంచును, తగును బల్కఁగ యాటల, దనరి యున్నన్. (2) కురుజంపె—పతిని నరుఁ చునే - మతిహీనవై దేవ - తతిఁ గొలిచి యీ నరక - తతిఁ తిన్, కుమత గురువుల మాటఁ కోరి విని పతిని - ద్వైత వ నరక వనధిలోఁ బడితిన్.

(8) చంద్రికలు అర్ధచంద్రికలు:—(2) అర్ధచంద్రికలు:—పడతికని పొలిండ్ల పై నలుపు ద్రోచెన్. మట్టిపై రుచి గల్గె మానినీ మణికిన్. సన్నుతాంగియు భర్తృ సంగతిని గోరెన్. ఇభరాజవదన పతియెడ ప్రేమ హెచ్చెన్.

(9) సింధు.—భామామణి వినుము - యమ పట్టణములోని చట్టము తెల్లా. N. B. ఇవి మిక్కిలి ప్రాచీనప్రతులలోనే యున్నవి. ఇప్పటి చిందా? బహుశః ఇవి ఇప్పటి చిందుల కొక్క యుదాహరణము:—కెయ్యర - దమ్ కెయ్ వెయ్-మతీ, మొయ్యర అమ్మోర్ని మెండ్, (2) రగడ:—సిరివరుఁడు నత్తెరవు, చేరవచ్చెఁ జూచి, శరము ముడి మొదవ ముడి, కలక లన్నియుఁ ద్రోచి.

(10) వెన్నెలలు—విన్నపములు:—(1) నూకాలమ్మను కొలవగానే - వెన్నెలాలో - మీద, నూకానికీ పెండ్లి యయ్యె వెన్నెలాలో, (2) విన్నపములు:—శ్రీరామ జయరామ, శృంగార రామ. గారామునను బ్రోవు కరుణాసముద్రా. నాలోని జాలి నీకే, లా తో చదురా? మనసిచ్చి నాతోను, మాటాడవేరా? వీనిని పల్లెటూరి తిరునాళ్లలో గరుడస్తంభము పెట్టుకొని భజనచేయువా రిప్పటికిని పాడుచున్నారు.

(11) ధవళము—త్రిభంగులు:—(1) ధవళము:—శ్రీకర పుణ్యశరీరా! ప్రాకట వంశోద్ధారా!........తత్త్వవిచారా! చెల్లర చిక్కన! ఐలిరా.

ఇవియును శైవుల యక్షగానములలో చాల గలవు. (2) త్రిభంగులు:—పసుపూ నందలు మేన బూసి - మంచి - పాలు నేతులు చల్లా బోసి, బిసరుహాక్షులు గుములు కూడి - దొడ్డ - బిడ్డని స్నానంత మాడి.

(12) సువ్విపాటలు:—తండ్రి కై క కొసగు వరముఁ, దలచి సీతా లక్ష్మణులతో, దండకావనము కరుగు నా, ద్దండ రామా!—సువ్వి సువ్వాలే.

ఇంకొక విధము సువ్విపాట:—సువ్వి సువ్వాలే. సువ్వి సువ్వాలే, సువ్వి సువ్వి యనుచు సువ్వియనుచూను, సువ్వి బాద రాళ్ళ సుదతు లందారూ - సువ్వి సువ్వాలే.

(13) మేలుకొలుపులు:—(1) మేలుకొనవే చిన్ని కృష్ణా! మేలుకొను శేషశతారా! మేలుకొను కేశవ మారా, మేలుకొనవయ్యా- కృష్ణా - మేలుకొనవయ్య.

(14) పరిశిష్టము లగు గానములు:—(1) ఏలలు — మొదలు పీడా కొనలు క్రిందా, మొలచి యున్నా చింత తోపు, పరిపక్వములు పూచినే - ఓగొల్లభామా, కదిసిమాడా, కానుపించూనే! (2, మంగళహారతులు:—శ్రీలక్ష్మీ నాథాయ మంగళం - పో - షిత భక్తయూధాయ మంగళమ్. వాగీశముఖ్య గీర్వాణ వందితాయ, భోగీశశయనాయ భువనరక్షకాయ-శ్రీ లక్ష్మీ నాథాయ మంగళమ్. (3) అల్లోనేరేళ్లు:—(1) అల్లో నేరే డల్లో, చెలగి కృష్ణుండనుచుఁ జెప్పరే మీరు. (2) శరివేల్పు మనదొరకు, గలిగనే నేడు - సిరివరుని వలె నితఁడు - చెలగుచున్నాడు—అల్లో నరే డల్లో.

ఇంకను యక్షగానములలో - లయగ్రాహి కవిరాజవిరాజితము పంచచామరము మత్తకోకిల మున్నగు కొన్ని వృత్తములు కూడ వచ్చుచుండును. కాని అవి మనవారికి పరిచితపూర్వము లగుటచేత నిందు ఉదాహరింప లేదు.

**యక్షగానముల పతనదశ**

జక్కులు తొలుదొలుత చక్కని విశ్రాంతులును మృదుమధురీతులును సరస ఫణితులును నొప్పారిన గానములనుకూర్చి, దేశకాలపాత్రానుసారము జానిని వ్యాప్తి నొందించుచు వచ్చినను రాను రాను మన నాఁటికి జొత్తుగ ప్రచారపథము నుండి తొలఁగి మాలమాలల వారి వాఙ్మయము పడియుండెనని చెప్పుటకు కొన్ని విశేషకారణములు గలవు. అందులో నీక్రింద వివరించిన మూఁడును ముఖ్యకారణము లని నా భావము. (1) సమర్థులు నిర్వహింపఁదగిన పనుల కసమర్థులు నిర్వహింపఁబూనుకొనుట (2) ప్రదర్శనములందు కేవలము సభ్యుల కభిరుచిగల మార్గము నవలంబించుట (3) అసభ్యశృంగారము. ఈ ముత్తెఱఁగులను ఈ వాఙ్మయము అవనతి నొందిన విధము ఈక్రింద సూచింపఁబడును.

(1) సమర్థులు నిర్వహింపవలసినపనుల కసమర్థులు నిర్వహింపఁబూనుకొనుట. తొలుతనుండియును జక్కులు ఈ గానములను వంశానుసృత మగు నభిగికళతో నిర్వర్తింపుచుండగా, దేశీయులు వారికి చేయు గౌరవాదరములను చూచి, తమరు నట్టి గౌరవాదరముల నొందుటకై - బవినీశులు, దాసరులు, పెద్దింటిగొల్లలు, పెతికలు-(ఒకజాతి వారు) మున్నగు జాతులవా రిందులకై పాల్పడిరి. దీనివలన యక్షగానకళ, అభివృద్ధి నొందుటయె బహుళాగా జక్కులలో బహుప్రచారము నొందియును, తక్కుఁగల వారివలన సముచిత లాలిత్యాదులందు పుష్టి బడయఁజాలకయును, నశింప దొరకొనినది. ఇం దాశ్చర్యమేమి? ఎవ్వరివలన నేయ్యది నిర్వర్తింపఁబడ వలయునో, అయ్యది వారివలన నిర్వర్తితము కానప్పుడు నశించుటకన్న వేఱొక గతి కన్పట్టకుండుట సాజమే కదా!

(2) రెండవ కారణము ప్రదర్శనమునందు సభ్యుల రుచి ననుసరించి మార్పులు చేయుట- ఈ కారణము ముఖ్యముగా గమనింపదగినది. యక్షగానములు పాడుటలోను నాడుటలోను తొలుత కొలఁదిమంది ప్రదర్శకులచే నిర్వర్తింపఁబడుచుండినను - రాను రాను అసాధారణము మాఱి, బహుళసంఖ్యాకులగు నటకు లున్నఁ గాని ప్రేక్షకులకు రుచింపదయ్యెను. ఈ ప్రేక్షకాభిరుచిని చేపట్టుటచేత- ప్రేక్షకాభిరుచుల విభాగము ననుసరించి ప్రదర్శక విభాగములును-ప్రదర్శకాభిరుచుల విభాగము ననుసరించి గ్రంథనిర్మాతలమార్గములును-వేర్వేరై తీర్థగానపు తీర్థము ప్రసాదమునకు ప్రసాదమునై ఎవరిదారి వారిదై చక్కబుచ్చిన వస్త్రమైనది. ఈదశ, భాగవతమేళములుగాఁ గూడి యక్షగానములను ప్రదర్శించు నాఁటికే ఏర్పడినది. దీనికి తోడు కాలమునఁ బ్రదర్శకసంఘములలో గూడ నైకమత్యము క్షీణించుటచే - ఎవరి మట్టునకు వారు ధన్యోహము అనుకొనుట గూడ కొంత కారణమైనది.

(3) మూఁడవది అసభ్యశృంగారము.— గానములయందేమి కావ్యములయందేమి నాటకములందేమి నీతిజాత్యాచారాదుల కవిరుద్ధముగ లోకయాత్రానిర్వహణవిధులను ప్రదర్శించుట ముఖ్యము. అట్లు గాక మన యక్షగానములలో పైనిచెప్పిన భాగవతమేళములు తోలుబొమ్మలాటలుగా మాఱిడిపోలేఁదని—సరసహృదయానురంజనము నైతికప్రవర్తనము- లోకయాత్రాదర్శనము-ఏటిలో కలిపి, గాంధోళిగాని గడబిడలతో - కేవలము పామరజనుల రంజనమునకై యక్షగానగ్రంథకర్తలును - తత్ప్రదర్శకసమాజములును- వాని నాదరించి చూచి తనియుచున్న సభ్యప్రపంచమును - మునిఁగి మప్పందు మను న్యాయమునకు పాల్పడుట సంభవించినది. కేవలము మహాపవిత్రములని పేర్కొనఁబడిన శృంగార వీర హాస్యాదిరసము లిట్టి అసభ్యతకు పాల్పడ నారంభించిన కాలము మొదలుకొనియే, మన యక్షగానములకును పతనదశ యారంభమై-చివఱకీనాఁటికి యక్షగానముల ప్రచారము నామమాత్రావశిష్టమై - ప్రాచీనకళావిధవమును స్మరించుటకైన దగిన యాధారములు లేక — సారస్వత చర్చలందు, ప్రాముఖ్యస్థానము వీనికి లేకున్న లేకపోవుఁగాక - ప్రవేశముగూడ దొరకనంతటి దుస్థితికి వచ్చి నశించిపోవుచున్నవి. ఎంతఘోరము!!

ఇఁక నీ వ్యాసము నింతతో ముగించుటకుముందు నింకవఱకును ఆంధ్రవాఙ్మయమునందు ప్రచారబాహుళ్యము నొందిన కొన్ని యక్షగానముల పేరులను ఆ యక్షగానములను రచించిన కవుల పేరులను తెలుపఁగల పట్టికను ఈ క్రింద నిచ్చుచున్నాము. ఇందులో, స్థాలీపులాకన్యాయము ననుసరించి ప్రధాన గ్రంథములే అకారాదిగా చూపఁబడినవి.

1. అహల్యాసంక్రందనీయము- కా. ఉదయాచలము 2 ఉషాపరిణయము - అకలంకకవి 3 ఉషాపరిణయము- ఆనందదాసు. 4 ఉషాపరిణయము- వేములపల్లి నారికి వేంకటసుబ్బకవి. 5 కుచేలోపాఖ్యానము- సుబ్బలింగాచారి. 6 కుశలవనాటకము-అనంతదాసు. 7 గరుడాచలము - ఓబయమంత్రి. 8 గయానాటకము - కాశీపతి ఆచారి. 9 గుత్తినదీవి రామాయణము- రాఘవకవి. 10 గోపాలవిలాసము-శ్రీనివాసాచార్యుఁడు. 11 గోపాలవిలాసము - పాకనాటిగణపతిరెడ్డి. 12 జీవయానచరిత్రము-యాదవదాసు. 13 ధర్మపురిరామాయణము - శేషాచలదాసు. 14 ధర్మాంగదచరిత్రము-నరసింహకవి. 15 ధర్మాంగదచరిత్రము-స. వేంకటదాసు. 16 ధ్రువోపాఖ్యానము-బెనారాఅప్పలనరసింహము. 17 నందినాటకము: కోదండరామకవి. 18 నలచరిత్రము: కోదండరామకవి. 19 నిజలింగ చిక్కయ్యచరిత్ర-పిడుపర్తి నిమ్మయ్యకవి. 20 నృసింహచరిత్రము : రా. అప్పాజీకవి 21 పరతత్త్వసుధానిధి: సోమసుందర మొదలి. 22 ప్రహ్లాదనాటకము: తిరునారాయణాచారి 23 పతివ్రతామాహాత్మ్యము; కా. రాఘవాచారి. 24 ప్రహ్లాదనాటకము: రామానుజసూరి 25 ప్రహ్లాదనాటకము: బొడ్డుచెర్ల సుబ్బకవి. 26 ప్రహ్లాదనాటకము- లక్ష్మణదాసుకవి. 27 ప్రహ్లాద భక్తివిజయము: త్యాగరాజు (కృతులు రచించిన త్యాగరాజే) 28 పోట్లపుర్తి జలక్రీడలు : రామరాజు. 29 బాణాసురవిజయము; వీరనారాయణకవి. 30 భాగవతము: వేంకటాచలదాసు. 31 భిల్లాణచరిత్ర: జక్కన్న సాంబయ్యగార్లు. 32 మార్కండేయవిలాసము: కాళిదాసు. 33 మృత్యుంజయవిలాసము - గోగులపాటి కూర్మనాథకవి. 34 యతిరాజవిలాసము - సుందరనారాయణార్య శేషాచలదాసకవి. 36 రామనాటకము: అనంతదాసకవి. 37 రామనాటకము - కతగోపాచార్యుడు 38 రామాయణము : శేషగిరిదాసు 39 రామానుజవిజయము - నరసింహాచారి 40 రంగనాథవిలాసము. లింగము వేంకట్రాయమంత్రి. 41 రుక్మిణీకల్యాణము - రాజాలక్ష్మీదేవి 42 రుక్మాంగదచరిత్రము- రాజలింగకవి. 43 రుక్మాంగదచరిత్రము- కవిపేరు తెలియదు. 44 రుక్మాంగద చరిత్రము- పాపారాయసుధి 45 లేపాక్షి రామాయణము- వేంకటరాయమహాకవి 46 లేపాక్షి కృష్ణనాటకము- వేంకటరాయకవి. 47 వసురాజవిలాసము- క్రొత్తమాగుల శేషాచార్యులు. 48 వల్లీపల్లవము - రంగాచార్యులు. 49 వామనచరిత్ర- మృత్యుంజయకవి. 50 వేంకటేశ్వరవిలాసము- సూర్యకవి 51 శశిరేఖాపరిణయము:- రంగాచార్యులు 52 శశాంకవిలాసము- కవిపేరులేదు. 53 శర్వరీవిజయము:-క.పే.లేదు. 54 శర్మిష్ఠావిలాసము-వేంకటదాసు. 55 శూర్పణఖాభంగము-క.పే. లేదు.56 సముద్రమథనము కృ. శేషాచలదాసు.57 సారంగధర-కోదండరామకవి. 58 సానందోపాఖ్యానము-క.పే.లేదు. 59 సారంగధరచరిత్రము క.పే. లేదు 60 సీతాకల్యాణము- రామన్నకవి 61 సీతాపహరణము- కవిపేరులేదు. 62 సీతాకల్యాణము - చిత్రకూటం వేంకటశేషయ్యదాసు. 63 సుగ్రీవవిజయము- రుద్రకవి. 64 సుధాస్వాదనము-వేంకటదాసు. 65 హనుమంతవిజయము- కవిపేరు లేదు. 66 హాలాహలపానము:- కవిపేరు లేదు 67 హంసకవిలాసము - పరమానందకవి 68 హనుమద్విజయము. పేరు తెలియదు.

పెంచి కమ్మనిపూతఁ బూయించి పిదప
మించుఫలముల బండించి మిసిమినించి
రార! విద్యాంసు లని రాజు లబ్బురంబు
నొందఁగా సాకతముఁజేసి రందమునగను.

సీ. ఒకరాజు తృప్తుఁడై యొసగినాఁ డగ్రహా
 రముల నయ్యె బుధరాజాలకును
యొసగినాఁ డికనొక్కఁ డసలార సర్వస్వ
 మాంధ్రరస్వా లార్పణం బటంచు
కనకాభిషేకంబుఁ గావించె నొక్కఁ డు
 ద్ధురతర ప్రౌఢిమ నుబ్బియుబ్బి
ఆనందపరవశుండై యొకఁడా రాజు
 పల్యంకికను తాన బట్టి మోచె
ఇచ్చినా రీవులను నిటుల్ హెచ్చుగాను
మెచ్చినారలు సేవింపఁజొచ్చినార
లాంధ్రనరపాలు రౌర! గుణాలవాలు
రేమివర్ణింపగల మాయిలేశ్వరులను!!

ఉ. రాజులు మెచ్చి యిత్తు రను రాణ దనర్చుటనో? మహో
త్తేజముఁగూర్పనా ననెడి తెంపుననో? మతికేలొకో? సుధీ
రాజులు బూనఁగాదగిన రమ్యకవిత్వము నిర్వహింప
నా స్తేజులు గొందఱూని, రయొ! దివ్యత నాటితో దీరమందునే?

సీ. ఒకఁడు స్వాప్నికగాథ నొనరంగఁగూర్చెనే
 నద్దానినే గూర్తు రఖిలకవులు
జతుశ్లేషల నొకండు చాతుర్యముఁజూప
 నితరు లందుల కట్టులెత్తుచుండ్రు
గర్భవృత్తాదుల ఘనుఁడొక్కఁడైనచో
 నితరు లారని మించ నెగురుచుండ్రు
నైరోష్ఠ్యనియమంబు నవధరింపఁగ నొక్క
 డొకని మించఁగనెత్తు రందఱుటయు
ఒకనికేదైన వింత యిత్తోదవనేని
ఇతరు లసమర్థు లాపుంత నెగురసాగి,
ఏవముఁజనింపఁ జేసినా రెల్లవారి
కల్ల నదుమంత్రపు కవిత్వ మల్లువారు.

సీ. అభినవ కల్పన ననలువాకెదు నాల
 మక్కటా స్తంభించి యావయుస్సా గ
సుమఫలాదుల సదా సౌరభంబులనీను
 తరు వంధతమసానఁ దగులుకొనియె
తేజావ నోఖాస దీపించు ఘనశాఖ
 దినదిన క్రిమిచేఁ దెల్లవాడె
ఆబాలగోపాల మాశ్రయదాతయై
 యొప్పుదానికి కళల్ దప్పిపోయె
అయ్యయో యిట్లు పెక్కండ్రు లనవ యగుచు
సంఘతమసంబునం బడి యావయు నవయు,
నయ్యె, చిరకాలమునకు నక్కటగయంబు,
నంత బుధలోకమున కబ్బెఁ గొంత తెల్వి.

సీ. మోహాపదేశతమో ముద్రితంబైన
 కను విచ్చి లోకంబుఁ గాంచినారు,
అలసత్వమున మన మలఁతుమైతిమి తల్లి
 నక్కటా యని మదిఁ బొక్కినారు
ఆహా! మనోజ్ఞత యధ్వాన్నమై వుంటు
 వడె గదా యని చాల వగచినారు
గతజలబంధన కరణ మయ్యెను మన
 పోషణం బనుచును పొగిలినారు
ఏమిచేయుద మీలోప మెటులదీర్త
మేదితెరవింక గంతవ్యమెయ్యది?—యని
బుద్ధిజింతించి, యనలెత్తు పుంతలరసి
పూనినారి ప్రవాఙ్మయపోషణమును.

సీ. దినపత్రికల దివ్యతేజంబు వెదజల్లి
 సేవించు నదె యొక స్థిరయశుండు.
విజ్ఞానసర్వస్వ విధకంబుఁ జేకూర్చి
 వెలయించు నొక్క వివేకధనుఁడు
ప్రాచ్యవైభవములు పరిఢవిల్లఁగఁ గడ
 లఁజేయు నిత్యదు నొక్క కమ్మకీర్తి
గ్రంథజాలంబు లగ్రస్థానముల నుంచ
 యత్నించు నొక్క యమేయబుద్ధి
దినదినంబును గ్రొత్తలఁ దెచ్చికూర్చి
మారసాలము నలరింప మహితగుణులు
సర్వవిధముల జతనముల్ సలుపుచున్న
వార, లయ్యుత్తములు సదా వఱలుగాత.

# నాస్తికదర్శనములు

శతావధాని వేలూరి శివరామశాస్త్రి గారు

## స్వరూపము

నాస్తికమతాచార్యులు తమ మతమును గుఱించి రచించిన స్వతంత్ర గ్రంథములు మనకుఁ గానవచ్చుట లేదు. బౌద్ధులయు జైనులయు మతములు కొంచెముగా నైనను గానవచ్చుచున్నవి. కాని, చార్వాకమత మూలగ్రంథములు స్వల్పముగ నైనఁ గానవచ్చుట లేదు. ఈమతమును ఖండించువారు తమ ఖండనమునకు ఉపయోగించునంతవట్టు ప్రతిపాదించిన విషయమే తన్మతస్వరూపమున కాధార మగుచున్నది. 'సర్వదర్శన సారసంగ్రహము'నందు చార్వాకమతమును మాధవాచార్యులవారు ఉపపాదించి యున్నారు. ఆవిషయమును-గొంత యిట నాంధ్రీకరించుచున్నాఁడను.

## చార్వాకదర్శనము

"చార్వాకుని చేష్టితము దురచ్ఛేద మయినది. ప్రాణు లందఱును తలంచుచుగా—

గీ. బ్రదుకవట్టును సుఖముగా బ్రదుకవలయు
మృత్యుముఖమునఁ బడనివాఁ డెవఁడు లేఁడు
బూదెనలుసులుగా మాఱిపోయినట్టి
కాయ మీయది మఱల నేగతిని వచ్చు?

అను లోకగాథ ననుసరించుచు నీతికామశాస్త్రానుసారముగా అర్థకామములనే పురుషార్థములనుగాఁ దలంచుచుఁ బారలౌకిక మగు నర్థము నపహ్నవించుచు చార్వాకమతము ననుసరించువారుగానే కానఁబట్టుచున్నారు. కావుననే ఆ చార్వాకమతమునకు 'లోకాయతము' అను అన్వర్థ మగు నామాంతరము.

నేల నీరు నిప్పు గాలి యను నాలుగు తత్త్వములనుండి పరిణమించిన దేహాకారములకలన కురాబీజములనుండి మదశక్తివలెఁ జైతన్యము పుట్టుచున్నది. ఆ దేహాకారములు నశింపఁగా, ఆ చైతన్యము కూడ నశించును.

విజ్ఞానఘనమైన ఆచైతన్యము భూతములనుండి పుట్టి, వానితోపాటు నశించును. దేహములఁ బాసినచో దానికి సంజ్ఞ (జ్ఞానము) ఉండదు. చైతన్యముతోఁ గూడిన దేహమే ఆత్మ. వేఱుగా ఆత్మ లేదు. ఉన్న దనుటకుఁ బ్రమాణము లేదు. ప్రత్యక్షప్రమాణమే ప్రమాణము. అనుమానాదులకుఁ బ్రామాణ్యము లేదు.

ప్రేయాలుల కౌఁగిలులవలనఁ గలుగు సుఖమే పురుషార్థము. ఇందును దుఃఖ ముండుటఁజేసి పురుషార్థము కా దనరాదు. ఏలన, అనివార్యమైన దుఃఖమును బరిహరించి సుఖము మాత్రమే అనుభవింపఁదగినది కదా! చేఁపలఁ గావలసిన వాఁడు ముల్లుఁజేఁపలను పొలుసులచేఁపలను బట్టుకొని, తనకుఁ గావలయు పదార్థమునే స్వీకరించును. (౧) ధాన్యము వలయువాఁడు పొల్లుతోఁగూడిన వానిఁ గైకొని యుపయుక్తమునే గ్రహించును. దుఃఖభీతిచే ననుకూల సుఖము నెవఁడును వీడనాడఁడు. జంతువులు తినిపోవు నని వరిపైరు నాట కుందురా? బిచ్చగాండ్రు కల రని కుండల వండకుందురా? దృష్టమగు సుఖము భీరుఁ డెవఁడేని వీడుచో వాఁడు పశువు.

చ. సరసుల కెప్పుడున్ విషయసంగమజాతసుఖంబు దుఃఖసం
కరమని లోన నెంచి విడఁగాఁదగు నంట! విమూఢభావ మా
వరులను దెల్లబియ్యము నపారముగా నిడుచుండు వానిని
బనుసని, పెల్లఁ బొల్లులకుఁ బట్టని, యెవ్వఁడు పాఱఁబోసెడున్.

ఓయీ! పారలౌకిక సుఖము లేనియెడలఁ జాల ధనముచేతను శరీరాయాసముచేతను సాధ్యమైన అగ్నిహోత్రము మొదలగు కర్మలయందు విద్యావృద్ధు లెట్టులు ప్రవర్తించుచున్నా రన్నచో నదియుఁ బ్రమాణము కాదు. వైదికులమని తలఁచు ధూర్తబకములచే నొండొండ అనృత వ్యాఘాత పునరుక్త దోషములచే కర్మకాండప్రామాణ్యవాదులు జ్ఞానకాండమును, జ్ఞానకాండ ప్రామాణ్యవాదులు కర్మకాండమును, ప్రతిక్షిప్త మొనర్చుటచేతను త్రయి ధూర్తప్రలాపమాత్ర మగుటచేతను అగ్నిహోత్రము మొదలగునవి బ్రదుకు దెఱువునకు బరఁగు ప్రయోజనములు. ఇదిగాక, బృహస్పతి వాక్యమును గలదు!—

గీ. అగ్నిహోత్రంబు వేదత్రయంబు మఱియు
బూదెపూయుట దండంబు పుచ్చుకొనుట
పౌరుషమును బుద్ధియును లేనివారలకును
బ్రదుకుదెఱు వని యా బృహస్పతి వచించె.

కావున ముల్లుమొదలగు వానివలనఁ గలుగు బాధయే నరకము. లోకసిద్ధుఁ డగు రాజు పరమేశ్వరుఁడు. దేహనాశము మోక్షము.

దేహమే యాత్మ యను సిద్ధాంతమునందే 'నేను కృశుఁడను; నేను నల్లనివాఁడను' అను నిడల సామానాధికరణ్యము పొసఁగుచున్నది. 'నా శరీరము' అను వ్యవహారము "రాహువుయొక్క తల" అనునట్టులు ఔపచారికము. అనఁగా, దేహమే ఆత్మ. కావున [తాను] నేను కృశుఁడను అనునెడ అన్వయము సరిగా నుండును. అయితే

(౧) ఈ యర్థము కల వాక్యములు 'స్వరితాత్సంహితాయా మనుదాత్తానామ్ - ౧.౨ ౩౯ - ఇత్యాది సూత్రభాష్యములందుఁ గానిపించుచున్నవి. వీని పౌర్వాపర్యము విచారింపవలసి యున్నది.

'నా శరీరము' అనునది యెటులు? అనఁగా, శరీరమే తాను. తాను శరీరముకంటె వేఱు కాఁడు. శరీరముకంటెఁ దాను వేఱగుచోఁ గాని 'నా శరీరము' అనునది కుదుర దన్నచో 'రాహువుయొక్క తల' అను ప్రయోగమువలె నౌపచారికము. రాహువనఁగ తల వినాగా శరీరము వేఱే లేదు. అటులు లే కున్నను తలకంటె వేఱుగాఁ గొంత యున్నటులు 'రాహువుయొక్క' అని వాడఁబడుచున్నది. అటులే 'నా శరీరము' అనునది యౌపచారిక మని యూహింపఁదగు. ఈ విషయ మంతయు నీక్రింది శ్లోకములచే సంగ్రహింపఁబడినది:—

"అత్ర చత్వారి భూతాని భూమివార్యనలానిలాః
చతుర్భ్యః ఖలు భూతేభ్య శ్చైతన్య ముపజాయతే
కిణ్వాదిభ్య స్సమేతేభ్యో ద్రవ్యేభ్యో మదశక్తివత్
'అహం స్థూలః కృశోస్మీ' తి సామానాధికరణ్యతః.
దేహస్థౌల్యాదియోగాచ్చ స ఏవాత్మా న చాపరః
'మమ దేహోయ' మిత్యుక్తి స్సంభవే దౌపచారికీ"

పృథివ్యప్తేజోవాయువు లను నాలుగుభూతములనుండి, సురాబీజములనుండి మదశక్తివలెఁ జైతన్యము పొడముచు. 'నేను స్థూలుఁడను. కృశుఁడను' అను ప్రయోగ సామానాధికరణ్యమువలనను స్థౌల్యాది యోగమువలనను దేహమే ఆత్మ. మఱొండు కాదు. 'నా దేహము' అనునది ఔపచారికము.

స్వభావమువలననే జగతి కలుగుచున్నది.

ఆ. నిప్పు వేఁడిగాను నీరు చల్లనిదిగా
గాలి సమపుఁ దాఁకు గలదిగాను
ఎవఁడు వీని నిట్లు సృష్టించియున్నాఁడు?
వాని యునికి ప్రకృతివలనఁ గలుగు.

ఈ విషయము నంతయు బృహస్పతి యిటులు వర్ణించియున్నాఁడు:—

సీ. స్వర్గములు లేవు. లే దపవర్గములును.
పారలౌకిక మగు నాత్మ లేదు.
వర్ణములు నాశ్రమాదులౌ వానిక్రియలు
నెంత యొనరించు ఫలమునుఁ జూప లేవు.
గీ. అగ్నిహోత్రంబు వేదత్రయంబు మఱియు
బూదపూఁతయు దండంబు ప్రద్విశోఁగ,
పౌరుషము బుద్ధియును లేనివారలకును
బ్రదుకుదెరువుగఁ జేసిరి బ్రహ్మగారు.
క. క్రతువునఁ జంపఁబడు పశు
తతి స్వర్గం బరుగుఁ జూడ తప్పనిచో, నా
క్రతువుల యజమానులు తమ
పితరుల నేలా వధింప విడిచెదరారా!
గీ. చచ్చిపోయినవారికి శ్రాద్ధకర్మ
తృప్తికిని దాను హేతువౌ నెడల, నింకఁ
దిరుగు జంతువులకును పాథేయకల్ప
నంబు లోకంబునందు వ్యర్థంబు కాదె!

క. దానం బిచ్చినచో స్వ
ర్గానం బడియున్నవారు కడుఁ దృప్తిపడం
గా, నిట మేడలనుండెడు
మానిసిమూకలకు నేల మఱి యీయ రహో!
గీ. బ్రదుకువట్టును సుఖముగా బ్రదుకవలయు,
బదులు చేసియు నేయిఁ ద్రావంగవలయు,
బూదిపలుగా మాఱిపోయినట్టి
కాయ మీయెడ మఱల నేగుదెంచి వచ్చు?
క. ఈ కాయము విడిచి పరమగు
లోకము కేఁగెడు జీవుఁడు 'నలోపాలా' యని తో
డాడు లగు సఖిబంధుల
యాకలనము మఱలఁ జేయనయి రాఁ డేలా?
ఉ. కావునఁ బ్రేతకార్యములు కావు ఫలప్రదముల్. ద్విజాధముల్
జీవనమార్గముం గడఁ జేసి రుపాయము. వేదకర్తలన్
మూవురు, భండధూర్తులును మొండినిశాచరుఁ డన్నవాఁడు వా
చావిధి వాగుచుండుదురు 'జర్భరితుర్ఫరి' యంచుఁ బండితుల్.

## సారాంశము

ఈమతమున నీతియుక్త మగు సుఖోపభోగమే పరమపురుషార్థము. ప్రత్యక్షప్రమాణమే ప్రమాణము. తదితరములు అప్రమాణములు. వీరు అనుమానానుమితిశబ్దప్రమాణములను ప్రౌఢముగా ఖండించియున్నారు. ఆఖండనమును బౌద్ధులు ఖండించిరి. వారిని ఖండించి యొకరీతిగా అర్హతులు తా మొక మతమును సిద్ధాంతముచేసికొన్నారు.

## నాస్తికశబ్ద విచారము

పాణిని 'నాస్తికః' అనుశబ్దము నిటులు నిర్వహించినాఁడు:—
"అస్తి నాస్తి దిష్టం మతిః" (౪-౪-౬౦) కాశికాకారుఁడు ఈ సూత్రమునకు ఇటులు అర్థమును వ్రాసెను:—

ప్రథమాసమర్థము లయిన అస్తి-నాస్తి-దిష్ట' అనువానికి షష్ఠ్యర్థమున ఠక్ప్రత్యయము. 'ఇతనికి మతి కలదు గాన ఆస్తికుఁడు; ఇతనికి మతి లేదు కాన నాస్తికుఁడు. మతియున్నమాత్ర ప్రత్యయము రాదు. ఇఁక నేమి? పరలోకము కలదను మతి యితనికిఁ గలదు. కాన ఆస్తికుఁడు; తద్విపరీతుఁడు నాస్తికుఁడు. ఈయర్థము అభిధాన శక్తిస్వభావమువలన (లోకమునందలి వాడుకవలన) లభించును అని కైయటుఁడు:—

పరలోక కర్తృతా చ సత్తా వివక్షితా—అని వ్యాఖ్యానము వ్రాయుటచే పరలోకము కలదను మతి కలవాఁడు ఆస్తికుఁ డని తేలుచున్నది. అంతే మనువు:— వేదము ప్రమాణము కాదని వాదించువాఁడు నాస్తికుఁడు. అను నభిప్రాయమును [౨-౧౧-లో] ఇచ్చియున్నాఁడు. మఱికొందఱు 'ఈశ్వరుఁడు లేఁడనువాఁడు నాస్తికుఁడు' అని యభిప్రేతు లగుచున్నారు. వారి మతమున సాంఖ్యమీమాంసాదర్శనములను నాస్తికము లని చెప్పవలసివచ్చును. గాని, నాస్తికుఁడు కూడ ఆమతములు 'నాస్తికమతము లని చెప్పనొల్లఁడు.

కొందఱు వెనుకఁ జెప్పినదంతయును సంగ్రహించి మఱికొంత చేర్చి యిటులు చెప్పుచున్నారు. "పరలోకము లేదు; తత్సాధనము అగు అదృష్టము - తత్సాక్షి యగు ఈశ్వరుఁడును - లేరను బుద్ధి యెవనికిఁ గలదో, వాఁడు నాస్తికుఁడు."

ఈ మతమునందలి ఏకదేశిమతస్థులు కొందఱిటులు చెప్పుచున్నారు:— పరలోకము ఈశ్వరుఁడు లేరు అనువాఁడు నాస్తికుఁడు. ఈ యుదాహరించిన మతముల నాలోచింపఁగా ఇటులు తెలియుచున్నది:—

వేదకాలమునుండి సూత్రకాలము దాఁక కర్మవిధులు మిగుల ప్రచారమునం దుండుటవలన, ఆకర్మవిధులు చాలవఱకు ముఖ్యముగా పరలోకమునందు పొందఁదగు ఫలములు కలవగుటంజేసి, యపుడు పరలోకమునందు విశ్వాస మత్యావశ్యక మాయెను. కానివాఁడు కర్మానుష్ఠానమే సంభవింపకపోయియుండును. అనేకము లగు నీ కర్మముల ననుష్ఠించియుఁ బ్రత్యక్షముగ ఫల మిసుమంతయుఁ బొందమిచేఁ గాని, కొండొక కారణముచేఁ గాని, యెవరికిఁ గర్మవిధియందు శ్రద్ధ నశించెనో, వారికిఁ గ్రమముగా పరలోకమునందు విశ్వాసము హ్రస్వమైపోయి యుండును. బహుళాయాససాధ్యము అయిన కర్మఫలము ఈలోకమునందే చవిచూడ నెంచిన వీరికి, అస లడుగంటుట కలసను, వీరి ప్రతిపక్షులు కర్మలు ఫల మిచ్చి తీఱు నని సమర్థించు కొఱకు మిక్కుటముగా పరలోకముఁ గూర్చి వ్రాయుటవలనను, వారు పరలోకమే లేదను వాదముఁ గొనియుందురు. దానఁ జేసి కాశికాకారుని వ్యాఖ్యానము సమంజసముగా నన్వితమగును. మఱియు వేదాఽప్రామాణ్యవాదియు నాస్తికుఁ డను నిర్వచనము కూడ సరియయినదియే. ఎట్లనఁ బరమును దిరస్కరించువారు తత్ప్రతిపాదకము లగు వేదములను దిరస్కరింప నెంచెదరు. తల్లిచెవులఁ ద్రెంపువారికి పినతల్లిచెవులు బీఱపువ్వులును కావు కదా!

"ఈశ్వరుఁడు లేఁ డనువాఁడు నాస్తికుఁ" డను వాద మర్వాచీనము. అధ్వరమీమాంసకానుస్థితము లగు కర్మలలో నీశ్వరునిఁ బ్రవేశపెట్టుటకవకాశము లేదు. కావున అచటనచట యాగములలో ఈశ్వరార్చనము కూడ అర్వాచీనులచేఁ బ్రవేశపెట్టఁబడి యుండును.

కాలవిపరిణామమువలన ఏకైకధర్మానుయాయులు స్వప్రతిపక్షులకు నాస్తికపదమును ప్రయోగించుచు వచ్చిరి.

'లింగార్చనపరా శైవా నాస్తికా స్సంప్రకీర్తితాః'

అని మాధ్వులును—

తప్తముద్రాంకితతను ర్నాస్తికం ధర్మ మాస్థితః
పశుతుల్య స్స విజ్ఞేయ స్సర్వకర్మసు గర్హితః,

అని శైవాదులును—ఇటులు తమతమలవారును—ఒకరినొకరు నాస్తికు లని దూషించికొనుట సామాన్యమయినది. ఇది యంతయు విద్వేషప్రసూత మని విశేషించి చెప్ప నక్కఱలేదు.

## ౨ లౌకాయతికులు

లౌకాయతిక మను నామము నాస్తికాపర నామధేయమే. 'లోకాయతమ్ అధీతే, వేదవా' అను నర్థమున ఠక్ ప్రత్యయము చేయఁగా లౌకాయతికశబ్దము నిష్పన్నమగును. పాణిని సూత్రపూర్వకముగా ఈశబ్దమును నిర్వచింపకున్నను క్రతూక్థాదిగణమున లోకాయతశబ్దమును బఠించియుండుటఁ జేసి యీవ్యుత్పత్తి యూహన కల్పితేతరము.

## ౩ లోకాయతికుఁడు

ఒకానొకచో లౌకాయతిక శబ్దస్థానమున లోకాయతశబ్దము కూడఁ గలదు. శారీరకభాష్యమున:— లోకాయతికానా మపి చేతన ఏవ దేహః, (౨-౨-౨) ఇటులే ౩-౩-౫౩ సూత్రభాష్యమునఁ గూడఁ గలదు. ప్రతాపరాయసంస్కృత మగు మహాభారతము (౧-౭౦-౪౯) నందును గలదు.

## ౪ లోకాయతుఁడు

కొండొకచో నాస్తికపదమునకుఁ బర్యాయముగా లోకాయత పదము వాడఁబడుచున్నది. రామతీర్థకృత మగు వేదాంతసార టీకలో (జాకోబ్ పరిష్కృతము) 'లోకాయతానాం = చార్వాకవిశేషాణామ్' అని ౧౪౧ వ పుటలోఁ గలదు. హరిభద్రసూరి షడ్దర్శనసముచ్చయమున—

లోకాయతా వదం త్యేవం నాస్తి దేవో న నిర్వృతిః
ధర్మాఽధర్మౌ న విద్యేతే న ఫలం పుణ్యపాపయోః

అని కలదు. తట్టీకాకారుఁడు మణిభద్రుఁడు లోకాయతపదమునకు నాస్తికు లని యర్థము వ్రాసెను. శ్రీహర్షుఁడు నైషధీయమున ౧౭వసర్గ-౫౪ వ శ్లోకమున లోకాయతపదమును నాస్తికార్థమునఁ బ్రయోగించెను. ఈయర్థమునఁ గ్రమముగా లౌకాయతికులు, లోకాయతికులు, లోకాయతులు అనుపదములు ప్రచారములోనికిఁ దేఁబడినవి. లోకాయత మనఁగా చార్వాకశాస్త్రమని యమరటీకాకారుఁడు వ్రాసెను. అయినను దీపక మీ యర్థమునందే శక్తము కాదు. సామాన్యముగాఁ దర్కశాస్త్రముకూడ దీని యర్థము. ఈపదము తార్కిక పర్యాయ మని వ్రాయుచు శబ్దకల్పద్రుమకారుఁడు దానికిఁ బ్రమాణముగా—

ఐక్యనానాత్మసంయోగ సమవాయవిశారదైః
లోకాయతికముఖ్యైశ్చ శుశ్రువు స్స్వన మీరితమ్.

[౨౪౮-౩౦-హరివంశే]

ఈశ్లోకము నుదాహరించినాఁడు. [ముద్రితపుస్తకములలో నీశ్లోకము కానరాలేదు.]

రామాయణమునకుఁ టీక వ్రాసిన తిలకుఁడు—

కచ్చిన్న లోకాయతికాన్ బ్రాహ్మణాం స్తాత సేవసే
అనర్థకుశలా హ్యేతే బాలాః పండితమానినః [౨-౧౦౦]

అను శ్లోకమునందలి లోకాయతికశబ్దమునకు కుత్సితతర్కవాదులు అని యర్థము చెప్పి, దీని ముందున్న

ధర్మశాస్త్రేషు ముఖ్యేషు విద్యమానేషు దుర్బుధాః
బుద్ధి మాన్వీక్షికీం ప్రాప్య నిరర్థం ప్రవదంతి తే - (౨-౩౯)

ఈశ్లోకము నందులకు ప్రమాణముగా నుద్ధరించినాఁడు. ఇది బౌద్ధులఁ గూడ సంగ్రహించుచున్నది. అచట లోకాయతపదముచే

వితండాశాస్త్రము బోధింపఁబడుచున్నది. అభిధానప్రదీపికలో

వితండసత్థం విఞ్ఞేయ్యం యంతం లోకాయతం-

అని కలదు. ఈవిచారణవలన లోకాయతికశబ్దము తొలుత కుతర్కవాదములఁ జెప్పునదిగా నుండి, పిదపఁ దత్సామ్యమునఁ జేసి నాస్తికులఁగూడఁ జెప్పున దాయెను. లోకాయతాపరనామము కల యీ వితండాశాస్త్రమే హేతుశాస్త్రమని చెప్పఁబడుచు, నచట నచట, నిందింపఁబడుచున్నది.

(*) కేవలహేతువాదుల గర్హించుట ప్రసిద్ధమే కదా!

హైతుకాన్ బకవృత్తీంశ్చ వాఙ్మాత్రేణాఽపి నార్చయేత్

[విష్ణుపు-౩-౧౮ ౯౯]

కొన్నితావుల సద్యుక్తి చెప్పువాఁడును హైతుకుఁడు నాఁబడుచున్నాఁడు:—

త్రైవిద్యో హైతుక స్తర్కీ నైరుక్తో ధర్మపాఠకః

త్రయ శ్చాశ్రమిణః పూర్వే పరిష త్స్యా ద్దశావర

[మను-౧౨-౧౧౧.]

ఇట హైతుకుఁ డనఁగా శ్రుతిస్మృత్యవిరుద్ధశాస్త్రజ్ఞుఁ డని కుల్లూకభట్టు వ్యాఖ్యానము.

౫. బార్హస్పత్యుఁడు

నాస్తికునకు బార్హస్పత్యుఁ డనియుఁ బేరు కలదు. హేమచంద్రుఁడు:—

బార్హస్పత్య స్తు నాస్తికః

అని తన నిఘంటువున వ్రాసియున్నాఁడు. బృహస్పతి నాస్తికవాదమున కాచార్యుఁ డని యెల్లెడఁ బ్రసిద్ధము. కావుననే కాఁబోలు మాధవాచార్యుఁడు చార్వాకునకు బృహస్పతి మతానుసారి యని విశేషణమును దగిల్చినాఁడు. మిగుల వీర్ఘకాలమును నాస్తికునిఁ దెల్పవలయుపట్ల నచటనచట బార్హస్పత్యపదమును వాడుచుందురు. ఈ వాదమునకు మైత్ర్యుపనిషత్తు ౭. ౮. మొదలగునవి మూలములుగాఁ గాన వచ్చుచున్నవి. అందుఁ జోటుల బృహస్పతి యసురులకు నాస్తికవాద ముపదేశించినటులు చూపఁబడెను.

"బృహస్పతి శుక్రాచార్యునివేషము దైచికొని యింద్రుని యభ్యుదయమునకును, అసురుల నాశమునకును, ఈ అవిద్యను సృజించెను. ఈ యవిద్యచే మంగళము నమంగళముగను, అమంగళమును మంగళముగను తలఁతురు. వేదశాస్త్రములకు దూరముగా నుండవలయు నందురు."

ఈయుపనిషత్తునందే కొండొకటి:—

"ఓంకారోపాసకులైన దేవతలును అసురులును ఆత్మతత్త్వ మెఱుఁగ బ్రహ్మకడకేఁగి నమస్కరించి యిట్లు పలికిరి:-భగవానుఁడా! మే మాత్మతత్త్వ మెఱుఁగఁగోరి మీకడకు వచ్చితిమి. మాకుఁ దెల్పుము. అనఁగా బ్రహ్మ ఆలోచించి యీ రాక్షసులు అన్యాత్ములు. అనఁగా దేహాత్మవాదులు. కాన, దేవతల కుపదేశించినదానికంటె భిన్నముగా నుపదేశింపఁదగు నని యిటు లొనర్చెను. ఆ మూఢులు ఆయుపదేశమును నిశ్చయమనుకొని, అనూయాపరులు - ముక్తివిరోధులు - అనృతవాదులునై ఇంద్రజాలమువలె అనృతమును సత్యముగాఁ గాంచిరి. కాన వేదమార్గము సత్యము. వేదములను విద్వాంసులు పోషించుచున్నారు. కాన బ్రాహ్మణుఁ డవైదికముఁ జదువఁగూడదు.

బృహస్పతియే కాక బ్రహ్మయుఁడ బోధముఁ డని తెలుచున్నది. ఛాందోగ్యోపనిషత్తునందుఁ గూడ అసురులు దేహాత్మవాదులని కలదు. [౮-౮] అట విద్యాదాత బ్రహ్మోపదేశకుఁడగు ప్రజాపతి. బృహస్పతి కాఁడు. ఆకథాసార మిట నుదాహరించుచున్నాఁడ.—

"దేవతలపక్షమున నింద్రుఁడును అసురులపక్షమున విరోచనుఁడును తత్త్వాన్వేషణమునకు దర్భపవిత్రపాణులై ప్రజాపతి కడ కేఁగి బ్రహ్మచర్యముఁ గైకొని మున్నూటేండ్లు నివసించిరి. ప్రజాపతి వారి కొక నీరికుండయందుఁ బ్రతిబింబమును జూపి యిదియే యాత్మ అని తెలిపెను. వారలు తెలిసికొంటి మని చనిరి. పిదప నింద్రుఁడు సందిహానుఁడై తృప్తి నొందలేక, మఱలఁ బ్రజాపతికడ కేఁగి ఆత్మతత్త్వ మెఱిఁగెను. విరోచనుఁడు శరీరమే ఆత్మయనుకొని యసురులకు శరీరమే ఆత్మ యని బోధించెను. ఎట్లనఁగా - ఈలోకమున ఆత్మ పూజనీయమును పరిచర్యమును. ఆత్మను బరిచరించుచు ఇహాముత్రల సుఖ మందును."

ఈ సంప్రదాయము నేఁటికిఁ గలదు. దానహీనుని శ్రద్ధాహీనుని యజ్ఞము చేయనివానిని అసురుఁ డని శిష్టులు తలఁతురు. ఈ యుపనిషత్తు శ్రద్ధాదుల బోధింపక యసురుల నుపపాదించుచున్నది. [తత్పశ్చాద్భాగమున] ప్రేతశరీరము నీ యుపనిషత్తుచే సంస్కరించి బట్టలతో నలంకారములతోను అలంకరించుచున్నారు. ఈ (శవ) సంస్కారముచే ఈలోకమును జయింపఁగల మని వారి తలఁపు.

ప్రజాపతియంతవాఁడు ఎంతటి యసురుల నైనను వంచించి యుండఁ డని తలఁచి యిటీవలి మైత్ర్యుపనిషత్తున బృహస్పతి నాస్తికోపదేష్టగాఁ జెప్పంబడెనని మోక్షమూలర్:—

It is not unlikely that Brihaspathi was introduced in the lattr Upanishad in order to take the place of Prajapathi, because it was felt to be wrong that this highest diety should ever misleds anybody, even the demons.

అని వ్రాసినాఁడు. బృహస్పతిపేరులు పలుతెఱంగులఁ గానవచ్చుచున్నవి. ధర్మశాస్త్రకర్త యగు బృహస్పతి యొకఁడు కలఁడు. భారతమునందే కొండొక బృహస్పతి (౨) కతనివలనఁ గూడ [ఉశనుఁడు వేరు - బృహస్పతి వేరు] కరదశాస్త్రకారుఁ డని కలదు. ఋగ్వేదమున [నాలుగువేలపట్టుల] బృహస్పతిపేర వివిధములు కలవు. అందొకఁడు (౩) ఆంగిరసుఁడు. కొండొకఁడు (౪) లౌక్యుఁడు. ఈలౌక్యునకును లౌకాయతికమునకుఁ గల సంబంధము

(*) చూ. మను ౨-౧౧. చూ. మహాభారతము. (౧) ౧౩-౧౧౨. (౨) ౧౩-౩౯; ౮-౧౦. (౩) ౧౦-౭౧. 'కపిబోధాదాంగిరసే' అను సూత్రము చూ. (౪) ౧౦-౭౨. (౫) ౮-౯౬-౧౫.

విచారింపఁదగియున్నది. తత్పూర్వకములలో నాస్తికవాదగంధమైనను లేదు. ఋగ్వేదమునందే (౪) బృహస్పతి యనుపేర నొక దేవత కలఁడు. ఈభాషాటవి యందు ఏతి పట్టుకొన్నచో బృహస్పతు లింకను దొరకకపోరు. కాని దొంగ యెవఁడో తెలియదు. మహాభారతము ఏబృహస్పతికి వంచనాశాస్త్రకర్తృత్వ మారోపించుచున్నదో ఆబృహస్పతికి యీ గౌరవమున కర్హుఁడు.

ఉశనా వేద యచ్ఛాస్త్రం యచ్చ వేద బృహస్పతిః
స్త్రీబుద్ధ్యా న విశిష్యేతే తాస్తు రక్ష్యాః కథం నరైః?
స్త్రీణాం బుద్ధ్యర్థనిష్కర్షా దర్థశాస్త్రాణి శత్రుహన్
బృహస్పతిప్రభృతిభి ర్మన్యే సద్భిః కృతాని వై

[మహా-భా- ౧౩. ౩౯; ౫ ౧౦-]

ఇటులు కాక మైత్ర్యుపనిషత్తునందలి బృహస్పతియే తత్కర్త యనుఁడు. నిర్వివాదము. దేవాచార్యుఁడును - పురోహితుఁడును నగు బృహస్పతికి నాస్తికవాదకర్తృత్వ మారోపించుట విస్మయావహమే! ఉపనిషత్కారుల కట్లారోపింప నేమి హేతువో?

## ౬. చార్వాకుఁడు

చార్వాకదర్శన మను పేరఁ బరఁగు గ్రంథమే నాస్తికశాస్త్రమునఁ బ్రసిద్ధగ్రంథము. ఇంకను గ్రంథము లు దొరకనంతవఱకు దీనినే వారి యుద్గ్రంథముగా నంగీకరింపవలసియున్నది. సర్వదర్శనసార సంగ్రహమున మాధవాచార్యులు—బృహస్పతిమతానుసారియు నాస్తికవాదశిరోమణియు నగు చార్వాకునిచే — అని వ్రాసినారు. ఇటులు చాలమంది చార్వాకుని నాస్తికశాస్త్రమునకుఁ గర్తగా వ్యవహరించుచున్నారు. కాన నీ చార్వాకుని విచారింతము. చార్వాకశబ్దమునకు ఇటులు వ్యుత్పత్తిని చెప్పుదురు. చారు + వాక,

చార్వాకః. [పృషోదరాది] చారు = లోకచిత్తాకర్షకమైన, వాక = వాక్యములుకలవాఁడు. మూర్ఖులగు:—

The name of Charvaka is clearly connected with that of Charva and this is given as synonym of Buddha by Balasastry in the preffare to his edition of Kasika.

అని వ్రాసెను. ఇది పొరపాటు. శ్రీ శ్రీ బాలశాస్త్రిగారు— చార్వీ బుద్ధః-అని కొంతగ్రంథము వ్రాసినారు. అది వారి సొంతము కాదు. 'సంమానకోత్సఙ్గన—' అను సూత్రము పైఁగల వృత్తి నను సరించిరి. అట — చార్వీ= బుద్ధిః- అని కలదు. బాలశాస్త్రిగారి 'బుద్ధః' అనునది ముద్రాదోషము. ఆతప్పు నొప్పుగాఁ దలఁచి ముప్పు గొన్నారు కొందఱు గారు.

మహాభారతమునఁ జార్వాకుఁ డొకఁడు కలఁడు. వానికిని నాస్తికమతమునకును బంధుత్వ మేమియును గానరాదు. ఆతఁడు బ్రాహ్మణద్వేషి. దానఁజేసి యాతఁడు రక్కసుగాఁ దెలుపఁబడియుండెను. వేణీసంహారమునందలి చార్వాకుఁ డొకఁడే. కాని నాటకచార్వాకుఁడు కాన వేఱుగాఁ గానఁబట్టును. న్యాయకుసుమాంజలి యను గ్రంథము క్షణభంగవాది యగు బౌద్ధుని చార్వాకుఁ డని వాడినది. ప్రకాశకారుఁడు నటులే చెప్పెను:—

స్యాదేతత్ మా భూ దధ్యక్ష మనుమానం శాక్షణికత్వే, తథాహి సందేహోఽస్తు ఏతావతాఽపి సిద్ధం సమీహితం చార్వాకస్యేతి

[౧ స్త బక-౧౫౨-సో-సా.]

విచారింపఁగా చార్వాకుఁడు వేఱు. బౌద్ధుఁడు వేఱు. చార్వాకుఁడు నాస్తికశిరోమణి. కాని స్వతంత్రముగా నాస్తికవాదగమయిత కాఁడు. ఆతఁడు బృహస్పత్యనుయాయి యని కానిపించెడిని.

## ౭. పాషండుఁడు, పాషండి, పాషండకుఁడు, పాషండికుఁడు

పాషండశబ్దము కూడ నాస్తికపరముగాఁ గవులచే వాడఁబడినది. శ్రీహర్షుఁడు నైషధీయమున [౧౭-౧౦౨]

బభాణ వరుణః క్రోధా దరుణః కరుణోజ్ఝితమ్
కిం న ప్రచండాత్ పాషండపాశ! పాశాద్బిభేషి నః

అని ప్రయోగించినాఁడు. సాంప్రదాయికులు దీనికిఁ గ్లిష్టముగా వ్యుత్పత్తి నిచ్చియున్నారు. పాపం + సనోతి = మాపుచేతను గలియికచేతను పాపము కలిగించువాఁడు. (౧) పృషోదరాదులలోఁ బెట్టి సాధింప వలయును. లేక, పాతీతి=పా (క్విప్) = వేదధర్మము షండయతి = ఖండించువాఁడు. కాఁగా పాషండుఁడు. (౨) కొందఱు పాషండశబ్దము సంస్కృతము కాదనియు, వైదేశికము గాని ప్రాదేశికము కాని యగు ననియు నభిప్రేతు లగుచున్నారు. (3) ఈ శబ్దము న్యాయకుసుమాఞ్జలి మొ. గ్రంథములయందుఁ గూడఁ బ్రయుక్తమై యున్నది. బౌద్ధులయెడ నీశబ్దము అసకృదావృత్తమై యున్నది. అర్హతులుకూడ నీశబ్దముచేఁ దిరస్కృతులు కాకపోవుట లేదు. ఇంతియ కాదు. విరుద్ధాచారములకల ప్రతివాదులను ఈశబ్దముచే నిరూపకేశింపఁబడుచున్నారు. (౧) అటువటు (౨) పాషండి (3) పాషండక (౪) పాషండికు, పదము లీ స్థానమునఁ బ్రయోగింపఁబడినవి.

## ౮. పాషండుఁడు - బౌద్ధజైనుల యుద్దేశము

బౌద్ధగ్రంథములలోఁ బాషండపదమున కెక్కుడు ప్రచారమున్నది. ఆపదముచే బౌద్ధులు తమ్ము సంబోధించుకొనక తమకు విరుద్ధములగు నన్నిటియెడఁ బ్రయోగింతురు. వారు తొంబదియాఱు తెఱఁగులకు పాషండులు కలరని వ్రాసినారు.

షట్టీపకాది భేదు త్రింశత్ న్యాసట్టి బట్టిరా
ఇతి న్నవ్నతిః ఏతే పాషండా సంపరికీర్తితా

అభిధానప్పదీపికా-౪౪౦.

[షట్టీపకాదినామములు ౩౪. మిగిలినవి ౬౨.]

(౧) 3-౧౮-వ-విష్ణు-పు-చూ. (౨) పాలనాచ్చత్రయీ ధర్మః పాశబ్దేన నిగద్యతే తం షండయంతి తే యస్మాత్ పాషండా స్తేన హేతునా. (3) The great epic of the India (Hopkins) P-49. Foot note చూ.
(౧) పద్మపురాణము-ఉ-ఖం-౪౨ అ. (౨) చూ-విష్ణుపురాణమ్ (3) చూ-శబ్దరత్నావళి. (౪) చూ-మణిభద్రకృత షడ్దర్శనసముచ్చయటీక.

ఈ మతములు బ్రహ్మజాలసూత్రమున వర్ణింపఁబడ్డవి. అర్హతులు 3౬3 పాషండులను జెప్పిరి.

అసియసయం (౧౮౦) కిరియాణం అకిరియవాఈణ హోఇ చులసీఈ, (౮౪) అన్నాణియ సత్తట్ఠీ వేణఇయాణంచ బత్తీసం(3౨) [మణిభద్రః]

## నాస్తికవాదమునకు మూలము

పాణిని 'నాస్తిక' శబ్దమును సాధించుటఁ జేసి యాతనికంటె నీవాదము ప్రాచీనతరము. మహాభారతము రామాయణము మైత్ర్యుపనిషత్తు ఛాందోగ్యము బృహదారణ్యకము, కఠము లందును నీవాదము కలదు. బ్రాహ్మణములందును నీవాదము కలదు. మంత్రభాగములందును నీ వాదము కలదు. దేవతలఁ గూర్చి ఋషులు ఆయాయి వస్తువులఁ బ్రార్థించుపట్లఁ జెప్పిన కొన్ని ఋక్కులలో - నీ విషయము కానిపించెడిని. ఏవిధముగానైనను వారికోర్కి ఫలించునెడ నామంత్రము మహిమ కలదని వారికి దానియెడఁ బ్రమాణబుద్ధి పొడమియుండును. ఇటులు ప్రామాణ్యముఁ గూడఁ గల్పింపక పోలేదు. అటు లే హేతువు వారిస్తుతులు ఫలింపకుండుటయే. వ్యర్థమనోరథులకు దానఁ బ్రామాణ్య మెటులు? ఏ దేవునందు విశ్వాసము మితిమీఱి యుండెనో ఆ దేవునందే అవిశ్వాసము కూడ నొకపెడఁ బెరుఁగుచునే యుండెనని కానఁబడుచున్నది. ఈ క్రింది విషయములు పై విషయమును స్థిరీకరించును.

(౧) యుద్ధమును గోరునో జనులారా! ఇంద్రుఁడుండు నెడల మీ రింద్రునికొఱకు నిజ మగు స్తోమమును ధరింపుఁడు. నేమర్షి యగు భార్గవుఁడు ఇంద్రుఁ డని యొకఁడు లేఁ డనుచున్నాఁడు. ఆ యింద్రు నెవరు చూచిరి? మే మెవరిఁ గొండాడుదుము?

ఇట్లనుటఁ జేసి యింద్రుఁడు వాదమాత్ర మని తెలియుచున్నది.

(౨) ఓ స్తోతా! ఇదిగో! నీ ప్రక్కనున్న నన్నుఁ గనుము. సర్వభువనములను మహాత్త్వముచేఁ దిరస్కరించుచున్నాను. సత్యోపదేష్టలగు విద్వాంసులు నన్ను స్తోత్రములచేఁ సంతసపెట్టుచున్నారు మఱియు దారణశీలుఁడ నగు నేను భువనముల దద్దరిల్లఁ జేయుచున్నాను.

కొండొకట నిటులు చూపట్టెడిని.

(౧) జను లెవనిని ఘోరుఁ డందురో ఆ యింద్రుఁ డెటనున్నాఁడు? జనులు ఇంద్రుఁ డని యొకఁడు లేఁ డందురు. ఆ యింద్రుఁడు భయపెట్టి శత్రువుల దబ్బు హరించును. కాన నింద్రుని విశ్వసింపుఁడు ఇంద్రుఁడు కలఁ డని విశ్వసింపుఁడు.

ఈ సూక్తమువలన నాకాలమున నింద్రునియెడ విశ్వాసము కల దని తెలియును. వైదిక దైవములలో నింద్రుని కత్యున్నతపదవి కలదు. అటులు విచికిత్సయుఁ గలదు. మఱికొన్ని చోటుల నాతని యెడఁ బరమవిశ్వాసము కలదు—

(౨) రాధుఁ డగు నా యింద్రుఁడు గొప్ప బలముచే జనుల సౌఖ్యముకొఱకు యుద్ధము లొనర్చును. ఎప్పుడింద్రుఁడు చంప సాధక మగు వజ్రముచే మేఘములఁ గొట్టునో అపుడే ప్రకాశవంతుఁ డగు నాతనియెడ విశ్వాసము కలుగును.

(3) మిగుల గొప్ప యగు నింద్రునిబలముఁ జూడుఁడు. ఏలన నీతఁ డావులను గుఱ్ఱములను ఓషధులను నీరిని వనములను సంపాదించెను. ఆతని బలమునెడ విశ్వాసము చెందుఁడు.

(౧) ఇటులు పెక్కు లుదాహరింప నగును. ఈ పర్యాలోచనముచే మంత్రకాలమునాఁటికే దేవతలయెడ సంశయబుద్ధి కలిగె ననవచ్చును. బ్రాహ్మణసమయమునను, సూత్రకాలమునను, ఇట్టి విచికిత్స కలదని సువిస్పష్టము. వేయేల? జ్ఞాన మెపు డారంభ మాయెనో అపుడే యీ విచికిత్స కారంభము. మంత్రములు కొన్ని యనర్థకము లని పలువు రుద్ఘోషించినారు. వారివాదము ఖండింప మహాసంరంభముతోఁ గొందఱు గ్రంథములు రచించినారు. అంతియకాక వారు స్వమతము నుపపాదింపను గూడఁ బలుగ్రంథముల వ్రాసియున్నారు. మంత్రము లనర్థకము లని ప్రతిపాదించు కౌత్సుని-స్వనిరుక్తమునందు యాస్కుఁడు ఖండించినాఁడు. (౨)

## 3. సంఘర్షణము

నాస్తికశబ్దపరిణామమును రెండవప్రకరణమువలన నెఱిఁగియున్నారము. కాలము గతించినకొలఁది చార్వాకులును బౌద్ధులును అర్హతులును నాస్తికమతము క్రిందఁ బ్రత్యేకముగా విభక్తు లయిరి. ఆ మూఁడును ఒండొం డభిన్నము లయినను ఆమూఁడు కలిసి నాస్తికమతము అను శీర్షిక క్రిందికి రా నవకాశము కలిగియున్నది. బ్రాహ్మణ మంత్ర, ఉపనిషత్, సూత్రకాలములఁదు నాస్తికమతము నుపపాదించు గ్రంథములు కానరావు. పురాణకాలమునందు అట్టి మతము

---

(౧) ప్ర సుస్తోమం భరత వాజయన్త ఇన్ద్రాయ సత్యం యదిసత్య మస్తి, నేన్ద్రో అస్తీతి నేమ ఉత్వ ఆహ క ఈం దదర్శ క మభిష్టవామ. [౮-౧౦౦.] (౨) అయ మస్మి జరితః పశ్య మేహ విశ్వా జాతా న్యభ్యస్మి మహ్నా, ఋతస్య మా ప్రదిశో వర్ధయన్త్యా దర్దిరో భువనా దర్దరీమి.

(౧) యం స్మా పృచ్ఛన్తి కుహ సేతి ఘోర ముతే మాహు ర్నైషో అస్తీత్యేనం, సో అర్యః పుష్టీ ర్విజ ఇవామినాతి శ్రదస్మై ధత్త సజనాస ఇంద్రః. [౨-౧౨-౫] (౨) స ఇ న్మహాని సమిథాని మజ్మనా కృణోతి యుధ్మ ఓజసా జనేభ్యః, అధా చ న శ్రద్దధతి ఇంద్రాయ వజ్రం నిఘ నిఘ్నతే వధం. [౧-౫౫-౫] (౩) తదస్యేదం పశ్యతా భూరిపుష్టం శ్రదింద్రాస్య ధత్త నవీర్యాయ, సగా అవిందత్ సో అవింద దశ్వాన్స ఓషధీః సో అపః సవనాని. [౧-౧౦౩-౫]

(౧) చూ-ఋక్-౧-౧౦౪; ౬-౬; ౬-౧౦౧; ౧౦-౨-౨ - Max Muller's Lectures on the origin of Religion P P 140 143-307-10. (౨) అథాపీద మంతరేణ మంత్రే ష్వర్థ ప్రత్యయో నవిద్యతే...యది మంత్రార్థప్రత్యయాయ అనర్థకం భవతీతి కౌత్సః; అనర్థకా హి మంత్రాః. [నిరుక్తమ్-పూ-ప-౧-౫-౧.]

అందలికథలయం దుపపాదింపఁబడి యున్నది. పదఁపడి మాధవాదులు ఖండనమున కుపయుక్తము లగు నంశముల నటనటనుండి యుద్ధరించు కొనినాను. పురాణకాలమునందలి నాస్తికమతకథ నొండు నుద్ధరించు చున్నాను.

(౧) ధర్మజ్ఞుఁడును మహారాజు నగు వేనమహారాజసభలో బ్రహ్మచిహ్నధారియు నగ్నుఁడును మహాకాయుఁడును నరసిన వెండ్రుకలు గలవాఁడును దంతయందు నెమలి యీఁకలతోఁ గట్టిన చీఁపురు కట్టఁ బాల్చువాఁడును దొంకాయ కమండలువు చేఁబట్టినవాఁడును వేదశాస్త్రముల దూషించు గరువ్వాస్త్రమును శరించువాఁడును అగు నొక పురుషుఁడు ప్రవేశించెను. వేనుఁడా పాపినిఁ జూచి— ఇట్టి చిత్రరూపమును దాల్చి నీ వెవఁడవు? ఏల వచ్చితివి? ఈ వేస మేమి? నీ పే రేమి? నీ ధర్మ మేమి? నీ పని యేమి? నీ వేద మేమి? ఆచార మేమి? నీతి యేమి? భావన యేమి? జ్ఞాన మేమి? ప్రభావ మేమి? ధర్మలక్షణ మగు సత్యమేమి? అని ప్రశ్నలు వైవఁగా, పాపుఁ డిటులు నుడివెను. ఇట్టి శంకలు వైచుచున్నావు. నీవు మహా మూఢుఁడవు. నేను ధర్మమునకు గుండెకాయను. నేనే జ్ఞాన మను. నేను సత్యమను. బ్రహ్మ మను వెక్కేల? జినరూపము ధరించిన నేను సర్వమును.

వేనుఁడు—నీ ధర్మ మేమి? దర్శన మేమి? ఆచార మేమి?

పురుషుఁడు—జైనులు దేవతలు. గ్రంథార్థభావము గురువు. దయ పరమధర్మము. అదియే మోక్షము. ఆచార మేమనఁగా, యజనము యాజనము వేదాధ్యయనము సంధ్య తపస్సు దానము హవ్యము కవ్యము పితృతర్పణము అతిథిపూజ వైశ్వదేవము కృష్ణపూజ ఈమొ. ఏవియు లేవు. జినధ్యాన ముత్తమము. ఇదియు జైనధర్మము.

వేనుఁడు—ఇది యుల్ల నేనవుయన్నము. నక్కుము చెప్పుము.

పురుషుఁడు — పంచభూతములచే పుట్టించిన శరీర మే (*) ఆత్మ. ఇది వాయుస్వరూపము. వేదప్రోక్తములగు కర్మలకు దీనితో నేమి సంబంధము? కంటికి కనుపడుట లేదు. పుట్టునో అటులే భూతములు పుట్టును. భూమి రజఃకణముల సముదాయము. భూమియం దుదకములు కలదు. వెలుఁగుకూడ నటనే కలదు. ఈ మూఁటిని వాయువు కదలించును. పిదప నాకాశ మాకరించెను. పదపడి బుడగలు పొటమరించుచున్నవి. అనఁగా జీవులు. ఉదకమధ్యమున ఒకానొక గుండ్రని తేజస్సు చెప్పపాటుకాలము కనుపట్టి వెంటనే యెట్లు నశించునో, అటులె భూతసమాయోగమును నశించుచుండును. అంత్యకాలమున వాత్మ పంచత్వముఁ గలిసి పోవుచుండును. యూనపులు మోహాచుక్ష్రుతి తెయగుదురు. అజ్ఞానముచే శ్రాద్ధమునకు మృతులైనవారికును జేయుచున్నారు. చచ్చినవాఁ డెచట నున్నాఁడు? ఎటుల తినును? శ్రాద్ధము పెట్టు టెవనికి? ఇది నిక్కమనుటకు ఎవఁడు చూచెను? అతిథి యింటికి వచ్చుచో విందు చేయవలసినదియే. వేదములఁ బ్రతిపాదిత మగు కర్మ దారుణ మయినది. అశ్వమేధమున గుఱ్ఱమును, వాజపేయమున మేఁకను రాజసూయమున ననేకప్రాణులను, పుండరీకమున నేనుఁగును జంప వలసినదని వేదము చెప్పెడిని. ఇది యేమి కర్మము? అది యేమి ధర్మము? ఏమి ఫలము? వేదపండితులచేఁ బశుమారణము ధర్మమా? ధర్మము నశించినది. దయలేని ధర్మ మేమి ధర్మము? జీవపాలనము ధర్మము కాని మారణము ధర్మమా? స్వాహాకారము స్వధాకారము తపస్సు, వీని కేమి? వీని నన్నిఁటి నెపుగుబట్టిన వపుడు చేయునది. దయాహీన మగు కర్మ నిష్ఫలము. దయవీఁడుచో వేదము లవేదములు. దయా దానపరుఁడై జీవుల రక్షింపవలయును. అటులు రక్షించు చండాలుఁడైనను, శూద్రుఁడైనను, వాఁడే బ్రాహ్మణుఁడు. నిర్దయుఁ డైన బ్రాహ్మణుఁడు చండాలుఁడు. పొల్లు మాటలను జెప్పునది వేదము కాగా, జ్ఞానము నేది నిర్వచించునో యవియే వేదములు. దయాహీనము లగు పత్రులయందును అట్టి వేదములందును సత్యము లేదు. జినధర్మము భుక్తిముక్తిప్రదాయకము. బహుపుణ్యదాయక మగు విషయమును నీకుఁ జెప్పుచున్నాను. తొలుత శాంతచిత్తముతో దయ నేర్చికొనవలయును. చరాచరాత్మకుఁ డగు జినుని ధ్యానింపవలయును. అతనికి నమస్కారాదికము చేయవలయును. తలిదండ్రుల పాదముల కెపుడు నెఱగరాదు. ఇఁక నితరులకు మ్రొక్కఁగూడ దని వేఱే చెప్పనేల?

వేనుఁడు—ఈవిప్రులు గంగాదినదులను బుణ్యతీర్థము లనుచున్నారు నిక్కమును నాకెఱిఁగింపుము.

పురు—ఓ మహారాజా! మిన్నులనుండి మబ్బులు వర్షించుచున్నవి. గుట్టలమీఁదను నేలమీఁదను నీరుపడును. అది యంతయు నదులగుఁ గదా! నదులు జలప్రవాహములు చెరువులు, సముద్రములు నంతియ కదా! పర్వతములు రాతిగుంపులు కావా? ఇవి పుణ్యతీర్థములనియు పుణ్యక్షేత్రము లనియు నెటులు ఒప్పదల? ఆ పుణ్యతీర్థములలో స్నానము చేయుచో సిద్ధి కలుగునెడల వానియం దెల్లపుడుండు చేఁప లేల సిద్ధిఁ బొందవు? కాన నివి యంతయు నసత్యము. జీవుఁడే తీర్థము. జీవునియందె ధర్మము కలదు. తపోదానాదిక మగు సమస్తపుణ్యము జీవుని యందె కలదు. జినుఁడొకఁడే సర్వమయుఁడు. తీర్థము లన్నియుఁ గల్పితములు. జినుఁడే ధ్యేయుఁడు—ఇటులు బోధింపఁబడి వేనుఁడు పాపి యాయెను."

ఈకథవలన నాస్తికమతమున దయ ముఖ్యమని తెలుచున్నది. ఈ యహింస నే మూలసూత్రముగాఁ జేకొనిన నాస్తికమతమును బౌద్ధమతమును క్రింద నిలువఁబెట్టి యద్వైతులు ఖండించుచున్నారు.

ఏ భూతమును జంపరాదు. దస్యుమునఁ బశువును జంపవలయును. (౧) అని వేదము తిన్నగాతోమున శాసించుచున్నది. అయినను వేదమతమునకు అహింసయే మూలము కాదు. అదియే మూలమగుచో (౨) గీతాదికము విరోధించును. అట్లు హింసచేయుమని గీతాభిప్రాయము కాదు. తన్మతమున (3) దయకూడ సంతఃపాతిగునే యయ

(*) భూమిఖండము. ౩౬ అధ్యా-పద్మపురాణము-చూ. (౧) చార్వాకదర్శనమున శరీరమునకు భూతచతుష్టయమే కారణమని కలదు.

(౧) మా హింస్యాత్ సర్వభూతాని యజ్ఞాయ పశు మాలభేత. (౨) గీతాభిప్రాయము యుద్ధ మొనర్చుటలోఁ దుదకుఁ బర్యవసన్నమయినది. (3) అహింసా సత్య మక్రోధ స్త్యాగ శ్శాంతి రపైశునమ్ దయా భూతే ష్వలోలుప్త్వం మార్దవం హ్రీ రచాపలమ్. [౧౬-౨]

స్మృతి. బౌద్ధమతమున అహింసకై పశువధ నిషిద్ధమని మూలసూత్రము. బుద్ధునకు జన్మమునందేని పశుహింస యెడ సంగీకారము లేదు. రామానుజాచార్యులుకూడ నీయెడ బుద్ధుని హృదయమును సమీపించెను. ఆస్తికులందఱు బుద్ధుని నందువలననే బహిష్కరించియుందురు. అవృత మునఁ గానఁబడు వేశ్లథత్వముకూడ బహిష్కారహేతువై యుండెను.

## 8. నాస్తికులవలని లాభము

పరిశీలించి చూచుచో-వేదములు స్మృతులు [పురాతనములు] నేఁటి సంఘసంస్కారపరాయణులు తెంత సంస్కారములు కావలెనని కలఁచుచున్నారో, యంతకు అంతకు మిక్కుటముగాఁ గూడ ననుజ్ఞ యిచ్చుచున్నవి. కలియుగమునందు నిషేధించిన ధర్మముల నన్నిఁటిని బరిశీలించుచో నీ విషయము తేటతెల్లము కాఁగలదు. ఈ విషయముల కడ్డు దవలినవారు బౌద్ధులు. వారిప్రచార మెక్కుడైన కొలఁది బురాతనాచారముల మార్పవలసి వచ్చెను. బౌద్ధులకును బురాతనాచారపరాయణులకు మితిలేని వైరము పాసఁగెను. బౌద్ధులహింసాధర్మనిబద్ధులు. పురాతనులట్టి అంతగా గారు. అనఁగా 'ఒక దవడమీఁదఁ గొట్టుచో రెండవ దవడను జూపించువారు' కారు. 'అపకారికి నుపకారము నెపమెన్నక చేయువారు' కూడ నగుదురు. కాని క్రోధమును దీర్చికొనక మానువారు కూడఁ గారు. వారికిని వీరికిని ప్రబలవైర మున్నటులు 'హస్తినా తాడ్యమానోఽపి న గచ్ఛేజ్జినమందిరమ్' [ఏనుఁగుచే ద్రొక్కింపఁబడినను జినాలయమునకుఁ జనఁదగదు] లోనగు వాక్యములు నేఁటికిని విద్వాంసుల నాలుకలపైఁ దాండవించుచున్నవి.

యాజ్ఞవల్క్యస్మృతి, అర్థశాస్త్రము, గౌతమస్మృతి, మనుస్మృతి మొ. వానియందు వర్ణాంతరకన్యావివాహము విహితమయినది. ఆదిత్యపురాణము బృహన్నారదీయము మొ. ఆ ధర్మములు కలివర్జ్యము లని ప్రతిపాదించెడిని. కావున నీ స్మృతులు ఆ స్మృతుల కంటె నిటీవలి వనుట నిశ్చయము. క్రీ. శ. ౮-వ శతాబ్దివఱకు బ్రాహ్మణులు వర్ణేతరకన్యావివాహము మద్యపానము మాంసాహారము విధవావివాహము ప్రౌఢావివాహము మొదలగు నాచారములఁ బాటించువారని నిశ్చయింపఁ గొన్ని యుద్గ్రంథములు సాక్ష్య మిచ్చుచున్నవి. ఆ కాలమున వర్ణేతరస్త్రీలయందుఁ గలిగిన సంతానమునకు వారు బ్రాహ్మణ్యమును (౧) బ్రసాదించుచుండిరి. ఇంతియకాక బ్రాహ్మణుల కా యబ్రాహ్మణపుత్రులు వరి పేరూదియజ్ఞకర్మములంను ఆర్త్విజ్యమును గూడఁ జేయువారు. ఈ విషయమును బ్రాహ్మణులుఁ దుము (౨) ఆపస్తంబుఁడును (౩) గూడ వక్కాణించియున్నారు అని యటుండె. ఇఁకఁ గలివర్జ్యముల విచారింతము.

బృహన్నారదీయమున—

సముద్రయాన మొనర్చినవానిఁ జేర్చికొనుట కమండలుధారణము వర్ణేతరస్త్రీవివాహము మఱఁదివలనఁ బుత్రోత్పత్తి, మధుపర్కమునఁదే పశువధ, శ్రాద్ధమున మాంసభోజనము, వానప్రస్థము, దత్తాక్షతకన్యను గొండొకని కిచ్చుట దీర్ఘబ్రహ్మచర్యము నరమేధాశ్వమేధములు, మహాప్రస్థానగమనము, గోమేధము మఖము బ్రాహ్మణులయిండ్ల శూద్రపాకము ఈ మొదలగునవి నిషిద్ధములు.

బ్రాహ్మపురాణమున—

పునర్వివాహము జ్యేష్ఠాంశము గోవధ భ్రాతృభార్య కమండలువు, విధవకుఁ బుత్రుఁగు పుట్టుటకై మఱఁదిని నియోగించుట, బాలికను గాని అక్షతయోనినిఁ గాని వరొకని కిచ్చుట, వర్ణేతరస్త్రీవివాహము, అతిథిపితృదేవతల కొఱకు గోవధ యొనర్చుట వీనిని నిషేధించుచున్నది.

ఈ వర్జ్యధర్మము లన్నియుఁ బ్రాచీనాచారములని సువ్యక్తము. ధృష్టుఁడు రథీతరుఁడు అగ్నివైశ్యుఁడు యావనాశ్వుఁడు కపి ముద్గలుఁడు హార్యశ్వుఁడు ఈ మొదలగువారి కొమారులు క్షత్రియులయినటులును, పిదప బ్రాహ్మణులయి గోత్రకారులుగా గూడ నయినటులును విష్ణుపురాణము రెండవయంశమునఁ జూపట్టెడిని. దీని నంతయు వెరసిచేసి చూచుచో- వర్ణవ్యవస్థ నేఁటివలెఁ బ్రత్యభివృద్ధికిని అతంకము కాక మనుజున కుండవలసిన సర్వస్వాతంత్ర్యము నకు ఊఁతకోలగా నున్నదని గ్రహింప వీలగుచున్నది. కొంత కాల మీరీతిఁ బోవఁగాఁ గట్టుదిట్టము లే హేతువులచేతనో యెక్కుడయినవి. ఆ ప్రాచీనాచారముల నెవ్వరో యడ్డి యుందురు. ఆ యాతంకములవలన భరతఖండ మంతయు నవలాకులిత మయి పోయినది. ఇపుడు మన మా ప్రాచీనాచారముల నడ్డినవారిని గూర్చి విచారింప వలసి యున్నాము.

కల్కిపురాణమున—

మహాభారతయుద్ధాంతకాలమునందు సహభోజనము లరుదును వివాహసంబంధము లందును ఒండొండ దచిరమైత్రి కల బ్రాహ్మణ క్షత్రియవైశ్యులలోఁ బాలమంది ప్రాణిహింసనము కల యజ్ఞాదిక్రియల నుండి విముఖులై బహుభార్యావివాహమునే కాక వీకపత్నీవివాహమును గూడ విడిచి మాంసమద్యనిషేధమును బరిత్యజించి నూతనముగా జైనమత మను నొకమతము గల్పించి జైను లైరి. అని కలదు. దీనిని బట్టి మూడేండ్లు నీ వైదిక భారతాచారములఁ బరిత్యజించి నవీనాచారముల నెక్కొల్పినటుల కనిపిస్తున్నది. బుద్ధుని ధర్మములఁ గూర్చి చెప్ప నవదానకల్పలతః—

(౧) గౌతమస్మృతి—౪-౨౨-౨౪ చూ. (౨) తే దశమాత్మ్యా ర్ధకపిత్రా నిత్యస్వాధ్యాయ ప్రసర్పేయు రాదశమా త్పురుషా దితి వ్యైవ ! యద్యబ్రాహ్మణీ మధిగచ్ఛేయు ర్బ్రాహ్మణ్యైవాభ్యాసం దశ సంపూరయేయుః । అస్మరంతిశ్చయతః స్మరేయుః—శ్రౌతసూత్రమ్. (౩) ధర్మచర్యయా జఘన్యో వర్ణః పూర్వం పూర్వం వర్ణ మాపద్యతే జాతిపరివృత్తౌ. (౨)-౫-౧౧-౧౦. అధర్మచర్యయా పూర్వోవర్ణో జఘన్యం జఘన్యం వర్ణ మాపద్యతే జాతిపరివృత్తౌ. (౨)-౫-౧౧-౧౧.

'వివాహః కామాయతనమ్' [పెండ్లి కామమున కిల్లు] 'మద్య మాంస నిషేవణమ్ రాగమోహహేతుః' [మద్యమాంససేవ రాగ మోహములకుఁ గారణము] 'ధనం లోభకారణమ్' [ధనము లోభ మునకు మూలము] అని వీనిని నిషేధించినది. పరోపకారము మాతా పితృశుశ్రూష గవాదిపశుసేవ అనాథజనసహాయము పేదతిమి సన్న్యాసము ముఖ్యధర్మము లని ధమ్మపదము చెప్పుచున్నది. ఈ ధర్మము లన్నియు జైనబౌద్ధనాస్తికసాధారణములు. గతానుగతికములుగా వచ్చు ప్రాచీనాచారములఁ ద్రోలఁగించుకొని యీ ధర్మముల నెల కొలుపుకొని జైనాదినాస్తికులు ప్రాచీనాచారపరాయణసంఘము నుండి వేఱుపడి బాహ్యులయి క్రమముగా వారియరమును బెంచి కొనిరి. ప్రతిమతమునకు అభివృద్ధినొందఁ గొంతకాల మావశ్యకము కానఁ బెరిఁగి పెరిఁగి బుద్ధునిచేతను జైనునిచేతను దుదకు ప్రతిష్ఠాపితము లయినవి. వైదికమతాధిక్యము వారలకాలమునఁ బోవునటులు కాని పించెను. కావున వైదికులుకూడఁ దమమతమును సంస్కరించికొన వలసి వచ్చినది. బౌద్ధులిచ్చు నాపత్తులు ఖండింప వీలు లేకపోయెను. వారిధర్మములు వారికే తప్పుగాఁ గానిపించెను. హింస విధవావివాహము మద్యపానము మాంసనిషేవణములఁ గూర్చి బౌద్ధులు చేసిన దూషణమువలన వారు మేలుకొనిరి. ధర్మపరీక్ష యను గ్రంథమున అమితగతి యను నొకబౌద్ధుఁడు.—

(౧)మాతా వివాహ్యమానా స్వా వరేణాన్యేన వీక్షితా<br>
ఖినివేద్య స్వసంబంధం మయా పృష్టా స్తపోధనాః<br>
ఆచక్షత న దోషోఽస్తి పరేణా స్యా వివాహనే<br>
ద్రౌపద్యాః పఞ్చ భర్తారః కథ్యన్తే యత్ర పాణ్డవాః<br>
జనన్యా స్తవ కో దోష స్తత్ర భర్తృద్వయే సతి<br>
ఏకదా పరిణీతాఽపి విపన్నే దైవయోగతః<br>
భర్తర్యక్షతయోని స్త్రీస్స పున స్సంస్కార మర్హతి<br>
ప్రతీక్షేతాష్టవర్షాణి ప్రసూతా వనితా సతీ<br>
అప్రసూతా త్ర చత్వారి ప్రోషితే సతి భర్తరి<br>
పఞ్చస్వేషు గృహీతేషు కారణే సతి భర్తృషు<br>
నదోషో విద్యతే స్త్రీణాం వ్యాసాదీనా మిదం వచః.

[ఓ తపోధనులారా! నాతల్లి యింకొకని పెండ్లి యాడు చున్నది. దోషము కలదేని తెలుపుఁడు. ద్రౌపదికి పాండవు లైదుగురు భర్తలు. ఇరువురైన మొగల నీతల్లి కేమి దోసఁగు? ఒకతూరి పెండ్లి యైనను దైవికముగా భర్త చనిపోవుచో అక్షతయోని యగు స్త్రీకి పునర్వివాహము విహితము. భర్త పరదేశ మేఁగుచో సంతుకల యాఁడుది యెనిమిదేండ్లును - లేనిది నాలుగేండ్లును - ఎదురుచూడవల యును. కారణపురస్సరముగా నైదుగురు భర్తలయెడ స్త్రీలకు దోషము లే దని వ్యాసాదులు పలికిరి.]

అని ప్రాచీనాచారముల నిందించినాఁడు. ఈరీతిగాఁ బెక్కురు జైనులును దూషించియున్నారు. ఆ కాలమున నీ యాచారములను రోసినవారు బౌద్ధులుగనో జైనులుగనో మాఱిపోయిరి. వారు వేదములఁగూడఁ గొన్నిమొదల బహిష్కరించిరి. మద్యమాంసనిషేవణము మానిరి. బహుపత్నీవివాహము ఏకపత్నీవివాహము విధవావివాహము మొదలగు వివాహమును గూడఁ బోనాడిరి. జనుల కందఱకు వారియెడ విశ్వాస ముదయించెను. ప్రాచీను లేమి చేయుదురు? తమ మతమును బరిష్కరించుకొనవలసి వచ్చినది. పురాతన దురాచారముల మాని ఆ కాలమునకుఁ దగినటులు వేదశాస్త్రములకు వ్యాఖ్యానములు వ్రాసి, నూతనము లగు స్మృతులను బురాణములను రచించుకొని ప్రచ్ఛన్నబౌద్ధు లయి స్వమతమును వేదములను రక్షించుకొనిరి. కలివర్జ్యధర్మము లన్నియు క్రీ. శ. ౮ లేక ౯ శతాబ్దినుండి ఆచరణములోనికి వచ్చినవి. ఈ విషయము స్ఫుటముగా సూత్రము లందును స్మృతులందును కావ్యములందును జూపట్టుచున్నవి.

ఈ పర్యాలోచనము మనలఁ దాఱుమాఱొనరించుచున్నది. ఏలన - నేఁటికాలమున ఆస్తికుల మనుకొనువారు ఏ యాచారముల ననుష్ఠించుచున్నారో, వానికి నాస్తికులు మార్గదర్శకులు. ఈ యాస్తికులు తమకు నాస్తికులు మార్గదర్శకు లని యొప్పుకొందురా? నేఁటి సంఘసంస్కర్తలు నాస్తికు లీ యాచారములకు విరోధు లని చెప్పిన విశ్వసింతురా? కాని గ్రంథములఁ బరిశీలించుచో నాస్తికులే మార్గదర్శకు లని దృఢప్రమాణములు కానిపించుచున్నవి. విచారింపఁగా నేఁటి యాస్తికులే పురాతన వేదస్మృతి విరుద్ధ వర్తనముల నాచరించుచుండి రనియు, నేఁటి సంఘసంస్కర్తలే పురాతన స్మృత్యనుయాయు లనియుఁ దేలక మానదు. లెస్సగాఁ బరిశీలనము చేయునిచో నిది తలక్రిందులుగాఁ గానిపించి తీరును. నాస్తికు లీవిధముగా సంఘమునకుఁ బవిత్రత్వము దెచ్చియున్నారు. ఈశ్వర సద్భావము మాత్రము వారికి గిట్టదు.



(౧) ఈ యర్థము కల పద్యములు వేమన్నవి. ఆంధ్రలోకమున వాడుకలో నున్నవి.

# శంకరమతమున జగత్తు అసత్యమా?

కావ్యతీర్థులు : బంకుపల్లి మల్లయ్యశాస్త్రులు గారు

అద్వైతులేమి యితరమతస్థులేమి యీమతభేదము పాటించని పాశ్చాత్యపండితులేమి "శ్రీశంకరులవారు బ్రహ్మసత్యము జగత్తసత్యము. అని అన్నారు" అని అనుచున్నారు. కాని శంకరుని భాష్యము లన్నియుఁ బరిశీలింపగా నాబుద్ధికట్లు తోఁచలేదు. బ్రహ్మ సత్యమనునంతవరకు నిర్వివాదమే. కాని జగత్తుమాత్రము అసత్యమని చెప్పినట్లు కానరాదు. ఏమన? కొన్నిచోట్ల - జగత్తులో జీవునివిషయమై చెప్పినవి కొన్నిభాగములు, వియదాది ప్రపంచము విషయమై మఱి కొన్ని భాగములును - కావచ్చును. అసత్యము లని తోఁచు భాష్యము లన్నియు జీవవిషయములుగా సమన్వయముచేయుటకే వీలుగానున్నవి. వియదాది ప్రపంచము విషయమై వ్రాసిన భాష్యము లెంతమాత్రమును అసత్యత్వమును జెప్పవు.

కొన్నియెడల 'నిది పరమార్థవిషయము కాదు' అంటే-అసత్యము అని యర్థము చేసుకొనుటచే నీభ్రమ వచ్చినట్లున్నది. మఱి దీనియర్థము నామతమున నెట్లంటే? పరమార్థము=మోక్షము. అర్థములు=ధర్మము, కామము, అర్థము, మోక్షమును. అందు నుత్కృష్టార్థము మోక్షమును, గనుక యది పరమార్థము అని. ఇట్లైన నాయా యీ చోట్ల "నిది పరమార్థవిషయము కాదు" అంటే మోక్షవిషయము కాదు అనియే అర్థముచెప్పితే సరిపడును. అంతేగాని దానికి 'ఇదిసత్యము కాదు. అని అర్థము చేయరాదు. ఇట్లున్నందువల్లనే భాష్యమును విరోధించ దనియే నానమ్మకము. దృష్టాన్తము లన్నియు ఉభయవాదములకును ఆధారములుగా గానుపించును. అయినను స్వప్నాది దృష్టాన్తములు జీవపరములుగాను, మృద్ఘటాది దృష్టాంతములు, వియదాది ప్రపంచ విషయములుగాను, సమన్వయించుట సులభము. న్యాయ్యము.

అయితే జగత్తు అసత్యము కానప్పుడు అద్వైతసిద్ధి యెట్లని శంకింపవచ్చును. ఆశంక అనవసరము. అద్వైతమంటే జగత్తులేదని యర్థము భాష్యములో నెక్కడను జెప్పలేదు, మరేమన్నారంటే "ఏకమేవాద్వితీయం" అను శ్రుతికి మఱియొక చేతనపదార్థము లేదని యర్థము చెప్పినారు. కాని, అచేతనమైన జగత్తులేదని చెప్పలేదు. జగత్తున్నను బ్రహ్మకు సద్వితీయత్వము రాదని "నచ వస్తుతః సద్వితీయత్వ"మను భాష్యగ్రంథములో స్పష్టముగా వ్రాసిరి.

ఇలాగు జగత్తునే ఒప్పుకొననప్పుడు అధ్యాసభాష్యమే సమన్వయింపదు. ఏమన-రెండువస్తువులు ఒప్పుకొన్నప్పుడే యధ్యాసము. లేకుంటే అధ్యాసము సంభవింపదు. అది లేనప్పుడు తత్పరిహార ప్రయత్నము నిష్ఫలము.

అయితే సాంఖ్యాది మతములకు అద్వైతమునకును భేదమేమి? అందురా? వలసినంత భేద మున్నది. వారు బ్రహ్మభిన్నముగా మఱియొక యచేతనమును ఒప్పి, అది స్వతంత్ర మన్నారు. మఱియు పత్యేకమైన చేతనాంతరమును గూడ ఒప్పుకొన్నారు. అద్వైతులట్లు కాదు. వీరు చేతనాంతరమును ఒప్పరు సరేకదా, యీజగత్తుగూడ బ్రహ్మలోనే యున్నదందురు అదియును స్వతంత్రముకాదు. బ్రహ్మాధీనము అందురు. కాన నద్వైతమునకు భంగములేదు. జగత్తు బ్రహ్మలో నొకభాగమయితే-బ్రహ్మ సావయవమా? వికారము చెందునా? అని శంకించినప్పుడు సమాధాన మేమంటే — అవును. వికారమును జెందును; కాని బ్రహ్మమాత్రము నిరవయవమే. ఏదేది వికారము జెందునో అయ్యది తప్పక సావయవము కాకతీరదు అనుయుక్తి బ్రహ్మభిన్నపదార్థములకే కాని బ్రహ్మవిషయమై చెల్లదు. యుక్తియెప్పుడును బ్రహ్మను చెప్పలేదు. బ్రహ్మను జెప్పునది యొక్క శ్రుతియే యని భాష్యములోనే శంకరులవారు వ్రాసియున్నారు.

అది ఉపాసనార్థముగాని పారమార్థికము కాదన్నారే అందురేమో! అవును—నాయర్థము చొప్పున గూడ నట్లే. కాని ఉపాసనావిషయమంటే అసత్యమని మాత్రము అర్థముకాదు. అట్లయిన బృహదారణ్యకభాష్యము విరోధించును.— దానిలో ప్రాణోపాసనను చెప్పుచు శ్రీశంకరుడు ఉపాసనార్థమై చెప్పిన విషయము యథార్థమేగాని అయథార్థ మెంతమాత్రమును గాదన్నారు గనుక. ఇదిగాక, విజ్ఞానవాదమును ఖండించుచు నాచార్యులవారు బాహ్యప్రపంచమైన, స్తంభ, కుడ్య, ఆదికము-భావపదార్థమే గాని అభావపదార్థమని యెంతమాత్రమును అనరాదన్నారు. అసత్యమైనప్పుడు అభావపదార్థమనియే వ్రాసియుందురు.

మఱియు, కార్యము ఉత్పత్తికి పూర్వము కూడ సత్తే అని చెప్పుటచేత- ఉత్పత్త్యనంతరము గూడ సత్తే అని స్పష్టముగా సత్కార్యవాదమునే స్థాపించినారు. కార్యమన్నది జగత్తే. శంకరుని మతమున అది సత్తే. అది యెన్నడును అసత్తుగాదు. అసత్తయితే స్వప్నదృష్టాన్తమును తీసికొని, 'స్వప్నమునకు జాగ్రదవస్థలో బాధ కలుగుచున్నది. జాగ్రదను భూతవస్తువునకు కే యవస్థలోను బాధ లేదు' అను "వైధర్మ్యాచ్చ న స్వప్నాదివత్" అను సూత్రభాష్యమును సూత్రమును నెట్లు సమరసపఱుతురు?

ఇక బ్రహ్మాత్మైకత్వజ్ఞానము కలిగినపుడును, జగత్తు సత్యముగానే కనఁబడును అని శంకరులవారంటే కొందఱు, [illegible] చేవ లెక్కించి, తరువాత నసత్యము అనియర్థముచేసి కావున, నెప్పుడును అసత్యమే యనుచున్నారు. అది న్యాయ్యము కాదు. ఆయవస్థ మనస్సు కూడా లేనియవస్థ. అప్పుడు ప్రపంచమిట్టిదని గోచరించు సాధనమైన మనస్సులేనిది ఇది మిథ్యమని యెట్లు నిర్ణయింపగలరు? కాక

# *పశ్చాత్తాపము

వెన్నెలకంటి అప్పారావు గారు

క. మన కేటి రాజ్య మొకం డొక జనపదమున కేగి భైక్షచర్యావిధి జీ
వనము నడిపికొని యుండుద మనఘా యిట్లయిన సుఖుల మగుదుము సుమ్మీ.—శాంతిపర్వము.

ప్రపంచమునందలి మానవజాతులు పోరిపోరి పరిశ్రాంతిఁ జెందినవై యున్నవి. ఈ యుద్ధ మొక మహాకవి నుడివినట్లు "క్రోధంబులకు సామ్రాజ్యంబును, క్రూరత్వంబులకు సామునియు, మదంబులకు సాఫల్యంబును, మాత్సర్యంబులకు కృతార్థతయు, నభిమతంబులకు విలసనంబును, నాశ్చర్యంబులకు నుద్వేలనంబును, నుత్సాహంబులకుం బురటిల్లును, నున్మాదంబులకుం బ్రాఁకుడును, సాహసంబులకుఁ బర్వంబును, సత్త్వంబులకు దాయంబును, బ్రాయంబులకుం గైసేతయుఁ, బంతంబులకుం బరిణేతయు" నై యొప్పినదే కాని ప్రెసిడెంటు విల్సనుగారు భావించినట్లు స్వల్ప రాష్ట్రములకు మోక్షదాయియై గాని, భావిసమరములకు నంతరాయమై కాని, ప్రపంచసౌఖ్యమునకు సహాయకారియై గాని విరాజిల్లె ననుటకు వీలు కన్పట్టదు. ప్రపంచమునం దిది ప్రథమరణము కాదు; అంత్యసమర మనుటకును వీలు కాన్పింపదు. పూర్వకాలంబున జను లనాగరకస్థితియం దుండుటచే, రాజ్యలోభం బొక్కటియె కారణంబుగా నిరంకుశచక్రవర్తులు పశుప్రాయు లగు జనులను సేనలుగా నేర్పరచి యుద్ధము ధర్మపథ మనియు, రణరంగంబున నిహతు లగు వారికి వీరస్వర్గము లభించు ననియు, మొదలగు కల్ల లాడి, వీరిని బ్రోత్సహించి రాజ్యతృష్ణచే వీరి ప్రాణము లొడ్డి కయ్యంబులను బాదంబు లాడిరి. ఇక్కాలంబునఁ గూడ జనులు కొంత విద్యార్థు లయ్యు రాష్ట్రతృష్ణ వదలఁజాలక దేశభక్త్యాదిశబ్దంబులతో జనులను మోసముచేసి యుద్ధంబులఁ బ్రవేశపెట్టుచున్నారు. అట్లు కాదేని ఇంతవఱకును జరిగిన మహారణముల వలని లాభము లెవ్వి? మన పురాణములలోఁ జెప్పఁబడినట్లు ఈ వివిధ సమరముల వలన గల్గు జనవినాశముచే భూదేవికి భారము మాత్రము తగ్గుచున్నది. యుద్ధములలో నీ నడుమ జరిగిన జపానురష్యా యుద్ధము వలన లాభము లెవ్వియో విచారింతము. ఈ యుద్ధ జయమునకు పూర్వము జపానీయులు తమ దేశమం దుద్భవించిన వస్తుసామగ్రితోఁ దృప్తిఁ జెంది సామాన్యహిందూజనులవలె నిష్కామకర్మపరులై ధర్మపరులై తృష్ణాదూరులై, అహింసాపరులై మహాపురుషులై యొప్పుచుండిరి. కష్టమై వారికి జయము కలుగఁగనే వారి దృక్పథము మారెను. మాతృదేశమందలి క్షేత్రంబులు వారికిఁ దృప్తి నొందింప వయ్యె. తమ పెద్దలు ధర్మముగ నార్జించిన ధనములు వారికిఁ జాలవయ్యె; స్వభావసిద్ధముగ జరుగు వ్యాపారము వారికి సంతసమీయ దాయె; తమ పితామహప్రపితామహులచే నిర్మింపఁబడిన గృహములు వారికిఁ దృణప్రాయములుగఁ దోఁచె. ఇంతయేల? పూర్వకాలంబు నందలి యుడుపులు గాని భోజనంబులుగాని, యాచారంబులుగాని, మతములు గాని, తత్త్వవిచారణలు గాని, విద్య గాని, వైఖరి గాని, యేదియు వారికి సరిపోదయ్యె. పాశ్చాత్యదేశమునందలి యంత్రములును ప్రయోగములును, నాగరకతయు వీరిని వశముచేసికొని సగము పాశ్చాత్యులను మార్చివైచెను. కాని విని యద్దుపనుటచే నొక్క రాజ్యతృష్ణయందుఁ దప్ప, దక్కిన యన్నివిషయంబులందును మార్పులు చెందవయ్యె. దీనికిఁ గారణము నిష్కామకర్మపరులగు రోగులింకను జపానునం దుద్భవించి ప్రాచీనాదర్శములను జాటుటఁ బట్టియే. నేఁడు జపాను జలాంతర్గాములచేతను, యుద్ధనావలచేతను, విద్యుచ్ఛక్తియుతము లగు వాయువిమానములచేతను బ్రకాశించుచుఁ బ్రపంచమునందలి అగ్రదేశములలో నొకటియై విరాజిల్లుచున్నది. జపాను రష్యాపై విజయము కాంచినపుడు హైందవులు సంతసించిరి. ఇప్పుడా సంతసకారణములు నశించినవి. ఏల యన అధికారపదవి యందుఁ గాని మనుజుని నైజగుణము బయల్పడదు. ప్రతివిషయమునందును ప్రతి మనుజునకును బశ్చాత్తాప మనునది యుండు కలదు. ఒకప్రాణి కొంతయేని బాధ కలిగించినంతన కాని, లేక పెద్దలచే దోష మని యెన్నఁబడువట్టి కర్మమేదేని చేసినంతన కాని, ఉత్తమ మనుజునకుఁ బశ్చాత్తాప మనునది యుండు జనించును. ఇట్లు జనించుట ప్రత్యేకమనుజునకే కాక ప్రత్యేక జాతికిఁ గూడ జనించుట స్వభావసిద్ధము. అయ్యది యుద్ధానంతరము "కొరియా" దేశమును స్వాధీనము చేసికొని జయభేరి మ్రోగించిన జపానునకుఁ గలిగిన దని చెప్ప వలనుపడదు. "అహింసా పరమో ధర్మః" అను నార్యోక్తిఁ బాటించిన బుద్ధుని నారాధించుచు నయ్యు రాజ్యకాంక్షచేఁ బాశ్చాత్యులవలె, కొరియను బాధించుట మానిన వారు కారు. కనుకనే పాశ్చాత్యులవలె వారినిఁ గూడ మనము దయదృష్టితోఁ జూచుట. గడచిన ప్రపంచయుద్ధమును గూర్చి నేఁ జదువునపుడును, ఆలోచించునపుడును, భారతయుద్ధము నాకుఁ బ్రత్యక్ష మగుచుండును. భారతయుద్ధము సమాప్తమైన పిమ్మట భారతవీరుల మనోదర్పణము లెట్టుల భాసిల్లెనో కనుగొనవలె నన్న

---

* యుద్ధము సమాప్తము కాఁగానే వ్రాయఁబడిన వ్యాసము కారణాంతరములచే నప్పుడు ప్రకటింపఁబడ దయ్యె.

భారతమునందలి శాంతిపర్వప్రారంభమే మనకు శరణు. భారతయుద్ధకాలమునఁ బ్రస్తుతార్థముగల దేశభక్తి లేదు. జాత్యభిమానము లేదు. ధర్మము అధర్మము అనునవియే ప్రాముఖ్యము వహించియుండె. ఆయుద్ధము కూడ రాజ్యకాంక్షచేతనే చేయఁబడెను. అందుఁ బాల్గొనిన యోధవరులలో ముఖ్యముగఁ గర్ణుఁడు ద్రోణుఁడు, భీష్ముఁడు మొదలగువారి నిష్పక్షపాతము, వైరాగ్యము నిష్కామకర్మ అదిగాఁగల అత్యద్భుతనియమములు పాశ్చాత్యసాగర నిమగ్నులైన వారికి నైతము-వారు తొంగిచూచు శాంతముతో భారతము తిలకించిరేని గోచరింపక మానవు. భారతయుద్ధమునకుఁ గారకుఁడైన దుర్యోధనునకుఁ బశ్చాత్తాపము లేదు. సర్వవ్యాపియై సర్వాంతర్యామియై సకల లోకరక్షకుఁడును సంహారకుఁడును నైన జగన్నాటకసూత్రధారుఁడైన శ్రీకృష్ణునకుఁ బశ్చాత్తాపము లేదు. భూతభవిష్యద్వర్తమానము లన్నియుఁ దెలిసినవాఁడు గనుక నీ మహానుభావునకుఁ బశ్చాత్తాపము లేదేమో! కాని విజయలక్ష్మి నముపార్జితుఁడగు యుధిష్ఠిరునకు మాత్ర మట్లు లేదు. వినుఁడు.

సీ. జ్ఞాతులనందఱఁ జంపితి మది యాత్మ
వధయ కాదే రాజవర్తనంబు
కొల్పు మహింప నిక్కముఁ దాల్మి మత్సర
వర్జన మది వనవాసజనుల
కాగమవిహితంబు లఁట యింత యొప్పునే
వనమున వసియింపవలయు నింకె
యసుఖవం బైన రాజ్యామిషంబునకుఁ గు
క్కలభంగి దమలోనఁ గొట్టులాడి
కులము సెల్లను బొలియింపఁ గుత్సితంపు
బ్రతుకువచ్చెను యన వగపాలవడఁగ
బ్రమద మొసఁగదు త్రైలోక్యరాజ్యమైన
గాన నేనొల్ల. మహి మీర కయికొనుండు.

ఈ పద్యమునందలి "జ్ఞాతులు" "కులము" అను పదములకు జనులు అను పదము నుపయోగించుచో దీనిలోని భావము ఈ కాలమునకుఁ గూడ సన్వర్థ మగును. రాజ్యమంతయు లభించినందులకు సంతోషింపక దుఃఖించువా రెందురాఁ? యని పాశ్చాత్యులు ప్రశ్నింపవచ్చును. కాని అది పాశ్చాత్యగుణము. ఈ ధర్మజుని దుఃఖోపశమనము చేయుటకు నారదాది మునిపుంగవు లెందఱో ఉపదేశించిరి. లోకంబునందలి లతోపదేశంబు లన్నియుఁ జేసిరి. కాని వ్యర్థములాయెను. చివరకు భారతపితామహుఁ డగు భీష్మాచార్యులు శరతల్పమునం దున్నవాఁ డయ్యు, శ్రీకృష్ణునిచే నియుక్తుఁడై ధర్మజునకుఁ గల్గిన ప్రతిసంశయమును నివారణచేసి భూలోకమునకు నపారమైన యుపకారముఁ జేసెను. భీష్ముని సందేశములే శాంత్యనుశాసనిక పర్వము లయ్యె. మహాయోగులకుఁ దెలియరాని సంగతులు కూడ నీమహామహుఁడు లోకోపకారార్థమై వెల్లడిచేసెను. ఇంత బోధితుఁడైన తరువాతఁ దన విధ్యుక్తధర్మము లెవ్వియో గ్రహించి ధర్మజుఁడు రాజ్యభారము వహించెను. ఇట్లు ప్రబోధితుఁడైన ధర్మజుఁడు వైరాగ్యమే తనజీవితమున కాధార మని యెంచి భూభారము వహించె నన, నాతని ప్రజ లెట్టి సౌఖ్యము ననుభవించియుందురో నే వర్ణింపఁగలనా ?

భారతరణమునకు మించినది కదా గడచిన ప్రపంచయుద్ధము. పూర్వకాలపు వా రనాగరకు లనియు, మనము నాగరకాగ్రగణ్యుల మనియు గదా గర్వించుట! భారతవీరుల యుద్ధచారిత్ర మగు పంచమవేదం బనంబరగు మహాభారతమువలన మన మెన్నియో నీతులే కాక మోక్షమార్గములను గూడ నేర్చుకొనుచున్నాము. గడచిన ప్రపంచయుద్ధమువలన మనము నేర్చుకొనఁదగిన విషయముల సంగతి యటుండ, యూరపుఖండమునకైనను తృప్తి కలుగలేదు. తృప్తికి మారుగఁ బ్రపంచమునం దంతయు నశాంతి పెచ్చుపెరుగుచున్నది. ప్రస్తుతయుద్ధమునఁ బరాజితులైన దేశస్థులకు దుర్యోధనునకుం బలెఁ బశ్చాత్తాపము జనింపఁజాలదు. విజయులైన వారికైనను బశ్చాత్తాపము జనింపకుండుట ప్రపంచదౌర్భాగ్యము కదా! ఔన్నత్యస్థితికి వచ్చినను, గర్వింపక వైరాగ్యము పూని వానప్రస్థాశ్రమమునకుఁ జనుట మొదలగు త్యాగకార్యములచే హిందూచక్రవర్తులు ప్రఖ్యాతిని వహించియున్నారు. ఇట్టి యార్యాదర్శమే మన యజాతశత్రుని యందును బ్రకటితమై యున్నది. కనుక ప్రపంచమునందలి దేశములన్నిఁటిలో నార్యావర్తము తన ప్రత్యేకవ్యక్తిచేఁ భేదింపఁబడవలసియున్నది. ఆప్రత్యేకవ్యక్తి ఆర్యావర్తము స్వతంత్రస్థితిలో నున్నఁ గాని పూర్ణదశకు వచ్చి తన చిద్విలాసములఁ జూపింపఁజాలదు. వైరాగ్యముతోఁ గూడిన పశ్చాత్తాపము మన యోగ్యలక్షణములలో నగ్రస్థాన మాక్రమించుకొనుచున్నది. అట్టిదగు ధర్మజుఁడు మనకుఁ బూజనీయుఁడు; ఆదర్శప్రాయుఁడు. అతఁడు యుద్ధానంతరమున నెట్టి పశ్చాత్తాపము పొందినదియు నెట్టి వైరాగ్యముతోఁ బరిపాలన మొనర్చినదియు భారతమును జదివి యానందింపఁ దగును. వైరాగ్యముకల్గినఁ గాని పరితాపహరణాభిలాషయు, రాజ్యభోగంబును విడవు. ధర్మజుఁడు చెప్పినట్లు—

గీ. కామభోగము లెవ్వని కాదు. వాని
విడిచి యాతఁడు పొందును విపులసుఖము.
కాయలాకులు నీళ్లును గాలి యనుభ
వించి యున్న మునీంద్రులు వెఱ్ఱివార?

ఆంగ్లులు మన మహాభారతమును బాగుగఁ జదివి యున్నచో నైనను ఆర్యతత్త్వమును గ్రహింతురు గాక.

# వీరశిఖామణి

అనంతపంతుల రామలింగస్వామి

చరణములాదిగ శిరమువఱకునొక
వరకవచంబు ధరించెనువీరుడు;
మొలనొక ఖడ్గము తళతళమెరసెడుఁ
బొడవునకుందగుఁ గడిమి చెలంగును;
కంఠీరవమును గాంచినచో నా
కడిందివీరునిఁ గన నవసరము.
ఆతనిదరి ధవళా జానేయము
మోమువంచి ఖురపుటమున భూమినిఁ
ద్రవ్వుచు, వాలముఁ జివ్వున నెత్తుచు,
నిట్టూరుపులను నించుచు నిలచెను.
వీరునిముఖమున వీరరసము వి
స్ఫారంబై కనుపండువఁ జేసెను.

* * * *

అంతటఁగుమారు నరయగవచ్చెను
కాలముఁగడపిన కాంతయొక్కరిత
దంతపుఁబిడితోఁ దళదళమెఱసెడు
కైజారును తనకరపుటమునవిడి
వచ్చియామెదీవనలను నల్పుచు
నచ్చెరువగునటులనె నీపగిది;
" తనయా ! తనయా! యనినల్పులకై
చననుంటివి యుత్సాహముతోడుత.
వినుమా! నే నిపుడను వాక్యములను
శ్రద్ధతోడుతన్ సంతోషముతో;
తురకలు మనశత్రువులు వారలున్
గరకరులై సుమఘనరరణమున;
నైననేమి నిర్భయముతోడుత
నుత్సాహముతో నుద్రేకముతో
శౌర్యాభినివేశము బుట్టిపడన్
వెనుకంజల నిక! వేయక, పగరకు
వెన్నియక, గర్వింపక, తనియక,
మాతృభూమినే మదిలోఁదలచుచు
సంపూర్ణంబగు జయమొందుటకై
నల్పుము రణమును సాహస మలరన్.
పాదుముదిమి నాపాలఁ గల్గె నిటు!
లేకయున్నచో జివ్వననీతో
బయలుదేరనా ఖండనభూమికి?
ఇదిగో! తనయా! యీఖడ్గంబును
నీ జనకుండిడె నీ కిడుమని తన
యవసానంబున. ఆస్తియిదే యని
మనవంశంబున మలయుచున్నదిది
పూర్వమునుండియు భూరిధనమువలె
యాంధ్ర వీరులకు నాదర్శంబిదె! ”
అనియాముదుసలియావిడ ఖడ్గముఁ
దనతనయున కిచ్చెను నొకముద్దిడి.

* * *

అంతలోనఁ గాలాబ్దముఁవిడి, య
త్యంతకాంతితో దళతళమెరసెడు
పరిపూర్ణేందు నిభానన యొక్కతె
బిరానవచ్చియుఁ గరంబులెత్తుచుఁ
గాంతునికంఠముఁ గౌగలించికొనె.
“నాథా! నాథా! ననుఁ గొంపోవుము
రణరంగమునకు రణమూనుటకై
జయమొందినచో సంతోషముతో
విజయధ్వానము విన్నుముట్టగా
నాజాకేతము నధిరోహించుచు
మనయిర్వురమున్ మఱలివచ్చెదము.
చచ్చినచో మీ సన్నిధానమునఁ
జచ్చి శాశ్వత స్వర్గముఁ బొందెద,
పతితో మరణం బతి సుఖదం బగు,
గాంతయు నిలోకములోకులన్
పలికింపుచు వైవంబు గలుగునా?

* * * *

అనుఁ బ్రియకాంతా ప్రణయవిరాగం
బరసి యద్భుతం బానందంబును
గొని కాంతామణిఁ దనకౌఁగిటిలో
గ్రుచ్చిముద్దుల స్గురిపించుచ ననెన్
“ప్రేయసి! నీదగుఁ బ్రియకాంతునిపైఁ
బ్రేమముఁ జూపుటవిధి. నీ, కయినన్

పాలుత్రావు ప్రియబాలునిఁ బాయుచు
రణరంగమునకు రాఁజనదు సుమీ!
బాలునిఁ బెంచుచుఁ బరమేశునిపై
భారమునుంచుచు భక్తినీశునే
యారాధించుచు నారాకకునై
వేచియుండుమా! ప్రేయసి! చనుమా!

* * * *

అన రణభేరీనినదము వినఁబడె,
ఘనవీరుఁడుఁ దనజననికెఱఁగి ధవ
ళాజానేయం బధిరోహించుచుఁ
జనె నిముసములో చండరణమునకు
తల్లికోట యుద్ధం బన నదియే!
హిందూ రాజులకిని పోరాటంబై
నంతట పైరందవు లయ్యో! యోడిరి,
ముసల్మానులే పొందిరి విజయము.
కృష్ణాతీరం బెంతో భయదమై
రక్తసిక్తమై ప్రబలె, ననేకులు
మరణించిరి యాసమరమునఁ గటకట!

* * * *

పరులెవ్వరు నాభండన భూమిని
కానరారు—కృష్ణానది మాత్రమె
హోరున మొఱలిడుచుండె నంతటన్.
హతులగు వీరజనావళి మధ్యను
కలఁ డొకవీరుఁడు గాయములం దిని
ఆతని దరి ధవళాజానేయము
మరణముఁ బొందియు ధరణీస్థలిఁ బడె—
వీరవరుని దృగ్వీథిని గన్పడె
తనభార్యామణి దైన్యమూర్తియై
కాటుకకంటినిఁ గన్నీ రిడుచును
రోలంబంబటు రోదనఁ జేయుచు.
అంతట వీరుం డనెనీ పగిదిని

* * * *

జననికి వందన శతములిడితినమ్మా!
తనయుని కలికీ పదిలముసుమా!
వీరబాలునిగఁ బెంచుము తనయుని
కాలక్రమమునఁ గాంతా! నీవును
నన్నుఁ గలసెద వానాకము లోనన్.
కాన, నీవు దుఃఖంబు వీడుమా!
అతివా; నాకై యాశ వీడుమా!
మనవంశంబున మునుపటినుండియు
వారసత్వముగ వచ్చుచున్నదిది—
ఈ ఖడ్గము నీవెంతో భద్రముగఁ
గొని యింటికిఁ జని కొడుకున కిమ్మా!
ఇదిగో చేకొను మీ ఖడ్గం"బను
చందివ్వగ నదియందు కొనుటకై
తన యెదు టెవ్వరుఁ గనరాకుండుటఁ
బరికించుచు హృద్భ్రాంతిగ నంతయు
నెఱింగి వీరుడు పురపురఁ బొక్కెను.

* * * *

అంతట దుర్దాహంబు జనించెను.
"దాహము! దాహము! దాహం"బని కడుఁ
బలవించు చతం డలసి యుండు నెడ
నొకచేతను దీవికను ధరించియుఁ
ముసల్మానుఁ డొక ముంత జలంబును
గుడిచేతను దానొడిసి పట్టుకొను
చీవీరుని కట్టెదుట నె నిలచెను.
"అయ్యా దుర్దాహార్తుఁడవైతివి
దాహముఁ దీరఁగఁ ద్రాగుము జల మీ"
వనుటతోడ నాఘన వీరవరుం
డాతని తనుఁ గని చలికోపముతో
"తులువా! శత్రుని జలముఁ గొందునా?
నిలుమా! నినుముక్కలు గావించెద"
ననుచా వీరుఁడు ఘననాదముతో
లేచి నిలచి యవలీలనేలఁ బడి
విగత జీవుఁడై వెలవెలఁ బోయెను.
తిమిరంబంతట నమితంబయ్యెను
జంఝూనిలమతి సాంద్రం బయ్యెను
నింగికి నేలకు నిశ్రేణిక తెక్
కాంతినించు చుక్కలు వడిరాలెన్ సి
తాబ్దము విడచె హిమాస్రుకణంబులు

# ఆంధ్రులు ఆర్యులు గారా?

తేకుమళ్ల రాజగోపాలరావు గారు, బి. యే. యం. ఆర్. ఏ. యస్

ఉ. వట్టి మెఱుంగుఁబెట్టి నుడువంబనిలేదది యెల్ల ఛేరిజో కొట్టుట గాక నిగ్గెలుఁగుఁగూడునె మాటల నీవు గంటివ
స్పష్టి శుభాంగుఁ డీవమణియాసల కాస్పద, మిప్డు నీవు న న్గట్టిగ నవ్వయాది కథనంబునఁ జేసి యనుగ్రహింపవే.

— ప్రభావతీప్రద్యుమ్నము

పాశ్చాత్యపండితులు తర్కములకు బయలుదేరి, ఆంధ్రులను హీనజాతులవారితోఁ గలిపి తమ జాతియొక్క హీనత్వమును నిలువఁబెట్టుకొన్న విషయము మనవారలకుఁ దెలియునో తెలియదో కదా! ఒక్క రాజకీయవిషయములందు మాత్రమే మనస్థితి హీనమై యున్నదని మనము అనుకొనవలసిన యవసరము లేదు. పాశ్చాత్యులు పనిచేసిన ప్రతిప్రదేశమునను తమ గొప్పను తక్కినవారి తక్కువను మాత్రమే ప్రకటించి యున్నారు. అలగ్జాండరను నైరోపియనుఁడు హిందూదేశముమీఁదికి దండెత్తివచ్చిన తరువాతనే గదా హిందువులు అజ్ఞానాంధకారమునుండి వెలువడి కొంచెమైన కన్నులువిచ్చి యొకింత చూడనేర్చిరి. ఇట్టి పరిస్థితులయందు ఆంధ్రులు అనార్యులుగాక ఆర్యులు కానేర్తురా? ఆంధ్రభాష యనార్యభాషగాక యార్యభాష కానేర్చునా?

ఇట్టి యూరోపియను విద్వాంసుఁడే కదా యొక్కఁడు సంస్కృత మనుభాష యీలోకమం దెచ్చటను నెన్నఁడును లేదనియు, కపటతంత్రోపాయజ్ఞులగు బ్రాహ్మణులు ఏరో పాఖండపు అమాయకులైన, పండితులను వంచించి, సంస్కృత మను నొక భాష కలదని నమ్మించిరని వ్రాసి, భూతవర్తమానకాలములందు సంస్కృతభాష యుండలేదని సిద్ధాంతీకరింపఁ జాలినవాఁడు. పాశ్చాత్యులవ్రాతలే విశ్వవిద్యాలయ పరీక్షలకు అమృతతుల్యములు. వారి పనికిమాలిన సిద్ధాంతములుగల గ్రంథములు అందు భాషకు పరని యీగ్రంథములు- తెల్లవారు వ్రాసిన గ్రంథముల యదృష్ట మట్టిది. మన నల్లవారి దురదృష్ట మిట్టిది. పఠించువాఁడు తనవాఁడైన కడబంతిని గూరుచుండవచ్చును, తెల్లవారు, మనజాతిని ఎంత హీనముగా తెలిపిన నేమి? వారివ్రాఁతలను మనబాలురు చదివితీరవలెను గదా!

ఈ పాశ్చాత్యవిద్వాంసుల యభిప్రాయము ప్రకారముగా మన కేదైన జాతి కలదా? కలదు వినుండు. పూర్వ మొకప్పుడు ముండజాతికిఁ జేరిన మనుష్యులు కొందఱు ఆసియాఖండమునందు నివసించుచుండిరి. వారిసంతతివారే ఆంధ్రులు; ఆంధ్రులసోదరు లగు అఱవలు, కర్ణాటకులుకూడ ఈముండజాతివారే! ఒక పాశ్చాత్య విద్వాంసుఁడు అదరుబెదరు లేక అయాచితముగా తన బుద్ధిబలము నుపయోగించి-ఇట్లు ముండాపుత్రత్వమును ఆంధ్రులకు బ్రసాదించుట పూర్వకృత సుకృతవిశేషముచేతనే గదా! ఈ మహనీయుని పేరు ప్రైడ్రిల్‌ముల్లర్. బంగారపు టక్షరములతో ఆంధ్రులు ఈతనినామమును తమహృదయపీఠములందుఁ జిత్రించుకొందురు గాక.

కలఁడు ఇంకొక పండితపుత్రుఁడు. మేధాసంపన్నుఁడు. బహుదేశములు తిరిగి పెక్కువిషయములను దెలిసికొన్నవాఁడు. నేఁటికిని గూడ అనాగరకదశయందే యున్న ఆస్ట్రేలియాద్వీపములోని బుష్‌మెన్ అనఁబడు జాతివారిని ఈతఁడు బాగుగా నెఱుఁగును. ఈమహానీయుఁడు ఆద్వీపనివాసులు వేటాడుసమయమున ఉపయోగించు బూమరాంగ్ అనఁబడు ఆయుధమువంటి ఆయుధమును నీలగిరిప్రాంతములందలి కొండలను త్రవ్వుచున్నప్పుడు చూచెనఁట. కాఁబట్టి తెలుఁగు అఱవము మున్నగు భాషలను మాటలాడువారు ఆస్ట్రేలియాద్వీపములోని బుష్‌మెన్‌కు పుట్టినవారు.

ఇంకొక రున్నారు ఊహాలకు. ఈయనను జెప్పియే ఇతరులను జెప్పవలెను. ఆంధ్రులు, అఱవలు, కర్ణాటకులు వీరందఱు నెవ్వరు? హిమవత్పర్వతముల కుత్తరమున నుత్తరమహాసముద్రమువఱకును దేశములు కలవుగదా! ఉందురు గదా అందును మనుష్యులు. అందు నడిమి ఆసియాలోని యెచ్చటనేని యొకతావునుండి దక్షి




# రత్న తయారగు స్థలము

## పి గోపాలస్వామి శెట్టి అండు కో.,

783, ధర్మరాజు గుడి వీధి.

పోస్టు-పరంగిమలై **Saint Thomas Mount P.O.**

నగలుచేయుట కుపయోగించు మేలైన ఇమిటేషన్ కెంపులు, నీలములు, తెలుపు పచ్చలు, పుష్యరాగములు, వైక్రాంతములు మొదలగు వాటిలో సుమారు, 50 సంవత్సరముల అనుభవము గలదు.

## హిందూదేశమం దంతటను ఖాతాదారులు గలరు.

కోరువారికి క్యాటలాగు ఇనాముగా పంపెదము.

సరకులు గారంటిగా పంపబడును.

# World's Wonderful Magic.

This Book will teach you the Secret of Western Professors in magic, namely Mental Magic "Second Sight." *Very easy to perform.* (In English) Price Re. 1, Postage extra,

## Press Opinions.

**United India and Indian States. Pondicherry, 10th February, 1921.**

"..........., The author gives out the secret of modern magicians who entertain us very often in evening social parties. **Tbe exposition is very clear and tbe secrets are quite easy** of acquisition by any having a taste for it..............."

1920 వ సం॥ అక్టోబరు నెల 12 వ తేది మంగళవారము ఆంధ్రపత్రిక యిట్లు వ్రాయుచున్నది:

"దివ్యదృష్టి:—మన పూర్వులు దివ్యదృష్టి కలిగియుండి అనేకాంశములను గ్రహించెడి వారు. పాశ్చాత్యదేశపు ఐంద్రజాలికులు............కొన్ని చిత్రమగు యుక్తిసాధనములచే కంటికి గనుపడని సంగతుల గూర్చి చెప్పగలుగుచున్నారు. అట్టి రహస్యములను తెలిపెడి గ్రంథమును పి. ఆర్. జనార్దనం నాయుడుగారు ఆంగ్లభాషలో రచించి ప్రచురించిరి. వెల 1 రూపాయి. వలయువారు, గుంటూరు జిల్లా ఒంగోలునందుండెడి గ్రంథకర్తపేర వ్రాసి తెప్పించుకొనవచ్చును."

**P. R. Janardanam Naidu,**
**Ongole, Guntur District.**

Siva Sankara Siddhanti Garu



జ్యోతిషరత్నాకర
శివశంకర సిద్ధాంతిగారు

Gomedhikam Sankaraswamulu Garu



బ్ర. శ్రీ. గోమేధికము శంకరస్వాములవారు

Pidaparthy Petha Purniah
Siddhanty Garu



పిడపర్తి పైదపూర్ణయ్య
సిద్ధాన్తిగారు

Late P. Venkata Krishnaiah



కీర్తిశేషులైన పులవర్తి వేంకటకృష్ణయ్యగారు

The Late Prof. Ramanujam



కీ. శే. ప్రొఫెసరు రామానుజం గారు

Rai Bahadur M Paparao Naidu Garu



రాయబహాదూరు ఎం. పాపారావు నాయడు

Mr A P. Kavi, Anantpur



అనంతపురం కేరశార్యకవి

Mr K V Kamaniah



కే. వి. రమణయ్యగారు

Ayurvada Pundit
C. T Arumugam Pillai



ఆయుర్వేద పండిత్, సి. టి. ఆరుముగం పిళ్లైగారు

Rai Sabeb M. Hamptah



రాయిసాహేబు ఎం. హంపయ్యగారు

The Late Mr. P. Sambasiva Rao



కీ॥ శే॥ పెద్దాడ సాంబశివరావుగారు

ణాదిఙ్ముఖము గా మనుష్య లోకనాఁడు బయలుదేరి రాలేదా? నదులను దరించి, పర్వతములను లంఘించి, మహారణ్యముల ననుగమించి. ఈ యనాగరకులు దక్షిణాం పుదిక్కునకు పోవంబోవ-అచ్చోట వారికి హిమాలయము పెనుమంచుకొండ అడ్డము వచ్చెను. అంతట వారు రెండు తెన్నులై ఒకరు తూర్పుమొగముగా ఒకరు పడమటి మొగముగాను కాళ్లు సాగించిరి. తూర్పుమొగమై పోయినవారికి అస్సాముకు సమీపమున కొండల యడ్డము తీసెను. ఆదారిని వారు ఇండియాలో ప్రవేశించి పడమటిమొగమై నడువసాగిరి. మొదటనే పడమరవైపు మొగము పెట్టుకొని పోయినవారికి కాశ్మీరదేశ ప్రాంతములందు ఇండియాలో ప్రవేశించుటకు దారి దొరకెను. వా రాదారిని మన పవిత్ర భరతఖండము సొచ్చి తూర్పువైపు మొగము త్రిప్పుకొని నడువసాగిరి. కొన్ని దినములు-ఏండ్లు-శతాబ్దులు—కడచెను. తూర్పు మొగమువారి సంతతివారును, పడమరమొగమువారి సంతతివారున్, నానాగోత్రములవారును, నానాదేశము లుతిరిగినవారు, సంపాదింపఁబడిన పర్యటనమునకు సంబంధించిన యనుభవమను నిగ్గుచేత తళతళలాడువారు మధ్యఆసియాలో నెక్కడనే నొక్కచోట తమ యాదిమ నివాసముకలవారు—ఈ రెండు తెన్నులను పోయినవారు మధ్య ఇండియాలో ఎక్కడనే నొక్కచోట కలిసికొనిరి. ఉపార్జింపఁబడిన యొండొరుల యనుభవసారములను అందు కలియఁబోసికొనిరి. అటువెడలి దక్షిణాముఖముగా ప్రయాణమైరి. ఆంధ్రులకును అఱవలకును వీరే పితామహులైరి.

వేఱొకరు. వీరు ఏకవర్షము, వర్షద్వితయము మాత్రమే ఇండియాలో నివసించినవారు కారు. అనేక వర్షములు పాండ్య రాజ్యమునం దధివసించినవారు. పాశ్చాత్యవిద్యామండలములచేత చక్కఁగా గౌరవింపఁబడినవారు. విశ్రుతము లగు వీరి గ్రంథములు పాఠకులకుఁ దెలిసియే యుండును. వీరియభిప్రాయము ప్రకారముగ సంస్కృతము ప్రాచీనభాషయే, కాని అఱవము ఇంకను ప్రాచీన మైనది. ఆంధ్రము కర్ణాటకము మున్నగు భాషలకంటె నఱవమునకు ఎక్కువ ప్రాచీనత కలదు. అఱవజాతివారు సంస్కృతజాతివారికంటె ప్రాచీనులై ఆర్యులసంబంధ మించుకేనియు లేకుండఁగనే యున్నతి నందఁజాలిరి. అఱవలు ఆర్యజాతివారు కారు. వీరు హిందూదేశపు టార్యులకంటె ప్రాచీనులైన యనార్యులు; సుప్రసిద్ధులు. ఆంధ్రాదిజాతులును భాషలును అఱవమునకు సంబంధించిన శాఖలు. సంస్కృతభాషతోడి సంబంధమువలన నితరులు గొప్పవారైనఁ గావచ్చుఁ గాని అట్టి యార్యసంబంధము లేకయే అఱవవారు గొప్పవారై ఆంధ్రాదులకంటె ప్రాచీనులై యున్నారు. అట్లైన నీ తెగవారు—ఈ తెలుఁగు అఱవము మున్నగు భాషలను మాటలాడువారు - వీరు ఏ-దివ్యప్రపంచము నుండి ఇచ్చటికి దిగివచ్చినారు? పేరు చెప్పినంతమాత్రముచేతనే ఏజాతిని ఈ భూమండలములోని నరులందఱును ఏవగించుకొందురో, స్త్రీలను నిలువున చీల్చివైచి, శిశుహత్యలను సంతోషముతో దేవతాప్రీతికరముగా చేసి, ఎవ్వారు దొంగతనములు దోపుడులు తమకు వంశాచారములుగా రాఁగా, లోకభీకరులై సంచరించుచుందురో, అట్టిజాతివారే ఆంధ్రాదుల పితరులకు మూలపురుషులఁట! ఆహా! చిత్రము!!

ఇఁక ఐరోపావారే జాతివారో యించుక చూతము. మన నల్లవారు ముండాపుత్రులైనయెడల వారికి లోపము లేదు. గాని దేవతావర్ణముగల తెల్లనినీటినిఁ బోలిన కీర్తిప్రవాహమునందు మునిఁగియుండువారిని మన మేమాటయు ననరాదు గదా! మా కాయుష్యము మా కారోగ్యము మాకు శుభము కదా! కాఁబట్టి పాశ్చాత్యులు అనార్యులు కారు. వారు ఆర్యులు! ఆర్యకులము నందు దీపమువలె వెలుగువారు! ఆర్యులకు మెదడు హెచ్చు. అభివృద్ధికి అంతు లేదు. ఆర్యులు ఉత్తమోత్తమ జాతి. తక్కినజాతులు ఆర్యజాతులకు చాలవు. ఆర్యులు సుఖసంపదలతోఁ దులదూగుచు నధికారులై యుందురు. కడవయంత గుమ్మడికాయయు కత్తిపీటకు లోకువ. ఆర్యులు కత్తిపీటకు పోల్పఁబడుదురు ఇది వారిజాతి. ఇది యున్నతి. వారిదే సామర్థ్యము. వారిదే బుద్ధికౌశలము. వారిదే ధర్మశక్తి. వారిదే మహత్వము. ఆర్యజాతికి మించిన జాతి లేదు. అట్టిజాతివారే తమరు.

పాఠకమహాశయులారా! మన యాంధ్రుల వంశమున కిట్టిరీతి లేఖకులవలనఁ గలుగుచున్న గౌరవమును పాటించి మన ప్రాచీనచరిత్రమును మన మే లోకమునకుఁ దెలుపవలసియున్నది. మనవిషయమై వ్రాయువారు మనవారు కారు. ఇతరులను గూర్చి మెట్టసిద్ధాంతములు చేసినను వారిజాతికి నష్టము లేదు. వారిని పూర్వపక్షము చేయువారికి విశ్వవిద్యాలయమున తావు

లేదు. వారిదే యందధికారము. కాబట్టి నిజస్థితిని తర్కమునకుఁ దెచ్చుటకై నేనీవ్యాసమును వ్రాయు చున్నాను. వైరీతివాదములను జదువుటవలన నామనస్సు నిష్పాక్షిక మందుచున్నది. పిలువని పేరంటముగా వచ్చి విదేశీయులు మనజాతివారిపై నిట్టి విపరీతములను వ్రాసి సాగించుకొనుచుండుట హిందువులకు కష్టమైన విషయమే. కాబట్టి వారిని ఖండించి స్వతంత్రముగా మనమే మనజాతిని గూర్చియు భాషను గూర్చియు విమర్శించుకొనవలెను. మన జాతిని-భాషను-గూర్చి నాకుఁగల యభిప్రాయములను వివరింతు. ఈయభిప్రాయములకు విరుద్ధాభిప్రాయము లేవేని యున్నయెడల వానికి నాకుఁ జేతనైనంతవఱకు పత్రికాముఖమున నదుత్తరముల నొసఁగఁదలఁచియుండుటచే నే నీవ్యాసరచనకుఁ గడఁగితిని. ఉన్నవిషయముల నన్నింటినిఁ జదువుట కొక పెద్దగ్రంథము కావలసివచ్చును. కాబట్టి సారాంశముల గొన్నింటిని మాత్రమే యిందు వ్రాయుచున్నాను.

1 ఆంధ్రులు ఆర్యులే! 2 ఆంధ్రభాష ఆర్యభాషయే! 3 ఆంధ్రమే ప్రాచీనభాష 4 సంస్కృతాంధ్రములు సోదరభాషలు. అందునను ఆంధ్రమే ప్రాచీనము!

(i) ఆంధ్రులు ఆర్యులే! కొన్ని కారణములు:— (అ) ఆంధ్రులు ఆర్యులని ప్రాచీనకాలమునుండియు శాస్త్రములు తలంచుచుండుట (ఆ) ఆంధ్రులు ఆర్యేతరులనుటకు ప్రాచీనసిద్ధాంతములు లేకుండుట (ఇ) ఆంధ్రులు అనార్యులని చెప్పు పాశ్చాత్యులమాటలు వట్టి నీటిమూటలగుట. మసిపూసినంతనే మారేడుకాయ కాదు. (ఈ) సాముద్రికలక్షణములవలన ఆంధ్రులయందు అనార్యత్వము కానఁబడకుండుట. (ఉ) మనోవృత్తులయందును ఆంధ్రులు ఆర్యులవలెనే యుండుట. (ఊ) పెద్దలనాటి చరిత్రమును దర్చి చూచుకొన్నను ఆంధ్రులు పెద్దలకాలమునుండియు ఉత్తమోత్తములైన యార్యజాతివారిని తలపించుచు తమచరిత్రములవలనఁ దమమూలపురుషులకుఁ గూడ వన్నె తెచ్చుట. ఆకారము వేషము భాష చరిత్రము మొదలగు నన్నింటియందును మన యాంధ్రులు వర్ణాంతరోపజాతివారికిని ఇప్పటికిఁగూడ తీసిపోక చాల సమర్థులై యున్నారు.

(ii) ఆంధ్రభాష ఆర్యభాషయే. దీనికిని గొన్ని కారణములను జెప్పుచున్నాను. (అ) వైయాకరణులు ఆంధ్రమును ఆర్యభాషలలో చేర్పలేదు. (ఆ) ఆంధ్రము అనార్యభాషయని, పాశ్చాత్యులును ఋజువు చేయలేరు. అట్లుచేయలేదు. (ఇ) ప్రాచీన సంప్రదాయములవలన ఆంధ్రభాష ఆర్యభాషలలోఁ జేర్పఁబడియున్నది. (ఈ) ఆంధ్రభాష మూలపదములును ప్రత్యయవిశేషములును కేవలము ఆర్యములే కాని అనార్యములు కావు. ఆంధ్రభాషా సంప్రదాయములు ఆర్యభాషాసంప్రదాయములలోఁ జేరినవై అనార్యభాషలలో జేర్పరాక యున్నవి.

(iii) ఆంధ్రమే ప్రాచీనభాష (అ) ద్రవిడశబ్దము ఇటీవలది. ఆంధ్రశబ్దము అతి ప్రాచీనమైనది. (ఆ) విశ్వామిత్రుఁడు ఋగ్వేదముకంటె ప్రాచీనుడు, అతఁడు ట్యూటనులకంటెను పూర్వుఁడు. (ఇ) అఱవలచరిత్రము మొన్నమొన్నటిది. త్రేతాద్వాపరయుగములలోఁ గూడ నాంధ్రు లుండిరి. (ఈ) శబ్దవ్యుత్పత్తులను జూచునప్పుడును - పాశ్చాత్యభాషా పదములకును ఆంధ్రపదములకును సంబంధము హెచ్చుగాఁ గానవచ్చును. అట్టితఱి అఱవమాటలు ఆంధ్రపదముల నవీనరూపాంతరములుగాఁ గానవచ్చును. (ఉ) ప్రతీతియు నిట్లే యున్నది.

(iv) ఆంధ్రశాఖ సంస్కృతశాఖకంటె ప్రాచీనము. సంస్కృతము, ల్యాటిను, గ్రీకు, ఇవి అక్క చెల్లెండ్రవంటివి. ట్యూటనుల ప్రాచీనభాష యీమూఁటికంటె ప్రాచీనము. ఆంధ్రభాషాతత్త్వమును బరిశీలించినప్పుడు సంస్కృతము ల్యాటిను మున్నగు భాషలకంటె మనభాషకు ప్రాచీనకాలపు ట్యూటనులభాషకు అత్యంతసమీపసంబంధ మున్నట్లు తెలియవచ్చును.

# వివేకానందస్వామి ప్రశంస

కూచి నరసింహము పంతులు గారు. బి. ఏ.

అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే, తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ (భగవద్గీత)

ఉదారకరుణాచిత్తులగు మా ప్రభువుగారు యథాగతత్రైవరణమున నాకు విశ్రాంతిసుఖ మిచ్చుచున్నారు. వ్యాధి వెనుదీయుచున్న ట్లగపడుచున్నది. మునుపటివలె విశేష శిరోభ్రమణ బాధలు లేకుండ, అప్పుడప్పుడు వార్తాపత్రికలు మున్నగునవి చదువుకొనుచున్నాను. ఇట్లుండఁగా నొకనాఁడు "ఓయీ వెఱ్ఱివాడా! నీ పుణ్యముచేఁ జివరకు సత్ప్రభువు ప్రాపు దొరకినది. అదృష్టవంతుఁడవు. జవసత్వము లుడిగిన యవస్థలో నిన్నాయన కంటిని ఱెప్పవలెఁ గాచుచు, నీకుఁ గావలయు నైహికసుఖములు పూర్ణముగా నిచ్చుచున్నారు గదా. నిద్రనుండి లేచి యేదో గొణఁగుకొనుచున్నావు. సరే. ఒక యరఁగంటసేపు కాఁబోలు తావళము త్రిప్పుకొనుచున్నావు. అదియును సరే కాని, నిత్యము నీ "డుకృఞ్ కరణే" లేమి? ఈ వార్తాపత్రికా పఠనవ్యసనము లేమి? భాషాభివృద్ధి చేసికొని యింకను బాఠములు చెప్పి బాలుర నుద్ధరించెదవా? లోకజ్ఞానము దిట్టపఱుచుకొని దేశపరిపాలనములోని లోటులను సవరించెదవా? వేదికపై కెక్కి యుపన్యాసగర్జనలు చేసి యుద్యోగములు సంపాదించెదవా? యూళ్లేలెదవా? యశస్సుకై దేవులాడుచున్నావా? ప్రజలు నిన్నటివఱకు నెత్తిమీఁదఁ బెట్టుకొని నేఁడు వషట్కారములతో సాగనంపువారిని జూచుట లేదా? ఖ్యాతియుఁ గాంతాకనకములవంటిదే యని యనుకొనవలేవా? అదిగాక, నీవేమి లోకమాన్య బాలగంగాధరుఁడవా? గంధిమహాత్ముఁడవా? నీబుద్ధి యెంత? నీశక్తి యెంత? భుక్తశేష మైన నీ బ్రతుకెంత? చాలు. జబ్బు జాలుమన్నదని, జబ్బునాఁటి యా యించుకంత భక్తి యింకిపోఁ దాఁచుచున్నావా? ఈ సింహావలోకనములు - భల్లూకావలోకనములు - నీ కిఁకఁ బనికిరావు. వెనుకచూపు ముందుచూపుగా మార్చుకొనుము. ప్రపంచవృత్తి సాధ్యమైనంతవఱకు తగ్గించుకొని కొంచెము పరమార్థచింతలోఁ బడుము. కొలఁదిగనో గొప్పగనో యితరసుఖము లేఁబదినాలుగేండ్లు చవిచూడనే చూచితివి. ఇఁక వాడని పరసుఖమునకై ప్రాఁకులాడరాదా?" అని యొక! యంతర్వాణి పలికినట్లయ్యెను.

ఉరికించి వదలిన శ్వప్నప్రశ్నలకు తెలివికలిగి, మనసు మఱియొకమార్గమును బట్టుచున్నదా యేమి? అని చూచుకొని, తగిన గ్రంథ మేదైనఁ జదువఁ దలపెట్టుకొంటిని.

"భగవద్గీతా కించి దధీతా" అన్న శ్లోకము జ్ఞప్తికి వచ్చినది. జ్ఞప్తికి వచ్చినఁ గార్య మేమి? సంస్కృతము రాదు. పఠించు కొఱకరాదా? భారకారకమై కట్టువడిపోయినది. నిత్యపారాయణము చేసికొనుచు నిర్వాణానంద మొందరాదా? కన్నన్ గీతాపారాయణము శుకప్రలాపప్రాయము మని, విదేశవిద్యా విసందిగ్ధ చిత్తము వెనువెనుకకుఁ బోయినది. కనుక సత్యోత్తమ మైన భగవద్గీత యందరాని పండయిపోయినది.

ఇఁక వేదవేదాంతములు - గీతలు - భాష్యములు - యోగశాస్త్రములు - యావదన్యమత గ్రంథములు - చూచి తెలిసికొని, తెలిసికొన్నవి తీవ్ర ముముక్షువై యాచరణములోఁ బెట్టి పరీక్షించి చూచుకొని, ముక్తుఁడై, ముక్తిసాధనములు పరోపకారార్థము విస్పష్టముగా - నాంధ్రములోఁ గాని, యాంగ్లములోఁ గాని, వ్రాసిన మహానుభావు లెవరైన నున్నారా? యని పర్యాలోచనము చేసితిని. అప్పుడు వివేకానందస్వామి నామము, విద్యుల్లతవలె హృదయాకాశము నందు మెఱసెను.

ఈయన శ్రీరామకృష్ణ పరమహంస గురువర్యుని ప్రియశిష్యుఁడు. జ్ఞానపుత్రుఁడు. ఆంగ్లసంస్కృతవిద్యా ప్రవీణుఁడు. ఆడుకొను వయసునందే యత్యద్భుత భక్తిజ్ఞానవైరాగ్య చిహ్నము లగపఱిచినవాఁడు. మహావక్త. గురువుగారివలెనే, కామినీకాంచనములను బూర్తిగా జయించినవాఁడు. తాను అమెరికాలో నున్నప్పుడు తద్దేశపు మహాధనికురా లొకయామె, దగ్గఱకు వచ్చి "స్వామీ" నా సర్వస్వముతో మీకీ శరీర మర్పించుకొనుచున్నాను. మీ భార్యగాఁ గైకొని నన్ను ధన్యురాలిని చేయుఁడు" అని పలికినప్పుడు నిశ్చలబ్రహ్మచర్యతేజముఁ గ్రమ్ము చూపులతో - నామెను జూచి, అమ్మా! నేను సన్యాసిని. నాకు ధనముతోఁ బనిలేదు. ప్రపంచములోని స్త్రీ లందఱు నాకుఁ దల్లులు. నీ వొక తల్లివి" అని ప్రత్యుత్తర మిచ్చిన కలియుగ శుకయోగీంద్రుఁడు.

మెడఁబట్టుకొని వంచి చక్కని ముత్యములు తీసికొమ్మని, యెవరైన సముద్రములోఁ దలముంచి విడిచినను, ఉక్కిరిబిక్కిరియై "ఊపిరాడుట లేదు. చచ్చిపోవుచున్నాను. నీ ముత్యములు నాకక్కఱలేదు. బాబూ! మెడవదలి రక్షింపు" మని మనుష్యుఁ డెంత యాతురతతోఁ బ్రార్థించునో, అంత యాతురతతో భవబాధావిముక్తికై భగవంతుని బ్రార్థించిన భక్తసత్తముఁడు.

చిన్ననాఁడే తీవ్రోద్రేకముతో, మహర్షి దేవేంద్రనాథ టాగూరు గారి యొద్దకుఁ బిచ్చిపట్టినవానివలెఁ బరుగెత్తుకొని పోయి "మహాశయా! మీరు దేవునిఁ జూచినారా?" యని యడిగి యలబ్ధకాముఁడై, శ్రీరామకృష్ణపరమహంసుని కడ కేతెంచి, యట్లే

ప్రశ్నించి, చివరకుఁ గృతార్థుఁడైన శ్రీవైరాగ్యసంపన్నుఁడు. చదువుకొను రోజులలో, ఒక యాంగ్లేయ మతబోధకుఁడు రోడ్డు మీఁద విగ్రహారాధనమును దూషించుచు-"నా కఱ్ఱతోఁ గొట్టిన, మీ విగ్రహ మేమి చేయఁగలదు?" అనఁగా "పడఁ గొట్టినచో, మీ ప్రభు వేమి చేయఁగలఁడు?" అన్నవాఁడు. "నీవు చచ్చిన తరువాత నరకములోఁ బడవేయును" అని కోపించి అతఁడు పలుకఁగా, "మా విగ్రహము, నీవు చచ్చినతరువాత నిన్ను నరకజ్వాలలో బడవేసి మలమల మాడ్చును" అని ప్రత్యుత్తర మిచ్చిన మేరుధైర్యుఁడు.

సద్గురు చరణారవింద సేవచే, సమస్త యోగరహస్యములు, సమస్త ధ్యానరహస్యములు, అనుభవపూర్వకముగా గ్రహించిన పుణ్య పురుషుఁడు. గురుశుశ్రూష చేయు కాలములో, గురూపదేశ ప్రకారము, సమాధినిష్ఠుఁడై, తోడిశిష్యుఁడు దోమకాటునకు వెఱచి తొలఁగిపోఁగా, గొంగళి గప్పినట్లు దోమలు దట్టముగ మూఁగి దేహమంతయుఁ గఱచినను, కదలక మెదలక, అట్లే యున్న యేకాగ్రచిత్తుఁడు.

ఆసేతుహిమాచలము తిరిగి, నానాక్షేత్రములు - నానాతీర్థములు-వివిధదేవాలయములు - సేవించి, ధ్యానపరిపాకముచే వివిధ ధ్యానానుభవ ఫలముల నాస్వాదించిన భక్తశిరోమణి.

బౌద్ధ, జైన, క్రైస్తవ తురుష్కాది వివిధ మతసారములఁ జక్కఁగాఁ గ్రోలిన సమచిత్తుఁడు. తత్తన్మతగురువులను విరాగులను దర్శించి, చర్చించి, చెప్పి, నేర్చి, సర్వమతసామరస్యమును గనిపట్టిన మహోదారుఁడు.

గురుకటాక్షముచేఁ బరమావధి యగు నిర్వికల్ప సమాధి సుఖము గూడఁ జవిచూచిన ధన్యాత్ముఁడు. ఆర్షమత సనాతన ధర్మముల ప్రాశస్త్యమును స్వానుభవమునఁ గనుఁగొన్న సన్న్యాసి. సత్తముఁడు. మహాదేశాభిమాని. నిమ్నజాతుల దురవస్థను చూచి పెక్కుసార్లు కన్నీరువిడిచిన కరుణామయుఁడు. మ్లేచ్ఛశబ్ద మెప్పుడు కల్పించినారో అప్పుడే యార్షమతము నడఁగఁద్రొక్కినా రన్న కుశాగ్రబుద్ధి. సత్యగ్రాహణచతురుఁడు.

మూలగ్రంథములను అభిమాన భావశక్తుల దృష్టితో నే చూచుచు భగవద్దత్తమైన స్వబుద్ధి నుపయోగపఱుపక, దేశకాలస్థితి భేదములఁ బాటింపక, కేవల ప్రాచీనత్వమే సార్వకాలిక ప్రమాణముగా గ్రహించుచు, ఆచారమే యామ్నాయ మని యనుకొనుచు, అన్యాయ్యములును వికటత్వ శృంఖలములును, దేశానర్థదాయకములును నగు పరంపరాగతము లైన కొన్ని అసమంజసాచారములను అభినివేశముతోఁ బ్రవర్తింపఁజేయు వారి బాధయొకటి. ఆంగ్లవిద్యావ్యాసంగముచే నవ్యనవప్రచారములు మూర్చ్ఛకొని పరదేశీయుల యొక్కపై మిసమిసలకు భ్రమసి, విదేశ వేషభాషాహార విహార వ్యామోహితులై, మసిపాత్రలోఁ గట్టి దాఁచిన మాణిక్యములవలె నున్న సనాతనధర్మరహస్యములను గనుఁగొనక, కనుగొనలేక, క్రొత్త మతములు సృష్టించి ఉన్న కాసంత యైకమత్యమును దేశమాతాభిమానములతోఁ గూడ గంగలోఁ గలుపుటకుఁ గ్రొత్త మార్గములు కల్పించినవారి బాధయొకటి. ఈ యుభయత్ర శత్రుబాధాద్వయమునఁ జిక్కి సనాతనమతము శల్యమాత్రావశిష్టమై యున్న దని పరిపరివిధములఁ బరితపించిన పరివ్రాజకచక్రవర్తి.

"వీఁడు సర్వప్రపంచము నొక యూఁపూఁపి, గజగజలాడించును" అని తన గురువాణి భావి సూచకముగాఁ బలుకుట కర్హుఁడై పుట్టినవాఁడు. అమెరికా యూరపులలో అక్కడి [illegible] నయముతో నిరుపమాన కర్తృత్వముతో, నిష్పక్షపాత యుక్తివాదములతో, అసాధారణ మేధాసంపత్తితో, అనన్యసామాన్య వైదుషి మహిమతో, ఆర్షమతబోధనముఁ గావించి అనేక ప్రసిద్ధ స్త్రీ పురుషులను శిష్యరాండ్రగాను శిష్యులఁగాను జేసికొని వైదికమతోత్కృష్టతను స్థాపించి అన్యదేశములలో ఆర్షమతబోధాశ్రమముల నెలకొల్పిన మహాప్రతిభాశాలి.

ఇట్టి శ్రీవివేకానందస్వామి అపర శంకరాచార్యస్వామి కాఁడా? పుంరూప సరస్వతి కాఁడా? మనదేశమాతృ పుత్రరత్నము కాఁడా? ఆర్యావర్తమహాతపఃఫలము కాఁడా? ఔ ననియే, నే ననుకొనుచున్నాను. పెక్కురట్లే తలంచుచున్నారు.

ఆత్మవిద్యావిషయకమైన సంశయములు నివృత్తి చేసికొనుటకై బ్రహ్మసాక్షాత్కారముకై శ్రీవివేకానందస్వామి పడినపాట్లన్నన్ని కావు. ఎన్ని తపస్యలు! 'ఎన్ని యోగసాధనములు! ఎంత కాలము చేసినాఁడు. పాపము! గురుదేవుని ఛాయాప్రతిమ, భగవద్గీత, దండకమండలువులు, భిక్షాపాత్ర, కాషాయచేలము — ఇవి తప్ప మఱియొండు లేకుండ, ఎన్ని యడవులు గుహలు చొచ్చినాఁడు. ఎన్ని తీర్థములలోఁ గ్రుంకినాఁడు. ఎందఱు సిద్ధపురుషులను సేవించినాఁడు! కొంత జంకులేకుండ ఎన్ని ప్రశ్నలు వారిని వేసి, వారు చెప్పినట్లు చేసి, సందేహపరంపరలు దీర్చుకొన్నాఁడు! అన్నపానములు లేక యెప్పుడెప్పు డెన్ని రోజులు పర్వతారణ్యములలోఁ బర్యటనము చేసినాఁడు! సర్వసామాన్యమైన భుక్తికే యెంతో శ్రమపడవలెను గదా! ముక్తికై యెంత శ్రమపడవలయును? గాని యితరు లెట్లు చెప్పఁగలరు? ఆత్మవిజ్ఞానమునకు, అభీష్టసిద్ధికిఁ బూర్వము, అనేకబాధలు పడుట తప్పదు.

దివ్యమోక్షానందముకై యెంత కష్టముపడినాఁడో, దేశసముద్ధరణముకై యంతకష్టము పడినాఁడు. అందుకై తనశక్తి, తన బుద్ధి, గురుకటాక్ష సమార్జితమైన తన యమూల్య తత్త్వజ్ఞానధనము, తనప్రాణము, ధారపోసినాఁడు.

ఆ దేశ మహారాజులు శిష్యులై ధనము లర్పించుకొందు మన్నను వలదు వలదని వదలిపెట్టినాఁడు. మూఁడునాళ్ళకంటె ఎక్కువగా సన్న్యాసి యొకపట్టణమున నుండఁగూడ దని, పామునుఁజూచి పాఱిపోవు బాలునివలెఁ, బెక్కుసార్లు తనకు సేవచేయుచుండు ధనిక శిష్యులనుండి తరలిపోయినాఁడు. ఇది అమెరికాకు వెళ్లకపూర్వము స్వామి మనదేశములోఁ బరివ్రాజకవృత్తిలో నున్నప్పటి మాట.

గురువుకొద్ద సాధనలు చేయుచున్నప్పు డనేక యోగ

మహిమలు వర్ణనీయము, నవి మోక్షావరోధకము లని తాఁ ద్యజించుటచే గాక, నాయష్టై మీరును దేయుఁ డని తన శిష్యులకుఁ బెక్కుమార్లు నొక్కి నొక్కి బోధించినవాఁడు.

మైసూరు మహారాజు గా రొకనాఁడు మిక్కిలి గౌరవించి తన ప్రక్క నుచితాసనముపై గూరుచుండఁ బెట్టుకొని, చనవుతో "స్వామీ ! మా యాస్థానములోని దివాను, సన్నిధానవర్తులును, ఎట్టివారు ?" అని వారి యెదుటనే యడుగఁగా, "అన్ని సంస్థానములలో నున్నట్లే యిచటను అట్లే యున్నారు." అని జంకు లేక పలికినాఁడు. అంత, మహారాజు చాటునకు లోపలికిఁ దీసికొని పోయి "మహాత్మా ! గొప్పవా రని మామాట మించుకయు లేక, సమ్ముఖముననే, వారి నట్లు పరాభవించితిరే !" యని పలుకఁగా, "మహారాజా ! నీవు న న్నడిగితివి గాన, బ్రత్యుత్తర మీయవలసి వచ్చెను. సన్న్యసించిన తరువాత నైనను సత్య మాడవలదా ? నిన్నుఁ గూర్చి నీ వుమారుఁ డడిగినను, ఉన్న దున్నట్లు చెప్పువాఁడనే !" యని నిర్భయుఁడై జవాబిచ్చెను.

ఒకనాఁ డీయనయును, ఇద్దఱు గొప్ప యాంగ్లేయులును, ఒకబండిలోనే కూరుచుండి 'రైలు ప్రయాణము చేయవలసి వచ్చెను. స్వామి కింగ్లీషుభాష రా దనుకొని' సాధువులు దొంగ లని, వంచకులు, సోమరిపోతులుఁ దిరుక్కురు లని, ఆ యిరువురు నోటికి వచ్చినట్లు వారిభాషతో దూషించుచుండిరి స్వామి నిశ్చలచిత్తుఁడై నిమీలిత నయనుఁడై యూరకుండెను. అంతట నొక స్టేషనుకడ ఈ ముగ్గురును దిగి దాహ మగుచున్నది. కొంచెము మంచితీర్థ మిప్పించెదరా? యని స్టేషన్మాష్టరు గారిని స్వామి యింగ్లీషుభాషతో నడిగెను. అది విని దొర లాశ్చర్యపడి యాడినమాటలకు నొచ్చుకొని, "ఏమయ్యా ! యింగ్లీషు వచ్చికూడ, మే మన్ని మాటలు మి మ్మన్నప్పుడు మిన్నకుంటిరి ?" అని యాంగ్లేయభాషతో సాంత్వనవచనము లాడిరి. "మూర్ఖులను జూచుటయు, మూర్ఖప్రసంగములు వినుటయు, నా కిది మొదటిమాటుగాదు" అని స్వామి యింగ్లీషులోనే జవాబిచ్చెను. దొరలకుఁ గోపము వచ్చి కన్ను లెఱ్ఱఁజేసిరి. అట్టివానికి నేను సంసిద్ధుఁడనైయే యున్నా నని చెప్పినట్లు స్వామి తొన్కులెంచి, యినుపముద్గలవలె నున్న చేతికండలను వారి దృష్టిపథమునకుఁ బరచెను. ఇంక మర్యాద దక్క దని కాఁబోలు క్షమింపు మని పల్కి మఱి మాటాడక దొరగార్లు నాటినాటికిని వారు తొలఁగిపోయిరి.

"[illegible]" ! [illegible] దేశసంరక్షణమునకై చేయు ప్రయత్నములలోఁ బైవిఘ్నలు వట్టుపడినప్పుడును, అసాధ్యమైన దేశోద్ధరణ సాధనము మవన్నన్నప్పుడును, స్వామి గిజగిజ కొట్టుకొని— "ఓ శ్రీరామకృష్ణభగవానుఁడా ! ఓతల్లీ ! జగజ్జననీ ! మీ బిడ్డనికి సరియైన దారి చూపి కృతకృత్యునిఁ జేయరా ! మీయాదేశము చే కదా శిరసావహించి నెఱవేర్పఁ ద్రికరణశుద్ధిగా దీక్ష వహించితిని. కరుణించి రక్షింపుఁడు ! మీ యనంత తేజశ్శక్తులు నాకుఁ బ్రసాదింపుఁడు !" అని భక్తిబాష్పములు వఱదలువాఱ, శ్రీ కన్యాకుమారియాలయము నున్న సుపవిత్రస్థానములతో, నెన్నో సార్లు ఏడ్చినాఁడు. అంచియాఁచి యుదయఁ దన యభీష్టసిద్ధికై కావలసిన జ్ఞాన తేజోబలమును బూర్ణముగా సంపాదించుకొన్నాఁడు. సంపాదించుకొని సత్సంకల్పములు నెఱవేర్చుకొని శాశ్వతకీర్తిఁ బడసినాఁడు.

ఇట్టి మహామహుని చరిత్రము చదువు మహాభాగ్యము నాకు గలిగినది. హిమవత్ప్రాంతమందలి మాయావతిలోని యద్వైతాశ్రమమున, శ్రీస్వామిప్రాక్పశ్చిమశిష్యులు, గురుసచ్చరిత్రమును భక్తితత్పరులై, విపులముగా, సరళముగా, ఆప్యాయమానమైన శైలితో, వ్రాసి 4 సంపుటములుగా కలకత్తాలో ముద్రించి ప్రకటించి పుణ్యము గట్టుకొన్నారు. అందుఁ బ్రథమద్వితీయసంపుటములు పరమానందముతోఁ బఠించినాను. మిగిలినభాగములు చదువుటకు మహోత్కంఠతతో నున్నాను.

శ్రీమద్భగద్గీతాగ్రంథము నుండి యెత్తి మకుటముగా వ్రాసిన శ్లోకము ఈనాఁటి యనన్యభక్తుల పూతచరితములందుఁ గూడ బూర్ణముగా సత్య మగుచున్న దని చూపుటయే ఈ వ్యాసముయొక్క ముఖ్యోద్దేశము. అందుకై శ్రీవివేకానందస్వామి జీవితమునుండి రెండు దాహరణముల నీక్రింద నిచ్చెదను: ఆ మహానుభావు నెడల నాకుఁ గల భక్తి ప్రపత్తులు వెల్లడించుటయును, ఆయన పవిత్రచరణారవిందములకు నా శతసహస్రప్రణామము లంతశ్శుద్ధిగా నర్పించుటయును, ఉపోద్ఘాత మింత పెంచవలసి వచ్చెను. శ్రమ యిచ్చినందులకుఁ జదువరులు నన్ను మన్నింతురు గాక.

ఊరూరఁ దిరిగి, యింటింట బిచ్చ మెత్తుకొను రోజులలో ఒకనాఁడు "నే నిల్లువదలి సన్న్యసించినది ఆత్మసాక్షాత్కారమునకా? అడుగుకొని తినుటకా ? అది నాకు సిద్ధింపనప్పుడు భిక్షాటన మేల ? నిటు పేదల బాధించి నేఁ దిని నందువలన ఫలమేమి ? పిడికెఁడు బియ్యము మిగిలినఁ, బేదవారిబిడ్డ కొక ముద్ద దక్కిన దన్నమాట గదా ! పరమాత్మావలోకనమునకుఁ బనికిరాని యీ పాడుశరీరము నే నేల కాపాడుకొనవలెను ? ఛీ ! ఛీ ! ఇఁక నీవృత్తి మానెదను. పూర్వమునుత్సవుల వంతను బోయెదను. అన్నము తినక నీళ్లు త్రాగక, ప్రయాణప్రయాసములచే ఈ రక్తమాంసాస్థిమయమైన దేహమును శుష్కింపఁజేసి దారిలో నచటనో వ్రాల్చెదను."— అని వివేకానందస్వామి తలఁచుకొని దృఢనిశ్చయుఁడై యొక మహాకాననములోఁ దూరఁబడి, సింహాదికములను లక్ష్యించక, పగ లంతయు నడచి [illegible] సాగింపలేక, సాయంసంధ్యాసమయమున నొక చెట్టుక్రిందఁ జతికిలఁ బడెను. చతికిలఁబడి సర్వాంతర్యామి యగు భగవంతునిపై మనసు పెట్టుకొని ఏకదృష్టితోఁ జూచుచుండెను.

ఇట్లుండఁగాఁ గొంతసేపటి కొక పెద్దపులి దూరమునఁ గనఁబడెను. క్రమక్రమముగా దగ్గఱ దగ్గఱకు వచ్చి అది కొన్ని గజముల దూరమున నాఁగి అచటఁ గూర్చుండెను.

స్వామి యాశ్చర్యపడి, "సరే ! బాగుగనేయున్నది. మన మిద్దఱము కూడ మిక్కిలి యాఁకలిగొని యున్నాము. ఈశ్వరసాక్షా

త్కారమున కుకశోంకింపని యీ తనువృత్తులన ప్రపంచమున కేమి యుపయోగము లేదు. ఇట్టికానిదో నాకుమాత్ర మేమి పని? దుర్వ్యాధచే నకనకఁ బడియున్న నిరుపయోగ్యాంగకములఁ బడినదో, దీని జన్మము కొంత సార్థక మగు నేమో ?" అని తలపోసికొని, పులి యే నిమిషమునవో తనమీఁదఁ బడి తన్నుఁ దిను నని నిశ్చయించుకొని, నిశ్చలుఁడై, నిర్భయచిత్తుఁడై, యెవరిపై నింతవఱకు మనసుఁ బెట్టుకొననో, ఆయనపైనే దానిని గట్టిగా లగ్నము చేసి నిర్యాణక్షణమును నిరీక్షించుచుండెను.—

కాని కూరుచుండి కూరుచుండి, ఏకారణమునవో పులి చటుక్కున లేచి మఱియొక త్రోవను బోయెను. పోయినప్పటికిని అది మఱల వచ్చి తన్నుఁ గబళించుట తప్ప దనుకొని, స్వామి ప్రతి నిమిషమును దానికై వేచికొనియుండెను. ఎంతసేపు కనుపెట్టుకొని యున్నను, అది వచ్చి తిరుగఁ గనఁబడలేదు. అతఁడు రాత్రియంతయు నాచెట్టుక్రిందనే పరుండి నిద్రపోయెను. తెల్లవారెను. అపూర్వమైన శరీరబలముతోను అత్యంతమైన మనోబలముతోను, స్వామి నిద్రలేచి తరలిపోయెను. ఆఁకటిచేతను, కాలినడకచేతను, ఎంతో బడలి-సోలి-చదికిలఁబడిన సన్న్యాసికి అట్టి దేహబలమనోబలము లెట్లు వచ్చెనో, ఎవ రిచ్చెనో, వివేకానందస్వామి కెఱుక! స్వాముల కెల్లరకును స్వామి యగు ఆస్వామి కెఱుక!

ముందు వేసఁగిని స్వామి పరివ్రాజక వ్రతము పూని తిరుగుచుండెను. తిరుగుచున్నది అత్యుష్ణమైన దేశము. రాజపుత్రస్థానము. ఎడారిభూమి. మధ్యాహ్నకాలమున నిసుకరేణువులు తళతళ మెఱయుచు గాజుపూసలవలెఁ గన్నులు మిఱుమిట్లు గొలుపుచుండును. బయళ్లు అవిరి గ్రమ్మిన ట్లగపడును. బొంగరములవలెఁ జిన్నచిన్న సుడిగాలులు గుడిదిరుగుచుండును. వేఁడిమి కలవాటుపడి చిట్టి తుప్పలలో మేయుచుండు మేఁకలు గూడ నొకప్పుడు కానరాకుండును.

ఇట్టి కాలములో వివేకానందపరివ్రాజకుఁడు పర్యటనము చేయుచుండెను. కాని యంగీ, కావికాసె, తప్ప దగ్గఱ మఱే యేవిధమగు సామగ్రియు లేదు. సాధారణముగా, కఱ్ఱతోనో, కొబ్బరచెంపతోనో చేసిన కమండలు వొకటి చేత నుంచుకొనెడివాఁడు. అది కూడ ఎక్కడ పాఱవేసినాఁడో కాని, యిప్పుడు లేదు.

తిండిలేకయుండఁ గొన్ని పూఁటలనుండి యొక వర్తకునితో రయిలుబండిలోఁ బ్రయాణము చేయుచుండెను. స్టేషను స్టేషను నొద్దను మంచినీళ్లమ్మువానిని కుంచితిల్లడిగెను. కాని చేతిలో నేమియుఁ బెట్టకపోవుటచేత వాఁడు మాట వినిపించుకొనకయే, మఱియొకచోటికిఁ బోవుచుండెను. వాఁడు మఱలవచ్చునప్పటికి, రయిలుస్టేషనునుండి పోవుచుండెను. ఇట్టి స్థితిలో స్వామి దాహశాంతిగావించుకొనుట కవకాశము లేకపోయెను. జిహ్వ ఆఱిపోవుచుండెను.

సహపథికుఁడైన వర్తకునకు, సన్న్యాసు లన్నను సాధువు లన్నను పరమాసహ్యము. డబ్బుగలవాఁ డగుటచేతఁ గావలసిన పండ్లు భక్ష్యములు పాలు చల్లని మంచినీళ్లు, కొని ఆరగించుచుండెను. ఆరగించుటలో నేమియుఁ దప్పులేదు కాని, అతఁడు స్వామిని దాఁచి నవ్వుచు, వెక్కిరించుచు, మర్మభేదకము లగు మాటలు లాడుచు మిక్కిలి బాధపెట్టుచుండెను. ఇది కడు శోచనీయము.

చివర కిద్దఱును "తారిఘాట్టు" అను స్టేషనులో అభిజిత్కాలమున దిగిరి. డబ్బులేని వివేకానందుని మొగ మెవరు చూతురు? మంచినీళ్లు దొరకినవి కావు సరిగదా తలదాఁచుకొనుటకు స్టేషనులో నీడగల చల్లని ప్రదేశమైనను దొరకలేదు. పైకాటి ... పదములు మండిపోవు బయటి యిసుకమీఁదఁ బడియుండి ఒక స్తంభమునకు వెన్నానుకొని స్వామి కూరుచుండెను.

ఆయనయెదుటనే కొంచెము దూరమున, చల్లనిచోట మృదులాస్తరణము మీఁద చుట్టును సమస్తభోగపదార్థములు పెట్టుకొని వర్తకుఁడు నక్షత్రకుఁడువలెఁ గూరుచుండెను.

కూరుచుండి యూరకుండక "ఏమయ్యా! ఇటుచూడుము. ఆహా! ఎంత చల్లని మంచినీళ్లు! ఎంత రుచిమంతము లైన లడ్డు మిఠాయి యుండలు! ఈ పూరీలు చూడుము. ఏమి మృదువైన పూరీలు! ఇవన్నియు నేను ఆప్యాయనముగాఁ దిని దివ్యానందభరితుఁడ నగుచున్నానే! నీగ్రహచార మేమి కాలినది? సన్న్యాసము పుచ్చుకొని యేమి పొందుచున్నావయ్యా? మద్దిమ్రాఁకులా గుంటుని గదా. ఏదో పనిచేసికొని డబ్బు సంపాదించుకొని సుఖపడరాదా? అర్థపరిత్యాగము అనుత్యాగములోనికి దింపదా? ధనహీనుఁడు బుద్ధిహీనుఁడు గాఁడా? చేయి జేబును పట్టి వైనప్పుడు, పొట్ట మాత్రము పట్టిదిగా నుండదా? విత్తము వలదన్న కొట్టి వెంగలయ్యకీ శాస్తి కావలసినదే! ఇంకను గావలసినదే! చూడుము. కూరుచుండుటకు నాకీ స్నిగ్ధచిత్రాసనము. నీకు కనకనలాడు కఱకుటినుకనేల. తినుటకుఁ ద్రాగుటకు నాకు మంచిమంచి భక్ష్యపానీయములు. నీకు మండెడు కడుపును ఎండెడు గొంతుకయును. తెచ్చిపెట్టుకొన్న కష్టములు తృప్తిగా, తీరికగా, అనుభవింపుము" అని పాపమా వర్తకుఁడు స్వామిని ఊరకయుండనీక, పిలిచి, లొట్టలువేసి తినుచు, గుటకలు వేసి త్రాగుచు, తెగఁద్రేన్చుచుఁ, బలువిధముల బాధపెట్టుచుండెను.

శుద్ధసత్త్వస్వభావుఁ డగు స్వామి ఆ పరిహాసవాక్యములకును, ఆదష్టాదేష్టీరములకును, ఏమాత్రమును గినియక - చలింపక - తితిక్షావిగ్రహమువలెఁ గూరుచుండెను.

అంతలో నా గ్రామనివాసియొ, యొకఁడు, కుడిచేత నొక మూటయు లోటయును, ఎడమచేత తిరిగలగంధపలితపూర్ణమైన యొక మట్టిమూకాయును పట్టుకొని, కక్షలో నొక తెల్ల చిన్న దుప్పటియును ఆస్తరణముగ ముడుగొంచు నొక చిన్నమెత్తయుఁ బట్టుకొని, పరుగుపరుగున వచ్చి స్టేషనులోఁ జొచ్చి శుభ్రమైన యొకచోట దుప్పటిపఱచి, మూటవిప్పి, అందలి వివిధభోజనపదార్థములను దానిపై నమర్చి, స్వామికడకు సంభ్రమముతో వగరుచుకొనుచు వచ్చి, "బాబాజీ! దయచేసి యిటువచ్చి, తమరు నేఁ దెచ్చిన యాహారమును వేగ భుజింపుఁడు." అని ప్రార్థించెను.

ఆ వస్తువు లెటులు ప్రాప్తించెనో, తెచ్చినవాఁ డెవఁడో నామమాత్రము తెలియని స్వామి యాశ్చర్యమును, ఇంతకుముం దనపై పరిహాసములు చేయుచు ఇప్పుడు వెలవెలఁబాఱిన ముఖముతో, బాష్పనేత్రితో, వెలిఁదినకన్నుల యాయురుండఁ జూచుచు దిక్కుతోఁచక ప్రతిమవలె నున్న వర్తకుని యాశ్చర్యమును, ఎవఁడు మాటలతో వర్ణింపఁగలఁడు ?

క్రొత్తగా వచ్చినతఁడు "బాబాజీ ! ఆలస్యము చేయకుఁడు ! వచ్చి వెంటనే భుజింపక తప్పదు." అని స్వామిని బ్రతిమాలి బలవంతపెట్టుచుండెను.

స్వా:—మిత్రమా ! నీ వేదో పొరపాటు పడుచున్నట్లున్నావు. ఒకనిని జూచి యొకఁ డనుకొనుచున్నావేమో ! నిన్నెన్నఁడును జూచినట్లు నాకు జ్ఞప్తిలో లేదు.

గ్రా:—సరిసరి ! బాబాజీ ! నేను మిమ్ముఁ జూచితిని చూచితిని. పొరపాటేమియు లేదు.

(వర్తకుఁడు తెల్లనోరు వెట్టుకొని చూచుచుండెను. స్వామి అతివిస్మయముతో నిట్లు పలికెను.)

స్వా:—అయ్యా ! నీ మాటలు నాకు దురవగాహములుగా నున్నవి. న న్నెక్కడఁ జూచితివి ?

గ్రా:—బాబాజీ ! వినుఁడు. నే నీయూరి మిఠాయివర్తకుఁడను. ప్రొద్దున భోజనముచేసి, మామూలుగా ప్రక్కపైఁ బరుండి కొంచెము కన్నుమూసితిని. అంతట నొక స్వప్నము వచ్చెను. అందు శ్రీరామచంద్రమూర్తి, నిన్ను- సరిగా నీవంటి రూపమునే- వ్రేలు పెట్టి చూపి "అదిగో ! వాఁడు. నీ యెదుట నగపడువాఁడు. నిన్నటినుండి తిండిలేక బాధపడుచున్నాఁడు. ఆ బాధ యంతయు నేనును బడుచున్నాను. వెంటనే లేచి, పూరీలు కూరలు చేసి యవియును మిఠాయి చల్లని మంచితీర్థమును, కూరుచుండుట కొక చిన్న మెత్తయును, రెయిలుస్టేషనునకుఁ బట్టుకొని వెళ్లుము. లెమ్ము." అని పలికెను. నేను మేలుకొంటిని గాని అది యేదో సామాన్యపు కల యని, అలక్ష్యము చేసి, ప్రక్కను ఒత్తిగిల్లి మరలఁ బరుంటిని. అంతట అపార కృపాసముద్రుఁడగు శ్రీరామచంద్రప్రభువు, తిరుగ నిద్రలో నగపడి— "ఓరీ ! ఏమిరా ! త్వరగా లేచి నేఁ జెప్పినట్లు చేయవేమిరా ?" అని నన్నుఁ జూచి కోపించి గద్దించెను. ఇఁక నెట్లు ఉపేక్ష చేయఁగలను ? ఉలికిపడి లేచి శీఘ్రముగా పూరీలను కూరలను జేసి, అవియును, తత్పూర్వమే చేయఁబడి సిద్ధముగా నున్న మంచి మిఠాయియును, గుమగుమలాడు చల్లని మంచితీర్థమును, ఒకచిన్న మెత్తను, పట్టుకొని, వేళ మించిపోవునేమో యను భయముతో తిన్నగా నిచ్చటికి పరుగుపరుగున వచ్చితిని. వచ్చి స్వప్నములో సాక్షాత్కరించిన రెండవ మహానుభావుని—మిమ్ము—దూరమునుండియే చూచి ఆనవాలు పట్టితిని. పొరపాటేమాత్రమును లేదు. కనుక దయచేసి వేడి చల్లారకముందే, తెచ్చినవి ఆరగించి నన్ను ధన్యుని జేయుఁడు. మీరు మిక్కిలి క్షుద్బాధతో నున్నారు. ఇఁక నాలస్యము చేయకుఁడు.

(వెంటనే స్వామి వెళ్లి సంతృప్తిగా భుజించి, కడుపునిండఁ జల్లని మంచితీర్థము త్రాగి, మిఠాయివర్తకునికిఁ గృతజ్ఞతాభివందనము లర్పింపఁ బోఁగా-)

గ్రా:—అదేమి బాబాజీ ! వలదు. వలదు. వందనములు నాకా ? అంతయు శ్రీరామచంద్రభగవానుని యిచ్ఛప్రకారము, ఆజ్ఞప్రకారము జరిగినది. ఆయనకు సమర్పింపుఁడు.

అన్ని పరిహాసములు చేసి స్వామిని పరాభవించిన వర్తకుఁడు పిడుగుపడినవానివలెఁ గొంతసేపు నిశ్చేష్టితుఁడై యుండి, పిమ్మట స్మృతికివచ్చి, బుద్ధి దెచ్చుకొని, పశ్చాత్తప్తుఁడై క్షమింపుఁడని స్వామిపాదములపైఁ బడి తత్పాదరజము తీసి బొట్టు వెట్టుకొనెను.

స్వామి, విస్మయానందభరితుఁడై విచ్ఛిన్నసంశయుఁడై, కనుఁగవనుండి పూర్ణ పూత భక్తిబాష్పములు కాలువలుగా చెక్కులంటి ప్రవహింపఁ, దైని వ్రాసిన భగవద్గీతాశ్లోకరాజమును స్మరించుకొనెను. స్మరించుకొని "పరమేశ్వరా ! మార్జాలకిశోర న్యాయముగా నిన్నే నమ్ముకొన్న వారికి బాధ లన్నియును పటాపంచలౌను కదా !" అని నిశ్చలమనస్కుఁడై ధ్యానించుకొని యుండవచ్చును.

# భగవద్గీతల పరమార్థము

వేదుల పార్వతీశము గారు

దేశమే దైవము. దేశభక్తియే దైవభక్తి. నిష్కామకర్మయే కర్మసన్న్యాసము. ఇదియే జ్ఞానము. ఇదియే జీవన్ముక్తి.

భగవంతునిచే నిర్మింపఁబడిన సృష్టి యంతయు నెల్లప్పుడు నానందమును పొందుచుండవలయు ననియే కోరుచుండును. ఇట్టి యానందము రెండు విధములు. బాహ్యేంద్రియానందము అని అంతరింద్రియానందము అని. ఇందు బాహ్యేంద్రియానంద మశాశ్వతము. అంతరింద్రియానందము శాశ్వతము. ప్రతిజీవియును కోరఁదగినది యీ శాశ్వతానందము. ఇందులకు కర్మ ప్రధానము. కర్మకు జ్ఞానము అవలంబనము. కాననే మహర్షులు తమకుఁ గల యనుభవజ్ఞానముచే జ్ఞానకర్మయోగముల రెంటిని విపులముగ ననేకరీతుల వెలిఁబుచ్చిరి. కాని వీని రెంటిని మించు కర్మ యగు భక్తియోగ మెందున్నదియుఁ గానరాదు. దీనినే శ్రీకృష్ణభగవాను లర్జునునకు బోధించెను. కర్మగాని జ్ఞానముగాని యభివృద్ధి గావలయు ననిన భక్తి యాధారము. ఈ భక్తియోగమునకు [illegible] మనకు జ్ఞానకర్మ యోగములు చెప్పఁబడియున్నవి. ఇది రాగద్వేషాదుల నరికట్టి జ్ఞానకర్మల నభివృద్ధిచేసి మనుజుని శాశ్వతానందమున నుంచును. కావుననే "భక్తియోగా న్ముక్తిః" అని చెప్పఁబడియున్నది.

భక్తి యనఁగా, నానందస్వరూపుఁ డగు భగవంతునియందలి ప్రేమ. ఇట్టి భక్తి రెండువిధములు. 1 కామ్యము. 2 నిష్కామ్యము. నిష్కామ్యము ముక్తికి మార్గము. కామ్యము నిష్కామ్యమునకు కారణము. కావుననే కామ్యభక్తుల సహితము నిందింపదగదు. భాగవతంబునను-

ఆ. అలుకనైనఁ జెలిమినైనఁ గామంబున
నైనఁ బాంధవమునసైన భీతి
నైనఁ దగిలి తలఁప నఖిలాత్ముఁ డగు హరిఁ
జేరవచ్చు వేఱు సేయఁ డతఁడు.

యని చెప్పఁ బడియున్నది. కామ్యకర్మ నిష్కామ్యకర్మకు కారణ మగుటకు ధ్రువోపాఖ్యానము తార్కాణము.

మఱియు శాశ్వతానందమును పొందుటకై మనము నిరంతర ముగాఁ జేయవలసిన కృషి యేమనిన- శాశ్వతానందవస్తువును ప్రార్థించుట. చేరుట, పొందుట, అందు లీనమగుట. ఇవియే సాలోక్య సామీప్యములు. దీనిని ప్రహ్లాదుఁ డెట్లనుభవించినదియు, సప్తమస్కంధములోఁ జెప్పఁబడినది.

మఱియు దీనికి ప్రారంభమున మన మరయవలసినది భగవంతుఁడు కలఁడా, లేఁడా? ఉన్న నెట్లు? లేకున్న నెట్లు? ఉన్న నెచ్చట నెట్టిగుణములచే కనుగొనఁగలము? అని విమర్శింపవలయును. నారాయణోపనిషత్తునందు "అథ నిత్యో నారాయణః, బ్రహ్మ నారాయణః, శివశ్చ నారాయణః, శక్రశ్చ నారాయణః, కాలశ్చ నారాయణః, దిశశ్చ నారాయణః, విదిశశ్చ నారాయణః, ఊర్ధ్వం చ నారాయణః, అధశ్చ నారాయణః, అంతర్బహిశ్చ నారాయణః" యనియు, సీతారామాంజనేయమున- రాముఁడు నిర్వికారుఁడు అనుమున్నగు పద్యముల ద్వారాను- భగవంతుని "ఉన్నాఁడు" "లేఁడు" అని బోధించుచున్నవి. ఇందు "ఉన్నాఁడు" అనుపదము "లేఁడు" అను అనుభవానందమునకు కారణము. కాన మన మున్నాఁ డనుపదమునే ముందు తీసికొని లేఁ డనుపదమును పిమ్మట గ్రహింపవలసియున్నది. దీనిని బాగుగా చూడవలయు ననిన భగవంతుని ముఖ్యగుణములను తీసికొనవలయును. భగవంతుని ముఖ్యగుణములు అమాయికత సత్యము శాంతము మృదుత్వము, దయ మున్నగునవి. ఈగుణము లనేకవిధములగు తేజస్సును కనఁబఱచును. ఆ తేజస్సే భగవంతుని రూపము. ఈ తేజస్సు సృష్టియంతటను నిండియున్నది. కాని యిట్టిది మాయాసహితమై కొన్నిటఁ గానరాకయును మఱి కొన్నిట స్వచ్ఛముగను నున్నది. ఇట్టి తేజస్సును కనుఁగొనుటకు కనుఁగొనువాని తేజశ్శక్తితో సంబంధించియున్నది. కానఁ బ్రతిమానవుఁడును తన మనస్సును విశాలవంతము గను తేజఃపూర్ణముగను జేసికొనుట ముఖ్యము. మనోభివృద్ధికి పరిశ్రమ మావశ్యకము. తేజోభివృద్ధికి భగవంతుని తేజఃపరిశీలన మావశ్యకము. ఇట్టి తేజస్సును కొన్ని కొన్ని పదార్థములందును, కొందఱు మనుష్యులందును కనవచ్చును. వీరు సత్యశీలురు, శాంతులు, అమాయికులు నగు మహనీయులు. వీరి ముఖవిలాసమును పరిశీలించిన మనకుఁ దెలియును. ఇట్టి ముఖవర్చస్సే మనము మంచిచెడ్డలను చెప్పుట కాధారము. ఆ ముఖవర్చస్సే వారిని మఱిమఱి చూడవలయు ననియు సంభాషింపవలయు ననియు మన మనస్సును లాగును. శ్రీకృష్ణుని చర్యలను బాహ్యదృష్టితో చూచిన నెన్నిలోపము లైనను గానిపించును. కాని [illegible] వానిని నిందించిన వారు గలరా? ఇందులకు కారణ మేమి? మాయామాయుఁ డగుటయే! ఇదియే కారణముగ మనము ప్రేమించు పిల్లవాని పసుల క్రియక్రియ ముగా వానికి 4, 5 సంవత్సరముల ప్రాయముగలవాఁ డగునరికి కొన్ని మంచివిగాను కొన్ని చెడ్డవిగాను అగుచున్నవి. మనము కడు హీనముగా చూచు పంది, కుక్క, గాడిద పిల్లలను చూచిన, మన మన మెట్లుండును? చీమలు బారుగట్టి తమ యాహారంబును గాని గ్రుడ్లను గాని తీసికొని పోవుచున్నప్పుడు బాగుగ పరిశీలింపుఁడు. పక్షులు, చిలుకలు, నెమళ్లు, కోయిలలు మొదలగువాని రంగులు, చేష్టలు నెంతయింపును గొల్పుచున్నవో! వృక్షములు మొలకలెత్తుట చిగుర్చుట, పుష్పములు, కాయలు, వాని యేర్పాటులు, రంగులు

# చదరంగము

## సమ్మెట రంగయ్యనాయుఁడు గారు

ఇది లోకమునఁ బ్రసిద్ధిఁజెందిన యాటలలో మిక్కిలి యుత్కృష్టమైనదై ఆటలలో రాజనియు రాజుల యాట అనియు వాడుకలో నున్నది. ఇది యెంతకాలమునుండి వాడుకలో నున్నదో యెవరు కల్పించిరో తెలియదు. ఇంగ్లీషువారు తమ చదరంగ గ్రంథములలో పదునేడవ శతాబ్దమునుండి ప్రారంభింపఁబడినట్లు వ్రాయుచున్నారు. అమెరికావారు శ్రీరాముఁడు లంక నాక్రమించిన రోజులలో మండోదరి తనభర్తయైన రావణాసురుని విచారము దూరము చేయుటకై సృష్టించినట్లును నాఁటనుండి నేఁటివఱకును వాడుకలో నున్నట్లును తమ గ్రంథములలో వ్రాసిరి.

ఈమధ్య ౫-౬ సంవత్సరముల క్రిందట ఏ. జే. మారిసు అను చదరంగచరిత్ర గ్రంథకారుఁడు ఏషియా యూరోపు అమెరికా ఆఫ్రికాఖండములలో సమస్తప్రదేశములందును సంచరించి సంతరించిన విషయములను బట్టి చూచినను ఆయా ప్రదేశములవారు తమ తమ రాజ్యములయందే పూర్వికులచేఁ గల్పింపఁబడి వాడుకొనుచున్నట్టులును ఏప్రదేశమునఁ గూడ నీయాట ప్రారంభించినకాల మెవరికిని దెలియనటులును దెలియుచున్నది. మనుష్యుఁ డెంత వాడుకలో నుంచిన నంతటి మేధ నభివృద్ధి పఱచుశక్తి దీనియం దుండుటచేత నే సమస్తదేశప్రజలు - రాజు మొదలుకొని కాపువానివఱకును - దీనిని వాడుక చేయుచున్నారు.

మారిసుగారి చరిత్రయందు కొన్ని రాజ్యములలో పూర్వులు ఈ చదరంగపు ఆటను పలుగురు ఎనిమిదేసి కాయ లుంచుకొని యాడినట్లును పిమ్మటఁ గొంతకాలమున కొకరి నొకరు చూచి యిద్దరిలో నాడుట యేర్పడినటులును వ్రాసియున్నారు గాని కల్పనాకాలమున నిద్దరిలోనే యుండుట దృఢము. ఏది యెటు లున్నను రమారమి 800 ల సంవత్సరములనుండి యనేకదేశములలో బుద్ధిమంతుల యూహల నాక్రమించుచుండుట నిక్కము.

ఇండియాదేశమునను యూరప్పుదేశమునను కొందఱు బలమాట యని పనుక బల్గానుగల కాయను కొట్టక ఆడుచున్నారు. ఇంతహీనమైన ప్రచార మింక నేదేశమునను లేదు. ఉభయపార్శ్వముల తమతమ కాయలను పెనుకపఱ్ఱాను గలుగఁజేసికొనిన పిమ్మట యాడినకాలమునే ముందునకు పనుకను నాడుచు నియమార్హ్యములవారును చేసుకు వసందు పెట్టికొని ఎవ రేకాయను మఱచియుందురో యని యొకరి నొకరు కాచుకొని యుందురు. కాలము వృధగా గడచిపోవుటయే గాక మేధాశక్తిని వృద్ధిచేయు ఎత్తులే యుండవు. సాధారణపు ఆటలో నేకాయను ఎప్పు డేమివచ్చే చంపెదరో యని యొకరి నొకరు మనస్సున యోజించుచునే యుందురు. అందువలన మేధాశక్తి అంతకంతకు ప్రబలుచునే యుండును. దీనినిబట్టి "యుద్ధరంగ" మని కూడ చెప్ప నొప్పును. అమెరికా యూరోపు రాజ్యములవారు ఈ రెండవపద్ధతినే యుత్కృష్టమని స్థిరపఱచి నేఁటివఱకు తమతమ యూహలను వ్యాయామములనుగా (Problems) రచియించి యితరులెవరైనను చిక్కు విడఁదీయ (Solve) గలరో యని పత్రికలందు ప్రచురించుచున్నారు.

చదరంగ మనేకదేశములలో బుద్ధిమంతులు కాయలతో నున్న పలకను జూడకయే యాడెదరు. కాని ముగింపుకాలమున నెదుటి పార్టీకి మహాత్తును (అనఁగా నెదుటివారి రాజును పట్టుకొనుట) జేయుట మిక్కిలి యరుదు. ఎంతటి జ్ఞాపకశక్తియో యుండినఁగాని యట్టి దుర్లభమైన యెత్తు చిక్కఁదు. అష్టావధాన మొనర్చువారు ఈ యాట నొక యంశముగా నుంచి పలకచూడకయే యాట నడిపెదరు. ఇది యొక అద్భుతమగు జ్ఞాపకశక్తియే యగును. కొందఱు మిగుల కష్టతరమైన యశ్వగతిని (అఱువదినాలుగిండ్లను) చిత్రబంధములుగా నంకముల నేర్పఱచి పద్యముల నాకర్షింపఁ జేయుదురు. భరతఖండమునందు మధ్యదేశమునఁ దప్ప ఇతరప్రదేశములలో నీ యష్టావధాన శతావధాన పరిజ్ఞానమే లేదని తెలియుచున్నది.

అశ్వగతి యనఁగా చదరంగమునందు గుఱ్ఱపు మొహరాను ముప్పదిరెండిండ్లను గాని అఱువదినాలుగిండ్లను గాని చిత్రగతిగా బంధగతిగా సంఖ్యాచక్రరూపముగా నడుపుచు, పోయిన యింటికి తిరిగి పోనీయక ప్రారంభించినగదికే వచ్చులాగున నడుపుట. ఇట్టి చిత్రములు కొన్ని దేశములలో ననేకులయిన యూహాపరుల మనస్సుల నాకర్షించి యున్నవి.

గుఱ్ఱపునడక చిత్రము. ఇది నాలుగుగతులుగా విభజింపవచ్చును. మొదటిది చిత్రగతి. రెండవది పుష్పగుచ్ఛగతి. మూఁడవది జంతుబంధగతి. నాలుగవది సంఖ్యాచక్రబంధగతి. వీనిలో మొదటిదైన చిత్రగతియందు (అ) హాయిమును పైవిధముగా ౩౨-౬౪ యిండ్లలో నడుపుట (ఆ) ఒక యెత్తు గుఱ్ఱపు నడక రెండవ యెత్తు ఏనుగు నడక. ఇటులు మాఱి మాఱి ౩౨-౬౪ యిండ్లు తిరుగుట (ఇ) ఒక యెత్తు ఏనుఁగునడక. రెండవయెత్తు హాయికటి. ఇటులు మార్చి ౩౨-౬౪ యిండ్లు త్రిప్పుట. (ఈ) అశ్వద్వయసంచార మనఁగా రెండు గుఱ్ఱములను ఏకకాలమున వేర్వేరు గదులనుండి నడచి ఒక్కొక్కటి ౩౨ యిండ్లు తిరిగి ప్రారంభించినయింటికి చేరుట. (ఉ) అశ్వత్రయప్రచారము - మూఁడు గుఱ్ఱములను నేకకాలమున వేర్వేరు స్థలములనుండి నడుపుచు నొక్కొక్కదానిని ౨౦ యిండ్లు తిరిగినపిమ్మట (నాలుగు గదులు మధ్యగాని మూలలు గాని విడిచిపోవును) తిరిగి మొదలిడిన గదులకే చేర్చుట. (ఊ) చతురశ్వప్రచార మనఁగా- నాలుగుగుఱ్ఱముల నేకకాలమున భిన్నభిన్నస్థలములనుండి ప్రారంభించి యొక్కొక్క

దానిని ౧౬ యిండ్లు నడిపి పైని చెప్పిన రీతిని దానిదాని యింటి కది వచ్చుట. ఈగతులలో నన్నింటికిని నశ్వము తెల్లకయింటికి తిరిగి వెళ్లకపోవుట చిత్రగతిగా నేర్పఱుపబడియెను.

రెండవదియైన పుష్పగుచ్ఛగతి: చదరంగమున నుండు ౩౨ కాయలను పుష్పాకృతిలో నొక బంధముగా నేర్పఱచి వాటిలో దేని నైనను నొకదానిని చేతc దీసికొని యక్కడనుండి తక్కినకాయల నన్నింటిని ఒకొక్కయెత్తున కొక్కొక్క కాయను గొట్టుట. ఆఖరి యెత్తు ప్రారంభించినగదికే చేరును.

మూడవదియైన జంతుబంధగతి:— చదరంగపు పలకపైని అశ్వ-గజ-సింహ-మయూర-ఉష్ట్ర-వృషభ-సర్పాది జీవముల యాకారములను వ్రాసి వీటి యవయవములు గల యిండ్లలోమాత్ర మశ్వమును నడిపించి తిరిగి ప్రారంభించిన గదికే చేర్చుట.

నాల్గవదియైన సంఖ్యాచక్రబంధము:— హయమును నడిపించుటలో వరుసలు సంఖ్యలు వేయుచు వచ్చిన గుఱ్ఱపునడక పూర్తి యైనప్పుడు చక్రము సమసంఖ్యగా నుండుట. ఇందు మఱొక విశేష మున్నది. అశ్వ మఱువదినాల్గిండ్లు దిరిగి రాcగా ప్రారంభించినగదినుండి ఒకటి రెండు మూcడని క్రమమున సంఖ్యలు వేయcగా, నిలువు అడ్డపు బారలు కూడ సమసంఖ్య వచ్చునటులు నడుపుట. ఇది కేవలము కష్టతరమైన దనియును మిక్కిలి యుత్కృష్టమైన దనియును, బుద్ధిశాలురగు రసికులు మెచ్చుకొనుచున్నారు.

మారిసుగారు వ్రాసిన దానికంటెను మించిన సంగతు లెవరును వ్రాయcజాలరు. వారు వ్రాసిన చదరంగము చరిత్రలో చెప్పcబడిన రెండింటిగుఱ్ఱపు సామాన్యప్రచారమే వినోదకరమైన దని ప్రకటించి యనేకదేశములలోని బుద్ధిమంతులు ప్రచారమునం దుంచినట్లు వ్రాసియున్నారు. నేను చతుర్విధచిత్రప్రచారములను వినోదకరములుగాc గల్పించి గ్రంథరూపముగా నిదివఱకు ఉరుదూభాషలో వ్రాసి "చదరంగవినోదము" అని పేరిడి నైజాముగారి కంకిత మొనర్చితిని. కొలcది కాలములోనే ఆగ్రంథమును విశేషవిషయములతోc దెలుcగున కూడ ముద్రించి ఆంధ్రులకు సమర్పించుకొన నున్నాను.

# గౌతమీపుష్కరము

## శ్రీమతి బుర్రా సూరమాంబ గారు

కంటిని పావనంబయిన గౌతమి కన్నులపర్వ మంచు, నే
వింటిని తన్మహత్త్వమును వీనులవిందుగ, పుష్కరంబునం
దుంటిని రాణ్మహేంద్రమున, నూర్జితపాపవినాశనమ్ముకై
మంటిని తజ్జలంబులను, మంగళస్నానము లాడ గోరికన్.

క. పన్నెండు నదులలో పల
నెన్నిక పుష్కరణిc గలదు తెలుగుదు రైనన్
విన్నారా? కన్నారా?
యున్నదు నీ శోభ రాణ్మహేంద్రమునన్.

సీ. యమర నాసేతుహిమాచలమ్ముల నున్న
యూళ్లవాళ్ల ప్రజ లెల్ల దిగిరి
ఒక్కరా! యిద్దరా!! లెక్కకు మిక్కిలై
క్రిక్కిరిసిరి యిండ్ల మిక్కుటముగ
వందల కెక్కుడై సందుగొందుల వేలు
లక్షలుమించి కోట్లయిరి జనులు
కాలు వీథినిc బెట్ట నేల యీనినయట్లు
యసుగిడ నే వీధి నడమ లేదు.
ఎంతపుణ్యుల మైతిమో! యీ యసుఖిద
గౌతమిc గ్రుంకు లిడ. లోక మాత గాద!
తల్లి భక్తజనుల కల్పవల్లి యనెడి
స్తుతివివాదంబు మిన్నంట మతిc జెలంగ.

సీ. పుష్పగిరికటిన్ బోయి మున్గెదమన్న
రేవు గన్గొనుటకే తావు లేదు.
రత్నగిరి స్రుంకులాడి వత్త మటన్న
తీర్థవిధుల రేవు తెలుపి లేదు
తనర మార్కండేయమునకేగ జను లెల్ల
నిసుకజల్లినయట్లు ముసరి రచట.
కోటిలింగముల కేగి క్రుంకివత్త మటన్న
జనబృందమున కందె యనికిపట్టు.
ఒండొరులc ద్రోసిపోవc జేయూత లిడుచు
జారుబురదను జారెడి వారి గనుచు
వెనుక జూచుచు తమవారి వెదకికొనుచు
స్నాన మొనరించి వచ్చెడి జనులc గనుచు.

సీ. మూసివాయనముల ముత్తైదువలచేతి
కందించు చోకచోటc గుందువారు
పసుపుకుంకుమ రాసి వస్త్రంబులc బోసి
అట్టె యొక్కెడ పంచిపెట్టువారు
పైడికానుకలు విప్రవరుల దోసిట యథా
విధిగాను నొకచోట నిడుచువారు
పంచులc దగcగోని యించుక వెండి కా
సొమ్ము లొక్కెడ వదcజిమ్మువారు
అర్థిభకముల నడుమ విద్వత్కలప్రమూట
లాగిన గట్టుక పిడికెడే నిడెడువారు
కడగి చక్కనిగోవుల నిడెడువారు
ప్రోవులై చేరి కనవా! యీ పుష్కరమున.

గీ. చీరలా! రైకలా! గంగతీర మందు
వెండిబంగారు గోవులా! వేలకొలcది
ఎందుగనc జేయిcజాచ, వే యిడుటె గాని,
లేమి యనుమాట యచ్చోట లేదు. లేదు.

# స్వయంవరవివాహములు

**కృ. వేం. లక్ష్మమ్మ గారు**

ఇప్పుడు దురవస్థలలో నున్న మనదేశము ఉన్నతస్థితికి రావలె నని దేశీయులు తలంచినయెడల చేయవలసిన సంస్కరణములు — ఉన్నత స్త్రీవిద్య ఐకమత్యము స్వయంవరవివాహములు అనునవి. స్త్రీవిద్యను గురించి కొంచెము విచారింతము. స్త్రీలకు ఉన్నత విద్య అవసరమా? అనవసరమా? అవసరమైన నెట్లుండవలెను. మనలో కొందరు నవనాగరకులు స్త్రీలకు విద్య అనావశ్యక మనియు స్త్రీలు విద్య నేర్చిన యెడల పురుషులను తిరస్కరించెద రనియు ననేకము లగు వెఱ్ఱి అభిప్రాయములు కలిగియున్నారు. కాని వారి అభిప్రాయములు సరియైనవి కావు. విద్యా దదాతి వినయం అను నార్యోక్తిని బట్టి చూడ విద్యవలన పురుషులకు గాని స్త్రీలకు గాని వినయసౌశీల్యాది సద్గుణము లలవడు నేగాని వేఱుగాదు. ప్రస్తుతము విద్య నేర్చుకొని గర్వితలై సంచరించు స్త్రీలు కలరందురేమో. ఆ లోపములు విద్యవలన కలిగినవి కావు. అవి స్వభావజన్య దుర్గుణములే కాని వేరు కావు. గార్గి, మైత్రేయి మొదలగు పౌరాణిక స్త్రీలు ఉన్నత విద్య బడసి లోకోత్తరలయి నేటికిని జగద్విఖ్యాతకీర్తిని వహించినారు. రాణీసంయుక్త వీరాబాయి మొదలగు ఇతిహాసకాలపు స్త్రీలు వినయవివేకాది సద్గుణములు కలిగి తమ భర్తలకు యుద్ధములందు సహాయ మొసర్చి లోకమునందు గల స్త్రీబృందమున కంతకు వన్నె తెచ్చి యుండుట మనము వినుచున్నారము గదా. ఇంకను స్త్రీల యొక్క చరిత్రములు తెలిసికొనదలచిన యెడల శ్రీమతి భండారు అచ్చమాంబగారు రచించిన అబలాసచ్చరిత్రరత్నమాల యను గ్రంథము చదివినచో నెల్లరకును నారియొక్క సద్గుణములు గోచరింపక యుండవు. ఈ గ్రంథముల చదివియైనను దురవస్థ మందభాగ్యములలో నున్న స్త్రీజాతి నంతయు నుద్ధరింతు రని నమ్ము జాలను. ఐకమత్యము ఎప్పుడు కావలసివచ్చును? భిన్నత్వమునందు. ఎట్లనగా — ఒక కార్యమును మొదలిడి చేయుచున్నప్పుడు దాని విషయమై ఒకరి కొకరు భిన్నాభిప్రాయులైన పక్షమున ఆకార్యము కొనసాగదు. అట్లు భిన్నాభిప్రాయులు గాక ఏకీభవించినయెడల ఏవిఘ్నములు లేక కార్యము కొనసాగును. కొంచెము బుద్ధిమంతులమై దైవనిర్మిత మగు సృష్టిని విచారించిన యెడల నంతయును భిన్నముగానే కనుపించును. అట్టి భిన్న సృష్టియందే ఏకత్వమును విడదీయుట ప్రతి మనుజుడును నేర్చుకొనవలసియున్నది. మాతృభూమి యగు హిందూదేశ మింత దుస్థితిని పొందుటకు ముఖ్య కారణము మన ఐకమత్య హీనతయే కదా. భారతీయులు తాము కలహించి అన్యదేశీయుల సహాయ మపేక్షించి ఒకరినొకరు నాశన మొనర్చుకొనినట్లు చరిత్రలయందు కలదు. మనలో మనము భారతమాతకు కన్న బిడ్డలము గదా యను సంశయము జ్ఞప్తియందుంచుకొని తల్లియొక్క దీనస్థితిని దలచి మత వైషమ్య మను పిశాచమునకు లోనుగాక స్వరాజ్యాభిలాషులమై ప్రయత్నించినను లోనర్చిన [illegible]కల లాభము కలుగకపోదు. 'కష్టేఫలీ' యను దేశోక్తి వ్యర్థ కాదు. ప్రస్తుతము హిందూదేశమునకు గల లోపమేమనగా - వర్తక విహీనత. వర్తక మన నెట్లు చేయవలెనో దేశీయులకు తెలియదు. సేవక వృత్తి చేయుటలో ఈ దేశమున కితరదేశములు సాటి లేవు. దానిలో నెన్నికష్టములు కలిగినను సహించి బహునమ్రతతో నాచరింప గలరు. సృష్టియందున్న ప్రతిజీవునకు స్వతంత్రేచ్ఛ కలదు. కాని దాని నెట్లుపయోగపర్చవలెనో తెలిసికొనజాలకున్నారు. ప్రతిజీవియును స్వతంత్రము నెందుకు కోరెద రందురేమో? సంతోషము సౌఖ్యము మొదలగు సర్వసుఖములు దానియందే యిమిడియున్నవి. ఒక మనుజునకు సర్వసంపదలు నొసగి ఒక గదియందు వాని నుంచి తాళము వైచిన వానికవి సౌఖ్యదాయకములుగా నుండునా? యుండ నేరవు. చిలుకను తీసికొని వచ్చి పంజరంబున బంధించి దానికి వలయు పదార్థము లొసగినప్పటికి అది సందుదొరకిన తప్పించుకొను నుపాయము నే వెదకుచుండును. ఏల? తోడి వానితో కలసి స్వేచ్ఛగా తిరుగునప్పు డున్న సౌఖ్యము యిప్పు డుండుకపోవుటచేతనే కదా! కనుకనే మన పెద్దలు అటువంటి స్వేచ్ఛాబాధక కార్యములు చేయుట దోష మనియు నట్టి వొనరించిన మనకు నటువంటి నిరోధమే కలుగు ననియు నొక్కి వక్కాణించుచున్నారు. మనలో నిమిడియున్నట్టి స్వతంత్రేచ్ఛను వదలి పారతంత్ర్యమునకు చేతులు చాచుకొని కూర్చునియున్నాము. ఈ స్వతంత్రము మాట నటు లుండనిండు. వెనుకటి వర్తకసరళి ననుసరింతము. ప్రస్తుతము మనవారు చేయు వ్యాపారము లెలాగున్న దనగా పరదేశీయు లనేకము లగు వస్తువులను యంత్రసహాయమున తయారొనర్చి మనదేశమునకు పంపగా వానిని కొంతవెలకు మనవారు స్వీకరించి దానిపై తమ లాభము నిమిత్తమై మఱికొంత ధరను హెచ్చుచేసి మనదేశమున విక్రయించెదరు. ఆ వస్తువులను దేశీయులు కొనుటకు చాల కష్టముగా నుండుచున్నది. ఆ వస్తువులను దేశీయులే తయారుచేసి వారికి వారు విక్రయించు ధరలకే యనయు మనదేశమున విక్రయించిన దేశీయులకు కొన్ని కష్టము లుండకపోవును కదా. వస్త్రములు మొదలగు నవి యంత్రసహాయమున తయారుచేయుట గ్లాసులు మొదలగు నుపయోగకరము లగు సామానులు చేయుట మన దేశీయులకు క్రొత్తగా తెలియుచున్నది. వీని విషయమై ధనవంతు లగు దేశీయులు బీద బాలురను పరదేశములకు బంపి, అక్కడనున్న క్రొత్తవిద్యను నేర్పిం

చుటయగా కొంత ద్రవ్యమును వెచ్చింపవలెను. దీనివ్యయమును ఒక్కరే భరింప నక్కరలేదు. దేశీయులవద్ద చందా రూపముగా కొంత ధనమును సంపాదింపవచ్చును. బరిడరులచే వెలకొల్పబడిన ఆంధ్రజాతీయ కళాశాలకు మనదేశమున నెంత ధనము దొరికినది కాదు. అయితే దానివలెనే పెద్దలు కొందఱు దీనివిషయమై కూడ పాటుపడిన కొనసాగకపోదు. దొరతనమువారికి యుద్ధసమయములయందు సహాయము నొనర్చిన దేశీయులు స్వవిషయమై సహాయము నొనర్పకపోరని నమ్ముచున్నదానను. మనదేశమున గల యిటువంటి లోటుపాటులను సరిచేసుకొనక వాగ్రూపమున "దేశీయులకు ఐకమత్యముండవలెను " దేశము నభివృద్ధిలోనికి తీసుకొని రావలెను" అనిన దేశమునకు నుంతయును లాభము లేదు. కొన్ని వేళల స్వంతసొమ్ము ఖర్చుపెట్టవలసి వచ్చినను వెనుదీయకూడదు. ధనవంతులు స్వలాభపరాయణులై యుపేక్షచేసిన యెడల కొద్దివారేమిచేయగలరు. దేశాభివృద్ధి కొరకు మహాత్మాగాంధి మొదలగు మహానుభావు లెన్నెన్ని కష్టముల నొందుచున్నదియుఁ గన్నులార చూచుచునే యున్నాము కదా. అటువంటి మహాత్ముల జీవితముల స్మరించుచు దేశీయులు మతముల యెడల భిన్నమనస్కులుగాక స్వదేశాభివృద్ధికొఱకు ఐకమత్యము నవలంబించునట్లు చేయుటకు దయామయుండగు సర్వేశ్వరునకు అనేక వందనముల నొనర్చుచున్నదానను.

స్వయంవరవివాహములు:—ఇప్పుడు మనలో బాలికలకు 8, 9వ వీట వివాహములు జరుగుచున్నవి. వెంటనే ఒకటిరెండు సంవత్సరములలో నత్తవారింట్లకు వెళ్లుట తటస్థించును. ఈలోపున బాలికకు 4వ క్లాసుచదువు వ్యవస్థకూడ నుండదు. వివాహమైన తరువాత నొకసంవత్సరమైనను పిల్లలను బడికి పంపరు. ఈలోపున వారికి నేర్పుతరగతులలోని విద్య లోకజ్ఞానమైనను వృద్ధిచేయజాలదు. నీతిని బోధించు భాగవత భారత రామాయణాది పురాణేతిహాసములే నేర్పియుండరు. ఇఁక చరిత్రజ్ఞానమో అంతకంటె శూన్యము. ఇటువంటి చదువువలన సంపాదించిన జ్ఞానముతో బాలికలు అత్తవారియిండ్ల గృహనిర్వాహకత్వ మెట్లు నిర్వర్తింపగలరో ఊహింపవలయును. పోనీ విద్యావ్యాసంగ మటు లుండనిండు. ప్రాపంచికమునకు ముఖ్యాధార మగు శారీరదార్ఢ్యమా అంతకన్న సున్నగ నుండును. శరీరదార్ఢ్య మెట్లు వచ్చును? 12, 13 సంవత్సరములు వచ్చునప్పటికి హిందూబాలికలు సంతానవతు లగుదురు. అప్పటికి వైద్యశాస్త్రప్రకారము వారయవములు పుష్టియైనను పొందియుండవు. ఇట్టి స్థితియందు సంతానవతులైన వారలకు శరీరారోగ్యము లెట్లు కలుగును? వారి సంతానమున్ననో అంతకంటెను బలహీనముగ నుండును. కావున మన యాడుపిల్లలకు ఆరోగ్యశాస్త్రము కుట్టుట శాస్త్రములను దేశాభిమాన పురస్కృతము లగు చారిత్రములను దైవభక్తి నిర్మితము లగు పురాణములను ముఖ్యముగా నేర్పవలెను. జిజాబాయి తన కొమారునకు స్తన్యపాలతోఁ గూడ దేశాభిమానమును బోధించుట వలననే గదా. ప్రాపంచికయాత్రకు ముఖ్యాధార మగు శరీరమునకు నతిదౌర్బల్యత నొందించు అతిబాల్యవివాహముల మాన్పలేక మొందు దేశమును బాగుచేయుదమని తలంచుట ఎంతయు వింతగ నున్నది. ఇంటగెలచి రచ్చగెలువవలె గదా! పూర్వాచారముల ప్రకారము స్త్రీలకు దాస్యవృత్తి గాక తదితరము లగు స్వాతంత్ర్యములు లేవని పురుషులు తలఁచుచున్నారే, గాని అది ఎంతమాత్రము నిజము కానేరదు. మనపూర్వులు ఏర్పరచిన కర్మలలోనే స్త్రీకి పురుషునితో సమానస్వాతంత్ర్యమున్నట్లు వెల్లడియగుచున్నది. పురుషుడు తనచేతిలోని ఒకవస్తువును బ్రాహ్మణునకు దాన మివ్వదలచిన స్త్రీ నీళ్లు వదలిన గాని అది చెందనేరదు. వివాహాదికర్మలందు స్త్రీలు లేని పురుషులు కంచుకముల దగ్గరనుంచుకొని వివాహాది కర్మ లొనర్చుట మనము చూచుచున్నారము. మనకు తెలియక పోయినప్పటికి పూర్వాచారానుసారము మన మొనర్చు కర్మములే స్త్రీలకు సంపూర్ణస్వాతంత్ర్య మున్నదని తెలియబరచుచున్నవి. స్త్రీలను యింత హీనస్థితికి తెచ్చినందువలన పురుషులు పొందు లాభము లేమి సరికదా అనేకము లగు కష్టములు సయితము కలుగుచున్నవి. కొందఱు తలిదండ్రులు జ్ఞానము రాని తమ పిల్లలను ధనమున కాశించి వృద్ధులకు కట్టిపెట్టుచున్నారు. దానివలన నా పిల్లయొక్క జీవిత మంతయు విచారసాగరమున మునుగుచున్నది. మరికొందఱు కట్నముల కాశించి మగపిల్లలకు అనాకారలగు పిల్లలను పెండ్లిచేయగా "వారికి జ్ఞానమువచ్చి నాకు చక్కని భార్య కావలెను. ధనమున కాశించి చేసినారు గనుక మీరే సంరక్షించండి నాకు అక్కఱ లేదు" అనువారలను చూచుచున్నాము. ఇంతకంటె బుద్ధిమంతులు స్పష్టముగా అక్కరలేదని యనక వారితో నిష్టముగా నుండక వారివారి యిష్టప్రకార ముండువారిని చూచుచున్నాము. పూర్వాచారముల ననుష్ఠించు బుద్ధిమంతులు చేయవలసిన కార్యము లేనా యివి? అగ్నిసాక్షిగఁ బెండ్లాడిన భార్యను త్యజించుటయే కాబోలు పూర్వాచారానుష్ఠానము? జ్ఞానమైనను రాకముందు పెండ్లిండ్లు చేసి; యిటువంటి దుర్గతుల పాలొనర్చుట తలిదండ్రుల లోపముగాక మరి ఏ మున్నది? చేయునది లేదు. అనుభవించునది వీరు. ఏమి న్యాయము! ఈ అతిబాల్యవివాహములవలన కలుగు బాధ కష్టముల లెక్కలేదు. (1) విద్యాహీనత (2) దేహదౌర్బల్యత (3) భార్యాభర్తల అననుకూల్యము. బాధలు లెక్కలేనివి? ఒక్కటి [illegible]. దేశాభిమాను లెల్లరు అనేక కష్టముల పాలుకాల మగు ఈ అతిబాల్యవివాహముల మాపుమాని తమ యాడుపిల్లలకు ఉన్నతవిద్యను గరపి స్త్రీలోకము నుద్ధరించుదురు గాక యని నమ్మి యింతటితో విరమించుచున్నదానను.

# విజయనగరసామ్రాజ్యము - విద్యారణ్యులు

సింగంపల్లి వేంకటాద్రి గారు

తుంగభద్రానది యుత్తరపుటొడ్డున, 'ఆనెగొంది' యను సుప్రసిద్ధపట్టణ మొకటి గలదు. దానిని క్రీ. శ. 12-వ శతాబ్ది ప్రారంభమున చాళుక్యుఁ డను రాజు పాలించియుండెను. అతనికి ముగ్గురు పుత్రు లుండిరి. ప్రథముఁడు నూతనరాజ్య మొకటి స్థాపించుటచే, ద్వితీయుఁ డగు విజయధ్వజుఁడు క్రీ. శ. 1117 సం. సింహాసన మధిష్టించెను. అతఁడు ముప్పదితొమ్మిది సంవత్సరములు ప్రజానురంజకముగఁ బాలించె. ఆ కాలమున మహమ్మదీయులు తుంగభద్రానదికి యుత్తరమున నుండెడు దేశముల నేలుచుండిరి. వారివలన, ఆనెగొందివారికి తరచు ముప్పు కలుగుచుండెను. విజయధ్వజుఁడు దూరదృష్టి గలవాఁడగుటచే, తుంగభద్రకు దక్షిణపుటొడ్డున ప్రధాననగర ముండిన మహమ్మదీయులు మాటిమాటికి నదినిదాటి రాజాల రని యెంచి క్రీ. శ. 1150 సంవత్సరం నూతన పట్టణ మొకటి కట్టించెను. విజయధ్వజనిర్మిత మగు నీ నగరమునకే 'విజయనగర' మని పేరిడబడెను. విజయధ్వజుని యనంతరము, అనవేమున, నరసింహరాయలు, రామదేవరాయలు, ప్రతాపరాయలు, జంబుకేశ్వరరాయలు, క్రమముగ పరిపాలించిరి. పాపము జంబుకేశ్వరరాయలకు సంతతి లేదయ్యె. వంశ మంతరించుట సంభవించె. రాజు లేని కారణమున రాజ్య మరాజక మయ్యె. ప్రజలు చోరాగ్ని పీడితు లయిరి. పట్టణమునఁ గల సుందర మందిరములు శిథిలము గావింపబడెను. కోటలు బీటలువారెను. ఇట్లుండ కొంత కాలమునకు తుంగభద్రానదీతీరంబున 'హంపి' యను దివ్యక్షేత్రసమీపంబున, భువనేశ్వరీదేవాలయముచెంత, 'మాధవభట్టు' అను పుణ్యపురుషుఁడు నిష్ఠాగరిష్ఠుఁడై తపం బొనర్చుచుండె. కారణాంతరములచే, ఆయన కొంతకాలమునకు జగద్విఖ్యాత మగు శృంగేరిపీఠ మలంకరింప తటస్థించెను. ఆయన సన్న్యసించుటం జేసి 'విద్యారణ్యులను' నామధేయము వహించిరి. ఆయనకు విజయనగరప్రాంతమునం దెక్కుడు పలుకుబడిగలదు. విజయనగర మరాజకముగ నుండుటఁ జూచి, తన ప్రియశిష్యుఁ డగు 'హుక్క' యను నాతని సామ్రాజ్యాభిషిక్తుని గా జేసెను. హుక్క, బుక్క, యను వీ రిద్ద రన్నదమ్ములు. వీరియువురును ఓరుగంటి ప్రతాపరుద్రుల కొలువుకూటమునం దుండిరి. శిష్యవత్సలుఁ డగు విద్యారణ్యులు హుక్క యను నాతని రాజుగాఁ జేసెను. 'హుక్క' తనకొప్పటిపేరును మార్చుకొని 'హరిహరరాయలు' అని పేరుబెట్టుకొనెను. రాయలు - గురువును రాజ్యప్రదాతయు నగు విద్యారణ్యస్వాముల మాటకు జవదాటెడువాఁడు గాఁడు. గురువుగారి యనుగ్రహముచేత నాతఁడు బహురాజ్యముల పరిపాలింపఁగల్గె. హరిహరరాయలు సింహాసన మధిష్ఠించిన వెంటనే, విద్యారణ్యుల ప్రోత్సాహమున నగరపునర్నిర్మాణమునకు బూనుకొనెను. చిత్రవిచిత్రము లగు దివ్యసౌధములు, బలిష్ఠము లగు కోటలు, ఉద్యానవనములు, చతురంగబలములు, గొప్పగొప్ప దేవాలయములు, విశాలము లగు రాజవీధులు, గజతురగాలయములు, వైద్యవిద్యాలయములు, ధర్మసత్రములు మొదలగునవి బాహాటముగ నిర్మింపబడెను. నగరము నూటయేబది చదరపుమైళ్లుండెనట. ఆ నగరము విద్యారణ్యస్వాముల ప్రోత్సాహముచే పునర్నిర్మిత మగుటం జేసి 'విద్యానగర' మని పిలువబడుచుండెను. హుక్కరాయల పిమ్మట బుక్కరాయలు, ద్వితీయ హరిహరరాయలు, ప్రతాపదేవరాయలు, విజయరాయలు మొదలగువా రెందఱో పరిపాలించియుండిరి. ఈ విజయనగరసామ్రాజ్యమునే మన శ్రీకృష్ణదేవరాయలు క్రీ. శ. 1490 మొ 1508 వఱకు పాలించియుండెను. విద్యారణ్యులు, పరాశరస్మృతి వ్యాఖ్యానమునందు, తాను భరద్వాజగోత్రుఁడ ననియు, మాయన శ్రీమతీదేవి తనూభవుండ ననియు చెప్పియుండిరి. వీరికి, భోగనాదులు, సాయన, యను సోదరులుండిరి. భోగనాదులు సన్న్యసించిరి. సాయన అన్నగారిచే ప్రతిష్ఠింపబడిన రాజ్యముననే మంత్రిగా నుండెను. విద్యారణ్యులు తనచే స్థాపితమైన రాజ్యము, చిందర వందర గాకుండుటకును, పరిపాలనా సౌకర్యములకును, వేర్వేఱు భాగములుగ నేర్పరచి, రాజకుటుంబములకు చెందినవారిని రాజప్రతినిధులుగను, రాష్ట్రపాలకులుగను, సేనాధిపతులుగను, మంత్రులగను నేర్పాటుజేసెను. విద్యారణ్యులు, హరిహరరాయలకును, బుక్కరాయలకును, ద్వితీయ హరిహరరాయలకును కుడిభుజమువలె నుండి, ఏఁబది సం. లతినిపుణతతో రాజ్యతంత్రముల నడుపుచు వచ్చెను. సామ్రాజ్యమున, రాయలుల ప్రభకంటె, స్వాముల ప్రతిభయే యెక్కుడుగ వెలుగుచుండెడిది. ఆయన కాలముననే విజయనగర సామ్రాజ్యము దక్షిణ హిందూదేశమం దంతటను, దక్కనులో దక్షిణభాగమున విశేషముగను, తూర్పు తీరమందంతటను వ్యాపింపగలిగెను. ఆ కాలమున, హిందువులకును, మహమ్మదీయులకును మతావేశములవలన బద్ధవైర ముండెడిది. వారొండొరుల నాశనముచేయ జూచుచుండిరి. విద్యారణ్యుల యనుగ్రహమునను, రాజ్యతంత్రముల వలనను మహమ్మదీయులు సామ్రాజ్యమునం దడుగిడుటకు దుస్తరముగ నుండెడిది. విప్రకులావతంస మగు విద్యారణ్యుల ప్రాభవ మెట్టిదో!

పూర్వపు ప్రభువులకు ప్రస్తుత ప్రభువులవలె విప్రద్వేష ముండెడిది గాదు. విప్రులయందు గురుభావ ముండెడిది. విప్రుల యాజ్ఞలను శిరసావహించెడివారు. విప్రులే రాజ్యతంత్రముల నడపుచుండెడివారు. మన విద్యారణ్యులు ప్రజ్ఞావిశేషములు గలవాడనుటకు సందియము లేదు. ఆయనకు 'కర్ణాటక సింహాసనస్థాపనాచార్య' యను బిరుదు గలదు. విద్యారణ్యులు ప్రభుకార్యములందు పాల్గొనుటచే నాఁటి ప్రభువులకు కులగురువులుగ సచివులయు నుండెడివారు. ......విద్యారణ్యులు రాజనీతిధురంధరుఁ డేగాక నిరుపమాన పాండిత్య ప్రభావసంపన్నుఁ డని యెఱుంగవలయును. ఆయన సన్న్యసించుటకు పూర్వము (1) పరాశరస్మృతి వ్యాఖ్యానము. (2) మనుస్మృతి వ్యాఖ్యానము (3) వేదభాష్యములు, (4) జైమినీయ న్యాయమాలా విస్తారము (5) కాలమాధవీయము, (6) వ్యవహారమాధవీయము, (7) శంకరవిజయము, (8) సర్వదర్శనసంగ్రహము, మొదలగు సద్గ్రంథము లనేకములను-సన్న్యసించిన పిమ్మట (1) వేదాంతపంచదశి, (2) వివర్ణ

యారాధ్యాభిధాన విరచితం బగు సరసహృదయానురంజనమునందు ప్రథమాశ్వాసము.

వేమనారాధ్య చరిత్రములో

సీ. పదపదార్థ నిబంధ బంధురంబుగ ధరా
 తల మెల్ల నెఱుఁగ శంతనుచరిత్ర
సరస శృంగారానుషంగముల్ రవణిఁ జూ
 పఁగ నహల్యావధూ పరిణయంబు
ధీమజ్జన స్తవ్య ధీమజ్జనోన్మేష
 కరముగా నలరు ఘూర్జరచరిత్ర
లసదలంకార లాలస వికంకటముగాఁ
 బరగు నింద్రాత్మజా పరిణయంబు
గీ. శతక పూజా స్తవంబు లసంఖ్యసంఖ్య
మీఱ నీవు ప్రసంగించు సారకావ్య
రచన మాకెల్ల సమ్ముదార్ద్రతఁ బొసంగె
సరసరుచిసాంద్ర సంగమేశ్వర కవీంద్ర!

అని ఈ విధముగ నభిధానాంతరమును వ్రాసికొని యున్నను ప్రాయికముగా దేవీభాగవతాది మహాగ్రంథములయం దీపాపరాయారాధ్యాభిధానమునే చెప్పుకొని యుండుటను బట్టి పాపయారాధ్యు లనియే ఉదాహరించితిని. వీరేశలింగకవిగా రీకవిని గుఱించి యించుక వ్రాసి యుండి రని యుదాహరించితిని. కాని వారికి కవులచరిత్ర వ్రాయు నాఁటి కీకవి కులగోత్రములైన సరిగా తెలియవని చెప్పుటకు సాహసింపవలసి వచ్చినది. ఇదియుంగాక, మఱికొన్ని చరిత్రములుకూడ వీరేశలింగముగా రిట్లు వ్రాసియుండిరి. వారి సాహసప్రవ్రాత యిం కొకటి కలదు. "ఈకవి కవిత్వము ప్రౌఢమైనదియే. కాని వ్యాకరణదుష్టము లిందనేకములు కానంబడుచున్నవి" అని వ్రాసియుండిరి. కాని పంతులుగా రెంచినటుల ఈకవి కవిజన సామాన్యుఁడు గాక సకలశాస్త్ర పారంగతుఁడై సంస్కృతాంధ్రములయం దనేక ప్రబంధములను రచియించి కవిత్వమునం దభినవ కాళిదాసు అను సన్వర్థబిరుదము వడసినవాఁడు. ఈ కవి విరచిత గ్రంథముల నిట నుదాహరించుచున్నాను. ౧ ఏకాదశీమాహాత్మ్యము (చంపువు) ఇది వేంకటాద్రి నాయని కంకితము. ౨ కల్యాణచంపువు. ౩ వేదాంతసార సంగ్రహము. ఈమూఁడును సంస్కృతమునందు రచియింపఁబడినవి. ఈగ్రంథ త్రితయ మతిప్రౌఢమై విద్వత్కవి మనోరంజకమై కవిపాండిత్య ప్రకర్షమును దెలుపుచున్నది.

ఇఁక నాంధ్ర ప్రబంధములు. ౧ సరసహృదయానురంజనము ౨ శ్రీమతీపరిణయ మను నామాంతరము గల సర్వమధురము. ౩ దేవీభాగవతము. ౪ వేమనారాధ్యచారిత్రము. ౫ అహల్యాసంక్రందన విలాసము. ౬ శంతనుచరిత్ర. ౭ ఘూర్జరచరిత్రము. ౮ ఇంద్రాత్మజా పరిణయము మున్నగునవి. దీనిలో సర్వమధురము మూఁడాశ్వాసముల యచ్చతెలుఁగు కావ్యము. మిగిలినవి మిశ్రభణితిని రచియింపఁబడినవి. మొత్తముమీఁద నీ కవి సంస్కృతమునందును మిశ్రభణితియందును అచ్చతెలుఁగునందును గ్రంథములను రచియించి తనకవిత్వమును త్రివిధగతిని బ్రకటింపఁజేసెను. శతకపూజాస్తవం బసంఖ్యసంఖ్య యని కవియె వాకొనియున్నాఁడు గాన నీకవి వ్రాఁతకు పరిమితియే గాన్పింపదు. వీనిలో ౧ శంతనుచరిత్ర ౨ ఘూర్జరచరిత్ర ౩ ఇంద్రాత్మజా పరిణయము. ఈ గ్రంథత్రితయ మెం దడఁగియుండెనో కన్నులఁ గను భాగ్యము కల్గినది కాదు. మఱియు నీకవి బహుళగ్రంథరచనా ధురంధరుఁ డగుటయే కాక సుమారొక నూఱుమంది విద్యార్థులకు విద్యాదాన మొసంగి తాను రచించిన కల్యాణచంపువును పఠనగ్రంథముగఁ జెప్పినటు లీయన శిష్యప్రశిష్యులవలన నీ కృష్ణా గుంటూరు మండలములం దెందును నభివ్యాప్తి కలిగియున్నది. ఈయన ప్రశిష్యు లొకకొందఱిప్పటికిని గలరు. వారివలన నీ మహాకవియొక్క ప్రతిభావిశేషము లాయాప్రాంతముల వినఁబడుచుండును. కాని వానికన్న కవివాక్యములే మనకు పరమప్రమాణములు. వేమనారాధ్య చారిత్రమునందు వంశావతారమున నిట్లున్నది:—

సీ. శాంతసౌజన్య వాత్సల్య దాక్షిణ్యాది
 గుణములు మూర్తి దైకొనె ననంగ
హరనేత్రదగ్ధ శంబరవైరి కరుఁ డౌచు
 ధరణిలోపల రూపుఁ దాల్చె ననఁగ
సురగురుత్వ మటుంచి నరగురుత్వము సేయ
 జగతి కేగిన బృహస్పతి యనంగ
తన పురాతన కవిత్వ స్థైర్య మొనగూర్పఁ
 దలఁచి పుట్టిన కాళిదా సనంగ
గీ. తగినవార లటంచు సద్ధరణిపతులు
సతము లొనర్చుచు పూజింప నవ్యవస్త్ర
హారముఖభూషణాదుల నందినాఁడ
రసన నను ముల్లు పాపయారాధ్యుఁ డండ్రు.
సీ. సరసశేఖర తర్క శాబ్దికాలంకార
 సాహిత్యసామ్రాజ్య చక్రవర్తి
సంస్కృతాంధ్రానేక సత్ప్రబంధనిబంధ
 బంధురకల్పన భరితయశుఁడ
దినకర్మయుత మహా త్రివిధలింగార్చనా
 యత్త చిత్తాబ్జైక నిత్యచరుఁడ
షట్స్థలజ్ఞానాను సంధాన కర లస
 త్పరమశివాద్వైత పండితుండ
గీ. వేమనారాధ్య వంశాబ్ధి సోముఁ డనుచు
జనులు వినుతింప నెగడితి జగములందు
విమల కౌండిన్యగోత్రపవిత్ర ముల్లు
పాపయారాధ్యనామ విభ్రాజితుండ.
మ. నను విద్వజ్జన జాల లాలిత వచోనైపుణ్య వష్టంభ గుం
ఫనధారాళకవిత్వతత్వ కలనా పారంపరీపారగుఁ
ఘనదైవజ్ఞ కళావిచక్షణమనోనాళీకుఁ జేరంగ ర
మ్మని కావించి వచించె నంచితవచో మాధుర్య మేపారఁగన్.
శా. శర పుంభావసరస్వతీ చతురరాడ్వాల్లభ్యసంభావనా
కరపాండిత్యజలాస్యశుద్ధ కవితాకల్పకకల్పీ కసం
శశికీ స్నిగ్ధ నిబంధబంధుర కథాంతారాంకిత గ్రంథర
త్న రతిస్త్యాహిని. పాపయార్యుఁడవు! ప్రత్యక్షగోభోక్తవు!

ఈపద్యములవలన పాపయారాధ్యుని గుణగణ మెల్లరకు దెలియుటయే కాక జ్యోతిశ్శాస్త్రపారంగతుఁ డనియు మహావైయ్యాకరణి యనియు పాపయారాధ్యుని వాక్యములనే వినుచున్నాము. వినుటయే గాక కవిత్వమునందలి ప్రయోగకౌశల్యము నీయన పాండిత్యవైభవమును జాటుచున్నది. ఇంక నీకవిశిఖామణినిం గూర్చి చెప్పవలయు ననిన ననేకము కలవు. గ్రంథవిస్తరభీతిచే నింతట విరమించి యొక్క విషయముతో నీచరిత్రమును ముగించుచున్నాను. పాపయారాధ్యుల

పరమభాగవతోత్తముఁడు. ఈయన భక్తియుక్తుఁడును వేదాంతపరుఁడై యున్నాఁడు. శ్రీమద్భాగవతము నాంధ్రీకరించినవారిలో నీయనయే ప్రథముఁడు. వేంకటాద్రిప్రభువు గతించినపిదప కొంతకాలమునకు తన వార్ధకదశయందు నొకయమావాస్యనాఁడు సంస్కృతభాగవతమును జదువుచుండఁగా నొక బాలుఁడు నానుకొని వినుచు, నాశుధారణి మఱియొకరుమారునకు నాంధ్రీకరణమును జెప్పి వ్రాయించి యారుమాసములలో సంపూర్తి నొనరించెను. ఈయనరచించిన భాగవతమునందెల్లయెడల భక్తిరసము వెల్లివిరిసి యుండును. పాపయారాధ్యులు తానొకనాఁడు చాముండేశ్వర్యాలయమునకుఁ బ్రదోషకాలమున దర్శనార్థమై పోవునప్పటికి నంతలి యర్చకుఁడు తలుపులుమూసి పోయియుండెను. ఆ సమయమందు భక్త్యావేశముతో—

"ముక్తిద్వారము తల్పుదీయఁగదె చాముండా! జగజ్జీవనీ"

యనెడు మకుటముతో నిరువదేడు పద్యము లాశుధారణిఁ జెప్పునప్పటి కా జగదీశ్వరికిఁ గరుణగల్గి తలుపులు తెరచె నని చెప్పుదురు. ఆ పద్యములలో నొకటిమాత్రము నిటఁ జూపుచున్నాను.

శా. ముక్తాపాండుర హాసచంద్రికలు కెమ్మోవిం గుబాళింప మా
దృక్తాపత్రయి విన్నవించి పతికింతోఁ బ్రేమఁబుట్టించి ప్రా
గుప్తాశీచరణాంగదారవ సముద్యోతాంగివై వచ్చి నీ
ముక్తిద్వారము తల్పుదీయఁగదె చాముండా! జగజ్జీవనీ!

పాపయారాధ్యుని గ్రంథములు ముద్రణాదిసాధన సంపత్తి లేక ప్రచ్ఛన్నములై యుండుటను బట్టి లోకమంతగా నీతని కవిత్వము నెఱిఁగియుండదు. కావున నీతని కవిత్వమును గుఱించి యించుక ముచ్చటించి విడిచెదను. పాపయారాధ్యులు కవిజనసామాన్యుఁడు గాక నిరుపమాన పాండితీవైభవోపేతుఁడు. ఈతని కవిత్వమును విమర్శించి చూచిన నీతనికి నాంధ్ర మనిన నొకలక్ష్యములో నుండినట్లు గాన్పింపదు. ఇంతమాత్రమున నీతని యాంధ్రకవిత్వమున కేమైని కొరత యుండెనా? కేవల మాంధ్రమందు గూడ నొక కావ్యమును రచియించెను. కావున నుభయభాషా కవిత్వవిశారదుఁడగు నిమ్మహాకవి కవిత్వ మనర్గళగంగాప్రవాహవలె నిరాఘాటమై లలిత మృదుపద భూయిష్ఠమై సర్వాలంకారాలంకృతమై చదువఁజదువఁ జవులుగొల్పుచు మనోహరమై యుండును. ఈతని కవిత్వమునుండి యుదాహరణార్థము దిఙ్మాత్రముగాఁ గొన్నిపద్యముల నిం దుదాహరించియే యున్నాను. ఆపద్యములను బట్టి యీతఁ డసమానవ్యాకరణ విద్వాంసుఁడని స్పష్టపడకమానదు.

# పంచముల విజ్ఞప్తి

గొల్లపల్లి సామ్యుల్ గారు

సంఘసంస్కర్తలే జనుల మా మమ్ముల
నాదరింపనిచోట నింక నేది దిక్కు?
పరమ భక్తులవలె జరుగువారెల్లరు
మముఁజూడకున్నను మార్గమేది?
వసుధ మహామహోపాధ్యాయులే మమ్ము
నిరసింప నింక వేఱు తెఱఁగదెద్ది?
మాచాకిరీలేక కొంచెమున్నగ్గని
వారె పీడగ మాకు దారియెద్ది?
గీ. కడుపునొందిన రొమ్ముపై గ్రుద్ద నగునె?
తరుణఫలములఁ దినిచెట్టు నఱుక నగునె?
తీసికొనిపాలు పొదుగు ఛేదింప నగునె?
ఏలనయ్యా! యిట్టిచేత - లిద్ధరిత్రి.

సీ. ఊరికి దవ్వుల నుంచిన మాత్రాన
బోయెనే? మీదు యసూయకొంత.
ముట్టరాదనిపట్టు కట్టిన మాత్రాన
సమసెనే? మీదు ద్వేషంబుకొంత
పెద్దకులంబని బిరుదాడినయంత
జనియెనే? మీదగు కినుక కొంత
అంటరాదని చాల - యార్భాట మొనరింప
ప్రందెనే? మీదు రౌ - ద్రంబుకొంత.
గీ. తగ్గనని మీర లొకవేళ దలచియున్న
హెచ్చదే? మాకు మీపైని యెన్నొరట్లు.
ద్వేషబుద్ధి ద్వేషంబునే పెంచుగాని
యైకమత్యంబు గూర్ప సహాయపడునె?

సీ. అంగళ్ల వస్తువు లమ్మి బ్రదుకుటకైన
నంటరాని తనంబె - యడ్డుదగులు
గొప్పవారలయొద్దఁ గొలువు సేయుటకైన
నంటరాని తనంబె యడ్డుదగులు
బంట్రౌతు పనిచేసి - బ్రతుకుద మనుకొన్న
నంటరాని తనంబె యడ్డుదగులు
గృహకృత్యము లొనర్చి మహిఁ బ్రతుకుద మన్న
నంటరాని తనంబె యడ్డుదగులు
ఇచ్చవచ్చిన చోటి - కేగుద మనుకొన్న
నంటరాని తనంబె - యడ్డుదగులు
గీ వసుధ నెల్లైన జీవనో - పాధి సేయ
నంటరాని తనంబె మా కడ్డుదగులు
ఎందుబోదుము? గతియేమి? యెవరు బ్రోతు?
రకట మాకర్మ మిటులయ్యె నవనియందు.

సీ. స్వపరి పాలనమునై సరిపోరుటల తోడ
వాదింపు జాతీయ నాయకులార!
ప్రజల హక్కులకునై ప్రభువుల సభలోన
వాదమాడెడు నతి వాదులార!
స్వేచ్ఛ నొసఁగు డంచు బ్రిటిషు వారల తోడ
వాదమాడెడు మిత వాదులార!
పై వారితోఁబాటు ప్రక్కతాళము వేసి
వాదులాడెడు ప్రజా ప్రముఖులార
గీ. దిగవిడిచి మమ్ము నిట్లు సం - దిగ్ధగతిని
హక్కులన్నియు మీరలే - యందువారె
లేమి చేయంగ మమ్ముల - నెంచినారు?
విశదముగ జెప్పరే మాకు - విబుధులార.

# కాకతీయ సామ్రాజ్యము

## శ్రీ శేషాద్రిరమణ కవులు

ఆంధ్ర వాఙ్మయాభివృద్ధికి ముఖ్యస్థానమును దేశోపకార ధుర్యులకు నిలయము నగు నాంధ్రసామ్రాజ్యపుఁ జరిత్రము క్రమముగ విస్మృతికి వచ్చుచున్నది. ఆంధ్రదేశీయుల పవిత్రక్షాత్రరక్తము ప్రవహించిన కాకతీయసామ్రాజ్య మాహాత్మ్యము చేతులార వ్రాసి కృతార్థులము కాఁదలంచి సంగ్రహముగ నివేదించుచున్నారము.

ఆంధ్రసామ్రాజ్య మని వ్యవహరింపఁబడిన పవిత్రక్షేత్రము నిజాము రాష్ట్రములోని హనుమకొండ ఒరుంగల్లులు ముఖ్యస్థానములుగఁ జాలకాలము సుప్రసిద్ధమై యుండెను. ఈసామ్రాజ్యమును గాకతీయులను త్రిలింగదేశవాసులు ధర్మబద్ధులై పాలించిరి. కాకతీయు లాంధ్రులు. శాసనములలో సూర్యవంశ్యు లనియుఁ జంద్రవంశ్యు లనియుఁ దదన్యు లనియు వ్యవహరింపఁబడుచు వచ్చిరి. శూద్రులని చరిత్రకారులు విశ్వసించుచున్నారు. ఈ వంశీయులకుఁ గాకతీయు లని పేరువచ్చుట కొక చిత్రకథఁ జెప్పుచున్నారు * కాకతి యను శక్త్యుగ్రహమున గుమ్మడితీఁగయం దొక బాలుఁడు జనించెనఁట. ఆబాలుని వంశము కాకతీయవంశ మని ప్రసిద్ధ మయ్యె నఁట, "కాకతి"యనునది జైనదేవత యనియు నీవంశీయులలోఁ బూర్వు లందఱు నాదేవత నారాధించువా రగుటచేఁ గాకతీయు లని వ్యవహరింపఁబడి రనియుఁ గొందఱు తెల్పుచున్నారు. కథాంశ మెటు లున్నను గాకతీయులలోఁ గొన్ని పురుషాంతరములవారు జైనులై తదాచారముల నాదరించి రనుట విశ్వసనీయాంశము. § ఇట్లు జైనమతావలంబు లైనవారిలో రుద్రదేవుని జనకుఁ డగు రెండవప్రోలరాజే కడపటివాఁ డని తెలియుచున్నది.

### మహామండలేశ్వర ప్రోలరాజు

ఇతఁడు శూరవర్యుఁడు. త్రిలింగదేశమున నాంధ్రసామ్రాజ్యము నెలకొల్పిన యశశ్శాలుఁ డీ మహాపురుషుఁడే. ప్రోలరాజనియుఁ బ్రోలిరా జనియు నితని వ్యవహరింతురు. ఈ ప్రోలరాజు జనకుఁ డగు త్రిభువనమల్ల బేతరాజు చాళుక్యప్రభువుల వద్ద సామంతుఁడుగ నుండెను. ♦ సమస్తభువనాశ్రయ శ్రీపృథ్వీవల్లభ మహారాజాధిరాజ పరమేశ్వర పరమభట్టారక సత్యాశ్రయకులతిలక చాళుక్యాభరణాది బిరుదముల నీ త్రిభువనమల్లుఁడు వహించి శూరచూడామణియై యాంధ్రదేశమును బాలించెను. ఇతని జనకుఁడే మొదటి ప్రోలరాజు. దేశచరిత్రములందు శాసనములందు నీతని విస్తర మగు జీవితము కానరాదు. పూర్వుల చరిత్ర మింతతో విడచి శాఖాచంక్రమణ న్యాయము ననుసరించి మహామండలేశ్వర ప్రోలరాజు జీవిత చరిత్రము దెలిసికొనఁ బ్రయత్నింతము. (*) ప్రోలరాజు క్రీ. శ. ౧౧ వ శతాబ్దారంభమునుండి, సుప్రసిద్ధుఁడైనటు లూహింప వచ్చును. చాళుక్యులకు సామంతులుగఁ దమపూర్వు లుండిరే గాని ప్రోలరాజు మాత్ర మటుల నుండలేదు. ఇతఁడు స్వతంత్రుఁడై హనుమకొండలో రాజ్యము స్థాపించి మిగుల నభివృద్ధిలోనికిఁ దెచ్చెను. ఈతని జీవిత మంతయు విరోధుల కెదురుగ నిలుచుటతోడనే గడచినటుల శాసనముల వలనఁ దెలియుచున్నది. చాళుక్యచూడామణియగు తైలపదేవుని యనురాగముతో సంగరమున విడచి పెట్టెను. ఉంతాకవిషయాధీశ్వరుఁ డగు గోవిందరాజును బంధించి విడచి పెట్టెను. గుండరాజును సర్వవిధముల నవమానించి వధించెను. పలువురు మండలేశ్వరుల సహాయముతో హనుమకొండ ముట్టడించిన జగ్గదేవుని జయించెను. ఈ విజయము లన్నియు హనుమకొండ శాసనములోఁ జెప్పఁబడియున్నవి. ప్రోలరాజునకుఁ బ్రతినాయకులు సామాన్యులు గారు. వీరందఱు నిజాము దేశములోని మండలాధీశ్వరు లని సాధనాంతరములచే నిరూపింపవచ్చును. స్థానికచరిత్రములో ప్రోలరాజే ఓరుగంటిలోఁ గోటఁ గట్టింప మంత్రకూటనివాసు లగు రామారణ్యశ్రీపాదులవారిచే శ్రీవిద్యాచక్రక్రమమున నాకృతిని నిర్మింపఁజేసెననియుఁ గోటలన్నియుఁ గట్టించె నని వ్రాయఁబడియున్నది. కాని దానిని విశ్వసింప వీలులేదు. సోమదేవరాజీయాదిగ్రంథములలో గణపతిదేవుఁడే కోటఁ గట్టించినటుల గానవచ్చుచున్నది. ఇదియే విశ్వసనీయాంశ మని తోఁచుచున్నది. ఇప్పుడు కానవచ్చు [illegible] మునకుఁ బట్టుగ కానవచ్చు కొండ లన్నింటిని జూచిన [illegible]

---

* కాకతీయ మహారాజా రంజితాం స్వగురైర్యస్యవం కాకత్యాః పరశక్తేః కృపయా కూష్మాండవల్లికా జాత పుత్ర మనూశ తదేతత్కుల మనఘం కాకతీయసంజ్ఞమభూత్. [మూ. అని తెల్లికలాపచేము శాసనము]

§ హనుమకొండలోని పద్మాక్షీయాలయము ముందుఁ గల కర్ణాటశాసనము చూడుఁడు.

♦ వడ్డెపల్లి చెఱువునొద్ద గల జీర్ణశాసనము చూడుఁడు.

(*) శ్రీమత్ప్రోలనృపాల సైన్యపతినా విఖ్యాతవిక్రాంతినా యద్ధైర్యేణ మహాబలేన నిహతో, మంథన్యగుండాధిపః - అను రుద్రసేనాని శాసనమువలనఁ గాటచమూపతియే గుండాధిపుని వధించినటులఁ దెలియును.

పోయఁబడియున్నది. ఒకవైపు గొప్పశిలాద్వారముపైతము కానవచ్చుచున్నది. ఈకొండలకు మధ్య సిద్ధేశ్వరాలయము మొదలుకొని పద్మాక్షీయాలయమువఱకుఁ గల విశాలప్రదేశమే ప్రోలరాజుకాలమునఁ గోటగా నుండెనని యాస్థలముఁ జూచినఁ దోఁపకమానదు. ప్రోలరాజు జైనమతాభిమాని యనుటకుఁ బద్మాక్షీదేవళపుఁ గొండరాళ్లపైఁ గల జైనవిగ్రహములు నటఁగల శాసనముఁ దోడ్పడఁగలవు. బద్మాక్షీదేవళముముందు సిద్ధేశ్వరాలయముముందుఁ గొలఁది సరోవరములు కానవచ్చుచున్నవి. ఈ సరోవరయుగ్మమధ్యభాగముననే ప్రోలరాజు కోటఁ గట్టియున్నట్టుల నూహింపవచ్చును. ప్రోలరాజు తన జీవిత మంతయు మండలేశ్వరుల నెదిరించుటతోఁ గలిపి యాంధ్రసామ్రాజ్యము నొకవిధముగ నిర్మింపఁగలిగెను. ఈవీరునకు రుద్రదేవుఁడు మహాదేవరాయలను నిరువురు కుమారులు కలరు. రుద్రదేవుఁడే వయస్సునఁ బెద్దవాఁడు. మహాదేవరాయల శాసనములు కానరావు. దేవగిరిరాజులతోఁ బోరి గతించినట్టుల స్థానికచరిత్రమునఁ గానవచ్చును. రుద్రసేనాని రామప్పగుడుల శాసనములో రుద్రదేవునియనంతరము రాజ్య మల్లకల్లోలమై విరోధిరాజులచే నాక్రమింపఁబడినట్టులఁ దెలియుటచే మహాదేవరాయలు రుద్రదేవుని రాజ్యపాలనముకంటె ముందుగా గతించినట్టు లూహింపకలయును.

## రుద్రదేవ చక్రవర్తి

ఈతఁడసహాయశూరుఁడు. యుద్ధక్రియాకౌశలుఁడు. రుద్రదేవుఁడు నిదురించుతఱిఁ దండ్రియగు ప్రోలరాజెందులకో స్పృశించెనఁట. విభ్రాంతుఁడై విరోధి యనుకొని రుద్రదేవుఁడు జనకుఁడగు ప్రోలరాజును గత్తితోఁ బొడచి ప్రమాదమునకుఁ బశ్చాత్తాప మొందెననియుఁ బ్రోలరాజు ఖడ్గహతితో మూఁడుదినములు జీవించి కుమారుఁడు నిర్దోషి యనియు నది ప్రమాద మనియుఁ బౌరులకుఁ దెలిపి మరణించెననియు స్థానికచరిత్రలోఁ గలదు. ఇం దెంతవఱకు సత్యము కలదో నిర్ణయింప వీలుకాదు. * రుద్రదేవుఁడు పరాక్రమశాలియగు దొమ్మరాజును భంజించెను. పొలవాసదేశాధీశ్వరుఁడు మేళగిదేవుని మేడరాజును వధించెను. వర్ధమానపురసంస్థానాధీశ్వరుఁడు దురాచారుఁడు మాతృసపత్నీపతియగు భీమరాజును రాజ్యమునుండి పాఱఁద్రోలి కొంటకరికోటలను వర్ధమానపురమును దహించి తైలపసుతి రాజ్యము నాక్రమించినందులకుఁ బగఁ దీర్చికొనెను. రుద్రదేవుని జీవితములో నాంధ్రసామ్రాజ్యము స్థిరపడెను. అరాతిలోకము వరించి యాత్మరాజ్యవృద్ధియే పరమలక్ష్యమై కనఁబడుటచే రుద్రదేవుఁడే రాజ్యస్థాపనాచార్యుఁ డయ్యెను. తండ్రికరె నితఁడు జైనమతాభిమాని కాఁడు. పాలకురికి సోమనాథకవి యీతని యాస్థానమున నుండి యనేకగ్రంథముల రచించి జైన మతనిర్మూలనము సైతము ప్రభుని యాదరణముచే నొనరించి రాజ్యమునం దంతటను వీరశైవమతమును వ్యాపకములోనికిఁ దెచ్చెను. జైనగ్రంథము లీకాలముననే చాలవఱకు నశించియుండును. రుద్రదేవుఁ డోయగంటిలో(ఏకశిలానగరము) ముఖ్యస్థానముగ రాజ్యము పాలించినట్టులఁ గొందఱు వ్రాసియున్నారు. ♦ హనుమకొండయే రాజధానిగఁ బాలించినట్టులతఁడు స్థాపించిన స్వయంభూదేవాలయశాసనమునఁ గలదు రుద్రదేవుఁడు సమధిగతపంచమహాశబ్దమండలేశ్వర హనుమకొండాపురవరేశ్వర పరమమాహేశ్వర పతిహితచరిత వినయభూషణ శ్రీమహామండలేశ్వరాది బిరుదములు వహించి యప్రతిమానపరాక్రమశాలియై నిర్విరోధిలోకముగ (క్రీ. శ. ౧౧౪౦ మొదలు ౧౧౯౬ వఱకు) రాజ్యమును బరిపాలించెను. రుద్రదేవుఁడు సంస్కృత కర్ణాటాంధ్రభాషలలోఁ బండితుఁడు కవియునై పెక్కుగ్రంథములు రచించెను. విద్యాభూషణబిరుదమును వహించి యితఁడు సంస్కృతమున నాంధ్రమున నీతిసార మను గ్రంథము రచించి యున్నాఁడు. మఱియు నీతఁడు సరస్వతీవిలాస మను న్యాయశాస్త్రమును చెప్పినట్టుల సైతము తెలియుచున్నది. రుద్రభూపాలుఁడు తనపేరుతో ననేకగ్రామములఁ గట్టించుటయే గాక రాజధానియగు హనుమకొండలో నొక గొప్ప దేవాలయమును గట్టించి, వాసుదేవరను రుద్రదేవుని సూర్యదేవుని బ్రతిష్ఠించి ముందొక సహస్రస్తంభమండపమును గట్టించెను. ఈయాలయములోని శిల్పప్రశస్తి వేనోళ్లఁ బ్రశంసింపఁదగి యున్నది. ఆలయములోని స్తంభములపైనను - ద్వారములపైనను - దీర్చిన చిత్తరువులు విగ్రహములు నిరంతర మాంధ్రులశిల్పసామర్థ్యము నుద్ఘోషించుచున్నవి. సహస్రస్తంభమండపమునకు నాలయమునకు మధ్య నొక నంది కలదు. దానిపైఁ గల హారములు దానియునికి అకారపుబింకము దర్శనీయము. ఇపు డా మండపము ఆలయము పాడుబడినది. చిత్తరువు లన్నియు ఛిన్నభిన్న మొందింపఁబడినవి. స్మరణీయము లగు నాలయచిహ్నములతోఁ బాటు పూర్వౌన్నత్యముఁ దెలుపు నొక దీర్ఘకయు శాసనము నేఁటికి దర్శనీయముగ నున్నవి. రుద్రదేవుని యనంతరము రాజ్యము పరస్వాధీన మయ్యెను. § అప్పుడు రేచర్లగోత్రికుఁడును స్వామిభక్తుఁడును సేనానాయకుఁడు నగు రుద్రసేనాని విరోధిబృందమును జక్కాడి పరస్వహస్తగత యైన రాజ్యలక్ష్మిని బంధోన్ముక్తురాలిగ నొనరించి రాజధర్మక్రమ మొకటించెను. పిమ్మట గణపతిదేవుని, చిర్రరాజ్యమున కభిషిక్తునిగా నొనరించి సాక్షీయుతరాజ్యస్థాపనాచార్య బిరుదము వహించెను. ఈ యంశ ముదితముగ క్రీ.శ ౧౨౧౩ స్థాపింపఁబడిన రుద్ర

---

* రుద్రదేవునిఁ బ్రతాపరుద్రుఁడని వ్యవహరించుట యిప్పటి చరిత్రకారుల కలవాటుగ నున్నది. కాని శాసనములలో నా నామము కానరాదు.

♦ రక్తస్రోతసి రుద్రదేవజయినో రుద్యత్కబంధాప్లవాః తస్యాస్తే హనుమకొండ నామనగరీ శ్రీరాజధానీకృతః

రుద్రదేవరాజుల విజయరాజ్య ముత్తరోత్తరాభిప్రవర్ధమాన మాచంద్రార్కతారముగా అన్మకొండపట్టణమునందు సుఖసంకథా వినోదంబున రాజ్యముఁ జేయుచు [మా. హనుమకొండశాసనము]

§ గ్రంథాలయసర్వస్వము మూఁడవసంపుటము నాలవభాగములోని రుద్రసేనానిచరిత్రమున నీయంశముఁ దెల్పు రామప్పగుడులవద్ద గల శాసన ముదాహరింపఁబడి యున్నది.

సేనాని శాసనమునఁ గలదు. విస్తరమంతయుఁ జూడఁదగును. ఈ ప్రభుభక్తి పరాయణుని సదా గణపతిదేవ చక్రవర్తి సాదరమునఁ దిలకించియుండును కావుననే నాంధ్రలోకమున కంతటి కమూల్యభూషణ మనఁదగు రామప్పగుడులు సాగరమునకుఁదీసి పోని తటాకము నెల కొల్పి రుద్రసేనాని కీర్తిశేషుఁడయ్యెను. రుద్రదేవ చక్రవర్తి కాలములోఁ గాకతీయసామ్రాజ్యమునకుఁ దూర్పున సముద్రము దక్షిణమున శ్రీశైలము పశ్చిమమునఁ గటకము ఉత్తరమున మాల్యవంతము సరిహద్దులుగా నున్నటులఁ జెప్పఁబడెను.

## గణపతిదేవ చక్రవర్తి

ఓరుగల్లుకోట రుద్రదేవుని యనంతరము గణపతిదేవుఁడు కట్టించి యట రాజధాని నేర్పఱచియుండును. పెదతండ్రి యగు రుద్రదేవుఁడు స్థాపించిన వడ్డెపల్లి వినాయకదేవరగుడి అయ్యనవోలు మైలారుదేవరగుడి హనుమకొండలోని పూర్వోక్తదేవాలయము గణపతిదేవుని కాలమున మిగుల నభివృద్ధిలోనికి వచ్చెను. రుద్రసేనాని గణపతిదేవుని రాజ్యకాలమున నాలయము స్థాపించియుండుటచేఁ దండ్రితరువాత గణపతిదేవుని సన్ముఖమున సైతము సేనానిగ నున్నటు లూహింపవచ్చును. ఇటులే రుద్రదేవునిచెంత గణపతిదేవుని చెంత నేక కాలమున నున్నవారిలో నామిరెడ్డియను సేనానియొకఁడు సైతము కలఁడు. గణపతిదేవుని పాండిత్యాదికములు తెలిసికొను సాధారములు లభించుట లేదు. కాని యుభయకవిమిత్రుఁడగు తిక్కనసోమయాజి యీతనిసన్ముఖమునకు వచ్చి సత్కృతుఁడై తన భారతమును వినిపించి జైనబౌద్ధమతముల నోడించి యేగినటుల ప్రతాపచరిత్రమునను సిద్ధేశ్వరచరిత్రమునను గలదు. గణపతిదేవుని నామముతోఁ గట్టఁబడిన గణపవరముల సంఖ్యకు గణపురముల సంఖ్యకు మితి లేదు. ఇతనియొద్ద శివదేవయ్య మంత్రిగ నుండెననియు బండితారాధ్యులవలన శైవమతదీక్ష గ్రహించె ననియుఁ బ్రతాపచరిత్రమునఁ గలదు. శైవగురు పరంపరలోని విశ్వేశ్వరశివదేశికు లితఁడే యని కొందఱ యభిప్రాయము. పితృవధాకారకు లగు దేవగిరిరాజులతోఁ దఱచుగ నీతఁడు సంగ్రామములు జరిపి విజయము గడించుచు వచ్చెను. సముద్రములతోఁ బోల్పఁదగు తటాకములు పెక్కులు నిర్మించి భూమిని సస్యవతినొనరించి ప్రజారంజకుఁ డగుటయే గాక పరిమితిగ సముద్రవ్యాపారమునకుఁ బన్నులు విధించి గణపతిదేవుఁడు సముద్రవ్యాపారము నభివృద్ధిలోనికిఁ దెచ్చెను. గణపతి దేవుని కాలమున రాజ్యము మిగుల నభివృద్ధిలోనికి వచ్చెను. మండలేశ్వరు లందఱు సామంతులైరి. పూర్వమునుండి స్వతంత్రమగుచుఁ దొలంగుచు నున్న కాంచీరాజ్యమును పాలించుట కొక ప్రతినిధిని కొలఁదిబలముతో నుంచి పాండ్యరాజులఁ దఱిమివేసెను. శ్రీశైలప్రాంతమునకుఁ గొణిదెనప్రాంతమునకు వేఁగినాటికి నల్లగొండప్రాంతములకుఁ ప్రత్యేక ప్రత్యేక ప్రతినిధుల నుచితమగు బలముతో నియోగించి మండలేశ్వరుల నందఱను సామంతులనుగఁ బాదపద్మోపజీవులనుగ నొనరించి యీ రాజచంద్రుఁ డోరుగల్లులో (ఏకశిలానగరమున) రాజధాని స్థాపించి ప్రతిష్ఠ గడించెను. సాధారణముగ నాంధ్రదేశమునఁ బూర్వము స్వతంత్రము ననుభవించిన రాజు లందఱు సామంతులై మాన ప్రాణములఁ గాపాడికొని సురక్షితులై జీవించిరి. గంగయసాహిణి, శివదేవయ్య సామంతభోజుఁడు చౌండసేనాని నామిరెడ్డి లోనగు నాంధ్రవీరులు గణపతిదేవుని ధర్మపరిపాలనమునకు సర్వవిధములఁ దోడుపడి కాకతీయసామ్రాజ్యభారవాహకులై ప్రతిష్ఠ గడించిరి. గణపతిదేవుడు ధర్మాత్ముఁడు. ఈతనిశాసనము లాంధ్రదేశమునం దంతటను గానవచ్చుచున్నవి. గణపతిదేవుని రాజ్యకాలము క్రీ. శ. ౧౧౯౯ మొదలు ౧౨౬౦ వఱ కని చరిత్రకారు లభిప్రాయపడియున్నారు. గణపతి దేవునకుఁ బుత్రసంతాన మున్నట్లు తెలియదు. ఇతనియనంతర మీ రుద్రమదేవి రాజ్యమునకు వచ్చెను.

## రుద్రమదేవి రాజ్ఞి

ఈయమ గణపతిదేవుని యనంతర మాంధ్ర సామ్రాజ్యమును మహోత్తరముగఁ బరిపాలించెను. గణపతిదేవున కీయమ భార్యయని స్థానిక చరిత్రములయందును జరిత్రలయందుఁ గలదు. కాని కుమార్తె యనుటకే ప్రబలాధారములు కానవచ్చుచున్నవి * కావునఁ గుమార్తె యని విశ్వసింపవచ్చును. మా యూహకనుగుణములగు శ్లోకములు కలవు. కాని వ్యాఖ్యాత రుద్రమదేవిని భార్యగనే వ్యవహరించెను. ఈయభిప్రాయభేదములకు హేతువు విచారణీయము. రుద్రమదేవి స్వయముగ స్థాపించిన శాసనము లభించు వఱకు నామావశిష్టమైయున్న భార్యయను వాదము సంపూర్ణముగ నంతరింపఁజాల దనుట యథార్థము. రుద్రమదేవి పరాక్రమశాలిని తన వ్యవహారములను రుద్రదేవుఁడను నామముతో జరుపుచు విరోధులకు భయంకరముగ సామ్రాజ్యము నీయమ పాలింపసాగెను. దేవగిరి యాదవరాజులు దిగఁబడి మహాసైన్యముతో నేకశిలానగరమును ముట్టడింపఁ జనుదెంచి పక్షముదినములు ఘోరయుద్ధమును గావించి పరాభూతులై పాఱిపోవుచుండ రుద్రమదేవి సైన్య మాబలమును దఱుముచు మూఁడులక్షలపదాతులను లక్షగుఱ్ఱంబులను బట్టి, దేవగిరిసమీపంబున కేగి, కోటిద్రవ్యంబు లపరాధంబుగ దీసికొనినట్లును రుద్రమదేవి యచట జయస్తంభము స్థాపించినట్లును స్థానికచరిత్రమునఁ గలదు. రుద్రమదేవి తనకొమార్తె యగు ముమ్మడమ్మకు పుత్రసంతానముఁ బ్రసాదింపఁ గాకతమ్మకు వడ్డెపల్లిసిద్ధివినాయకుని సన్నిధికి మొగిలిచర్ల యేకవీరాదేవి సన్ముఖమునకు అయినవోలు మైలారుదేవిచెంతకుఁ బోవుటకుఁ బురంబు వెడల, సవతిపుత్రు లగు హరిహరదేవుఁడు మురారిదేవుఁడు బలోపేతులై యేకశిలానగరముఁ బ్రవేశించి గోనులు కాచి రుద్రమదేవిని యామె

* (1) జాతా తస్య పయోనిధే రివరమా శ్రీరుద్రదేవీ సుతా [కొలను పాకశాసనము.] (2) రుద్రదేవీ సముదభూత్కన్యా త్సర్వభూభృతాం [మల్కాపురము శాసనము.] (3) పిత ర్యుపరతే తద్వ దరక్షదఖిలాం క్షితిం శ్రీ వీరరుద్రదేవీ తిదుహితా మహితా గుణైః.

[అని తల్లికలువచేఱు శాసనము]

పుత్రిని పరిజనంబును బురిలోనికి రాకుండ నిరోధింపఁ గార్యము మిగిలె నని సాహసోపాయముతోఁ గోటలోఁ బ్రవేశించి సమయోచితము ముగ రుద్రమదేవి బాలికను సింహపీఠముగాఁ బట్టుబెట్టి సామ్రాజ్యమును రక్షించి తన రాజ్యపరిపాలనకాలము ప్రచురించి శాశ్వతప్రతిష్ఠఁ గడించెను. ఈయమ రాజ్యకాలము క్రీ. శ. ౧౨౬౧-౧౨౯౧ వఱకని చరిత్రకారులు నిర్ణయించి యున్నారు. పలువురు రాజులు రుద్రమదేవి పరిపాలనమునఁ దిరుగఁబడి పరాభూతులై శాంతిఁగడించి నటుల చరిత్రమునఁ గలదు. గణపతిదేవుని కాలమునం దున్న యాంధ్రసామ్రాజ్యమును జెక్కుఁజెదరనీయక కాపాడుటయే గాక రుద్రమదేవి ధనము మిగుల వెచ్చించి యేకశిలానగరపుఁ గోటను మిక్కిలి యభివృద్ధిపఱచెను. రుద్రమదేవికిఁ బుత్రసంతానము లేదు. ఈమె భర్త యేమండలాధీశ్వరుఁడో తెలియదు. ఇట్లు కొలఁది కాలము రాజ్యము పాలింప, రుద్రమదేవి రాజ్యభారము వహించు తేజము పుత్రియగు ముమ్మడమ్మగర్భమున నభివృద్ధి నొందసాగెను. శ్రీ ప్రతాపరుద్ర దేవచక్రవర్తి జనించెను. రుద్రమదేవి పుత్రికచే నోమించిన వ్రతము లన్నియు ఫలించెను. తన తండ్రి నాటనుండియు మంత్రియై దీక్షితుఁడై యున్న శివదేవయ్యచే నాశిశువునకు రక్షాగ్రము విభూతిఁ బెట్టించి నామకరణము చేయించి రుద్రమదేవి శిశుసంరక్షణమున నప్రమత్తురాలై ప్రవర్తింపసాగెను. * యుక్తవయస్సు వచ్చిన పిమ్మట మంత్రి సామంత దండనాయకాదుల యభిప్రాయానుసారముగఁ బ్రతాపరుద్రచక్రవర్తి నొక శుభముహూర్తమునఁ బుత్రునిగా స్వీకరించెను. పిమ్మట నొక యజ్ఞకాలమున నా రుద్రమదేవీరాజ్ఞి ప్రతాపరుద్రచక్రవర్తి కాత్మీయసామ్రాజ్యమును బట్టాభిషేకముఁ గావించి కృతార్థురా లయ్యెను.

## శ్రీ ప్రతాపరుద్ర చక్రవర్తి

♦ రుద్రమదేవి మనుమనికిఁ బట్టాభిషేకము గావించినదాఁక నతనిఁ బుత్రునిగ వ్యవహరించినట్లును ఆతఁడు రుద్రమదేవిని తండ్రిగ భావించినటులను దెలియుచున్నది. ప్రతాపరుద్రదేవచక్రవర్తికాలములో దేశమునకు భావికి సుదినములు వచ్చెను. ఆంధ్రసామ్రాజ్యము, ద్రావిడదేశమును ఓఢ్రదేశమును కర్ణాటదేశమును మహారాష్ట్రదేశమును దన ఛత్రచ్ఛాయక్రిందికిఁ దెచ్చుకొని ధర్మబద్ధముగఁ బవిత్రము శాస్త్రసంగతము నగు నాంధ్రతేజమును దిశాభిరామముగ వెలయించెను. ఆకాలమువారు ప్రతాపరుద్రుని సాక్షాత్ రుద్రావతారముగ భావించి దైవమని పూజింపసాగిరి. § ఈతఁడు క్షత్రపత్నులలో పెద్దవాఁడై ప్రతాపరుద్రనామ మొసఁగు వేలకొలది కన్యకల వివాహమాడినవాఁడని ముక్కంటి యనునామము సైరమాయాన వహించె ననుటయే కాక కవులలోఁ గొనియాడఁబడెను. ప్రతాపరుద్రచక్రవర్తిజీవితకాలములోఁ జాలభాగము శాంతముగ గడచెను. రాజ్యములోని భాగము లన్నింటిని సీమలుగ విభజించి తత్కాలోచితములగు పేరులఁ బెట్టి ప్రతాపరుద్రదేవుఁడు క్రొత్తనాయకులను నియోగించి వారలకు సర్వాధికారము నొసంగి రాజ్యమునంతయు శాంతియుత మొనరించెను. తొల్లి గణపతిదేవచక్రవర్తి యట్టి పరిపాలనముఁ గావించెఁ గాని యందుఁ గొన్ని మార్పు లావశ్యకములగుటచే ప్రతాపరుద్రుఁ డనేకవిధముల సంస్కరించి నూతనమార్గములఁ గనిపెట్టెను. త్రిపురాంతకాంబ దేవాదిమండలేశ్వరు లపుడపుడు తిరుగఁబడుచు వచ్చినను ప్రతాపరుద్రచక్రవర్తి తాను స్వయముగ సంగ్రామమునకు వెడలక సైన్యముచే శాంతిని స్థాపింపసాగెను. ప్రతాపరుద్రచక్రవర్తి ధర్మస్వరూపుఁడని ఖండఖండములయందుఁ బ్రతిష్ఠ నొందఁబడెను. ఆంధ్రసామ్రాజ్యము సామాన్యజనుఁడు మొదలు చక్రవర్తివఱకు నాదర్శప్రాయముగ నుండెను. పూర్వము స్వతంత్రులుగ నున్న దేశాధీశ్వరులు సామంతులై ప్రతాపరుద్రచక్రవర్తికి లోఁబడి యభిమానమును గాపాడికొనవలసిన యావశ్యకము తటస్థించెను. కాని ప్రతాపరుద్రుఁ డేమఱక వేఁగులచే రాజకీయతంత్రముల నెఱుఁగుచు నాంధ్రసామ్రాజ్యమును వేయి కన్నులతోఁ గాంచుచు జీవితసర్వస్వమును వెచ్చించి యెట్టి కల్లోలములు జరుగకుండ జాగరూకుఁడై మెలఁగసాగెను. కాకతీయచక్రవర్తులకు దేవగిరిరాజులకుఁ జిరకాలమునుండి ద్వేషము కలదు. పలుమాఱు కాకతీయచక్రవర్తుల నెదిరింపఁ గృతప్రయత్నులై దేవగిరిరాజు లపజయమును సార్జించి మిగుల నష్టపడిరి. ఆక్రోధాగ్ని-ఆద్వేషవిస్ఫూర్తి - ప్రతాపరుద్రచక్రవర్తికాలమున సైత మంతరింపలేదు. (*) దేవగిరిరాజులు ప్రతాపునికాలములో సైతము గోదావరి దాఁటి యాంధ్రసామ్రాజ్యముపైఁ బడి పరాభూతులైనటుల దెలియుచున్నది. ఆంధ్రసామ్రాజ్యము శాశ్వతముగ నంతకాలమేని నిలుచుటకుఁ బ్రవ్వని పరిసుగ నున్న గౌతమీప్రశాంతియే కారణ మనుట నిజము. ఆంధ్రనగరసైన్యము గోదావరికాలమును గాచుచుండి సామ్రాజ్యక్షేమము సంతరింపసాగెను. ఆంధ్రసామ్రాజ్య మెంత దుర్భేద్యముగ శత్రుజనాగమ్యముగ నుండెనో ప్రకృతకాలమున శీర్ణమైయున్న యాకోట దర్శించినచో పాఠకసోదరుల కవగతము కాఁగలదు.

---

*స్వీకృతో పుత్రభావేన దౌహిత్రః ప్రాభ్యమాజ్ఞయా అస్మిన్నిశ్చితే శశాంకః గుర్వీ ముర్వీమురాం ... [ప్రతాపరుద్రయశోభూషణము]

♦ యస్యాం కాకతిక్షోణీంద్ర మౌళిమణిః శ్రీరుద్రదేవ స్సుతా ప్రస్ఫారింకదయాను కైతవ మతః శ్రీరుద్రదేవ్యాః పరం [మాల్యాపురము శా.] రాజ్ఞా పుత్రీయ మౌళిమండనమణిః ప్రాతిష్ఠ సామ్రాజ్యకే [ప్రతాపరుద్రయశోభూషణము.]

§ చూ. కొండవీటి సామ్రాజ్యములోని కాకతీయచరిత్రము.

(*) శ్లో. కే కే సేవణ క స్తవాయ మనిదం పూర్వా వ్యగర్వాయమహాన్ ? ఉత్తీర్ణా కిల యేన గౌతమనదీ ప్రాప్తోఽసి మృత్యోర్ముఖం ఏహ కాకతివీరరుద్ర ఇతి కిం నాశ్రావి సప్తాక్షరీ ప్రత్యుథ్య త్విపతు పార్థివ మహాభూతగ్రహోచ్చాటనీ. [ప్రతాపరుద్రయశోభూషణము]

* ఆంధ్రసామ్రాజ్యమున నా కాలమున వచ్చెడి రాబడికి మేర లేదు. ఆదాయము వ్యయము స్థానికచరిత్రమున వ్రాయఁబడియున్నది. ఇం దతిశయోక్తి యున్నటుల సూచింపఁజాలను.

చాళుక్యరాజుల ముఖ్యస్థానమగు కల్యాణపురిపైకి కామేశ్వర ప్రాంతీయులకు విజయయాత్ర కేగి కానుకలతో వెనుకకు మరలుటయే గాక ప్రతాపరుద్రచక్రవర్తి మళయాళదేశ మేలుచుండు దేవిని సౌరాష్ట్రదేశాధీశ్వరులను గెల్చి ఢిల్లీపైకి దాడివెడలి సులతా నొసంగిన కానుకలతోఁ గరుణించి వెనుకకు మఱలెనఁట. ఈచక్రవర్తి కాలములో శ్రీశైలము కాళేశ్వరము త్రిపురాంతకము లోనగు చోటులఁ గల దేవాలయము లమితవైభవముతో నలరారెను. నూత శైవ మగు జైనమతము సైతము చాలవఱ కీతనికాలముననే నశించెను. కొలనుపాక, వేములవాడ, హనుమకొండ, లోనగుచోటుల గల జైన దేవళము లన్నియు మార్చి, వానిని పాలించు జైనులఁ దొలంగించి శైవుల యధీనముఁ జేసి క్షేత్రమాహాత్మ్యములు సృజించినది సైత మీకాలముననే యని యూహింపఁ బెక్కు లాధారములు కానవచ్చుచున్నవి. రాజ్యమునం దంతట నాకాలమున ప్రభుని యాదరణముచే శైవమతమునకే ముఖ్యస్థానము లభించె ననుట సత్యము.

1 ప్రతాపరుద్రచక్రవర్తి మిగుల సుందరాకారుఁడు. వివిధాలంకారభూషిత మగు సేనుఁగుపై నెక్కి యాంధ్రనగరరాజవీధులలో విహరించుచుఁ బ్రజలకు దర్శనభాగ్య మొసంగుచుండెను. రసికతాప్రచురణమునకుఁ గాఁబోలు నితనికి వేశ్యాసంపర్క మున్నటుల గ్రంథాంతరములలో వ్రాసిరి. కొలఁదిలోపములఁ బాటిసేయ రాదు గాన ప్రతాపరుద్రచక్రవర్తి ధర్మప్రభు వనుటలో నెట్టి సంశయము లేదు. ఈరాజన్యుఁడు తనపేరుతో నేకశిలానగరమున కీశాన్యమునఁ బ్రతాపగిరి యను నొక దుర్గముఁ గట్టించెను. రెండువేలయోడల నిర్మించి ద్వీపాంతరములనుండి వస్తుసామగ్రిఁ దెప్పించుచు సముద్రవ్యాపారమును మిగుల నభివృద్ధిలోనికి దెచ్చెను. ప్రతాపరుద్రయశోభూషణముఁ జూడ చక్రవర్తి విలాసపురుషుఁ డనియు స్వైరవిహారప్రియుఁ డనియు నూహింప నవకాశము కలుగును. ఇతఁడు ప్రతిష్ఠించిన దేవాలయములు చేసిన ధర్మములు లెక్కయిడరానివి. ఆంధ్రవాఙ్మయమున నీయనకాలమున నూతనవికాసము కలిగె ననుట సహజోక్తియే. ఈప్రభుని యాస్థానమున నూటయేబదిమంది బంగారు పల్లకి యెక్కు సంస్థానమునకు వచ్చు నుత్తమవిద్వాంసులు, సకలశాస్త్రప్రవీణులగు పరిహాసకు లెనిమిదిమందియు, నాట్యగురు వేదవేదాంగపారీణులు, ఇన్నూఱుగురు కవీశ్వరులు గలరు. భాస్కరరామాయణములో గొంతభాగము వ్రాసిన మల్లికార్జునభట్టాతఁ డాయాస్థానమున మిగుల గౌరవము నంది, రాజ్యతంత్రములలోఁ గూడ పాలుగొనెను. ఇతఁడు నిరోష్ఠ్యరామాయణమును సంస్కృతమున రచించినటుల స్థానికచరిత్రమునఁ గాననగును. ప్రతాపదేవుని యాస్థానకవులలో విద్యానాథుఁ డగ్రగణ్యుఁడు. ఈయన రచించిన యలంకారగ్రంథము సుప్రసిద్ధమగు ప్రభుకంఠప్రఖ్యాతి వేయివిధముల చాటుచున్నది. మఱియు నీ చక్రవర్తి యవలంబనములో నుండియే సాహిణిమారన భాస్కరరామాయణము, గన్నయసేనాని మార్కండేయపురాణము సంకిత మొంది యాంధ్రవాఙ్మయము నలంకరించిరి. రుద్రదేవుఁ డను నొకకవి సంస్కృత కర్ణాటభాషలలోఁ గొన్ని గ్రంథముల రచించెను. ప్రధానమంత్రి యగు శివదేవయ్య శివతత్త్వరసాయన మను నొక యుత్తమకావ్యము నాంధ్రవాఙ్మయమున రచించెను. ఇటులే యాకాలమున ననేకగ్రంథములు రచింపఁబడి యుండవచ్చును. నిజామురాష్ట్రమున సమగ్రముగ గ్రంథములఁ బరిశీలించిన నెన్ని యమూల్యగ్రంథనామములు కవినామములు వెలువడునో! ఆంధ్రనగరాధ్యక్షుఁ డగు ప్రతాపరుద్రుని జీవిత మీకారణముచే నాంధ్రవాఙ్మయమునకు భూషణముగ నున్నది.

## సమాప్తి

కాకతీయ ప్రతాపరుద్రచక్రవర్తి ఆంధ్రసామ్రాజ్యమును పాలించుకాలమున ఢిల్లీసామ్రాజ్యమున కల్లాయుద్దీను రాజై యుండెను. త్రిలింగసామ్రాజ్యమును హరించి ప్రతాపరుద్రుని తనకు సామంతుని జేసికొనఁదలంచి యతఁడు చాల ప్రయత్నింపసాగెను. దేవగిరిదుర్గ మంతకుమున్నె మహమ్మదీయహస్తగతమై యుంటచేతను ఈ దుస్తంత్రమున దేవగిరిరాజులు భాగస్వాములై యుండుటవలనను అల్లాయుద్దీనుదృష్టి-దురదృష్టదేవతచేత నావరింపఁబడిన నాంధ్రసామ్రాజ్యముపై ద్వరలో ప్రసరించెను. "మలిక్ కాఫూరు" అనువానితో నుచిత

---

* కటకవల్లభుండు లోనుగాఁగల చిల్లరరాజులు ప్రతివర్షంబును ఇచ్చు నప్పనంబులు ఇరువైనాల్గుకోట్లు. తనభూమి పాలితంబై రాజ్యంబువలన వచ్చు ధనంబు ఇరవైకోట్లు. అగ్రహారంబులు బ్రాహ్మణులకుఁ జెల్లుచుండెడివి నాల్గువేలు. దేవతావైభవంబులకు రెండువేల గ్రామంబులు, ఇదిగాక తన భాండారమునకు వచ్చునట్టు నాల్గుకోట్లు. (వ్యయము) ప్రతివర్షంబు తులాపురుషంబులకు మూఁడుకోట్ల యేబది లక్షలు. నిత్యవైభవంబునకు పరిమళగంధ కర్పూర కాశ్మీర జవాజి పరిమళంబులకు పంక్తిభోజనంబులకు నగరిదీపాలకును నానాదేశముల నుండి వచ్చు విద్యార్థులకును బంచిపెట్టిన ద్రవ్యంబు ప్రతివర్షంబును మూఁడుకోట్ల అరవయిలక్షల యిరువయివేలు. నగరుగాచు నిశ్శంకవల్లభులకు జీతము ప్రతివర్షంబున కటనప్పనంబుగా ఎనభైయెనిమిదిలక్షల యిరువదివేలు. అన్నసత్రంబుల గణుతి ఒక్కొక్క పట్టణంబునకు వేయింటి చొప్పున నూయసత్రంబులు ద్వారాలకు ఏడాదికి మూఁడుకోట్లు [illegible]. రాజమహలకంబులకును [illegible] జీతంబులవారికి రెండుకోట్లు [illegible]. ఏకశిలానగరంబున గల దేవతావైభవంబున కొక్కకోటి. రాజగృహంబులు కట్టి [illegible] ప్రతివర్షంబున [illegible] వారణాసి విశ్వేశ్వరునకు శ్రీశైలమల్లికార్జునకు కాళహస్తీశ్వరునకు కామేశ్వరము [illegible] నాసికా త్ర్యంబకేశ్వరునకు అయినాచలేశ్వరునకు కొలిపాకసోమేశ్వరునకు ఏకవీరేశ్వరునకు వేములవాడరాజేశ్వరునకు కాళహస్తి ముక్తీశ్వరునకు గోకర్ణేశ్వరునకు మొదలైన యీశ్వరస్థానంబులకును శ్రీరంగనాయకులు కంచివరదరాజులు శ్రీవేంకటేశ్వరులు మంగళగిరినృసింహస్వామి సింహాచలం ఆదివరాహమూర్తి ... భద్రాచలం శ్రీరాములకును ... ప్రతివర్షంబు మూఁడుకోట్లు. తన భండారమునకు మూఁడు కోట్లు చెల్లుచుండె. [ప్రతాపచరిత్రము]

1 శ్లో. వీరరుద్ర మధిరూఢసింధురం ద్రష్టు మంధ్రనగరీపురంధ్రయః కుర్వతే రచితచంక్రియా త్వరా స్తుంగసద్మశిఖరాధిరోహణం.
[ప్రతాపరుద్ర యశోభూషణము.]

ప్రతాపరుద్రధరణీశోపాత్త సామ్రాజ్యవిద్యోపాధ్యాయి నెఱుంగవయ్యెదవు మాచల్దేవి వారాంగనన్. [క్రీడాభిరామము]

మగు బలమునొసంగి యాంధ్రసామ్రాజ్యము ముట్టడింపు మని అల్లాఉద్దీను పంపెను. మలికాఫూరు కొందుమాఱు లాంధ్రసామ్రాజ్యము పైకి సంగ్రామమునకు వచ్చి పలాయన మొనరించెను. తుదకు వీడ యాంధ్రసామ్రాజ్యము విజయదూరము కానున్నదనుచుఁ బ్రతాపరుద్రునకు దోఁచుటచే మిక్కుటముగ మలిక్ కాఫూరునకు రొక్కమొసంగి సంధినొనరించెను. మహమ్మదీయబలములు వెనుక కేగెను. ప్రతాపరుద్రచక్రవర్తి తీర్థయాత్రలతో రాజ్యాభివృద్ధి నొనర్చుటతోఁ గాలము గడుపసాగెను గాని మహమ్మదీయు లెన్నటికేని రాజ్యచ్యుతుని గావింతు రను నూహ జనింపదయ్యెను. దురదృష్టదేవత నెత్తిపైఁ గూర్చుండి తాండవమాడుచుండ యుక్తాయుక్తపరిశీలన మెక్కడనుండి వచ్చును. ఢిల్లీలోని మహమ్మదీయరాజ్యమున నంతశ్శాంతి నశించెను. చక్రవర్తియగు నల్లాఉద్దీనును జంపి మలిక్ కాఫూరు ప్రభు వయ్యెను. ప్రభుద్రోహి యగు మలిక్ కాఫూరును ప్రజలు వధించిరి. తరువాత ముబారక్ రాజ్యమునకు వచ్చెను. వానిని జంపి ఖుస్రూ రాజ్యమునకు వచ్చెను. వానిని వధించి గజిబేగ్ తుఘ్లఖ్ రాజ్యమునకు వచ్చెను. ఇతనినే గ్యాసుద్దీ నందురు. ఇతఁడు స్థిరపడి యాంధ్రసామ్రాజ్యము పైకి దృష్టి ప్రసరింపఁజేసెను. ముఖ్యసేనానాయకులతో నమిత మగు బలముతో నలూఫుఖానను వానిని నితఁ డాంధ్రసామ్రాజ్యముపైకిఁ బంపెను. ప్రతాపరుద్రసైన్యమునకు మహమ్మదీయసైన్యమునకును ఘోరసంగ్రామము జరిగెను. ఆంధ్ర రక్తము మహమ్మదీయరక్తము సమముగఁ బ్రవహించెను. మారణ కాలముతలంపునకు వచ్చెను. ఎంత బల మున్న నేమి? బహిరంగస్థలములలోని కాధారముగ నున్న యవనసైన్యము ఏడుకోటలమధ్య సురక్షితమై యున్న యాంధ్రసైన్యముతోఁ బోరిపోరి విజయము గడింపఁ జాలక వెనుకడుగు వేయసాగెను. ఆంధ్రసైన్యము యవనదళమును గోదావరివఱకుఁ దఱిమి వెనుకకు మఱలెను. మహమ్మదీయు లేడు మాఱులేక శిలానగరమును ముట్టడించి రని స్థానికచరిత్రమున గలదు గాని చరిత్రమున నాల్గుమాఱు లనియే కలదు. మహమ్మదీయసైన్యము నాల్గువంతులు నష్టపడి ఢిల్లీకిఁ జేరెను. ఆంధ్రసైన్యము తెఱపిలేని సంగ్రామములవలన విజయయాత్రలవలనను జాలవఱకు బలవిహీనమయ్యెను. ప్రతాపరుద్రచక్రవర్తి తనసైన్యపరాక్రమములకు హర్షించి బహూకరించి కొలఁదికాలమువఱకు కొట్టి విప్లవము లుండవని విశ్రాంతి నొసంగెను. అలూఫుఖాను హతశేష మగు సైన్యము ఢిల్లీ కేగి పరాభవము సెలింగింప మిగుల నాగ్రహించి బలము నంతయుఁ గొనిపోయి యేని యాంధ్రసామ్రాజ్యము రూపుమాపు మని సులతా నాజ్ఞ నొసంగెను. విధిలేక విశ్రాంతినైనఁ దీసికొనక, వెంటనే అలూఫుఖాను పూర్వముకంటె నెక్కుడు బలముతో నాకస్మికముగ నాంధ్రసామ్రాజ్యమును ముట్టడించెను. ప్రతాపరుద్రచక్రవర్తి విశ్రాంతిగొనుచున్న సైనికుల సమావేశపఱచి రణోన్ముఖులను గావించెను. కోటబైట మహమ్మదీయులొకవైపున నాంధ్రులు నిలిచి ఘోరముగఁ బోరాడిరి. ప్రతాపరుద్రున కనేకములు అపజయములు సంభవించెను. ఆంధ్రసామ్రాజ్య మంతరించునటులే భావించి అన్నమరాజు వీరపాండ్యరాజు నేరాల బబ్బారెడ్డి నలుపతిరాయలు మొదలగు సామంతులకు సైన్యాధిపత్య మొసంగి గజారూఢుఁడై ప్రతాపరుద్రచక్రవర్తియు సంగ్రామరంగ మలంకరించెను. రణము కోట కన్ని ప్రక్కల ఘోరముగ భయంకరముగ జరుగసాగెను. అన్నమదేవుఁడు వీరపాండ్యరాజు బబ్బారెడ్డి నలుపతిరాయలు సమానముగఁ దురుష్కసైన్యమును బ్రతిఘటించి యప్రమత్తులై రణము చేయింపసాగిరి. అంతలో నాకస్మికముగ సంగ్రామమునకు సైనికుల నియోజించు ప్రతాపరుద్రదేవుని అలూఫుఖాను బంధించి శిబిరమునకుఁ గొనిపోయి యటనున్న నేమి యాపద వచ్చునో యని యాత్మసంరక్షణమునకు వలయు బలముఁ జేకొని నాఁటిరాత్రినుండియే ఢిల్లీకిఁ బ్రయాణమయ్యెను. ఆంధ్రసామ్రాజ్యమునఁ జక్రవర్తి పట్టువడె నను వార్త వ్యాపించెను. జనులందఱు హాహాకారములు చేయసాగిరి. సేనానాయకులు సంగ్రామరంగము వదలి ప్రతాపరుద్రుని గొనిపోవు మహమ్మదీయసైన్యము వెంటఁబడి పదిరెండామడలదూరమున నున్న రామగిరి యొద్ద మహాత్తరముగ నెదిరించిరి. ఉభయదళంబుల కట మఱల ఘోరసమరము జరిగెను. ఈ సంకులసమరసమయమున విజయవార్త ముందుగ ఢిల్లీశ్వరునకుఁ దెలియఁబంపి అలూఫుఖాను కొలఁదిబలముతోఁ బ్రతాపరుద్రుని ఢిల్లీకిఁ బంపివేసెను. ఆంధ్రవీరు లందఱు మహమ్మదీయబలమును నిర్మూలనముఁ గావించి వెదుకఁగా చక్రవర్తి కానరాఁడయ్యెను. ఆంధ్రవీరు లిట్లు ప్రతాపరుద్రసంరక్షణమున కేగుటఁ జూచి కోటను ముట్టడియున్న యవనసైన్యము నిరాతంకముగ నేకశిలానగరమునఁ బ్రవేశించి రాజగృహముల విపణులఁ దోఁచి, రాజమందిరముల నాలయముల రూపుమాపి, ఢిల్లీపురాభిముఖులై వెడలిపోయిరి. ఢిల్లీనవాబు ప్రతాపరుద్రుఁడు పట్టువడె నని విని మిగులసంతోషించి రాజ్యమున నుత్సవములఁ జేయించి యాతని చెఱసాలలో నుంచి ఆంధ్రసామ్రాజ్యము తనహస్తగతముఁ గావించికొనెను. * ఇంతతో నాంధ్రసామ్రాజ్య మంతరించెను.

ఆంధ్రసామ్రాజ్య మవిచ్ఛిన్నముగ రెండువందల సంవత్సరము లేక ధాటి నభివృద్ధి నొంది యంతరించెను. ప్రాచీనాకారమును దలపింపఁ జేయుచు నాంధ్రవీరపవిత్రక్షాత్రరక్తముచేఁ బూతమైన యా యేకశిలాపురనగరము ఓరుగల్లను పేరున నాంధ్రజనుల యశ్రుతర్పణములతోఁ దృప్తినొందుచు నేఁటికినిఁ గానవచ్చుచున్నది. సోదరా! నీ వాంధ్రుడవు. నీ వాఙ్మయ మాంధ్రము. నీ దేహమునఁ బ్రవహించున దాంధ్రరక్తము. ఒక్కమాఱు నామావశిష్టమై యున్న నాంధ్ర నగరమును స్మరించి సందర్శించి, కృతార్థుఁడవు కాఁగూడదా?

ఉ. "కాకతిరాజ్యవైభవ వికాసము సర్వము శూన్యమయ్యె భా
వాకలితంబు లయ్యె భవదంచితభోగ సమృద్ధులెల్ల నీ
ప్రాకటపూర్వభాగ్యపరిపాటిఁ దలంచిన, "నాంధ్రరాజ్యల
క్ష్మి!" కరిణాత్మకుం డయినఁ జింతిలి నీరయి శోకముండునే?"

---

* ప్రతాపరుద్రుని రాజ్యపాలనకాలము క్రీ. శ. ౧౨౯౫ మొదలు క్రీ. శ. ౧౩౨౧ వఱకని చరిత్రకారుల యభిప్రాయము.

# అక్బరునాటి విద్యాభివృద్ధి

గోవిందరాజు వేంకట కృష్ణా రావు గారు

వెలుఁగలాయి చక్రవర్తులలో నగ్రగణ్యుఁ డగు అక్బరు రాజ్యకార్యధురంధరత్వమున కెంత పేరొందెనో యంతకన్న నెక్కువ విద్యాభివృద్ధిని కూడ ప్రసిద్ధి వహించెను. కొందఱు చరిత్రకారులు అక్బరు విద్యావిహీనుఁ డని వర్ణించియున్నారు. గోవాదేశస్థుని మాటలను ప్రమాణముగా గైకొని నోర్ అను చరిత్రకారుఁడు అక్బరు విద్యాగంధము లేనివాఁ డని వ్రాసెను. అట్లే "తుజకీ జహాంగిరి"లోఁ గూడ వ్రాయఁబడెను. అనేక కారణములచేత అక్బరు విద్యావిహీనుఁ డను మాట అంగీకృతమైనది కాదు. హుమాయూను తన కుమారుని విద్యకొఱకు చాల వ్యాకులత నొంది అబ్దుల్ లతీఫ్ అను వారిని నియమించె నని చరిత్ర తెల్పుచున్నది. అది గాక పీర్ మహమ్మదుఖాన్ హాజీమహమ్మదు ఖాన్ అనువారు అక్బరు గురువు లని ఫెరిస్టా వ్రాసెను. పామరుఁడును నిరక్షరకుక్షియు నగు నొక మనుజునకు విద్యావిషయములను గురించి జరుగు సంభాషణ దెలిసికొనుట కాని, దుర్గ్రాహ్యమైన వివాదముల గ్రహించి సంతసము నొందుట కాని, విద్వాంసులతో చర్చలు సల్పుట కాని, గద్యపద్యకావ్యరచనలలోని ఆ లాలిత్యముల గ్రహించుట కాని, చాల కష్టము. అసంభవము. కాని, అక్బ రట్టి కష్టవిషయములందు తన సామర్థ్యమును ప్రకటించె నని అబ్దుల్ ఫజల్ తన గ్రంథమునందు వ్రాసెను. అక్బరు 20-11-1547 తేదీని అక్షరాభ్యాస మొనర్చె నని ఫజల్ దెల్పెను. కావున అక్బరు విద్యావిహీనుఁ డట అక్రమము.

అక్బరునకు హిందూదేశ కల్పనాకథలు వినుట యందు చాల ప్రీతి. మీర్ హసీడాచే వ్రాయబడిన 360 కల్పనాకథలను సొగసైన దస్తూరితో వ్రాయించి చిత్తరువులతో నింపెను. ఆరంభమునుండి తుదివఱకు గ్రంథములఁ గొంతమంది యోగ్యతగల్గిన మనుజులచేఁ జదివించి, రోజున కెన్ని పుటలను చదివెనో గుర్తుపెట్టి పుటల ప్రకారము ధన మిచ్చెడివాడు. అప్రతిమ విద్వాంసుఁడును, అనుపమేయ లౌకిక వ్యవహారదక్షుఁడును అగు అబ్దుల్ ఫజల్ యిట్లివిధమున వ్రాసెను:—

"శాస్త్రములోఁ గాని చరిత్రలోఁగాని ఇంక నే విధమైన విషయములను గురించిగాని వ్రాసిన గ్రంథముల నన్నిఁటిని ఫాదుషావా చదివెను. ఇతని కంటఁబడిన పుస్తకము లన్నిఁటిని చదివెను. చదివిన పుస్తకమే మఱల చదివినను విసుగుకొనక ఆదరముతో వినును."

ప్రతిదినము రాత్రిసమయమున రాజకీయ వ్యవహారములఁ బరిష్కరించి, అక్బరు చాల నోర్పుతో వేదాంతులతోను సుఫీస్‌లతోను చరిత్రకారులతోను చర్చలు సల్పెడివాఁడు. విద్వాంసులు పండితులు మొదలగువారు శాస్త్రములమీఁదను, ప్రాచీనాధునిక చరిత్రలమీఁదను, మతములను గురించియును చేయు చర్చలను వినుచుండెడివాడు. ఈ సభలు జరుపుటకై తాను క్రొత్తగాఁ గట్టిన ఫత్తేపూరుసిక్రిలో ఇబాదత్ ఖానా యను నొక మందిరమును కట్టించెను. శాస్త్రములోని విచిత్రములు సృష్టివైచిత్రములు మొదలగు వానిని గుఱించి ఆమందిరమున చర్చలు జరుగుచుండెడివి. సున్నీ, షియా, సూఫీ మున్నగు మహమ్మదీయ మతస్థులును, బ్రాహ్మణ బౌద్ధ క్రైస్తవ యహూదీ పారసీక మతగురువులును తమతమ మతాధిక్యమును ప్రతిపాదించెడివారు. ప్రతివాఁడును భయముడిగి స్పష్టముగఁ దన యభిప్రాయములనుఁ దెల్పుచుండెను. ఒక్కొక్క పర్యాయము వాద వివాదములు చేయువారు చెలరేగి బిగ్గరగా నఱచి యొకరినొకరు తిట్టుకొని అల్లరిచేసెడివారు. ఏజాతివాడైనను చెప్పు సంగతులు వినుటకును, వానిలోని ముఖ్యాంశములను గ్రహించుటకును అక్బరు సిద్ధముగ నుండెడివాడు. ఒకసారి క్రైస్తవబోధ వినుటకై తన కుమారుని నియోగించి అబుల్ ఫజల్‌ను క్రైస్తవమతమును భాషాంతరీకరించుట కాజ్ఞాపించెను.

ఒక్క విద్యావిషయిక చర్చలనే సల్పుట గాక గ్రంథరచనను కూడ ప్రోత్సాహపరచెను. 1582 సం

త్సరమునందు మహాభారతమును తర్జుమా చేయించి దానికి రజమ్‌నామా యని పేరిడెను. నాలుగువత్సరములు క్రమపడి 1589 సంవత్సరము అబ్దుల్ ఖాదర్ పారసీక భాషలోనికి రామాయణమును అనువాదముచేసెను. సుర్ హిందీచేత అధర్వవేదమును, ఫైజీచే లీలావతియు, ముఖమల్ ఖాను గుజ్రాతీచే నొక జ్యోతిశ్శాస్త్రగ్రంథమును, మహమ్మదు శాహబాదీచేత సంస్కృతములోని కాశ్మీరచారిత్రమును, పారసీకభాష లోనికి తర్జుమా చేయించెను. ముస్తఫీచే హరివంశమును హుసేనుచే పంచతంత్రమును శృంగారనైషధమును కూడ తర్జుమా చేయించెను.

తైమూరువంశములు స్వీయచరిత్ర రచనయందు ప్రీతి గలవారు. దానికి నిదర్శనములు— బేబరు స్వీయ చరిత్ర. జహాంగీరు స్వీయచరిత్ర. కాని కొందఱు వ్రాయ కుండినను తమ కాలమున జరుగు సంగతులను వ్రాయుటకు చరిత్రకారుల నియోగించిరి. అక్బ రట్లే చేసెను.

విలువగల గ్రంథములను సమకూర్చుట అక్బరునకు చాల ప్రీతి. రాజకీయ గ్రంథము లంతఃపుర మందునను కొన్ని బయటను నుండెడివి. తన భాండాగారము మంచి స్థితిలో నుండుటకు మంచి యేర్పాటులను గావించి దానిలోని పుస్తకములను శాస్త్రముక్రిందను చరిత్రక్రిందను విభజన చేసెను. ఫైజీ చనిపోయినప్పుడు ఆతని గ్రంథాలయమున 4600 గ్రంథము లుండెను, వాని నక్బరు తన గ్రంథాలయమందు జేర్చె. మూడు భాగములుగా భాగించెను. ఆగ్రాకోటలో నొక గది గ్రంథాలయపు గది యని చూపెదరు. దానిని గుఱించి హావెల్ గా రిట్లు వ్రాసిరి:—

“ఈ చిన్నచిన్న గదుల నన్నిటిని దాటిన తరువాత పుస్తకభాండారపు గది యని ప్రసిద్ధికెక్కిన నొక పెద్దగదిలోనికి మనము ప్రవేశింతుము, దానిని కొలది కాలముక్రిందట రంగువేసి అలంకరించుటకై కొన్ని ప్రయత్నములు జరిగెను.”

అక్బరు మంచి గ్రంథములను చిత్తరువులతో నింపుట కనేకచిత్రకారుల నియమించెను. చిత్రకళాభివృద్ధికి గాను చిత్తరువుల శాశ్వార మొకదానిని స్థాపించెను. దానిలోనికి చిత్రకారులు వచ్చి తమతమ విద్యాకౌశలతను గనబరచెడివారు. సంగీతముకూడ అభివృద్ధి పరుపబడెను. అక్బరు నాస్థానమున హిందువులు ఇరేనియనులు తురేనియనులు కాశ్మీరవాసులు గాయకులుగా నుండెడివారు.

తన కుమారులు, మనుమలు వీరియొక్క విద్యను గుఱించి చాల శ్రద్ధను దీసికొని వారిని అప్పుడప్పుడు పరీక్షించుటకు గాను గొప్ప విద్వాంసుల ననేకులను నక్బరు నియమించెను.

పాఠశాలలలోను కళాశాలలలోను చదువు చెప్పుటలో నొక క్రొత్తమార్పు వచ్చుట కక్బరుకాల మొకకారణముగా గణింపవచ్చును. మహమ్మదీయ చారిత్రమునందు అక్బరు హిందువులు మహమ్మదీయులను భేదము పాటింపక అందఱిలో విద్య వ్యాపింప జేయుటకు కష్టించినవారిలో ప్రథముడని చెప్పవచ్చును. విద్యావిషయికము లగు మార్పులతోం దృప్తినొందక అక్బరు విద్యావ్యాపనమును చేయు పాఠశాలల నెక్కువ జేసి, కోటలు రాజభవనములు, కళాశాలలు మసీదులు మొదలగునవి కట్టుట కని వాండ్రను (రాజమేస్త్రీల) అనేకులను నియమించెను. ఆకాలమందు విద్యార్థులు తమ గురువుల గృహములలోం గూడ జదువుకొనిరి. అందు అబ్దుల్ ఖాదర్ తన గురు వగు మీర్ అలీ బేగ్ నింటం జదువుకొనెను. ఇతర రాజులకాలములో జరిగినట్లు అక్బరు కాలమందు కొంతమంది జనులు విద్యావ్యాపనమునకు దోడ్పడిరి. మహమ్ అనాగ యను నామె బాలుర విద్యను వృద్ధిచేసెను. ఈమె మదరసా కట్టించెను.

అక్బరు విద్వాంసులకు బహుమానము లిచ్చెడువాడు. కాశ్మీరమును వశపరచుకొనినపుడు ఆ దేశములోని విద్వాంసులకు బహుమానము లిచ్చెను. త్రివేణీగ్రామములోని వంగభాషాకవి యగు మాధవాచార్యులు (అక్బరు సమకాలీనుడు) అక్బరును తాను వ్రాసిన “చండిమంగల్” యను గ్రంథమందు చాల పొగడెను.

మహమ్మదీయ విద్యావిషయిక నభోమండలమున నక్బరు మార్తాండుం డని చెప్పవచ్చును. ఆతని రాజ్యమున రాజకీయ విద్యావిషయిక మతసంబంధ శాఖలు సర్వజనసమత్వమును, అన్యమతద్వేషాభావమును అనుసరించి పాలింపంబడెను. ఈ విషయమున నితనికే మహమ్మదీయరాజును సమానుండు కాడు. తాను పాలించెడి ప్రజల సుఖదుఃఖములతో దా నేకీభవించెనని తెల్పుట కీతని హిందూమతాదరణమే నిదర్శనము. ఏమతమువా రైనను తనకు సమానులే యని చాటిన

మహమ్మదీయ రాజులలో నితఁడు అగ్రగణ్యుఁ డని చెప్పవచ్చును. హిందూబాలురు చదువుకొనుటకు మదరసాలను కట్టించి ఇబాడత్ ఖానాలో హిందువులతో వారిమతమును గురించి చర్చలు సల్పి హిందూపురాణములను మతగ్రంథములను పారసీకములోనికి భాషాంతరీకరింపఁ జేసి సంగీతశాస్త్రములోను చిత్రకళలోను అభిరుచిగల హిందువులను పోషించి, తా నన్యమతద్వేషి గాఁ డని లోకులకు చాటెను. తా నొక సూత్రధారుఁడై మహమ్మదీయ విద్యావిషయిక నాటక మెట్లు ఆడించెనో మనము చూచితిమి గదా! అబుల్ ఫజల్ ఫైజీ అబ్దుల్ ఖాదర్ మున్నగు విద్వాంసులతో విద్యావినోదములతో కాలక్షేపముఁ జేసి, వారిని తన ప్రాణస్నేహితులుగాఁ బరిగణించెను. దీనివలన నెన్నఁడును సాధ్యము కాని విద్యకును ఐశ్వర్యమునకును ఐకమత్యమును సమకూర్చుచు హిందువులును బౌద్ధులును, జైనులును, క్రైస్తవులును మహమ్మదీయులును, వేయేల సర్వమతములవారును కలిసి మతవిషయికచర్చలు సల్పుట కొక మందిరమును గట్టించి, అట్టి చర్చలను ప్రోత్సహించి, అన్యమతద్వేషమను శక్తి నావలకు బారద్రోలి, హిందూదేశపు మతవిషయిక చరిత్ర కొక యలంకారమును తెచ్చిపెట్టెను. "పరమేశ్వరుని నెఱుఁగు విశేషసామర్థ్యము చిత్రకారులకు గలదు. ఒకానొక మనుష్యుని ప్రతిమను వ్రాసి యందు జీవముఁ బోయు సామర్థ్యము తనకు లే దనియు ఈశ్వరునకు మాత్రము గల దనియును చిత్రకారుఁడు చక్కఁగ నెఱుంగును. అందుచే నీశ్వరుని సామర్థ్య మాతనికి బాగుగ దెలియు న"ని అక్బరు ధైర్యముగా వ్రాసెను. అక్బరు రాస్థానమునకు విదేశములనుండి చాలమంది పండితులు వచ్చిరి దొరతనమువారి కచ్చేరీలను కూడ విద్యావిషయిక సంస్థానములుగా మార్చెను. పండితులకును విద్వాంసులకును బహుమానముల నొసంగెను. విద్యావ్యాపనముఁ జేయుటకు పాఠశాలలను, కళాశాలలను నడుపుటకుగాను మాన్యము లిచ్చి సంస్కృత కవితాచారిత్రమున భోజభూపతి పరిపాలనకాల మెట్లో ఆంధ్రకవితాచారిత్రమునందు కృష్ణదేవరాయల కాల మెట్లో మహమ్మదీయ కవితాచారిత్రమున నక్బరుకాల మట్టి దని వ్యక్తపఱచెను.

# జ్ఞానసూర్యోదయము

చింతపల్లి రామకృష్ణ శాస్త్రిగారు

జనముల నిద్ర దేపి విలసన్మృదుపద్మపథంబుఁ జూపి, స
త్యనియతి నీడఁ బాపి, పరదైవతభక్తి శిరంబు మోపి, కో
రిన ఫలపూర్తిఁ జేపి, దురరిప్రకరమ్ములఁ బాపి లోకవ
ర్ధన మొనరింప వేడ్కఁ గయివ్రాలముఁ జూపి వెలింగె మిత్రుఁడున్.

చ. కలకలలాడు నెమ్మొగము కాంతులు దిక్కులఁ బిక్కటిల్లఁగన్
కలకల నాదముల్ జనులు [illegible] దెసల నింప
[illegible]
[illegible]

సీ. ఎఱిఁగినారలు గదా! ప్రకృతి నాయకులు ని
రోపకారమే సదా శుభ మటంచు మ
గుఱు తెఱింగిరి గదా! కరుణాయితాత్మకుల్
నీచమాత్సర్య తామస గుణుల [illegible]
దలంపు మంచిరి గదా! దగ సర్వనయులు స్వ
యంసహాయమె శరణ్యం బటంచు
నిజముఁ గాంచిరి గదా! ప్రజలు ధర్మప్రభు
త్వము రాద్రక్షణమె సుఖ మని

తే. గీ. త్యాగ మాత్మసంయమ [illegible] కుశాగ్రబుద్ధి
సత్యధర్మ వచోరూఢి, శాంత శమద
మాది గుణములఁ గల్గి నిత్యంబు మనఁగ
జ్ఞానసూర్యోదయంబు జగానఁ గాఁగ.

సీ. విజ్ఞానదీపంబు వెలుఁగ దేహాగార
మున [illegible] గనుము చేయ
నీవు నీ యను భేదనియమములఁ మాని వా
[illegible] నిర్వహింపు
మాత్మ తేజశ్శక్తి నలరించి సద్బోధ
నలఁ జేసి సార్థకం బలయఁ బూను
మనోవ్యగ్రసహాకార మైకమత్యపరోప
కారముల్ గలిగి శంకను త్యజించు

తే. గీ. స్వార్థపరతయుఁ బెట్టివేదాంతముల వ
దలి నిజం బగు జనకర్తవ్య మెఱుఁగు
జ్ఞానసూర్యోదయం బయ్యెఁ గాన యాత్మ
బోధ సల్పి వహించుమా! పుత్ర! దీక్ష.

# గోపాలుని రామకవి

కర్లపాలెపు వేంకట నారాయణప్ప గారు

గోపాలుని రామకవి, తన చిత్రాంగదాపరిణయములో, తాను నన్నయభట్టారకుని వంశజుఁడైనట్లు వ్రాసికొని యున్నాఁడు. బ్రహ్మశ్రీ కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రులు గారు, రౌద్రి సంవత్సరము ఉగాదిసంచికలో, రామకవి, నన్నయభట్టారకుని వంశీయుఁడు కాఁడని ఒక వ్యాసమును ప్రచురించినారు. ఆ వ్యాసమందలి విషయము లెంతవరకు సహేతుకములో విమర్శింపవలసి యున్నది.

గోపాలుని రామకవి, మిగుల నాధునికుఁడనియును, ఆహేతువువలన, నన్నయ భట్టారకుని వంశజుఁడు కాఁడనియును, వ్రాసిరి. ఆధునికుఁ డనుమాట సత్యమే కావచ్చును. దాదాపుగా నిన్నూరు సంవత్సరముల క్రిందనే ఉండియుండును. ఆధునికుఁడైనంతమాత్రమున వంశము మారిపోవునా? అన్యపురుషుని మూలపురుషునిగాఁ జెప్పుకొందురా? తమ మూలపురుషుని మఱచిపోవుదురా? భరతఖండమంతటను, ప్రతిబ్రాహ్మణుఁడును, తాను, ఎవరో ఒక ఋషి సంతతివాఁడ నని చెప్పుకొనుచుండును. నాలుగు యుగముల యొద్దక్రిందనుండిన ఋషుల సంతతివార మని, సకలబ్రాహ్మణులకు, నెట్లు జ్ఞాపక మున్నది? వీరికి ఏవిధమునైన లిఖితాధారములు కలవు? ఏ శిలాతామ్రశాసనములలో కనఁబడును? ఇట్లు జ్ఞాపక ముండుటకు పరంపరాగతమై సంప్రదాయసిద్ధమైన పెద్దలవాక్యములు తక్క, ప్రత్యక్ష, లిఖిత, నిదర్శనము లేమైన నున్నవా? తిక్కన, సోమయాజుల వంశీయులు ఇప్పటికిఁ గలరని కవులచరిత్రములో, శ్రీ వీరేశలింగము గారు వ్రాసిరి. ఈ పాటూరి శరభరాజు గారికి తిక్కన, తన మూలపురుషుఁ డని యెట్టుల జ్ఞాపక మున్నది? తిక్కన, సోమయాజుల ౧౨౨౦ సంవత్సర ప్రాంతముల నుండియు ఇప్పటికి, ఆయన సంతతివారికిని, ఆయనకును, నడుమ, కాలవ్యవధి, ఏడునూర్ల సంవత్సరములు, అటులనే నన్నయభట్టారకుడు, ౧౦౫౦ సంవత్సరప్రాంతముల నున్నవాఁడు. గోపాలుని రామకవి ౧౭౫౦ సంవత్సర ప్రాంతమున నున్నవాఁ డనుకొనుడు. వీరిద్దరికిని గూడ, కాలవ్యవధి ఏడునూర్ల సంవత్సరములే! పాటూరి శరభరాజు గారికి, తన మూలపురుషుఁడు, తిక్కనసోమయాజి యని జ్ఞాపక ముండఁగా, గోపాలుని రామకవికి నన్నయభట్టారకుఁడు, తన మూలపురుషుఁ డని జ్ఞాపక ముండుట, అసంభవమా? కావున గోపాలుని రామకవి, అత్యంతము, ఆధునికుఁ డగుట వలన, నన్నయభట్టారకుని వంశజుఁడు కాఁ డనునది మెచ్చఁదగినమాట కాదు.

'గోపాలునిసింగన్న, 'నన్నయభట్టారకుఁడు తన మూలపురుషుఁడని చెప్పుకొనలేదు అనునది ఇంకొక కారణము. ఇది కారణాభాసమే! కాని కారణము గాదు. ప్రతివాఁడును తన మూలపురుషునియొక్క పేరును గాని పెంపును గాని చెప్పుకొనవలె నని నియమ మున్నదా? ఇష్టము వచ్చినవారు చెప్పుకొందురు. ఇష్టము లేనివారు మానుకొందురు. తిక్కనసోమయాజి తనతాత మంత్రి భాస్కరుఁడు రామాయణమును వ్రాసె నని చెప్పుకొనెనా? సుప్రసిద్ధుఁడైన నరహరిశాస్త్రులవారు, [సరస్వతీతీర్థు లనఁబడువారు] కావ్యప్రకాశ వ్యాఖ్యానమగు "బాలచిత్తానురంజని" వ్రాసినవారు. వీరు తనతండ్రిగా రని మల్లినాథసూరి అనియును, పంచకావ్య వ్యాఖ్యాత యనియును చెప్పుకొనెనా?

గోపాలుని రామకవి గోత్రమును నన్నయభట్టారకుని గోత్రమును వేరువేరని వ్రాయుట మూఁడవది. నన్నయభట్టారకుఁడు ముద్గలగోత్రజాతుఁడ నని వ్రాసికొనెను. గోపాలుని రామకవి తనది మౌద్గల్యగోత్రమని వ్రాసికొనెను. దీనినిఁబట్టి ముద్గలగోత్రము వేరనియును, మౌద్గల్యగోత్రము వేరనియును, శాస్త్రులవారు వ్రాసిరి. కాని ధర్మశాస్త్రములు చదువుకొని గోత్ర సంప్రదాయములను, సంపూర్ణముగ తెలిసిన, విద్వాంసులు ఇట్లు చెప్పరు లేమి. ముద్గలగోత్రమును, మౌద్గల్యగోత్రమును వేరువేరుగా లేవనియును మౌద్గల్యగోత్రము ఒకటియే యున్నదనియును చెప్పుచున్నారు. నిర్ణయసింధువు మొదలైన ధర్మశాస్త్రగ్రంథములలోను, శాస్త్రులుగా రుదాహరించిన "ధర్మప్రవృత్తి"లోను గూడ, మౌద్గల్యగోత్ర మొకటే కాని ముద్గలగోత్ర మొక్కటే లేదు. ఈ విషయమై ధర్మశాస్త్రములను సమగ్రముగాఁ బరిశీలించిన యొక శాస్త్రులుగారు ఇట్లు వ్రాసినారు!

"శ్రీశంకరభాష్యే, తైత్తిరీయోపనిషది శిక్షావల్ల్యాం, అష్టమే ఉవాకే - పురుశిష్టస్యాపత్యం = పౌరుశిష్టిః - రథీతరస్య గోత్రాపత్యం = రాథీతరః - ముద్గలస్యాపత్యం = మౌద్గల్యః - తత్రైవ శంకరానందయతిః భగవతో మాధవాచార్యస్య గురుః, స్వకృతదీపికాయాం = ముద్గలస్య అపత్యం = మౌద్గల్యః - వాచస్పతి నిఘంటుః. ౪౭౫౭ పేజీ, ముద్గలః - గోత్రప్రవర్తకే మునిభేదే - ౪౦౭౭ పేజీ, మౌద్గల్యః - ముద్గలస్య మునేః గోత్రాపత్యం - ముద్గలగోత్రాపత్యే - మునిభేదే - ఇత్యాది వాచస్పత్యాది, వాచస్పత్యాది గ్రంథేషు"

గోపాలుని రామకవిగారు, మౌద్గల్యశబ్దమును ప్రయోగించుచుండగా, 'నన్నయామాత్యుఁడు ముద్గలగోత్రజాతుఁడ' నని వ్రాసికొని యున్నందునను ముద్గల, మౌద్గల్య శబ్దములు రెండును, ఒకటి ఋషివాచకము రెండవది అపత్యార్థమును దెలుపుచుండ, "ముద్గలః - గోత్రకారకముని విశేషః" అనినంతమాత్రమున నే దుష్పితార్థకశబ్ద కలిగినట్లు, ఆనందము చెంది, ప్రమాణపదవియందగ్రపూజ్యులగు శ్రీ శంకరాది మహాశయుల అభిప్రాయములను ముద్గల మౌద్గల్య శబ్దములకు ఇచ్చిన నిర్వచనాదులను, గణనింపకయే "పచగోత్రకారః

గోత్రకారక మునివిశేషః" అను తుల్యసదృశపదద్వంద్వమునే నమ్మి ఋషిభేదము స్పష్టముగా గనుపించుచుండినను, పై పదముల తండ్రి కుమారు లని సామాన్యస్ఫురణ మగు అర్థమును పరిత్యజించి స్వాభిమత సిద్ధికై గోత్రభేదమును, పాఠకులకు శబ్దభేదము - అనఁగా ముద్గల మౌద్గల్య శబ్దముల కించిత్తు భేదము గనబడుచున్నందున "అందులో కొంత వాదియుఁ గలుగుదు" అను ఆంధ్రోక్తి ననుసరించి, ప్రయత్న విశేషమున, ముద్గలగోత్రజుఁడు, మౌద్గల్యగోత్రజుఁడును ఒకఁడే ట్లగు ననియు ఈమాత్రభేదము కని తెలిసికొనక పోయినాఁడనియు, స్థిరీకరించి నన్నయభట్టారకునిగోత్రము వేరు రామకవిగోత్రము వేరు అని స్వాశయమును బ్రహ్మయ్యశాస్త్రులుగారు దృఢపరచుకొనినారు. కాని ఏ ప్రవరగ్రంథమం దైనను, ముద్గలగోత్రులు, మౌద్గల్యులు ప్రవరోచ్చారణ సమయమునందు వేఱువేఱుగా కనబడుచున్నారా? నిర్ణయసింధ్వాది నిబంధనగ్రంథములయందు, తన్నిబంధనకర్తలందఱు గోత్రప్రవరనిర్ణయప్రకరణమున కేవలాంగిరసగణమునందు - హారిత, కుత్స, కణ్వ, రథీతర, ముద్గల, విష్ణువృద్ధ, అను షడ్విధభేదమును గనఁబరచుచు, సాత్యముగ్రియాదులు గల ౧౭ భేదములనుగ ముద్గ గణంబులను గనంబరచుచు, అంగిరస, భార్మ్యశ్వ, మౌద్గల్య; అంగిరస, తార్క్ష్య, మౌద్గల్య అని ప్రవరను పరిగణనము చేసియున్నారు. కాని, మన బ్రహ్మయ్యశాస్త్రులుగారు, కల్ల బరచినట్లు ముద్గల, మౌద్గల్యగోత్రములు వేరే యనుకొనిన ముద్గలగోత్ర ప్రవరగణమును గురించి చెప్పియుండలేదు. స్వవాదసమర్థనకొఱకు ముద్గలగోత్రమును, భిన్నము చేసినను నిబంధనకారు లందఱును సమకాలికులు గానందున బ్రహ్మయ్యశాస్త్రులవారి వాదమునకు, అనుకూల నిదర్శనములు దొరకవైరి. ముద్గల, మౌద్గల్య పదములను ప్రాచీనకవులు పవాద పాండిత్య కవితా విశేషములు గాని సామాన్యముగా ప్రయోగించినారు. బ్రహ్మయశాస్త్రులుగారు విపరీతవిమర్శలను ప్రాచీనకవిప్రయోగములయందు ఆరోపించి, అజ్ఞులగు పాఠకజనులకును హాస్యాస్పద మగునట్లు ప్రాచీననిబంధన గ్రంథాదుల సమగ్రముగఁ బరిశీలింపకయే, తమకు తోఁచినరీతిని వ్రాసినారు.

దీనినిబట్టి మౌద్గల్యగోత్రముకంటె భిన్నమైన ముద్గలగోత్రము లే దనియును రెండును ఒకేగోత్ర మనియును గ్రహింపవచ్చును. కాఁబట్టి నన్నయభట్టారకునిగోత్రమును గోపాలుని రామకవిగోత్రమును ఒకటియే కాని వేరు కావు. అందువలన గోపాలుని రామకవి నన్నయభట్టారకుని వంశజుఁ డగుటకు సందేహింప బనిలేదు. గోపాలుని రామకవి తాను నన్నయభట్టారకుని వంశజుఁడ నని వ్రాసికొని గ్రంథమందు బాహాటముగా చెప్పుకొనుచుండగా ప్రమాణశూన్యముగా కా దని చెప్పుటకు నెవరికి నేమి యధికారము గలదు? గోత్రము వేరనియును ఇద్దరికిని చాలాకాలము వ్యవధి యున్న దనియును మఱియు నేవేవియో కారణాభాసములను చూపి పామరజనులను మోసపెట్టఁజూచిరి. కాని పండితులైనవారికి యథార్థము బోధపడక పోదు. రామకవి తాను నన్నయభట్టారకుని వంశజుఁడ నని ఢక్కాగొట్టి చెప్పుచుండగా మఱియొకరు ప్రమాణరహితమైన వాక్యములతో "కాదు, కాదు" అని చెప్పుట "ఇంటివాఁడు పాడిగేదె యనఁగ బయటివాఁడు గొడ్డుగేదె" యనిన ట్లున్నది. కాకినాడలో నుండెడు బ్రహ్మయ్యశాస్త్రులు గారికి వినుకొండనొద్దనుండు గ్రామములలో నివసించెడు గోపాలునివారి పుట్టుపూర్వోత్తరము లెట్లు తెలియును? ఈ విషయమై నన్నయభట్టారకుని వంశజులలో నొకరైన గోపాలుని వేంకటనరసింహముగారు వ్రాసిన యొకలేఖ నిందు క్రిందఁ బొందుపఱచుచున్నాను. ఆ యుత్తరమువలన పెక్కుసందేహములు సమసి పోగలవు.

"ముప్పాళ్ల, 5-11-20. మహారాజరాజశ్రీ................ ................పంతులు గారి దివ్యసముఖమునకు - విన్నపములు, గోపాలుని వేంకటనృసింహం కృతానేక నమస్కారములు. మీరు మహారాజశ్రీ, గోపాలుని వేంకటప్పయ్యగారి పేర వ్రాసిన యుత్తరం చూచినాము. నన్నయభట్టు మావంశీకుడు అయినట్టు కొన్ని దృష్టాంతరములు గలవు. మా గోత్రము- మౌద్గల్యస. ప్రవర-ఆంగీరస భార్మ్యాశ్వ మౌద్గల్య, త్రయార్షేయ, మౌద్గల్యసగోత్రః ఆపస్తంబ సూత్రః యజుశ్శాఖ. ప్రస్తుతము మాలో నన్నయభట్టు అను పేరు గలవారు ఒకరు గలరు; వారికి వయస్సు 50 సంవత్సరములు. నన్నయభట్టు విషయమై చరిత్ర తమరు వ్రాయుటకు పనికివచ్చు దృష్టాంతరములు ప్రస్తుతము మాయొద్ద లేవు. మన చారిత్రవిషయమై వ్రాయువలెను. మాకొక కాకితము రావలసియున్నది. అది వచ్చినవెంటనే తమరు నన్నయభట్టు విషయమై చారిత్రవివరముగా వ్రాయగలను. క్షేమసమాచారములు వ్రాయించ కోరుతాను. వెంటనే జాబు వ్రాయవలెను. చిత్తగించవలెను.

(చేవ్రాలు) గోపాలుని వేంకట నృసింహాం.

అడ్రసు:—గోపాలుని వేంకటనృసింహాం, ముప్పాళ్ల, పిడుగూరు పోస్టు; వినుకొండ తాలూకా.

ఇఁక నను గోపాలునివారు, నన్నయభట్టు తమ పూర్వికుఁడని చెప్పకొనుచున్నారా? యనునది యింకొక కారణము.

ముప్పాళ్లలో నున్న గోపాలునివారితోను మఱికొందరితోను, ఎవరో ఏవిషయము మాటలాడుచున్నప్పుడు, గోపాలునివారు తమ మూలపురుషుఁడు నన్నయభట్టు అని చెప్పలేదఁట. నేను, పైన నుదాహరించిన గోపాలుని వేంకటనరసింహం గారు ముప్పాళ్ల కాపురస్థులే గదా. ఉత్తరము మూలమున తెలియును. శాస్త్రులుగారితో నెల విడ్చిన ఆ యెవరికో నే, అప్పుడు చెప్పని గోపాలునివారు ఇప్పుడు ఉత్తరమెట్లు వ్రాసినారు? ఇంతేగాక ఏవిషయమును ప్రసంగములో వచ్చినదో దానిని గురించియే మాటలాడుట విజ్ఞుల మతము కదా. కావున నిది యొక హేతువు కాదు.

నన్నయభట్టారకునకు, గోపాలుని రామకవికిని, గృహనామ సంబంధము లేదనుట మఱొక కారణము.

అసలు మొట్టమొదట నన్నయభట్టారకుని యింటిపేరేమో శాస్త్రులుగారు సెలవీయగలరా? పోనీ, నన్నయభట్టారకుని ఇంటిపేరును, గోపాలుని రామకవి యింటిపేరును, వేరువేరు అనియే

యనుకొందము. అంతమాత్రముచేత, వంశము మారిపోవునా? వంశజాలు అగుటకు ఇంటిపేర్లే యాధారమా? రుద్రాభట్ట వెంకప్ప సోమయాజులు గారు, విశ్వామిత్రగోత్రికుఁడు కదా. విశ్వామిత్రుని యింటిపేరు రుద్రాభట్టవా రయ్యెందురా? పుల్లంరాజు వేంకటేశ్వరరావు పంతులుగారిది పరాశరగోత్రము కదా. పరాశరుని యింటిపేరు పుల్లంరాజువారా? కాఁబట్టి యింటిపేరు ఒకటి కాదు. గనుక వంశజుఁడు కాఁడనుట యుక్తిసహమైన మాటగాదు. కొట్టరువు తిక్కనామాత్యుని వంశజుఁడు పాటూరి శరభరాజు గారట్లయినారు? ఇటులనే యింటిపేరులు మారిపోయినవారిని వేనవేలు దృష్టాంతరములు చూపవచ్చును. శాస్త్రులవారు, ఉపన్యాసాంతమందు ఇట్లు వ్రాసిరి.

“కాన, రాజనరేంద్రుని కులబ్రాహ్మణుఁడును, ఆచార్యపద కలితుండును, ముద్గలగోత్రజాతుఁడును, నగు నన్నయభట్టారకునకును నియోగియు, మౌద్గల్యగోత్రుండును, యోగానందామాత్యనందనుండును నగు గోపాలుని రామకవికిని, శాఖాసంబంధము గాని - గోత్రసంబంధముగాని, గృహనామసంబంధము గాని, ఎంతమాత్రమును లేదు” అని వ్రాసినారు. ఈ యన్ని సంబంధములు నున్నవో లేవో పైన నేను తెల్పినాను. కొన్ని ఆక్షేపణలకు సమాధానము చెప్పినాను. మిగిలిన కొన్ని యాక్షేపణములకు సమాధానములు, నా అసలు వ్యాసములలోని పూర్వభాగమునకు ఉత్తరభాగమును చూచిన బోధపడ గలవు. ఇంకను కొన్ని యాక్షేపణము లున్నవి; కాని వానికి, సమాధానము చెప్పవలసినంత యవసరము కాన్పించదు. ఏలయనఁగా అవి ఈర్ష్యాసూయాద్వేషప్రధానము లగు వాక్యరత్నములతో నిండి యున్నవి. సత్యాన్వేషణము కొఱకు వ్రాసినట్లుగాఁ గానుపింపవు. కాఁబట్టి యాపేక్షణీయములు. మఱియును తిట్లతోను దూషణలతోను, పరిహాసములతోను ఎత్తిపొడుపులతోను, నిండియున్నవి; పండితులు వ్రాయదగినవి గా లేవు. కాఁబట్టి - నన్నయభట్టారకుని వంశజుఁడే గోపాలుని రామకవి. గోపాలుని రామకవి నియోగియే! కాఁబట్టి నన్నయభట్టారకుఁడును నియోగియే!! ఆయన కృష్ణదేవరాయల యనంతరమున నియోగులలోనుండి వేఱుపడి పోయిన (1) ఆంధ్రవైదికుఁడు కాఁడు. (2) ఆయన ఆంధ్రుఁడు గనుకను, ఆయనభాష ఆంధ్రభాష గనుకను మహారాష్ట్రభాష మాతృభాషగాఁ గల విదర్భజవైదికుఁడును గాఁడు. (3) ద్రావిడభాష మాతృభాషగా గల ద్రావిడవైదికుఁడును గాఁడు. నన్నయభట్టు తమవంశమువాఁడని ఆంధ్రవైదికులు చెప్పినచో, గొంత అందము, చందము; ముద్దు ముచ్చటయు అయినను ఉండును. విదర్భజవైదికులును, ద్రావిడవైదికులును నన్నయభట్టు తమవాఁడని చెప్పుటలో బొత్తిగా సారస్యమే లేదు. ఇన్ని విచారణ లేల? శ్రీకృష్ణదేవరాయల కాలమునకు పూర్వము ఆంధ్రకవులందఱును నియోగులే! కొండవీటిరెడ్డిప్రభుత్వమునకు పూర్వము ఆంధ్రబ్రాహ్మణు లందఱును నియోగులే!!

# స్వరాజ్యసందేశము

బాలకవి వడ్డాది సీతారామాంజనేయులు గారు

పంజాబు దుర్గతిపాల్జేసినట్టి మై
  కేలాడ్వాయరుని శిక్షింప రయ్యె
నిరపరాధుల ప్రజానీకమ్ముఁ ద్రుంచిన
  ఉద్యోగులను శిక్ష నొంచ రయ్యె
ప్రభులు కామన్సు దౌర్జన్య మామోదించి
  రే గాని జాలి వహింప రయ్యె
మొనమొన్న వైస్రాయి యినయుపన్యాస మం
  దున కనుతాపమున్ జూప దయ్యె
గీ. హైందవుల మహమ్మదీయుల స్నేహమ్ము ప్రబల
  న్యాయ మొందును కనుకఁగన్నట్టి సమ్య
  భరతసుతులార! మీరు బహిష్కారదీక్ష
  పూనుడు స్వరాజ్యవిభవమ్ము పొందుడనుక.
సీ. ఘన బిరుదావళుల్ గౌరవోద్యోగముల్
  నియమిత సభ్యులన్ విడుచవలయు
గౌరవార్థము దొరల్ గావించు విందుల
  దర్బారులను విడనాడవలయు
బ్రిటిషు కార్ఖానాల ఛేదింప జాతీయ
  విద్యాలయముల స్థాపింపవలయు
ప్రతినిధ్యములకు గూడ దత్తత్తక్షత్ర
  నిలువ, నిల్చిన వోట్ల నీయరాదు.
గీ. సైనికులును కూలీల్ సుమస్తాలు గాని
  వృత్తికై కాలనీలకు వెడలరాదు.
  అన్యదేశవస్తు ప్రవాహమ్ము నాపి
  త్యాగమును జూపవలయు సోదర్యులార!
సీ. మూలమూలలఁ బడి యున్న మగ్గము లట్టి
  చేతిరాట్నాల పునరుద్ధరించి
ప్రోత్సాహకము నకు ప్రవిమ్ముగాఁ గ
  ల్గడరగా సారెల మహత్వమును
దేశీయవస్తుల తొగల నిందాయదు
  కాణాల బల్ ప్రభావాంచితి
ఆబాలగోపాల మతి పార్శ్వమున స్వదే
  శీయవస్తుల వాడు చెలంగ వలయు
గీ. త్యాగమే పరమావధి గాగ నలరు
  భరతసుతులార! ఇదియె క్రమ్మరఁ గనంగ
  భాగ్య మెందరె, గాంధి మహాత్ము ప్రతిభ కలిమి
  కైకొనుడు! లెండు!! ఖడి బహిష్కారదీక్ష.

# రైల్వే పరిపాలనము

కొండివర్తి వీరభద్రాచార్యులు గారు

ఇంగ్లీషుభాషలో రేల్ అనఁగా కమ్మి అని అర్థము. ఇటువంటి కమ్ములతో నమర్పఁబడిన త్రోవ రేల్ వే లేక రేల్ రోడ్ అనఁబడును. ఈ కమ్ములమీద నడుచు బండికే "రైలుబండి" అను పేరు వచ్చినది. రైలుబండ్లను లాగు యంత్రమునుండి పొగ గుప్పుగుప్పున వచ్చుచుండుటం జేసి దానిని పొగబండి యనిరి.

1844 సం. ఆర్. ఎం. స్టీవెన్సనను నతఁడు ఇండియాలో రైలుబండ్లను సాగించుట లాభప్రద మని యింగ్లాండునందలి 'ఈస్టు యిండియా కంపెనీ' వారికి సలహా నిచ్చెను. ఆయనయే ప్రధానుఁడగు యింజనీయరుగా నియమింపబడి 'ఈస్టు యిండియన్ రైల్వే' యన్నగు కొన్నింటిని మనదేశములో నిర్మించినవాఁడు. 1849 సంవత్సరములో కలకత్తానుండి రాజమహలు వఱకును మొదటిరైలు నిర్మింపబడినది. అప్పుడు మనదేశములో దొరతనమును నడుపుచుండిన ఈస్టు యిండియా కంపెనీవారు ఆ రైలుకుగాను పెట్టుబడిపెట్టిన సొమ్ముమీద నూటికి 5 కంటెను లాభము వచ్చునటుల హామీని యిచ్చి రైల్వే కంపెనీవారిని ప్రోత్సాహపఱచిరి. అనఁగా ఈ రైలునకు పుటవలన సంవత్సరమునకు నూటి కైదుచొప్పున లాభము రాని యెడల ఆనష్టము నంతను దొరతనమువా రిచ్చునటుల బాధ్యతను వహించిరి. ఇట్టి హామీని యిచ్చి బొంబాయినుండి కళ్యాణివరకు నింకొక రైలు వేయించిరి. ఇది మొదటిహార్డింజిప్రభువు కాలమున జఱిగినది. వారితరువాత 'డల్హౌసీ' ప్రభువు గవర్నరుజనరలుగా వచ్చెను. ఆయన 1853 సం. రైల్లు విరివిగా హిందూదేశమున నిర్మింపఁబడవలెనని ప్రోత్సాహము చేయుచు వ్రాసినాఁడు. ఇండియా గవర్నమెంటువారు లాభమునకు హామీనిచ్చి ప్రైవేటు రైల్వేకంపెనీల వలన రైల్లు వేయించవలయునని సలహా నిచ్చియున్నాఁడు. ఈయన హిందూదేశమునందు బ్రిటిషువర్తకుల వ్యాపారము బాగుగా సాగుటకొఱకై యుద్దేశించి రైళ్లను వేయించినాఁడు. దీనికితోడు రాజకీయ మర్మములును ఆ యుద్దేశ్యమును బలపఱచినవి. ఈతని జీవితచరిత్రను వ్రాసిన సర్ విల్లియంహంటరుగారు ఇట్లు వ్రాసియున్నారు:

క్రొత్తగా సంపాదింపఁబడిన హిందూదేశ సంస్థానములను తన రైల్లుమార్గమున సమ్మేళనమునకు దెచ్చుటయేగాక, సామ్రాజ్యమున ప్రతిస్థలమునను సైనికబలముల దాడికి గల బలమును మిక్కిలి హెచ్చించుటే గాక, ఇంతవఱకుం దుండిపోయిన యేగవర్నరు జనరలును ఊహించి యుండజాలనంత హెచ్చుగా బ్రిటిషువర్తకుల పెట్టుబడిని వ్యాపారోత్సాహమును హిందూదేశమున నాకర్షించుటకై రైళ్లనిర్మాణము నతఁ డుద్యమించి యున్నాఁడు.

ఆ డల్హౌసీప్రభువే రైళ్లనిర్మాణ సందర్భమున "......ఇంగ్లాండు దూదికొఱకై మొఱ లిడుచున్నది. ఆదూదిని హిందూదేశ మిప్పుడు కొంతవఱకు పండించుచునే యున్నది. దూరస్థములగు బయళ్లనుండి నౌకలమీద వేయుట కనువగు రేవులకు దానిని చేర్చుటకు దగిన వసతులు గల్పింపబడినయెడల శ్రేష్ఠమైన రకమును గావలసినంత పండింపగలదు. వర్తకమునకు వసతులు హెచ్చినకొలఁదిని, కడుదూరమున బడియున్న హిందూదేశపు అంగళ్లలో యూరపున దయారైన వస్తువుల యక్కఱ హెచ్చుచుండ మన మెఱుగుదుము గదా!" అని వ్రాసియున్నాఁడు.

"రైలువ్యాపారమునకు పూర్ణముగ వసతులు గల్పించుటకుగాను హిందూదేశీయ వర్తకమున కడివఱకు గల యాతంకములను హద్దులను డల్హౌసీప్రభువు తొలగించె"నని సర్ ఎడ్విన్ ఆర్నాల్డు వ్రాసినాఁడు.

డల్హౌసీప్రభువుయొక్క 8 సంవత్సరముల పరిపాలనకాలములో దూది ఎగుమతి 15 లక్షల నవరసులనుండి దాదాపు 25 లక్షల నవరసులకును, ధాన్యపు ఎగుమతి 8 లక్షల 90 వేల నవరసులనుండి 29 లక్షల నవరసులకును హెచ్చినవి. మఱియు మొత్తపు ఎగుమతులు ఒకకోటి ముప్పదిలక్షల నవరసులనుండి రెండుకోట్ల ముప్పదిలక్షల నవరసులకు పెరిగినవి. ఇది చూచినయెడల రైళ్లవలన హిందూదేశ వ్యాపారము చక్కబడిన ట్లగపడును. కాని ఈ ఎగుమతులవలన దేశజనులను హైందవులను పరదేశవస్తువుల కొనుటకు సిద్ధము చేసినవి. 1856 సం||న వారు రెండుకోట్ల ముప్పదిలక్షల నవరసుల విలువగల పదార్థములను ఎగుమతిజేసి రెండుకోట్ల ఏబదిరెండు లక్షల విదేశవస్తువులను గొనిరి. ఈ విదేశవస్తువులలో తాము పంపిన ముడిపదార్థములలో తయారైనవి చాలగలవు. ఎగుమతిదిగుమతులు రైళ్లమీదుగా జరుగునప్పుడు, దేశీయుల లాభనష్టములకంటె తెల్లవర్తకుల లాభనష్టములనే యెక్కువగ పాటించి రేట్లు నేర్పఱచియుండిరి. ముడిపదార్థములు దేశముయొక్క మధ్యభాగములనుండి రేవుపట్టణములకు ఎగుమతులకై పంపునప్పుడు తక్కువరేట్లును, రేవులనుండి దిగుమతులను దేశాంతర్భాగములకు దీసికొనిపోవునప్పుడును తక్కువరేట్లను రైళ్లపాలకులు నియమించిరి. రైళ్లపాలకులు తెల్లవారు ముడిపదార్థములను కొని దేశాంతరములకు దీసికొనిపోవువారు తెల్లవారే. దేశాంతరములనుండి విదేశవస్తువుల దిగుమతి చేయువారు వారే. అటువంటి పదార్థములమీద తక్కువరేట్లు విధించుటచేత ముడివి చవకగా తెల్లవారికి లభించుటేగాక, వారు ముడిపదార్థములను గుత్తగొని పోవుటకును విదేశవస్తువుల దెచ్చుటకును హెచ్చరి

(నను కొల్పును. ఈ పదార్థములనే దేశములోపల నొక చోటినుండి మరియొకచోటికి గొనిపోయినయెడల హెచ్చురేట్లు పుచ్చుకొనబడును. ఇదియును ముడిపదార్థముల యెగుమతికే బలపడుచును. దేశములో తయారైన వస్తువులను దేశాంతర భాగములకు గొనిపోవుటకు నగిన హెచ్చురేట్లు; విదేశవస్తువులను రేవులనుండి దేశములోనికి దీసికొని పోవుటకు తగ్గురేట్లు. ఇందువలన దేశీయవస్తువులకంటె పరదేశ వస్తువులు చవకగ నమ్మబడగలవు. "దేశాంతర్భాగమునగల రేట్లకంటె రేవులదగ్గఱ రేట్లు నూటికి కేబదివంతున తగ్గించుటవలన ఇండియాలో తోళ్లుఊనుపనికి నిజముగా నిరుత్సాహము గలిగినది! విదేశవస్తు నిర్మాతలకు, హిందూదేశములోమాత్రము దొఱకు కొన్ని ముడి పదార్థములు హస్తమున జిక్కిపోయినవి." అని యిండస్ట్రియల్ కమిషన్‌వారు సయిత మొప్పుకొనిరి.

రైళ్లనిర్మాణముతోబాటు దొరతనమువారు హిందూదేశమందలి బొగ్గు, యినుపగనులను త్రవ్వించినయెడల చాల లాభము గలిగియుండెడిది. ఈ రైళ్లకైన ఖర్చుకూడ నూటికి కేబదివంతున తగ్గియుండును. ప్రపంచములో నేదేశముకన్నను హిందూదేశమున మిక్కిలి హెచ్చుగా ఇనుపగను లుండియు, లోహపరిశ్రమము శూన్యమై యుంట విపరీతము గాదా! మీదుమిక్కిలి పూర్వపు కర్మకరులు కరవులపాలు కాగా 25 కోట్ల రూపాయల యినుమును మనము పరదేశములనుండి కొనుక్కొనుచున్నాము.

రైళ్లు హిందూదేశమునకు మహోపకరణములను భ్రమతో మురియుచున్న మనము వారి పరిపాలనమును గూర్చియు నొకింత దెలిసికొందముగాక. రైళ్లువేయు కంపెనీ లన్నియు విదేశీయులవి. ఈ కంపెనీలవారితో ఇండియామంత్రిగారు కొన్ని నిబంధనలను గుదుర్చుకొని రైళ్లను వేయించుచున్నారు. రైళ్లకంపెనీలవారు రైళ్లను నిర్మించి వానిని నడుపుదురు. అందులకుగాను పెట్టుబడి సొమ్ము మీద అప్పటియందు రేట్లప్రకారము నూటికి 5, 4½ లేక 4½ లాభమునకు దొరతనమువారు హామీని యిచ్చెదరు. ఉచితముగా కావలసిన స్థలము నొసంగుదురు. ఎప్పుడుగాని రైలుకంపెనీలవారికి, ఖర్చు లన్నియు బోను, హామీపడిన పరిమితికి మించిన లాభమువచ్చే యెడల, ఆ హెచ్చువచ్చిన సొమ్ములోసగము; దొరతనమువారు హామీ క్రింద తత్పూర్వమిచ్చియుండిన సొమ్మును తిరిగి చెల్లించుటకు వినియోగింపవలయును. మిక్కిలిసగము భాగస్వాములు పంచుకొందురు. ఈ రైళ్లు 99 సంవత్సరములవఱకు కంపెనీలకు కౌలు కీయబడిన ట్లుంచబడును. ఆ పిమ్మట న్యాయ్యమైన ధరలకు వానిని దొరతనమువారు కొందురు. ఒకవేళ 50 సంవత్సరములు గాని, 25 సంవత్సరములు కాలపరిమితి ఏ కారణముచేతనైనను దొరతనమువా రీ రైళ్లను దీసికొనగోరినచో, షరతులప్రాప్తిని కంపెనీవారికి లభించియుండు వడ్డీఆసలుఖాయిదాల నిచ్చి తీసికొనుటకు దొరతనమువారి కధికారముండును. ఈ షరతులతో ప్రథమమున రైళ్లు ప్రారంభింపబడినవి.

దొరతనమువారు రెట్టి హామీ నీయకుండ రైళ్లువేయించుపద్ధతికై ప్రయత్నములు జరిగి 1863 సంవత్సరములో పెట్టుబడికే ధనసహాయము నిచ్చున ఏర్పాటుచేసిరి. ఇండియన్ బ్రాంచి రైల్వేకంపెనీ ఇండియన్ ట్రాంకంపెనీలకు 20 సంవత్సరములకు మైలురైలురోడ్డుకు 100 పవనులును, పెద్దవంతెనలు కట్టునెడల అనగా 10 వేల పవనులు మించి ఖర్చగు వంతెనలకై ప్రత్యేకసహాయము నిచ్చునటుల దొరతనమువా రొప్పుకొనిరి. కాని యీ పద్ధతి ఫలప్రదము కానందున తిరిగి హామీపద్ధతియే యవలంబింపబడినది. కావున హామీపద్ధతియొక్కటే 1869 సంవత్సరమువఱకును ఆచరణలో నుండినది.

1869 సంవత్సరములో దొరతనమువారే కొన్నిరైళ్లను వేయ మొదలిడిరి. 1880 వఱకు రైల్వే కంపెనీలచే వేయబడిన రైల్వే 6,128 మైళ్లును, దొరతనమువారు స్వయముగ వేయించిన రైల్వే 2,175 మైళ్లును దేశమున వ్యాపించినది. కాని యింక 5000 మైళ్ల రైలురోడ్డు అత్యవసరమనియు లేనియెడల దేశమున నడివడిగ వ్యాపించుచున్న క్షామముల నాపుట కష్టమనియు క్షామవిచారణ సంఘమువారు 1880 సంవత్సరములో సలహా నిచ్చిరి. దొరతనమువారు స్వేచ్ఛగా ఋణములుచేసి రైళ్లువేయుట మంచిది గాదని తిరిగి హామీపద్ధతి మీద రైలుకంపెనీల ద్వారా రైళ్లు వేయింపసాగిరి. ఈరైళ్లు 25 సంవత్సరముల పిమ్మటగాని, తరువాత 10 సంవత్సరముల గడువులోగాని దొరతనమువారు తగినఖరీదు నిచ్చి కొనవచ్చునని యేర్పాటు చేసిరి. ఈసారి హామీరేటు వేరువేరు రైళ్లను వేరువేరుగా నూటికి 4 మొదలు 2½ వఱకును నిర్ణయింపబడినది. ఇట్లు హిందూదేశమందున్న రైళ్లు వివిధములుగా నున్నవి: వానిలో ముఖ్యములగునవి దొరతనమువారివై దొరతనమువారిచేతనే నడుపబడునవి. (నార్త్‌వెస్టర్న్ రైల్వే; ఈస్టర్న్ బెంగాల్ రైల్వే; ఔధ్ అండ్ రోహిల్‌ఖండ్ రైల్వే)

2. దొరతనమువారికే చెందిన రైల్వేకంపెనీవారిచేత నడుపబడునవి: వీనిని నడిపినందులకు కంపెనీవారు పెట్టుబడిమీద కొంతకక్కు దొరతనమువారు హామీని యిత్తురు. అనగా దొరతనమువారు లాభమునకు హామీపడుచు తమ రైళ్లను రైలుకంపెనీవారికి కౌలు కిచ్చిరనవచ్చును. (ఈస్టిండియన్ రైల్వే; గ్రేట్ ఇండియన్ పెనిన్సులా రైల్వే; బరోడా అండ్ సెంట్రల్ ఇండియా రైల్వే; మదరాసు అండు సదర్న్ మహారాట్టా రైల్వే; అస్సాం బెంగాల్ రైల్వే; బెంగాల్ నాగపూరు రైల్వే; సౌతిండియన్ బర్మా రైల్వే).

3. ప్రైవేటు రైల్వేకంపెనీవారివి: (బెంగాల్ అండ్ నార్త్ వెస్టర్న్ రైల్వే; రోహిల్‌ఖండ్ అండ్ కుమాయూన్ రైల్వే; సదర్న్ పంజాబ్ రైల్వే.

4. డిస్ట్రిక్టు బోర్డులవారివై రైల్వేకంపెనీలచే నడుపబడునవి ఇవి అంతగా పెద్దవిగావు. మన రాజధానిలో ప్రస్తుతము 5 జిల్లా బోర్డులవారు 263 మైళ్ల రైల్వేవేసియున్నారు. 909 మైళ్లు రైల్వే మరి 18 జిల్లాబోర్డులవారును వేయ ప్రయత్నించుచున్నారు

# సినెటు మెంబరులు

Miss. De la Hay



మిస్ డి లా హే

Miss. Macdonald



మిస్ మెక్డొనాల్డ్, మిషనరీ లేడీ

Miss. Sreenivasam, B. A., L. T.



శ్రీమతి శ్రీనివాసం, బి. ఏ., ఎల్. టి.

Mrs. Sithamma



శ్రీమతి సీతమ్మ

Sri Sarada Samajam – Anantapur



అనంతపురములో శ్రీ శారదాసమాజపు ద్వితీయ వార్షికోత్సవము

Temple of Marulare



దేవాలయ గోపురము, మరుటేరు

దీనికంతటికిని చాల ధనము కావలసియున్నది. దొరతనమువారు చాల ధనము పెట్టుబడి పెట్టియున్నారు. 1918-1919 సంవత్సరమువఱకును దొరతనమువారి పెట్టుబడి సొమ్ము 555¾ కోట్ల రూపాయలకు పైగానున్నది. ఇదిగాక 24 కోట్లు రైల్లకంపెనీవారు వేసిన రైల్లను దీనికొనునప్పుడు పెట్టుబడి క్రింద సంవత్సరవాయిదాలు వారికిచ్చి యున్నారు. 8 కోట్లు కంపెనీవారల యొద్దనుండి కొన్న సామానులు వగైరాల విలువయును, ఇంతవఱకును దొరతనము వారు రైల్లు కనుగొనుటకై ఖర్చుపడియున్న సొమ్ము అప్పులమీద దొరతనమువారు భరించిన వడ్డీ వగైరాలును, మొత్తము 280 కోట్లు-అనగా మొత్తము 312 కోట్లు పైన దొరతనమువారి పెట్టుబడిగా నీయబడిన 555¾ కోట్లకు చేర్చవలయును. అప్పుడు రైల్లమీద దొరతనమువారి పూర్తి పెట్టుబడి సుమారు 867¾ కోట్ల రూపాయ లగుచున్నది. మన దొరతనమువా రింత సొమ్మును పెట్టుబడి పెట్టగా రైలుకంపెనీలు పెట్టుబడి పెట్టినది సుమారు 62 కోట్లు మాత్రమే. ఇండియా ప్రభుత్వము చాల పేదది. ఇంతసొమ్ము ఎచ్చటనుండి తెచ్చుచున్నది యని యడుగవచ్చును. వ్యష్టిపురుషు లప్పు దీసికొనునటులనే దొరతనము వారును అప్పుచేయుచుందురు. ఇంగ్లాండులో 300 కోట్ల రూపాయలు ఇండియాలో 17 కోట్లు వారు అప్పు చేయుచుందురు. ఇటుల దొరతనమువారు చేయు ఋణములను ముప్పాతికవంతు రైల్లకొఱకే.

దొరతనమువారికి వచ్చు ఆదాయములో భూమిపన్నే యెక్కువైన దనియు వ్యయములో మిలిటరీ ఖర్చే యెక్కువ యనియు ప్రజల యభిప్రాయము. కావుననే శాసనసభ్యులును, విద్యాధికులును, సుద్యోగులును రైల్లపరిపాలనను గూర్చి యంతగా విచారింపరు. కాని దొరతనమువారికి 1918-19 సంవత్సరములో భూమిపన్నులవలన 34½ కోట్లాదాయము రాగా రైల్లవలన 86¼ కోట్లాదాయము వచ్చినది. మొత్తపు ఆదాయములో నూటికి 35 వంతులు రైల్వేలవలని సంపాదనే. ఖర్చులో గూడ నూటికి 32 వంతులు రైల్లకొఱకునగే. మిలిటరీ ఖర్చు 46 కోట్ల 6 లక్షలు కాగా 42 కోట్లు రైల్వే పరిపాలనది.

ఉద్యోగము లిచ్చుటలో గూడ నన్ని డిపార్టుమెంటులలోను దేశీయులకును తెల్లవారికిని భేదము చూపబడుచున్నది. ఉన్నత శాఖ (సుపీరియర్ సర్వీసు), నిమ్న శాఖ (సబార్డినేట్ సర్వీసు) అని రెండు తరగతుల ఉద్యోగులు గలరు. నెలకు 200 రూపాయలకు పైగా పుచ్చుకొనువారు మొదటి తరగతివారు. వీరి పరమావధి నెలకు 3500 రూపాయలు. దొరతనమువారి పాలనములో నున్న రైల్లమీద నిట్టి యున్నతోద్యోగులు 447 మంది గల రనియు వారిలో 45 గురు మాత్రమే హిందూదేశీయులు గల రనియు పబ్లికుసర్వీసు కమీషనువారు (1912-1915) తమ రిపోర్టులో తెలిపియున్నారు. ఈ 45 గురిలోను 800 రూపాయలకు పైగా జీతము గొనువారు 11 మందియే నట. తక్కినవారు తెల్లవారు. వారిలో 372 మందికి 172 ర 800 రూపాయీలు పైగా పుచ్చుకొను వారు. పరమావధిగా నున్న 2500 రూపాయీల పుచ్చుకొను దేశీయోద్యోగులు లేనే లేరు. 1918 సం. జూను నెలలో దొరతనమువారి రైల్లన్నిటిమీదను గల సుపీరియరు సర్వీసులో 1408 మంది యుద్యోగు లున్నారు. వారిలో 166 మందిమాత్రమే దేశీయులు; వీరును సాధారణముగా ప్రారంభదశలో నున్నా రని యెఱుంగవలయును.

సబార్డినేటు సర్వీసులోమాత్రము 685965 మంది నౌకర్లకు 668805 మంది దేశీయు లుండ తక్కిన 17160 మంది తెల్లవారు గలరు. దీనిలో 7 రూపాయల వారుకూడ నుండుటచే తెల్లవారు తక్కువగా నుంటకు కారణము. ఈ తరగతిలో పై యుద్యోగములకే వారు వత్తురు. మఱియు రైల్వే యున్నతోద్యోగులు తమక్రిందనున్న సబార్డినేటు సర్వీసులోనివారిని డిస్మిస్ చేయుటకు, ప్రామోషను చేయుటకు, బదలాయించుటకు, సెలవులు మున్నగున విచ్చి యనుగ్రహించుటకు పూర్ణాధికారమున్నది. ఇట్టి అధికారము ఐ. సి. ఎస్. లకును లేదు. సుపీరియరు సర్వీసు రైల్వేయుద్యోగులు ఉన్నతవిద్యావిశారదు లగుట సత్యము. ఈపని కెంత ఖర్చగునని గణితములు వేయుటలోను, ఈపని నిట్లు చేయుండని సూచన లొసగుటలోను నెక్కుడు చాకచక్యము గలవా రనుట నిజము. అయినను వీరును నరులే. సబార్డినేటు సర్వీసులోని నౌకర్లును వీరివలె జీవితావశ్యకములు సమకూర్చుకొన వలసినవారే. కావున సందఱికిని జీవితావశ్యకములకు లోటులేని జీతముల నిచ్చి, ఉన్నతోద్యోగుల నున్నత విద్యాకౌశలముల కనువుగ ప్రత్యేకము మఱికొంత హెచ్చువేతనములను నిచ్చుట ధర్మము. కాని జాతిభేదముచేసి యీరెండు తరగతులందును ఉద్యోగముల నిచ్చుటయు, అందునను హస్తిమశకాంతరములు గల్పించుటయు నక్రమము. ఇట్టి విపరీతస్థితి మఱేదేశమందును గానరాదు. యూరోపుదేశములలో సబార్డినేటు సర్వీసులోని ప్రారంభ జీతమునకు 22 రెట్లకు మించి యే యున్నతోద్యోగికిని సామాన్యముగ జీత మీయరు. నార్వే, బెల్జియము దేశములలో నీ భేద మింకను తక్కువ. ఎనిమిదిరెట్లే వార. మఱియు దొరతనమువారి సేనలోనే క్రిందితరగతి ఉద్యోగులకు ప్రజలకును తెల్లవారికి హీరవు(?) లేనిరొండల(?) వ్యాయము లభించుట లేదు. ఇట్లుండ నిరంకుశాధికారు లగు రైల్వేదొరలు దాదాపు ఏడులక్షల దేశీయులకు దమ యేలుబడిక్రింద నన్యాయ్యము జఱిగించుచున్నా రనిన యబ్బుర మేమున్నది? ఎందుకు కొఱగాని దొర యున్నతోద్యోగపదవిని నాయ మాత్రము కష్టించుట. కావలసినపని సంతను నిర్వహింపుచు సగౌరవముగా హింసలను భరించుచు దేశీయులు వారిక్రింద పనిచేయుచుండుటయు సర్వసామాన్యము. ఇటుల జాతిభేదపాలనము సాగుటవలన హైందవులు సంపాదనలందే గాక మానప్రాణములందు నైరము కదు దీనస్థితికి వచ్చుచుండిరి. ఆత్మగౌరవము రూపుమాయుచున్నది. ఉద్యోగాభిలాషులై చదువుల కేర్పడు యువకులు లక్షలకొలది నిట్లు భంగపడుచుండుట జేరాళిక్వమే. దొరతనమువారి యుత్తరవులు జారిచేయుటలో లోపము లేదు. 1870 సంవత్సరమున నొకసారియు 1878 సంవత్సరమునను ఇండియామంత్రిగారు రైల్వేవిద్యాశాఖయందలి యుద్యోగము లన్నిఁటిని పొందుటకు హైందవు

లర్హులై యుందురని యుత్తర్వుల జేసియుండిరి. దేవునివర మున్నను పూజారివర మెక్కడ? ఉద్యోగుల నియమించు స్థానికాధికారుల యిష్టములో సర్వమును విడిచినప్పు డెట్టి యుత్తర్వులున్న నేమి లాభము? గుత్తగొనినటుల నున్నతోద్యోగము లన్నియును తెల్ల వారికై ప్రత్యేకింపఁబడుచున్నవి.

1912-1913 సంవత్సరములో దొరతనమువారు స్వయముగ నడుపుచుండిన రైల్వే యుద్యోగులలో 250 రూపాయలకు దాటిన జీతముగలవారు 500 గలరు. వారిలో 455 తెల్లవారును 42 లక్షల రూపాయల జీతములను పొందగా, తక్కిన 45 గురు దేశీయో ద్యోగులును 3 లక్షలరూపాయల జీతమును మాత్రము పొందఁగల్గిరి. స్వదేశ ప్రభుత్వములచే నడుపబడు రైల్వే యుద్యోగులు 43 రు గలరు. వారిలో తెల్లవారు 32 రు $2\frac{1}{2}$ లక్షల జీతము ననుభవించిరి. దేశీయులు 11 మందియును 37 వేల రూపాయల జీతము ననుభవించిరి. ఇఁక రైల్వే కంపెనీల పరిపాలనలో సర్వము నన్యాయమే. ఈ కంపెనీల యుద్యోగులు 1116 మందిలో తెల్లవారు 1088 మంది 1 కోటి 3 లక్షల రూపాయలును, దేశీయులు 28 మంది $1\frac{1}{2}$ లక్షల రూపాయలను పొందిరి.

దేశీయులలో నుద్యోగార్హులు లే రందురా? పనుల నన్నిఁటిని నెరవేర్చువారు వీరే! అనుభవమునకు లోటులేదు. శాస్త్రజ్ఞానమునకు కొఱఁతలేదు. అయినను ఉత్తరువులపై సంతకములు చేయుటకును హెచ్చువేతనము పొందుటకును వీరు పాత్రులుగారు. దీని రహస్యమును రైల్వేబోర్డు సెక్రటరీగారగు "రైయన్" గారు రాయల్ కమీషనువారి యెదుట 1913 సం. నవంబరు 13 తేదీని దెలిపియున్నాడు. రైల్వే యుద్యోగులను యూరోపియనుల నుండియు ఆంగ్లోయిండియనుల నుండియు నియమించు నావశ్యకత దేశక్షేమము కొఱకట! సైనికనీతిని బట్టి చూచినను, దేశశాంతికొఱకును యూరోపియనులను విశ్వాసార్హపదవులం దుంచుటయు, నేటివులను దూరమున నుంచుటయు నావశ్యకమట! దొరతనమువారి రైల్వేలయందే గాక స్వదేశసంస్థానములవారి రైల్వేలయందును నీ పద్ధతియే సాగుచుండుట తన వాదమునకు సాక్ష్యమని రైయన్‌గారనిరి. దేశీయులందు జూపబడు నీ యవిశ్వాసము అక్రమము అన్యాయ్యమునైయున్నది. లెక్కలేనన్ని సందర్భములలో దేశీయులు తమ రాజభక్తిని,విశ్వాసార్హతను ఋజువు చేసియున్నారు. ఉద్యోగధర్మ నిర్వహణమునకు ప్రాణమానధనముల నర్పించియున్నారు. ఆత్మగౌరవమును దేశాభిమానమును గూడ బలి యిచ్చియున్నారు. ఇటీవల జరిగిన ఘోరసంగ్రామమునకు భారతీయులు జూపిన శౌర్య పరాక్రమములు విశ్వాసార్హత, త్యాగము, శాంతము, ఓర్పు సౌశీల్యనిధులును తెల్లవారే గ్రహించి పలికియున్నారు. 1917 సం. ఆగష్టు 20 తేదీ నొసంగిన చక్రవర్తిగారి యాదేశ మున్నది. మాంటేగు-ఛెమ్సుఫర్డ్ సంస్కరణములు లున్నవి; 1919 సం. డిశంబరు మహాప్రకటన మున్నది. రాయలు కమీషనుల సలహా లున్నవి. ఎన్నియున్న నేమి? కార్యలు యథాప్రకారమే! ఇట్టివి ఇంకను అనేకములు దేశీయ స్వత్వనిరోధక పద్ధతులు కలవు.

1870 సం. లోనే ఇండియామంత్రి హైందవులకు తెల్లవారితో సమానముగా వసతుల నీయవచ్చునని యుత్తరువులు చేసి యుండగా 50 వత్సరములు గడచినను ఫలితము లేదు. ఎన్ని కమీషనులు పెట్టిననేమి? ఎన్ని విచారణలు జరిపిననేమి? ఎన్ని సలహాలను వారొసంగిననేమి? వాని నాచరణలో పెట్టింపగల సాధనము లేనప్పుడు కాగితములలో తియ్యనిపలుకులు ఉన్న లాభమా?

సర్ విశ్వేశ్వరయ్యగారు తెలిపినటుల రైల్వేపరిపాలనము పూర్తిగా దొరతనమువారి పాలనములోనికి దీసికొనిన యెడల కొన్ని కష్టములు నివారణ కాగలవు. సరిహద్దులందు సైనిక వ్యవహారములకు తోడ్పడవలయు నొకటిరెండు రైల్వేలు తప్ప తక్కినవి రాజధానీ గవర్నరుల పాలనమున నుండవలయును. అప్పుడుగాని కష్టముల గూర్చి వెంటవెంటనే విచారించుట-వానినివారించుట-ప్రజాభిప్రాయమును దొరతనమువారు బాగుగ దెలిసికొనుట - పొసగదు. సైనిక వ్యవహారములలో దేశరక్షణమునకై వేవేగము సంచలనమున కనువగు నటులను అట్టి సంచలనము ఇండియా గవర్నమెంటువారికి లోబడి యుండు నటులను సరిహద్దుల రైల్వేలను ఇండియా గవర్నమెంటువారే పాలింపవచ్చును. అందుకొఱకొక మంత్రినిగాని- మెంబరునుగాని నియమించవచ్చును. తక్కిన సామాన్యపు రైల్వేలు రాజధానీ గవర్నమెంటువారి పాలనములో మంత్రుల యధీనమం దుంచుట యుక్తము.

ఈ దేశపు రైల్వేలను నడుపుటలో పాలించుటలో దేశీయులు హెచ్చుగా పాల్గొనుట ధర్మము. ఇందుకు వేనవేలు ఉద్యోగులు కావలసియుందురు. వారికి తగిన తరిబీదును విద్యయు నొసగుట దొరతనమువారి ధర్మము. కావున దేశీయ విశ్వవిద్యాలయములలో మెకానికల్ యింజనీరింగు లోకో ట్రాఫిక్ లెక్కలశాఖలందు అత్యుత్తమ విద్యలను నేర్పవలయును. రైల్వే స్కూళ్లలో ఫోర్మన్, మెకానిక్స్, మున్నగు పనివాండ్రను, జాతి మత భేదము చూపక, తరిబీదుచేయు చుండవలెను. క్రొత్తరైల్వేలు వేయుటకును-పాతరైల్వేలను దొరతనమువారు దీసికొనుటకును వలయుధనమును సేకరించుటలో దేశీయులలో ధనికులను ప్రోత్సహింపవలయును. అట్టి పనులకై స్థానికసమితు లేర్పడుటకుగాను దొరతనమువారు స్థలధనములను, సలహాలను విరివిగా నొసంగుచు దేశీయుల నెల్లవిధముల ప్రోత్సహింపవలయును.

మన రాజధానిలో కోయంబుత్తూరు, గుంటూరు, కృష్ణ, సేలము, తంజావూరు జిల్లాబోర్డువారు 265 మైళ్ల రైల్వేను వేసియున్నారు. 904 మైళ్ళ రైల్వేను వేయ సమకట్టియున్నారు. ఇందుకై వారు 77 లక్షల రైల్వే పన్నును ప్రోగుచేసినారు. తక్కిన జిల్లాబోర్డులవారును నైజాము నమునకెంచి 600 మైళ్ళ రైల్వేను వేయ సమకట్టి 60 లక్షలరూపాయల పన్నును ప్రోగుచేసి యుంచిరి. ఈ యుద్యమములు చాలకాలమునుండి ఫలరూపము దాల్చకుండ సౌత్ ఇండియన్ రైల్వే కంపెనీవా రభ్యంతర పెట్టుటవలన, తమ వ్యాపారమునకు నష్టమును దెచ్చునని వారు వారించుట వలన, ప్రజాలాభకర మగు నీపని యాగిపోవలసి వచ్చుచున్నది. కొన్ని విషయములలో నీ కంపెనీవారు మితిమీరి యక్రమముగా

నష్టపరిహారమును గోరుదురు. కొన్నిపట్ల దానికిని - అన్నియు వారి కనుకూలముగా నిర్ణయమైనను - చిరకాలము పని సాగనీయరు. కావున నెట్టి కష్టనష్టములకైన నోర్చి రైల్వేకంపెనీల యాతంకముల నంత మొందించుట శ్రేయస్కరము. ఇండియాదొరతనమువారి పెట్టుబడి లాభనష్టముల బాధ్యత యెంత యెక్కువ యున్నను, కంపెనీవారల భాగము స్వల్పమైనను కంట్రాక్టుషరతులు వారి కిష్టమువచ్చినట్లు ఇంగ్లాండులో నిర్ణయింపబడుటవలన చిక్కులు పెక్కులు గలుగుచున్నవి. రాజధానిదొరతనమువారు ఋణమును పుచ్చుకొన్న నెంచిన యెడల ధనము దొరకదను సందియ మెంతమాత్రమును లేదు.

యూరపునందలి పశ్చిమదేశములు మూఢజనులచే నిండియుండి పరిశ్రమల నెట్టివో యెఱుంగని ప్రాచీనకాలమున హిందూదేశమున చిత్రకళలు పరిశ్రమలు మహోన్నతదశ నందియున్నవి. ఆ కాలపు రాజులు పరిశ్రమల నెన్నో విధముల పోషించెడివారు. శిల్పులను పారిశ్రామిక ప్రజలను పోషించుట రాజు ప్రధానధర్మములలో నొకటి. ఇండస్ట్రియల్ కమిషన్‌వారు వ్రాసినటుల యూరోపు వర్తకులు ఇండియాకు వచ్చినప్పటికిని హిందూదేశ పరిశ్రమ లున్నతదశయందే యున్నవి. యూరోపులో నాగరకమునకు పేరెన్నికగన్న యేదేశముతోను ఇండియా తీసిపోలేదు. అప్పటికి యూరోపులోను ఇండియాలోను గూడ, స్వీయపరిశ్రమలను విదేశపుపోటీవలన చెడిపోకుండ గాచు సంస్థలు విరాజిలుచుండెను. అచ్చటి "గిల్డు" లనబడు ప్రతిష్ఠాపనలును, ఇచ్చటి కులకట్టులును పరిశ్రమలను జక్కగ గాపాడుచుండెడివి. ఇట్లుండగా నొకదేశమునకును మఱొకదేశమునకును రాకపోకలు విరివిగా సాగి, వివిధజాతు లేక ప్రదేశమున గలియుట సంభవించినది. వాణిజ్యవ్యాపారములు వ్యాప్తి నందినవి. సాంఘికనియమములకును, మతాచారములకును సంఘర్షణము హెచ్చినది. రాజకీయ స్వాతంత్ర్యమునకై పెనగులాటలు మిక్కుటమైనవి. పరిశ్రమలకును కళలకును పోటీ హెరిగినది. సామాన్యప్రజల పీడనము దుర్భరమైనది. యూరోపునందు విప్లవములు తలచూపినవి. అందుగడలో నున్న నైసర్గికపరిస్థితుల సహాయమున ప్రతిసంఘమును స్వరక్షణకై క్రొత్తక్రొత్త ప్రతిష్ఠాపనల నెలకొలుపసాగి తదితరులను నిరసింప నారంభించెను. ఎచ్చటజూచినను అశాంతి, తీవ్రత, ఆత్మరక్షణ పరాయణత గాంచనయ్యెను. పరిశ్రమాభివృద్ధికి వలయు భౌతికశాస్త్రములు ఇదివరకెన్నడు నుండలేదు. వానినెఱుగక యంగీకరించుటకు ప్రజల కోపిక లేదు. అందుగడలో నున్న విధానము నెల్ల ప్రయోగించి సామాన్యప్రజలు వృద్ధికై తహతహపడసాగిరి. ఈదశయే విప్లవము. విప్లవమనగా తిరుగుబాట్లు గాదు. విప్లవ మనగా రాజద్రోహము గాదు. విప్లవమనగా అరాజకము గాదు. ప్రాతపద్ధతులను నిరసించి నూతనమార్గముల నవలంబించి యప్పటి ప్రస్తుతస్థితిని వేవేగము మార్పజాలుటే విప్లవము.

ఇట్టిస్థితిలో ఈస్టిండియాకంపెనీవారు హిందూదేశమున దిగిరి. తమ దేశములోని వస్తువులను ఇండియాకు దెచ్చి, ఇక్కడివానిని దమ దేశమునకు గొనిపోయి వర్తకము చేసికొనుటే వారి ప్రథమోద్దేశము. హిందూదేశపు వస్తువులను ఇంగ్లాండులో అమ్మి మితిలేని లాభమును ఇతరులు పొందుచు తమధనరాసుల నపహరింపుచుండగా ఆంగ్లులు సహింపలేకపోయిరి. ఆధనప్రవాహముల పోకడ నాపి తామే యావద్వర్తకలాభమును పొందవలయును నని వారి సంకల్పము. వారి కప్పుడు తమపరిశ్రమల నున్నతికి దేగలుగుదుమను విశ్వాసముగాని, సామ్రాజ్యమును నిర్మింపగల్గుదుమను పేరాస గాని లేదు. హిందూదేశముతోడి వర్తకమే వారి పరమావధి. హిందూదేశ నాగరికమును చవిజూచుటే వారి చరమగమ్యము. అన్నివిధములను హిందూదేశము వారి యాదర్శమూర్తియై వెలసినది. ఈ కాలమున హిందూశిల్పములను పరిశ్రమలను మోటు వని పలుకు ఆంగ్లులు హిందూదేశమున తయారగు పట్టుబట్టలను దూదిబట్టలను అనుకరణమునను మించినవని విలపించిరి. వీనిని తమదేశమునకు రాకుండ నాపినగాని, తమపరిశ్రమలకు పోటీ లేకుండ నొనర్చినగాని, ఆంగ్లపారిశ్రామికజనులు బ్రతుకలే రని ఘోషించిరి. హిందూదేశమనిన వారికి మత్సరము మితిమీరినది. కర్మవశమున నిండియాదొరతనము ఆంగ్లులచేతిలోనికి రాసాగినది. హిందూదేశవస్తువులు ఇంగ్లాండుపోకుండ నాపుటే గాక, ఇంగ్లాండులో తయారైన మోటువస్తువులను దమ చేతినున్న రాజకీయాధికారము నుపయోగించి యీదేశమునకు బలాత్కారముగ దిగుమతి చేయ గడంగిరి. అట్టి దిగుమతులకు దొరతనమువారు తోడ్పడుచుండిరి. ఆ దిగుమతులతో పోటీకి నిలుచు దేశీయవస్తువుల యుత్పత్తికి ఆతంకములను గల్పింపసాగిరి.

ప్రకృతిశాస్త్రము లభివృద్ధి గాంచుచు నానిజ్ఞానము పాశ్చాత్యపరిశ్రమల కెంతగు ప్రయోగింపబడుచుండగా, మనదేశమున నట్టి యవకాశములు కల్లలైనవి. పూర్వపద్ధతులు నిరసింపబడుచుండెను. నూతనవిధానములు నెలకొల్పువారు లేరు. విద్యావిధానము పరదేశీయుల హస్తగతమైనది. వారికి హిందూదేశపరిశ్రమ వాణిజ్యాభివృద్ధి గిట్టదు, కావున హిందూదేశీయులు స్వయముగ బ్రారంభించిన నూతనపరిశ్రమలు నష్టమయినవి. తగినప్రోత్సాహము లేక చెడిన వానిలో దక్షిణహిందూదేశపు లోహపరిశ్రమలు ప్రధానములు. ఈ విఫలప్రయత్నముల నాధారము చేసికొని విపరీతసిద్ధాంతములు కొన్ని తలజూపినవి. ఉష్ణదేశములు సాధారణముగా సారవంతములగు క్షేత్రములు గలిగియుండి, చక్కని వర్షపాతమును పొందుచు పంటల కనుకూలముగ నుండును. కాబట్టి ఉష్ణదేశవాసులు వ్యవసాయము చేసి ముడుకపదార్థములను ఉత్పత్తిచేయవలసిన వారు. సమశీతోష్ణదేశములవారు ఆ ముడుకపదార్థములతో పారిశ్రామిక వస్తువులను తయారు చేయవలసినవారు. ఇది నైసర్గికధర్మమని కొందఱి వాదన. ఈవాదమునే కొందఱు అంగీకరించి దొరతనమువారు ప్రవర్తించుచున్నారు. వారు ముడుకపదార్థముల యుత్పత్తిని, వాని యెగుమతిని, సిద్ధవస్తువుల దిగుమతిని ప్రోత్సహింపుచున్నారు. ఈ విధానము సాగునటులనే రైళ్లను నిర్మించి పాలింపుచున్నారు.

పూర్వము ప్రతిగ్రామమును దనకు గావలసిన యాహారపదార్థములను పండించెడిది. తక్కిన జీవితావశ్యక పదార్థములను కనిష్ఠసం

ఖ్యకు దెచ్చి సమీపప్రదేశముల నుండి సంపాదింపుచుండెడిది. ఒక గ్రామము వస్తువులు ఆ గ్రామములోనే సాధ్యమైనంతమట్టుకు తయారగును. తమ యావశ్యకతకు సరిపోగా మిగిలిన వాని నమ్మి, దూర స్థలములనుండి వచ్చు భోజ్యపదార్థములఁ గొనెడివారు. అప్పుడు వ్యాపారకేంద్రస్థానములై భోగలాలసా నిలయములై వెలయురేవులు, నగరములు బహుస్వల్పముగ నుండెడివి. ఇప్పుడు వెండిబంగారములు నగిషీచేసిన వస్త్రములు పాత్రలు, అలంకారములు, కొన్నియౌషధములు మాత్రము దూరదేశములకు పోగల్గెడివి. ఆకాలము విశేషము లిట్టివి పెక్కులు.

ఇప్పుడు రైల్లు ఇట్టిస్థితి నంతను మార్చివేసినవి. పండినయూరు పండనియూరు సమమైనవి. చిత్రకరులున్న నగరము లేని నగరము నొక్కటే. దేశముననున్న సంపద దూరమగును. దూరమున నుత్పన్నమగు యాంత్రికవస్తువులు దేశమున నిండును. పల్లెలందలి సామాన్యజనులు భోగాభిలాషు లగుచుండిరి. కలవారికలిమి వారిభోగములకు జాలదు. ధనమెల్లెడల నున్నట్లే గాన్పించును గాని దారిద్ర్యము ప్రజల బీడించుట హెచ్చైనది. కలవనిని లేనివానిని దుర్వ్యయముల పాల్సేసినవి. రైల్లు, విదేశవస్తుచయము అర్వాచీన కాలమహిమను బట్టి వచ్చిన రైల్లు మున్నగున వనివార్యములై పోయినవి. మఱియు నవి జీవితావశ్యకములు నైనవి. గ్రుడ్డిలో మెల్ల యనినట్లు, మన పరిశ్రమలను వెంటనే యభివృద్ధికి తేజాలకున్నను రైల్లుపరిపాలనము దేశీయుల కనుకూలముగ నొనర్చు మార్గములకై విచారణలు సాగుచున్నవి. అందు ముఖ్యముగ నీక్రింది సూచనలు గాన్పించుచున్నవి.

రైల్వేబోర్డులు తొలగవలెను. వానిని సంస్కరించిన లాభము లేదు. అవి ఎన్నడును భారతీయుల క్షేమమునకై పనిచేయఁజాలవు. కావున దొరతనమువారే రైల్లు పరిపాలనమును వూనవలయును. రైల్లు మొదలగువాని పరిపాలనము రాజ్యాంగశాఖగా గొనుట యన్ని నాగరికదేశములందును నాచార మగుచున్నది. దొరతనమువారి పాలనమున నుద్యోగివర్గమునకు హెచ్చుగ న్యాయ్యము జరుగగలదు. ప్రజల లాభములు హెచ్చుగ గణింపబడును. ప్రయాణికుల నెక్కుడు జాగ్రత్తతోడను సరకుల నెక్కుడు జాగ్రత్తతోడను జూతురు. కర్చులు చాలవఱకు తగ్గగలవు. పనిపాటులవారి కెక్కువ సౌఖ్యమును, న్యాయ్యమును, సంపాదనము లభించును. లంచములు, మోసములు తగ్గగలవు. ఉన్నతోద్యోగులు మితవ్యయధర్మము నెక్కువగఁ బాటింతురు. దేశధనము ధర్మమార్గమున వ్యయ మగును. దొరతనమువారు ప్రజల కష్టములను గ్రహించి యుచితరీతిని పరిహారముల సలుపగల్గుదురు. ఎక్కడనో 6000 మైళ్లదూరాన కంపెనీల భాగస్వాముల కంటె సన్నిహితు లగు రాజకీయోద్యోగులు విషయములను దెలుసుకొనుటకు ప్రజలకు అందుగడలో నుందురు.

ఈసూచనలు రైల్వేకమిటీవారి యెదుట నేకగ్రీవముగా భారతీయు లందఱును నివేదించుచున్నారు. అన్ని పక్షములవారు నేకాభిప్రాయు లయినారు. ఎంతటి నిర్లక్ష్యభావము గల దొరతనము కూడ నిట్టి యెడ తాటస్థ్యమును జూపఁ జాలదు. కొలది కాలములో ననుకూలపు మార్పులు కొన్ని రానున్నవి. రైల్వే పాలనమునఁ గల రహస్యములు ప్రజలకే మాత్రమును నిదివఱకు దెలియవు. ప్రజాసామాన్యమునకే గాదు, విద్యాధికులకును, రాజనీతివేత్తలకును దెలిసెడిది గాదు. రైల్లు దొరతనమువారి ప్రత్యక్ష పాలనమున లేమిని వానిపాలనవివరములు శాసనసభలో వచ్చెడివి కావు. ప్రజలు మేల్కొనినారు. భారతీయులలో నధికసంఖ్యాకులు జాతీయాభివృద్ధియందు విశేషప్రమేయము గల్గినట్టియు, దొరతనమువారి పెట్టుబడికిని ఋణమునకును మూలమైనట్టియు, రైల్లుపరిపాలనమును గూర్చి విచారణ సల్పుదురు గాక.

# తన్మయము

## కందా భీమశంకరము గారు

త్రిభువన లావణ్య వర్ణాల జల-దముల వలఁ
లలితపరిరంభణముల లాలనము సేయ;
కగము మెల్లని చల్లతె-మ్మెరల నొదిగి,
విరుల మొత్తాల నలరు తీ-వియల గములు
కౌతుకోత్సాహమున నాడ - చివురు లెనయ;
మెఱయు చదలరంగులకును - మేళవించి,
గుబురుమాటునఁ, గోకిల - కోమలముగ
విమలమధురానురాగ గీ-తములఁ బాడ;
చెలువుఁ బచ్చికపై విచ్చు - చిన్నిననలు
మెత్తనగు, నీహారబిందుల-యొత్తిడియిడు,
మిత్రతీయంబు నైకొన; - మేల్మిసుఖము
నియమలావణ్య నిధనాండ - నేమఱ్రావ;
మోఁద మిన్నుమ గ్రిందభూ-మియును గాంచిప;
నాదు చిత్తమునారగ నాం-తాలలాయు,
మిసిమిబంగారు పరి నీదు మేనికాంతి
యెఱుకవ్వలగ, జక్వనఁపుఁద్రాళ్-సూపఁబడుచు,
ఒకట నాశయము నుత్సాహ - మొకటనిలువ
సచ్చిదానంద మను నాక-సమును సోఁక;
ప్రకృతిపురుషుల ప్రణయంపు ఫల మనంగ
నేనునీయందు నీవు నా-లోనఁ గఱగి
తన్మయంబునఁ గాంతు మ-ద్వైతసిద్ధి.

# భరతవర్షము — గోజాతి

పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి గారు

ప్రాచీనకాలమునుండియు భారతవర్షీయులు, పూజ్యభావమున గౌరవించి, సేవించి, ప్రత్యక్షలాభము నొందుచున్నది గోజాతి. భారతీయులు ఐహికాముష్మిక కర్మలయందును గోసంబంధమును విడచియుండలేదు. వేదములను స్మృతిపురాణేతిహాస గ్రంథములను గోవర్ణనలతో నింపించిరి. వేయేల? కట్టుకొనెడిబట్టలు పాడుకొనెడి పాటలు-ఆడెడియాటలు - కొలచెడి దేవతలు - సర్వము వారికి గోస్వరూపమే! కాన ప్రస్తుతమిట గోజాతిని గురించి కొంత వ్రాయుదును. ఋగ్వేదకాలమున విశేషముగ పాడి కల దనియు ఇప్పటివలె కవ్వముతో మజ్జిగఁజేయుట, దధిపయః ప్రాశనము కల దనియు, నేతిని విశేషముగ, భుజించుచుండి రనియు నీ క్రింది ఋక్కులవలన వెలియవచ్చుచున్నది. "శ్రేష్ఠస్యవో ఘృతస్యధారా ఉపయంతి విశ్వతః" ౧.౧౨౫-౪ "యత్ర మంథాం విబధ్నతే రశ్మీన్ యమితవాఇవ" ౧,౨౮,౪ యత్తే సోమ గవాశిరో యవాశిరో భజామహే వాతా పేపీవ ఇద్భవః" 1-187-9. "అభి ద్విజన్మా త్రివృదన్నం ఋజ్యతే" 1-140-2.

ఈ ఋక్కునకు భాష్యమునందు విద్యారణ్యులు సోమ, గవ్య, పురోడాశములను మూడువిధములగు నన్నము లనుచు "యవ్య" స్థానమున పురోడాశమును వ్రాసిరి. కాని అందును గవ్యమును మాత్రము వదలనందునను "పురోడాశ"పు తగాయిదా ప్రస్తుతాంశమునకు సంబంధము కానందునను వదలితిని. ఎటులనైన ఆ కాలమున గవ్యము ముఖ్యాహారముగా నుండుట నిర్వివాదాంశము. మనము కాఫీలో పాలను కలుపుకొనుచుండినటుల ఋగ్వేదకాలమున సోమరసమున పాలను పోసి అన్నమును గలపికొని భుజించుచుండి నటుల ఈ క్రింది ఋక్కువలన తెలియుచున్నది. "సంతే పయాంసి సముయంతు వాజాః" 1-9 18. ఇఁకను గోసంరక్షణము నరయుదము:

పశువులకుఁ గొల్లలు ఉదయముననే గోవులను తోలుకొని పోయి రాత్రి యింటికి తీసికొని తోలుకొనివచ్చుటయు, గోవులందు సుఖముగా నిద్రించుట కెటువంటి జాతికిని భేదము లేదు. "ఉద్ధప్రభాసి కృత్వ్య అనుద్యాన వర్విశేషశ్విషే ఉరాయ" 1-121-7. "పరాహి మేవంతి ధీతయో గావో నగవ్యూతీ రను ఇచ్ఛంతి ఉరుచక్షసం" 1-25-16. తా. అనేకులచే స్తుతింపబడు వరుణుని గూర్చి నా బుద్ధులు, గోవులు సాయంకాలమున గోష్ఠమును గురించి వెనుకకుఁ జూడకుండఁ బోవునటులఁ బోవుచున్నవి. "సుయవసా ద్భగవతీ హి భూయా అథో వయం భగవంతః స్యామ, అద్ధి తృణ మఘ్న్యే విశ్వదానీం పిబశుద్ధ ముదక మాచరంతీ" 1-16-40. తా. ఓగోవా మంచిగడ్డిఁ దినుచు క్షీర సమృద్ధిని గలిగి యుండుము. నీవలన మేమును, భాగ్యాభివృద్ధి కలవార మగుదుము గాక. సర్వకాలము తృణములఁ దినుచు నిచ్ఛావృత్తి సంచరించుచు, నిర్మలజలములఁ ద్రావుచుండుము. ఋగ్వేదమున నశ్వినీదేవతలును ఋభుదేవతలును గోవైద్యులుగా వర్ణింపబడిరి. "యువం వృకా ఉస్రియాయా మధత్తం పక్వ మామాయా మవపూర్వ్యం గోః" "యాభిర్ధేను మస్వం పిన్వథో నరా తాభిరూషు ఊతిభి రశ్వినా గతం" 1-111-3. "నిశ్చర్మణ ఋభవో గా మపింశత సంవత్సేనా సృజతా మాతరం పునః" 1-109-8. "నిశ్చర్మణో గా మరిణీత ధీతిభిః" 1-161-7. గోవులలో ననేక జాతులు కలవని ఋగ్వేదమున గల "శిప్రిణీ" "వంసగః" మొదలగు శబ్దములచే నూహింపవలసి యున్నది. దీనివలన గోదానము నాటికాలమునను పవిత్రముగా నెంచబడుచున్న దనియు, మహారాజులు ఋషులకు వేలకొలఁది గోవుల నిచ్చుచుండి రనియు ఋగ్వేదము 1-126,3,4 సంఖ్యలలో గల "స్వనయ, కక్షీవంతు"ల గాథలవలనఁ దెలియనగుచున్నది.

క్షాత్రకాలము:- ఈ కాలమున పశుపాలనము పవిత్రకార్యముగ నెంచబడెనని యీ క్రింది గాథవలనఁ దెలియవచ్చుచున్నది. సత్యకాముడను జారిణీపుత్రుఁడు తనకు బ్రాహ్మణ్యము నీయుఁడని ఋషుల బ్రార్థింపగా వారు చిక్కిన నాలుగువందల గోవుల నిచ్చి వీని నెప్పుడు వేయి గోవులగాఁ జేసెదవో నాడే నీకు బ్రాహ్మణ్యము కలుగు ననిరి. సత్యకాముఁడు వనమునకు నాలుగువందల గోవులను దోలుకొనిపోయి కొన్నియేండ్లు వనమునఁ గడపి వేయికంటె నధికములగు గోవులనుగా జేసి తెచ్చి ఋషులవలన బ్రాహ్మణ్యము నొందెను.

[ఛాందోగ్యోపనిషత్ 4 4-5]

ఈకాలముననే శ్రీకృష్ణభగవానుఁడును పాండవసహదేవుఁడును గోపాలకులైన ప్రసిద్ధపురుషులు. నాటి గోజాతి లక్షణములను వాటిస్థితిని వ్యాసమహర్షి మహాభారతమున సహదేవపాత్రము నుండి పలికించియున్నాఁడు. గోవ్రాతాదికములు భోజనవస్తువులలో ముఖ్యమైన వనియు తేజోబలముల నవి యిచ్చు ననియు నాటికాలపువారు తెలిసికొని యుండిరని పృథివీసూక్తములోని యీ క్రిందివాక్యముచే తెలియ నగును. "ఊర్జం పుష్టం బిభ్రతీ రన్నభాగం ఘృతం త్వాభి నిషీదేమ భూమే" అథర్వవేదము 12-1-29.

ఈకాలమున గోధనము ముఖ్యధనముగా తలంచుచుండిరి. శత్రురాజుల గోవుల నపహరించుట యుత్కృష్ట కార్యముగ తలంపబడెను. గోవులను గురించిన యుద్ధము లీ భరతఖండమున ఋగ్వేదకాలము మొదలు మహమ్మదీయ కాలారంభమునం దాంధ్రదేశమున జరిగిన "అలకన్న, బయ్యన్న"ల పశువులబీడు తగాయిదాలవఱకు విశేష

ముగ జరిగినటుల చరిత్రలు చెప్పుచున్నవి. విరటుని గోవుల నపహరింపఁ గౌరవులు ప్రయత్నింపఁ బాండవు లడ్డుకొనుటయు నందర్జునకృతోత్తరగోగ్రహణ యుద్ధమును జగత్ప్రసిద్ధమే కదా! పెక్కువేల గోవుల నొక్కచోటున మేపుటకు తగిన బీళ్లుండనపుడు విడివిడి మందలగా జేసి మేపుచుండిరి. విడిమందను పాలించువాడు గోపాలుఁ డనియు పెక్కుండ్రు గోపాలురపై నుండు నధికారికిఁ "గోనాయఁ" డనియు ఛాందోగ్యోపనిషత్తు 6-8-5 సంఖ్యవలన దెలియుచున్నది. [చూడుము. అథర్వవేదములోని సూక్తములను. 2-31-5; 2-31-2; 2-32-1; 2-32-2, 2-32-3.]

అథర్వవేదము 4-21 సూక్తమున పశువుల నరణ్యమునకుఁ దోలుట, వనమునందు ఘాతుకజంతువులవలన బాధ కలుగుట, బీళ్లయందు గడ్డి సమృద్ధిగ నుండుట, పశువులకు రోగములు కలుగుట మొదలగు వృత్తాంతము లింపుగ, వర్ణింపఁబడెను. అసూక్తమునందలి యర్థము- నేటి తూర్పుగోదావరి డెల్టా వాసులగు రైతుల కనుభవసిద్ధమైయున్నది. గోవు పవిత్రవస్తు వనియు కాలితో దాకిన మహాదోష మనియు నథర్వవేదము 13-1-56 నందును శ్రీమద్రామాయణము 75 సర్గయందును వర్ణింపబడి యున్నది. కపిలగోవులమహిమ నెటుల భీష్ముఁడు ధర్మరాజునకుఁ జెప్పెనో భారతపాఠకులకు విశదమే. రాజులు ప్రజలు, క్షాత్రకాలమున గోసంరక్షణవిషయమై విశేషపరిశ్రమం జేసి రని వైదికవాఙ్మయమువలన దెలిసికొనుచున్నారము. ఇతోధికముగ నార్యులు సూత్రకాలమున గోవృద్ధ్యాదికమునకు బ్రయత్నించి రని, సూత్రవాఙ్మయమువలన దెలిసికొనగలము.

సూత్రకాలము: ఈకాలమందు పశువృద్ధి విశేషముగా నుండెను. గ్రామనిర్మాణమును పశువ్రజల కనుకూలముగ నుండునటుల చేయుచుండిరి. చూ. మనుస్మృతి 8-237.

పశువులు గ్రామసమీపమున స్వేచ్ఛగ సంచరించుటకు గ్రామమునకు చుట్టును 400 మూరల దూరమువఱకు మందబయలు లేర్పఱుపవలెను. లేక బలముగలవానిచేత విడువఁబడిన మూఁడుకోలలు పోవుదూరమువఱకయినను మందబైలు లేర్పఱుపవలెను. పట్టణమునకు మూఁడురెట్లధికముగ మందబయలు నేర్పఱుపవలెను. ఈమందబయలుగుత్త ప్రస్తుతము గోదావరికృష్ణాడెల్టా గ్రామములలో క్షీణించి, నాలుగువందలమూరలకు బదులు నాలుగుమూరలయిన లేనివి కలవు. మందబయలు లేని గ్రామమున మంద లెటు లుండును? ఈకాలమున పశు[illegible] ప్రభువులును, ప్రజలును [illegible] కట్టుబాటులను చేసిరి. గౌతమధర్మసూత్రములందలి 12వ ఖండికయొక్క భాగమును మన ప్రభువులును, ప్రజలును గమనింపఁదగును. "పశుపీడితే స్వామిదోషః పాలసంయుక్తే తు తస్మిన్ పథి క్షేత్రే అనావృతే పాలక్షేత్రికయోః" గ్రామసమీపము నందున్న పొలమునకు యజమాని ఒంటెకు కనఁబడనంత యెత్తుగ కంచెను వేసుకొనవలె నను నిర్బంధ మానాఁడు గలదు. మనుస్మృతి (8. 230) లో పశువులను మేపువాఁడు, పగలు తోలుకొని పోయినది మొదలు, రాత్రి యజమానియొద్ద నప్పగించువఱకు ఆపశువులకును పశువులవలనఁ బైరులకును కలుగునష్టములను, పశుపాలుఁడే భరింపవలెను. ఇంటికడ నొప్పగించిన పిమ్మట, యజమానుని దగు నని మందలోఁ జెడిపోయినను, క్రిములు మొదలగు వానిచేఁ జంపఁబడినను కుక్కలు మొదలగు వానిచేఁ గఱవఁబడినను మిట్టపల్లములఁ బడినను, అశ్రద్ధగా మేపుటవల్ల నశించినను కలిగెడి పశునష్టమును మేపువాఁడు భరింపవలె ననియు, మున్నగు నియమములు ఆనాఁడు కలవు. వానివలనఁ బశుసమృద్ధి కలిగి దేశము సుభిక్షముగ నున్నట్లు కన్పడుచున్నది.

బౌద్ధకాలము: బౌద్ధమత ప్రచారమువలన గోమేధము లడుగంటెను. అశోక చక్రవర్తి భరతఖండమునకే కాక యూరప్ ఖండములకుఁ బశువైద్యశాలల నేర్పరచిన ప్రతీతికలదు. అన్యఖండములలోగూడ పశువైద్యశాలల నేర్పఱచిన మహానుభావుడు స్వదేశమున నెంతటి ఘనకార్యముల జేసియుండునో, మనమె యూహింపగలము! పశువైద్య సంబంధములగు నాటిగ్రంథములు మనకిపుడు లభింపకపోవుట దురదృష్టము. యాజ్ఞవల్క్యస్మృతి వ్యవహారకాండము నందు గోవున కనుకూలముగ గ్రామనిర్మాణ ముండవలె నని కలదు. గోజాతి తండోపతండములుగా వృద్ధినొందుటచే, జనులా గోజాతికి వేర్వేఱు గుర్తుల నుంచుచుండిరి. ఔక్షకము గవ్యావాత్సకము మహోక్షము జాతోక్షము తర్ణకము శకృత్కరి దమ్యము ఆర్షభ్యము ఇట్వరము నప్యోతము ప్రష్ఠవాట్ శాకటము ప్రాసంగ్యము మున్నగు పేరు లిందులకు తార్కాణములు. ఆవులకును నైచికి ద్వికర్ణి త్రికర్ణి మొదలగు నామములును రంగులననుసరించి ధవళ శబలాది నామములును కలవు. గొడ్డావునకు వశ యనియు, నీచుకొనిపోయిన యావునకు అవతోక మనియు, ఇట్లు ఆయా అవస్థాభేదములను బట్టి నామభేదములును గలవు. బౌద్ధుల కాలమున హెచ్చుగ పాడిపంటలు కలిగినను దేశీయులకు తృప్తిలేక తమవాఙ్మయమునందు, నేతిసముద్రమును, పాలసముద్రమును, పెరుగుసముద్రమును ఇక్షుసముద్రమును గల్పించిరి. ఈకాలమున ఇక్షు, సర్పి, దధి, క్షీర, సముద్రము లింకి పోవుచున్నవి గాని "సుర" సముద్రమాత్ర మెత్తరోత్తరాభివృద్ధిగా నుప్పొంగుచున్నది. పాడికి నెలవగు క్షీరములనుండియే యైశ్వర్యాధిదేవత యగు లక్ష్మి యుద్భవించె నని కవులు కల్పించియుందురు. కర్షకులయింటఁ బాడియుండు ననియు వారియింట లక్ష్మియుండు ననియుఁ గాబోలును హాలచక్రవర్తి తన గాథాసప్తశతిలో కర్షకకన్యను వర్ణించుచున్నాఁడు.

శ్లో॥ [illegible]
[illegible]

పౌరాణికకాలము! ఈకాలమునందు బౌద్ధమత సంపర్కముచే భారతీయులు అహింసాకర్మాసక్తులై విశేషించి గోహింసను మానినందునను, గోవునందు పూజ్యాతిశయభావము కలుగుటచేతను, గోబృంద మీకాలమున నత్యధికముగ వృద్ధినొందెను. సహదేవ శాస్త్రాది పశుచికిత్సాగ్రంథము లీకాలమునఁ బుట్టియుండు నని తోఁచుచున్నది. 'అత్రేయ'స్మృతిలో ప్రతిసంసారికిని అధమ మొక

పాడియావైనను కలిగియుండనియెడల నాసంసారి దురదృష్టవంతు డను తలంపుతో గాబోలు నిటు లనుచున్నాడు:

శ్లో. యస్యైకాపి గృహే నాస్తి ధేను ర్వత్సానుచారిణీ
  మంగళాని కుత స్తస్య? కుత స్తస్య తమః క్షయః?

పౌరాణిక కాలమునందు చెప్పఁబడిన గ్రంథములలో గోవ్రాతము నమిత గౌరవముతో వర్ణించియున్నారు. "భారవి" మహాకవికృత కిరాతార్జునీయమునందు, అర్జునుని ప్రయాణమధ్యమున గొల్లపల్లెలలోని గోవు లిటుల వర్ణింపబడెను.

శ్లో. ఉపారతాః పశ్చిమరాత్రిగోచరా దపారయంతః పతితుం జవేన గాం, సముత్సుకా శ్చక్రు రవేక్షణోత్సుకం గవాం గణాః ప్రస్నుతపీవరోధసః.

శ్లో. గతాం పశూనాం సహజన్మబంధుతాం
  గృహాశ్రయం ప్రేమ వనేషు బిభ్రతః
  దదర్శ గోపా నుపధేను పాండవః
  కృతానుకారా నివ ధేను రార్జవే. భారవి. 4 సర్గ.

అంబరీషుని గోదానాతిశయమును గురించి భాగవతము నవమ స్కంధమునం దిటుల "పోతన" మహాకవి వర్ణించుచున్నాడు.

శా. పాలేక ప్రవహింప నంగరుచులం బ్రాయంబులన్ రూపము
  ల్మేలై ధూర్తలు గాక వెండిగొరిజ ల్హేమారుశృంగంబులం
  గ్రాలం గ్రేపుల యత్తు నాకుచును, రంగచ్చేలలై యున్న మం
  దాల న్యర్బుదషట్క మిచ్చె విభుఁ డుద్యద్వైదికశ్రేణికిన్.

## మహమ్మదీయకాలము

ఋగ్వేదకాలము మొదలు పౌరాణిక కాలము వరకు "గోమేధాది" యజ్ఞములలో ఏవశిష్ఠునివంటి బ్రహ్మర్షి వచ్చి నపుడో తప్ప, గోవధ విశేషముగ లేదు. సంస్కృతమహాభారతము ఉద్యోగపర్వములోని నహుషుని చరిత్రముఁ జూడ, గోవధ కూడ దని శాస్త్రకాలమునందే కొంత చర్చ బయలుదేరిన దని తోఁచెడిని. బౌద్ధపౌరాణిక కాలములలో గోవు లింతింతనరాని యభివృద్ధి నొందినవి. భారతీయుల దురదృష్టము కొలది భారతీయుల ధనము విదేశములపాలగుటయే గాక, రాజ్యములు పోవుటయే కాక, భారతీయులు తల్లితో సమానముగను పవిత్రవస్తువులలో మిక్కిలి పవిత్రవస్తువుగను, కొలుచుకొనెడిగోవు, మహమ్మదీయులకాలమున నమితముగ నాశనము చేయబడెను. దీనిని వధించిన మనము మహాదోష మని తలంచుచుండగా వారిని మహమ్మదీయులు తమ పండుగలలో వధించిన పుణ్యమని తలంచిరి. ఇది దేశ దురదృష్ట హేతువు కాదా?

సీ. నవకోటిపరిమిత ద్రవిణమేధూపతి
  భండారమున నెప్డు బాయకుండు.
  ఏకోనశతదంతి శతరాజి ఘనశాల
  నీలమేఘంబులై లీలఁ గ్రాలు
  బలవేగరేఖ న ల్పదివేలు తురగంబు
  లీవరేంద్రునిపాగ నెపుడునిలుచుఁ
  బ్రతివాసరంబు డెబ్బదియేనుపుట్లనే
  యేవిభుమందల నెపుడుగలుగు

గీ. నట్టిస మధిక విభు-డగు కులోత్తుంగరా
  జేంద్రచోళవిభుని-కిష్టసచివ
  తంత్రముఖ్యుఁడగుచు-మంత్రిగోవింద నం
  దనుఁడు కొమ్మన ప్రధానుఁ డొప్పె.
  [కేయూరబాహుచరిత్రము]

ఈ పద్యమును చిత్తగింపుఁడు. దినమునకు 75 పుట్ల నేయి కలుగుట కెన్నికోల గోవు లుండవలయునో నే డూహింప శక్యము కాకున్నది. మహమ్మదీయ కాలమునను "అమృగ మహాల్" "పుంగనూరు" 'వంగోలు' మొదలగు చోటుల నుండిన గోజాతి ప్రసిద్ధికెక్కియే యున్నది. మైసూరునవాబగు "టిప్పుసుల్తాను"దండయాత్రల నతిత్వరితముగఁ జేయుటకు మైసూరు రాజ్యమునందలి యెద్దులే కారణమనియు వస్తుసామగ్రి నవి వేగముగా కొనిపోవుటచేతనే చురుకుగా సైన్యములను నడపించువాఁ డనియు, ప్రఖ్యాతి కలదు. ఎటులనైనను మహమ్మదీయకాలమున లోకవిఖ్యాతి నొందిన మన గోబృందము చాలవఱకు తురుష్కులపట్టుదలచే మహమ్మదీయకాలమున నశించిన దని తలంపవలసియున్నది. స్వదేశప్రభువులు మాత్రము గోసంరక్షణముకొఱకు నాఁడును విశేషముగ పాటుపడిరనుటకు సందియము లేదు.

## ఆంగ్లేయులకాలము

గోజాతి ప్రస్తుతము ఆంగ్లపరిపాలన కాలమున వృద్ధినొందలే దని విచారించుచు వ్రాయవలసియున్నది. ఎన్ని "క్యాటిల్‌షోలను" పెట్టిన నేమి? ఎందఱు గోశాలల నేర్పరచిన నేమి, గోవృద్ధి సందేహాస్పద మగుచున్నది. గోవులు తిరుగుటకుఁ దగిన బీడులు విశేషముగా తోటలుగానో సస్యక్షేత్రములుగానో మారినవి. గ్రామములకు ప్రాచీనకాలమునం దేర్పఱుపబడిన మందబయళ్లు జనవృద్ధిచే జనులగృహములుగానో, కక్కుఱితిపడిన రైతుల పొలములుగానో, మారినవి. ఇంకొకమూల ఫారెస్టుడిపార్టుమెంటువారు ప్రాచీనగోక్షేత్రములలో నరణ్యనిబంధనల నేర్పరచిరి. "క్యాటిల్‌షోలమూలమున" "బ్రెజిల్, జావా" మొదలగు దేశములనుండి పాశ్చాత్యవ్యవసాయకులు శ్రేష్ఠగోవృషభముల నేరి, కొని పోవుచున్నారు. మరి యొక వంక ఉన్న గోవులయొక్క, ఆంగ్లేయులకు గోమాంసము విక్రయించుటయే వ్యాపారముగా చేయుచున్నారు. దక్షిణసోల్జర్ల భోజననిమిత్తమే సం॥రం ఒకటికి ఒకలక్ష యేబదివేల గోజాతి వధింపబడుచుండెడి దను ఖ్యాతి కలదు. "మాకైనిక స్త్రీపున్నను నే యియుదు, ఆధనముతో నాస్త్రేలియానుండి మాంసపుడబ్బాలను దెప్పించి సోల్జర్లను దృప్తినొందింపుఁడు. మాగోజాతినిమాత్రము వధింపకుఁడు." అని జార్జిప్రభువు పట్టాభిషేకసమయమున నొక విజ్ఞప్తిని ఉత్తరహిందూస్థానమువారిచే, కొన్ని లక్షలవ్రాళ్లతో చక్రవర్తికి సమర్పింపబడె నని, వార్తాపత్రికలలో జదివియుంటిమి. దాని

గతి యేమయ్యెనో తెలియదు. బహుశః భారతీయుల యితరవిజ్ఞప్తుల వలె నదియు బుట్టదాఖలై యుండును. మనగోజాతి క్షీణించు చుండుటచే ఖండాంతరానీతము లగు "హార్లిక్సుపాలు, నెస్సెల్సు పాలు, మెలిన్సుఆహారము" మనకు గతియగుచున్నవి. పూజ్యురాలగు గోవును మనము గణనఁజేయనియెడల మన యాయురారోగ్య భాగ్యములు క్షీణించుట యొక లెక్కలోనిది కాదు. ఈగోజాతి వృద్ధి నొంద పరమేశ్వరుఁడే యేదేని విధానముం గనిపెట్టవలె నని కొన్ని వత్సరములనుండి డోలాందోళితమనస్కులై కొందఱు పరితపించు చున్నారు. దానికి తగినవిధానము భగవంతుఁడు చేయుచున్న సూచనలు పొడకట్టుచున్నవి. నైజాము రాజ్యమువంటి మహమ్మదీయ రాజ్యమునందును, ప్రతిగ్రామమునందును చాలవఱకు గోభూమిగ నుండవలె నని శాసనము లుదయించినవి. గోజాతి నెగుమతిం జేయకుఁడని ప్రజాప్రతినిధులు ప్రభుత్వము నడుగ సాహసించుచున్నారు. "అయినాఅక్బరీ" యను గ్రంథమునఁ జెప్పబడినటుల బ్రిటిషుపాలనములో 17 వ శతాబ్దప్రారంభమున యకరములకు 1388 పౌనుల ధాన్యముపండి 19 శతాబ్దమున నది 1కి 8,9 వందల పౌండ్లధాన్యమే పండినను నేడింకను పంట తగ్గినను, మనకు కొదువలేదు. కాని మన సరస్వ మగు గోజాతి వృద్ధినొందగల యవకాశము లున్నఁజాలును. దయాళుఁడగు ఈశ్వరుఁడు మన కీయర్థమును అనుగ్రహించుఁగాక. గోబ్రాహ్మణులకు సదా శుభ మగుఁగాక. లోకములు సుఖనిలయము లగుఁగాక.

# నిదాఘదినాంత గౌతమీతీర విహారము

## వడ్డాది సుబ్బారాయకవి గారు

వినువ్రాలుచో నుదీచినిఁ దళుక్కని క్రాలు
మెఱుఁగులతో నీలమేఘమాల
యద్దాని క్రింద దావానల జ్వాల రే
ఖల తోడి నల్లని గట్లచాలు
దానిముందర సాంద్రమైన కావిరి గ్రమ్మ
యెడములు కబళించు వృక్షరాజి
దాని కివ్వల దృఢస్తంభపాళీ శిరో
భాగ నిర్మిత మైన వారధియును
గీ. దాని పైదారి, దిగువ లోఁతైన వారి
వాయుగతిఁ బోవు నావిరిబండ్లుఁ, బడవ
లేటిదరికి వేసఁగిసంజ నేఁగువారి
కెల్లఁ గనువిందు రాజమహేంద్ర మందు.
క. నల్లని నీళ్లను గౌతమి
తల్లి కనులపండు వగు నిదాఘపు సంధ్యన్,
దెల్లని నురుఁగుల విఱుఁగుచుఁ
గల్లోలము లుఱుకుచుండ గగ్గుమునరుదున్.
సీ. గుండ్రని పెనుగాజుఁ గుప్పె దీపమువోలెఁ
బశ్చిమాంబుధిఁ దేలు భానుఁ జూపి
పలురంగు లద్దిన పలువచెన్నున వన్నె
వన్నెయబ్బులఁ గ్రాలు మిన్ను చూపి
దాఁగిన చీఁకటుల్ తలలెత్తు చందాన
మసలాడు తోఁపులు మసలఁ జూపి
నీలాలవలెఁ దేటి నిర్మలం బగు నీట
విడిసంజఁ గ్రొంజాలు వెడఁగుఁజూపి
గీ. చండకరు ధాటి మూర్ఛిల్లు జగతిమీఁదఁ
జిఱుతకరువలి చలిమిరుల్ చిలుకుచుండ
నావలను తూఁగు వేత్రాసనములఁ బోలుచు
గౌతమీతటి యలరించుఁ గన్నప్రజల.
తే. పసరు టాకులలోఁ గప్పువడిన పెద్ద
గుండ్ర గుమ్మడిపం డెంచుకొం డ్రు వదిని
బశ్చిమాఁబుధికరడులు పైకొనంగ
మాటువడఁ జూచి మార్తాండమండలంబు.
తే. తలలు క్రిందుగ గవుల మ్రాఁకులను బగలు
వ్రేలు కొండగబ్బిలములు బైలువెడలె
నిరులుతోఁ గూడఁ, గడసంజ నెల్లకడలఁ
దల్లివెను వెంటఁ బఱతెంచు పిల్ల లట్లు.
ఆ. కొండగబ్బిలములు కుతుకెండి పయి నెక్క
లార్చుకొనుచు డాయ నలలచేతు
లెత్తి వానినోరి కిడు నందికగ నీరు
ప్రేమ వెల్లి గౌతమీమతల్లి.
క. పేదకు సిరియెత్తుకొనున్
భైదలి యుక్కకతె చెట్టపట్టున దానన్
మూదికలెఁ దోఁచు శిరల
పొదుఁను వెలుఁగొందఁడే తుషారయోగమునన్.
సీ. అరచందురునకు సుందరరూప సాహస్రములు
ఘటిల్లఁ జలించు నలలనలుఁ
నలలమీఁదను దళతళలు దేరఁగ వెండి
జలపోఁతఁ పలుకృ వెన్నెలలచెలఁగ్రు
వెన్నెలలకు సుంత వింతజా డేనగాఁడఁ
జదలఁ బర్వెడు యెఱసంజ పంచ
నెఱసంజ మెలమెల్ల నినువంక దిగఁ జూచి
నిజనాధు నలరించు నిసిబెడంగు
గీ. నిసి ధరించిన గువ్వక న్నెలచీర
కరణి రాణించు నంతరిక్షంబుడంబుఁ
గాంచుచును జల్లగాలి సేవించు జనులు
రేయిమొగమున నదియొడ్డఁ బాయఁ గలరె?

# కానుఁగు చెట్టు

పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులు గారు

నక్కదోసకాయ యూరుఁగాయ. గోఁగుకూరపచ్చడి. బచ్చలి పెరుఁగు అంతే. అంతకంటె నక్కడ నేమిదొరకును? అవే పంచభక్ష్య పరమాన్నములు. ఇట్లనుదినము వేళపాళయని లేక కొర్నిపాటి సుబ్బరాజుగారన్నప్రదాన మాచరించుచుండిరి. అన్నము జొన్నయన్నము. విస్తరి బాదుమేడియాకువిస్తరి. ఉప్పు తాతియుప్పు. నీరు దిగుడుబావినీరు. ఇప్పటిమాటయా? దాదాపుగా నూరేండ్ల క్రిందటిమాట. ముప్పదిసంవత్సరము లిట్లా బ్రాహ్మణుఁడన్నప్రదాన మొనర్చినాఁడు. మహానుభావుఁడు. నిర్గర్వుఁడు. నల్వురు మోయఁదగిన చొప్పమోపును తానే పొలమునుండి తలపైఁ బెట్టుకొని తెచ్చి బఱ్ఱెలకు వేయును. వానిపాలు పాలికాఁపులచేఁ బిదికింపక తానే పిదుకును. ఇంట నందఱకాతని భార్యయే వంట చేయును. వంటలక్కలు కాని నీళ్ల బ్రాహ్మణులు కాని వారి కెవ్వరును లేరు. ఉంచుకొనవలసిన యావశ్యకతయు వారికి లేదు. తమయింటిపని నొకరిచేఁ జేయించుట పాపమని భావించుచుండెడివారు. పచనాదికృత్యములను బైవారిచేఁ గూలిపెట్టి చేయించినయెడల నతిథిపూజాఫలము పరిపూర్ణముగఁ దమకు సిద్ధింపదేమో యని వారికి భయము. పాలుమాలిక లేక, యొడలు దాఁచుకొనక భూతసంతుష్టిచేయుటయే పుణ్యకార్యమని నమ్మి వారట్లు చేసిరి.

మగనికిఁ దనకుఁ దవ్వెడుబియ్యము నుడుకుకలాడించుటకే యీ కాలపుఁ గులకాంతల కోపిక లేదు. దొడ్డిలో దాసి. వీధిగుమ్మములో సేవకుఁడు. ఇంటిలో వంటలక్క. ఇంతపై బలగమున్నఁ గాని యాలుమగని కంటె నెక్కువలేని యిద్దఱకాపురమీ దినములలోఁ గడతేఱకుండ నున్నది. పంచపాళిలో వాఱవైచినబట్ట భటునిపాలు. పెరటిలోఁ బాఱవైచిన తప్పెల దాసిపాలు. పడమటింటిలోని పప్పుగేయి సామాను వాపనక్కపాలు. అమ్మగారు పడుకటింటిలో నారంగజేబు నవలను చదువుచు నావులింతలపాలు. అయ్యగారు రణాబిల్లపై సంతకములతో నప్పులపాలు. ఇంతేకదా యిప్పటి సంసారముల సౌభాగ్యము! అతిథిపూజలేమి సరేకదా - పలలి సరిలోఁ బచ్చడి మొదలయినవి జేసిపెట్టిన చాలు? కంటప్రాయశ్చిత్తముగ్గఁ [illegible] మంచము [illegible] మొంగము పొగుంగ కరఁగి పోవునప్పుడు మగనిమొగాన నింక మొద్దుతిక్కని కుతికేమున్నది? ప్రాణములి సంజీవిపదలో నుండవచ్చునో లేదో తెలియును గాని, పప్పుడికిన తరువాత నుప్పు వేయవలయునో - యుడకక ముందు వేయవలయునో - తెలియదు. ఉండలు జిల్లేడుగాయలు కాకుండ వత్తెసరు వేయఁగల యమ్మగారన్నపూర్ణాదేవిగారు. వంటయింటిలోని ప్రాణాహుతులతోను బజారులోని కారపుఁబూసతోను గాపురము లిట్లోజరుగుచున్నవి. జరుగక మానునా? కాలచక్రము నెవరడ్డగలరు? ఆయన వుండగా నెవరేమి చేయఁగలరు? మగలబ్రదుకులే యిట్లు దిగనాఱునప్పుడు మఱఁదుల బావల యత్తల బ్రదుకు లడుగవలయునా?

కాని యాహా! ఏమిదుర్గమ్మ!! దూపాటి సీమనుండి వచ్చినవాఁ డొకఁడు. నల్లకులనుండి వచ్చినవాఁ డొకఁడు. కోనసీమనుండి వచ్చినవాఁ డొకఁడు. పలనాటి సీమనుండి వచ్చినవాఁ డొకఁడు. ఇట్లెందఱో యతిథులై రాగా, వారి కందఱకు బహు పరిశుభ్రముగా కంచి, భర్త పెట్టి సిద్ధపఱచి యుంచిన యాకులలో వడ్డించి, వారు సంతుష్టిగ భుజించినతరువాతఁ దాను భుజించును. ఇట్లొక్క దినమా? ఒక్కమాసమా? ఒక్క సంవత్సరమా? ఆఁడుదాని పరిపూర్ణసహాయ్యము లేకుండ బ్రహ్మదేవుఁడైన నన్నప్రదాన మాచరింపలేఁడు. అన్నప్రదానపుణ్య మంతయు నంగనదే!

ఇఁక నీయతిథులకు సాయంకాలమున మూఁడుగంట లగుటతోడనే—ఆనపుఁగాయదినములలో తంపటివైచిన యనుపగుగ్గిళ్లు - లేతజొన్నకంకులదినములలో నూచబియ్యము - మొక్కజొన్నపొత్తుల కాలములో మొక్కజొన్నపొత్తులు - ఇట్లు ఏయేకాలములో నేది వచ్చునో - యది యల్పాహారముగ వారిముందుఁ బెట్టి తాను చేగునప మంత గంటము చేతఁ బుచ్చుకొని, తాటియాకులపై భాగవతమో వారి వంశమో మరేదియో యీ సుబ్బరాజుగారు వ్రాసికొనుచుండును. ఇట్లాతఁ డెన్ని గ్రంథములో వ్రాసినాఁడు. కవీశ్వరు లాతనికిఁ గన్నులుఁ గట్టి నట్లుండురు. తిక్కన సోమయాజి యాఱడుగుల పొడవగువాఁడని - గడ్డముక్క కలవాఁడని - నడుముకట్టులోఁ జురకత్తి కలవాఁడని - కాలిన మొక్కజీడిపప్పు రంగువాఁడని - యాతఁడా యతిథులతోఁ జెప్పుచుండును. చేతిలోనున్న యనుపపప్పు ముందుఁ గథలోనున్న కాలిన మొక్కజీడిపప్పెక్కువ రుచింపకుండుటచేఁ గాఁబోలు వారామాటలను గణింపకుండెడివారు. తిక్కన సోమయాజిగా రిట్లుండెనని మీ కెట్లు తెలిసినదని యాయన నెవ్వరు నడుగలేదు. అడిగిన యెడలఁ గారణము చూచుకొని మాత్రము చూపి తెలిపియుండును? [illegible] దోసమని యేకారణము. దింగలి సూరన్నగారికి ముప్పది దంతములతో నొకటిపైనొకటి [illegible] యని చెప్పును. ఆయనను చలాగునఁ గనఁబడుచుండఁగ నెవరు కాదనఁగలరు? ఒకనాఁడు తాను తనభార్యయుఁ బండుకొని యుండఁగాఁ దాను "దుర్గా! పోతరాజుగా రెట్లుండురని నీయభిప్రాయ"మని యామె నడిగెను. ఆ ప్రశ్న యామె కెందులకో బోధపడదు. "పొడుగుగాను, సన్నముగాను నుండురని నే ననుకొందునని" యామె బదులుచెప్పెను. భర్త యడిగిన నడుగును గాక! భార్యకీ ప్రత్యుత్తర మెందులకో యంతకంటె బోధపడదు. "అలా

గునఁ గాదుసుమీ. పొట్టిగా నుండును. తగుమాత్రమైన బొజ్జగలిగి యుండును." అని భర్త బదులుచెప్పెను. ఔనని, కాదని, భార్యాభర్తలిద్దఱొక్కనిముసము సంభాషించుకొన్న మీఁదట భర్త - "నే నన్నమాటయే నిజమగునెడల—నదిగో—గోడబల్లమీఁదఁ బెట్టిన మద్దెలయున్నదే. అది గణగణ మ్రోఁగును" అనుసరికే దైన యెలుక దానిని గదల్చెనో మఱేమైన జరిగెనో తెలియదు. కాని, మద్దెల గణ గణ మ్రోఁగెను. అంత నాతఁడు మహానందమున లేచి మద్దెలను గ్రిందికి దింపి దానికిఁ బూజ లొనర్చి, పోతరాజుగారి మద్దెలయని దానికిఁ బేరిడి పోతరాజుగారి గజేంద్రమోక్షాదిగాథలలోని పద్యములన్నియుఁ గీర్తనములుగాఁ బాడుకొనుచు మద్దెల వాయించుకొనుచుండెను. ఇది జరిగి యిరువదేండ్లు దాఁటినది. అల్పాహార కాలమునం దీకథ యతిథులకుఁ బ్రతిదినమును జెప్పును. అట్లు కొంతసేపుచెప్పి—

క. "పలికెడిది భాగవతమఁట
పలికించెడి వాఁడురామ-భద్రుండఁట నేఁ
బలికిన భవహర మగు నఁట
పలికెద వే ఱొండుగాథ పలుకఁగ నేలా ?"

యను పద్యమును చదివి "ఆహా! మహానుభావుఁడు! ఎంతమృదులముగా-నెంతలలితముగా-నెంతమనోహరముగాఁ-జెప్పినాఁడో! మా తండ్రి - పోతరాజుగారిప్పు డెక్కడ నుండునో" యని కన్నుల నీరు-జలజల రాల్చుచుండును. ఊచబియ్యపుఁ బదనుచేఁ జొంగలు గార్చుచున్న - భక్తిప్రియులకుఁ బోతరాజుగారి కవిత్వ మప్పుడు కావలయునా ?

ఇట్లు కొంతకాల మత్యుచ్ఛ్రయముగా నా సంసారమునకు దినములు జరిగినవి. కాల మొక్కరీతిగాఁ గడచునా? వర్షములు వెనుకఁ బట్టినవి. పంటలు తగ్గిపోయినవి. క్షామము తలసూపినది. అందువలన నతిథులు మఱింత వచ్చుచున్నారు. అందఱకు సంతుష్టిగఁ బెట్టుచునేయున్నాఁడు. అప్పులు చేసినాఁడు-పాటిపెరళ్లమ్మినాఁడు. ఇల్లమ్మినాఁడు. ఇంటిలోఁ బాత్రసామగ్రి నమ్మినాఁడు. కోటప్పకొండ మ్రొక్కుతో సంబంధించిన తన యెడమకాలి వెండి కడియ మమ్మినాఁడు. అమ్మగా మిగిలిన రెండు గేదెలుకూడఁ జచ్చిపోయినవి. ఇంటిలో నేమియులేదు. మట్టమధ్యాహ్నమగు సరికిద్దఱతిథులు వచ్చినారు. ఇంటిలో నరసోలెడు గింజలులేవు. అప్పుడు భార్యయొద్ద "నాఁడుపోయి యిప్పుడువచ్చిన యతిథులను బూజించుటెట్లు?"—అని యడిగెను. పసుపురాచిన దారమును మెడను గట్టుకొని మంగళసూత్ర మిచ్చి "ఇది యమ్మి వారికిఁ గావలసిన సామగ్రి నితెండు. అమ్మాయి పెద్దియన్నము తినినది. [illegible] దినమున భుజింపవలయు. వారికి సాయంకాలము కాకుండనే భోజనము పెట్టి పిల్లను దీసికొని రాత్రి యెటకైనఁ బోవుద"మని భార్య పలికెను. మంగళసూత్రమునకు రెండు వరాలు కాఁబోలు వచ్చినవి. కొంతవ్యయపఱచి యాయతిథులకు సంతుష్టిగా భోజనము పెట్టి శిష్టాన్నము కొంత సాయంకాలమునఁ గూఁతునకుఁ బెట్టి, తాము తినక, నా రాత్రి యెవ్వరితోడను జెప్పకుండ వెడలి పోవఁ బ్రయత్నించిరి. కాని, యీ యూరనున్న యొక సంపన్నుఁడీ యంశమును గర్ణాకర్ణిగా విని యాయనయొద్ద కారాత్రి వచ్చి "సుబ్బరాజుగారూ! మీకు దుర్దినములు వచ్చినవి. దరిద్రతకంటె దుస్థితి లేదు. మిమ్ము నేను గనిపట్టుదును. మీ రెక్కడికిని బోవలద"ని చెప్పెను. "ఓయబ్బ! దుష్టదినములు మాత్రము మమ్మేమి చేయఁగలవయ్యా? దరిద్రము పోతరాజుగారు పడలేదా? ఆయనకంటె మే మెక్కువ వారమా? ధర్మబుద్ధిచే నొకరు నాకింత పెట్టఁగ నేను దినువాఁడనుగాను. పోతరాజుగారిని రక్షించిన యొంటిమెట్ట కోదండరామమూర్తి మమ్ముల రక్షింపకుండును? అడవులఁబట్టి పోవుదుము. నాయనా! పోతరాజుగారు "అడవి రక్షలేని యబలుండు వర్ధిల్లు, రక్షితుండు మందిరమునఁ జచ్చు"నని చెప్పినారు. మమ్మొద్దు పెట్టకుము. కాని నాదొక్క కోరిక యున్నది. ఎవ్వరైన నతిథులు వచ్చునెడల నీవు వారిని చేతనగునంత వఱకు నాదరించుచుండుము. అట్లు చేయునెడలఁ బోతరాజుగారు సంతసింతురు అని చెప్పి యాతని నంపివైచి, ఇదివఱకుఁ దాను వ్రాసిన తాటాకు గ్రంథము లన్నియు నటుకమీఁదఁ బదిలముగా దాఁచి, తాను వ్రాసిన పోతరాజుగారి భాగవతమును దేవతార్చనపుఁ బెట్టెతోఁ గూడ నంగవస్త్రమునఁ జుట్టి తలపైఁ బెట్టుకొని, పోతరాజుగారి మద్దెల వీఁపునఁ గట్టుకొని, గంటము మొలలోఁ బెట్టుకొని, కూఁతు నెత్తుకొని, భార్యచేయి పట్టుకొని—

కం. శ్రీకంఠ చాపఖండన
పాకారిప్రముఖ వినుత, భండన విలస
త్కాకుత్స్థవంశ మండన
రాకేందు యశోవిశాల రామనృపాలా.

—యని పఠించుకొనుచు వెడలిపోయెను.

## II

అది మహమ్మదీయుల రాజ్యము. ఆయూరి పేరేదో తెలియదు. జోడుగుఱ్ఱాల బండిమీఁద నవాబుగారు బయలుదేఱి—'కాసు' తోఁటఁజూచి తిరుగ నింటికిఁ బోవుచున్నారు. ఆదారిలో నొక బ్రాహ్మణుఁడు నిలువఁబడియున్నాఁడు. గుఱ్ఱపు బండి వచ్చుచున్నది. "ఓయబ్బా! ఆఁపవయ్యా బండి! ఒక్కటేపరుగా?" యని బండివాని కాతఁడు కేకవైచెను. బండియాఁపక యాతఁడు తోలుకొని పోవుచుండఁగా నాబ్రాహ్మణుఁడు గుఱ్ఱపుఁ గళ్లెములను బట్టుకొని బండినాఁపెను. గుఱ్ఱములు బెదరుచున్నవి. కాని, వానిని కదలనీకుండ నాతఁడు పట్టుకొనియున్నాఁడు. ముందుఁ గొంతదూరము పోయిన తురుపు సవారులు వెనుకకు [illegible]. కొందఱు జనులు మూఁగిరి. నవాబుగారు బండి దిగినారు. ఆయనయొద్ద కాతఁడు వెళ్లి "మాయబ్బ! నీవే నఁటయ్యా! ఈ [illegible] పాలాల కంఠమును రాజవు? సరే కాని, నాకేమైన భృత్యు నేర్పాటు చేసి, తాటాకు గ్రంథాలు వ్రాయింపరాదఁటయ్యా! నాకు జరుగుబాటుగను నుండును. నీకు ఖ్యాతిగాను నుండును. సుఖముగాఁ గూరుచుండి వ్రాయుదును. నీ కచ్చేరిలోనికి నన్ను రానీయరని నిన్నుఁ జూచుట కీడకు వచ్చినాను. ఎవరేమి చెప్పుకొందురో వినవచ్చును. బండి నిమ్మళముగాఁ దోలించుకొనరాదయ్యా" యని నవాబుగారితో

వనిరెను. బ్రదుటదెరువుకొఱకుఁ బ్రభుని బ్రథమమున సందర్శించినప్పటి సంభాషణ మిట్లున్నది. పాపము! భటత్వమెఱుఁగునా? ప్రభుత్వమెఱుఁగునా? మన్నన యెఱుఁగునా? మార్దవమెఱుఁగునా? మర్యాదయెఱుఁగునా? మాటతీరెఱుఁగునా? అయ్యో! పల్లెటూరివాఁడు. తాపమున మోటు. వస్త్రమున మోటు. పలుకున మోటు. పట్టి నిష్కల్మషుఁడు. అమాయకుఁడు. మనసున నొకటి. నోటనొకటి యున్నదా? శుద్ధ సత్యకాలపువాఁడు. ఋషివిగ్రహుఁడు. హరిహరీ! ఇప్పటి యింద్రజాల మహేంద్రజాల మహామహోపాధ్యాయులలోని వాఁడా? ఇప్పటివారిలోఁ గొందఱు సత్యసంధులకుఁ దక్క దఱచుగా నెవ్వరినిఁ జూచినను నొసలు వెక్కిరింపు. నోరిగిలింపు. మొగమెదుట నమస్కారములు. వెనుకఁ దిరస్కారములు. పలుకు తేనెపట్టు- పిడికిలి క్రోతిపట్టు. పెదవిని మందహాసము హృదయమునఁ జంద్రహాసము. అతఁడిట్టి వారిలోవాఁడా? తన యుపకారపుమాట యేదో యెఱుఁగఁడు. ఎదుటివాని యపకారపుమాట యేదో యెఱుఁగఁడు. మనసులో నేది సత్యమని తోఁచునో యది పైకి రావలసినదే. ఆ వచ్చుటలో నొక సాపులేదు- సంతన లేదు. నీటులేదు గాటలేదు. పల్లెకట్టుపడి కంకరరాతి పాకముతో రావలసినదే! అతఁడనినమాటలు విని నవాబుగారు కొంత నిశ్చేష్టితులై యూరకుండిరి. నవాబుగారివంటి వానిని సుబ్బరాజుగారెట్లు చూడలేదో, సుబ్బరాజుగారివంటి వానిని నవాబుగారట్లు చూడలేదు. "మాయబ్బ; అదేమిచూ పయ్యా!

"కారే రాజులు రాజ్యముల్ గలుగవే- గర్వోన్నతిం జెందరే?
వారేరీ సిరిమూఁటఁ గట్టుకొని పోవంజాలిరే భూమిపైఁ
బేరైనంగలదే శిబిప్రముఖులున్ బ్రీతి న్యశస్కాములై
యీరే కోర్కుల వారలన్ మఱచిరే! యిక్కాలమున్ భార్గవా"

యని పోతరాజుగారు సెలవిచ్చిరయ్యా! అడుగక యడుగక యడుగవదిరేండ్ల కడిగినానయ్యా! నీ పాలా లన్నియు నా కూరకే యిచ్చినను నా కక్కఱలేదు. ఏదో కొలువుచేయించుకోవయ్యా! ఎందుల కింతయోజన? నీ విచ్చు భత్యము నా కేమియు నక్కఱలేదు వింటివా? పూటకొక్క యతిథి కన్నము పెట్టి మిగిలిన గంజితో నా కూఁతును రక్షించుకొందును. నేను నా భార్యయుఁ బస్తుండెదము. లేదేని కాయయో కసరో తినుచుందుము. మామాట కేమి?" అని [illegible] పలికెను. ఇంకను నవాబుగారు నిర్విణ్ణులై యుండి చూచుచుండగా "నీతో నాకేమి [illegible] - [illegible] రాజుగారే రాజుగాని నీ వక్కడి రాజు వయ్యా" యని [illegible] [illegible] నవాబుగారి భటులకుఁ గనుసన్న చేసిరో యేమో కాని పల్వురుభటులు సుబ్బరాజుగారిని సున్నము లోని [illegible] కుండఁ గొట్టిరి. సుబ్బరాజుగారు రామరామ యనుచు నా దెబ్బలన్నియు నే మాత్రము తిరుగుబాటయిన లేకుండ కన్నయినఁ జిట్లించుకొనకుండ సహించెను. మఱియొక భటుఁడింతలో వచ్చి యాయన జన్నిదమును ద్రెంపఁబోవగ నాతని నెత్తిపై తన గంటము మొదటితోఁ గొట్టెను. వాఁడు గిలగిలలాడుచుఁ గ్రిందఁబడి పోయెను.

అంత సుబ్బరాజుగారు కారాగృహమందుంపఁబడిరి. నవాబుగారు తమ మహలునకుఁ బోయిరి.

III

స్ఫోటకపువ్యాధులచే విషూచివ్యాధులచే నా మహమ్మదీయ గ్రామమంతయు నిండియున్నది. జనులు కుప్పతిప్పలుగాఁ జచ్చుచున్నారు. బండ్లమీఁద వైచి శవములను దీసికొని పోవుచున్నారు. సుబ్బరాజుగారి కారాగృహమున కొక్క పలువది బారల దూరములో నొక కానుఁగుచెట్టున్నది. అది వీధిప్రక్క నున్నది. దాని క్రిందనే, దుర్గమ్మ యామె కూఁతుతో నివసించుచున్నది. తనకుఁ దనభర్త కన్నము లేకపోయినను ఏజీరుగడమో కల్లు పెండలమో తిని కాలక్షేపము చేయఁగలరు. కాని, అయిదేండ్లపిల్ల యట్లు బ్రదుకఁ గలదా? ఆపిల్లను సంరక్షించుట కామె యొచ్చటనైన దాస్యమును కొప్పుకొని చేయవలయునుగదా! ఎక్కడెక్కడఁ దిరిగినను సదుపాయము నౌకరి దొఱకలేదు. తుదకొక్కయింట నెల కొక్క వరాజీతమున కొప్పుకొని యాయింటను స్ఫోటకపు వ్యాధిచే బాధపడుచున్న యొక కాంత కుదయమునుండి సాయంకాలము వఱ కుపచారము చేయుట కంగీకరించెను. మాసవేతనములోఁ దీఱ్చుకొను పద్ధతిమీఁద నొక్కమాడ ముందుగాఁ దీసికొని పిల్లదానికిఁ గావలయు సామగ్రి కొని కుండతోఁ బెల్లవాఱకముందే రవంతవండి, కూఁతునకుఁ బెట్టి దానిని దండ్రి కారాగృహము గుమ్మము వెలుపలవిడిచి తాను సేవకుఁ బోవుచుండును. ఇట్లు పదునైదు దినములు గడవకుండ నామెపిల్లకు జ్వరమువచ్చెను. పుచ్చుకొన్న మాడ కింకను రెండు దినముల సేవబాకియున్నది. ఋణము తీర్చుకొన కుండరాదనియు, నుచితముగ నెవ్వరి సొమ్మును దీసికొనఁ గూడదనియు నాజ్వరము తోడనే పిల్లను గారాగృహాంగణమున విడిచి సేవకుఁబోయి యాబాకి తీర్చుకొని, యంతటినుండి సేవకు రాఁజాల నని చెప్పెను. పిల్లకు స్ఫోటకము వచ్చినది. రెండుఁ తాను లడ్డు కట్టుకొని యాచెట్టుక్రిందనే వాని చాటునఁ బిల్లను బెట్టుకొని కంటికిమంటి కొక్క ధారగా నేడ్చుచుండును. తండ్రి, కారాగృహమందు భీష్మస్తవరాజమును జదువుకొనుచుండును. ఇట్లుండఁగాఁ బైఁటచాటున గుడ్డలలోఁ బిల్లను బెట్టుకొని యొక్కనాఁ డుదయమున దుర్గమ్మ కారాగృహము నొద్దకుఁగచ్చి పిల్లను తండ్రికి జూపి యేడ్చెను. [illegible] [illegible] కంటనీ [illegible] నిం చెను. [illegible] [illegible] [illegible] రోదనము చేయుచున్న భార్యను గాంచి, [illegible] [illegible] [illegible] రెండు బొమ్మముల నట్టు [illegible] — "ఓయబ్బ! ప్రపంచ మిట్టిదని [illegible] గరు? తొందరపడకు. ఒంటిమిట్ట కోదండరాముఁ డిచ్చినాఁడు, ఆయనయే తీసికొన్నాఁడు. ఓయబ్బ! తనసొమ్ము తాను దీసికొనఁ డేమి? పోతరాజుగారి మాటయందు నాకున్నట్లే నీకుఁ బ్రమాణబుద్ధి యున్నది కావునఁ జెప్పెదను.

"మచ్చిక వీరికెల్ల బహుమాత్రము చోద్యము! దేహి పుట్టువుం
జచ్చుచునుండఁ జూచెదరు. చావక మానెడువారి భంగి నీ

చచ్చినవారి కేడ్చెదరు. చావున కొల్లక దాఁగవచ్చునే?
యిచ్చటఁబుట్టె నచ్చటికి నేగుట నైజము ప్రాణికోటికిన్"

అందువలన నిప్పుడు మన యమ్మ వైకుంఠమున నున్నది. నే నెఱుఁగుదును. నాకు రాత్రియే తెలిసినది." అనెను. ఇంతలో స్ఫోటకపుశవము నచటికిఁ దీసికొని రాఁగూడదు. పోపో యని భటులామెను బెదరించిరి. ఆమె యేడ్చుచు "నాయనలారా! పోవుదును. క్షమింపుఁ"డని భర్తవంకఁ దిరిగి "ఎవ్వరికైన నొకటంక మిచ్చినఁగాని యీపిల్లయొక్క దహనాదికర్మము జరుగదు. నాయొద్ద నేమియు లేదు. నేనే తీసికొనిపోయి నా చేతులతోనే యీ పనిచేయవలయునా?" యని గోలున నేడ్చుచుఁ దటాలునఁ బోయెను. ఆమె యేడ్పు చూచి భర్త గుండె లేకావు-బ్రహ్మాండ గోళమంతయు గడగడవడఁకిన ట్లయ్యెను. నిజమైన యాపద వచ్చినప్పుడు-అందులో మహాపతివ్రత కాపదవచ్చినప్పుడు — ఆయాపదకన్న కడుపుతోఁ జేరినప్పుడు-పునాదులతోఁ జెల్లగిల్లునట్లు-ప్రకృతి కంపించు ననఁగా నాశ్చర్యమేమి? అంత సుబ్బరాజుగారు—

"లావొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యెఁ బ్రాణంబులున్
రావుల్దప్పెను మూర్ఛవచ్చె తనువున్ డస్సెన్ శ్రమంబయ్యెడిన్
నీవేతప్ప నితఃపరం బెఱుఁగ మన్నింపందగుం దీనునిన్
రావే యీశ్వర! కావవే వరద! సంరక్షించు భద్రాత్మకా!"

యను పద్యమును జదువుకొని కొంతకాలంటిపడి రామనామ స్మరణ మొనర్చుకొను చుండెను.

IV

సుబ్బరాజుగారి గంటపుదెబ్బతినిన భటుఁ డిరువది దినములు బాధపడి మరణించెను. ఖూనీ, నేరము చేసినందులకు సుబ్బరాజుగారిని నబాబుగారింక శిక్షింపవలసి యున్నది. విచారణ కొక్క దినమున నాయనను నబాబుగారి కచ్చేరికి దీసికొనిపోవుట కేర్పాటయినది. వకీల్లు కావలయునా? దస్తావేజులు కావలయునా? సాక్ష్యము కావలయునా? నబాబుగారి యెదుటనే కాదా నేరము జరిగినది? భీష్మైకాదశీదినమున విచారణ జరుగనై యున్నది. ఆ యుదయము నసే దేఁకుకొనుచు నాతనిభార్య కారాగృహము గొడ్డకు వచ్చి భర్తను గాంచి "నాకీయుదయమున నుండి వాంతులు భేదు లగుచున్నవి. నా కీ సాయంకాలమువఱకు నిల్చునని తోఁపదు. నడువలేక యిట్లు దేకుకొనుచు వచ్చితిని. సర్వథా అనుగ్రహ మొందవలయును" అని [illegible] యెటఁబడిన గొంతుతోఁ బలికెను. భార్యను గాంచి [illegible] నెను. ఒక్క నిముసమునకుఁ బ్రజ్ఞఁ [illegible] ములనాయనకు లోపలనుండి [illegible] గన్నులనుండు ధేర్చుకొని-శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః — యని భార్య కనుచున్నది. భర్తయుఁ గంటివెంట నీటిచుక్క లేదు. భార్యకంతకంటె లేదు. అతి శుష్కమైన వస్తువున కయిన రసమున్నది. అతినీచమైన కాష్ఠమునకైన రసమున్నది. అగ్నిజ్వాలలకైన రసమున్నది. కాని యతిదుఃఖమున రసము లేదు "మీ పాదసన్నిధిని నాకు మరణింపవలయునని యున్నది. కాని యీ వ్యాధిగల నన్నిక్కడఁ గొంతసేపైన నుండనీయరు. భటులు పొమ్మనకుండనే స్వామీ వెడలిపోదును. నమస్కారము." అని యామె దేఁకుకొనుచుఁ బోయెను. ఆమె యేమనుకొనుచుఁ బోయెనో యాయన యేమనుకొనుచుఁ గొట్టులో నుండెనో వారికే తెలియఁదగినది. అంత—

కం. కలఁడందురు దీనులయెడఁ
గలఁడందురు పరమయోగి గణములపాలన్
గలఁడందు రన్నిదిశలను
గలఁడు కలం డనెడి వాఁడు కలఁడో లేఁడో.

యని చదువుకొనుచు నిట్లు గలిగిన సందేహమును వెంటనే పరిహరించుకొని,

కం. నీపాదకమల సేవయు
నీపాదార్చకులతోడి నెమ్మి నితాంత
శ్రీపాదకమల సేవయుఁ
దాపసమందార నాకు దయసేయఁగదే.

యని ధ్యానించుకొనుచుండెను. ఇంతలో విచారణకై యాయనను గచ్చేరికిఁ దీసికొనిపోవ భటులువచ్చిరి. వారాయనను దీసికొనిపోవుచుండగ "ఆ కానుఁగుచెట్టుక్రింద నన్నొక్కసారి నిలుపవయ్యా! నా భార్యను చూచి వత్తు" నని వారిలో నొక్కని నాతఁడు కోరెను. వారంగీకరింపక చెట్టుప్రక్కనుండియే యాతనిఁ దీసికొనిపోవుచుండ దుర్గా! దుర్గా! దుర్గా యని సింహగర్జనమునఁ బిలిచెను. పలుకలేదు. ఆమె మరణించెనని నిశ్చయపఱచుకొని కోదండరామ ప్రభూ యని యొక్కకేక వైచి "ఓ కానుగుచెట్టా? నాదుర్గను, నా బిడ్డను నేను బోషింపఁజాలని దినములలో నీవు నీడనిచ్చి వారిని బోషించితివి. దిక్కుమాలినదైన నా భాగ్యకళేబరము ప్రక్కనుండియే దానిని జూడకుండ నేను బోవుచున్నాను. నీవట్టిదానవు కావు. నీవింక నామెయొద్దనే కనిపెట్టుకొని యున్నావు. నీవే నాకంటె ధన్యతి కలదానవు. నీకుత్తర జన్మమున మహోత్కృష్టమగు జన్మము సిద్ధించును గాక" యని నడచుచునే చెట్టును దీవించి కచ్చేరికిఁ బోయెను. కచ్చేరిలో విచారణ యేమున్నది? "నీవు మా భటుని గంటముతోఁ గొట్టి చంపితివి-నీ కేశిక్ష యేల విధింపఁగూడదో చెప్పుకొందువా" యని నబాబుగా రాయన నడిగిరి. "ఓయబ్బ! గంటపుదెబ్బకే చచ్చిపోయినాఁడయ్యా! కత్తిగాఁ గొట్టలేదయ్యా! మాయబ్బ! ఎన్ని గ్రంథములు వ్రాసిన గంటమయ్యా! ముందు జన్మమున వాఁడు మంచివిద్వాంసుఁ డౌను. ఈడున మంచికీర్తి పొందుటకే యాదెబ్బఁ బోయినాఁడని [illegible] చెప్పుచుంటే ఇంకేమి? నన్ను [illegible] నీయిష్టము వచ్చినట్లు చేసికొనవయ్యా. అదిగ [illegible] మాత్రము [illegible] పాపం" యని కచ్చేరినుండి పోవుటకుఁ బ్రయత్నింప భటులాయనను బట్టుకొనిరి. ఇంతగర్వి, ఇంత పొగరుబోతు, నింతదుర్మార్గుఁడు లేఁడని యచ్చటివారంద ఱనుకొనిరి. ప్రజల యభిప్రాయముల సౌష్ఠవము సౌభాగ్యము నిది. ఈ యంశము సందేహము కాదు. అన్ని యంశములందుఁ గూడ నిట్టిదే - ఆతని తల నఱుకవలయునని నబాబుగారు భటుల కాజ్ఞాపించెను. "ఓయబ్బ! ఇంతేకద!

ఈమాత్రానికి నన్నీడకుఁ బిలిపించ నెందుకయ్యా" యని యాబ్రాహ్మణుఁడు పలికెను. భటు లాతనిని వధ్యస్థానమునకుఁ గొనిపోయిరి. తలారి కత్తి చేతఁబట్టుకొని యాతని మొగము గాంచి గడగడ వడఁకి నేనీపనిని జేయఁజాలనని కత్తి నావలఁ బాఱవైచెను. ఏలనఱుకలేవని నవాబుగా రాతని నడుగ "ఆతనిరూపము నాకేమో భయంకరముగా నున్నది. నాచేతు లాడకున్న" వని యాతఁడు నవాబుగారి పాదములపైఁ బడెను. "నీవాతనిని నఱుకకుండు నెడల నిన్ను ముందు నఱికింతు" నని నవాబుగా రాతని బెదరించిరి. అంత నాతఁ డేమిచేయఁగలఁడు? గడగడ వడఁకుచు సుబ్బరాజుగారి కంఠమున బిస్మిల్లా యని కత్తి విసరెను. కంఠము తెగలేదు. మఱియొక్కసారి చూరకత్తెచ్చుకొని వైచెను. తెగలేదు. "ఓ సుబ్బ! నీవలనఁగాదయ్యా! భాగవతము తలమీఁదనుండగాఁ దల తెగుననియే యనుకొంటివటయ్యా! నీ బొందపడ! ఎక్కడనో యడవిమృగములవలె నున్నావు. విను. నీవేమియుఁ గష్టపడకు. వెనుకకు విఱిచికట్టిన నాచేతులు విప్పవయ్యా. భాగవతము తలమీఁదినుండి దింపుదును. తరువాత సుళువుగా సుఖముగా నఱుకుదువు కాని- ఎందుకింత రోజన" అని సుబ్బరాజుగారు పలికిరి. చేతులు విప్పుమని నవాబుగారు భటునకు సంజ్ఞచేసిరి. అంత సుబ్బరాజుగారు, కొన్నినాటి ప్రయాణమునుండి యానిముసమువఱకుఁ దలమీఁదనే కట్టుకొనియుంచిన భాగవతమునుదీసి, కన్నుల కద్దుకొని దూరముగ నుంచి దానికిఁ బ్రదక్షిణము నర్చి సాష్టాంగ మాచరించి లేచి కోదండరామప్రభూ! యని బ్రహ్మాండకటాహ మదరున ట్లొక్క కేకవైచి చాపచుట్టగఁ గ్రిందఁబడి ప్రాణములు విడిచెను. కత్తితో భటుఁడింక నఱుకుట యెందుకు? ఆతఁ డెట్లు మరణించెనో? యని యందఱు నాశ్చర్యముగాయున్నది. పరీక్షించిచూడఁగ నాతనినోటినుండి రక్తము లికినది. పిడుగుపడినట్లు కోదండరామప్రభూ యని యాతఁడు వైచిన కేకతో గొంతుకలోని రక్తనాళము తెగి యారక్తపుఁజుక్కలు వాయుద్వారమునఁ బోవుటచే నూఁపిరియాడక నిముసములో మరణమీతనికి సిద్ధించినదని యచటనున్న వైద్యుఁడు Scientific Explanation (శాస్త్రీయ సమాధానమును) చెప్పి, తన పాండిత్య మందఱకుఁ దెలిసినదో లేదోయని యటునిటు చూచెను. పరమాత్ముని యాజ్ఞ యయినది కావునఁ బ్రాణములు దేహమును వదలిపోయిన వని చెప్పగ నందఱకును దెలిసినమాట.

సుబ్బరాజుగారు మరణించిరనుమాట చెవినిబడఁగనే కన్నుల నీరైనఁ గనబడనో కడుపులో నేమైన గుబులుపుట్టెనో కాని గడగడవడఁకి బారున నవాబుగా రేడ్చిరి. వారికంటె ముందుగానే కాఁబోలు వారి భటు లేడ్చిరి. అచ్చటి ప్రజలందఱికంటె ముందుగాఁ గాఁబోలు నేడ్చిరి. అంద ఱేడ్చుచున్నారు. ఎందుల కేడ్చుచున్నారో యెవ్వరు నెఱుఁగరు? ఏది? ఆ సమయమున నెవ్వరికైన మతు లున్నవా? చైతన్యము లున్నవా? గోలుకున్న శోకసముద్ర మంతకంటె నేమి చూలేదు. అంత యూఁదీవిన తరువాత నేడ్చిన లాభమేమి? సుబ్బరాజుగారికథ విన్నవారికే కన్నులు చెమ్మగిల్లవలసి యుండఁగ నాయనకథను జూచినవారికిఁ గడుపు చెఱువయ్యెననఁగ నాశ్చర్యమేమి! నవాబుగారేమో రామభక్తుఁడైనాఁడట. అగుఁగాక. రామభక్తు లందఱు లేరు. వారిలో నాతఁ డొకఁడు. సదా కోటి జంగాలలో నొక బోడిలింగము లెక్కయేమి? ఆర్యావర్త దేశమున నారామచంద్రమూర్తి మహాత్మ్య మెఱుఁగని నరుఁ డెవ్వఁడు? నరునివలెఁ గొందులకు? కోతినడుగు-కొండముచ్చునడుగు-కాకినడుగు-గ్రద్దనడుగు అంతవఱకుఁ గూడ నెందులకు? చెట్టునడుగు - పుట్టనడుగు - జాతి నడుగు-అప్పనడుగు-దేశమంతటను రామనామము శతకోటి జిహ్వలతో మాఱుమ్రోఁగుచున్నది. రాముఁడు లేనిచోటేది? రాముని గూర్చి యొకానొకఁ డిట్లు పలికినాఁడు.

సీ. వీథి పురాణంపు వేదికపై నీవు,
పారాయణపుఁ బీఁటపైని నీవు
దృశ్య ప్రబంధంపుఁ దెరలసందున నీవు,
వృత్తివార్త శ్రుతిఁ బడ్డ యెడను నీవు,
గొల్లసుద్దుల జేకు డొల్లలందున నీవు,
యక్షగానపుఁ జిందు లందు నీవు
చండాలబుజముపై మిండితంబుర నీవు,
తోలుబొమ్మలసంత గోల నీవు,
పడుకగదుల గోడల నీవు భక్తహృదయ
రసనలను నీవు యాయావరతను నీవు-
సృష్టి నీమయమో? నీవు సృష్టిమయమొ!
యెట్లయిన నేమి? రామ! రక్షింపుమయ్య!

# మన పౌరుషము!!

౧

పటుమ లాకాశమును గరిటును
పనులఁ గుంటువ్రుపులఁ బూయును
నిలుకడ యొక్కింత లేదుగదా !
మన పౌరుషమునకు
బలపు సోలపులు బట్టబయ లయ్యెన్.

౨

ధీరులౌ, మతి శక్తియుక్తులౌ
భీరులో ఉత్తరకుమారులౌ
కోరికలఁ బడగూల్ప లేముగదా !
మన పౌరుషములకు
ఊరకను నీరఁ ద్యాగ మలవడునే?—

౩

సత్యసంపద సాత్త్వికత్వము
నిత్యమాత్మకము నసౌజ్ఞానము
భృత్యభావము మాన్ప లేదుగదా !
మన పౌరుషములకు
జాత్యభిజ్ఞానంబె లేదుగదా !!

—విజయాభిలాషి.

# ప్రవాళగీతి

కోడాలి ఆంజనేయులు గారు

తామ్రపర్ణీ పవిత్ర తీర్థములలోనఁ
గళలు విరిగిన నెలవంక కలదకుండె
వృక్షశాఖల చలనప్రవృత్తి మాన్చి
ప్రకృతి శాంతగంభీరభావములు బూనె.

గీ. పుణ్యశైవాలినీ ముక్త పులినతలల
వలిపవెన్నెల లంతంత పలుచవారి
వివిధ కుటజ శాఖాశిఖాంచలములందు
తళతళల నూగు చంద్రమండలము గ్రుంకె.

గీ. గ్రుంకినన్ జెంతగల పల్లెకూటమునకు
జీర్ణ తృణకుటీరాంగణ సీమలందు
కనులు బొడుచుకొన్నను గాని కానరాని
కటికి చీకట్లగమి కాయక్రమ్ము కొనియె.

ఉ. అనిసి, పల్లెకూటమునం దొకపర్ణకుటీరమందునన్
మానిని యొర్తు, వంతఁ దొలిసాటికతల్ స్ఫురియింప కన్నులన్
బూనిన యుష్ణబాష్పకణపూరములం గొనగోట జిమ్ముచున్
“కానకపోతి నిట్టి కడగండ్లకు పాలగుదంచు నక్కటా.”

మ. అనుచున్ జెక్కిలిచేయి జేర్చుకొని పర్యంకాంతభాగంబునం
దునఁ గూర్చుండి విషాదభారమున కన్నుల్ మోడ్చి గంభీరభా
వనిరూఢిం దలపింపజేయఁ గడువిభ్రాంతిప్రదంబైన యా
ర్తనినాదం బొకండున్ వినంబడె కుటీప్రాంగణం బంతటన్.

చ. అని మరుమాటలేక గహనాంతరసీమఁ గుఠారధారఁ గూ
లిన తరువట్లు నేలబడి లేవక యుండిన సంభ్రమంబునన్
వనిత యొకింతసేపు తడబాటును తొందరపాటు పొందు నూ
తన మొంకయాపథమ్ము మదిదట్టిన వేగము ద్రొడ్డిలోనికిన్.

గీ. పరుగిడుచు బోయి యొక యాకు పసరుదెచ్చి
ముకుపుటంబులలోఁ గొంత పోసినంత
కన్నులను విప్పి యటునిటుఁ గదలె నతఁడు
పసరుగుణ మిట్టి దని వేర పలుకనేల?

గీ. అంత మతికొంత సేపటి కాత డహహా
నిదుర మేల్కాన్నగతి లేచి యెదుటఁ బిల్ల
తెమ్మెరలఁ దూగు విరిమల్లెతీవ వోలె
వడకుచున్నట్టి పూఁబోణిపడతిఁ జూచి.

గీ. పడతి! నీవు నాపాలిదైవంబ వగుదు
వెవరవో గాని! యింతయు నెఱుకపడదు.
మబ్బుతెరచాటు గల చందమామ వోలె
చినుగుపుట్టమ్ము లివియేల? చెలువ యనఁగ.

చం. మృదులములౌ గులాబిపువు రేకు నిగారపు చెక్కులం బడిం
బడి జడివానగాఁ గురియు బాష్పకణంబుల జాలు చిన్గప
య్యెద మునికొంగునం దుడిచి యింతి “గతంబుగతంబుఁ జెప్పగా
మొదలిడ భారతం బగును పూర్వపుగాథల వేల త్రవ్వగన్.

గీ. వినఁ జెప్పెదఁ దానఁ గొంతేని లోన
రగులుకొనెడు విషాదభారమ్ము తఱుఁగు:
దైవవశమున ననుఁ గన్న తల్లిదండ్రు
లకట చనిపోవ నాదు బాల్యమ్ము నందె.

గీ. బాల్యమంతయు నుఁ గడచి వయసువచ్చు
పిదప నా మేనమామయె పెండ్లిఁ జేసె
శ్యామలాపురంబున నివాసమ్ము జేయు
భాగ్యవంతుల కిడె నన్నుఁ బ్రజలు మెచ్చ.

గీ. పరిణయంబయి యొక్క వత్సరము రోని
గడచెనో లేదొ మామ స్వర్గస్థుఁ డయ్యె.
అకట పుట్టింటయాశ లీట్లడగిపోవ
నత్తవారింటి కపుడ యాయత్తపడితి.

గీ. క్రొత్తగాఁ గాపురముఁ జేయు కొలదినాళ్లు
ప్రేమచే జూచె నన్ను నా ప్రియవిభుండు
పిదప నేమందు దురదృష్టవిధిని నొక్క
వెలవెలందుక పొత్తుల గలసె నతఁడు.

చ. నగ నదిఁ జూచి నేను “తగవా! మెరమెచ్చుల మాటలాడితోఁ
దగులముఁ జెంది యాకులటతంత్రముల న్వాని ధర్మపత్నికిన్
వగపు ఘటించి యిక్కటుల పాలొనరింపగ నీకు నన్న, కిం
పగు నెరఁజాడ్కిఁ జూచి యెదురాడక నేర్చితి చాలులే యికన్.

గీ. కొంపలో నిన్ను నిలువనీకూడ దనుచు
జాజిపూవ్వుల తావుల జల్లుగురియు
కుటిలకుంతల బంధంబు కూర్చి పట్టి
వెడలనడచెను మాయూరి వెలికి నన్ను.

గీ. నాటినుండియు నిట్టు లివ్వీటనుండి
మాధుకరవృత్తి నిలిపి తస్మచ్ఛరీర
మనుచు కన్నీరు మున్నీరులై స్రవింప
వెలది యేడువఁదొడఁగను వెక్కివెక్కి.

ఉ. అంతట నాటసారి హృదయమ్ము చలింప “ప్రవాళి! నిన్ను నా
దంతట వేఁచినట్టి కుటిలాత్ముఁడ పాపుఁడ నేన నన్ను ర
క్షింతయు పొల్పుగా విపుడు యైన తమిరింపు మటంచుఁ గన్నులన్
దొంతరలౌచు బాష్పములు దొగగ నాపెఁ గవుంగిలించెనన్.

గీ. పొరలుపొరలుగ చీకటి తెరలు విడలి
ఉదయరాగాంకురము లప్పు డుదిత మయ్యె
సంజఁ బ్రియుఁ బాసి దురపిల్లు చక్రవాకి
మఱలఁ గనుగొని ప్రణయసామ్రాజ్య మేలె.

# ఆంధ్రాయుర్వేద గ్రంథములు

ఆయుర్వేద విశారద చా. రామమూర్తి శాస్త్రి గారు

మన దేశమున నన్నిచరిత్రములతోఁ బాటు నాయుర్వేద చరిత్రము గూడ నతికష్టమువలనఁ గాని తెలిసికొనుట కనువగుట లేదు. దైవదోషమునఁ బరపాలకుల దూరమై యంధకారగహ్వరమున నిలిచిన యీ చరిత్రమును దెలిసికొనుటకు నాయాకాలమందలి మహాత్ములు వ్రాసిన గ్రంథములు ప్రమాణములు. కావునఁ గూడినంతవఱకు గ్రంథాధారములతో నీ చరిత్రమును బ్రదర్శింపఁ బ్రయత్నించెదను. పాఠకు లిందలి గుణములఁ గ్రహింప బ్రార్థితులు.

## వైద్యచింతామణి

ఇది యాంధ్రాయుర్వేద గ్రంథములలో విపులముగాఁ బ్రాచీన గ్రంథ విషయములతో సహా విచారణఁ జేసిన స్కంధత్రయ సహిత మగు గ్రంథము. ఏతత్కర్త యింద్రకంటి వల్లభాచార్యుఁడు. ఈతని తండ్రి అమరేశ్వరభట్టు. శ్రీవత్సగోత్రుఁడు. వల్లభాచార్యుఁడు బసవరాజువలెఁ దన గ్రంథమున నెచ్చటను నాంధ్ర పద్యములను గాని గద్యలను గాని చేర్చియుండలేదు. కాని విషనిదానాధ్యాయమున "ఊడుగ గన్నేర్ల తొగఁ గరక్కాయ" యను సీసమాలిక ముద్రిత పుస్తకము లందు మాత్రమున్నది. ఈ సీసమాలికయే బసవరాజీయమునఁ గూడ గలదు. ఇది ప్రక్షిప్తమైనను కావచ్చును. కాదనువారు గ్రంథంబున నెచ్చటను నొక్క యాంధ్రపదమైనను జేర్పని వల్లభాచార్యుఁడు, కేవల మొక్క తెలుఁగుపద్యము నేల గూర్చెనో చెప్పవలసి యున్నది. మఱియు నీ సందిగ్ధప్రమాణము నాధారము చేసికొని యితని నాంధ్రదేశీయునిగా చెప్ప వలనుపడదు. అయినను ఇతని యాంధ్రత్వమునకు మఱి కొన్ని హేతువు లున్నవి.

(1) ఈ గ్రంథ మాంధ్రదేశంబుననే ప్రసిద్ధమై యుండుట (2) ఆంధ్రదేశమునందు గోదావరిమండలమున ఇంద్రగంటి వారనేకు లుండుట (3) ఆంధ్రుఁడగు బసవరాజు కొంచెమించుమించుగా నీ విషయరీతుల నన్నిటిని గ్రహించియుండుట (4) ఆంధ్రదేశము నందలి లెక్కలేని గ్రంథములను గ్రంథకర్తలను జింతామణి యనుకరించి నట్లుండుట, ఇట్టివింకను గలవు.

## చింతామణి స్వాతంత్ర్య గ్రంథమా?

ఆయుర్వేద శాస్త్రము ప్రత్యక్ష విషయమైనది. నిజమైన స్వతంత్రుఁడు బ్రహ్మ యని చెప్పవలసియుండును. ఇట్లు చెప్పినచో సౌశ్రుతాది శల్యచికిత్సకులకును స్వాతంత్ర్యము లేకుండవలసివచ్చును. కావున నీ యాయుర్వేదంబున స్వతంత్రమున కన్యథా యర్థము పరికల్పింపవలసియున్నది. ప్రాచీన విషయములతోఁ బాటు స్వానుభూతవిషయములఁ గొన్ని నూతనములఁ జేర్చి నిబంధించుటయే ఇట స్వతంత్రత కావున నొకవిధముగా గౌణస్వతంత్రత "చింతామణి బసవరాజీయములకు గల్పింపవచ్చును.

ఉదాహరణార్థమై వల్లభాచార్యుడు చెప్పిన నూతన విషయములు కొన్ని:— (1) జ్వరప్రకరణంబున పూర్వ గ్రంథకర్తలు చెప్పిన జ్వరముల లక్షణములనే గాక "మహాజ్వరము లను పేరిట ననేకములను లక్షణములతోడ విభజించుట (2) క్షయరోగమునఁ గ్రొత్తగా నిరువది మహాక్షయలను సలక్షణముగా నిర్దేశించుట (3) కాసరోగంబునఁ బ్రాచీనోక్తభేదములే గాక ఇంకను యిరువదిశ్లేష్మంబులను బంగాళీకాస మందారకాస మున్నగు నామంబులతో వివరించుట. ఇట్లే యచ్చటచ్చట రోగభేదంబుల క్రొత్తగ విభజించినాఁడు. ఇట్లు విభజించుటకుఁ గారణము దినదినము ప్రవర్థితములును పరివర్తితములు నగు వివిధరోగములు తత్కారణములు. ఇఁకను వల్లభాచార్యుఁడు తన గ్రంథమున నూతనముగాఁ జూపిన ద్రవ్యచికిత్సా విషయంబుల గొన్నిటి నుదాహరించెదను:—

(1) ప్రమేహరోగమున - గాఁచినమూత్రముచే ప్రమేహ సాధ్యాసాధ్యజ్ఞానమును వివరించుట (2) అమ్లపిత్తరోగమున "పోస్తుకాయ గసగసాలు నల్లమందు" వీనిని ప్రయోగించుట (3) మూలరోగమునందు ధూమార్థము గౌరీపాషాణప్రయోగము (4) చాతుర్థికజ్వరమున నస్యార్థము అగస్త్యపత్రప్రయోగము (5) గ్రహణీరోగమున నల్లమందు నుపయోగించుట (6) కంఠజివ్హిక యను కాసరోగమున ధూమపానార్థము నేపాళపువ్రేళ్ల నుపయోగించుట (7) ప్రమేహములలో "పరింగిచెక్క"ను బ్రయోగించుట (8) అగ్నిమాంద్యమునఁ జెప్పిన యోగములలో ఉమ్మెత్తవిత్తుల భస్మము నుపయోగించుట (9) ప్రమేహమున నెవగలను బ్రయోగించుట (10) ప్రమేహములలో [illegible] ఇట్టివి ఇంకను ఎన్నియో గలవు. ఇట్లు విషయములను పేర్కొనుచు బోయిన గ్రంథవిస్తరమగును గాన నిం దొక్క విషయంబును మాత్రము చెప్పి విరమించెదను. శిరస్సంజనితము లగు యూకలకు మనవారు చేయుచుండిన పాదరసపువైద్యమును నీ గ్రంథకారుఁడు చెప్పియున్నాఁడు. అప్పటి దీతద్గ్రంథకర్తయే కనిపెట్టినట్లు తోఁచుచున్నది. ఆ సందర్భపు గ్రంథభాగ మిది:— శ్లో. పారదం మర్దయే స్నిగ్ధం కృష్ణధత్తూరక ద్రవైః। నాగవల్లీద్రవైర్వాథ వస్త్రఖండం ప్రలేపయేత్। తద్వస్త్రం మస్తకే బద్ధ్వాధార్యం యామత్రయం తతః। యూకాః పతంతి నిశ్చేష్టాః పరీక్ష్యాత్ర సంశయః। విశాలాయాః ఫలం పక్వం

తప్తలోహే పరిక్షిపేత్। తద్ధూమోదంత లగ్నశ్చేత్కటాహో సాంఘత నం పరమ్. ఈ వల్లభాచార్యుఁడొక్క భిషక్ఛిఖామణియే కాక సరస కవిశిఖామణి యనియుఁ దెలియుచున్నది. ఈతని కవిత్వ గుంభనల కీ క్రిందిరచనలు సాక్ష్యమీయఁగలుగును:—శ్లో. ఫలత్రయం కటుత్రయం సుయోజయే ద్భిషగ్వర। త్రిజాతకం యవాని యుగ్మ వహ్ని జీరకం తథా। రాస్న భార్గవహ్నిచ వ్యధాన్య యుగ్మ జీరకం అశ్వగంధ సంయుతం పృథక్చకర్ష సంయుతం। మధుస్నుహేచ తత్సమా సశర్కరాసమాక్షికం। గోఘృతం సుపక్వకం రసాయనం మనోహారం। మేహపిత్తవాతమిస్త గుల్మశూలహారకం। సప్తధాతు వర్ధనం సుదీపనం యశస్కరం। పూజ్యపాదనిర్మితం రసాయనం సుపూజితమ్॥

బసవరాజీయము:—ఆంధ్రాయుర్వేద గ్రంథములలో "చింతామణి" తరువాత నిదియే యుత్తమగ్రంథము. ఆంధ్రభిషజులలో దీనిని జదువనివా రుండరు. ఈ గ్రంథమునకు రచయిత నీలకంఠ కొట్టూరు బసవరాజు. ఈయనతండ్రి నమశ్శివాయ గురువు. ఆరాధ్య రామదేశికుడు. స్వనామ గురునామాదులను బట్టికాని ప్రకరణాంతమున నీతడు చేయు ప్రార్థనలఁ బట్టిగాని చూచినచో నీతండు శైవుండని తోచును. అనుకర్తృసుకార్యులను ఏర్పఱచ వీలు లేదు. కాని యీతఁడు చింతామణిలోని విషయంబుల ననేకము తన గ్రంథమున జేర్చినాడందురు. కలౌ బసవక స్మృతిః, కలౌ చింతామణిస్మృతిః వచనములు సంశయము నొదవించుటకు మాత్రమే చాలియున్నవి. ఈయన "కవితాచాతురీ ధురీణుఁ"డ నని వ్రాసికొన్నను కవిత అంత సరసముగా నుండలేదు. కాని "వైద్యజనశిరోభూషణ" యను బిరుదమును జాలవఱకు సార్థకము జేసికొన్నాఁడు. వల్లభాచార్యుని కాలముకంటె నీతనికాలంబున నాంధ్రాయుర్వేదము కొంచె మభివృద్ధి గాంచిన దనవచ్చును. అనేకగ్రంథములం జూచి అందలి సారంబుగ్రహించి తా నీ గ్రంథమును జేయుచున్నాను అని వ్రాసిన మాట కుపబలముగాఁ గాబోలును ముద్రితమైన బసవరాజీయములో ఆయా విషయములకు మొదట చరకే మాధవనిదానే అను నీ మున్నగు పదము లుట్టంకితములు. కాని చరకసంహితలో రసగంధకాది యోగములును మాధవనిదానమున చికిత్సావిషయంబులును నెచ్చట నున్నవో నిరూపింపవలయును. ఇప్పుడు లభించు చరకాది గ్రంథములలో లేవు.

వల్లభాచార్యునికంటెను బసవరాజీయమునఁ జేర్చిన గొన్ని నూతనయోగములు:—(1) కర్పూరిని బసవరాజు పురాణజ్వరముల యందు ప్రధానముగా నుపయోగించుట (2) అగ్నిమాంద్యమున విషముష్టిని ప్రయోగించుట (3) ఉబ్బసమున బలురక్కసిని ప్రయోగించుట (4) ప్రమేహమును వేపబంకను ప్రయోగించుట (5) మూల రోగమున ఆకుపలకట్టు నుపయోగించుట (6) ప్రతిశ్యాయరోగమున నవాసారము నుపయోగించుట (7) యోనిశూలలో మయూరతుత్థ ప్రయోగము (8) ఉన్మాద రోగములలో పంది చెవిలోని రక్తముచే నస్యకర్మఁ జేయించుట (9) వ్రణము పగులుటకు నరాస్థిని తైలముతో లేపనము జేయుటతో (10) కోఁడిగ్రుడ్డునందు రసమును దీసివైచి ఔషధద్రవ్యమునుంచి వాలుకాయంత్రమునఁ బచనముచేయుట. (11) వంధ్యారోగమందు మహాద్రాక్షాదియోగములు (12) హృద్రోగమున గురివెంద విత్తుల నుపయోగించుట (13) పాండురోగమున నల్లఉప్పిచెక్కను విశేషముగాఁ బ్రయోగించుట (14) ఉబ్బసంబున చేఁదుబీఱవిత్తులను బ్రయోగించుట ఇట్లనేకములు గలవు. వాతరోగములలో వల్లభాచార్యుడు గ్రహింపని యాయుర్వేదసూత్రమును అగ్నికర్మకుఁ దన గ్రంథమున నీయనఁ జేర్చినాడు. మొత్తముమీఁద నాంధ్రాయుర్వేదాభివృద్ధి వల్లభాచార్యుని కాలమునఁదుకంటెను ఈ బసవరాజు కాలమునందు నెక్కుడు అభివృద్ధి నొందె ననవచ్చును.

భేషజకల్పము:—ఇయ్యది పరిభాషాత్మక గ్రంథము. చందనాచార్యపుత్రుఁ డగు గంగాధరాచార్యునిచే సంగ్రహింపఁబడినది. దీనిని చిలకపట్టి వేంకటాచార్యుఁడు ఆంధ్రమున పద్యరూపముగా నొనర్చినాడు. ఈతఁడు శరణ్యపాదాచార్యుని కొమరుఁడు. ఈయన గురువు కందాళ రంగాచార్యుఁడు. ఇం దెన్నియో పరిభాషలు గలవు. మాన విషయంబైన మతిభేదము లిందుఁ జక్కఁగా విభజింపఁబడియున్నవి. తత్తత్ప్రక్రియల కుపయోగించు కషాయభేదము లెన్నియో చక్కఁగా వివరింపఁబడినవి.

ఇట్టిగ్రంథ మింతదనుక వ్రాయసకాండ్రమూలమున దోషభూయిష్ఠంబై యున్నది. దీనిని కీ. శే. వైద్యరత్న ఆయుర్వేదమార్తాండ భిషఙ్మణి పండిత డి. గోపాలాచార్యుల వారు అనేక గ్రంథముల సహాయ్యమున స్వోపజ్ఞ మగు నాంధ్రవ్యాఖ్యానముతో ముద్రించి పుణ్యము గట్టికొని మనలఁ దరింపఁజేసినారు.

ఆంధ్రచింతామణి:—దేవులపల్లి వెంకటనరసయ్య ఈగ్రంథమునకు ప్రణేత. శ్రీనివాసమంత్రి ఈయన పితామహుడు. ప్రారంభ పద్యములవలన నద్వైతమతస్థుం డని తెలియుచున్నది. అశ్వాసాంత గద్యమువలన ప్రధానముగా వైష్ణవభక్తుఁ డని తేలును. ఈయన వ్రాసికొనిన గద్యను బట్టి వల్లభాచార్య విరచితంబగు వైద్యచింతామణి కిది యొకవిధ మగు ననుకృతి యని స్పష్ట మగును. ఈ భాషాంతరీకరణమును బట్టి చూచినచో గొంత వ్యత్యాసము గూడ నున్నది. లక్ష్యానుసారంబుగ నీతడు ప్రథమాశ్వాసంబున నే లోహపాషాణౌషధకూరకాదిక్రియలను జెప్పియున్నాడు. ఇప్పుడు ముద్రితమైన చింతామణియందు నీ ప్రకరణము లుట్టంకిడకు కాన్పించుచున్నది. ఇం దెయ్యది గల్యాణ యూహింప వలనుపడలేదు. ఎట్లయినను నితండు పూర్వగ్రంథముల ననుసరించి భాషాంతరీకరించినట్లు తోఁచెడిని. కాని పాత్రమంతయు లభించుట లేదు.

శరభరాజీయము:— ఈ గ్రంథమునకుఁ గర్త శివదేవుల శరభరాజు. ఈతని కాలము గాని జన్మస్థలము గాని తెలియఁజేయు నాధారంబులు గానరావు. ఇందు బసవరాజీయము వైద్యచింతామణి మున్నగు వానిలోని యోగములు గానఁబడుటచేత తదనంతర కాలికత్వము మాత్రము సిద్ధించుచున్నది.

# డాక్టరు ఆ. లక్ష్మీపతి, బి. ఏ., ఎం. బి. సి. ఎం. గారిచే స్థాపింపబడిన

## ఆంధ్రఆయుర్వేద ఫార్మసీ లిమిటెడ్ వారిచే నిర్దుష్టముగా తయారుచేయబడిన శాస్త్రీయ ఔషధములు.

### తాళీసాదిచూర్ణము-బిళ్లలు

లేక టేబ్లెట్లు. చూర్ణము 10 తులములు 8 అణాలు

టేబ్లెట్లు 100 ఒకరూపాయి. 1000-కి 7-8-0.

శ్లో. కాసశ్వాస జ్వరహరం ఛర్ద్యతీసారనాశనం। శోషాధ్మానహరం ప్లీహగ్రహణీ పాండురోగజిత్. శా॥సంహిత



దగ్గు ఎగయూపిరి జ్వరము జలుబు మొదలగు వ్యాధులయందు మిక్కిలి ఉపయోగకరం. వాంతులు అజీర్ణ విరేచనములు కట్టును. అరుచిని బోగొట్టి జీర్ణశక్తిని వృద్ధి చేయును. క్షయ, ప్లీహ పాండురోగములయందుగూడ వీని ఉపయోగము గలదు.

### ఇచ్ఛాభేదివటి

తులము 0-10-0 అణాలు; 10 తులములు రూ 5-0-0

మాత్రలు 100-కి 8 అణాలు ; 1000-కి రూ 4.

ఇది సుఖవిరేచనము చేయును. జ్వరములోను గూడ నిచ్చిన విశేషమై జ్వరము తగ్గును. రాత్రి పరుండబోవునపుడు తీసికొనిన ఉదయమున విరేచన మగును.

### చందనాది వటి.

25 మాత్రలు 1 రూపాయి.

ఈమాత్రలు ఉష్ణమేహము, ఔపసర్గికమేహము(పచ్చసెగ), మూత్రకృచ్ఛ్రము, మూత్రనాళము గోనిత్రణము, మూత్రాశయ బలహీనత, స్త్రీలకువచ్చే కుసుమరోగములు, మొదలగుగువ్యాధులను బోగొట్టును. గనేరియాకు ప్రశస్తమైన మందు.

### అశ్వగంధావలేహ్యము.

4 అవున్సులు 1 రూపాయి; ఒకపౌను రూ, 8

శ్లో. కృశక్షీణేశ వర్ణే చ బాలేషు బలవర్ధనం...॥

ఇది క్షీణించిన శరీరము గలవారలకు బలము, పుష్టి, జఠరదీప్తిని గలిగించును. మరియు వడికను కచ్చిన, చిరకాలము నుండి యున్న దగ్గురోగమును బాగుచేయును.

వాతరోగము, ఆమవాతనొప్పులు, కీళ్లనొప్పులు బోగొట్టి నరములకు బలము చేయును. ధాతువృద్ధిని గలిగించును. మేధాజనకము.

### దంతధావన చూర్ణము.

అవున్సు 0-4-0; 2 అవున్సులు 0-7-0.

దీనితో పళ్లు తోముకొనిన, శుచిగాను, దుర్గంధ రహితముగా నుండును. ఇది స్వాదుగాను కటు, కషాయరస ప్రధానముగాను ఉండును. పళ్లచెంబడిని చీము, రక్తముపడుట, పళ్లు కదలుట, మాటిమాటికి చిగుళ్లు ఉబ్బుట మొదలగు దంతరోగములను బోగొట్టును. నోటిపూతకు గండూషముగా కూడ నుపయోగి పడగును.

### వాసావలేహ్యము.

(దగ్గు, కఫరోగాధి నారము)

"...శ్వాసకేచ కాసేతుయే ప్రపిత్తేకఫపీనసేచ......"

ఈ లేహ్యము దగ్గు, ఉబ్బస, ఉబ్బసము, నోటివెంట రక్తముపడుట, క్షయ మొదలగు వ్యాధులయందు మిక్కిలి ఉపయోగకరము. 4 అవున్సులు రూ 1-4-0; 1 పౌను రూ 4.

వాసామార్గము! ఈ మార్గమును కృష్ణమండలి పొగను పీల్చుచుండిన దగ్గు, ఎగ ఊపిరి వెంటనే తగ్గును. రోగికి ఆయాసము ఎక్కువగ నున్నపుడు సైతము వాసావలేహ్యము లోపలికి ఇచ్చుచు ఈమార్గముతో ధూమపానముచేయించుట హితము.

వెల 1 అవున్సు రూ 0-12-0.

**పోస్టుబాక్సు 369. ఆంధ్ర ఆయుర్వేదఫార్మసీ లిమిటెడ్, 19 హారిస్‌రోడ్డు, మౌంటురోడ్డు-మద్రాసు.**

రసప్రదీపిక:— ఇది [illegible] మూల వ్యాఖ్యానముల గ్రంథము. దీనిని ముదుంబి వేంకటాచార్యుడు సంస్కృతమునుండి యాంధ్రమున పద్యరూపముగా నొనర్చినాడు. కీ. శే. వీరేశలింగము పంతులు గారు కవిచరిత్రమున నీతడు నూఱు సంవత్సరముల లోపటివాఁడనియు గోదావరి మండలవాసి యనియు వ్రాసినారు. రసప్రదీపిక యాంధ్రభాషలోని రసాయనిక గ్రంథములలో తొలుదొల్తది. ఇందు ధాతు లోహ మారణాది విషయంబు లన్నియు వర్ణింపఁబడి యున్నవి. ప్రాచీన రసతంత్ర ప్రవర్తకులు పారదము రసరసేంద్ర సూత, పారద, మిశ్రక భేదములచే నైదు విధము లనియు నందు రస రసేంద్రములు బుట్టెడి కూపములు దేవనాగులు పూడ్చిరనియు దానంజేసి యవ్వి దుర్లభంబు లనియు మిగిలిన సూత మిశ్ర పారదంబులు లభ్యంబు లనియు వ్రాసియుండగా నీ కవి తనకాలమునకు ఆమాటిలో గూడ రెండు దుర్లభంబు లగుటవలన పారదము మాత్రమే లభ్య మగు నన్నాడు. ఈ రసప్రదీపికకును కీ. శే. గోపాలాచార్యులుగారు ప్రభ యను వ్యాఖ్యానము తెలుగున వ్రాసి ప్రకటించినారు. ఈ రసప్రదీపికయు నీవ్యాఖ్యానమును నాంధ్రదేశమందలి రసాయనిక గ్రంథదారిద్ర్యమును తొలగించిన దనియే చెప్పవచ్చును.

నవనాథసిద్ధప్రదీపిక:— గ్రంథకర్త ఇర్లపాటి పేరయామాత్యుఁడు. వైద్యసార మని గూడ దీనికి మఱొక నామము గలదు. ఇయ్యది యసంపూర్ణమగుటచే గ్రంథము సంతగా విమర్శింప వీలు లేదు.

ఈ విషయమును గూర్చి యింకగా విమర్శింప నవసరము లేదు. ఈ గ్రంథములలో చాలభాగము ముద్రితంబులై మనకు దొరకుచునే యున్నవి. కావున ముద్రణలో లేక యాంధ్రవ్యాఖ్యతో గూడియున్న యొకటి రెండు గ్రంథములను మాత్రము వివరించెదను.

గదా సంజీవనము:— ఇది సంస్కృతంబున శ్రీవత్సగోత్రుండును అపస్తంబసూత్రుండు నగు మాధవపండితునిచే రచింపఁబడినది. ఈతనికి వైద్యవిద్యా త్రినేత్ర యను బిరుదమున్నది. ఈ గ్రంథమునకు యాంధ్రటీక నెవ్వ రెవ్వరు రచించిరో తెలియదు. ఇందు రోగ నిదానంబులు లక్షణంబులు తచ్చికిత్సలును చక్కగా వివరింపఁబడినవి. కాని ఇయ్యది యసంపూర్ణముగా లభించుటచే సంతగా విమర్శింప వీలుపడుటలేదు. వైలికోక్త శ్లోకము:—

శ్లో॥ దండలీపత్రమూలంచ భృంగీభృంగంచ నాగరమ్
లశునం శృంగబేరంచ క్వాథోయం సర్వశూలజిత్.

ఆహారము:— ఇందలి "గౌరీపుత్ర కార్తికేయ వరదితే [illegible] గ్రహణి [illegible] ప్రశమం [illegible]." అను గద్యమును పరిశీలించినచో నష్టాంగహృదయమును కాక ఇదియొక నూతన గ్రంథమని స్ఫురించుచున్నది. కాని నిజమునకు దీని నెవ్వరు రచించిరో తెలియరాదు. ఇందు [illegible] నిదానంబులు చికిత్సలు [illegible] గలవు. ఇయ్యది రెండు పరిచ్ఛేదములు మాత్రము లభించుచున్నది. ఇవి గాక మద్రాసులో [illegible] పుద్యాడవారు ఈ క్రింది గ్రంథములకు చక్కని టీకలను వ్రాసి ప్రకటించినారు:— (1) అష్టాంగహృదయము (2) [illegible]కరము (3) కాలజ్ఞానము (4) గుణపాఠము (5) [illegible] (6) చికిత్సారత్నము (7) చికిత్సాసారము, (8) ధన్వంతరినిఘంటువు. (9) నాడీనక్షత్రమాల (10) నాడీజ్ఞానము (11) నాడీకరణకల్పద్రుమము (12) శార్ఙ్గధరసంహిత (13) [illegible] (14) సుశ్రుతశారీరము (15) వైద్యామృతము (16) సద్వైద్యజీవనము. (17) అనుపానమంజరి. ఇట్టులనే మొన్నమొన్న కీర్తిశేషులైన పండిత గోపాలాచార్యులు వారును ఈ క్రింది గ్రంథములను చక్కని వ్యాఖ్యానములతో ముద్రించి ఆంధ్రదేశసేవఁ జేసి యశముఁ బడసి యున్నారు. (1) మాధవనిదానము (2) ఆర్కప్రకాశము (3) ఆయుర్వేదపరిభాష (4) పథ్యాపథ్యము. ఇవి కాక శ్రీ ఆచార్యులవారు టీకలు వ్రాసిన పెక్కు గ్రంథము లున్నవి. ఈ వ్రాసిన దానిం బట్టి మనయాంధ్రదేశమునఁ గొంతవఱకు గల ఆయుర్వేద గ్రంథముల స్థితి తెలిసినది. ఇంతకు నధికముగా గ్రంథము లుండినవని చెప్పవలసియున్నది. కాని అట్టివి వెలుగుదలంచుట నిజముగా మన [illegible] తప్పదు. ఇప్పటి మన స్థితిగతు లెంత హీనముగా నున్నను, పూర్వులగు మన యాంధ్రులు ఆయుర్వేదమున మిగుల ప్రసిద్ధి కెక్కిన సుచికిత్సకులై గౌరవపాత్రులై రని [illegible] చాటుచున్నది. మఱియు నిప్పుడును గూడ [illegible] మైసూరు మొదలగు సంస్థానంబులు [illegible] యాయుర్వేదమునకుఁ బ్రోత్సాహ మొసఁగుచున్నారు. [illegible] మునిసిపల్ సంఘములవారును తాలూకా బోర్డు జిల్లాబోర్డుల వారును యాయుర్వేదముపట్ల నభిమానముఁ జూపుచున్నారు. ఇట్లే మన యాంధ్రదేశములోని సంస్థానాధీశులును శ్రీమంతులును [illegible] ఈ యాయుర్వేదమునకుఁ జేయూత నొసంగినచో ఆంధ్రభాషాదేవికి అమూల్యాభరణము లనఁదగిన గ్రంథరత్నములు వెలయుటకు వీలు కల్గును. [illegible] కావున సద్వైద్యులకు [illegible] దేశమున కిట్టి భాగ్యమును ప్రసాదించుగాక.

# లోకయాత్ర

## మల్లంపల్లి మల్లికార్జునశాస్త్రిగారు

లోకము భిన్నభావము విలుప్తము బుద్ధియు బల్మికల్మి, దు
ర్థీకులు మాయలందుఁ గడతేఱినప్పాయులు పెక్కుమంది, కు
శ్లోకులు ధర్మతత్పరులఁ జూడఁగఁ దక్కువ. ఏమిదారి? యా
హా! కలికాలసాధు లపహాస్యతపా లగుచుండి రెంతయున్.

ఉ. లోఁచును మంచి చెడ్డయె, తోఁచును జెడ్డయు మంచియౌచు, నా
లోచన లెన్నగా నలిపి లోకహితం బగు దాని నెట్టులో
యాచరణంబునం దిడుట యందరికిన్. విధి, స్వీయపక్షమున్
జూచిన లాభముం డెడి ననూనము వీడుట శ్రేయ మెంతయున్.

చ. ఒకరి సుఖంబునన్ సుఖమె? యొక్కరి దుఃఖము దుఃఖమే? జగ
మ్మొకపగిదిన్ సుఖించుగతి యోజనచేసెడి బుద్ధిమంతు లె
న్నిక గను కాల మియ్యది. యనింద్యచరిత్రులె రాజు లెల్ల. నిం
దకుఁ దగు కర్జముల్ సలుప దార్కొన రెన్నడు భూమిపాలకుల్.

మ. మన సేరీతి మెలంగినన్ జగము నమ్మార్గమ్ముననే ప్రవర్తిల్లు. స
జ్జనుఁ డేవేళ బరోపకారపరుఁడై సన్మార్గుఁడై యొప్పు. దు
ర్జనుఁ డేవో యపకారముల్ సలిపి సర్వద్వేషియౌ. లోకరం
జనుఁ డెవ్వండొ యతండె రాజగును. రాజద్వేషి కీడంజెడున్.

శా. ఎంచం జెల్లదు దోషులంచు నొరులన్, హేయంబుగా వేని వ
ర్ణించం జెల్లు, బరోపకారులను దూషించంగ రాదెప్డు బా
ధించం గూడదు సాధుమానవుల యత్నించంగ నా కీర్తికిం
గించి త్తేని వివేక మున్న నరుఁడేన్ గీడొందుఁ గా కుండినన్.

శా. ఊనం బిడ్డ యనూన మియ్యది మహాంహోదారుణం బిడ్డ ని
త్యానందం బిది పుణ్య మియ్యది యటం చావంత యోజించు వా
డే నాడేమి యొనర్చినన్ జగతికా నింతేని మేల్ తాదృశ
జ్ఞానంబు న్విడి చేసినట్టి పని ప్రాజ్ఞశ్లాఘ్య మెట్లయ్యెడిన్?

చ. ఎవరికి నేది యిష్టమొ యదే శుభదం బగు వారి కెప్డు, శాం
భవ మని శాక్త మందు మరి వైష్ణవ మంచును సౌర మంచుఁ గ్రై
స్తవ మని శౌరాకం బనియు ధాత్రిఁ గట్టి మతమ్ము లెల్ల మం
చివి యు. యుపాసనప్రకృతి చెడ్డదియే నది చెడ్డ దయ్యెడిన్.

సీ. కామధేనువుఁ గొన్న కార్తవీర్యునిఁ దండ్రి
గాఁ బ్రీతయని గొడ్డుఁ గావ లేని పుత్రు
లవనిఁ బరశురాముఁ డక్షత్రియముగఁ జేసె
ధాత్రీసురుల కిడి దానకీర్తి
ముని కశ్యపుని కిడి యతని కిడఁ బోక
పదము తార్కొపిపడముఁ గనిన
బ్రాహ్మణుఁ డు కన్న క్షాత్త్రం బూన నగు తేజ
మని తెల్పెఁ గుశికనందనమహర్షి.

తే. యిప్పటికిఁ బ్రభువులు బ్రాహ్మణేతరులకు
గౌరవము గూర్పఁగడఁగుట కరము బ్రాహ్మ
ణుక్కడని తెల్పనట్టిది యొట్టు లగుకు
పట్టుఁబట్టడు పట్ట దెప్పటికి నిజము.

తే. అప్పు డారీతి బ్రాహ్మణు లవనిపు లయి
దాని క్షత్రియులకు నిడి తపముఁ బూని
మంత్రులయి కీర్తిఁ గని కలిమహిమ నేఁడ
కత్యాయనమను దగరుం డ్రి కడకు నకట.

తే. కలిమహిమ నిప్పు డంతగాఁ గానిపించ
కున్న నింతయో యంతయో యున్న దిపుడు
బ్రాహ్మణులకు నస్వార్థపర ప్రవృత్తి
బూని విడకున్న వారి కెంతేని మేలు.

సీ. వృత్రాసురుని జంపవేడిన మఘవ సాగరముఁ
ద్రావడె మున్న గస్త్యమౌని
మును దధీచి యనెడి ముని యీడె తన
యెముకలర్థులై వచ్చిన యనిమిషులకు
దవకడ కరువంచు తపసులఁ బ్రోచి గోదా
వరిన్ జేడె గౌతమ మహర్షి
ఇక నెంద తెందఱో బుధు లుపకారముల్
చేసి లోకములఁ బ్రసిద్ధిఁ గనరె.

తే. అట్లె జగదుపకారమ్ము నాచరించి
బ్రాహ్మణులు తమ గౌరవంబు నిల్ప
కొనఁగవలె. వారి ద్వేషింపఁగూడ దెవరు
బ్రాహ్మణద్వేషమున నేగి వచ్చునంద్రు.

తే. నెంకటినుండియు నన్యుల మోసపుచ్చి
యణఁగ ద్రొక్కిరి బ్రాహ్మణు లనుచు గొంద
ఱంద్రు నాతు లెవ్వరో వారి నఖిలమునులు
గారవించుటఁ గనరో యవ్వార లెపుడు.

తే. అతఁడు మునులకు నుడివిన యవియ కద బు
రాణములు నేఁటికిని వాని బ్రాహ్మణులు ని
రాకరించిరె? యోగ్యులు గాక యెవరు
గారవముఁ బొంద జాలరు గా ధరిత్రి.

తే. ఎవరి జాతి యేదిగాని, యేమతంబు
గాని, యన్యోన్యసౌఖ్యంబు గలిగి మెలఁగ
కలరొ సద్గుణ శుభములుగలిగి తఱుచు
గాఁ గలికిఁ గూడదు కలహ పడుట.

తే. అరయ నాచారముల కప్పుడపుడు మార్పు
లగుపడెడి మున్న నిప్పుడు నప్పగిదిని
జేసికొన నగు వచ్చెడి నేఁగి మేలు
లందు నియ్యది యధికంబొ? యారయ వలయు.

# ఆయుర్వేదము — ఆంధ్రుల కర్తవ్యము

ఆచంట లక్ష్మీపతి గారు, బి. ఏ. ఎం. బి. సి. ఎమ్.

ఆంధ్రరత్నమనఁ దగిన వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులుగారు మన దురదృష్టమున కాలధర్మము నొందుట సంభవించినది. ఆచార్యులవారు కేవలమును మన ఆంధ్రదేశమునందొక్కచోట మాత్రమే గాక భరతఖండమునందంతటను విఖ్యాతిగాంచినవారు. వారున్నంతకాలము మఱెవ్వరిసాయము నక్కఱలేకయే ప్రజాహితకరము లగు నాయుర్వేదకార్యము లన్నియును అవలీలగా నెఱవేరుచుండెను. వారు లేనిలోప మిప్పుడు గదా తెలియుచున్నది. మాటలకేమిగాని- సంవత్సరమునకు పదివేల రూపాయలకు మించిన వ్యయమును భరించి, భరతఖండమున కంతటికిని ఆదర్శమనఁదగినట్టి ఒకకళాశాలను ఆయుర్వేద ధర్మవైద్యాలయమును 10,15 సంవత్సరములు తామొక్కరే నిర్వహించుటకు ఎంతటి ప్రజ్ఞాప్రాభవములు కావలయునో ఆలోచింపుడు.

ప్రకృతము ఆయుర్వేదపు స్థితి సందిగ్ధావస్థలో నున్నది. ఇంతవఱకును ప్రభుత్వమువారును, వారి వైద్యశాఖాధికారులును ఆయుర్వేదమునకు తాము ప్రతికూలురమనుటను బాహాటముగ వ్యక్తపఱచుచుండిరి. ఆయుర్వేదము పట్ల తామున్నంతకాలమును ఎట్టి సానుభూతిని జూపమని శాసనసభలో నిదివఱకు వైముఖ్యమును జూపిన సర్జనుజనరలు గిఫర్డుగారే గడచిన ఫిబ్రవరిలో నూతనశాసన నిర్మాణసభలో ప్రజాప్రతినిధుల మనుకూలురు వారిబలము హెచ్చగుటచేత మౌనము వహింపవలసివచ్చినది. తరువాత "ఆయుర్వేదాభివృద్ధికై వలయు కార్యములను నిర్వహించుటకు ప్రభుత్వమువారు వెంటనే పూనుకొనవలయు"నను ఏ. ఎస్. కృష్ణారావుగారి తీర్మానము అంగీకృతమైనది. తదనుసారముగ నాయుర్వేద ప్రాశస్త్యమును పరీక్షించుటకై ప్రభుత్వమువారు కమిటీని ఏర్పఱచిరి. ఫలితము ముందు విశదమగును.

**డాక్టరు కోమనుగారి రిపోర్టు**

ఇది ఇట్లుండఁగా, ప్రభుత్వమువారు, 1918 ఆగస్టులో ఆయుర్వేదౌషధములలో నుపయోగకరము లగునవి ఏవియైన నున్నవేమో పరిశోధించుటకు డాక్టరు కోమనుగారిని నేమించిరి. కోమనుగారిని నేమించునప్పుడు శాసనసభ్యులు వీరి నియామకము "ఆయుర్వేదాభివృద్ధికా? లేక, ఆంగ్లవైద్యాభివృద్ధికా?" యని ప్రశ్నింపగా, ఆయుర్వేదము అశాస్త్రీయమనియును, కోమనుగారి నియామకము ఆయుర్వేదములోగల ప్రశస్తౌషధములను ఎఱుంగుటకే యనియును జెప్పిన ప్రభుత్వమువారి ప్రత్యుత్తరమును బట్టియే ఫలితము గూడ నూహింప వచ్చును.

డాక్టరు కోమనుగారి రిపోర్టు ఇటీవల బయలువెడలినది. కోమనుగారి నియామకమున [illegible] పరిపూర్ణమగు విశ్వాసము కలదు. ఆయన ఆయుర్వేదము నెఱుఁగని వాఁడే యగుటయు ఆయుర్వేదాభిమాని [illegible]. తాము ఆయుర్వేదౌషధములను పరీక్షించితిమనియును, అవియు [illegible] ఉపయోగకరములును సులభ్యములును నగా నున్నవనియును వారు వ్రాసినారు. కాని మనకు వీరి రిపోర్టును చదువకముందే ఈవిషయములు తెలిసియున్నవి. కాని తొలుత ప్రకటనకు గడంగిన వీరిలేఖిని ప్రభుత్వాధికార వాసనావశమునఁ గాబోలు-ఆయుర్వేదము శాస్త్రీయ పద్ధతులకు దూరమనియును, ఇందు తాము తెలిసికొనుటకు ఏమాత్రమెత్తియో కాని, బ్రిటీషు ఫార్మకోపియామందులకంటె నిందు పరిగణింపఁదగిన విశేషౌషధములు లేవనియును ఆయుర్వేదౌషధములకంటెను ఆంగ్లేయ ఔషధములే సర్వసాధారణముగ నుపయోగింపఁదగినంతటి చౌకగా నున్నవనియును ఆయుర్వేదౌషధములకంటె ఆంగ్లేయౌషధములే సులభసాధ్యము లనియు నీమున్నగు వాక్యరత్నములతో రిపోర్టు పర్యవసానమును నింపెను. కాని ఆరిపోర్టును పరికించినచో, మనకు వారు వివరించిన ఔషధగుణ చర్చనుబట్టి వారి యనుభవ మొకటియనియును, వారు [illegible] పర్యవసాన మింకొకటి యనియును తోఁచకపోదు. వీరు 225 మందులను పరీక్షించి అందులో నూటికి 75 వంతులు నుపయుక్తములని వ్రాసియును పర్యవసానము నిట్లు వ్రాసిరి.

వీరు పరీక్షించి మందులనుగుఱించి తెలిపిన అనుభవవాక్యములను పర్యాలోచించినచో ఆయుర్వేదౌషధములే ఆంగ్లేయౌషధములకన్న సులభములును నిశ్చయముగ గుణదాయకములును అని తేలుచున్నది. అట్లు కాదేని వీరు తమ రిపోర్టులో ఆయుర్వేదౌషధములవలన దుశ్చికిత్స్యమై ఆంగ్లేయౌషధములవలన సుచికిత్స్యము అగు నొక్కవ్యాధినైనను చెప్పఁగలిగియుండిరా? క్వైనా లేనిది చలిజ్వరము దుర్నివారమను నాంగ్లసిద్ధాంతము కోమనుగారి రిపోర్టువలన వృథాపాత్రమైనది. మలేరియా జ్వరపురుగును కనిపెట్టి ఆవ్యాధిని మన ఆయుర్వేదీయౌషధములగు ఆనందభైరవి శీతాంశురసము పంచతిక్తపానకము మున్నగువాని ప్రయోగములచే నివారింపఁగలిగితి మని వీరు వ్రాసిన యొక్కయంశమే ఆయుర్వేద విజయమునకు ప్రధానమగు నిదర్శనము కాదా? ఇంతయేల? చరకసుశ్రుతుల నాటినుండి నేటివఱకు మన కనుదినము ననుభవసిద్ధములై ఆచరణలో నున్న ఔషధముల వలననే ఈవిషయము స్పష్టమగుచున్నది.

ఆయుర్వేదగ్రంథములు వ్యాధిపరీక్షణముఁ జేసి స్పష్టముగా సాధ్యాసాధ్య కష్టసాధ్యములను విభజించి ప్రదర్శించినవి. వీనిలో అసాధ్యము లని పేర్కొనిన ఏయొక్క వ్యాధినైనను - కుదుర్పగల ఆంగ్లేయౌషధములను-తాము చెప్పగలరా? యని కోమనుగారి నడిగెదను. బ్రిటిషుఫార్మకోపియాలో లేని-ఆయుర్వేదమునఁగల-విశేషౌషధము లేవైన గలవా? యని వీరు ప్రశ్నించిరి కాని, ఈప్రశ్నమునకే- ఆయుర్వేదమునందసాధ్యములని పేర్కొన్న వ్యాధుల విషయములో ఆయుర్వేదము-ఆంగ్లదేశపు ఫార్మకోపియానుండి గ్రహింపకతీఱని యౌషధములేవైన నున్నవా?-యని ప్రతిప్రశ్నముఁ జేసినచో తామేమి ప్రత్యుత్తరము నిచ్చెదరో? ఈమాటలు నేను స్వాభిమానముతో ననుటలేదు. మన ఆయుర్వేదములో లేనివానిని-ముఖ్యావశ్యకములైనవానిని-మన ఆయుర్వేదగ్రంథములు [illegible] ప్రతివత్సరమునకు గ్రహించుచునే యున్నది. [illegible] ఆయుర్వేద పండితులును-ఆయుర్వేద గ్రంథకర్తలును-ఇట్టి [illegible] భూతిప్రక్రియలను తమతమ గ్రంథములలో కూర్చికొనియున్నారు. ఇట్టివారి పరిశ్రమల యందఱి కోమనుగారివంటి ఆంగ్లవైద్యుల పరిశ్రమ లేపాటివో వ్రాయవలయునా?

కొంతకాలముక్రిందట మనదేశము "పాలకుల వేషభాషలు మున్నగునవి గౌరవప్రదము" లన్న వ్యామోహమున మునిఁగియున్నది. కాని కాలచక్రము పరివర్తితమగుటఁ గాబోలు ప్రకృతము వెనుకటి పథకమును వదలిపెట్టి స్వదేశ స్వభావాదులు గౌరవ

# ఆయుర్వేద రసాయనశాస్త్రముల పరస్పర సంబంధము

వేమూరు విశ్వనాథశర్మ గారు; యం. ఏ. ఎల్. టి.

ప్రకృతిశాస్త్రములలో ఆయుర్వేదమునకును రసాయనశాస్త్రమునకును పరస్పరమైత్రి చాల గలదు. ప్రతిదేశము నందును రసాయనశాస్త్రాభివృద్ధికి ముఖ్యముగ వైద్యులును రసవాదులును కారకులు. రసవాదులు ముఖ్యముగా నీచధాతువులను వెండి బంగారములుగ మార్చుటకు ప్రయత్నించుచుండెడివారు. మనదేశములో కూడ ఈ రెండు శాస్త్రములును చిరకాలము క్రిందటనె యభివృద్ధిని జెందినవి.

రసవాదుల యోగములు చాలవరకు గోప్యముగ నుండుటచేత నవి రసాయనశాస్త్రసిద్ధాంతముల నెంతవరకు అనుసరించుచున్నవో చెప్పుటకు వీలు లేదు. కాని వైద్యశాస్త్రయోగములను రసాయనశాస్త్ర సిద్ధాంతముల బట్టి పరీక్షింపవచ్చును. మొదట మన దేశములో మందులను కేవలము ఓషధులతో చేసెడివారు. కాని కాలక్రమమున రసవిషగంధకాదులగు ఖనిజములను కూడ ఆయుర్వేద వైద్యులు శుద్ధిచేసి లోపలికి వాడుట ప్రారంభించిరి. నాటనుండియు వైద్యశాస్త్రయోగములు రసాయనశాస్త్ర సంబద్ధములై యీ రెండిటికి పరస్పరసంబంధము గాఢము అయ్యెను.

వస్తుతత్త్వమును నిరూపించునది రసాయనశాస్త్రము. వస్తువుల యొక్క గుణావగుణములను కనిపెట్టి లోపలికి పుచ్చుకొనునప్పుడవి శరీరమునం దెట్టి పరిణామములు పుట్టించునో తెలుపునది వైద్యశాస్త్రము. వస్తుసంఘట్టనము వైద్యశాస్త్రమునకు అవసరముగనుకను, ఈ సంఘట్టనము రసాయనశాస్త్ర సిద్ధాంతములకు బద్ధమై యుండుటచేతను ఆయుర్వేదవైద్యులకు రసాయనశాస్త్రపరిచయము అవసరము.

పాశ్చాత్యులలో కాలక్రమమున రసాయనశాస్త్రము ప్రత్యేకముగ స్వతంత్రశాస్త్రముగ నభివృద్ధి జెంది వైద్యశాస్త్రమునకు తోడ్పడుచున్నది. కాని మనదేశములో కొంతకాలము గడచిన తరువాత అన్ని శాస్త్రములవలెనే వైద్యశాస్త్రముకూడ క్షీణించి రసాయనశాస్త్రాభివృద్ధికి గూడ నిరోధము గలిగెను. ఈ కారణముచేత మనదేశములో రసాయనశాస్త్రము స్వతంత్రశాస్త్రముగ బరిణమించుటకే యవకాశము లేకపోయెను. కాని పాశ్చాత్యవైద్యులలో ప్రతివానికిని రసాయనశాస్త్రముఖ్యసిద్ధాంతములు వ్యాపకముగ నుండును. మన ఆయుర్వేదవైద్యుల కట్టి శాస్త్రపరిచయము లేదు. కావున రసాయనశాస్త్ర సిద్ధాంతములను కొన్నిటి నీవ్యాసమునందు తెలిపెదను.

[illegible] ఔషధముల రసవాది లోహములను భస్మముచేయుట ఆయుర్వేదములో ముఖ్యయోగము. ఇవి సామాన్యముగ పుటములు వేసి తయారుచేయుదురు. భస్మములు ముఖ్యముగ ప్రాణవాయువుతో గూడుకొనిగాని, లేక గంధక సంబంధమై గాని, యుండును. భస్మీకరణములో ఆయుర్వేదవైద్యులలో కొన్ని శాస్త్రవిరుద్ధములగు అభిప్రాయము లున్నవి. రసమును గంధకముతో గలిపి భస్మము చేయునప్పుడు ఒకపాలు రసముతో నొకటి మొదలు ఆరుపాళ్ల వరకు గంధకము నూరి, దానిని గాజుకుప్పెలో వైచి, వాలుకాయంత్రముతో వండుదురు. ఇట్లు వండినప్పుడు రసము సిందూరించి గాజుకుప్పెయొక్క పైభాగమున అంటుకొనియుండును. ఇట్లు తయారైన సిందూరము గంధకపు పాళ్లను బట్టి అరుణమగు సిందూరములను వండవచ్చునని ఆయుర్వేద వైద్యుల యభిప్రాయము. రసముతో సరిసరి గంధకమును గలిపి వండిన సిందూర మొకటనియు, ఆరురెట్లు గంధకముతో వండిన షడ్గుణమను సిందూరము మరియొకటనియు వారి యభిప్రాయము. కాని యిది శాస్త్రసమ్మతమైనది కాదు. వస్తుసంయోగమునందు పరిమాణనియమ మున్నది. అనగా రసము గంధకముతో కూడి సిందూరించునప్పుడు తులము రసమునకు అందులో ఆరవ వంతు గంధకము కలిపి నూరిన చాలును. పాతికతులము రసముతో సిందూరించుటకు నాలుగు తులముల గంధకము చాలును. ఇంతకంటె నెక్కువగంధకము కలిపినయెడల నాలుగు తులములు మాత్రమే రసముతో కలిసి మిగిలినదంతయు ఆవిరిరూపమున నెగిరిపోవును. సిందూరము వండునప్పుడే యావిరిరూపమున నెగిరిపోయిన గంధకము గాజుకుప్పెయొక్క మూతిచివర నుండుచుండును. పాతికతులము రసముతో నాలుగుతులములకంటె తక్కువ గంధకము కలిపినయెడల కొంతరసము సిందూరించక మిగిలిపోవును. ఇట్లు మిగిలియుండిన రసము ఆవిరిరూపమున కొంత యెగిరిపోవును. మరికొంత గాజుకుప్పెయొక్క పైభాగమున నంటుకొని సిందూరముతో గలిసియుండును. మనవైద్యులు చేసెడియోగములలో రసముకంటె తక్కువ గంధకమెప్పుడును తీసుకొనరు. గనుక సిందూరించని రసము మిగిలి యుండకూడదు.

ఆయుర్వేద వైద్యులకు తెలియవలసిన రెండవసంగతి తూనిక సంబంధమైనది. ఆరుతులముల రసమును 36 తులముల గంధకముతో గలిపి నూరి సిందూరింపజేసినప్పుడు 6 తులముల కంటె నెక్కువ షడ్గుణము రాదని మనవైద్యుల యభిప్రాయము. అనుభవములో 6 తులముల కంటె కూడ తక్కువయే వచ్చును. కాని శాస్త్రప్రకారము ఆరున్నర తులముల షడ్గుణము రావలెను. ఆరుతులముల రసము అరతులము గంధకముతో సంయోగించిన షడ్గుణ మగును. ఇట్టి స్థితిలో ఆరున్నరతులములకంటె తక్కువషడ్గుణము రాకూడదు. వినను వండుటలో నెక్కువగ కలిపిన గంధకమే కాక సిందూరము కూడ కొంత యావిరిరూపమున ఎగిరిపోవును. ఇందుచేత షడ్గుణము యొక్క తూనిక తగ్గును. ఈరీతినే లోహాదులను భస్మము చేయునప్పుడు భస్మముల తూనిక ఆయాధాతువుల తూనికకంటె నెక్కువ రాకూడదనియు [illegible] తూనికతగ్గు వరకును పుటములు వేయవలెననియు మనవైద్యుల అభిప్రాయము. కాని యీ యభిప్రాయము శాస్త్రసమ్మతమైనది కాదు. లోహాదులు భస్మములగునప్పుడవి గాలిలో నున్న ప్రాణవాయువుతో సంయోగించును. అనగా ధాతువులును ప్రాణవాయువును చేరి భస్మములగుచున్నవి. అందుచేత భస్మములయొక్క తూనిక ఆయాధాతువుల తూనికకంటె నెక్కువగనే యుండవలెను. భస్మీకరణమునందు ధాతువులను ఓషధులతోను పసర్లతోను గలిపి నూరుదురు. అప్పుడు కొంతమందు ఖల్వమును బట్టుకొని యుండును. పుటము వేయునప్పుడు కొంత ఎగిరిపోవచ్చును. ఇట్టి కష్టములు లేకుండ భస్మీకరణము చేసినయెడల భస్మములయొక్క

# లోకమాన్య బాలగంగాధర తిలకుమహారాజు

### పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి గారు

నియతినామక సాంద్రనీహార తతిఁబ్రుంగు భరతాత్మజుల పాలి భానుమూర్తి, కారాగృహంబులే, కనకసౌధములుగా సంతసించిన కార్యసాధకుఁడు, కర్మయోగమె కృష్ణుఘనభావమని సదా బోధగావించిన పుణ్యమూర్తి ఐహిక సుఖముల నావంతయేనియు సరకుసేయని యట్టి సాధుజనుఁడు, తనదు జీవితమంతయు ధన్యముగను, దేశసేవల వెలయించు ధీరతముఁడు, లోకమాన్యతఁ గన్న వివేకఘనుఁడు, బాలగంగాధరుఁడికేఁడి? భారతాంబ!

### జనమంచి సీతారామస్వామిగారు పిఠాపురము

సీ. ఏపండితుని మాటయెల్ల ప్రాజ్ఞులకును విజ్ఞానసంయుక్త వేదవాక్కు, ఏధీరు ప్రావీణ్య మెల్లయోధులకును ధర్మసంగరమార్గదర్శకంబు ఏధన్యుజీవితంబెల్ల మానవులకు దేశాభిమానోపదేశకర్త, ఏమహాత్మునిశాసమెల్ల హైందవులకు పరమానురాగసంపాదకంబు.

అట్టిబాలగంగాధరుఁడక్కటకట మనలనందఱ విడనాడి చనియె దివికి, ఎంతకష్టము ప్రాపించె నింతలోన! కడుపుచెఱువగుచున్నది గాని, దిటము తెచ్చుకొన శక్యమే యెట్టిధీరులకును.

### కాశీనాథుని చిన వీరభద్రయ్యగారు ఈమపుగల్లు

ఉ. భారతమాతృపుత్రుఁడయి, భారతదేశము వృద్ధిఁజేయగా, భారము నూని బోధలను బాగుగఁజేసి స్వరాజ్య బీజమున్ వారక విత్తెఁ జిత్తముల, కండకమున్నె మహాత్ముఁడక్కటా! భారత మాన్య డౌతిలకభానుఁడె యస్తమునందె నూతఁడో!

చ. అనఘుఁడులోకమాన్య ఘనుఁడన్నను భారతదేశవృద్ధియే ఘనమని యెంచి కష్టములగాంచియు ఖైమననుండి గీతలన్ ఘనమతి కర్మయోగమును గౌరవమందగవ్రాసె గ్రంథమున్ ఘనతరకీర్తిగాంచి యిటు గాయముఁబాసెను భారతాంబరో!

### రాజా మంత్రిప్రెగడ భుజంగరావుబహద్దరుగారు

సీ. అధికారుల తెన్నెన్ని విధముల బాధించి, కట్టిపడ్డార్చిన కష్టములఁగని కారాగృహప్రాప్తి భారంబనక దేశ సేవకై పలుమారు సిద్ధపడితిఁ, మితవాదులకుఁ పరాభూతి దీర్చ మనుగోల్పగ, ఘనదేశమున స్థైర్యపటిమఁ బాటి సంక్షోభ దల్పి రాజద్రోహులఁగని, వారి ధాతలకు భీధత్వ్గాక, దేశసేవను పరమావధిగ గణించి మానధనముల లెక్కింపఁబూనుకొనక, ధరమహారాజ పదవియిదంబుఁ బ్రజల, వలనఁగాంచిన తిలకు దివంబుఁ జెందె.

### ఎన్. సుబ్రహ్మణ్యదీక్షితులు. పుంగనూరు

శా. శ్రీమత్సద్గుణ మండితోదర! యశః శ్రీశోభితాశాంతరా!, కామాదిద్విపసద్రి వజ్రధరా! లోక ఖ్యాత-విద్యాధరా!, భూమప్రేమవిలోకితార్తనికరా!-పుణ్యావతారా! భవుం, డామోదంబు నొసంగునీకు బుధమాన్యా! బాలగంగాధరా!॥

శా. ఒకవో నాత్మ శతీవిరోగము వసం బుగ్రాధిపాధోధికుం, చికదుర్ణాతియకట్టు; నొక్కయి ద వి-క్షిపంగఁ గారాలయం బకలంకస్థితి ధైర్యమూని యొకయిం- తై నంజలింపంపంగనే, రవు గీతార్థముఁ దెల్పినా వహహా! ధీ-రా-బాలగంగాధరా॥

### చల్లా పిచ్చయ్యశాస్త్రిగారు

గీ. పరిమ దుద్యానభూములఁ బ్రసరదున్న తాశయరసాలవృక్షశాఖాంతరమున, సంతస వసంత వేళఁ బ్రజాసుఖముగఁ గఁడమెత్తెడు పిక "తిలకము" బునోయె.

### కా. అప్పయ్యశాస్త్రిగారు

శా. స్వారాజ్యంబు స్వరాజ్యసంచు నిలపైనింజాటి పెక్కేండ్లయో కారాగారము నందునుంచినను నీ కార్యంబు చాలించకే, దారా బంధులు గోలుపోయినను నీధైర్యంబు బోనీక స్థయిం, తో రమ్యంబునఁ జేసి మానుమయొహో, తోడ్పాటుకై యేగితే, స్వారాజ్యంబునమ స్తదేవతల, దేవా బాలగంగాధరా.

### రూ మునయ్యగారు ప్రొద్దుటూరు

మ. అనఘాత్మా! జ్వరపీడితుండయితివం చాలించి యారోగ్యమున్, దనరున్ జోయని యుంటి విూదినవము నాస్తాపత్రికల్ పిడుగు, లో, లిసనీయంతము దెల్పె! నీమరణమోలిన్ గొండచి చ్చట్లు సజ్జన చిత్తంబుల కాల్చివై చె, మతవేషా! బాలగంగాధరా.

### బ్రహ్మభట్ల పట్టాభిరామశర్మగారు గుడివాడ

సీ. భరతమాతృకగర్భ -పాధోధి కెవ్వాఁడు, పూర్ణచంద్రునిభాతి బొడమినాడు, అజ్ఞానతిమిరసం- వ్యాప్తులకెవ్వాడు బాలసూర్యునిభాతిఁ బరగినాఁడు. స్వేచ్ఛావిరహితులై- చెలఁగు హైందవపాళిఁ గాకరిక నెవ్వాడు-గడిగినాఁడు. భరతదేశస్థితి- బాగుజేయుగ నెంచి ఇంగ్లాండునను సన్నుతి గాంచినాఁడు. భారతీయుల కనుకూల ప్రసారఘనతర తిలకకార్యము తెవ్వాండు- కలఁచినాఁడు అట్టి శ్రీ బాలగంగాధర తిలక మహస్తమించెను మనల గోల్పోవఁ జేసి.

### యెడ్లపాటి వెంకట సుబ్బారావుగారు

మ. కలలోనిన్నటు దోఁచు నీమరణమో కైవల్యసంప్రాప్త! లోపల నెంతో దిగులందిపాదుకొను నెప్పక్కినేగనం బోయినన్, పలు భంగుల్ భవదీయమూర్తిఁ గనెలిన్ శంకింతు నొక్కప్పుడిట్టుల నీమృత్యువు మృగ్యమంచు మలిఁక నెట్టుల్ శాంతిచేకూరునో?

### సుబ్రహ్మణ్య భాగవతులు తెనాలి

సీ. మూడుభావములను సంపూర్ణమై దుష్యంబు బడసిన యట్టి సత్వండి
తుండు, అంతరాత్మయనుదే శాభివృద్ధికి కానిపనినకన్నా ర్తిమా తని
స్థిరుండు, తనమైన బడిసకేను ననన్యసామాన్య మనగ వాదించిన
న్యాయవాది, బంధనమ్మన కర్మ పరముగా గీతలవ్యాఖ్యవ్రాసిన
పేటి భాష్యకర్త, బాలగంగాధరాఖ్యస ద్బ్రాహ్మణుండు అఖిల
భారతజనహృద యాలయముల తనదుమూర్తి ప్రతిష్ఠించి తాను
చేర శివునిసాయుజ్యమిందుకై చింతయేల.

గీ. ధర్మమునకును హానియు ధర్మమునకు
తగని యభివృద్ధికలిగిన తరుణమందు
అవని నవతారమెత్తెద నన్న నీదు
పలుకునే నమ్మెదము వేద వాక్యమనుచు.

### గుండిమెడ వేంకట సుబ్బారావు

సీ. అవసాన సమయాన, హా, జన్మదేశమా! యంచెంత మదిఁబల్వ
రించినావొ, మరణకాలమునందు, భరతప్రపంచమా! అనియెంత
మదిబిగ్గ, నఱచినావొ, అంత్యకాలమునందు, హా; మహారాష్ట్రమా
యని యెంతసంతాప, మందినావొ, తరలి పోయెడివేళ, ధర్మ
కస్యారమా! యంచెంత మది విచా, రించినావొ, అకట! పర
లోకమునకు నీ, వఱుగువేళ ప్రేమయెమ్మెంత దీవించి, వెడలి
నావొ, భువన సంచారి వైకుంఠమూర్తి కెఱుకమాన్య గుణధన్య
హా! లోకమాన్యతిలక!

### కర్లపాలెము లక్ష్మీనరసింహముగారు

సీ. పాశ్చాత్యనభయుపై ప్రాచ్యవిజ్ఞాన చంద్రిక ప్రసరించి హాసింప
జేసి, భారత హృదయచకోరమ్ములను దేవసేవామృతమ్మున జేర
దీసి సకలకు వలయముల్ సర్వేశుగీతార హాస్యకరమ్ము నలరజేసి
నిజకాంతి శోభచేసఖిల నక్షత్రాళి కాంతిసెల్లహరించి వంతగూర్చి
శీతకరమున చోరులశిక్షవేసి రాగిణులయందు తాపాగ్నిరగులజేసి
అక్కటా! వీడిపోయితె యద్ధిగ్రుంకె బాలగంగాధర సుధా
కరాలలామ!

### పల్ల వేంకటశాస్త్రి

ఉ. భారతమాత నీడగుక భాగ్యము నెమనిబల్కు వాడ హా
ఘోరవరంసమై బరగు నూనుని మాన్యుని బాసినావు యి
వ్వారలు నీకు దిక్కెకను వంతలపుంతలుగాక యిమ్మకే
నూతల జన్మలొందియును నొంపగ నేస్తవ! యట్టిపుత్రకన్.

కే. బి. కోటిలింగకవి.

సీ. అఖిల భారతనాయ కాగ్రేసరుండు గీ. తారహస్యాది యుద్గ్రంథ
కర్త, స్వరాజ్య నిర్ణయ సూత్రోపదేశకుం, డఖిలదిగంతవిశ్రాం
తకీర్తి, ఆబాల్యమాతృదే శారాధనపరుండు, నధ్యాత్మవిద్యారహ
స్యవేది, సకల సద్గుణగణ ప్రకలిత శాంతుండు, కార్యశూరుం
డైన, కర్మయోగి, కష్టముల కోర్చి నిజనూడు, ఖడ్గవాది, బాల
గంగాధరాభ్యవిద్వత్ప్రభుండు తను, ధనమనంబులోయలకై ధార
వోసి, భౌతిక శరీరముంబెడఁబాసె నకట॥

### గార్లదిన్నె సుబ్బారాయుడు గారు

సీ. భరతమాత కోలకు పలుకష్టములఁ కెందె పలుకంగఁ దగు పుత్ర
తిలకుఁడితఁడె। దుర్జను లెన్నిరా తొందరల్ పెట్టిన నలయ
కోర్చిన సాధు తిలకుఁ డితడె, అలబిడ్డలవేస కాకాంక్ష యెట్టి
దో తెలియ కుండిన ఋషి తిలకుఁ డితఁడె, కారాగృహస్థుఁడై
కవితా సుధా రసం బొలికించె సత్కవి తిలకుఁ డితడె, ఇట్టి
సర్వతిలకుఁ డెంతయు మహనీయు డస్తమించె శుభము లస్త
మించె, దేశచిత్రముఖకు శోకయుముల్ ముసిరించె విధి తెలుంగు
సెంచఁ దరమె?

### దద్దనాల లక్ష్మీసత్యనారాయణయ్య గారు

సీ. ఆగష్టుమాస మారంభంబునకు నీదు కాలంబు జెల్లెడే కరుణసాం
ద్ర! నీవు బూనిన కార్య మెవ్వని మూపుపై దిగవెట్టి చనితివి దివ్య
చిత్ర! పరమపవిత్రకా చరిత్రసారమిబు వినవివారర్హయ
విమలచరిత! స్వారాజ్య భారతజ స్వాతంత్ర్యులగు యమ్మ గా
చుకొమ్మను మన్న జాడగలమె దేశభక్తులలోన యీనుని కృప
వలన నగ్రగణ్యుండవై నవతరించి. నట్టివాడవు నేడిట్టు లంతరించి
దేశమాతను మమ్ముతి తెంపులేని దుఃఖసంద్రంబు నందుల ద్రోసి
వేయ న్యాయమే నీకు నేనిట్లు న్యాయమార్గ

వుదయగిరి, శీతారామాచార్యులు.

ఉ. చూచితి వెల్లదేసములు చూచితి వెల్లసభల్ నరేంద్రులం
జూచితి శాస్త్ర కోవిదుల కుటిల యభ్యుదయంబు గూర్పగా
జూచితి చింతలోన ధీచోదితకాం ప్రజ్ఞం వశేకమం
జూచితినే కయి తంద్రి విబొధ్యక హా! తిలకా మహాత్మకా.

# చిన్నిబాలుఁడు

### కంచనపల్లి కనకమ్మ గారు

కలయ లీవికారములు నీ చిరునవ్వులు నీవుయారముల్, ఈలలితంపు పల్కులును నీ సుమనోహరరూప సంపదల్
పాలమెఱుంగు బుగ్గలును స్వచ్ఛవిలోచనసుందరత్వమున్, బాల రసాల నూత్నతర పల్లవకోమల హస్తయుగ్మమున్
చేలగు జారుబొజ్జయును, మిన్నగు చిత్తము, మందహాసమున్, జాలము గల్లజేసె మము సంతసవార్ధిని ముంచు బాలకా!

# శరన్నవరాత్ర ప్రాశస్త్యము

దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు

నవరాత్ర మనఁ దొమ్మిది రాత్రు లని యర్థము. రాత్రిశబ్దము సమాసశేషమున రాత్రమై యీరూప మేర్పడుచున్నది. దేవీప్రీతికరముగా వసంతాదియందును ఒక నవరాత్రము చెప్పఁబడినది. శరద్వసంతములు యమదంష్ట్ర లనియుఁ దదారంభమున నరిష్టనివృత్తికై చండీపూజనాదికము కర్తవ్య మనియు దేవీభాగవతము. ఇట్లు వసంత శర న్నవరాత్రములు రెండును సాధారణములుగా నున్నను, నిబంధకారులు అద్యమును విస్తరింపక శరన్నవరాత్రములనే ఎక్కువగా నభివర్ణించి యున్నారు. బ్రహ్మాండపురాణాది గ్రంథములయందును శరన్నవరాత్రమే ప్రతిపాదింపఁబడియున్నది. లలితా సహస్రనామ భాష్యమందు - శారదారాధ్యా అను నామమునకు ముఖ్యముగా శరత్కాలపూజనీయ యను నర్థము వ్రాయఁబడినది. భార్గవార్చనదీపిక యను గ్రంథములో-ఆశ్వినస్య సితే పక్షే ప్రతిపత్సు శుభే దినే, యనియు, మార్కండేయపురాణములో శ్లో. పూర్వవిద్ధాతు యా శుక్లా భవే త్ప్రతిపదాశ్వినీ నవరాత్రవ్రతం తస్యాం న కార్యం శుభ మిచ్ఛతా" అనియు, స్కాందమున - ప్రతిపద్యాశ్వినే మాసి సా శుద్ధా శుభదా భవేత్-అనియు దేవీపురాణములో శ్లో॥ "యో మాం పూజయతే నిత్యం ద్వితీయాదిగుణాన్వితాం ప్రతిపచ్ఛారదీం జ్ఞాత్వా సోఽశ్నుతే సుఖ మవ్యయ" మ్మనియు అన్వయవ్యతిరేకముఖము లైన వాక్యములచే శరన్నవరాత్రవ్రతము ఆశ్వయుజ శుద్ధ ప్రతిపత్తిథిలో నారంభ మగు నని చెప్పబడియున్నది. కాఁబట్టి లోకాచార మీ విషయమున ధర్మశాస్త్రపురాణానుసారముగా నున్న దనుట స్పష్టము. నవరాత్ర మాశ్వయుజశుద్ధ ప్రతిపత్తిథిలో నారంభమై మహానవమితో బూర్త మగుచున్నది. ఇది తొమ్మిదిదినములు ప్రవర్తిల్లవలసిన కార్య మైనను తృతీయాది నవమ్యంతము సప్తరాత్రముగాఁ గాని, పంచమ్యాది పంచరాత్రముగాఁ గాని, సప్తమ్యాది త్రిరాత్రముగాఁ గాని, అష్టమ్యాది ద్విరాత్రముగా గాని, ఏకదినపక్షమునఁ గేవలాష్టమిని గాని, కేవలనవమిని గాని, ఆచరింప వచ్చునని సౌకర్యము చెప్పఁబడియున్నది. అకరణమందు దోషశ్రవణమువలన నిది నిత్యవ్రత మనియు ఫలశ్రవణమువలన నిది కామ్యకర్మ మనియు నేర్పడుచున్నది. నవరాత్ర కర్తవ్యములు శాస్త్రములఁ దొమ్మిది తెఱంగుల వివరింపఁబడి యున్నవి. (1) కలశస్థాపనము (2) దేవతాపూజనము (3) సప్తశత్యాదిజపము (4) అఖండదీపము (5) మాలాబంధనము (6) ఉపవాస నక్తైకభక్తాది నియమము (7) సువాసినీభోజనము (8) కుమారీభోజనము (9) స్తోత్రమంత్రహోమాదులు. ఇందు దేవతాపూజనము ప్రధాన మనియుఁ దక్కినవి తదంగములనియు శాస్త్రీయాభిప్రాయము. ఈ తొమ్మిది తిథుల నేయే విశేషాంశములతో - నేయేవిధమున భక్తుఁ డెట్లుపాసనసల్పవలసినదియు భక్తితరంగిణ్యాది దేవీగ్రంథముల యందు వివరింపఁబడియున్నది.

రాత్రిశబ్దవిచారము

ఈ వ్రతమం దాహ్నిక త్రైకాలిక పూజ ఉపపన్నముగా నున్నను, రాత్రిపూజయే యుత్కృష్టమును శీఘ్రఫలప్రదమును గావున దత్ప్రాశస్త్యమున ఈ వ్రతము నవరాత్ర మని చెప్పఁబడినది. కొందఱు దీనిని నక్తవ్రతముగానే చెప్పి యాహ్నికపూజా పరిత్యాగమును బోధించిరి. కాని ధర్మశాస్త్రజ్ఞులు రాత్రిప్రశస్తివలన నహఃకార్యము త్యాజ్యము కాదనియుఁ గలశస్థాపనాది కార్యము ప్రమాణ బాహుళ్యముచేతఁ బగలే కావింపఁ బడవలయు ననియు శాసించిరి.

## నవశబ్ద విచారము

'నవ' శబ్దము శాక్తసంప్రదాయమున నతి ముఖ్యము. సంఖ్యలలోఁ దొమ్మిది పెక్కువయైన స్వతంత్ర సంఖ్య యేపరిగణనమందును లేదనుట స్పష్టముగదా! ఇది నవరాత్రపూజా విధానమున సర్వాధిక స్థానము నధిష్ఠించి యున్నది. ఈ వ్రతమునకుఁ బ్రథమాంగ మైన కలశపూజ నవాక్షరమంత్రముచేతఁ జేయవలసియున్నది. సువాసినీ భోజన కుమారీవరణములును నవసంఖ్యాపరిమితములై యున్నవి. వరణీయ లైన కన్యల యొక్క నామములు తొమ్మిదియు వయోనియతిని బట్టి వేర్వేఱుగా చెప్పఁబడినవి. ఇష్టదేవత యైన దుర్గ యొక్క స్వరూపములును తొమ్మిదియే. నవకోటి శక్తి సహితయై నవావరణములకు లోపల నవదుర్గాస్వరూపమున వర్తిల్లు నవాక్షర మంత్రాధిష్ఠాన దేవతను నవసంఖ్యాపరిమితములైన దినములలోఁ బూజించుట సమంజసమే. కావున ఈ నవరాత్రవ్రత మవశ్యానుష్ఠేయము.

## నవరాత్రవ్రతమునకు మూలము

ఇఁకను శ్రీరామనవమి, కృష్ణాష్టమి, ఇత్యాదుల వలెనే ఈ నవరాత్ర దినములకును పూజ్యదేవతా చరిత్రమునకును సంబంధ మేదేని కలదా? యనుట విమర్శనీయము. లోకాచారమును బట్టి యూహించిన యాంధ్ర గౌడ వంగాది దేశములందుఁ గూడ నవరాత్రములలో దేవీవిజయాదికము ప్రఖ్యాతింపఁబడుటచేతఁ దన్మూలమున నివి మహిషాసుర సంహారాది దేవీవిజయదివసములుగాఁ బరిగణింపఁబడుటయుఁ గలిగియున్నది. కాని యిట్టి ప్రతీతికిఁ గారణము మృగ్యము. ఈవిషయము ప్రముఖముగా నుండవలసిన చండీసప్తశతిలోఁ గాని, దేవీభాగవతమునఁ గాని, మఱి మార్కండేయపురాణాదులలోఁ గాని, ఇది యిట్టి దని చెప్పఁబడి యుండలేదు. శరన్నవ

రాత్రిపూజ బహుఫలప్రద మను వచనములు విశృంఖలముగాఁ గలవు. కాని ఈ యాశ్వయుజ మాసమున నిడికముల నీరాజ్యకులు దేవిచే సాదరింపఁబడినవను సాధారము కన్పట్టదు. విశేషించి శరన్నవరాత్ర ప్రస్తావసమయమునసే దేవీలోక కొన్నిదినములు గూడ ముఖ్యముగాఁ బరిగణింపఁబడి యుండుటవలన ఈదినములే దేవీవిజయ ప్రస్థానదినము లనుట కొంతదనుకఁ బ్రత్యాఖ్యాత మగుచున్నది. ఆశ్వయుజమాసాదియు, చైత్రమాసాదియు నవరాత్ర వ్రతమునకు గ్రహింపఁబడుటకుఁ గారణములు దేవీభాగవతమున—

శ్లో॥ శృణు రాజన్ ప్రవక్ష్యామి నవరాత్రవ్రతం శుభం, శరత్కాలే విశేషేణ కర్తవ్యం విధిపూర్వకం, వసంతేచ ప్రకర్తవ్యం తథైవ ప్రేమపూర్వకం, ద్వావృతూ యమదంష్ట్రాఖ్యౌ నూనం సర్వజనేషు వై, శరద్వసంతనామానౌ దుర్గమౌ ప్రాణినామిహ, తస్మాద్యత్నా దిదం కార్యం సర్వత్ర శుభమిచ్ఛతా, ద్వావేవ సుమహాఘోరా- వృతూ రోగకరౌ నృణాం, వసంత శరదావేవ జననాశకరావుభౌ, తస్మాత్తత్ర ప్రకర్తవ్యం చండికా పూజనం బుధైః" అని చెప్పఁబడినదే గాని, యింకఁ గారణాంతర ముపన్యసింపఁబడలేదు. అందే మఱియొక్కచోట "అష్టమ్యాం చ చతుర్దశ్యాం నవమ్యాం చ విశేషతః, సుమపూజా ప్రకర్తవ్యా—అని చతుర్దశీసహితముగాఁ జెప్పఁబడి యున్నది. శాక్తాగమములు, పురాణములు తంత్రములు నసంఖ్యములు. అనంతములు. అట్టి వానిలో నేదేని ప్రబలాధారము చిక్కునో విజ్ఞులకు విచార్యము. శరన్నవరాత్రమును దేవీవిజయములతోఁ గలుపు విశేషవిషయము చొప్పడకున్నను దుష్టశిక్షార్థము యుగయుగంబుల నవతరించి జగద్రక్షణ మొనర్చు జగన్మాత జగత్పూజ్యయనుటకు సందియము కలదా?

## అధిష్ఠాన దేవతాస్వరూపము

ఆర్యమత మెల్లవిధముల ననవద్యము అన్యమతములవలె గాక ఇది మొదటి నుండియు జిజ్ఞాసువుల బుద్ధి వైచిత్ర్యముల నెఱిఁగి తత్తదుచిత క్రియాకలాపమును నిర్మించినది. ఇట్టి సామరస్య పరాయణత యితరమతములందు లేదు. మనుష్యులు కేవలము ప్రాకృతస్థితిలో నుండు సమయమున వారికొఱకు విగ్రహారాధనాదికము చెప్పఁబడెను. విగ్రహపూజాధురంధరుఁడైనవాఁడే విగ్రహమునకు మూలమైన మూర్తిని గుఱించి విచారింపఁ దొడంగినపుడు పురాణేతిహాస ముఖమున నీతిబోధకము లైన యవతార చరిత్రములు వర్ణింపఁబడినవి. ఇట్లు కొంత జ్ఞానము కలిగి, జిజ్ఞాసు వవతార తత్త్వవిమర్శనమునకు గడంగినపుడు, జగత్సృష్టిస్థితిలయాధికారి యైన సగుణబ్రహ్మము లేక - యీశ్వరస్వరూపము నిరూపింపఁబడినది. వీనం దుపాసన వలచేఁ జిత్తశుద్ధి గలిగి-పూర్ణాధికారియైన వానికి, సగుణ బ్రహ్మమున కతీతమైన యధిష్ఠానము - లేక నిర్గుణబ్రహ్మస్వరూపము బోధింపఁబడినది. మఱియు నేకాంతప్రయోగ న్యాయమునఁ గాక, క్రియాతత్పరునకుఁ గర్మయోగద్వారమునను, కాయక్లేశసహనశీలునకు హఠయోగద్వారమునను, మహాపోహవిచక్షణునకు జ్ఞానయోగద్వారమునను, రసలిప్సువునకు భక్తియోగద్వారమునను, ఇష్టసిద్ధిప్రాప్త్యుపాయములు చెప్పఁబడినవి. ఇట్లు మందానుజిఘృక్షుచేఁ బూర్వర్షులు చేసిన యనంతవిభాగములు చూడఁగా, వారి సర్వజ్ఞత్వము వ్యక్త మగుచున్నది. భాగవతసప్తమ స్కంధముకొనను విగ్రహారాధన మత్యంత ముత్కర్షింపఁబడి యున్నది. ఆ గ్రంథమందే వేఱొక్కచో ప్రతిమార్చనము ఖండింపఁబడినది. సామాన్యపాఠకుఁడు వీని వైరుద్ధ్యమును జూచి భాగవతకర్తకు మతవిషయమున నిశ్చితాభిప్రాయము లే దని తలంచును. కాని పరమకారుణికుఁ డైన వేదవ్యాసుఁడు ఎవ్వని కేది చెప్పిన నుపయోగమో, అది వానికిఁ జెప్పుచున్నాఁ డని తెలిసికొనఁ జాలఁడు. ఆర్యమతమున, బుద్ధిభేదము చేయరా దని ఘంటాఘోషముగాఁ జెప్పఁబడినది. ఎవ్వఁ డేని ఏవిధముగా నేని, ఈశ్వరారాధన తత్పరుఁడై యున్నయెడల నీతిబాహ్యక్రియ లున్న వానిని దిద్దవచ్చును. గాని వానిబుద్ధికి వాఁడుచేయు పూజయందెన్నటికిని వికల్పముఁ గల్పింపరాదు. గీతల యభిప్రాయమును నిదియే. శుద్ధాద్వైత ప్రతిష్ఠాపకుఁడై - బ్రహ్మమున కెట్టి విధమైన రూపమును గాని నామమును గాని యంగీకరింపని-శ్రీమచ్ఛంకరభగవత్పాదులు విగ్రహారాధనముఁ జేయుచుండిరి. ఇది స్వార్థముగాక శిష్య ప్రబోధనార్థ మనుట విశదము కదా. మఱియు మన యార్యమతమున 'నర్థవాద' మని యొకటి కలదు. ఎవ్వఁ డేరూపమున నీశ్వరుని బూజించుచున్నాడో, లేక యే వ్రతము చేయుచున్నాఁడో, దానిని ఇతరము లన్నిఁటికంటె నధిక మని యుత్కర్షించి పొగడుట స్తుత్యస్తుతి యందురు. ఇం దుద్దేశ్యము భక్తుని బుద్ధి నన్యమునుండి మఱలించి చేయుచున్న కార్యమునందు స్థిరీకరింపఁజేయుటయే. కాని కలలోనైన నితరవ్రతములఁ గాని యితర దేవతలఁ గాని దూషింపవలయు నని కాదు. ఇది యెఱుంగక పురాణములు పరస్పరవిరుద్ధము లని కొందఱు, శైవ వైష్ణవాది భేద ప్రతిపాదకము లని కొందఱు, తత్త్వ మెఱుంగక విభ్రాంతిపాలగుచున్నారు. స్థూలములైన వ్రతావతార విషయములనే గాక ఇట్టి సామరస్యము తత్త్వప్రతిపాదకములైన షడ్దర్శనములందుఁ గూడఁ గల దనియు, అవి పరస్పరవిరుద్ధములు గాక జ్ఞానసౌధారోహణమునకు సోపానము లనియుఁ వానికిఁ బర్యవసానము అద్వైతమం దనియు శ్రీ వివేకానందస్వాములవారు చెప్పియున్నారు.

2. పూర్వము శిష్యుఁడు గురూపదేశపూర్వకముగనే విద్య నధిగమింపవలసి యుండుటవలన నాతనికి శాస్త్రములయందు సందేహము కలుగుటలేదు. శిష్యుని ప్రజ్ఞ నెఱిఁగి, గురువు ఏది యెంతవఱకు ఎపుడు చెప్పిన శిష్యునకుఁ దెలియునో, యది యంతవఱకు అభ్యాసమునకు రదుక విగ్రహారాధన మెంతవఱకు ఉపాదేయమో, కర్మ మెంతవఱకుఁ గర్తవ్యమో, యోగ మెంతవఱకు నాచరణీయమో, యివి యెప్పటి కవసరములో శిష్యునకుఁ దెలియుచుండెడివి. ఇప్పు డట్లనో, ఇతర గ్రంథములవలె నధ్యాత్మగ్రంథములును ముద్రితములై యొక్కసారిగా మనపాలఁబడినందున, భేదములను సమన్వయించుకొనఁజాలక, వైక్లబ్యమును బొరయుచున్నారము. ఈ విపత్తునకుఁ దోడు పాశ్చాత్య సంసర్గమువలనఁ బ్రాచీనవస్తువుల ననాదరబుద్ధియు నెలకొన్నందున, దేశమున మతాభిరతి నష్టప్రాయమై, సకలకష్టముల కాకర మగు

కేవల భోగపరాయణులై చెడిపోవుచుండిరి. ఇది శంకరుని కాలమునకే వ్యాప్తిలో నుండఁగా - వారు దాని నతినిశితముగా ఖండించిరని శంకరవిజయ గ్రంథావలోకన మూలమున విశదమగుచున్నది. దక్షిణసంప్రదాయమున, మాతంగీసంతర్పణాది కార్యములు కొన్ని కనఁబడుచున్నను, నీతిబాహ్యములు కావు. అదియును విమర్శన మెక్కుడగు కాలక్రమమున నడుగంటఁ గలదు. ఇట్టి దురాచారము లుడివలననే భువనపావనముగా నెన్నఁబడవలసిన అంబపూజ శక్తిపూజ యనునవి నేఁడు మద్యపానమునకును మాంసభక్షణమునకును పర్యాయపదము లైనవి. ఈదురాచారముల మొదలుకొట్టఁ బోఁగొట్టి యుపనిషత్ప్రసిద్ధ మైన దేవీమతమును యథాశాస్త్రముగా జనులకు బోధించు మహాపురుషు లింకను అవతరింపవలసియున్నది.

విజయదశమి:-

శరన్నవరాత్రవ్రతము వెంటనే, ఈ దశమి చొప్పడుచున్నందున దీనిఁగూర్చి రెండువాక్యములు. ఇందువిహితములు (1) అపరాజితాపూజనము (2) సీమోల్లంఘనము (3) శమీపూజనము (4) దేశాంతర యాత్రాస్థలప్రస్థానము. అపరాజితకు, జయావిజయలు పార్శ్వదేవతలు కావున, ఈ దశమి విజయదశమి యని వ్యవహరింపఁబడుచున్నది. ఇందుఁ బూజాశ్లోకములలో శమిని గూర్చి "ధరిత్ర్యర్జునబాణానాం - రామస్య ప్రియవాదినీ" అని చెప్పఁబడియుండుటవలన ఈ శమీపూజ భారతకాలమున కీవలఁ బుట్టినట్లు కొందఱందురు. పూజ కాకున్నను, శ్లోక మైన నీవలఁ బుట్టినదే. ధర్మరాజాదు లజ్ఞాతవాసకాలమున ప్రత్యక్షంగము కాకుండ దుర్గవలన వరము పడసినట్లు సంస్కృతభారతమునఁ గలదు. అచ్చోటను దుర్గను, జయావిజయాభిధానములతో వర్ణించియున్నందున, అచ్చటను అపరాజితయే యుద్దిష్ట యగుట స్పష్టము. శ్లో అశ్వయుక్ శుక్లదశమీ-విజయాఖ్యాభిధా శుభా, ప్రయాణేతు విశేషేణ - కిం పున శ్శ్రవణాన్వితా - అని జ్యోతిశ్శాస్త్రప్రసిద్ధి కలదు. కావున రాజులకుఁ బ్రస్థానమున కిది యుత్తమోత్తమ కాలము. కాని శత్రువిజయప్రస్థానమనవసర మైన యీకాలమున నీ విధికి వినియోగము లేదు.

ఈ దశమికి దశహార యను నామము విఖ్యాతమై యున్నది. ఈశబ్దమే దసరా దశరా యని జనులచే వాడఁబడుచున్నది. ప్రకరణాంతరమున దశపాపహరా యని ప్రమాణము కలదు. దశపాపములు ధర్మశాస్త్రాదులఁ బ్రసిద్ధములు. కావున, విజయదశమి - నవరాత్రుల నొకపేరఁ గాక, యపరాజితాభిధాన యైన దేవిపేర నుప్పతిల్లిన వ్రతమనియు, దశారా యనునది దశరాత్రశబ్దభవము గాక, 'దశహారా' యను శబ్దమునుండి నిష్పన్న మైన దనియు నెఱుంగవలయును.

కీర్తిశేషులైన

# తంజనగరము - తేవప్పెరుమాళ్లయ్య గారు

బ్రహ్మశ్రీ కపిస్థల పట్టణము రామానుజయ్యా గారు

సీ. ఉభయభాషాజ్ఞాన♦విభవంబుచే సుధీ
బిరుదంబుతో భువిఁ ♦ బరఁగి తీవు
మనుచరిత్రకు మున్ను ♦ ఘన మగు వ్యాఖ్యను
బొనరించి యెంతయుఁ ♦ దనరి తీవు
రామాయణంబును ♦ రహి నాంధ్రవచనకా
వ్యంబుగా రచియించి ♦ వఱలి తీవు
పెక్కుగ్రంథములకుఁ ♦ బీఠికల్ పెక్కువ్రాసి
నేర్పుమై సమకూర్చి ♦ నెగడి తీవు
అపరచిన్నయసూరి వీ♦వనఁగఁ దగిన
పండితాగ్రణి వాంధ్రప్ర♦పంచమునను;
అట్టి నీ వింతలో దివి ♦ కరుగుకతన,
ఘనుఁడ! తీఱనిదుఃఖంబు ♦ గలిగె మాకు!

తే. తొలుత నానందముద్రణ♦నిలయమందుఁ
బండితస్థలి విలసిల్లి ♦ దండికవుల
కావ్యశతక ప్రబంధముల్ ♦ కరము వ్యాప్తి
నందఁజేసితి వాంధ్రు లా♦నంద మొంద.

తే. ఆంధ్రసంస్కృతభాషల♦యందె కాక
ద్రావిడాంగ్లంబులందును ♦ దక్షుఁడ వయి
చెలఁగితివి నీదు ప్రజ్ఞావి♦శేషముఁ గని
మిత్రబాంధవు లెల్లరు ♦ మెచ్చుకొనఁగ.

తే. పిఠాపురాధీశుఁ డై ♦ వెలయు సూర్య
రాయనృపు నాంధ్రకోశ కా♦ర్యాలయమునఁ
బండితాగ్రసరుండ వై ♦ పరిఢవిల్లి
యల్పకాలంబునన దివి ♦ కరిగి తకట!

క. వరగీర్వాణనిఘంటువు
విరవున వ్రాయింప నెంచి ♦ వేల్పులవారయున్
సరగున రప్పించుకొనెను
సురలోకంబునకు నిన్ను ♦ సురగురునాజ్ఞన్!

# కీ॥ శే॥ తిరుపతికవి స్మృతిపద్యములు

గారుఁడు బ్రహ్మయశాస్త్రి కొనియాడు నవనిఁ గర్ణాటసీతా
రాము పాటఁ జేసి, తోడి కలాగ్రతే ధుర్యహుఁ దెల్వి తీర్చ
కపించిన కలహంబు సలుపుచుండ్రు ఎవఁ డెన్నఁడును వారి మె
లమి విప్పకయె వ్యాకరణపాండిత్య ప్రకర్షమూనె, ఒరులు నచ్చ
నివాని గరువమ్ము సహింపఁ జాలె నెవ్వని మనీషాబలంబు, ఎవఁ
డు నాకెక్కుడయ్యె నాయెడల గారణాంతరమ్మున గురుభావ
మంతరంగమునను కాక, వెలికిఁ గూడఁ గనఁగఁ జేసె నట్టి తిర్ప
తికవి దివికరిగె నకట!

మ. కలలోనైన నతండు ముందనుచు నెన్కన్ నేనటంచున్ మదిన్
తలపంబో, మతఁ డేనుఁగూడ నెటులీ తారాత్మకు చేకూరనో?
బలవంతుండె మహోన్నతంపు బసపిన్ బ్రాకంగ నర్హుండు దు
ర్బలుఁడో కాదటువంటివాఁ డనుట సర్వత్రాను భూతంబకా!

ఉ. ఏఁబది వాఁడె నా, కతని కేఁబది కింక నెలల్ గొలంతి నా
ల్గాబుధమాన్యుఁ డిందనుక నాఁగక సల్పె శతావధాన, మే
నో బహుకాలమై యొకట నుండియు నాతని చేతి యూత బ్ర
హ్మా బహుశావధానపుఁ బ్రసంగము తీర్చుచు నుంటి నెట్టులోన్.

శా. త్వాంకారోక్తులతోఁ బ్రసంగము సహాధ్యాయిత్వమున్ దెల్ప ని
శ్శంకన్ వ్రాసెడి లేఖలందలి నమస్కారాది సంభావనా
లంకారమ్ములు నాయెడం గల యనల్పత్వకృతజ్ఞత్వపుం
బొంకమ్మున్ వెలిబుచ్చ వర్తిలిన నీబుద్ధిన్ స్మరింతున్ సఖా!

ఉ. ఏసల నూజివీటిసభ కేగితి నిన్ దిగఁ బ్రావి యున్నదో
పానవకాదె? యొంటరిగఁ బాక రిపున్ గనఁబోయి తిప్పుడో
ధీనిధి! తిర్పతీ! యచటి ధీరులతోఁ గలహమ్ము గల్గిన
న్దీరియు నైననీస్మృతికి నెక్కకపోను సుమీ సుమిత్రమా!

క. "నన దర్శన మిప్పింపుం"
డని వ్రాసిన లేఖ నాకు నందకమునుపే
చని నాఁడెవ్వ స్వర్గంబె
మని నాతోఁ జెప్పఁ దలఁపవైతి సఖా!

శా. కృతకృత్యుండవు నీవు. నాకుననితో చెకోరి చెప్పన్ బనే,
మి? ఈసి వ్రాసినదొకసారి జూచుటకు, చల్లన్ దాన్ని రమ్మంచు
వ్రాసితి. పోస్టుండెని పల్లెనాఁటు నది నీ దేల్లింప లేనైతి. తిర్పతి!
విశ్వత్సాకపి! క్షమింప నిది యర్హం బెమ్మెయిన్ జేర్మమై.

ఉ. నీ కొమరుండు సత్కవిని నేర్పఁగఁజాలిన బుద్ధిశాలి త
ద్దీ కుశలత్వమున్ సరిగ నిద్ది త్వదాత్మకు మెచ్చొనర్ప నం
దాకను నాదు రాకకయి నాకమునందు ప్రతీక్షసల్పు మ
య్యా! కవి తిర్పతీ! వ్యవధియాటకు నైపగదయ్య యియ్యెడన్.

తే. అలదివాకరునకుఁ బోతె నస్తమయము
నుదయమును గూడ నిజమునకుండఁ బోవు
నీయశఃకాయమునకని నీవెఱిఁగియుఁ
బాపరతఁ జేసి విలపింపవలసె సఖుఁడ!

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి, శతవధాని.

మ. ఒకనాఁడేనియు మాదుతప్పిదము లెన్నో నైఁచు వేగాని మ
మ్మొకపల్లెత్తయినన్ రుషావికలితంబుల్ వాక్కులాడంగ నే
దకలంకంబగు ప్రేమతోడ భవదీయానుగ్రహం బానుమా
కిఁక నాభాగ్యము లేదుగా! జనక! మమ్మేరీతిగా వీడితో.

ఉ. చక్కని ధారగల్గి కవిసామజపోత మనంగ నొప్పు నా
తిక్కనసోమయాజి మన తిర్పతిశాస్త్రి యటంచుఁ బల్కలి
ప్తక్కట యెవ్వనిన్ బలుక నొకని భూజను లెల్ల దీనతన్
బొక్కము నుండఁగా దివికిఁ బోతివె కృష్ణుని జూచువేడుకన్.

ఉ. చెప్పెదొ, మానెదో, తెలియఁ జెప్పఁగ నేరికి శక్య మంతలో
ముప్పు మునింగినట్లు గళము న్విసనుంబలె యావహించి వా
క్రీప్పగ నీదుశ్వాస, నినుఁ దీవ్రతరంబుగఁ దండ్రి నీమనం
బొప్పని చెప్పుకుంటకు శకో! యని గుందగ మాకుపాల్పడెన్

దివాకర్ల వేంకటావధాని

చ. సరసకవీంద్ర సంతతికిఁ జక్కని త్రోవలఁ జూపి వేంకటే
శ్వరునకు నాటపట్టయి సువర్ణ ధరామరకీర్తి కామినీ
వరుఁ డని పేరుఁగాంచి యన వద్య పటుత్వ కవిత్వ సంపదన్
వరలిన సత్కవీ! చనితె వా! క్షితిఁ బాసి యమర్త్యభూమికిన్.

చ. చదివితి పాణినీయమును జక్కఁగ నేర్పితి శిష్యరాజికిం
పొదవఁగ గ్రంథరత్నముల నొప్పిన యన్ని రచించి కైతమున్
జెదరని సామ్యమెన్నొ దయచేసితి మృత్యుజరాదిదూరమై
కదలని కీర్తిదేహమునఁ గ్రాలెదు నీ కయి కుంద నేటికిన్?

కాశీ కృష్ణాచార్యులు

క. పరిణత పాండితీబలము, మధురకళాంకము, మాధురీ పరి
స్ఫురిత కవిత్వము గలిగి సుభ్రయశోలత గడించుకొన్న మా
తిరుపతిశాస్త్రి సత్కవి గతించెనె! శారద భవ్యవధూటికిన్
స్థిరతర కావ్యభూషణ విశేష పరిష్క్రియ తీఱిపోయెనే?

ఉ. బుద్ధచరిత్రమున్ మనసు పుట్టి పఠించుచునుండు, నందు జ్ఞా
నోద్ధతుఁ డల్ల బుద్ధుఁ డొకయుక్తినిఁ బుత్రవినాశ దుఃఖితన్
వృద్ధను దేర్చు పట్టున స్రవించిన తిర్పతిశాస్త్రి సత్కవి
తోద్ధతి బుద్ధిఁ బోలె యిపు డూఱట నాఱటమున్ ఘటించెడున్

శా. ఎందాకం దవరారు నాంధ్రవిజయం, బెందాక శాస్త్రజ్ఞమా
నందంబానన్ వెలసిల్లు సౌందనుక నాంధ్ర శ్రీరమో దేవి పే
ర్పొందుం, దిగ్పతిశాస్త్రి సత్కవి ఖలేః భూర్జైందుః డెందాక నే
కందుంగుందును లేక లోకమునకున్ గల్గించు నాహ్లాదమున్.

వేటూరి ప్రభాకరశాస్త్రి.

చ. తిరుపతివీడి వేంకట సుధీమణి చింతలఁ జిక్కెడే, డుకు
ద్ధరములు దైవ దుర్విలసితంబులు పెల్చన పేఁగి, సజ్జనో
త్కరముల నిల్వనీయక యకాలపు మృత్యువుపాలొనర్చు నె
క్కరణి మనీషిపుంగవులు గాంతురు గాఢముదమ్ము నెమ్మదిన్.

క. రంగనాథశాస్త్రులు.

సీ. అపగతోభయభావ మయ్యె నాంధ్రజగంబు నష్టావధానంబు నష్ట
మయ్యె, శతవధానంబనె శతవిధానంబుల సాహిత్యవిస్ఫూర్తి
సమసిపోయె, బోధకతాశక్తి పోలివోయెఁ బాండితీ నిలయంబు
తెల్లను విలయమందె, బహుమతసభలను బహుమతు లొప్పె కాగ
విద్వత్ప్రభావంబు వీఁటిపోయె, జెలిమాకర్షంబు నశియించె బలిమి
యుడిగె, దుర్వివాదంబు చలిదీసె దుఃఖమూరె, నాలుబిడ్డల యస్న
లయందు వేంకటేశ్వరుని జోడువీడ నహీనసభల.

కొత్తపల్లి సూర్యరావు

సీ. అష్టావధాన విద్యావిశేషమునందు నిపుణశీలుఁడటంచు నెగడినాఁడు
శతవధానవిధాన చాకచక్యమునందు ఘనుఁడంచు విఖ్యాతిగాంచి
నాఁడు, నవరసాలంకారక వనవైఖరులందు రసికశేఖరుఁడంచు నె
గడినాఁడు, అఖిల రాజాధిరాజాస్థానముల నెంచు సమ్మానితుఁడంచు
పేరందినాఁడు, తాలిమితనంబుఁ దాలిచి చెలులౌ టది, శిష్యులఁ దగనర
కవారలఁ జేసినాఁడు, అట్టి తిరుపతిశాస్త్రి పోవయ్యెన నిడు
వార్త శ్రుతులకు వజ్రాతి పాత మయ్యె.

పిసుపాటి చిదంబరశాస్త్రి

మ. కవితాకన్యక కింపుమీర మిగులన్ గైసేసె మత్త్యాలందు
స్ఫుకవిచిత్తేభవితానబంధముల జిక్కం జేల్చె యీ ధాత్రి స
త్కవివింకాందివిచేఁదె ఘనుఁడ దిగువతిక్ గాఢ్యశ్రేష్టిస్వా
దివమ్ముం జేర్చి మనః ప్రశాంతి నిడ, నో దేవా! నిమ్మ స్వేడదవ.

రాజా మం. భుజంగరావు

చ. విరియఁగ హృత్పుటంబు కడు వేసటి జిక్కెయె నాంధ్రమాతరా
ల్గరఁగగ హా కుమార యని క్రందుగ నేడ్చుచుఁ జింతఁజీకగా,
నిరుపమధారణాయుతుని నిర్మలశబ్ద విలాససంఘటున్,
తిరుపతిసూరివర్యుఁ గవిధీరునిఁ గాలుడు! మ్రింగివైచితే !!

నాగేశ్వరి. విద్యార్థిని.

సీ. అద్భుతంబుగ నెవ్వడాంధ్రభాషను జాల నష్టావధానముల్ నడపి
నాఁడు, అష్టావధానమే కష్టమైయుండ శతావధానములను తగఁగఁ
జేసె, పండితాళికిఁ దమపాండిత్యమునుజూపి వారిచే నెవ్వరు వడసె
కీర్తి పలుమారు దేశాధిపతు లెవ్వరిని బిల్చి సత్కారములు
చాలసల్పుచుండ్రు, అట్టి సుకవిత్వధాటిని యందియుండి ప్రజల
మెప్పులు మిక్కిలి వడసియున్న, సుగుణ తిరుపతి వేంకటసుకవి వర
యుల దిరుపతిమసల విడనాడి దివికి నేగె.

అ. సుబ్రహ్మణ్యశాస్త్రి.

ఉ. పంకరుహోత్త సింహము పవల్ గగనాటవి సంచరించిన
క్కంక గ్రహాలి వేదవల సల్పి నిశన్ విరమించు చాడ్పునన్
కింకవిరాజ మత్తగజ కేసరియై కవితామహాటవిన్
గ్రుంకితి వయ్యయో! కవుల గుండెలు కల్లడిలంగఁ దిర్పతీ!

మహాంకాళి వేంకటేశ్వరరావు.

కం. వెలనాటివాఁడ; కవికరు
వెలనాటితి నన్న ప్రౌఢ విశ్వధరిత్రిన్
కలరే నీ కెనయగు వా
రలు రసవత్కృతుల సల్పి రసికులఁ దనుపన్.

మైలవరపు కృష్ణమూర్తి

Andhra Students of Calicut Commercial Institute.



ఆంధ్ర వాణిజ్య విద్యార్థులు, కల్లికోట

New Guindy Engineering College, Guindy



మద్రాసు ఇంజనీరింగు కాలేజి, గిండి

Prof. M. V. Krishna Rao



ప్రొఫెసరు ఎం. వి. కృష్ణారావుగారు

Prof. Lakhmaji Rao



ప్రొఫెసరు లక్ష్మాజీరావుగారు

Sree Chintamani Andhra Vidyardhi Samaj DattatreyaMutt Benares City



శ్రీ చింతామణి ఆంధ్ర విద్యార్థి సమాజము దత్తాత్రేయమఠము శ్రీకాశి

A Boy at Kasur aged 11 years,
Charged with Waging War Against the King



11 సంవత్సరముల బాలుని రాజద్రోహి యని పట్టుకొనుట